# నష్టములేదనుట తెలిసికొనుడు

వ్యాపారమున మీకు బేరమాడుట కవకాశము నిచ్చు వర్తకులమనస్సు కపటముతో గూడియుండును. మఱియు నట్టి వర్తకులు తగ్గించుట కనుకూలముగ నుండు వెలనే తెలుపుదురు. ఇట్టి యుక్తులచే మిమ్మును మోసముచేసి మీ దగ్గరనుండి సొమ్మును లాగుకొనవచ్చునో అంతవఱకు ప్రయత్నింతురు. వారిట్లు చేయుటకై యనేకతంత్రములనుగూడ చేయుచుందురు.

1. పై చెప్పినమాదిరి వర్తకుడు ఇతరవర్తకులతో (ముఖ్యముగా ఖరారుధరలకు వజ్రముల నమ్ము వర్తకులతో) పోటిచేయుటకై మొదట మీకు చెప్పిన వెలను చాలతగ్గించును. అట్లుచేసి తానే మిగులతక్కువధరకు అమ్మునట్లు మీరు నమ్ముటకై పలువిధములగు ప్రయత్నములను చేయును. అంతే మీ రట్టివానిని నమ్మరాదు. ఏలయన, మట్టరకములనుజూపి మొదట వెల యెక్కువచెప్పి పిదప తగ్గించు సామర్థ్యము వారికి చాలగలదు. ఈ తంత్రములను మీరు కనిపెట్టజాలరనుట ముమ్మాటికి నిశ్చయము.

2. వెల గిరాకియో నయమో యను విషయము తెలియకపోయినను కొందరు జనులు వ్యాపారము చేయునపుడు వర్తకుడు తనవస్తువులవెలను తగ్గించులాగున బేరమాడి యతడు వెలను తగ్గించినచో తామే మిక్కిలి సమర్థులని గర్వించుచుందురు. అట్టివారికి కొంచెమైనను ధర తగ్గింపని యెడల తృప్తియుండదు. చెప్పిన వెలకే కొనుట లాభకరమైన వ్యాపారముగా వారు తలపరు. ఖరారు ధరకు అమ్మువర్తకులు వెలను కొంచెమైనను తగ్గింపరు. కావున తాను తగ్గించితినని జనులు తలచ[illegible] కొనునట్లు యితర వర్తకులు నటింతురు. ఇదియంతయు వట్టిబూటకము. పై రకము జనుల తృప్తికొఱ[illegible] వర్తకులు [illegible] మధికధరలు చెప్పి అందులో పది, అయిదు తగ్గింతురు. వాడుకగా కొనువారు [illegible] బేరము చేయువారయిన వారు కోరినరీతిని వెలలను తగ్గించుటకు వీలుగ నుండునట్లు మొదటనే [illegible] యధికముగ చెప్పుదురు.

[illegible] అధికసందేహముగల వాడుక శాస్త్రాచార్యులతోడను, ఒకరిద్దరు తప్ప[illegible] యెవ్వరితోడను (వజ్రముల గుణదోషములను తెలియుట చాల కష్టసాధ్యము. కావున [illegible] చేయునపుడు వారు మీరు పిలుచుకొనిపోయిన కట్టడపు పనివానిని గాని, [illegible] మఱి యెవ్వనిని గాని లోపరచుకొనుటకై మిగుల ప్రయత్నింతు[illegible]

కొందఱు వర్తకులకు తమ కమీషను యిచ్చెదమని యెఱుగుట సాధ్యము కాదని వాదించుదురు ...చోటు. వాడుకపడియున్నవారికంటె వర్తకులకు జ్ఞానశక్తి యెక్కువగలదని వారు తెలిసి...ను. ఈ తరగరులకు కమీషను యిచ్చెదరని మీరే భరించుకోవలెను కాని వర్తకులు ... కాబట్టి ఇట్టి మోసగాండ్రగు వర్తకుల మోసమునకు మీరు లోబడకుండ చూచుకొనుడు. ... యితరుల దాక్షిణ్యము లేకయే మిగుల లాభముగా వజ్రములను కొనుట కొకమార్గము ...లదు. ఒక్కటే ఖరారువెలకు విక్రయించు వర్తకునియొద్దనే కొనుట మీకు చాలలాభకరము. మీసామర్థ్యము నక్కఱయుండు నవసరములేదు. ఇట్లుకాక బేరము చేసికొనవచ్చునని తలంచితిరేని అదృష్టవశమున నెప్పుడైన ఒకసారి లాభకారి అయినను చాలమార్లు మీరు మోసపోయి నష్టమును పొందుట నిశ్చయము. ఖరారువెలకు అమ్మువారియొద్దతంత్రములు, టక్కులు, మోసములు లేనేలేవు. అందఱికి ఒక్కటేవెల. ఎవరయిన సులభముగా కొనవచ్చును. మీ యిరుగుపొరుగువాడు యిచ్చు వెలనే మీరును యీయవలసియుండును. కొంచమైనను వ్యత్యాసములేదు. మీరు నేరుగానే వచ్చి కొనవచ్చును. తరగరులకు శ్రమనిచ్చి సొమ్మును ఖర్చుపెట్టుకొన నక్కరలేదు. ఇట్లు చేయుటచే నిశ్చయముగ మీకు లాభము గలుగును. ఇట్టివర్తకు లెవరో తెలియునా?

## మెస్సర్సు సురాజ్‌మల్ లల్లూభాయి కంపెనీవారే.

వజ్రములకు ఒక్కటె వెలను చెప్పుదురు. వీరు వజ్రవ్యాపారమున మోసము చేయరు. ఆకంపెనీవారు మేమే. మీరు మీకు కావలసిన మాదిరి నగలను, వానికై మీరు వెచ్చింపదలచిన మొత్తమును మాకు తెలిపిన చాలును. మీరు యిచ్చెడి మొత్తమునకు యెంత వెలైనవస్తువులను పొందవచ్చునో అంత వెలైనదానిని, మాయొద్ద పొందగలరనుట సత్యము. దయచేసి పైని సూచించిన విషయమును చదివి గ్రహించి తరువాత మీకు యెక్కడ నమ్మిక ముండునో అక్కడ వజ్రములను కొనవచ్చును.

# సురాజ్‌మల్ లల్లుభాయి అండు కంపెని

## ప్రధాన వజ్రవర్తకులు

| బొంబాయి | కలకత్తా | రంగూన్ |
| --- | --- | --- |
| ...కాల్బదేవిరోడ్డు. | ఠాకోర్‌లాల్ హీరాలాల్ కంపెని. 12. లాల్‌బజారు, మెర్కంటైల్ బిల్డింగ్సు. | 14, మొగల్ వీధి. |

...నాయక వీధి, (సావుకారుపేట, తపాలాఫీసు దగ్గర) మద...

నిపతి, పురోహితుడు; ఫలము:— మధ్య
స్యము, ప్రజాపీడ, పురోహితుల సూక్ష్మ
డు ధాన్యాధిపతి; ఫలము:— క్షీరసమృద్ధి,
ఆరోగ్యము, సువృష్టి; శుక్రుడు రసాధిపతి,
ధపతి; ఫలము:— పుష్పసమృద్ధి ఫలసమృద్ధి,
ర్థవస్తుసమృద్ధి, రాజనీతివిచారము, కర్మాభివృద్ధి,
వ్యాపనము; కుజుడు నీ ర సా ధి ప తి, పరీక్షకుడు;
ఫలము:— చందనాగరుకస్తూరీప్రవాళాభివృద్ధి, చోరా
గ్నిశస్త్రబాధ; గురువు గణకుడు; ఫలము:— సౌమ్యబుద్ధి,
సౌఖ్యము, సదాచారము; బలభద్రుడు పశునాయకుడు;
ఫలము:— సువృష్టి, తృణసస్యసమృద్ధి, సుభిక్షము. సంవ
త్సరమునకు సామాన్యఫలము:—

శ్లో. రక్తాక్షివత్సరే సస్యవృద్ధి ర్వృష్టి రనుత్తమా,
ప్రేక్షన్తే సర్వదాఽన్యోన్యం రాజానో రక్తలోచనాః
శ్లో. ఆహవే నిహతా స్సర్వే భూపా రోగై స్తథాజనాః
తథాఽపి తత్ర జీవన్తి రుధిరోద్గారివత్సరే.

రక్తాక్షి సంవత్సరమునకు సంరంభము, సంక్షో
భము, విప్లవము సామాన్యఫలములుగ నున్నను శౌమ్య
ఫలబీజములను సయితము గ్రహబలము సూచించుచు
న్నది. ఈ సంవత్సరమునకు రాజైన శని రవిసంయోగ
మును బొంది ప్రపంచమునకు శాంతిని గలుగజేయుటకు
భగవంతు డనుగ్రహించుగాక.

పదునాల్గవసంవత్సరాదిసంచికను సకాలమున
ఆంధ్రప్రపంచమునకు సమర్పించుట కనుగ్రహించిన
యాంధ్రమహాజనులకును భగవంతునకును వందనముల
నర్పించుచున్నాను. సాధారణసంవత్సరాదిని

**సంచికలు**

ప్రారంభమైన సంచికల ప్రచురణము
...సమును బొందుచున్నవిధమును పదునాల్గు
...ను విశదము చేయుచున్నది. ఆంధ్రపత్రి
...ందు సంవత్సరాదిసంచికలు నవయుగా
చేయుచున్నవి. పందొమ్మిదవ
...కల్యాణమున కవతరించిన
సమర్పించుట కాంధ్ర
...వత్సరాదిసంచి
కల యందలి వ్యాసములు పద్యములు పటములు విశదప
చేయుచున్నవి. స్వదేశోద్యమముతో నారంభమైన నూత
నోత్సాహము స్వధర్మానుష్ఠానమునందు పరిణామము
నొందుచున్నవిధమును నాంధ్రభావప్రపంచచరిత్రము
విశదముచేయుచున్నది. ఆంధ్రులదృష్టి బాహ్యసాధనల
నుండి యాంతరంగికసాధనములకు మరలిన విధమును
భావప్రపంచము విశదముచేయుచున్నది. ఈ ధర్మవికాస
మును సంవత్సరాదిసంచికలయందలి వ్యాసములు వి...
దము చేయుచున్నవి. దేశకాలపాత్రస్థితిగతుల కనుర
మైన ధర్మప్రతిష్ఠాపనమున కనుకూలముగను సం...
రాదిసంచికలస్వరూపస్వభావాదులును పరివర్తన...
బొందుచున్నవిధమును గతసంచికలవలె రక్తాక్షిస
యును విశదముచేయుచున్నది.

గత సంవత్సరమునం దాంధ్రరాష్ట్రరాజ్య
చరిత్రమునం దొకనూతనఘట్టము నిర్మితమైనది.

**కాంగ్రెసు సంచిక**

...దెనిమిదవ దేశీయమహాసభ ఆం...
రాష్ట్రమునందలి కాకినాడపుర...
నందు మొదటిసారి గూడినది. ఈ యపూర్వసమా...
మునకు సంబంధించిన విషయము లీసంచికయం...
ప్రాముఖ్యమును బొందినవి. లక్షలకొలది ప్రజలు కా...
నాడయందు జాతీయతీరయాత్రను జేసి నాయకులన...
సందర్శించి కృతార్థులైరి. కాకినాడయందు గూడినసభ...
యుదంతమును నాయకులయుపదేశములును నిందు జేర
బడినవి. దేశభక్త వేంకటప్పయ్యపంతులు మౌలానా
మహమ్మదాలి రాజేంద్రప్రసాదు జవాహరిలాలు నెహ్రూ
చిత్తరంజనదాసు జయకరు సదాశివయ్యరుగారలు మొ
లగువారి యుపన్యాసములును చిత్రపటములును ని...
జేర్పబడినవి. ఈ వ్యాసములకు దోడుగ వాఙ్మయప
నకును రాజ్యాంగాదులకును సంబంధించినవ్యాసము...
భావభరితములైన పద్యాదులును జేర్పబడినవి.

కాంగ్రెసు సమావేశమైన గాంధినగరము...
సంబంధించిన ఛాయాపటము లీసంచికయందు ప్రచు...

**చిత్రపటములు**

మును గాంచినవి. జాతీయమహా...
గూడిన పెద్దడేరా పటము ప్రద...

...ప సంబంధించిన పటములు సయితము గలవు. గతసంవత్సరస్వరాజ్యసంరంభమునందు నాగపురపుపతాకసంరంభమునకు ప్రాముఖ్యము గలిగినది. స్వరాజ్యపతాకవిజయము ...లక్ష్యముగను గాంధినగరమునందు వేలకొలది సేవకుల ...క్షమునను జేయబడిన స్వరాజ్యధ్వజారోహణపటము ...ద్రింపబడినది. నాగపురము సత్యాగ్రహపతాకసంరంభమునందు విజయమును బడసిన శాంతియోధులపటములును ...గములపటములును జేర్పబడినవి. ఆంధ్రదేశమునకు ...బంధించిన ఇతరపటములును నెప్పటియటులు ముద్రించినవి. కార్మికనాయకుడును ప్రధానమంత్రియును ...మెగ్డొనాల్డునిపటము, తురుష్క రాజ్యాధిపతి ...లుపాషా పటము, కార్మికనాయకులపటములు ఇతర ...పటములు గలవు.

శాంతమూర్తియైన గాంధిమహాత్ముని పటములు ...ఖపటమును ప్రథమపటముగను ముద్రింపబడినవి.

మఖపటము

ముఖపటమునందు శస్త్రచికిత్సానంతరము తీసిన రూపమును మొదటిపటమునందు శ్రీకృష్ణజన్మస్థానమునకు బ్రహ్మాకారమును నిరూపింపబడినవి. ఈరూపములందు సయితము మహాత్ముని మహాత్యాగము సువ్యక్తంబగుచున్నది. లోకకల్యాణమునకు పునర్జన్మమునెత్తిన మహాత్మునిరూపసందర్శనము నామస్మరణము పావనకరములు. మహాత్ముని విమోచనమును ఆరోగ్యమును జాతీయహృదయము నావరించిన నిశ్చే...కు త్తేజనమును గలుగజేసినవి. దేశమునందంతటను ...తనోత్సాహము విజృంభించుచున్నది. ఆంధ్రులు వారి కృతజ్ఞతోత్సాహములను విశదముచేయుటకు దేశకైంకర్య...నకు లక్షరూప్యములను పూజానిధిని సమకూర్చి గాంధి మహాత్మునకు సమర్పించుటకు నిర్ణయించిరి. ఆంధ్రమహా...లు కృతనిశ్చయులై యథాశక్తిని పూజానిధికి కానుకను సమర్పించి స్వధర్మనిర్వాహణమును జేసి పరమేశ్వరానుగ్రహమునకు పాత్రులగుదురుగాత!

## ప్రపంచప్రవృత్తి

...చపరిస్థితుల అయోమయస్థితిని యూరపు ...పరిస్థితులు విశదముచేయుచున్నవి. ఫ్రాన్సు ప్రబలస్థితియందున్నను జర్మనుపిశాచమున... పడుచున్నది. గతసంవత్సరమునందు ...నాక్రమించుకొని యర్బుదముల ద్రవ్యము... చేసినది. వ్యయమున కనురూపమైన ప్ర... ఫ్రాన్సునకు సమకూడక పోయినను జర్మనీస్థితికి ... నష్టము గలిగినది. జర్మనీని విభజించుటకు ఫ్రాన్సు ప్రయత్నములు నిరర్థకములైనవి. విభాగపక్షావలం...లకు సంప్రాప్తమైన పరాభవము సకలదేశములందును దేశద్రోహులకు గుణపాఠమును నేర్పుచున్నది. జర్మనీయందు విభాగపక్షావలంబనులకు దారుణమరణావమానములు శరణ్యములైనవి. అయినను ఫ్రాన్సునకు జ్ఞానోదయము గలుగలేదు. జర్మనీని యధోగతియందుంచుటకు ఫ్రాన్సు చతుర్విధోపాయములను వినియోగించుచు మితభేదాదిదుస్తంత్రముల నవలంబించుచున్నది. ఆ తంత్రములన్నియును ఫ్రాన్సున కాత్మవిశ్వాసమును గలుగజేయుటకు నిరుపయోగముగ నున్నవి. ఫ్రాన్సు తనకు మించిన మహాసైన్యములను సంరక్షించుచు నాత్మనాశనమును జేసికొనుచున్నది. ఫ్రాన్సుపక్షమునందు గల రాజ్యములును, యుద్ధసన్నాహములను జేయుచు యూరపు రాజ్యములు, 1927 వ సంవత్సరమునందు తిరిగి సంగ్రామదావానలమును వ్యాపింపజేయుటకు సిద్ధమగుచున్న విధమును రాజ్యములస్థితి విశదముచేయుచున్నది. ఫ్రాన్సు దేశము నష్టపరిహారము మిషమీదను జేయుచున్న బీభత్సమున కాద్యంతములు గనుపింపకున్నవి. నష్టపరిహారసమస్యను నిర్ణయించుట కేర్పడిన యుపసంఘనిర్ణయములను పోయిన్కేరి ప్రభుత్వము నిరాకరించుట నిశ్చయము.

నష్టపరిహారమునకు జర్మనీ 2,25,00,00,000 సవ...రనుల నిచ్చుటకును గ్రేటుబ్రిటను అమెరికాకీయవలసి... సొమ్మునుమాత్రము తీసికొని శేషించినదానిని ...దలగు దేశముల కిచ్చుటకును బ్రిటీషు ప్ర...నది. బ్రిటీషు ప్రభుత్వము అమెరి... డాలరుల అసలు మొత్తమును ...రుల వడ్డీని 62 సంవత్స... ...కోటను బ్రిటీషుసభ...

చెల్లించుచున్నది. ఎవరిసంగతి యెటు
...ఫ్రాన్సుదేశముమాత్రము తనభాగమునకు
,000 నవరసులు గావలయునని కోరుచున్నది.
పరిహారముమొత్తమంతయును150,00,00,000
...లకు మించగూడదని ఘోషించుచున్నది.
...త్తము విషయమై సమాధానము కుదిరినను ఇచ్చెడి
...నమునందును హామీయందును ఫ్రాన్సు తనపట్టును
విడువకున్నది. యూరపురాజ్యములసంగ్రామబీజములను
ఫ్రాన్సు పెంచి పోషించుచున్న విధమును నష్టపరిహార
సమస్యయును ఫ్రాన్సురాజ్యనీతియును విశదము చేయు
చున్నవి. ఈమహోపద్రవమునుండి యూరపురాజ్య
ములను ప్రపంచమును నుద్ధరింపవలసినభారము కార్మిక
ప్రభుత్వముమీద గలదని రాజ్యాంగపరిస్థితులు విశదము
చేయుచున్నవి.

**కార్మిక ప్రభుత్వము**

బ్రిటీషురాజ్యాంగతంత్రమునందు దైవానుగ్ర
హమువలన నపారమైన పరివర్తనము గలిగినది. బాల్డు
విను ప్రభుత్వపు నిర్లిప్తత్వము ప్రజా
హృదయమునందసంతృప్తిని గట్టుగ జేసినది.
ఎన్నికలయందు సంయుక్తప్రభుత్వము
పరాజయము నొందినది. కన్సర్వేటివ్లసంఖ్య 346 నుండి
259 కి తగ్గినది. కార్మికులసంఖ్య 144 నుండి 187 కిని
లిబరలులసంఖ్య 11 నుండి కిని 147 పెరిగినది. లేబరు
లిబరలుపక్ష సంయోగమువలనను కార్మిక ప్రభుత్వము
బ్రిటీషు రాజ్యాంగమునందదృష్టవశమునను నేర్పడినది.
సంగ్రామసమయమునందు దేశద్రోహిగ బరిగణింపబడి
నిర్బంధములకు బాలైన రామ్సే మెగ్డొనాల్డు మహాశయు
నకు ప్రధానమంత్రిపదవి నధిష్ఠింపగలభాగ్యము గలిగినది.
ఈయదృష్టము భారతభూమికి బ్రయోజనకరము గాక
లోకశాంతికైనను ప్రయోజనకరమగునని
...లు విశదముచేయుచున్నవి. కార్మిక
...ట్యాతో సమాధానమును జేసికొని
...సిన లాసేను ఒడంబడిక నామో
...ను జర్మనుదేశముతోను
...యత్నములను జేయు
చున్నది. స్వస్థలవిషయములందును సమ్మెకట్టులందును
కార్మికసమస్యలందును సమాధానముల నేర్పాటు చేయు
టకు బ్రయత్నములను చేయుచున్నది. బలహీన
కార్మికపక్షము మీ స్వల్పకాలమునందు జూపినసా
ధైర్యములు రాజ్యాంగపరిజ్ఞానము సంస్తవనీయమ
బ్రిటీషుమంత్రివర్గమునందు విద్యాసంపన్నులు ...
ధనులు తత్వజ్ఞులు నున్నను బలీయమైన సామ్రా
సంస్కారము స్వధర్మనిర్వాహణమునకు ప్రతిబంధక
నున్నది. ఫ్రాన్సుదేశమును సమాధానపఱచుటయ
జూపెడి పరిజ్ఞానము కార్మిక ప్రభుత్వప్రతిష్ఠను వ్య
చేయగలదు. కార్మిక ప్రభుత్వము యూరపురా
సమస్యలయందెంత యుదారస్వభావమును గనఁ
నను భారతరాజ్యాంగసమస్యపట్లను మానమును
దరణమును జూపగలవిధమును స్వల్పకాలానుభ
విశదముచేసినది.

**భారతీయుల నిరాశ**

రాజ్యాంగరంగమునందు కార్మిక మంత్రి
ప్రవేశము భారతీయనాయకుల హృదయము
దాశాంకురములను వికసింప జేసినది. ఉదారాశ
ములను దెలిపిన రామ్సేమెగ్డొనాల్డుగారును
యనుచరులును నూతనరాజ్యమును స్థాపించుట
దోడ్పడుదు రనునాశ గలిగినది. మ
గౌరవనీయులు శ్రీనివాసశా
గారును సామ్రాజ్య శాసనసభ్యుల
కార్మికమంత్రులకు స్వస్తివాచకములను సమర్పిం
కాని ఈయాశలన్నియును నిరాశలైనవి. కార్మికపక్ష
నకు కర్నలు వెజివుడునుగాని హాల్డేను ప్రభువును
భారతరాజ్యాంగమంత్రినిగ నియమించుటక
ప్రతిపత్తి గలుగలేదు. అజ్ఞాతుడైన సర్ సిడ్ని
మంత్రిపదవిని స్వీకరించిరి. ఓలివియరుప్రభువుగారి ఖా
లు భారతహృదయమునందు నిరాశను బలపఱచినవి.
యరుగారు నిరాశాసందేశమును చల్లగను వెల్ల
సంస్కరణశాసనమును ప్రస్తుతము పరిశోధిం
భవమని మంత్రి సమర్థించి బ్రిటీషురా
విస్పష్టముచేసెను. ఓలివియరు ప్రభువుగా

...హాయమంత్రి రిచార్డ్సుగారి వ్యాఖ్యానములు నిరాశను
లుగజేసిన విధమును భారతరాజ్యాంగప్రవృత్తి విశ
ముచేసినది. ఓలివియరు ప్రభువు రిచార్డ్సుగారు లేమి
...నను చెప్పకపోయినను రాజ్యాంగసంస్కరణశాసన
...ను విమర్శించుట మాత్రము ప్రస్తుత మసంభవ మని
...దమైనది. వ్యక్తులయుదారాశయములును పక్షముల
...ంతములును భారతరాజ్యాంగముల వాసనలతో
...చితములు గాగల విధమును కార్మికపక్ష ప్రవర్తనము
...కముచేసినది. అయోమయమును దారుతుల్యమును
... భారతరాజ్యాంగవిధానమునందు ప్రకాశము ప్రవే
...శుట కవకాశములు లేవని ౧౯౧౭ వ సంవత్సరము
...౦దు మాంటేగుగారు ప్రతిపాదించిన సిద్ధాంతమే ప్రర్త
...న కాలమునందు స్థిరతరముగ నున్నదని యనుభవము
...దముచేసినది. అధికారాసనమునందు శ్రీరాజా
...మారాయణంగారు కూర్చున్నను, సర్ మాల్కం
...యిలిగారు కూర్చున్నను, రీడింగు ప్రభువుగాని ఓలివి
...రు ప్రభువుగాని కూర్చున్నను ప్ర... సమా
...నుని విశదమైనది. అధికార...హచర్యము భ్రమరకీటక
...యమునందు బరిణమించెడి విధమును అనుభవము
...శదము చేసినది. ఈ యనుభవమే అసహాయయోగా
...గ్యాసమునకు గారణమైనది. స్వరాజ్యపక్షనాయకుల
...నుభవమునయిత మీాసత్యమును విశదము చేయు
...చున్నది. భారతదేశమోక్షము భారతీయుల యధీనము
...౦దు గలదను సత్యము తిరిగి వెల్లడియైనను నాయకుల
...దృష్టిమాత్రము పార్లమెంటునుండియును శాసనసభల
...౦డియును మరలకుండుట విచిత్రముగ నున్నది. నిరం
...తరమునకు సహజమైనఫలము గలుగునపుడు
...సహకారమున కవకాశము లేకపోయినను నిరంతరమైన
...ఉద్యోగము సహజముగ విభ్రమమును గలుగజేయు
...నును. గతసంవత్సరకాంగ్రెసుచరిత్ర సంభ్రమకార
...ములను విశదము చేయుచున్నది.

...కాంగ్రెసు త్రివిధబహిష్కారమును సమ
...దాసు పక్షమువారు వారిపట్టును నెగ్గించుకొను
...విశ్వప్రయత్నములను జేసిరి. నిర్మాణకార్యవిధా

*శాసనసభా ప్రవేశము*

...మునందు లగ్నము గావలసి
...ర్యములు ఖండనమండన
యోగపడినవి. పత్రికలదృష్టి ప్రజలదృష్టి
గోపాలాచార్యులుగారల భావవిమర్శనమున
ముతై నిర్మాణవిధానమునందు లగ్నము కా...
ప్రవేశవాదులు బహిష్కారవాదులు ప్రచండమైన వ
లహముతో గాలయాపనము చేసిరి. ప్రయాగసమి
ధానము నాగపురము సమాధానము గాలహరణమునకు
సాధనము లైనవి గాని సంయోగమునకు సాధనము
గాలేదు. బొంబయి సమావేశమునందు ప్రత్యేకసమా
వేశ మవసర మని నిర్ణయింపబడినది. ఆ నిర్ణయమున
కనుకూలముగను ఢిల్లీయందు సెప్టెంబరు మాసాంతము
నందు ప్రత్యేకమహాసభ గూడినది. ఆ మహాసభయందు
త్రివిధబహిష్కారపురస్కృతమైన అసహాయోద్యమ
సిద్ధాంతము పునః ప్రతిపాదితమైనను మతనైతికవిధ
మైన ప్రతిబంధకములు లేనివారు సభ్యులుగ ప్రవేశింప
వచ్చుననియును ఎన్నికలయందు పాల్గొనవచ్చుననియును
నిర్ణయింపబడినది. ఆనిర్ణయము స్వరాజ్యపక్షాశయ
మును సఫలముచేసినను దేశమునందు శాంతి గలిగి
ప్రజలదృష్టి నిర్మాణకార్యవిధానమునందు లగ్నము
గాలేదు. ఢిల్లీసమావేశానంతరము ప్రజలదృష్టి ఎన్ని
కలయందు లగ్నమై నిర్మాణవిధానము నామమాత్రా
వశిష్టముగ నిలిచియుండెను. ఎన్నికల యనంతరము
కాకినాడయందు గూడిన భారతజాతీయ మహాసభ
యందు ప్రజలదృష్టి నిలిచినది. కాంగ్రెసు చరిత్రము
నందు నిశ్చేష్టాకరమును వివాదగ్రస్తమును విచారకరము
నైన గతసంవత్సరచరిత్రము అసహ్యాకరమైన ఘట్టముగ
నుండగలదు.

ఈ పరమవిషాదకరమైన ఘట్టమ...
పురపుసత్యాగ్రహము మహోజ్జ్వలిప...
చున్నది. శ్రీయుత జమా...
నాయకత్వమ...

*పతాక విజయము*

జరిగిన ...
యము...

...నుతాపమును విశదము చేయుచున్నవి. యువకులు పరమోత్సాహముతో స్వరాజ్య రక్షణమునకు నిర్బంధమును స్వీకరించిన స్వాతంత్ర్య సంరంభమునందు పవిత్రఘట్ట ...ంపగలదు. బోర్సదు అపరాధపుపన్ను నిరాకరణ ...యమును గతసంవత్సరచరిత్రమునందు గణనీయాధ్యా ...ముగ నున్నది. ఈయుభయ విజయములకు శ్రీయుత వల్లభభాయి పటేలుగారి శాంతము సామర్థ్యము గారణములు. అకాలీజట్టుల ప్రశాంతవిజయమును నొక ముఖ్యఘట్టమును దెలుపుచున్నది. ఈ విషమ పరిస్థితులందు ధీరులైన ఆలీసోదరుల ప్రవేశము శాంత్యుత్సాహములకు గారణం బైనది.

కార్యవాదులు

కార్యవాదులైన ఆలీసోదరుల విమోచనములు విషాదాయత్తమైన ప్రజాహృదయమునం దుత్తేజమును గలుగ జేసినవి. రాజగోపాలాచార్యుల పక్షమువారు కార్యభారమును ఆలీసోదరులవశముచేసి వారియాజ్ఞలను పాలించుట కంగీకరించిరి. మౌలానా మహమ్మదాలీగారు డిల్లీయందలి రాజీ తీర్మాన మంగీకృతమగుటకు గారకులు. శ్రీయుత వల్లభభాయిపటేలు, జమ్నాలాలుబజాజు, గంగాధర దేశపాండె, దేశభక్త వేంకటప్పయ్య, డాక్టరు కిచలుగారులు మొదలగు నాయకులు కార్యభారమును మహమ్మదాలిగారి యధీనము చేసిరి. సామదానాద్యుపాయములను కాంగ్రెసు పక్షమువారిని స్వరాజ్యపక్షపురాజీకి మహమ్మదాలిగారొప్పిదము చేసిరి. వరదాచార్యులు, సుందరలాలు, శ్యామసుందరబాబుగారులవంటి బహిష్కారవాదులు రాజీ తీర్మానమును ప్రతిఘటించినను మధ్యస్థపక్షముయొక్కయు మహమ్మదాలిగారియొక్కయు బలవంతమువల తీర్మాన మంగీకరింపబడినది. కాంగ్రెసుపక్షము ...ందు ప్రతిఘటనప్రస్తానమును జేయు స్వరాజ్యపక్షమువారికి సభాప్రవేశ కవకాశములు గలిగినవి. దేశ విజయయాత్రను జేసి గలుగ జేసిరి. అక్టోబరు నవంబరు డిశంబరుమాసములందు ప్రజాదృష్టి యయును ఎన్నికలయందు లగ్నమైనది. యథార్థము; గతసంవత్సరమంతయును వ్యర్థమైన వాదప్రతివాదములతో గడచినది. తిలకుస్వరాజ్యనిధి ఖద్దరుని...ణము కాంగ్రెసుసంఘములు మూలబడినవి. కాకి... కాంగ్రెసు కాంగ్రెసుజీవనమునందు గలిగినని శ్చేష్ట దొలగించి నూతనోత్సాహమును గలుగజేసినవిధము దేశచరిత్రము విశదము చేయుచున్నది.

కాకినాడ కాంగ్రెసు

ముప్పదియెనిమిదవ భారతజాతీయమహాసభ నాడయందు జయప్రదముగ జరిగినది. ఆలీసో... నాయకత్వము విజయమునకు శుభ...కముగ నుండెను. డిల్లీరాజీకి కారకుడై మహమ్మదాలిగారు కాకినాడయం దా...జీని సమర్థించుట యవసరమైనది. శ్రీయుత రాజగోపాలాచార్యులుగారికిని, దేశబంధు చిత్తరంజనదాసుగారికిని గొప్పకలవరమునకు గారణంబైన విషయముపట్లను సమాధానము కుదిరినది. ఉభయులును అసహాయయోగసిద్ధాతమును పునఃప్రతిపాదనమును జేయుటకును డిల్లీరా... సంరక్షించుటకును సంకల్పించిరి. ఈయపూర్వసం...గము కాకినాడకాంగ్రెసువిజయమునకు దోడ్పడిన ఉభయనాయకులును నిర్ణయించినతీర్మానమును కాం...గ్రెసు ఆమోదించి వివాదమునకు మూలమైన కలహబీజముల నంతరింపజేసినది. కాంగ్రెసు అసహాయోద్యమ ధర్మబద్ధమైనను స్వరాజ్యపక్షస్థితి కవకాశము గలిగినది. రెండుపక్షములయందును నతివాదుల కీరాజీతీర్మానమనం తృప్తిని గలుగజేసినను సామాన్యముగ నీతీర్మానము సంతృప్తిని గలుగజేసినది. ఈస్నేహపరిస్థితి కాంధ్ర సౌజన్యము మూలమని కాకినాడకాంగ్రెసుపరిస్థితుల విశదముచేసినవి. రాజీవిషయమునందువలె నితరవిషయములందును కాకినాడకాంగ్రెసుసమావేశము పరిగణనీయముగ నున్నది. లక్షలకొలది ప్రజలు ఖద్దరుబ... గట్టుకొని కాంగ్రెసుయాత్రను జేసి యానంద మోత్సాహముతో నాయకులయుపదేశముల...కించిరి. గాంధీనగరము, ఖద్దరుగుడారము, స్వ...

...హాయమంత్రి రిచార్డ్సుగారి వ్యాఖ్యానములు నిరాశను
...లుగజేసిన విధమును భారతరాజ్యాంగప్రవృత్తి విశ
...ముచేసినది. ఓలివియరు ప్రభువు రిచార్డ్సుగారు లేమి
...నను చెప్పకపోయినను రాజ్యాంగసంస్కరణశాసన
...ను విమర్శించుట మాత్రము ప్రస్తుత మసంభవ మని
...దమైనది. వ్యక్తులయుదారాశయములును పక్షముల
...ంతములును భారతరాజ్యాంగముల వాసనలతో
...చితములు గాగల విధమును కార్మికపక్ష ప్రవర్తనము
...ముచేసినది. అయోమయమును దారుతుల్యమును
... భారతరాజ్యాంగవిధానమునందు ప్రకాశము ప్రవే
శుట కవకాశములు లేవని ౧౯౧౭ వ సంవత్సరము
...దు మాంటేగుగారు ప్రతిపాదించిన సిద్ధాంతమే వర్త
...నకాలమునందు స్థిరతరముగ నున్నదని యనుభవము
...దముచేసినది. అధికారాసనమునందు శ్రీరాజా
...మారాయణంగారు కూర్చున్నను, సర్ మాల్కం
...యిలిగారు కూర్చున్నను, రీడింగు ప్రభువుగాని ఓలివి
...రు ప్రభువుగాని కూర్చున్నను ప్ర[illegible] సమా
మని విశదమైనది. అధికారసాహచర్యము భ్రమరకీటక
...యమునందు బరిణమించెడి విధమును అనుభవము
...శదము చేసినది. ఈ యనుభవమే అసహాయయోగా
...భ్యాసమునకు గారణమైనది. స్వరాజ్యపక్షనాయకుల
...నుభవమునయిత మీసత్యమును విశదము చేయు
...చున్నది. భారతదేశమోక్షము భారతీయుల యధీనము
...దు గలదను సత్యము తిరిగి వెల్లడియైనను నాయకుల
...ష్టిమాత్రము పార్లమెంటునుండియును శాసనసభల
...ండియును మరలమండుట విచిత్రముగ నున్నది. నిరం
...మునకు సహజమైనఫలము గలుగునపుడు
...హాక్షేపమున కవకాశము లేకపోయినను నిరంతరమైన
...ంగము సహజముగ విభ్రమమును గలుగజేయు
...డును. గతసంవత్సరకాంగ్రెసుచరిత్ర సంభ్రమకార
...ములను విశదము చేయుచున్నది.

...కాంగ్రెసు త్రివిధబహిష్కారమును సమ
...దాసు పక్షమువారు వారిపట్టును నెగ్గించుకొను
...ప్రయత్నములను జేసిరి. నిర్మాణకార్యవిధా

శాసనసభా ప్రవేశము

మునందు లగ్నము గావలసి...
...ర్యములు ఖండనమండన
యోగపడినవి. పత్రికలదృష్టి ప్రజలదృష్టి
గోపాలాచార్యులుగారల భావవిమర్శనము...
ములై నిర్మాణవిధానమునందు లగ్నము కా...
ప్రవేశవాదులు బహిష్కారవాదులు ప్రచండమైన వ
లహముతో గాలయాపనము చేసిరి. ప్రయాగసమ
ధానము నాగపురము సమాధానము గాలహరణమునకు
సాధనము లైనవి గాని సంయోగమునకు సాధనము
గాలేదు. బొంబయి సమావేశమునందు ప్రత్యేకసమా
వేశ మవసర మని నిర్ణయింపబడినది. ఆ నిర్ణయమున
కనుగుణముగను ఢిల్లీయందు సెప్టెంబరు మాసాంతము
నందు ప్రత్యేకమహాసభ గూడినది. ఆ మహాసభయందు
త్రివిధబహిష్కారపురస్కృతమైన అసహాయోద్యమ
సిద్ధాంతము పునః ప్రతిపాదితమైనను మతనైతికవిధ
మైన ప్రతిబంధకములు లేనివారు సభ్యులుగ బ్రవేశింప
వచ్చుననియును ఎన్నికలయందు పాల్గొనవచ్చుననియును
నిర్ణయింపబడినది. ఆనిర్ణయము స్వరాజ్యపక్షాశయ
మును సఫలముచేసినను దేశమునందు శాంతి గలిగి
ప్రజలదృష్టి నిర్మాణకార్యవిధానమునందు లగ్నము
గాలేదు. ఢిల్లీసమావేశానంతరము ప్రజలదృష్టి ఎన్ని
కలయందు లగ్నమై నిర్మాణవిధానము నామమాత్రా
వశిష్టముగ నిలిచియుండెను. ఎన్నికల యనంతరము
కాకినాడయందు గూడిన భారతజాతీయమహాసభ
యందు ప్రజలదృష్టి నిలిచినది. కాంగ్రెసు చరిత్రము
నందు నిశ్చేష్టాకరమును వివాదగ్రస్తమును విచారకరము
నైన గతసంవత్సరచరిత్రము అసహ్యాకరమైన ఘట్టముగ
నుండగలదు.

ఈ పరమవిషాదకరమైన ఘట్ట...
పురపుసత్యాగ్రహము మహాజ్యోతి...
చున్నది. శ్రీయుత జమా...
నాయకత్వము...

పతాక విజయము

జరిగిన ...
యనుః...

...రోహణము, నగరసంకీర్తనములు, భజనలు, సేవా ...దములు, వివిధసభలు, ఖద్దరుప్రదర్శనము, నాయ ...యుపదేశములు ప్రజలయుత్సాహము కాకినాడ ...వేశమున కనిర్వచనీయమైనశోభను గలుగజేసి ...గ్రెసు ప్రతిభను వెల్లడిజేసినవి. కన్నులుగలవారి కీయ ...తము జ్ఞానోదయమును గలుగజేయుటకు జాలియున్నను ...లుండియును జూడనివారిని జూచునటులు చేయుట ...కైనను తరముగాదుగదా!

...ఎన్నికలయందు స్వరాజ్యపక్షమునకు గొంత ...యము గలిగినది. మధ్యరాష్ట్రములందు స్వరాజ్యపక్షమునకు పూర్ణవిజయము గలిగినది. డాక్టరు

స్వరాజ్య పక్షము

ముంజీ రాఘవేంద్రరావుగారుల నాయకత్వముక్రిందను మధ్యరాష్ట్రములందు ప్రతి...సనము పూర్ణముగ నవలంబింపబడినది. ఆర్థిక శాసన...ను నితరశాసనములను శాసనసభ నిరాకరించినది.

...ఫాంకుస్లియుగారు ప్రజాయత్తశాఖలను స్వాధీనము ...కొని నిరంకుశాధికారము నుపయోగించుచున్నారు. ...రాష్ట్రములందు ఎన్నికలయందు స్వరాజ్యపక్షమునకు ...ర్ణమైన విజయము గలుగకపోయినను నితరపక్షము వారి ...హాచర్యమువలనను కొంతవడి ప్రతిష్టంభనతంత్రము ...ధ్యమైనది. నిరాకృతమైన యార్థికభాగములను లిట్టను ...భువు పునరుద్ధారణము చేసి స్వరాజ్యపక్షమును బెదిరి...చు ప్రభుత్వవ్యవహారములను నిరాటంకముగ నడుపుచు...న్నాడు. సామ్రాజ్యశాసనసభయందు స్వరాజ్యపక్షమునకు ...ర్ణమైన విజయము గలుగకపోయినను నితరపక్షముల ...హాయమునను పండితమోతీలాలునెహ్రూగారు ప్రతిష్టం...భ ప్రస్తావనము నిపుణముగ జేయుచున్నారు. స్వరాజ్య ...తంత్రపక్షముల సంయోగము బలము నొసంగినది. ...భుత్వమునకు పూర్ణమైన పరాజయము గలిగినది. ...రాజ్యాంగసమస్యను నిర్ణయించుటకు నాయకులసభా...వేశ మావశ్యక మను తీర్మానమును శాసనసభ ...చినది. ఆర్థికశాసనమును శాసనసభ పండిత ...మాలవియగారి నాయకత్వము క్రిందను ...నిర్బంధ శాసనముల నుపసంహారము

చేయవలయునను తీర్మానమును ప్రభుత్వము ...పాయముల ప్రతిఘటించినను సభ య... భారత ప్రభుత్వ మితరసందర్భములందును ...మును బొందినది. ఈపరాజయ పరంపరలు బద్ధమైన ప్రభుత్వమునకు ప్రతిబంధకములుగాని ప్రభుత్వమునకు ప్రతిబంధకములు గావు. గవర్నరు...లు తలచినపుడెల్లను శాసనములను సమర్థించుట...కార మొసంగెడిశాసనము నిర్మింపబడినది. స్టేటుకౌన్సిలు సహాయముతో నార్థికశాసనము శాసనరూపమును దాల్చినది. కె. వి. రంగస్వామి అయ్యంగారు మినహా శేషించినవారందఱును రాజప్రతినిధివ్యవహారము నామో...దించిరి. రాజ్యాంగసంస్కరణములు సమకూర్చిన స్వాతంత్ర్యము మితవాదులకు స్వరాజ్యపక్షమువారికి ప్రపంచమునకు విశదమైనది. స్వరాజ్యపక్షము తలచిన ప్రతిష్టంభనతంత్ర మసాధ్యమని విశదమైనది. భారత ప్రభుత్వ మక్షయముగను నిరంకుశాయుధములను విని...యోగింపగలవిధము విశదమైనది. రాష్ట్రీయశాసన సభలయందును ప్రభుత్వములు పరాజితములైనను నిరాటంకముగను నిరంకుశాధికారము సాగుచున్నది. చెన్నరాష్ట్రమునందు ప్రజాప్రతినిధులైన మంత్రు లధికారుల ప్రాపకమువలనను రాజ్యయాత్రను, జీవయాత్రను జేయుచున్నారు. మంత్రులయధికారము మిథ్య యని మద్రాసుశాసనసభావ్యవహారములును నితరరాష్ట్రముల సభావ్యవహారములును విశదముచేసినవి. అయినను సంస్కరణములను పట్టుకొని పెనగులాడదలచినమహనీయు లెందఱో గలరు. స్వరాజ్యపక్షమువారి కనుభవమువలన సంస్కరణముల ప్రయోజనము గోచరంబైనది. ఈపరి జ్ఞానము క్రొత్త గాకపోయినను భారతీయులకు విభ్రాంతిని గలుగజేసినది. ఈసంరంభ ప్రస్థానమునందు ...వాదుల కర్తవ్య మగ్రాహ్యముగ ను... ప్రభుత్వ మెంతకాల మీవిధము... ...యును కాలము విశదముచేయ... ...మునకు ప్రతీకార మ... విధానము గాదని యధి...

ఖల ప్రయోజన మేటున్నను అధికారహృద కుశదుర్గమునందు సుప్రతిష్ఠితముగ నుండ [illegible]ద మైనది. నిరంకుశదుర్గభేదనము స్వశక్తి [illegible]యము గాగలదనియును పరాపేక్షవలన గాదనియును విశదమైనది. ముప్పదికోట్ల భారతీ[illegible] స్వశక్తిని వినియోగింపగలవిధమును నిర్ణయించు [illegible] నిరంకుశాధికారదుర్గమును భేదించుటకు సాధనము.

స్వరాజ్యపక్ష మవలంబించిన ప్రతిరోధకవిధా[illegible]ము పరివర్తనవిధాన మనియును సక్రమసంరంభవిధా నము గాదనియును ప్రతిపక్షు లాక్షేపిం

సక్రమ సంరంభము

చుచున్నారు. ఆర్థికశాసనమును తిరస్క రించుట సక్రమసంరంభమార్గముగాని [illegible]రివర్తనవిధానముగాదని రాజ్యాంగపరిజ్ఞానము విశదము చేయుచున్నది. ఆదాయమును వ్యయమును నిరం కుశ ప్రభుత్వము నిర్ణయించుచున్నది. ఆనిర్ణయములందు స్వల్పమైన మార్పులను జేయుటకు నిరంకుశ ప్రభుత్వ మంగీకరించునుగాని విశేషమైన మార్పులను జేయుట కంగీకరింప దని యుప్పుడున్నవ్యవహారము విశదముచేసి నది. అధికారు లాడించునటు లాప్రహసనమును సామ్రా జ్యశాసనసభాసభ్యు లాడుట యోగ్యమో ఆత్మగౌరవ మున కనురూపముగ ప్రవర్తించుట యోగ్యమో ప్రాజ్ఞులు నిర్ణయింపవలసియుందురు. హేయిలీగారాడించెడియాట నాడుటయును పాడించెడిపాటను పాడుటయును నాత్మ గౌరవమును నిర్మూలము చేసినవి. ప్రజలసంకల్పములను నిరాకరించెడి ప్రభుత్వమును పోషించుట యధర్మముగాని ధర్మముగాదు. ప్రజాశయములకు బ్రతికూలమైన ప్రభుత్వ మునకు బోషణమును నిరాకరించుట సుప్రసిద్ధమైనరాజ్య [illegible] మని రాజ్యనీతికోవిదు లంగీకరించుచున్నారు. ఆ [illegible]మునే ప్రజాప్రతినిధు లవలంబించి స్వధర్మ [illegible]రి. ప్రజాభిప్రాయ మీయాచరణమున [illegible]గమును ప్రజాభిప్రాయము [illegible] ప్రతీకారమును నిర్ణయించి యధికారుల ధర్మము. జేయునప్పుడు భగ

వంతుడు స్వధర్మ నిర్వహణమునకు బూనుకొనగల స్వరాజ్యపక్షమువారు ముందేమి చేయదలచినదియు నాయకులు నిర్ణయింపగలరు. కాని కార్యవిధానమును ని యింపవలసిన భార మధికారము గల ప్రభుత్వముమీ గలదు గాని ప్రతిఘటనమునకు బూనికొనిన ప్రజాప్ర నిధులమీదను లేదని రాజ్యధర్మానుభవము విశదము చేయుచున్నది. బ్రిటీషురాజ్యాంగచరిత్రమునందును నితర రాజ్యాంగచరిత్రములందును నార్థికశాసననిరాకరణము సక్రమప్రతిఘటనముగను సంగీకరింపబడుచున్నది. ఇ రాజ్యాంగములందు సక్రమమైనసాధనము భ రాజ్యాంగమునందేల పరివర్తనమార్గముగను బరిగ వలయునో తెలియకున్నది. ప్రజాప్రతినిధు లార్థికశా మును నిరాకరించి స్వధర్మమును నిర్వహించిరి. పరిణామము భగవదధీనమునందు గలదు. స్వధర్మనిర్వ ణమే ప్రజలకర్తవ్యము. నాయకులు గాంధిమహాత్ముని సంప్రతించి కార్యవిధానమును నిర్ణయించుటకు బూ కొనుచున్నారు. ప్రభుత్వహృదయమునం దేవిధమై సంచలనమును గలిగినటులు గనిపించదు. ఈవిషమపరిస్థి లందు నాయకులును ప్రజలును స్వధర్మనిర్వహణము జేయుటకు మహాత్యాగమును జేయవలసిన యవసరము గలుగుచున్నది. అధికారులును నాయకులును ప్రజలున స్వధర్మపరాయణులై దేశాభ్యుదయమునకు దోడ్పడునట భగవంతుడను గ్రహించుగాక!

భారతీయులకు స్వదేశమునందు సంప్రాప్తమైన తిరస్కారమే పరదేశములందును తీవ్రముగ సంప్రా[illegible] మగుచున్నది. కెనియాసమస్య యథాస్థితియం దున్న

భారతీయుల పరదేశస్థితి

తెల్లవారు భారతీయులను ప్ర ఘటించుటకు గట్టిపట్టును పట్టు న్నారు. దక్షిణాఫ్రికాయందు భారతీయులను వెడలగొ వలయునను సంకల్పము తీవ్రాకారమును దాల్చుచున్నది గూడెముల శాసనమును జేసి భారతీయుల నవమ బహిష్కరించుటకు స్మట్సుప్రభుత్వము పూను రలు స్మట్సుగారు వెనుక నంగీకరించినసమాధ







# పాల్యపు వేంకటాచల పండితులవారి

# లోకామయహర కస్తూరిమాత్రలు

## శ్రీసీతారాఘవ వైద్యశాల, మైసూరు.

ఈ మాత్రలు ఉత్తమమైన కస్తూరి, కుంకుమపువ్వు, పచ్చకర్పూరము,మున్నగు హెచ్చువెల గల పదార్థములచేతను, వీర్యవంతములు, శుద్ధములు, గుణకారులగు మూలికలచేతను, చేయబడుచున్నవి. ఆక్షేపకరమగు ఏ వస్తువ కాని చేరలేదు. ప్రతిదినము ఈ మాత్రలు 2, 4 తాంబూలముతో గాని, వట్టినోటిలో గాని, సేవించుచు వచ్చిన నోరు నిండా సేపు వాసనగా నుండుటయేగాక [illegible] మరియు మందము, జలుబు, దగ్గు, శీతము, శీతవాతము, వివిధజ్వరములు, పళ్లనొప్పి, అజీర్ణము, మలబద్ధము, కడుపు[illegible] తలనొప్పి, పిల్లలజ్వరములు, ఈడుపు, మాంద్యము, అజీర్ణభేదులు, శీతవాయువు, మున్నగు రోగములను [illegible] ముద్దర క్రమముగ వృద్ధిజేయును. బాలెంతలకు సంజీవివంటిది 250-300 మాత్రలుగల బుడ్డి 1-కి ధర రు 0-4-0 మాత్రమే.

తమంతట తామేపంపిన వేనవేలు యోగ్యతాపత్రములనుండి కొన్నిటిని మాత్రమే యీ క్రింద ముద్రించియున్నాము.

మా ఔషధశాల దివ్యౌషధములలో కొన్నిటిని ఈ దిగువ తెలిపియున్నాము.

ఇంకను అనేక సిద్ధక్రియలగు మందులున్నవి. అన్నిమందులకును ప్యాకింగు పోస్టేజి ప్రత్యేకము.

1 మ॥ డాక్టరు ప్రభాకర్ ఫెలో ఆయుర్వేదిక్ యూనివర్సిటీ గ్రాడ్యుయేట్ ఎన్. వై. ఇన్‌స్టిట్యూటు ఆఫ్ సైన్సు యునైటెడు స్టేట్సు ఆఫ్ అమెరికా ఐ ఎల్. ఆఫ్ ది శానిటరీ ఇన్‌స్టిట్యూటు లండను కన్‌సల్టింగు కెమిస్టు, ఎగియరిలేన్, నెం 2, బొంబయి, వ్రాసినది:— తమ లోకామయహర కస్తూరిమాత్రలను ఉపయోగించినదానిలో క్రమక్రమముగ శ్వాసోచ్ఛ్వాసముల వ్యత్యాసము, అజీర్ణము, మలబద్ధము, ప్రక్కలనొప్పి, కడుపునొప్పి, దినజ్వరములు, పిల్లల యీడ్పు, వాయువులన్నియు గుణమై

2. మ॥ వి. ఎన్. అచ్యుతరావు సీనియరు, సర్జను, మరియు శానిటరి కమీషనరు మైసూరు గవర్నమెంటు, వ్రాసినది:—తమచే తయారుచేయబడిన లోకామయహర కస్తూరిమాత్రలను నేనుపయోగించి యున్నాను ఈ మాత్రలు చాల గుణకరముగ నున్నవి.

3. మ॥ కే. కే. విశ్వాసు కవిరాజ్, విష్ణుచక్ర డిస్పెన్సరి 9.41 వీధి, బొక్లేబజారు, రంగూన్, బర్మా, వ్రాసినది:—తమ లోకామయహర కస్తూరిమాత్రలు నాకును నావద్దకు రాగల రోగులకును సంపూర్ణమైన తృప్తి నిచ్చినది.

4. మ॥ పరశురామ మహాదేవ జోషి, ప్లీడరు, అమరావతి, బీరార్, వ్రాసినది:-లోకామయహర కస్తూరిమాత్రలు బాలెంతలకుచాల మేలుచేసియున్నది. తోడనే 25 సీసాలను పంపవలయును.

5. మ॥ లాల్ సింగు, మిాథే పబు అసిస్టెంటు సర్జను, పిరోహి రాజపుటానా వ్రాసినది:-లోకామయహర కస్తూరిమాత్రలను నేను ఉపయోగించుచున్నాను. చాల గుణకరముగనున్నది. మరి 12 సీసాలను పంపవేడెదలు.

6. మ॥సి. ఎన్.మాధవరావుఅసిస్టెంటుమాపరింటెండెంటు పలమనేరుపోస్టు, చిత్తూరుజిల్లా:లోకామయహర కస్తూరిమాత్రలందుసంపూర్ణమైన గుణములన్ని యున్నవనియనుసంతోషము [illegible]

| | | |
|---|---|---|
| తాపాపనోదిని(క్రొత్తజ్వరములకు) | 64 [illegible] | [illegible] |
| [illegible]చనమాత్రలు (భేదిమందు) | [illegible] | [illegible] |
| బాలసుఖోదయం ([illegible]) | 4 ఔన్సు సీసా | 0-12 |
| [illegible] | [illegible] | [illegible] |
| శ్వాసకాసకేసరం (ఉబ్బసము[illegible]) | [illegible] | [illegible] |
| [illegible] రసాయనం ([illegible]) | [illegible] | [illegible] |
| వృష్యరాజరసాయనం ([illegible]) | [illegible] | [illegible] |
| నారికేళాంజనము (నేత్రవ్యాధులకు) | సీసా | [illegible] |
| బాధాపహారిణి (అన్ని నొప్పులకు) | | |
| లోలామృతమాత్రలు. (సెగరోగమునకు) | సీసా 1-కి | [illegible] |
| సారస్వతాసవం (బుద్ధిప్రసాదిని) | 6 ఔన్సు సీసా 1-కి | 1-[illegible]-0 |
| కాసకేసరి (సాధారణమైన దగ్గులకు) | 4 ఔన్సుల సీసా 1-కి | 1-0-[illegible] |
| మహాభృంగామలకతైలం (శిరోవ్యాధులకు) | 4 ఔన్సు [illegible] | [illegible]-8-0 |
| [illegible] | [illegible] | 1-0-0 |
| దంతలోజ్వలచూర్ణం. | టిన్ 1-కి | 0-2-0 |
| అశ్వగంధరసాయనం (రక్తపుష్టికి) | 24 తులముల టిన్ | 1-[illegible]-0 |
| మహాసౌభాగ్య శొంఠి (బాలెంతలకు) | 20 తు | 1-0-0 |
| సుదంధపాలవేళ్ల షరబత్తు | 12 ఔన్సు 1-0-0 [illegible] ఔన్సు | 0-8-0 |
| శివకాంతతైలము (సుఖభేదిమందు) | [illegible] | [illegible]-0 |
| వద్రుపరిహారిణి (సకల తీటులకు పొడలకు) | | 0-4-0 |
| వైశ్వానరాసవం (కలరామందు) | 4 ఔన్సు సీసా | 1-0-0 |
| వ్రణమలాము (వ్రణములకు పైన రుద్దునది) | | 0-8-0 |
| భూనింబారిష్టము (ప్రాతజ్వరములకు) | 6 ఔన్సు సీసా | 1-0-0 |
| మండూరాదిరసాయనం | 24 తులములు | 2-8-0 |

నిరుపయోగమైనది. భారతీయుల హక్కులను గాపాడుటకు శ్రీమతి సరోజినిదేవిగారు చేయుచున్న ప్రయత్నములు నిరుపయోగములుగ నున్నవి. స్టేటుకౌన్సిలునందు సర్ నరసింహేశ్వర శర్మగారు ప్రభుత్వపక్షమునను చేసిన దైన్యసమర్థనము ప్రభుత్వహృదయమును విశదముచేయుచున్నది. శర్మగారి కధికారపదమునందు గల యభిమానము భారతీయులగౌరవమునందు లేదని వారి ప్రసంగము ప్రవర్తనము విశదముచేసినవి. అధికారపదస్వీకారముతో దేశాభిమానమునకు భ్రమరకీటకన్యాయమే సంప్రాప్తమగుట భారతరాజ్యాంగములదుర్విపాకమునకు నిదర్శనముగ నున్నది. స్వస్థలమునందును పరస్థలములందును పుట్టుగతులు లేని భారతీయులస్థితి పరమదౌర్భాగ్యులకు సయితము రోషావేశమును గలిగించుట సహజము. దక్షిణాఫ్రికాస్థితిగతులు ప్రబలమైన కార్యవిధానము నపేక్షించుచున్నవని గాంధిమహాత్ముడు ప్రకటించెను. గాంధిమహాత్మునియుపదేశానుసారముగను భారతీయులు ప్రవర్తించి స్వదేశమునందును పరదేశములందును నాత్మోపలబ్ధిని బడయుదురుగాత!

నిర్మాణ విధానము

వర్తమానపరిస్థితులందు స్వరాజ్యసంరంభమునందు విజయయోగసిద్ధికి నిర్మాణవిధానమే శరణ్యముగ నున్నది. ఈవిషయమై గాంధిమహాత్మునియాదేశమును కాంగ్రెసు నిర్ణయమును సమాదరణీయములుగ నున్నవి. దేశమునందు ప్రజాహృదయమునందు స్వరాజ్యాభిలాష గలిగినను అభిలాషకనురూపమైన యనుతాప ముదయింపలేదని యథార్థమైన పరిస్థితులు విశదముచేయుచున్నవి. నిర్మాణకార్యవిధానమునందు ముఖ్యాంగమైన ఖద్దరునందు విశ్వాసము లేనినాయకు లెందఱో గలరు. గతసంవత్సరమునందు ఖద్దరువ్యాపనము వెనుకంజ వేసినది. రాటములు మగ్గములు మూలపడినవి. ఖద్దరుధారణమునందు ప్రజల కభిమానము తగ్గినది. దేశమునందంతటను హిందూమహమ్మదీయులకు సంయోగము శిథిలమైనది. కలహకారణములు వ్యాపకమును బొందినవి. ఉత్తరహిందూస్థానమునం దేదోప్రాంతమునం దుభయసంఘములందును గల విభేదములు బైలుచుగను ప్రత్యక్షమగుచున్నవి. అంతరానితనమును నివారించుటకు దగిన ప్రయత్నములు జరుగుటలేదు. తిలకుస్వరాజ్యనిధికి కానుకలను సమర్పించుటయందు సయితము ప్రజలు తగినయుత్సాహమును జూపుట లేదు. మీదుమిక్కిలి స్వరాజ్యనిధివినియోగమును శంకించెడి మహనీయులును గలరు.

నిరంకుశత్వము

ప్రజాస్థితి యిటులుండగా, అధికారనిరంకుశత్వము నిరాటంకముగ వృద్ధిని బొందుచున్నది. వంగదేశమునందు విప్లవనిందారోపణమునకు యువకులు గూఢకారణములకు నిర్బంధము ననుభవించుచున్నారు. దేశబంధు, చిత్తరంజనదాసు మొదలగు వంగనాయకులకు సయితము నిర్బంధవాసము గలుగ నున్నదని వార్తలు వెడలుచున్నవి. రాజకీయసాంఘికవిప్లవముల నేరము డాంజే, సింగారువేలుసెట్టి గారులు మొదలగువారిమీదను నారోపింపబడినది. నిర్బంధశాసనప్రయోగ మన్నిప్రాంతములందును నారంభమైనది. ఆంధ్రదేశమునందు జగన్నశాస్త్రిగారిమీదను, భట్టిప్రోలు సూర్యప్రకాశరావుగారిమీదను అధికారవీక్షణము ప్రసరించినది. అధికారకరుణాకటాక్షము దేశమునందంతటను వ్యాపించుననుటకు సూచనలు గలవు. పాపము విల్లింగ్డనుప్రభువుగారి కీపర్యాసమయమున విరామము గలుగుట సంతాపకరము. జలియనువాలాబాగుహత్యలతరువాత నైదేండ్లు గతించినను జెయిటోవధలు ప్రభుత్వహృదయము మాఱనివిధమును విశదము చేయుచున్నవి. బ్రిటీషుప్రభుత్వమునకు మారణాయుధప్రయోగమే శరణ్యమని జెయిటోయుదంతము విశదము చేయుచున్నది. అధికారులనిర్బంధవిధానము వ్యాపకమును బొందుచున్నను ప్రజలప్రశాంతస్థితి మహాత్మునియోగసిద్ధికి శుభలక్షణముగ నున్నది. అకాలీయోధులు. మహాశూరులైన అకాలీయోధులు. ప్రభుత్వదౌర్జన్యమునకు జెయిటోయందును నితరసందర్భములందును నాత్మసమర్పణము చేసి శాంతధర్మవిజయమార్గమును లోకమునకు బ్రదర్శించిరి. ఈవిషమదశయందు సయితము తదుద్యమములను విసర్జించినమహాశూరులు

దేశదాస్యవిమోచనమునకై యాత్మసమర్పణమును జేసి పాటుపడుట భావివిజయమునకు శుభలక్షణముగ నున్నది. ఈశుభస్థితియందు దైవానుగ్రహమువలనను గాంధిమహాత్మునివిమోచనము గలిగి ప్రజానాయకులహృదయములందు నూతనోత్సాహము ప్రబలుచున్నది. ఆయుత్సాహము వర్తమానసంవత్సరమునందు కార్యరూపమును దాల్చి ప్రజాభీష్టసిద్ధికి దోడ్పడుటకు భగవంతు డనుగ్రహించుగాత!

**గాంధిమహాత్ముడు**

పరమేశ్వరానుగ్రహమువలనను గాంధిమహాత్మునకు గొప్పగండము తప్పినది. కర్నలు మేడకుగారు మహాత్ముని మృత్యుముఖమునుండి రక్షించిరి. మహాత్ముడిపుడు సముద్రతీరమునందుగల జుహూగ్రామమునందు విశ్రాంతి ననుభవించుచున్నాడు. క్రమముగ రాజకీయవిషయముల నవగాహనమును జేసికొనుచు నాయకులతో సంప్రతింపును జేయుచున్నాడు. శ్రీయుతులు దాసు నెహ్రూ, లజపతిరాయి, రాజగోపాలాచార్లు, వల్లభబాయిపటేలుగారులు మొదలగునాయకులు భావికర్తవ్యమువిషయమై మహాత్మునితో సంప్రతించుచున్నారు. దేశదృష్టి నిపు డాకర్షించుచున్న శాసనసభలవిషయమునను అకాలీలవిషయమునను మహాత్ముడు తీవ్రమార్గమును నిర్ణయించునని నమ్ముట కవకాశములు లేవు. శాసనసభలవిషయమునను ఆరంభశూరత్వము ముగిసినది. ప్రథమరంగము ముగిసినది. రెండవరంగ మారంభమగుటకు వ్యవధి గలదు. స్వరాజ్యపక్షమువారివిధానమును మహాత్ముడు నిర్ణయింపజాలడు. గాంధిమహాత్ముడు స్వరాజ్యపక్షమువారిని కాంగ్రెసు పక్షమువారిని వారిదృష్టినినిర్మాణ కార్యవిధానమునందు లగ్నము చేయుడని కోరుట సహజము. కాని నాయకుల ఉపన్యాసములందుగల విశ్వాసాదరణములు కార్యవిధానమందు గలుగకుండుట సంతాపకరము. జెయిటోయాత్రలవిషయమై అధికారులు తీవ్రవిధానము నవలంబించుదురని వదంతులు వ్యాపించుచున్నవి. అకాలీలసంరంభము వారి జన్మస్వాత్వమునకు సంబంధించినను కాంగ్రెసుసంబంధ మింతవరకు గ్రాహ్యమో గాంధిమహాత్ముడు నిర్ణయింపవలయును. గాంధిమహాత్ముడు వర్తమానసంవత్సరాదినుండియును నవజీవనయంగు యంగుఇండియాపత్రికాసంపాదకత్వమునుస్వీకరించునటులు తెలియుచున్నది. దక్షిణాఫ్రికాసమస్య మహాత్మునకు సంతాపమును గలుగజేయుచున్నది. ఆసమస్యవిషయమై తీవ్రమైనయాచరణ మత్యంతావసరమని మహాత్ము డిదివఱకె తెలిపియున్నాడు. మహాత్మునియారోగ్యము సంపూర్ణముగ కుదుటబడుటకు మూడుమాసము లైనను గావలసియున్నను మహాత్ముడు కాలహరణము చేయక కార్యరంగమునందు వెంటనే ప్రవేశింపదలపడుచున్నాడు. వర్తమానసంవత్సరము దుర్ముఖిసంవత్సరమువలె స్వరాజ్యసంరంభమునందు ప్రముఖముగ నుండుటకు శుభసూచనలు గలవు. అధికారుల నిర్బంధములు ప్రజానాయకులత్యాగము విశేషముగ వ్యాపకమును బొందుట సహజము. కార్మిక ప్రభుత్వము స్వరాజ్యాందోళనము నాపుటకును స్వీయప్రతిష్ఠను సంరక్షించుకొనుటకును రాయలుకమిషను నియమించి యాశాంకురములను వికసింపజేయవచ్చును. ఈసంకులపరిస్థితులం దాంధ్రులకర్తవ్యము వివిధరంగములందును దుర్భరముగ నుండగలదు.

**ఆంధ్రుల కార్యభారము**

ఆంధ్రోద్యమారంభముతో వివిధరంగములందును నాంధ్రుల కార్యభారమధికమైనది. ముఖ్యముగను రాజకీయరంగమునం దాంధ్రులకార్యభారమధికతరమైనది. నిరంకుశ ప్రభుత్వవిధానమునం దాంధ్రులకు వ్యక్తిత్వము గలుగకపోయినను స్వరాజ్యవిధానమునం దాంధ్రులకు వ్యక్తిత్వముగలిగి కార్యభారము దుర్భరమైనది. ఆంధ్రమంత్రులు లబ్ధావకాశములను నిర్బంధములకు వినియోగించిరి గాని దేశవికాసమునకు వినియోగింపలేరు. ఆంధ్రమహాసభకధ్యక్షతనువహించిన రాజారామారాయణంగా రాంధ్రరాష్ట్ర సమస్యనే మఱచిపోయిరి. వారియవకాశములను నిర్బంధములకు వినియోగించిరి. విద్యామంత్రి సర్ పరశురామపాత్రోగారును విశ్వవిద్యాలయవిషయమును వెనుకబెట్టిరి. పరిశ్రమాంగమంత్రి సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడుగారునిందలతో కాలమును గడపిరి. అధికారులదృష్టి యీయాం

ద్ధోద్యమ విషయమునను మందగించినను ప్రజాదృష్టి పరిస్థితుల కనురూపముగను వికసించినది. ప్రజల యాదరణ పోషణమువలన నాంధ్ర వ్యక్తిత్వము వికసనమును బొందుచున్నది. ఆంధ్రమహాజనులు జాతీయవిద్యాపోషణమునందును వాఙ్మయకళాపోషణమునందును స్వధర్మనిర్వాహణమును జేయుటకు యథాశక్తిని బాటుపడుచున్నారు. ఆంధ్రదేశమునందు గల జాతీయవిద్యాలయము లేమితర రాష్ట్రమునందును లేవు. కీ. శే. కోపల్లి హనుమంతరావు పంతులుగారు స్థాపించిన యాంధ్రజాతీయకళాశాల యాంధ్రుల ప్రతిభను భారతభూమియందు వ్యాపింపజేసినది. ఆంధ్రదేశము భాగ్యవంతమైన దేశము గాకపోయినను జాతీయవిద్యాలయములను గ్రంథాలయములను గానసమాజములను నాటకసమాజములను పోషించుచున్నది. అసహాయోద్యమ ప్రస్థానమునం దాంధ్రనాయకులును యువకులును ముందంజవేసి స్వధర్మనిర్వాహణమును జేసి యధికారుల ధిక్కారములకును ప్రజలమన్ననలకును బాత్రతను గడించిరి. వృత్తులనువిసర్జించి దేశసేవ కాత్మసమర్పణము చేసిన న్యాయవాదులు న్యాయమూర్తి కూట్సుట్రాటరు గారి కటాక్షవీక్షణములకు బాత్రులై గాంధిమహాత్ముని ప్రశంసలకు బాత్రులైరి. విద్యను చాలించిన విద్యార్థులు కష్టముల ననుభవించుచున్నను దేశసేవను జేయుచున్నారు. ఆంధ్ర చిత్రకారులు రెండేండ్లు చిత్రకళా ప్రదర్శనమును జయప్రదముగ నిర్వహించిరి. నిర్మాణవిధానమునకు ముఖ్యాంగమైన ఖద్దరునిర్మాణవ్యాపనమునం దాంధ్రదేశమునకు భారతభూమియందు ప్రతిపత్తిగలిగినది. పత్రికానిర్వాహకులు గ్రంథకర్తలు ప్రచారకులు విజ్ఞానవ్యాపనమును జేయుచున్నారు. ఆంధ్రులు 36 వ భారతజాతీయమహాసభను కాకినాడయందు జయప్రదముగ నిర్వహించి భారతసోదరుల ప్రశంసలకు బాత్రులైరి. కాకినాడయందు గాంధినగరమున గూడినమహాసభలు సర్వతోముఖమైన యాంధ్రుల యుత్సాహమును విశదముచేసినవి. కాంగ్రెసునకు రూ. ౧, ౫౦,౦౦౦లు వసూలైనవి. ఖద్దరుధారణ మాచార్య ప్రఫుల్లచంద్ర రేగారి ప్రశంసను బడసినది. ఆంధ్ర స్వచ్ఛందసేవకులు స్త్రీపురుషులు ధర్మనిర్వాహణమును జేసి నాయకుల ప్రశంసలను బడసిరి. ఆంధ్రుల కార్యనిర్వాహణాసక్తి వారిభారమును వర్తమానసంవత్సరమునందు ద్విగుణీకృతము చేయుచున్నది. గాంధిమహాత్ముడు రాటమునందే దేశమునకు తరణోపాయముగలదని ప్రకటించుచున్నాడు. ఖద్దరుబోర్డు ఖద్దరునిర్మాణవ్యాపకమునకు ధనము నపేక్షించుచున్నది. ప్రచారకులు స్వరాజ్యప్రచారమును జేయుటకు ద్రవ్యము గావలసియున్నది. కార్యనిర్వాహకసంఘము గాంధిమహాత్మునకు లక్షరూప్యముల పూజాద్రవ్యమును సమర్పించుటకు నిర్ణయించినది. మూడు నాలుగు మాసములలో గాంధిమహాత్ముడాంధ్రదేశసంచారమును జేయుట సంభవము. ఆంధ్రులు వారికార్యదీక్షను భక్త్యుత్సాహములను గనబఱచుటకు శుభసమయము సంప్రాప్తమగుచున్నది. ఆశుభసమయమునందు సకలజనులకును యథాశక్తిని భారతమాత నారాధించుట కవకాశములు గలవు. ఆంధ్రలోకము యథాశక్తిని లబ్ధావకాశములను సఫలముచేసి యాత్మోపలబ్ధిని బడయుటకు శ్రీకృష్ణపరమాత్ముడనుగ్రహించుగాత!



# విహంగవిమానము

**వేంకట పార్వతీశ్వర కవులు**

క. లలితకుహూకలరవమా! అల వనరమయింటివివం దగు కవివరమా!
అలరు వసంతునిరాకం, దలఁపించెడి నీకు స్వాగతము! కోకిలమా!

## ప్రస్తావము

సంతాభ్యుదయమైనది. శిశిరవికలయగు ప్రకృతి చిత్రవిచిత్రముగ శృంగారించుకొని చిగురుగే లెత్తి జీవలోకము నాహ్వానించుచుండెను. వనరమామాధవుల వైవాహికశుభసమయమున సకలజగంబును నానంద ప్రపూర్ణమై యుండెను. అప్పుడు విహంగవిమానము నుండి వివిధస్వరములతో విశ్వగీతములు విన వచ్చుచుండెను. ఆమధురస్వరము లప్రయత్నముగ శ్రవణగోచరములై యంతరంగమునఁ బ్రతిధ్వనించి యనేకసంకల్పముల నంకురింపఁజేయుచుండెను. ఆభిన్న స్వరములయేకీభావమే వసంతగానము. ఆభిన్న ప్రకృతుల సముత్సాహసమీకరణమే వసంతకల్యాణమహోత్సవము. సమస్త బంధుమిత్రపరివారసమాకీర్ణం బగు నాకల్యాణమండపమే విహంగవిమానము.

జగముచుట్టమగు వసంతుని పెండ్లికి బంధువులుగాఁ జేరనివా రెవ్వరును లేరు. ఆతని కందఱును జుట్టములే. కాని, వారందఱును దమలోఁ దాము పరస్పరబంధులు మాత్రము కారు. అందు సజాతీయులును, విజాతీయులును, శత్రులును, మిత్రులును, సములును, విషములును గూడ సమావేశులై యుండిరి.

పురోహితుఁడగుపూర్ణకాముఁడు పుష్పాక్షతలన జల్లుచుఁ బవిత్రప్రణయమంత్రములను బఠనము సేయుచుండెను. వధూవరుల ప్రథమావలోకనసమయమునఁ బరస్పరహృదయములే కాక ప్రకృతి యంతయును బులకించి పోయెను. ఆయానందములో నాటలు పాటలు, వింతలు, వినోదములు, ముద్దులు, ముచ్చటలు జరిగిపోవుచుండెను.

కొందఱు రసజ్ఞులు పెండ్లిపాటల నాలకించుచుండిరి. కొందఱు విచక్షణులు పెండ్లివేడుకలఁ దిలకించుచుండిరి. కొందఱు సమర్థులు పెండ్లిపనులలోఁ బాల్గొనుచుండిరి. కొందఱు ముగ్ధులు ప్రకృతిచిత్రములకు ఆచ్చెరువడుచుండిరి. కొందఱు విదగ్ధులీశ్వరవిలాసములకు మెచ్చుకొను చుండిరి. కొందఱు వాచాలురు తర్కవితర్కములలోఁ దత్త్వమును మఱచిపోవు చుండిరి. కొందఱు క్రియాశూన్యులు లోకాభిరామాయణమున నిమగ్నులగు చుండిరి. ఇట్టి యనేకభిన్నప్రకృతుల భిన్నభావము లన్నియు నీపెండ్లివేడుకలలో నలక్షితములై యుండెను.

భావప్రపంచమున విహరించు పరమహంసఁ నవలోకించుచున్న యొకకవికులభూషణుఁ డప్పుడు పర్ణకుటీరాంగణమునఁ గూర్చుండి ప్రణయగానమునకు శ్రుతులను సవరించుకొను చుండఁగా నెలమావిచిగురుజొంపమునం దూఁగుచుఁ దూఁగుచు వసంతకోకిల పంచమ

స్వరంబున "కుహూ! కుహూ! కుహూ!" అని పాడఁ దొడంగెను. ఆపల్లవిలోఁ బ్రమదావన మంతయుఁ బల్లవితమయ్యెను. ప్రసవమంజరు లన్నియును బరిమళించెను. ప్రకృతి యంతయును బరవశమైపోయెను. భావగానలోలుఁ డగుకవి యప్పుడు.—

ప్రసవరస మానునెల దేఁటిపాటకంటె
ఫలరసముఁగ్రోలు రాచిల్క పల్కుకంటెఁ
గనరుజివురాకుఁ గసిగాటు గాగ్రసించు,
మత్తకోకిలరవ మింత మధురమేమొ!

అని భావింపఁ దొడంగెను.

ప్రదేశము—మధువనము.

ప్రవేశము—రసాలశాఖపైఁ జిలుక, గోరవంక.

చిలు— (మెడ జిక్కించి) ఆహా! ఏమి యీయమృతగానము!

గోర— ఔను. అది యీఫలరసము కంటెను మధురముగా నున్నదే! కాకులలోఁ బెరిగినదానికీ గ.ల కంఠ మెట్లువచ్చినదో?

చిలు— ఎక్కడఁ బెరిగిననేమి, ఎవ్వరు పెంచిననేమి? అది దాని జన్మస్వత్వమే కాదఁటే!

గోర—అక్కా! నీకుమాత్రము కలాలాపత్వము జన్మస్వత్వము కాదా?

చిలు— ఇదియెట్లు? పలుకులు నేర్చినంతమాత్రమునఁ బాటలు పాడఁగలమా? మన మిరుపురమును గలాలాపలమే కాని. కలకంఠుల మెట్లగుదుము?

గోర-మనముకూడ దానివంటి పక్షులమే గదా! ఆపాట మన మేల నేర్చుకొనఁగూడదు?

చిలు— అది సహజముగఁ బుట్టవలయునే గాని నేర్చుకొనిన వచ్చునది కాదమ్మా!

గోర—మనము మాత్రము రసజ్ఞులము గామా? కోకిల నాశ్రయించినచో మన కీరహాస్యము బోధపడునేమో?

చిలు—కోకిల కెవ్వరివలన బోధపడినది? మనకు సహజముగా రసానుభవమేగాని, రాగగరిమ యెక్కడిది?

గోర— ఫలరసము మాని మనముకూడఁ బల్లవసేవనము గావించిన నేమగునో?

చిలు—సోదరీ! పువ్వులలో మసలినంతమాత్రమునఁ దేనెటీఁగ తేఁటి కాఁగలిగినదా? ఊరక యాసపడి చిగురుమేయుటకారంభించినచో నాగరుబిగువుచే మనకున్న పలుకుబడి కూడఁ జెడిపోవును. కష్టపడి ప్రయత్నించినంతమాత్రమున మనము కలకంఠులము కాఁగలమా?

(కోకిలమరలమృదుస్వరముతో కుహూ! కుహూ! కుహూ!)

(గోరవంక రత్తరముతో ఱెక్కలనప్పళించుచు మెడఁ గుంచి పైకెఁజూచుచు వటునిటుఁ జిదుగుచుండును.)

చిలు— (కలకల నవ్వుచూ) సోదరీ! ఈ యావేగమంతయు నేమే!

గోర— అక్కా! వినఁబడ లేదా? ఆకోకిల పసలను పిలుచుచున్నది!

చిలు—చెలీ! ఎంతవెఱ్ఱిదాన వే! అది మనవంకఁ జూడనైనఁ జూచినదా? పలుకరించినట్లు- పరాకుఁ దెలిపినట్లు- ప్రత్యుత్తర మిచ్చినట్లు-ప్రబోధించినట్లు- బహుభావములు దానిపాటలోనే యున్నవి.

గోర—అక్కా! నీమాటలు నిజమేనే! చూడుము! తమ్ముఁ బలుకరించినట్లుగా దెసలుమాఱుపలుకు చున్నవి. తమకుఁ బరాకుఁ దెలిపినట్లుగాఁ దరుణవల్లికలు పల్లవాంచలముల సవరించుకొను చున్నవి. తమకుఁ బ్రత్యుత్తర మిచ్చినట్లుగాఁ బక్షిసంతతు లన్నియును బ్రతివాక్యముఁ జేయుచున్నవి. తన్నుఁ బ్రబోధించినట్లుగాఁ బ్రకృతి యంతయును దిస్మయమగుచున్నది. ఆహా! ఒక్కపాటలోనే యిన్ని భావములా?

చిలు— అదియే బహుజన్మతపఃపరిపక్వమగు ప్రతిభ! అట్టి యమృతవృష్టిచేతనే జీవచైతన్యమంతయు నానంద విలసితమగుచుండును. అట్టి యమృతప్రభచేతనే జీవలోకమంతయు నాలోకరమణీయ మగుచుండును.

గోర— ఆకోకిల నిట్లు పాడుమన్న వారెవ్వరే!

చిలు—అది యొక్కరికొఱకుఁ బాడుటలేదు. ఉత్సాహము పొంగి పొరలినప్పు డది యూరక పాడుకొనుచుండును. దాని కెట్టికోరికయును లేదు.

గోర—లేకేమి? మన మందఱము నిట్లుమెచ్చుకొను చుంటిమి గదా! వన మంతయు నిత్యానందకందళిత మగుచున్నది గదా! దెసలన్నియు నిట్లు ప్రతిధ్వనించు చున్నవి గదా! జగమంతయు నిట్లభిముఖ మగుచున్నది గదా! లోకమును మోహింపఁ జేయుటకుఁగాకున్నచోఁ గోకిల కీపాట యేల?

చిలు—సోదరీ! నీవు పొరఁబడుచున్నావు. కొమ్మలెవ్వరిమెప్పుకొఱకుఁ బల్లవించుచున్నవి? తెమ్మెర లెవ్వరి

మెప్పుకొఱకు వికసించుచున్నవి? పువ్వు లెవ్వరి మెప్పు కొఱకుఁ బరిమళించుచున్నవి? ఫలము లెవ్వరిమెప్పుకొఱకు ఫలించుచున్నవి? ఆనందోచ్ఛ్వాసముచే నగుచుండు దీనింగూర్చి యనుభవజ్ఞు లభినుతించుచుందురు. రసజ్ఞులు రంజిల్లుచుందురు. కోకిలపాటకూడ నట్టిదే.

గోర—అక్కా! నీవు కవిత్వమునుగూర్చి ప్రశంసించినట్లు ప్రశంసించుచున్నావే!

చిలు—కాదా మఱి! హృదయమును రసమయముగఁ జేయుపలుకుపొందిక యే కవిత్వము.

(కోకిల—కుహూ! కుహూ! కుహూ!)

చిలుక—గోర— (ఆనందపారవశ్యమునందును.)

కవిపరమానందములో

సీ. ఆనందమయవసంతారామమోహన
దివ్యతేజంబుపై దృష్టి నిలిపి
ఆనందరాగరసామోదపల్లవ
మృదులపీఠంబుపై మేను నిలిపి
ఆనందరసతరంగాయితనవసుధా
మధురభావంబులో మనసు నిలిపి
ఆనందగుప్తమంత్రాధారపావన
ప్రణవనాదంబులోఁ బాట నిలిపి
అఖిల మానందపారవశ్యమున మునుఁగ
వాస్తవానందతన్మయత్వంబుఁ గాంచి
చల్లగా రాగవల్లరుల్ పల్లవింపఁ
గోయిలా! హాయిగాఁ బాడు కోఁగదమ్మ!

కోకిల—కుహూ! కుహూ! కుహూ!—

గోర—(ప్రకృతిస్థమై స్మృతినభినయించి)అక్కా! ఈమధురగానమునకు లోక మంతయు నిట్లు తైమఱచి పోవుచుండఁగాఁ దనబిడ్డగా నెంచి పెంచికొన్న కాకి యీకోకిలనెట్లు తన్నివై వఁగలిగినదో?

చిలు—దాని కారసజ్ఞత యెక్కడిది! పురుగులను బొడిచికొనితినుపులుగునకుఁ బువ్వులపరిమళ మెట్లు తెలియును?

("తురతురుతురుతురుతుర్" అను ధ్వనియగుచున్నది.)

గోర—(ఉలికిపడి) ఇది యేమి? ఈయనంత సుఖస్వరమునఁ గ్రిందినుండి యేదో యపస్వరము వినఁబడుచున్నది!

చిలు—అది యేదో కఠినవక్త్రమునుండి వెలువడిన కఠోరస్వరమువలె నున్నది.

("ఠక్ ఠక్ ఠక్" అను ధ్వనియగుచున్నది.)

గోర—(భయముతో)అక్కా! ఎవ్వరో చెట్టుఁ గొట్టుచున్నట్లున్నది!

చిలు—(ఆలోచించి) తెలిసినది.భయములేదు. ఈ వికృతచేష్టలు వడ్లంగిపిట్టవని తోఁచుచున్నది.

గోర—క్రిందివంకఁ జూచి) ఔనే! తన యినుపముక్కుతో నది యీతరుస్కంధమును టక్కు టక్కు మని పొడుచుచున్నది. చూడుము!

చిలు—(పరికించి)ఫలవృక్షములను బగులఁ గొట్టుటయే దానిపని.

గోర — ఈశుభసమయమున నిది యెంతరసభంగము చేయుచున్నది!

చిలు—అచ్చటికిఁ బోయి దాని నెట్లయిన మరలింతము రమ్ము.

(చిలుకయు, గోరవంకయు నెగిరి క్రిందికొమ్మపై వ్రాలుచున్నవి.)

వడ్లంగిపిట్ట— (చప్పుడు విని తల పైకెత్తి) ఓహో! చిలుకా గోరింకలవలెనున్నారు.

గోర— వలె నుండుట యేమి? మేము చిలుకా గోరింకలమే!

వడ్లం—మీయంతటి రసజ్ఞత నాకు లేదనియా వుని నేనన్నమాటకుఁ బ్రత్యాఖ్యానముఁ జేయుచున్నావు?

చిలు— నీకు రసజ్ఞత లేదనియా? నీచేష్టలు—

వడ్లం—(అర్థోక్తియందే) నాచేష్టలు మీ రేమని గ్రహించితిరి?

గోర— రసభంగములుగా నున్నవని—

వడ్లం— ఓహో! తెలిసినదానివలెరసము రస మనుచున్నావు! రసస్థానమేదియో నీవెఱుఁగుదువా?

గోర— ఎఱుఁగ కేమి? పాటలో రసమున్నది- పలుకులో రస మున్నది.

వడ్లం— ఆలాగా? వానికి మూలము?

గోర— చిగురులో రస మున్నది.పువ్వులో సరమున్నది. పండులో రసమున్నది.

వడ్లం—అంతేనా? మఱి యెచ్చటను లేదా? సరే. వానికి మూలము?

గోర— రసజ్ఞునిహృదయములో రసమున్నది.

వడ్లం — ఆఁగు మాఁగుము! గోరింకా! నీవొక్కపారిగాఁ గప్పగంతులు వైచుచున్నావు. వానికి మూలకారణ మగు కేంద్రస్థానము ఇప్పుడు నేను నిలిచియున్నచోటే! ఇందేమైన రస మున్నదేమో యనియే నేను పరీక్షించు చుంటిని.

గోర — ఏమైన నగపడినదా?

వడ్లం — ఇంతవఱకు నాకేమియు నగపడలేదు.

గోర — (నవ్వుచు) ఇది మూలచ్ఛేదప్రయత్నముగాని, రసగ్రహణప్రయత్నముగాదు.

వడ్లం — చెట్టునలేనిరసము చిగురునకెక్కడనుండి వచ్చును? వెఱ్ఱిదానా! తత్త్వజ్ఞానములేని పాండిత్యముతోఁ దప్పులు దిద్దవచ్చితివా?

గోర — ఆలాగా? అట్లయినచో నీతలకు మించి నశక్తి ముక్కున కెట్లు వచ్చినది?

చిలు — (సాధుభావముతో వడ్లంగిపిట్టంగాంచి) అన్నా! ఈ శుష్కతర్కములవలన నేమి ప్రయోజనమున్నది? కోయిల హాయిగాఁ బాడుచున్నది. ఒక్కింతసేపు నిశ్శబ్దముగా నుండి యానందింపరాదా?

వడ్లం — ఆహా! ఏమి యీచిలుకపలుకులు! మ్రానుగోయిలమాట చిగురుగోయిలపాటపాటిది కాకపోయె నేమి?

చిలు — వాదము వల దంటిని గాదా?

వడ్ల — వాద మక్కఱలేదు గాని వస్తుతత్త్వమును గ్రహింపవలదా?

గోర — (విసుఁగుతో) నీవిందు గ్రహించిన దేమి? రంధ్రాన్వేషణమే గాని నీకు రసగ్రహణశక్తి యేదీ? ఎంత పట్టిపాఁకులాడినను, ఎంతపొట్టు పొట్టుచేసినను, నీబ్రదు కింతే.

చిలు — అన్నా! రసజ్ఞులపని యిదిగాదు. అమృతతరంగమాలికాఖేలనమున నానందింపక యడుగున నేమున్నదో త్రవ్వఁగోరుట యవివేకము కాదా?

గోర — ఔను, అమృతఫలముల నారగింపవలయును గాని, గిల్లిగింజలను లెక్కించుటవలన నేమి ప్రయోజనము?

వడ్లం — (కోపముతో) అమృతము, రసము, హాయి, యని మీరేమేమో కొసవెఱ్ఱిమాటలు చెప్పుచున్నారు. గ్రుడ్డినమ్మకమేగాని గుణాగుణపరిశీలన మక్కఱలేదా?

చిలు — దేనిగుణాగుణములను దానినిబట్టియే గ్రహింపవలయును. పనసతొలలరుచి పైపెచ్చులను నమలిన నెట్లు తెలియును?

వడ్లం — సరే. ప్రకృతమును విమర్శింతము. కోయిలపాట హాయిగా నున్న దంటిరిగదా! ఎట్టిదాహాయి?

చిలు — సకలజీవహృదయములను రసమయములుగాఁ జేయుమధురభావము లందు మూర్తీభవించి యున్నవి.

వడ్లం — సరిసరి! ఈమాటలవలన నాకేమి బోధపడినట్లు? పెండ్లిపాటయా? వసంతపుఁబాటయా?

చిలు — నీ కెట్లు తోఁచుచున్నది?

వడ్లం — ఏమియుఁ దోఁచుట లేదు ఒక్కటే పొలిపాటవలె నున్నది.

గోర — మధురకోకిలగానము మ్రానుగోయిల కెట్లు రుచించును?

వడ్లం — (కోపముతో) మర్యాద నతిక్రమించి మాటాడుచున్నావు!

గోర — ఉన్నమాట యన్న నులుకేల?

వడ్లం — (కోపముతో) ఆలాగా? ఇంతెక్కువ తక్కువలు నీవేమి గ్రహించితివి?

గోర — గ్రహింప కేమి? చిదుకఁబొడిచి చెట్లుఁదొలుచుదానవు నీవు—పాటపాడి చిగుళ్లను బెట్టించునది.

వడ్లం — (అసహ్యభావముతో) నోరుమూయుము! గట్టిగ మాటాడుచున్నావు.

గోర — నీ యినుపముక్కుకంటె, నీటిక్కుటిక్కులకంటె నా మాటలు కఠినముగానున్నవా?

(వడ్లంగిపిట్ట కోపమును బట్టఁజాలక గోరవంకను బొడువఁజూచుచుండఁగా గాలిపాటున రసాలఫలముజారి పడినచప్పు డగును.)

"తురుతురుతురుతురు తుర్రో!"

అని వడ్లంగిపిట్ట యెగిరిపోవును.

చిలు — గోర — (యథాస్థానమున కెగిరిపోవును.)

కోకిల — కుహూ! కుహూ! కుహూ!

కవి

చివురు దినుము! పాడుము! మఱి
చివురులు వెట్టింపు మలరఁ జేయుము వనమున్,
నవనవగీతాచాతురి
మివుల మరల మరలఁ బాడుమీ! కోకిలమా!

# వందనము

**వేంకట పార్వతీశ్వరకవులు**

శ్రీమూర్తి తనమూర్తి చిత్తగించెడివేళ, సిద్ధసంకల్పంబు చెందువేళఁ
చిన్మయాకాశంబు చిత్రితం బగువేళఁ, బంచభూతములు నర్తించువేళఁ
బ్రహ్మాండంబులు ప్రసవంబు లగువేళ, బహురూపములు గానఁబడెడువేళఁ
బ్రవిమలానందంబు ప్రకృతి కబ్బెడివేళ, నఖిలంబునకుఁ బురుడైనవేళ
వేయుచేతుల సృష్టి గావించువేళ, నన్నియును దానయ్యు దేని నంటుకొనక
విశ్వకారణమూర్తియై వెలుఁగుచుండు, వరదుఁ డగు వేదనిధికి మా వందనములు!

సీ. ఘోరశార్దూలముల్ కుయివెట్టునడవిని, మృగకదంబములకు మేపు సూపి
అలకొన్న బకములు పైకొన్న కొలఁకునఁ, జిఱుచేపలకు మను తెఱఁగు సూపి
ఖరనఖ శ్యేనముల్ తిరుగునాకసమున, వరకపోతములకుఁ దెరువుసూపి
దారుణామయములు దరికొన్న జగమునఁ, బొదలుజంతువులకు బ్రదుకు సూపి
సకలజగములఁ బ్రణయైకశాసనమునఁ, బాలనము సేయు జగదేకపాలకునకు
భక్తచింతామణికి సార్వభౌమమణికిఁ, బ్రేమమయజీవమణికిఁ బ్రణామశతము!

సీ. భూతజాలంబు లుప్పొంగి పోవుచుండ, భువనంబు లణువులై పోవుచుండ
గగనభూచరసృష్టి గగ్గోలుపడుచుండ, రవిచంద్రతారకల్ రాలుచుండ
భవరంగమున నాశపటము జాఱుచు నుండ, హాహావిరావంబు లగుచు నుండ
జీవచైతన్యంబు చివికిపోవుచు నుండ, నఖిల మేకార్ణవం బగుచునుండఁ
బ్రకృతిదుస్సహ మగునట్టి ప్రళయవేళ, నఖిలసంక్షోభముం గాంచి యవధిఁ గాంచి
తన్నుఁ దాఁ గాంచి యానందతాండవమున, మగ్నుఁడగు నీశ్వరునకు నమస్కృతంబు!

సీ. కరుణామృతము వోసి పరమాదరమున లాలించి నిత్యంబుఁ బాలించుతల్లి
ప్రేమామృతము చిల్కి ప్రియతమపథము రూపించి నిత్యంబుఁ జూపించుతండ్రి
జీవామృతం బిచ్చి చిరతరారోగ్య మందించి నిత్యంబు సంధించు వెజ్జు
జ్ఞానామృతము సూపి యానందవార్ధిఁ గీలించి నిత్యంబుఁ దేలించుగురువు
నగుచు జీవుల నిత్యంబు ననుసరించి, వేయుగన్నులఁ గని మేలు సేయుచుండు
సర్వలోకాశ్రయుం డైన సర్వమయుని, వత్సలత్వంబునకు నభివాదనములు!

సీ. హాలాహలము నైన నరచేత నిమిడించి, యారగింపఁగ నోపునట్టిశక్తి
అశనిపాతము నైన నడుగుదప్పక నిల్చి, తలయెత్తి యెదిరింపఁ గలుగుశక్తి
కాలపాశము నైనఁ బూలమాలికవోలెఁ, దేజరిల్లఁగఁ జేయు దివ్యశక్తి
ప్రళయానలము నైనఁ బండువెన్నెలవోలెఁ, బరిణమింపఁగఁ జేయు భవ్యశక్తి
సాధువులకుఁ గటాక్షించు సర్వశక్తి, సర్వసమవర్తి శాశ్వతసత్యమూర్తి
సర్వభూతదయాపరచక్రవర్తి, చరణకమలంబులకు నమస్కారశతము!

# రక్తాక్షి

బుర్రా బాలకృష్ణశాస్త్రి గారు

షష్టసప్తకప్రఖ్యాతదోషమునను
మా నిదుమంత్రపుఁ గల్మిచేత
స్వాశ్రయగ్రహపటుబలోచ్ఛ్రయముచేత
కాలముం గర్మముం దోడు గలిగియుంట
నొకరి కొక్కరు తీసిపోకున్న మిగిలి
యుటుక లోకాల వేధించుచుందు రకట!
ఎంతకాలము మీయాట లిట్లు సాగు;
ఉచ్చనీచలు శాశ్వత ముండఁబోవు
అప్పు డటు రుధిరోద్గారి వైతివిగద!
ఇపుడు రక్తాక్షి వైన మా కేమిభయము?

* * * *

సహజదుర్ధర్షదుర్మార్గసరణి నీది
సహజనిశ్చలసహనానుసరణి మాది
పటునిరంకుశనిస్తంద్రఫణితి నీది
ప్రబల ధర్మానుగతతపఃఫణితి మాది
జగము పుట్టెను బుట్టె మీసప్తకంబు
ఎన్నిమాఱులు రావు నీ విట్లు దవిలి
ఎంతగా మేము నిన్ సహియింపలేదు!
దయయు దాక్షిణ్యమును లేదు తలఁచికొనినఁ
బెల్లకుం దగురీతినే వెడలుచుండు
వర్తనముకూడ, నింక మా ప్రార్థనములు
చాలు; నీదయ చాలును; చాలు ఫలము;
ఇపుడు రక్తాక్షి వైన మా కేమిభయము?

* * * *

అవును రక్తాక్షి వాదు వేమైన నాదు
వంతమాత్రాన భయపడ మమ్మ మేము
ఎన్నినా ళ్లుందు; వర్షమాత్రేచ్ఛచేత
నిపుడు భుజకీర్తు లొత్తవే నం చెంచఁబోకు
మల్ల కాలయుక్తి చనె; సిద్ధార్థి గడచె;
రౌద్రి పోయెను; వెడలె దుర్మతియు నటులె;
దుర్మతి యడంగ నంత దుందుభియు మ్రోసె;
జనెడి నదె రుధిరోద్గారియును గలంగి
ఉట్టి కత్తుక వీరల్లి నూఁగినారె!
వట్టియపకీర్తిమాత్రమే వచ్చెఁగాని
యులిగి యిదమిత్థ మని చేయఁగలిగినారె?
గోళములు గోళము లొరసికొనెనె యెచట?
ద్వాదశాదిత్యమండల ప్రభలు గాని
జంతువిప్లావదశనివర్షములు గాని
గలిగి యీభూతసృష్టిని గలఁచివైచు
ప్రళయములు వచ్చెనా వీరిపాలనమునఁ?
గూటికిని గుడ్డకును లోటు గూర్చె టొకటి
భూమి కదలించి దేశాలఁ బూడ్చె టొకటి
చేయవలసిన దేదియో చేసినావు
నుదిరి బ్రహ్మాండభాండమం దొక్కమూల
నే రవంతయొ మాఱుటయెల్ల సహజ;
మీవు చేసెడి దేమున్న దింకమీఁద
పూర్వవర్షము లంతఁగాఁ బొడిచె నపుడు
ఇపుడు రక్తాక్షి వైన మా కేమిభయము?

* * * *

కర్మఫలభోక్త యై నింగి గఱచునపుడు
కలుషవృత్తికి మార్పును గలుగఁబోదు
ధర్మశాంత ప్రయుక్త సన్మార్గయాయి
ప్రబలదుర్దశ సిగపూవు వాడకుండ
నెప్పటికి నొక్కరీతినే వృద్ధిపొందు;
నెన్నికష్టాలు వచ్చిన నేమి? మదిని
ధర్మమును జయించు ననుమాట తథ్యమే కద!
మించి కీర్త్యపకీర్తులే మిగిలి యుండు;
తనువులును సంపదలు శాశ్వతములు గావు;

వహ్నికణములు నామరూపాలు గ్రక్క—
హృదయ మమృతమయముఁ [illegible] గడిరేని
వారిమూర్తుల సత్కీర్తి వనితయంత
నమల నాదంబుతోడ స్వర్ణాక్షరములఁ
బేరుపేరున వ్రాయు దిగ్భిత్తులందు
నన్నియును నీవె నెమ్మది నరసికొనుము
చెప్పవలసిన దంతయుఁ జెప్పినాను
ఎట్లు మెలఁగెదో చూడు నీయిచ్ఛ యింక
నీవు రక్తాక్షివైన మా కేమిభయము?

* * * *

ఒక్క సంగతి [illegible] ముంచుకొనుము
దుష్టస ప్త[illegible]కాలఁ దుదిమె నీవు
అదె సమీపంబునను ప్రభవాదు లుండి
రీవు పోయినఁ గృతయుగ మేర్పడుఁ గద!
ఈరవంత కాలంబు సహింపలేమె!
వచ్చుచుంటివిగాని యీ ప్రక్కఁ గంటె
దినదిన ప్రవర్ధితమహాదివ్యతేజ
మూనివసంతభానునివోలె నదిగో
ధర్మసంస్థాపనాచార్యతరణి వచ్చె
బహుళసందేహవీచికాపటము వెడలి
శాంతవారిధి స్వేచ్ఛగా సాగిసాగి
అటునిటుం దూఁగుచలనంబు నాఁపివైచి
స్వాగతదుర్జయ్య మగు జనశక్తితోడ
సిద్ధనిజమనస్సంకల్పసిద్ధితోడ
భంగములు దాటి దరిఁజేర వచ్చుచుండె
నిపుడు రక్తాక్షివైన మా కేమిభయము?

* * * *

ఎపుడు నీకును దయకుఁ జుక్కెదురు గాదె!
దయయు సత్యంబు శాంతంబు ధర్మసహిత
మార్గసంచార మూని దుర్మదవిఘాత
విజయశంఖంబు పూరింప వెలుఁగుపడక
"నేను రక్తాక్షి నింక నన్నెఱుఁగఁ జేతు"
ననుచు గర్జన చేయుదు వబ్బహాతక!
ఏమనందగు నీకు సిగ్గింత లేదో?
ఎట్లు పూర్వాపరజ్ఞాన మెగసెనొక్కొ?
గమ్యముం జేర ధర్మమ్ముఁ గదలనీక
సకలభేదమ్ము లొక ప్రక్కఁ జదిమిపెట్టి
యేకఫలకాంక్ష జగములు నేకమయ్యె
ఎన్నిమార్గాలఁ బట్టిన నింతయైన
శాంతభంగంబు గాకుండ సంచరించి
ధర్మభంగంబు గాకుండఁ దలఁపుఁబట్టి
సత్యభంగంబు గాకుండ సంప్రతించి
శీలభంగంబు గాకుండ సిద్ధపఱచి
నిష్కలంక ప్రభావమ్ము నిగ్రహించి
ధైర్యకవచంబు రక్షణోద్యతముగాఁగ
నీకుఁ దావెందుఁ గలదు? యీపోక లేమి?
ఈ బెదర్పు లదేమి? యీకసితి యదేమి?
ఏమి తలపెట్టి వత్తువో యెఱుఁగరాదు;
జంకుమాత్రము విడువదు స్మరణఁ దగుల;
శాంతజోత్సాహధైర్యముల్ చాలగల్గు
నిరక రక్తాక్షివైన మా కేమిభయము?

# గాంధిమహాశయప్రశంస

## గార్లదిన్నె సుబ్బారావు గారు

గాంధిమహాత్మ! దేశమునకై శ్రమనొంది, సహింపరాని ని
ర్బంధముఁ బొందితే! యెటులు బాధలఁ గుందుచున్న వాఁడవో
బాంధవపుత్రమిత్రులకు భార్యకుఁ గల్గిన నీదుప్రేమసం
బంధ మటుండఁగా, భరతమాతృసముద్ధరణైకకార్యధౌ
రంధరమూర్తివై తగి, స్వరాజ్యముఁ బొందఁగ నెంచుచుఁ దయా
సింధుఁడవై జనంబులకుఁ జేప్పుడుబాధల నూడ్చి సౌఖ్యముల్
సంధిలఁ జేయఁగాఁ దలఁచి జానపదస్థితబంధురావివే
కాంధతమిస్రమెల్లఁ జనునట్లు ప్రబోధ మొనర్చి ఖద్దరే
బంధువు, మోక్షదం బనుచుఁ బల్లెలయందును బట్టణాలలో
బంధురరీతిఁ జెప్పి, యెటువంటిదియైన విదేశజాంబరం
బుం ధరియింపఁగా మనకుఁ బోలదటంచు నుపన్యసించి, నీ
వ్రం ధరియించితే యటుల పోలనిబట్టను దివ్యవస్త్రసం
బంధము వీడి, నీదగు ప్రభావము నేమన! నీదుకార్యసౌ
గంధపరంపరల్ దెసలఁ గ్రమ్మెను, విస్తృతమైన నీ యశో
గ్రంథము వ్రాయనేర్తునె? స్వరాజ్యమహీజమునందు నాద్యమౌ
స్కంధము నీవె కావె? కలకాలము శ్రీహరి నిన్నుఁ బ్రోవుతన్.

సీ. నీవు జనించిన పావనహైందవ, భూమియే యవతారభూమిగాఁగ
నాజన్మమును నీకు నావాసమగు కారా, గృహ మెన్నగా జన్మగృహము గాఁగ
సకల భారతపుత్రసముదాయ మాత్మీయ, జనమైన యాదవజనము గాఁగ
నతిశయముగ స్వరాజ్యాకాంక్ష గల జన, తండముల్ ప్రియులైన పాండవులుఁగ
నీ కెదురై మది నీబోధ మొప్పని, వారలే కుమతులౌ కౌరవులుఁగ
నరయంగ నెహురూ మహమ్మదాలీ ప్రభృ, తులు విదురాది భక్తులును గాఁగ
సత్యదయాశాంతసాహసాద్యున్నత, గుణములు మెఱమెచ్చు గోపికలుఁగ
దేశహైన్యారాతిఁ ద్రెవ్వ [illegible]ఁ గొన్న, రాట్నమే భయదచక్రంబు గాఁగ
సొంత మేల్బడిఁ బొందఁ జింతించుటయె ధరా, భారంబు హరియించు పనియుఁగాఁగ
నీ సన్నిధిం గడు భాసిల్లు దేశీయ, సభ సుధర్మాహ్వాయ సభయె కాఁగ
వైస్రాయితో నీవు భాషించినవిధంబు, ప్రజలొప్పు రాయబారంబు గాఁగ
ఖద్దరుడాల్చుటే కామ్యసిద్ధియటంట, జగతి గీతోపదేశంబు గాఁగ
దర్శనమాత్రాన దాసుఁడై యెవాఁడుఁ, జనుట యమానుషశక్తి గాఁగ
ప్రజలకై నీవెప్డుఁ బడు వంతలెల్లను, భక్తులకై పడు పాటుగాఁగ

గీ. గలిగి, యద్భుతమహిమచే వెలసి, ధాత్రి, నపరకృష్ణావతారుండ వనెడునుడికి
నర్హుఁ[illegible] నిన్ను జనులు 'మహాత్ముఁ'డనెడి, బిరుద మెంత? ఘనతయెంత? వెలయదెంత?
యిట్టి నీకచ్యుతుం డాయు విచ్చుఁగాక, యెట్టికాలంబు నారోగ్య మిచ్చుఁగాక
తొట్టినట్టి వెతల్ గూలఁద్రోయుఁగాక, పట్టినతలంపు లీలఁ దుదముట్టునట్లు
గట్టిగాఁ జేర్చి నిన్నుఁ జేపట్టుఁగాక, గాంధిశుభనామ! నయగుణగ్రామసీమ
సర్వదేశాభిరామ! విసారకీర్తిసామ! ధృతిధామ! భారతసుతలలామ.

# సాహిత్య విమర్శన స్వభావము

నేపూరి లక్ష్మీనరసయ్య గారు, ఎం. ఏ.,

విమర్శన మనఁగా జక్కఁగా విచారించుట యని యర్థము. కావున సాహిత్యము విమర్శించువానికి గొప్పప్రతిభ, అనుభవ ముండవలెను. కవిత్వము విచారించునపుడు, కవియొక్క భాషాజ్ఞానము, ప్రాపంచికవివేకము మానవజీవితగ్రహణశక్తి పక్వానుభవము గుర్తింపవలసి యున్నది. కావున విమర్శకుఁడు కవిగాకపోయినను గవి సమానుఁడు గావలయును. అట్లుగానిచో కవిభావగీతికలను గుర్తింపఁజాలఁడు. ఎట్లైనను గవిత్వవిమర్శన కవిత్వమువలెనే పవిత్రమైనది. అందుచేత దానికిఁ దగినంత గౌరవ మున్నది.

ఆంధ్రవాఙ్మయమున నూతనభావచారిత్రికశాస్త్రీయవిమర్శన లేకుండుట భాష కెంతయు లోపము. ఇదివఱలో వ్రాసిన విమర్శకులందఱు లక్షణగ్రంథములను బట్టియే వ్రాసియున్నారు. మనవాఙ్మయమున లక్షణగ్రంథములకు స్థాన మున్నది గాని విమర్శనయందు వానికిఁ గల గౌరవస్థానము మలినమై యున్నది.

సంస్కృతాంధ్రములందుఁ బెక్కు లక్ష్యలక్షణగ్రంథము లున్నవి. వాని వ్యుత్పత్తిని గుఱించి యించుక విచారింతము. భాషకుఁ బూర్వము సాహిత్యము లేనట్లు, సాహిత్యమునకుఁ బూర్వము విమర్శన లేదని యందఱకెని దెలిసిన విషయమే. కావున లక్షణగ్రంథము లన్నియు నింతయో యెంతయో సాహిత్య మేర్పడినతర్వాతనే బయలుదేఱినవి. కవుల ప్రభావము కడు చిత్రమైనది. దానిని గ్రహించుటకుఁ బండితపామరు లర్హులు. కాని భాషాలోపముచేఁ బామరులు భావపూరితములగుకొన్నియుద్గ్రంథములను, వానియందలి యున్నతభావములను, గ్రహింపలేక పోవుదురు. సాహిత్యము "విశ్వశ్రేయస్కరమైనది." కావున నందఱానందింపవలసినవిషయమే. అందుచేతఁ గావ్యము దురవగాహము కాఁగూడదు. ఒకప్పుడు భాషాజ్ఞానము ప్రజలయం దనేకకారణాంతరములచే క్షీణించుటచేతఁ గొన్ని యుత్తమగ్రంథములు జనసామాన్యమున కర్థము కాకుండఁబోవచ్చును. అప్పుడు ప్రజలు సాహిత్యమునం దిచ్ఛ గలవారైనను గ్రంథములలోనిభావములు తెలిసికొన నుత్సాహము కలవారైనను, భాషాకాఠిన్యమునకు వగచి, వెనుకకు నీడ్చుమనముతో నాయాగ్రంథకర్తల నిరసించుచుఁ బోవుట గలదు. అట్టియెడ నెవరు నిందింపవలసినవారో తెలియదు. ప్రస్తుతపుకాలమే నిందిత మని తలంచుట యుక్తము.

కవులు తమ కుచిత మని తోఁచిన శైలిలోను, దమ కలవాటగు శైలిలోను గవిత వ్రాయునాచారము కలవారు. వారు ప్రపంచముకొఱకు బద్ధులై, స్వతంత్రమును జంపుకొనరు. కావుననే "నిరంకుశాః కవయః" అందురు. కవి కొక్కొక్క కాలమున నొక్కశైలిపై నలవాటు పడియుండును. ఇందులకు దృష్టాంతముగఁ గవిసార్వభౌముఁడగు శ్రీనాథమహాకవి వ్రాసినశృంగారనైషధములోని యీక్రింది పద్యముఁ దీసికొనవచ్చును.

"చ. పనిగొని నారికేళఫలపాకమునం జవియైన భట్టహ
ర్షుని కవితానుగుంభములు సోమరిపోతులు కొంద ఱయ్యలో
యని తలయూఁప నేర రదియట్టిద లేజవరాలు చెక్కుఁగీ
టిన వసవల్చు బాలకుఁడు డెందమునం దలరంగ నేర్చునే."

ఈపద్యమువలనఁ గవులఁ బట్టి రసవిదులు నడచుకొను నలవాటు గలవా రని తోఁపదు. ఈ కారణముచేఁ గాలవశమునఁ గొన్నిసాహిత్యగ్రంథములు సామాన్యపండితపామరులకుఁ గూడ నర్థము కాకుండఁ బోవచ్చును. అట్లు మార్పులు వచ్చునపు డాయాగ్రంథములవిలువ చెడును. చెడనీయక యుంచుటకొఱకు వ్యాఖ్యానములు కావలసివచ్చును. లక్ష్యలక్షణములను దెలుపు వ్యాఖ్యానములే చివరకు లక్షణగ్రంథము లైనవి. కావున లక్షణ

గ్రంథము లన్నియు నంతకుఁ బూర్వ మున్న వాఙ్మయ స్వభావమును దెలుపుచరిత్ర లేశములుగఁ బరిగణింపఁదగినవి. ఆవలికాలమువారు దానినె యనుసరించి యుండిరేని కవితాశిల్ప మంతరించి యుండునేమో? అరిస్టాటిలను Aristotle గ్రీకుతత్త్వకవిత్వశాస్త్రజ్ఞుఁడు తనకుఁ బూర్వ ముండిన మంచిగ్రంథముల నన్నిటిని బరిశీలించి వానిలక్షణముల నొకగ్రంథముగా 'Poetics' వ్రాసెను. అతనికిఁ దర్వాత వచ్చినవా రాగ్రంథమునే మూలాధారముగాఁ దీసికొని యాగ్రంథములోనిలక్షణములకు విరుద్ధము లేకుండునట్లు గ్రంథములు వ్రాసిరి. పిదప నట్లు విరుద్ధము లేవైనను గలగ్రంథములు బనికిరానివిగాఁ ద్రోసివేసిరి. అటులే మనలక్షణగ్రంథములుకూడ బయలుదేఱి యుండును.

లక్షణగ్రంథములకట్టుబాటులకు లోఁబడని గ్రంథములయం దెంతరస మున్నను, భావ మున్నను, మన లాక్షణికులు బహిష్కరించిరి. అంతియగాని యేభావ స్వరూపము బహిరంగముచేయుటకో, ఏరసస్వరూపము వెల్లడిచేయుటకో, లేక, తమకుఁ గల భావస్వాతంత్ర్యము వెల్లడించుటకో యటులు కవులు తమకుఁ బూర్వమున్ననియమముల జవదాఁటియుందు రని తర్వాతిలక్షణగ్రంథకర్త లూహింపకపోవుటయే మనసాహిత్య మభివృద్ధి నొందకుండుటకుఁ గారణమైనది. ఇందులకుఁ బ్రబలనిదర్శనము కేవలభావకవి యనఁదగు వేమనకు నాంధ్రసాహిత్యమునఁ బ్రాచీననియమానుసారు లుచితమగుస్థాన మొసఁగకపోవుటయే.

గ్రంథ మెంతరసవంతముగ నున్నను, "శూద్రుఁడు రచించిన శ్రావ్యము గా" దనుకట్టుబాటుగూడ నప్పకవి చేసియున్నాఁడు. సాహిత్యమునకు గ్రంథములు ప్రధానములా, గ్రంథకర్తలజాతి ప్రధానమా యని ప్రాచీనలక్షణగ్రంథకర్తలూహింపకపోవుట మిక్కిలి విచారకరము.

లక్షణగ్రంథములకట్టుబాటులు కవుల ననేకవిధములఁ బీడించెను. స్వతంత్రశీలురగుకవు లాకట్టుబాటులకు లోఁబడలేక విడువలేక కడకు జవదాఁటిరి. కావుననే యట్టికవులకవితలో గుణము చాల కానవచ్చుచున్నది. ఇట్టిస్వతంత్రకవులలో కనుపర్తి అబ్బయామాత్యుఁ డొకఁడు. ఇతఁడు తన "కవిరాజమనోరంజనము"లోఁ దన యభిప్రాయము నిట్లు చెప్పికొనియున్నాఁడు:

ఉ. " చెల్లు నటంచు నొక్కకవి చేసినలక్షణ మొక్కఁ డివ్వలన్
జెల్లమి జేసి తా నొకటి చెప్పఁగ లక్షణవిస్తరంబు సం
ధిల్లుటఁ గావ్యశంక లవనిం దఱుచయ్యె రసజ్ఞులార......".

రసార్థియై యీకవి లక్షణములకట్టుబాటులఁ జాలవఱకు జవదాఁటి కృతార్థుఁడయ్యెను.

సాహిత్యమునకు సహాయపడినంతవఱకు లక్షణగ్రంథము లుపయోగకరములు; కాని నాటంకపడినప్పుడు వానిని దీసివేయవలసివచ్చును. ఏలన మనకు సాహిత్యమే ప్రధానము. అయిన మనము పూర్ణముగా లక్షణగ్రంథములను నిరసింప వీలులేదు. అవియు నొకప్పుడు సాహిత్యమునకు సహాయములుగా నుండినవి. మఱియు నొకవిధమగులక్షణములు గల ప్రాచీనసాహిత్యగ్రంథములను బరిచయము చేసికొనుట కవి సహాయపడును.

ఐనను లక్షణగ్రంథములు మనకుఁ బూర్ణాధారములు కావు. అవియే యాధారములు కానియెడల నింకే యాధారములు సాహిత్యమునకుఁ గలవని పాఠకు లడుగవచ్చును. ఆధారములు లేకపోలేదు. సాహిత్యము భావముతోఁ గూడినది. భావరహితమైనప్పు డది తనపనిని మానుకొన్నదని యనవచ్చును. కావున భావమును విమర్శించుటకు భావపరిపూర్ణతయే కావలయును. అట్టిభావపరిపూర్ణముతో విమర్శింపఁబడిన విమర్శనలు భావ కావశ్యకములు. రసస్వరూపమును, భావస్వరూపమును, లక్షణగ్రంథములు, ప్రాచీనవ్యాఖ్యానములు బోధించుట లేదు. కాన వానిని విమర్శనవాఙ్మయమున నొకతెగగఁ బరిగణించి ప్రధానస్థానము భావవిమర్శమున కీయవలయును.

పాశ్చాత్త్యులయందు విమర్శనము నూతనవికాసముఁ జెంది యున్నది. మనదేశమునం దన్ననో యది జన్మించినదే కాని, యభివృద్ధిఁ జెందినది కాదు. ప్రస్తుతము పాశ్చాత్త్యులయం దున్న విమర్శనవిభాగములను గూర్చి యించుక ముచ్చటింతము. ఇతరవిషయముల నేమియు బాటింపక గుణాగుణములను స్థూలదృష్టితోఁ

బ్రశంసించి బాగోగులను మాత్రమే చివరకు విచారించి, కావ్యముపైని తీర్పుఁ జెప్పువిధ మొకటి. దీనిని బాగోగుల తీర్మానపు విమర్శన మని యందము. (Judicial Criticism) ఈ తెగవిమర్శకులకు లక్షణగ్రంథములే ప్రమాణములు గాని, వీరికి నూతనభావవికాస మందికది కాదు. నూతనవిషయము లట్లు విమర్శనలోనికిఁ దేఁబడనందున ఆసాహిత్యమునకు నష్టము కలిగినది. కావున నీవిషయమే వదలి కావ్యమునందలి గుణాగుణములను మాత్రమే సూక్ష్మబుద్ధితో విచారించి యీకావ్యమునం దీయీగుణము లున్నవి, వేఱొకకావ్యమునం దాయీగుణము లున్నవని యొక్కొక్కకావ్యము నాకావ్యపు సూత్రములతోఁ బరిశీలించు టర్హమని నిశ్చయించి కొందఱు "అనుమేయ విమర్శన" (Inductive Criticism) కొఱకై వాదించి యున్నారు. ఆవాద మెంతయు బ్రశంసనీయమే. లక్షణబంధితుపవిమర్శనలోని కాఠిన్యముఁ జూచినవారి కీయనుమేయవిమర్శనకన్న వేఱుమార్గము లేదని తోఁపక పోదు. అయిన నీమార్గమునఁగూడఁ గొంతకొఱఁత గలదు ఇందు విమర్శకునివ్యక్తి బొత్తుగా సాగపడదు. అంతియగాక కావ్యము సర్వజనరంజకమైనది లేనిది తేటపడదు. అందఱు పండితులైనయెడల నద్భుతవిషయములతోఁ గాలము పుచ్చఁగలరు. గాని సామాన్యజనుల కవి సుబోధములు కావలయు నన్న నుపసంహార ముండితీరవలయును. ఏవిషయము మనము విచారించినను నది మంచిదా ? చెడ్డదా ? యని చర్చించుచుందుము. అటులే కావ్యములందుఁగూడ విచారింపవలసి యున్నది. కావున ననుమేయపద్ధతిప్రకారము మన కేదియుఁ దేలదు. ఉపసంహారము లేనందున విమర్శన చివరమాత్ర మాశాభంగకరముగా నుండును. ఏకావ్యమునైనను మనము చదివి యానందింపవలసినదియే. అట్టియెడ ననుమేయవిమర్శన ప్రకార మానందమునకుఁ గొంతలోపము వచ్చును. కావునఁ బూర్వపుఁబద్ధతికిని ఈనూతనపద్ధతికిని మధ్యమార్గమే మనపద్ధతిగా నవలంబించిన మంచిమార్గమునఁ బోయినవార మగుదుము. దీనినే చారిత్రిక (Historical) విమర్శన మందురు. అనుమేయపద్ధతిప్రకార మొక గ్రంథమును గొంతవఱకు విమర్శించి ఆధునికప్రాచీనవర్తమానముల కెంతవఱకు నిదర్శనముగా నాగ్రంథ మున్నదో తెలిపి కావ్యమందలి గుణదోషములను వెల్లడించు నుపసంహారముతో నిది ముగింపఁబడును. అభివృద్ధి నొందఁదగిన ప్రతివాఙ్మయమున కిట్టివిమర్శనలే చాల నవసరములు.

ఆంధ్రమున నూతనభావకావ్యములు చాలినన్ని లేవని మనమందఱ మెఱుంగుదుము. నూతనభావకావ్యము లేవన, లక్షణగ్రంథముల ననుసరించి నాయికానాయకలను జిత్రింపక ప్రబంధసంప్రదాయముల దృష్టిపథమున నుంచికొని యష్టాదశవర్ణనములతో నొకయచ్చునఁ దీసినప్రతిబింబపటములవలె సృజింపక నూతనభావములతోఁ బక్వవివేకముతో పాత్రముల సహజధర్మములకు ననుకూలములగు పోకడలతో నలరుకావ్యము లని చెప్పవచ్చును. నూతనమార్గము లన్నఁ బూర్వనాగరికులకు నచ్చదు. ఒకవేళ నెవ్వరైన నట్టిత్రోవల నేగినచో సమకాలికులు వారిని ఒత్తియొత్తి నిడుతురు. కావుననే చేమకూర వేంకటపతి "విజయవిలాసము" లో "ఏగతిని రచించుచున్న సరికాలమువారలు మెచ్చరే కదా" యని చెప్పియున్నాఁడు. సమకాలికులపీడ చాలబలమైనది. సమకాలికులు తఱచుగాఁ బ్రాచీనవాఙ్మయముకంటె నాధునికవాఙ్మయము వెనుకఁబడిన దను విశ్వాసముతో నుందురు. కాన రసోత్తరములైనను, ఆదర్శప్రాయములైనను సమకాలికులగ్రంథములలోని సారస్యము వారు గ్రహింపఁజాలరు. కావున సమకాలికులకంటె రాఁబోవు యుగమువారే నూతనభావకావ్యకర్తలకు సహకారు లని తలంపవలయును. సత్కావ్యములగుణములను గాలమే వెల్లడింపఁగలదు. భవభూతి గూడ సమకాలికులయొత్తడికిఁ దాళలేక కాఁబోలు "మాలతీమాధవీయము" లో ,, గ్రంథము బాగులేదనువారికొఱకిది వ్రాయఁబడలేదు. కాల మనంత మైనది. ప్రపంచము విశాలమైనది. నాసమానధర్ముఁడు పుట్టకపోఁడు. అట్టివానికొఱకే వ్రాయుచున్నాను." అని సమాధానము చెప్పికొని యున్నాఁడు.

మనము పురాణములలో మునిఁగి ప్రబంధము లలోఁ దేలుచున్నాము. ప్రబంధములనుగుఱించి శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారివిమర్శనఁ జదివినవారికి వేఱుగ వ్రాయవలసియుండదు. ప్రబంధరచన వెఱ్ఱి యాఁగిపోయినతరువాత, వేఱేవిధమైన కావ్యములు చాలినన్ని యాంధ్రవాఙ్మయమున బయలుదేఱలేదు.

ఇప్పు డింకొకవిషయము గమనింపవలసియున్నది. మనవారు నిబంధనలకు నెక్కువగా లోఁబడువారు. పుక్కిటిశాసనములకును నితరనైతికశాస్త్రములకు నెట్లు లోఁబడిరో యట్లే యేదో యొకవిధముగా వ్రాయఁబడిన లక్షణగ్రంథములనే ప్రమాణమునుగా నెంచిరి. ఇప్పటికి నేవిషయమునందైన నొకచర్చ వచ్చెనేని తప్పైనను, ఒప్పైనను పూర్వగ్రంథమునే ప్రమాణముగా నెంతురు. ఈయలవాటువలన వారు పూర్వగ్రంథములం దెంతయభిమానము గలవారో తెలియనగును. రచనలకు యతిప్రాసలు చెల్లవందురు. అట్లు చెల్లిన భాష కేమి లోపము వచ్చునో చెప్పువా రరుదు. కాని యతి మాత్రము కూడదనువారు మెండు. కొంచెము స్వరభేదమే యొప్పనిమనవారు నూతనమార్గముల నెట్లునే యొప్పరని చెప్పవచ్చును. ఒకప్పుడు "అర్జునపరాభవ"మ నునాటకము నేను చదువుచుండ, సంస్కృతసాహిత్యము గలపండితుఁడొకఁడు నాయొద్దకు రాఁగా, నేనానాటక గుణాగుణములను గుఱించి యెంతోయుత్సాహముతో ముచ్చటింపఁబోవ, నాతఁ డానాటకనామము మూఁడు నాలుగు సారు లుచ్చరించి యేగ్రంథమునకైనఁ బరాభవము లేక విఘ్నసూచన గల్గునామము గ్రంథనామమై యుండఁగూడ దని శాసింపఁబడియుండ నిట్టి గ్రంథనామ మిడుట పొరబాటని చెప్పెను. పండితులపూర్వలాక్షణిక విశ్వాస మెంతవఱకుఁ దెచ్చినది. సంస్కృతభాషలో "కంసవధము," "ఊరుభంగము" "శిశుపాలవధ" లోనగు విషాదాంతనామములతోఁ బెక్కు గ్రంథము లుండుట యాపండితుఁడెఱుంగఁడు కాఁబోలు. లక్షణగ్రంథనామముల నిషేధించెనే గాని యుత్తమకవులానియమముల నుల్లంఘించిరి. ప్రతిభాషయందిట్టి స్వాతంత్ర్యము కవులకుఁ గలదు. పండితు లాలక్షణగ్రంథములనుబట్టియే ప్రాఁకులాడుచుందురు. కాని లక్ష్యవివేకముతో భాషాప్రపంచము దర్శింపలేరు. ఇదియే మనవిమర్శనమునకు వేరుపురుగై కావలసినంత సాహిత్యముఁ బాడుచేసినది.

ప్రస్తుతము దీనిని విరమించి మనచర్చకు వత్తము. సాహిత్యము విశ్వమునకు జెందియుండుటవలనఁ దానిని బెక్కునిబంధనలవలనఁ జెఱుపఁగూడదు. భావనాశక్తి యేమార్గము చూపునో యామార్గమునఁ బోవుటె కవుల కుచితము.

ఆంధ్రమున విమర్శనగ్రంథములు పెక్కు లేవని వేఱుగా జెప్పనక్కఱలేదు. శ్రీ రామలింగారెడ్డిగారు నూతనభావవిమర్శనమునకు మార్గదర్శకులు. ఇటీవల నప్పుడప్పుడు వెలువడు గ్రంథములపీఠికలయందుఁ గొంత నూతనవిమర్శనసూచన లగపడుచున్నవి. పూర్వపుఁ బద్ధతులను మాని నూతనకల్పితకావ్యములు వ్రాసినవా రరుదు. వీరిలో రాయప్రోలుసుబ్బారావుగారు కొంతవఱకు నూతనమార్గావలంబనముఁ జేసిరి. శ్రీ శేషాద్రిరమణకవులు "ప్రణయిని"లోఁ జక్కనిభావములను నూతనపుఁబోకడలతో వ్రాసిరి. "ఊహాగానము"కూడ నీతీరుగ వ్రాసినగ్రంథములలోనిదే. ఇట్లే కొన్నిహాస్యగ్రంథములు తదితరములు కనఁబడుచున్నవి. కాని, విశేషముగాఁ గానఁబడవు. కావుననే ఆంధ్రసాహిత్యము ప్రపంచసాహిత్యమునకు వెనుకఁబడియున్నది. ఈకొఱంత కొలఁదికాలములోనే తీరునని యెంచెద.

ఇప్పుడు "సాహిత్య" మన నేమో కొంత చర్చింతము. ప్రపంచమునం దనేకవిధము లగు గ్రంథము లున్నవి. అవి యన్నియు సాహిత్యగ్రంథములుగా నెంచఁదగునా? అట్లన్నిటిని సాహిత్యగ్రంథములుగా నెంచను వీలుపడదు. ఉత్తమగ్రంథములుమాత్రమే సాహిత్యములోఁ జేర్పఁదగినవి. ఉత్తమగ్రంథములను వేఱుదీయుట సామాన్యమైనపని గాదు. "లోకో భిన్నరుచిః" అనునట్లు ఒకరికి నుత్తమగ్రంథముగాఁ దోఁచినది మఱియొకరి కట్లు తోఁపదు. కావున నన్నియు నుత్తమగ్రంథములుగానే యెంచవలసివచ్చును. అప్పుడు మనమార్గ మేదియో

నవలలు నవలలు

# సరస్వతీ గ్రంథమండలి - రాజమహేంద్రవరము

ప్రకాశకుఁడు: అద్దేపల్లి లక్ష్మణస్వామి. సంపాదకుఁడు: తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి.

ఇందు విశేషముగ మనోహర కథాకల్పితంబులును, భావపూరితంబులు నగు చారిత్రిక-సాంఘిక-సాంసారిక - అపరాధ పరిశోధక - నవలలు, ముచ్చటైన బొమ్మలతో ముద్దులొలుకు క్యాలికో బైండుతో డెమ్మీసైజున రమారమి ౨౦౦ పుటలతో రెండుమాసముల కొక్కటిగ వెలువడుచుండును. వెలువడు ప్రతి గ్రంథమును పోస్టేజిగాక రు ౧-౦-౦ వెలకు చందాదారులకు బంపుచుందుము. చందాదారుగఁ జేరువారు ప్రవేశరుసుము ముందుగ నాలుగణాలు చెల్లింపవలెను.

ఇం దీవఱకు వెలువడిన గ్రంథములు:

౧ రహస్యవిప్లవము ౨ చోరశిఖామణి 3 హత్యారహస్యము, (డిటెక్టివు నవలలు)

౪ ప్రేమసుందరి ౫ లక్ష్మీప్రసాదము ౬ రెయినాల్డ్సు కవివర్యుని 'ఫాస్టు' మొదటిభాగము ౭ 'ఫాస్టు' రెండవభాగము. (సాంఘిక నవలలు.

అనుబంధ గ్రంథములుగ:—౧ మార్కండేయ నాటకము ౨. 'మృత్యుతరంగిణి' యను డిటెక్టివు నవల 3. 'అభాగిని' యను సాంఘిక నవల.

---

# కె. నాదముని అండు సన్సు

164, చైనాబజారు రోడ్, పార్కుటౌను మద్రాసు.



## మావద్ద నాటకసంఘములకు కావలసిన సామానులు

జిగినాపనిచేసిన విల్వెట్టు డ్రెస్‌లు నూతనమైన సీనులున్ను నాగరీకమైన స్త్రీపాత్రలకును, రాజపాత్రలకును కరాల్ టోపాలున్ను ముఖమునకు వేయుటకు ఇంగ్లీషు రంగులున్ను స్టేజికర్టన్స్ పరదాలో వ్రాయుటకు అన్నిరకములు రంగులున్ను, యెట్టో బంగారు ఆభరణములున్ను, జిగినాలేస్ పనిచేసిన పగిడీలును, హంటింగు సూటులు, రాక్షసుల ఉడుపులు మిలిటరి సంబంధమైన ఉడుపులు, పార్శీవారి, విధవిధ అరబ్బీవర్తకుల ఉడుపులు, ఫేసుపౌడరులు, పెరల్ క్రీము, రోజాబ్లూము, గ్రీజ్ పెయింటులు, లిప్‌సల్, రౌగ్, ఏప్లు, లైనింగుపెనసల్లు మున్నగునవి అన్ని రంగులలో గలవు. అన్నిరకముల రాజాటోపీలు, తలపాగాలు, ఫెదర్సు, బ్రూచీలు మావద్ద ఎప్పుడు సిద్ధముగా నుండును. లేనివి ఆర్డరు ఇచ్చిన సకాలములో తయారుచేసి పంపెదము. వెల సరసముగా విక్రయించెదము. వలయువారికి అర్ధణాబిళ్ల పంపితే కేటలాగు పంపెదము. ఇదివరలో అనేక సంఘములకు విక్రయించి అనేక యోగ్యతాపత్రికలను పొందియున్నాము.

K. NATHAMUNI & SoNS.

164, China Bazaar Road G. T. Madras.

# ఆనందాశ్రమ గ్రంథరత్నమాల

## తెనుఁగు పుస్తకముల వివరము

గ్రంథములకు వ్రాయునపుడు వాని వెలయును తెలుపవలెను.

నూతన ప్రచురము నామలింగానుశాసనము అను నామాంతరము గల

### అమరకోశము

త్రికాండము - సటీకము

ఆంగ్లేయభాషాంతరపదములతోఁ గూడినది.

20 రతుల డిమ్మి గ్లేజుకాగితములు

| | | | |
|---|---|---|---|
| క్యాలికో బైండు | 1 | 12 | 0 |

16 రతుల సాదాకాగితము

| | | | |
|---|---|---|---|
| క్యాలికో బైండు | 1 | 8 | 0 |
| అట్టబైండు | 1 | 0 | 0 |

### శ్రీమద్భగవద్గీత

ప్రతిపదటీకాభాష్యవిశేషార్థ సహితము

ఈ గ్రంథము మొదటి కూర్పునందు శ్రీరామానుజభాష్యము ననుసరించి టీకాతాత్పర్యములు కొంత సంగ్రహముగ వ్రాయఁబడినవి. భాష్యమును యథామూలముగా తెనుఁగుచేసినచో విశ్కిలి యుపయుక్తమని యనేకులు కోరినందున భాష్యమునం దొక్కవిషయమునైన విడువక అందలి ప్రమాణములకు ఆకరములతోను, కష్టములైన ప్రమాణములకు అర్థములతోను, భాష్యమునందు సందిగ్ధములైన విషయములకు తాత్పర్యచంద్రికనుండి విశేషముగా వివరణములతోను గూర్చి, తేట తెనుఁగున ఈ రెండవకూర్పును ముద్రించి యున్నారము. ఇందు గీతార్థసంగ్రహమునకు టీకయు చరమశ్లోకమునకు లోకాచార్యులు రచించిన రహస్యార్థమును గలవు. మొదటి కూర్పుకంటె నీ రెండవకూర్పునందు సుమారు 250 పుటలధికముగాఁ జేర్పఁబడియున్నవి. కాలికో బైండు గిల్టుపేరు గలది 3 0 0

### శ్రీమదాంధ్ర మహాభారతము, పద్యకావ్యము

పెక్కు వ్రాతప్రతుల సహాయమున చిరకాలమునుండి సంపూర్ణశ్రద్ధతో వ్రాయింపఁబడి 40 రతుల గ్లేసుకాగితములపై అచ్చొత్తించి పేలు కాలికో బైండు గిల్టుపేరు చేయఁబడియున్నది.

| | | | |
|---|---|---|---|
| 1. ఆది సభాపర్వములు గల సంపుటము | 2 | 4 | 0 |
| 2. అరణ్యపర్వము | 2 | 4 | 0 |
| 3. విరాటోద్యోగపర్వములు | 2 | 4 | 0 |
| 4. భీష్మద్రోణపర్వములు | 2 | 4 | 0 |
| 5. కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వములు | 2 | 4 | 0 |
| 6. శాంతిపర్వము | 2 | 4 | 0 |
| 7. ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక స్వర్గారోహణ పర్వములు గల సంపుటము | 2 | 4 | 0 |

శ్రీకృష్ణకర్ణామృతము మూడాశ్వాసములు, ఆంధ్ర టీకాతాత్పర్యవిశేషార్థములతోను ఆంధ్ర పద్యములతోను కాలికో బైండు అతి సుందరమైన గిల్టుపేరు గలది 1 12 0

హరిశ్చంద్రోపాఖ్యానము, ద్విపద 0 12 0

నలచరిత్రము:— ఇది చక్రపురి రాఘవాచార్య ప్రణీతమయిన ద్విపదకావ్యము. 0 12 0

బిల్హణీయము:— చిత్రకవి సింగరార్యప్రణీతము 0 8 0

పారిజాతాపహరణము:— ముక్కు తిమ్మనార్యుని ముద్దు పల్కులు ఎవరికిష్ట ముండవు? ఇందలికథ శ్రీకృష్ణుఁడు స్వర్గలోకమునుండి పారిజాతవృక్షమును దెచ్చుట. సత్యభామ నూరార్చుటయును. ఇంకను పెక్కుకథలు గలవు. నాగపూడి కుప్పుస్వామయ్యగారి గొప్పపీఠిక గలదు. 0 8 0

గజేంద్రమోక్షణము:— టీకాతాత్పర్యసహితము. కాలికో బైండు 0 10 0

డిటో డిటో పేపరు బైండు 0 8 0

రుక్మిణీకల్యాణము:— సటీకాతాత్పర్యము, కాలికో బైండు 0 10 0

డిటో డిటో పేపరు బైండు 0 8 0

శ్రీసహస్రనామస్తబకము:— విష్ణుసహస్రనామస్తోత్రమ్, గోపాలసహస్రనామస్తోత్రమ్, హయగ్రీవసహస్రనామస్తోత్రమ్ మొదలగు యంశములు గలవు 0 12 0

భజగోవింద శ్లోకములు, శ్రీమచ్ఛంకరభగవత్పాద విరచిత మగు శ్రీగోవిన్దద్వాదశమంజరికాస్తోత్రము తచ్ఛిష్యవిరచితమగు శ్రీగోవిన్దచతుర్దశమఞ్జరికాస్తోత్రము ఈరెండును టీకాతాత్పర్యములతో 0 2 0

శ్రీలక్ష్మీనృసింహస్తోత్రము శ్రీమచ్ఛంకరభగవత్పాదవిరచితము సటీకాతాత్పర్యము 0 2 0

ముకుందమాలా సటీకాతాత్పర్యము 0 4 0

## ఎ. కణ్ణన్ సెట్టి అన్డ్ కంపెని

తెనుఁగు బుక్కుసెల్లర్స్ అన్డ్ పబ్లిషర్స్

286, చైనా బజారు రోడ్డు,

మద్రాసు

తెలియకుండును. కావున నుత్తమగ్రంథమును వర్ణింతము. విషయమును బట్టియు, విషయవిచారణను బట్టియు సర్వజనుల కభిరుచి గలిగించుచు స్వరూపమువలన నానందము కలుగఁ జేయునదియే యుత్తమగ్రంథము.

"సీ. శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగ నీక
పదమైత్రి యర్థసంపదలఁ బొదలఁ
దలఁ పెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తిదోషంబు పొంతఁ బోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరింపుచు నా
ఖాచంక్రమక్రియ గడవఁ జనక
ప్రకృతార్థభావంబు పాదుకొని నడుచుచు
నుపపత్తి యెందు నత్యూర్జితముగ
తే. గీ. నొకటఁ బూర్వోత్తరవిరోధ మొందకుండ
దత్తదవయవవాక్యతాత్పర్యభేద
ములు మహావాక్యతాత్పర్యమునకు నొదవఁ
బలుక నేర్చుట బహుతపఃఫలము గాదె."

ఉత్తమగ్రంథము పైవిధముగ నుండవలయు నని పింగళిసూరకవి చెప్పియున్నాఁడు. సంస్కృతకవులుగూడ "రమణీయములగు శబ్దార్థములు ప్రతిపాదించునదియే కావ్యమనియు" "రసాత్మకమగు వాక్యమే" కావ్యమనియుఁ జెప్పియున్నారు. కావ్యమునకు రసము జీవము. రసమును పాత్రౌచితినిబట్టి జాగరూకతతోఁ గాపాడినవాఁడె కవితాశిల్పమునఁ గృతార్థుఁడు. శ్లేషలు, శబ్దాలంకారములు, గర్భకవితలు రసము వెదజల్లఁ జాలవు. కవులకుఁ గల చిత్రనిర్మాణశక్తి వెల్లడించును. రసవిషయమునఁ బాత్రపోషణమున రచనాసౌష్ఠవమున నెన్నుకొనఁదగిన కార్యమె విమర్శనీయము. దానిని దఱచిననే యమృతము లభించును. కావున నట్టిగ్రంథమునకును మానవజీవమునకును రసస్వరూపమునకుఁ జేరిక కలదు. వీనికి భిన్నమగునవి సాహిత్యములోఁ జేరవు. ఇది లోకానుభవముచే గ్రహింపఁదగినది. ఇట్టిగ్రహణశక్తి లేనిచో బజారు లెక్కలజాబితాకూడ సాహిత్యములోనికిఁ జేర్పవలసియుండును. కావ్యస్వరూపవిషయములో రసికులకు భిన్నాభిప్రాయము లుండును. అయిన నుత్తమస్వరూపమును నడకవలననే గుర్తింపవచ్చును. దీనిని నిర్ణయించుటకు రాచికులు కావలెను. మానవజీవము ప్రపంచమునం దంతయు నొకటే. అలవాటులు భేదించును. కాని స్వభావము మాఱఁజాలదు. కావున సాహిత్యము ప్రపంచమం దంతట నొకవిధమే.

సాహిత్య మిట్టిదైనప్పుడు జనసామాన్యమునకు సాహిత్యపరిచయ మబ్బుట దుస్తరము కాకపోయినను, విశ్రాంతిలేకయో, ప్రపంచభాషలు రాకయో యందఱికి సాహిత్యవాసన దొరకకపోవచ్చును. ఒకభాషయందుఁ బాండిత్యమున్నవారికి వేఱొకభాష రాకపోవచ్చును. ప్రస్తుతము మన మాంగ్ల (పాశ్చాత్య) సాహిత్యము తెలిసికొనవలె నన్న నాభాష నేర్చుకొనవలసివచ్చును. అట్టియెడ నాభాషాసాహిత్యవిమర్శనఁ జదివి భాషావాసన లేనిసమయమున సాహిత్యవాసన కలుగఁ జేసికొనవచ్చును. ఇట్టిసమయములందు విమర్శనలు తోడుపడును. విమర్శనయందు మాతృకలోనిభావములు కొన్ని తేటపడకపోవచ్చును. భాషామార్దవము పోవచ్చును. కాని యావిమర్శనలు సాహిత్యపరిచయమందుఁ దోడుపడకపోవు. విశ్రాంతిలేనివారికిఁగూడ విమర్శనలు తోడుపడుచునే యుండును.

వాఙ్మయమునకు విమర్శన తోడుపడురీతి తెలిసికొన్నతర్వాత విమర్శనము వాఙ్మయమున నేభాగ మలంకరించునో చూచెదము. కావ్యవిమర్శనకుఁ బూనుకొన్నవాఁడు కవిసమానుఁడని వ్రాసియున్నాము. లేనిచో కవిభావములు గ్రహింపఁజాలఁడు గదా! విమర్శకునిలక్షణములను కొన్ని గమనింతము.

విమర్శకుఁడు గొప్పయనుభవశాలియుఁ బాండిత్యము కలవాఁడు కావలెను. రాచికుఁడును గూడఁ గావలెను. నిష్పక్షపాతియు, విశాలహృదయుఁడు గావలెను. భాషాజ్ఞానము లేనియెడల కవి భాషాచమత్కారము గుర్తింపలేక కొంతభావముగూడఁ బోఁగొట్టును కావునఁ గవి కున్న లక్షణములన్నియు విమర్శకున కుండవలెను. ఒకప్పుడు విమర్శకుఁ డివి యన్నియుఁ గలవాఁడయ్యు నొకరి కవిత్వము విమర్శించుతఱి నది లేదు. ఇది లేదు. ఇది అనవసరము, అది యవసరము, అని మొదలు పెట్టి, కవితాపరిశ్రమ మెఱుఁగక ఖండించుచుఁ బోవచ్చును. ఇక

కష్టము కవియే యెఱుఁగును. కావునఁ గవిత్వవిమర్శకులలోఁ గవియే శ్రేష్ఠుఁడు. కవులు విమర్శకులైన నీ విమర్శకుల కొకదోషముకలదు. తా మేది కష్టమని తలఁచి వ్రాయలేకపోదురో దానిని వేఱొకకవి వ్రాసిన యెడల నెంతో యానందించి యాకవిని శ్లాఘింతురు. లేక తాము వ్రాసినదానికన్న నెక్కువ రసముతో వ్రాసి వన్నెఁబెట్టినయెడల నసూయతోఁ జూతురు. ఎప్పుడైనను గవి కవికి జ్ఞాతికావునఁ గవివిమర్శనయందు దూషణభూషణములలో నేదైననొకటి యెక్కువగా నుండును. కావుననే విమర్శకుఁడు కేవలము కవి గాక పైని జెప్పఁబడిన లక్షణములు గలిగియుండవలయును.

అట్టివ్యక్తి వ్రాసినవిమర్శకుఁగూడ వ్యక్తి కలుగును. విమర్శకునిభావసూచనలు పోకడలు శైలి నడక ఇవి యందు గనఁబడును. విమర్శకునిభావములు మనము గుర్తింప వచ్చును. విమర్శము గద్యములో రచించినను గద్యముకూడఁ గావ్యమునకుఁ బనికివచ్చును. విమర్శకుఁ డొకవిధమైనవాఙ్మయమును మన కిచ్చినవాఁడగును. విమర్శకుఁడు కవివలెనే పృథగ్భూతత్వము గలవాఁడు. అతఁ డొకవిధమగువ్యాఖ్యానము వ్రాయువాఁడు; కనుక నతని వ్రాతలుకూడ విలువగలిగియుండును. కావున విమర్శకుఁడు గూడ సాహిత్యమం దొకభాగము. అందుచేత విమర్శన చరిత్ర వాఙ్మయచరిత్రయం దొకభాగమై యున్నది.

ఆంధ్రవాఙ్మయమున విమర్శనగ్రంథములు తక్కువగా నున్నవని యిదివఱకే తెలిసికొంటిమి. ఉన్నవానిలోఁ గొన్ని కేవలము దోషవిమర్శనములు. ఇందుల కుదాహరణములు "ప్రసన్నరాఘవవిమర్శనము" "పూర్వశాకుంతలావిమర్శనము" "కవితావిమర్శనము." రెండవతెగవి. పాక్షికవిమర్శనములు (అవేవన, వసుమనుచరిత్రల విమర్శము, దీనిఖండనము, శ్రీనాథచరిత్రముఁ బోలు గ్రంథములు) ఇప్పుడిప్పుడే యాంధ్రమునఁ గొన్ని నూతన సాహిత్యగుణదోష విమర్శనలు వెలువడుచున్నవి. కవిత్వతత్త్వవిచారము అలంకారతత్త్వవిచారము పింగళి సూరనార్యుఁడు, వసుచరిత్రవిమర్శముఁ బోలు గ్రంథములాంధ్రవిమర్శన వాఙ్మయమునకుఁ గ్రొత్త మార్గములు చూపుచున్నవి. అనతికాలములో నిట్టిగ్రంథములు వెలువడి విమర్శనకొఱంతఁ దీర్చి సాహిత్యమున కుత్సాహము గలుగఁజేయునని యెంచెద.

విమర్శమునకుఁ బూనుకొనకమునుపు సాహిత్యమున నేమో గ్రహించి, లక్షణగ్రంథముల నెంతవఱకు వాడవలయునో వితర్కించి, కవియొక్క చరిత్రము నేర్చి, భాషాపోషణము పాత్రపోషణము గమనించి, ఔచితి రసము గుణము దేశకాలస్థితులు పరికించి, నిష్పక్షపాత బుద్ధితోను విశాలభావములతోను, బ్రపంచమానవ జీవనవివేకముతోను విమర్శమునకు బయలుదేఱవలెను. ఆంధ్రసోదరు లట్టివిమర్శములు విరివిగా వ్రాసి యాంధ్ర మహాకవులగుణముల వెల్లడించుటకుఁ బ్రాలుమాల రేని పాశ్చాత్యవాఙ్మయములలో దేనికిని మనమాతృభాష దక్కువ కాదు. అట్టి శుభావసరముకొఱకు వాఙ్మయము ప్రతీక్షించుచున్నది.

# ఆ శం స ము

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

శ్రీరాస్తా మఖిలప్రపంచవలయే స్వాతంత్ర్య ముజ్జృంభతాం
నిత్యానందసమృద్ధి వృద్ధిమహితం మానుష్యకం వర్ధతామ్,
సత్యజ్ఞానమహామహోవితరణే ఉహాయా ఇహా యాస్యత
స్వామిన్! సర్వజగద్గురో! విజయతాం సర్వత్ర తే స్వాగతమ్.

మ. కనఁగాఁ దొల్లిటివెల్లనిర్ణయము లిక్కాలమ్మునన్ దల్లక్రిం
దనఁగా మార్పడు లేర్పడెన్, భువనకళ్యాణంబు చేకూరనుం
డె నటంచుం గనుఁగొంచు నుంటి; మిట సందేహంబు లే దింక నీ
వనురక్తాక్షివిగాఁగ మాఱెదవు రక్తాక్షీ! సమీక్షింపఁగన్.

చ. తఱి గుఱుతింపఁగాబడె సుదర్శనమూర్తి యొకండు మర్త్యమం
దెఱుకయుఁ బారతంత్ర్యమున నేవయుఁ గొల్పఁగ జన్మమందె నన్
తెఱఁగది; తత్ప్రయోజనము తీఱెను, మీఱెను మోక్షకాంక్ష, య
క్కఱ యిది చక్కఁదీర్పఁ బాడకట్టఁగదే జగదేకనాయకా!

ఉ. పంచసహస్రముల్ కడవపైఁ గలివట్రిలు, ధర్మముల్ పటా
పంచలగున్, బ్రచండమగుఁబాప, మటంచును దొంటి వాక్ప్రసం
గించినవార్త లిప్డు తలక్రిందగుఁగాత జగద్గురూ! ప్రజా
సంచయ ముద్ధరింప నవతారము తారు పరిగ్రహింపఁగన్.

శా. భూకంపంబులు పెల్లుమీఱెనవి శేషో మాహా యేమేమొ చీ
కాకుల్ దాకొననుండఁబోలు నని వైక్లబ్యంబు మాకేటి, కో
లోకాధీశ్వర! మీకృపాజలధి కల్లోలంబులం దోఁగుచున్
శ్రీకైవల్యపదాభిలాషమున మాచిత్తం బుదాత్తంబుగాన్.

# ఉచిత వేషము

## కొత్తపల్లి సూర్యారావు గారు

ఉ. కాలమె మాఱునై జనులఁ గాని సమర్థులు లేరు మార్పనై, క్కాలమునం దెఱుంగక వికారపు వేషములెల్ల నవ్యవి
ద్యాలలితుల్ ధరింతురు విధాతలె వీ రటులాచరించినం, గాలము వెఱ్ఱి వెఱ్ఱి తలకాయలు వేయక మాఱుచున్నదా!

ఉ. నవ్వెడువారిఁ గాంచియు ననాదరభావముఁ జూపి వారినే, నవ్వఁదలంతు రజ్ఞులొకనాఁడును గాలము దానమాఱునే
చివ్వకుఁ గాలు ద్రవ్వెదరు చేసినతప్పును నొప్పుసేయఁగా, నెవ్వరు కొంటెయుక్తు లాలయింతురు కాలము దానమాఱునే!

క. కలికాల ధర్మమనుచును, దలబిఱుసున కర్తవ్యాకార్యతతి నొనరింపం,
దల మగు ముగ్గురు నలువురు, కలుషుల కర్భకులు పుట్టఁగాఁ జేయుదురో!

గీ. తోఁకలేని నక్కతో సామ్య మబ్బించు, కొనఁగఁ జూతు రకట! కుమ్మరెల్లి
గుడిసె యెక్కినంతఁ గుంభినీధవు రాణి యగునె! నొసటి వ్రాలనర్థమగునె!

వెంకటపతి రావు జల్లిసీమలో సంపన్నులగు విడసన మెట్ల వారిచిన్నవాఁడు. రైలుబండి గోదావరిజిల్లాలో లేనప్పుడు రాజమహేంద్రవరములోఁ జదువు చాలించిన పిమ్మట వకీలు పరీక్షకని స్టీమరుమీఁదఁ జెన్నపట్టణము తండ్రి పంపఁదలఁచెను. మీనాక్షి స్టీమరెక్కుటకై కాకినాడవచ్చి యక్కడ రెండుమూఁడు దినములకుఁ దగిన కాయలు, పండ్లు. మజ్జిగ, మంచినీరు పోసికొనుటకుఁ గళాయిగిన్నెలు కొని ప్రయాణసన్నాహము చేయుచుండఁగా వేంకటేశ్వరులునాయఁడను విద్యార్థి తోడు పడియెను.

రావు—నాయఁడుగారు! మూఁడవనాఁటికిఁగాని చేర లేము. ఈనాఁడిక్కడ భోజనముచేసి బైలుదేఱుదుము. ఎల్లుండిభోజనమున కక్కడఁ జేరుదుము. నడుమ నొక్కనాఁడు ఆమూఁకలో స్నానముచేయకుండ మైలతిండి తినలేము. పస్తుపడియుండుట మేలా? కాని కూడుదిని ప్రాయశ్చిత్తముచేసికొనుట మేలా?

నాయఁడు—నేను సముద్రప్రయాణములో నేమైనఁ దలత్రిప్పు వాంతులు కలిగినా పుక్కిలించుటకుమాత్రము నీళ్లచెంబు తెచ్చుచున్నాఁడను. నే నేకాదశీవ్రతమే చేసెదను.

రావు—కాలము మాఱుచున్నదనిన దానియంతట నది మాఱవలసినదేగాని కానికాళ్లు దిని మనము మార్చుచున్నామని యెట్లు చెప్పవచ్చును?

నాయ—"పథి శూద్రవ దాచరే" త్తని యాపద్ధర్మముగాఁ జూడవలయును.

రావు—శూద్రులు మీరే ముక్కు బిగించుకొని కూరుచుండు మనుచుండ నేనా? మానాయనగారియొద్ద నబద్ధ మాడఁజాలను. నాలుక బంగారుతీఁగతోఁ గాల్తు ననును.

నాయ—మాతండ్రిగారు మీతండ్రిగారి శిష్యులే.

రావు—అక్కడ రెండేండ్లు పట్టనవాసము. ఏమో విద్యకై యెంత!

నాయ—ఆవిద్యకై యెఱిఁగియు నూతిలోఁ దిగఁబడుట.

రావు—పోనిండు, ఏమి చదువు? వందలకొలఁది తండ్రి పంపుచుండఁగా నాయనకుఁ దృప్తిగాఁ జదివి తేఁగ యెడల లాభ మున్నదిగాని- ఏమో! "పట్టణే పాద మాచార"మ్మనియెట్లుందునో! ఉభయభ్రష్టులము కాఁగూడదు.

నాయ—మీరు కుటుంబముతో బైలుదేఱరాదా, వంటపూటింట్లదరిద్రము వదలును.

రావు—స్థాయిపడినతర్వాత-

నాయ—మీరు పరీక్షయైనతర్వాత హైకోర్టులోనే పనిచేయవచ్చును.

రావు—చీరకుఁగండె మొదలు. ఇంకను స్టీమరెక్క లేదు. ఎప్పటిమాటయో!

నాయ—ఎంతసేపు? కన్నులు మూసికొనిన నింతలో వచ్చును. ముందు రైలుకూడ వేయుదురు,

రావు—చూచికొందముగాని, మీవలెనే నేనును దండుగవస్తువులేవియుఁ గొనను. ఈసారి ప్రయాణ మెట్లుండునో చూచెదను. "శ్రీకృష్ణం" దగ్గఱకు వెళ్లి టిక్కెటు కొనుట యెక్కడనో, యెప్పుడు బైలుదేఱునో, హాల్విలనుకంపెనీలో మా మేనబావ యున్నాఁడు, విచారించి వచ్చెదము.

నాయ—మంచిపేరు; మనవారు భక్తి రస ముట్టిపడ సీకస్టమునకు శ్రీకృష్ణమని పెట్టినారు. మాయూర నొకఁడు బాబూ "దొరలు తమమతముతోఁబాటు దేశములో నూనెకూడ, కిరస్తానీనూనె దీపముల కింటింటఁ బ్రవేశ పెట్టినా" రన్నాఁడు.

రావు—స్టీమరు మీనాక్షియఁట.

ఇట్లనుకొని కృత్యములన్నియు నెఱవేర్చుకొని యథాకాలమున యథాయోగ్యముగాఁ బొగయోడ యెక్కినారు. చెన్నపురి చేరినారు. రావుగారి తండ్రిగారు ముందుగా వ్రాసినయుత్తరముచొప్పున నిదివఱకే పట్టనములో నివాసము కుదుర్చుకొని వకీలుగానున్న సుబ్బరావుగారనుకొకరు సేవకు నొక్కని సముద్రపు రేవునకుఁ బంపెను. వెంకటపతిరావును గనిపెట్టి బండిమీఁద నింటికి సేవకుఁడు తీసికొనివచ్చెను, రెండుమూఁడుదినములు సుబ్బరావుగా రుపచరించి న్యాయశాస్త్ర కళాశాలలోఁ బ్రవేశపెట్టిరి. బుద్ధిమంతుఁడు. ఏ విషయమైన గ్రంథమైనను "మంచి నీళ్ల ప్రాయము." ఒక బస యిల్లు కుదుర్చుకొని స్నాన సంధ్యాద్యనుష్ఠానములు తీర్చికొనుచు వేళకుఁ బూటకూళ్లయింట భుజించుచు కళాశాల కేగుచు రెండేండ్లు గడపినాఁడు. పరీక్షలైనవి. గెల్చినాఁడు. అప్పటికి బెజవాడ మీఁదుగాఁ జెన్నపురి కినుపదారి పడినది. సుబ్బరావు పంతులుగారి సహాయమున రావుకు హైకోర్టులో నొక యుద్యోగము దొరికినది. "రెండుసంవత్సరము లీపనిలో నుండుము. నీకు నచ్చకపోయినయెడల వకీలు పనిలోనికి దిగవచ్చును. కోర్టు వ్యవహారములు తెలిసికొనుచుండుమని సుబ్బరావుగారు వేంకటపతిరావునకు చేసిన యుపదేశము సమ్మతమై తండ్రిగారి యనుమతిపైఁ గొలువు చేయుచుండెను. బెజవాడవఱకుఁ బడవలమీఁదను, అక్కడనుండి రైలుమీఁదను వెంకటపతిరావు భార్యను కూఁతును తండ్రిగారు తీసికొనివచ్చి దిగఁబెట్టి కొన్నిదినము లక్కడనుండి వెళ్లిరి. విద్యార్థిదశ విడిచి, రావుగారుద్యోగియై సీమాజామాలతోఁ బక్కను గూరుచున్నక్రొ[illegible]వానివాసనకై ముక్కుమూసికొని జట్కాబండిలో కోర్టుకు వెళ్లుచుండిరి. కొన్ని నెలలనాఁటికి పదిగంటలక భోజనముచేసి వెళ్లి మరల సాయంకాలమువఱకు పచ్చి మంచినీరయినను గొనక పనిచేయుచుండుటచే శరీరము శుష్కించినది. వైద్యునకుఁ జూపించెను. "భోజనములో వ్యత్యాసము కలిగినది. మధ్యాహ్నము ఫలాహారము చేయుచుండుము. బట్టనములలో సహజమయిన వేఁడికి దోఁడు మనుష్యుల వేఁడి యొక్కటి యెక్కుడు. ఏదియైన నాహారము పుచ్చుకొనవలయు"నని డాక్టరుగారు చెప్పిరి.

రావు—నాకలవాటు లేదు. ఆచారము కుదరదు. కోర్టులో నందఱిలోను దినలేను.

వైద్యు-ఔషధప్రాయముగా నంగీకరింపవలయును.

రావు—మా నాయనగారు వినినఁ గోపగింతురు. వాస్తవముగ, నాకే మనస్కరింపదు.

వైద్యు—నేనొకటి చెప్పెదను. రెండు చిన్న పెసరట్టులు కాగితములోఁ జుట్టఁబెట్టుకొనిపోయి, యొంటిగంటవేళఁ గొళాయిదగ్గఱ నెవ్వరును జూడకుండ నోటిలో వేసికొని యిన్నినీళ్లు త్రాగుచుండుఁడు. దీనిలోఁ దప్పులేదు. శరీరమును గాపాడుకొనవలయును.

రావు—చిల్లరతిండి నాకుఁ బడదు. తడిగుడ్డ కట్టుకొని తినుటకుఁ జాలినంతకాలము లేదు. అయినను, జేబులోఁ బెట్టుకొనివెళ్లిన దానికి మడియేమి?

వైద్యు—ఏదో, చూడవలయును. నామందువలననే గుణమీయదు. మీరుకూడఁ గొంత—

రావు—సరే చూచెదను. పెసరట్టులో నంటు లేదు. ఎంగిలికాదు.

వైద్యు—కొన్నినాళ్లు సరిపుచ్చుకొనుఁడు. మనస్సమాధానము ముఖ్యము.

ఇంటికివచ్చి వేంకటపతిరావుగారు తలగట్టి కండుకొన్నారు. "ఎట్లురా!" యని దీర్ఘ విచారము చేసినారు. భార్య చెప్పినమాటలపైఁ గోర్టు సమీపములో నిల్లుచూడఁ బోయెను. దినమునకు రెండు పెసరట్లు చేసికొని యున్న చోటనే యుండుటకంటె నీ క్రొత్తయిల్లు లెక్కయెక్కుడుగా నగపడెను. కోర్టు సమీపమున బాడుగ లెక్కువ. ఇకప్పుడు తండ్రిగారు క్రిందటినెలకంటె వర్తమాన మాసమున నేల వ్యయ మెక్కుడుగానైనదని యడుగు నేమోయని భయము. వీని నన్నిటిని విచారించి రహస్యముగాఁ గోర్టులో నట్టుముక్క "ఫలహారము" నకే యొడంబడియెను. ఒక్క యట్టు పరగడుపునఁ దినుట కూడ మంచిదని భార్య చెప్పెను. అపుడపుడు తాను వంట చేసికొనవలసివచ్చినపుడు స్వయంపాకముతోపాటు పెసరనిప్పటి చేసికొనలేక కోర్టు దగ్గఱ నయ్యరు హోటలులోఁ గొన మొదలుపెట్టెను. కొన్నినాళ్లకు భార్య నేల శ్రమ పెట్టవలయును. బ్రాహ్మణుఁడే చేసి యమ్ముచున్నాఁడని అయ్యరుగారి యుంపుడు కత్తె లేక పనికత్తె రుబ్బిన పిండి రొట్టెలకే సమ్మతించెను. జందెములు వేసికొన్న పిల్లల చేతఁ జేయించి అయ్యరుగా రంగడిమీఁదఁ గూర్చుండి యమ్మువానినే కోరఁజొచ్చెను. తండ్రిగారు నూఱు రూపాయలు జీతమైనదని విని స్వర్గస్థులైరి. అప్పటికే పెద్దపెద్దల సహవాస మబ్బినది. సభలలోనికి వెళ్లవలసివచ్చినది. వఱిగవాటుగ సంఘ ఫలాహారములు- తోఁటవిందులు- శీతకాలములో రాత్రి తడిగుడ్డకట్టుకొనలేక పట్టుపంచె చుట్టఁబెట్టుకొనుట- అరటియాకులు ప్రియముగానున్నపుడు, పగలు పరాకునఁ బనివానిచేఁ దెప్పించుట మఱచినపుడు, వెండికంచములో- కొంచెము తలనొప్పి వచ్చిననాఁడు చొక్కాయ చేతులుమీఁదికెగఁదీసికొని- రామారావుగారి స్నేహ మబ్బినప్పటినుండి- తండ్రిగారి మరణము- గొప్పయుద్యోగము- అయ్యరుల సహవాసము- దొరగారి దర్శనముచేయుటకు బంగ్లాకువెళ్లినపుడు సచేల స్నానమెందుకు? కోర్టులోఁ బ్రక్కబెంచి మీఁది సాహెబుగారిని ముట్టుకొనిన బట్టలే కావా? భోజనము వేళ స్నానము తప్పదుగదా! చలిదికంటె నూరుఁగాయ, బట్టలకంటె యజ్ఞోపవీతములకుఁ బెట్టుట యేల? నిత్యము సాయంకాలము కపాలేశ్వరుని గుడిలో లెంపలు వేసికొన్నఁ జాలును. సర్వ ప్రాయశ్చిత్తము. ఇట్లని కొంతకాల మాలోచనలు జరగినవి. మన యీ యనాచారశరీరము దేవుని, దేవునిగుడిని మైలపఱుచునని రాత్రి పదిగంటల వఱకు దీపముకడఁ గచ్చేరీ కాగితములు చూచుకొనుటి మొదలిడెను. వేఁడిలో వేఁడి యింటికి వచ్చినది మొదలు భోజనము వఱకుఁ గాగితములు చూచుకొనకున్న భోజనమైన తర్వాత బద్ధకమఁట— "సాహెబు! నిన్న మునిస్వామి దులిపినాఁడు గాని, నీవు రాత్రి దుప్పటి దులిపినట్లులేదు. నిద్రపట్టలేదు. దానికిఁ దోడు తాయి కాఁగులో నీళ్లు నిండుగాఁ బోయలేదు- చెమటపట్టినది. పెసరట్లకంటె రీడింగు బిస్కట్టులు బలమని జోన్సుగారు చెప్పి యొకటిచ్చినారు; రుచిగానున్నది. రేపటినుండి పెసరట్లుమానెదను." అని యట్లు చేయసాగెను. రుచియెట్లున్నను జేబులో బిస్కట్టులవలన నూనె పట్టుకొనదట. పదిసంవత్సరముల నాఁటి కిట్టి వేదాంతము పూర్ణముగా ముదిరినది. ఉద్యోగము బడాయించి రెండువందలు జీతమైనది. అమ్మగారి కిరుగు పొరుగు వారల స్నేహముచే బీచి షికారునకు బండి కొనుమని కోరికొన బుద్ధిపుట్టెను. కొనినంతనె, తన కూఁతురు ముచ్చటలకని తాను సాయంకాలముల వాహ్యాళి. తర్వాత సముద్రము నెడ్డునకు నిత్యమును షికారులకుఁ బంతులుగారి హృదయమున నుత్సాహాంకురము పొడమెను. మెట్టుపై మెట్టు. పట్టనాచారములు కావలసినన్ని యలవడినవి. కట్టుబట్టతోఁ గొళాయియొద్ద స్నానమంచఱకు నసహ్యముపుట్టి స్నానములకుఁ గదికట్టించుమని యింటి యజమానికి జాబు వ్రాసి కట్టించుకొనిరి. బూట్సులు, నైటుక్యాపులు, కోట్లు, ప్రొయ్యి యలుకు కొనఁ జింపిగుడ్డ-బూట్సు తుడిచి కొనుటకుఁ గంతగుడ్డ-కఱవు. కాఫీ వడియగట్టుటకు జేబురుమాళ్లు కొఱతలేదు. నూలుగుడ్డ మందునకులేదు. ఆచారము సన్నగిల్లినప్పటికి సంధ్యావందనమునకు సమయముకూడ దొరకుటలేదు.

తంతివిలాసము "లక్సు"   టెలిఫోను నెం. 760

మదరాసు   తపాలపెట్టె నెం 20

# లక్ష్మీ రత్తన్సు లిమిటెడ్

## 316, తంబుశెట్టి వీధి,

## మద్రాసు.

1. పెరోక్ పెంకులు కంపెనీవారు తయారుచేయు కల్లికోటపెంకులు, కల్లికోట దళవరుసరాళ్లు, అనేక రంగులతో చేయు అపూర్వమైన సీమెంటు దళవరుసరాళ్లు, అనేకవిధములైన చిత్రపు పనులు గల దళవరుసరాళ్లు, చలువరాళ్లు, తళతళయని ప్రకాశించురాళ్లు.

2. సీసపు తెలుపు, తుత్తినాగపు తెలుపు, శుద్ధమైన తెలుపు, చాక్లెటు, ఆకుపచ్చ మొదలయిన రంగులు నూనెతో నూరినవియును, పొడరుగను, వీటికి నూనె వార్నిషు, బ్రష్, మైనములు, మెరుగుసామానులు మొదలైనవి.

3. వసారాటాకు, కిటికీల టోపు, గదులు వీటికి గోడవారె నమర్చదగిన తగరపు రేకులు, అనగా విభాగములు వగైరాలకు ఉపయోగమైన అస్బెస్టాస్ సీమెంటుషీట్లు;

4. కళ్యాణ కూటములు, పడకగదులు, బంగాళాలలో వాసాలను మరుగుపరుచునటువంటియు, కంటికి సొగసుగా నుండునట్టియు అనేకవిధములైన స్టీలు తగరముల సీలింగులు.

5. కట్టడములకు కావలసిన స్టీలుగర్డర్లు, పట్టెలు, కమ్ములు, చేతిపిడులు గల కీలు సామానులు.

6. స్నానపుగదిలో చలువరాతితో తయారుచేయబడిన తొట్లు, పింగాణితొట్లు, చేతులు కడుగుకొనుతొట్లు, మరుగుదొడ్డికి కావలసిన తొట్లు వగైరాలు.

7. జలదారులకు, తూములకు, కావలసిన గొట్టములు

8. పలువిధముల పూలతొట్లు

9. చిత్రపుపనులతో తయారు చేయబడిన రాళ్లతుండ్లు.

10. సరసమయిన ధర గల సీమెంటు.

ఇంకను అనేకవిధముల కట్టడముల సామానులు సప్లయిచేయుదుము.

వైదిక బ్రాహ్మణులతో మాటలాడుటకు-తండ్రి తద్దినము తిథియొకటి రెండుదినములు ముందుగాఁ దెలిసికొనుటకుఁ తీరుబడి కనఁబడుటలేదు. వారి పంచాంగములో తండ్రి గారి తిథి వచ్చు నెలకాగితము లుండనేయుండవు- బైండరు వంద్యుఁడు. కూఁతునకుఁ బెండ్లి యీడువచ్చినది. బ్రహ్మ దేవునివలె నొక్కసారి నాల్గుదిక్కులు వెదకెను. ఈసమయమునకు శాఖాభేదము పాఱిపోయినది. ఏదియెట్లు పోయినను-మఱిచి పోవుదమని యెంత కష్టపడినను సందె ముక్క చిన్నతనములో నేర్చికొనినది గనుక, పంతులు గారు సందెవార్చినను మానినను డక్కామొక్కీలకాఁగి తలకెక్కి విడువలేదు. దులిపి దులిపి విడిచినాఁడు-నిర్లక్ష్యము చేసినాఁడు. తర్వాత "నేను సంధ్యావందనము చేయనినాఁడు దొరగారు నాపైఁ గోపగింపలేదు. తిన్న యన్నము రాత్రి బాగుగా జీర్ణమైనది. మడికట్టుకొనక తినినపుడుగూడ నెలనెలకు జీతము ముట్టుచునేయున్నది." అని రావుగా రుపన్యాసములు మొదలు పెట్టెరి.

"కొన్ని నాళ్ళలో రంగూను డిస్ట్రిక్టు మునసబుగా వేయించుకొందును. ఈలోపునఁగుమారిక పెండ్లి చేయుట మంచిది. ఏనాఁడైననుసరియే, నియోగియేయని నియమము లేదుగాని వైదికులు, నియోగ ప భువులని- నకారగుళ్ళని విరసముగాఁ జూచుచున్నారు. అట్టి బ్రహ్మగాళ్ళకు బలి గ్రద్దలకు నే నెట్లు బిడ్డనిచ్చెదను. నిజముగా నాకు నియోగపు సీటులేదు. చదివిన వైదికికి ఛాందసమును లేదు. నేను దొరటోపీ పెట్టుచున్నాననని దుఃఖపడు వీరు మీఁద నన్ని కల్పింపలేరు." అని వృత్తాంతపత్రికలలో విద్యార్థులకై వెదకసాగెను. ఏ బ్రాహ్మణ బాలుఁడు బి. ఏ. ప్యాసయి నాఁడో యని మార్కులు లెక్క వేయుట, పిల్లరునచ్చ వలెను, తల్లి చూచుకొనవలయునని యెవ్వానినో యొక విద్యార్థిని రాత్రిపూఁటఁ దమయింటికిఁ దీసికొని వచ్చుచుండుటచే రాత్రిభోజనము గురుత్వము చూపెను. తన మనస్సునకుం దగినవాఁ డన్యశాఖవాఁడున్నను నియోగులపిల్ల వానినే చూడుఁడని భార్య నిక్కచ్చిచేయుటచే నీవే చూచికొమ్మని యామె కాభారము వదలి పెట్టెను. నియోగుల పిల్లవాఁడు బి. ఏ కాకపోయినను సరియే మేమే చదువు చెప్పించెదమని యమ్మగారే శ్రద్ధపట్టి బీచిలో సాయంకాలము బసచేయుచు వంట బ్రాహ్మణుని ఫలహార మక్కడికే తెచ్చున ట్లానతియిచ్చెను.

ఎఱ్ఱమిల్లివారు పల్లెటూళ్ళలోనున్ననియోగులలో నతినైష్ఠికులు, సంపన్నులు. సోమయాజులను నెఱ్ఱమిల్లి వారి చిన్నవాఁడు క్రొత్తగాఁ జెన్నపట్టణము బి. ఏ చదువుటకు వచ్చెను. నెలయైనది. ఏదిచూచినను సోమయాజి కద్భుతముగాఁ గనఁబడు చుండెను. తంబుశెట్టివీధిలోఁ గాపురమున్న సోమయాజులు స్నేహితుల మూలమునఁ బంతులుగారి భార్యకుఁ దెలియ వచ్చెను. రాజమహేంద్రవరము స్నేహితుఁడొకఁడుకూడ "సోమయాజిగుణవంతుఁడు బ్రహ్మచారి యని రావుగారి కింటినెంబరుతోఁగూడ జాబు వ్రాసెను. కొందఱు మధ్యవర్తులు సోమయాజిని సర్. రామస్వామి మొదలియారుగారి సత్రములోనికిఁ దీసికొని వచ్చిరి. రావుగారు, సతీమణియు మార్గస్థులవలె వచ్చి చూచిరి. నచ్చినది, మఱునాఁడు సోమయాజులుతండ్రిగారి కుత్తరమువ్రాసిరి. ముహూర్త నిశ్చయము చేసిరి. పెండ్లికందఱును వచ్చిరి. పెండ్లి జరుగుచున్నది. తక్కినవర్ణన లెందుకు? కన్యధార వేళ. రాత్రి దీపముచాటున-పగలు నిద్రబద్ధకము-చూడవచ్చిన యిరుగు పొరుగు మగనాండ్రు- బంధువులు-వీరిలో నెవ్వరిని జూచుటకు సోమయాజులు సిగ్గుచే నొక రీతిగా మొదటినాఁడుండెను. రెండవనాఁడు మనస్సులో నేదో యాలోచన పుట్టినది. తెగలేదు. పసుపు నలుగులు, బంతులాటలు జరుగుచున్నవి. వియ్యపు మర్యాదలలో లోపము లేదు. సదస్య మాత్రము బాగుగా జరుగలేదు. నాలుగవనాటికిఁ బెండ్లికొడుకున కూహ కుదురకతలనొప్పి పట్టుకొన్నది. శరీరములో జబ్బేమియు లేదు. నాఁటిరాత్రి యూరేగింపునకు నేను రాలేనని చెప్పెను. ఎన్నియో రూపాయలు పెట్టి కట్టించిన విమానము వ్యర్థమైనది. స్నేహితులు, తండ్రి, అన్నగారు బుజ్జగించిరి. బంధుగులు బతిమాలిరి. వైద్యుఁడు చేయిచూచి కొంచెము బద్ధకముగాఁ నున్నదిగాని జబ్బులేదని చెప్పెను. నాగవల్లి స్నానము చేయుమనిన నేను స్నానముచేయలేనని స్పష్టముగాఁ జెప్పెను. ఏమియుఁ దోఁప దనుకొన్నగాని కారణము

Sir D. M. Dalal, Indian High Commissioner



సర్ డి. యం. దలాలు గారు, ఇండియా హైకమీషనరు

Mr. Sydney Webb



సిడ్ని వెబ్బుగారు

Lt. Colonel Viscount Goschen,
The New Governor of Madras



లెఫ్టినెంటు కల్నల్ వైకౌంటు గోషెన్ గారు
నూతన మద్రాసు గవర్నరు.

The Late Lenin, President, Russian Republic



కీర్తిశేషులగు లెనినుగారు, రష్యా నాయకుడు

The Late Mrs. Macdonald



గతించిన మాక్డనాల్డు సతి

Madam and Mestapha Kemal Pasha



ముస్తఫా కెమల్ పాషా, సతీమణి

Chicherin, as a Russian General



చిచరిన్ రష్యాజనరల్

ఒరుల కెవ్వరికిం దెల్పఁడు. తంబుచెట్టివీథిని తన బసకుఁ బోఁ
దలఁచెనుగాని పెండ్లివారి యంపకములు కాలేదు. తలి
దండ్రు లింటనే యున్నారు. ఇట్టిసంగతి తెలిసికొని స్నేహి
తులు వచ్చి "నీ స్నీవీథివారు, వెంకివాఁడని యత్తవారిని
బాధించువాఁడని యనుచున్నారు. ధైర్యముగా నలుగు
రితోఁ గలసిమెలసి యుండు"మని బోధించిరి. విధిలేక
యతఁడట్లే యుండెను. మనుగుడుపులలో నొకనాఁటి
సాయంకాలము గుఱ్ఱపుబండ్లమీఁదఁ బెండ్లివారిని సము
ద్రపుటొడ్డునకుఁ దీసికొనిపోఁదలంచిరి. (సోమయాజి,
పెండ్లికూఁతురు, అత్తమామలు నొకబండిలో సోమ
యాజి తలిదండ్రులు, కూఁతురు, అల్లుఁడు మొదలైనవారు
రెండు మూఁడుబండ్లలోఁ గూర్చుండెదరు.) సోమ
యాజికిఁ దలదువ్వి పువ్వులు ముడిచి నాఁడుకుట్టించిన
క్రొత్త పట్టుకోటు తొడిగి యత్తమామయంచుల క్రొత్త
పంచెలు కట్టించిరి. పెండ్లికూఁతురు దొరలపిల్లవలె పట్టు
గౌను బ్రాహ్మణులపిల్లవలె బంగారునగలు రత్నముల
చౌకట్లు - అద్వైతభావముగా నుండెను. రావుగారు పం
ట్లము, కోటు, సాయంకాలపుటోపి ధరించి, సాక్షాద్దొర
గారైరి. ఆయనభార్య కొర్నాడు పట్టుచీర, దానికిఁ దగిన
రవికె, యాభరణములతో స్వచ్ఛ బ్రాహ్మణ గృహిణి నని
రుజువుచేయుచుండెను. తొందరలో బల్లమీఁదఁ బెట్టి
యల్లునకిచ్చుట మఱచిపోయిన సరిగకుళ్లాయి నొకచేత
ఫలాహారముల పెట్టె నొకచేతఁ బట్టుకొని వంటబ్రాహ్మ
ణుఁడువచ్చి పెట్టెనమ్మగారి కాలుదగ్గఱఁ బెట్టి కుళ్లాయిని
సోమయాజి కిచ్చెను. బండ్లు నడిచినవి. పెద్దయినుపవంతెన
యొద్ద బండ్లు నిలచినవి. ఒక్కొక్కరిని దింపి వేంకటపతి
రావుపంతులుగారు వియ్యమువారికిఁ జిత్రములు చూపి
చెప్పుచు వారాశియొడ్డుపులినతలమున రాజహంసివలెఁ
బ్రక్కను గృహిణి నడచుచుండ నందఱను వెంటఁగొని
నడయాడుచుండెను.

సోమయాజితలంపుల కప్పుడు మరల సమయము
వచ్చినది. ఆలోచనకు దిగినాఁడు. ముఖము వికసింపఁ
దొడఁగినది. 'ఆఁ! దొరకినది.' రెండవగోడవలో మరల
మఱతునేమో యని గట్టిగ జ్ఞప్తికిఁ దెచ్చుకొని, "సరిసరి"
యని తనలోఁ దాను సమాధానపడి యానందమున న
మామలతో, నడుమ నడుమఁ దల్లిదండ్రులకుఁ, దానెఱిఁ
నంతవఱకు నేవియో చెన్నపురి వార్తలు దెల్పుచుండెను.
ఇంటియొద్ద నేమియుఁ దోఁపక గదా సర్వసాధారణముగ
నందఱును సాయంకాలము బీచికి షికారుపోయెదరు.
పెండ్లివారికందఱకు సోమయాజినిగాంచిన నమితానంద
మయినది. సోమయాజి మనస్సులో నుద్భవించిన
సందేహకళంక మాయిసుకతిన్నెలలో లీనమై పోయిన
గదా! కొంతసేపుండి దీపములు వెలిఁగించుచున్నపుడ
బండ్లుకట్టించి రావుగారు రెండుమూఁడు క్రొత్తవీథుల
ద్రిప్పి తీసికొని, వెళ్లవలయునని తెచ్చిన ఫలాహారములుఁ
యోగముచేయించి మెల్లఁగా నందఱను సంతసముతో
గృహమునకుఁ దెచ్చిరి.

ఇన్నియవస్థలకుఁ బాల్పడిన సోమయాజిహృదయ
మిప్పటికి మీ కెవ్వరికిఁగాని, తెలిసినదా! తెలియ
లేదను కొందును.

సోమయాజి క్రొత్తగాఁ జెన్నపురమువచ్చిన
7-8 నాళ్లలో నొకనాఁడు స్నేహితులతో బీచికి వచ్చెను.
అతనికదియే ప్రథమము. ఏదిచూచినను వింతగా నుం
డెను. అన్నివింతలకంటె వింత-యొకదొరగారి చేయిపట్టు
కొని యొక్క బ్రాహ్మణస్త్రీ సైకతప్రదేశమున విహరిం
చుట. అద్భుతమునకు మేరలేకపోయెను. ప్రతిదినము
సాయంకాలములయం దక్కడ జరగువినోదములు చెలి
కాండ్రు చెప్పఁగా మఱింత యద్భుతము కలిగెను. పెం
డ్లిలోఁ దనయత్తగారి నిదివఱకెక్కడనో చూచినట్లు
లోలోన నాడుచున్నది. ఎక్కడఁ జూచినాఁడో! యెట్లు
చూచినాఁడో! మాత్రము తలంపునకు రాలేదు. ఆలో
చన యెక్కుడైన కొలఁది "నీమె యానాఁడు దొరగారి
చేయిపట్టుకొని యిసుక తిన్నెలలో విహరించిన యామె"
యని పొడకట్టి యభిమానము ముంచుకొని వచ్చినది.
"ఇట్టియామెకూఁతురా నాకుభార్య" యని దుఃఖము కలి
గెను. అందఱకు నిబ్బంది కలిగెను. బుద్ధిమంతుఁడు-ఊహ
కుదరని సగముసగము తొందరమాటల నితరుల నేమని య
డుగును? గుట్టు బైటఁ బెట్టలేదు. ఈనాఁడు బీచిషికారులో

మామగారు దొర వేషము- అత్తగారు బ్రాహ్మణ వనిత - వీరిద్దఱిసమావేశము చూడఁగనే వెనుకటి సంశయమునకు సమాధానము తనలోఁ దనకే కలిగి యానందము ప్పతిల్లినది. కలికాలముగదా! కాలమునకుఁ దగిన వెఱ్ఱివేషముగదా యిది. ఉచితవేషము లేకపోవుట యెన్ని యిక్కట్టులకు మూలము కాఁబోయినదోగదా! యని చక్కఁగాఁ జర్చించుకొనియెను. త్వరపడి తనకుఁ గలుగు సందేహముల వాస్తవము కనుఁగొనకుండ నెల్లవారికిఁ దెల్పి యపకీర్తి పాలగువారీదినములలోఁ గొంద ఱుందురుగదా! తొందరపడఁగూడదని ధనవంతుల యల్లుఁడగుటకంటెఁ జక్కనిచక్క యిల్లాలైనదను దానికంటె నెక్కువయానందముం బొందెను. ఇందునుగుఱించియే పెద్దలు

గీ. తగినవేషంబుఁ దనుతాన పొగడుకొనమి
నొచ్చియును గీడు పలుకమి యిచ్చి వగవ
కునికిఁ దనకెంత..................
..............................నడవడి యొప్పఁజేయు.

అని నుడివినారుగాని దాని నెందో మహాసముద్రమువంటి చేటభారతములోఁ బడవెచిరి. నాకుఁ బద్యము పూర్తిగా రాలేదు. అన్నింటికి క్షమింపుఁడు.

నాయఁడుగా రేమైనారని యడిగెదరా! ఆయన యిక్కడిచిత్రము లన్నియుఁ గనిపెట్టుచు నింటికి వ్రాసిన యుత్తరములు గలవు. దానిలో వారిసంగతి వచ్చును. చూచుకొందము.

---

# అన్యాపదేశము

## మక్కపాటి వేంకటరత్నము గారు

భ్రమరి! నీకాశ్రయంబును బ్రణయనిభృత
మమృతనిధియగు పుష్పరాజమును విడిచి
తనువు బడలంగఁ బ్రబలనైదాఘువేళ
నొంటి నెచ్చోటి కేగుచు నుంటి విపుడు.

గీ. భృంగమా! మధు వానెడి వేడ్క నీవు
మదిమదిని నన్ను గదియఁ గోరెదవు గాని
పిదప నా కగుచేటు నెమ్మదిఁ దలంచి
గుణము గ్రహియించి నను జాలిఁ గన విదేల?

గీ. హా! లతాపుత్రి! పుష్పిణివై పసీదు
ప్రాయమును విలసనము నేలపాలు గాఁగఁ
బ్రాపు నెడఁబాపి నిను గీడుపఱచి నట్టి
యదయుఁడగుసృష్టికర్త నేమనఁగలాఁడ!

గీ. నవనవవిలాసనంపదల్ నవసిపోవు
మధువు చెడిపోవు బుష్పముల్ మాడిపోవు
గాని మామకమానసాకర్షణంబు
రమ్యవల్లీ! త్వదీయసౌరభము చెడదు.

గీ. ప్రణయమాధుర్య రసకదంబముల నసఁగి
స్నిగ్ధసుకుమారగతి వికసించి దెసల
సరళసౌరభములు వెదఁ జల్లుచుండు
రమ్యసుమమంజరుల నేల రాల్చు నౌర!
కాలపవమానుఁ డదియేమి కారణంబొ?

# పెద్దనార్యుని యుదంతము

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు

ప్రబంధకవులలో గరిష్ఠుఁడని పేర్కొనఁబడు నితఁడు విశేషప్రతిభాశాలులై వన్నెకెక్కిన యాంధ్ర మహాకవులలో నొకఁడు. శ్రీకృష్ణదేవరాయని మనం బాకర్షించిన విద్వత్కవిరత్నములలో నితఁ డొకఁడు. తొల్లి సరసప్రబంధకర్తల పరిగణనావసరంబున రాయల యాస్థానములోని యష్టదిగ్గజములని భాషాభిమానుల పొగడ్తగాంచిన కవిగ్రామణులలో నితఁడొకఁడు. పెక్కేల? పెక్కుబాసల నేర్చియుఁ ద్రిలింగభాషాసుధారసాస్వాదనంబున నానందపరవశుఁడై "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యనిన కర్ణాట భూకాంతుఁడగు నాంధ్రభోజునిచే "ఆంధ్రకవితాపితామహ!" యని పిలువఁబడి సరివారిలో మెప్పువడసిన కవిశిరోమణి యితఁ డొక్కఁడే. అట్టి యీ కవితల్లజుఁడు తన జీవితకాలమంతయు నొక్కమనుచరిత్రమున కే వెచ్చపెట్టక యెన్నోకృతులు వ్రాసియుండు ననుట కల్లగాదు. కాని వానిలోనెల్ల నొక్క హరికథాసారము మాత్రము నామమాత్రమున నానంద పెట్టుచున్నది. తక్కిన వానిపేరయిన వినరాకపోవుట యాంధ్రదేశము దుర్దశయేకాని వేఱుగాదు. ఇతఁడు తనపోషకప్రభుని చిత్తవృత్తి ననుసరించి పెక్కుసమయంబుల లెక్కకు మీఱిన చాటుకృతులు సమయసందర్భోచితంబులు స్వభావమధురంబులుగాఁ జెప్పి యాతని మెప్పించుచు వచ్చెనఁట. వానిలోఁగూడ వాడుకలోనున్న యేవో రెండుమూఁడు దక్కఁ దక్కినవి లెక్కకు రాకపోవుటయు భాషయొక్క భాగ్యహీనతయే యనవచ్చును. ఎవరిభావము కవితాప్రతిమకు జీవమో, యెవరిభాషణము భాషాంగనకు భూషణమో యెవరివ్రాత లోకంబునకుఁ జేయూఁతయో యట్టి వారిపలుకులకలిమియే వాగ్దేవికిఁ గలిమి. దానిలేమియే లేమిగదా? మృతజీవుఁడగు నీతని జీవకవిత్వము కొంత నిర్జీవమగుట చిత్రముగాని యహంకారదూరుఁడగు నీతని చరిత్రమును దెలుప మనుచరిత్రము దోడ్పడకపోవుట చిత్రము గాదు.

వాస్తవ మరయఁ దొల్లిటివారిచరిత్ర మనఁగా వారికులగోత్ర జననీజనకాదుల నామములును వారి దినచర్యయును గాదు. ఇఁక నేమనఁ జదువరుల కానందమునో విచారమునో శాంతినో శౌర్యమునో యిహమునో పరమునో బోధించుచు హృదయంబు గరగించునట్టివారి జీవితకాలములోని ఘనకార్యములే లోకారాధ్యు లగునట్టివారి యుత్తమచర్య లపుడు గాదిపుడుగా దెపుడైనను మఱచినను మఱపునకు రాక వ్రాయకున్నను వ్రాతలై వినకున్నను వీనులవిందై శాశ్వతము లగుననుట నిక్కము. అట్టివారుగానిచో వారి చరిత్రములు పెద్దభారతమంత గ్రంథములయినను లోకము వానినిఁ దలక్రిందిదిండ్లుగానైనఁ జేయనొల్లదు. కావునఁ బెద్దనార్యుని నిజోదంతము పూర్తిగాఁ దెలియలేదని వగవఁ బనిలేదు. ఆతనియావచ్చరిత్రమునకు నతని యాంధ్రకవితాపితామహబిరుదుమే చాలునని సంతసించి లభ్యమయినంతలో నతనిచరిత్రముం దెలిసికొందము.

### వంశనివాసాదులు

పెద్దనార్యుఁడు నందవరవంశమున జన్మించినవాఁడు. ఇందుల కీతనిగద్యములోని "నందవర పురవంశోత్తంస" యనెడు విశేషణమే ప్రమాణము. దేశమునుబట్టి వెలనాటివారు వేగినాటివారనివచ్చినట్లే వీరికి గ్రామమునుబట్టి నందవరమువారని వ్యవహారముగలిగినది. ఈనందవరము "కర్నూలుజిల్లా నంద్యాలతాలూకా బనగాలపల్లి జమీను"లోనున్నది. ఈగ్రామమును దీనింబట్టివచ్చిన పై వంశమునుగూర్చి చౌడేశ్వరీవిలాసమనునొకప్రాచీనద్విపదకావ్యము సవిస్తరముగాఁ దెలుపుచున్నది. చౌడేశ్వరీవిలాసము లేక చాముండావిలాస మనుపేర నెవరో యతిప్రాచీను లొకసంస్కృతగ్రంథమును రచియించినట్లును దానిని, కోట నారాయణకవి తెలిఁగించినట్లును దానివలననే తెలియుచున్నది. దేవీమహిమను తెలుపు నందలికథ యిపుడు విశ్వాసపాత్రము గాకపోయినను బ్రకృతాంశమగు నందవరవంశమును గూర్చి తెలిసికొనుట కదియే యాధారమగుటచే దానినుండి సంగ్రహించి యించుక వ్రాసెదను.

పాండవవంశ వివర్ధనుండగు జనమేజయుని పుత్త్రపౌత్త్రపరంపరలో నుత్తుంగభుజుఁడను రాజొకఁడుండెను.

ఆతనికి నందుఁడు లేక నందనుఁ డను నొక పుత్త్రుఁ డుండెను. ఈనందునిగూర్చి లోకంబున నొకచాటుశ్లోకము వదితమై రమ్యమైన యొకచిన్నకథను దెలుపుచున్నది. చదువరుల కింపుగా నుండును గావున దాని నిం దుదాహరించెదను.

ఉత్తుంగభుజుఁడు పుత్త్రవతియగు తనధర్మపత్ని యెడ ననాదరముఁ జూపి వేశ్యాలంపటుఁడై యుండెనఁట. అట్లు కొంతకాలము చనినంత నొకవణిజుఁ డమూల్యమయిన రత్నహారమును విక్రయింపఁ దెచ్చి దానిని రాజాంతఃపురంబునకుఁ బంపెనఁట. దానిఁగని యారాణి మక్కువపడియు రాజు కొనియీయఁడని యెఱిఁగి తన యొద్ద రొక్కము లేమికి వగచి యక్కఱలేదని త్రిప్పి వేయుచున్నంత నామె ప్రియదాసి "అమ్మా! అమ్మ వచ్చినవస్తు వేదయిన నెంత వెలయిచ్చియైనను గొనుచుట రాజకులంబున నాచారము. అట్టిచో మనసునకు నచ్చిన మణిహారము నూరక పోఁగొట్టుకొన నగునా? చేత సొమ్ము లేకున్నచోఁ గ్రయధనమున కొకయేఁడు గడువు పెట్టి యావర్తకుని మరల రమ్మనవచ్చును. ఇంతలో దేశకాలస్థితినిబట్టి యావణిజుఁడైనఁ జావవచ్చును. లేదా? రాజుగారిబోగముది చనిపోవచ్చును. కాదా? రాజుగారే పోవచ్చును. దానఁ జేసి మననందుఁడు రాజు గావచ్చును" అని సమ్మతిపఱచి యారత్నాలసరము గొనిపించెనఁట. పైయర్థము గర్భితముగా నున్న శ్లోక మిది.

"ఉత్తుంగభుజనాశో వా, దేశకాలగతోఽపి వా
వేశ్యావణిగ్వినాశో వా, నందో రాజా భవిష్యతి"

ఈనందుఁడు తనపేరఁ బరఁగిన పూర్వోక్తనందవరము రాజధానిగా దేశము నేలుచు నొకతఱి, దైవయోగంబున సారెసారెకు గంగాస్నాన మొనరించి వెంటనే తిరిగివచ్చునట్టి శక్తి నొసంగు మంత్రరాజము నొకయతి యుపదేశింప నతం డొక సూర్యోపరాగదివసంబున భార్యాసహితుఁడై కాసి కేగి జాహ్నవీమజ్జనాదికంబాచరించి కాలకర్మవశంబున నమ్మంత్రము బలహీనము గాఁగా విచారించుచు నత్తఱుణమునఁ జాముండికాపూజ నొనర్చివచ్చు కాశీనివాసులు నాశ్వలాయనసూత్రులు శ్రీవత్సాది త్రయోదశగోత్రులు వేదశాస్త్ర పురాణాదివేత్తలు నగు నేనూఱుగురు బ్రాహ్మణులఁ గాంచి ప్రాంజలియై వారికిఁ దనదశ విన్నవింప, వారు మరల నట్టి మంత్ర ముపదేశించిరి. అందుల కతఁడు సంతసించి మణికర్ణికాఘట్టమునఁ దనరాజధానియగు నందవరమును శాశ్వతాగ్రహారముగా ధారాపూర్వకముగా వారికి [1] దానము చేసి తనపురంబున కరుదెంచెను. అంతఁ గొంత కాలంబునకుఁ గాశిలోఁ గఱవు సంభవింప నయ్యయిదు వందలయిండ్ల వైదికులును దమకు ధారాదత్తమయిన నందవరమునకు వచ్చి నందరాజును సందర్శించి పూర్వదానవృత్తాంత మెఱింగించిన నతఁడు దెలిసియుఁ దెలియని యట్లు నటించి "మీకిచ్చినదానమునకు సాక్షిని జూపెదరేని యిప్పుడు నందవరము మీకు విడిచిపెట్టెద" నని బదులు చెప్పెను. అందుల కావిప్రులు కుపితులై వెంటనే కాశికేవచ్చి చౌడాంబికం గొనియాడి, యనుగ్రహించి బ్రాహ్మణీరూపమును దాల్చిన యామెను నందవరమునకుఁ దోడ్తెచ్చిరి. రాజును భయభక్తివినయంబులు ముప్పిరిగొన నిలువెడలి యెదురువచ్చి పురంబు వెలుపల నున్న యద్దేవి చరణకమలంబుల కెఱఁగి నీదర్శనలాభంబున కిల్బిషన్నితి నని విన్నవించి మన్నింప సన్నుతులొనర్చి యాక్షణంబ వారికి నందవర మిచ్చి సకుటుంబముగా వారాణసికిఁ బోయి యందు నివసించె. అంత దేవియుఁ బదుమూఁడుగోత్రంబుల ధరామరులకును దగినరీతిని వృత్తులు పంచియిచ్చె. వారును జౌడేశ్వరిని గులదేవతఁగా, నారాధించుచు నంతటినుండి నందవైదికు లనఁబరఁగిరి. వారే క్రమముగ నందవరికులు నందవరీకులు నని వ్యవహరింపఁ బడుచున్నారు. పైనివ్రాసిన యంశంబులకును వీరు నందవైదికులే కాక నందవరికనియోగులు గారనుటకును [2] నాంధ్రచౌడేశ్వరీవిలాసమునుండి కొన్నిపంక్తు లిం దుదాహరించెదను.

"ఈరీతి వృత్తులు నేనూఱు సేసి,
వారిజోద్భవ వంశవార్ధి చంద్రులకుఁ
గాశికావల్లిఁ గడనుంచి యపుడు,
వాసికెక్కిరి [3] నందవైదికులనఁగ
ఆవేళ నొకవిప్రుఁ డార్వేలకులుఁడు
దుగ్గనప్పయ వచ్చి తోడనే నిలిచి
అంబవెంబడి మీరు నరుదెంచునపుడు

(1) ఈదానమును దెలుపు సంస్కృత చౌడేశ్వరీ విలాసములోని శ్లోకము "విలంబినామాంకిత భవ్యవత్సరే సూర్యోపరాగే మణికర్ణికాయామ్, మహీసురేభ్య శ్శుభ మగ్రహారం నందో దదౌ నందవరం మహీశః" (2) ఈగ్రంథము 1891 లో బళ్లారి న్యూట్రల్ ప్రెస్సులో ముద్రింపబడెను. (3) ఈపద మీగ్రంథమునఁ బెక్కుమాఱులు ప్రయోగింపబడినది.

వెంబడి వచ్చితి వేదాఢ్యులార!
నా కొకవృత్తిచ్చి యన్నాదరించి
మీ కులంబునఁ గల్పి మేరతో నుండు"
నని యాతఁ డీరీతి నాడువాక్యములు
విని యంతటను జూచి విప్రు లిట్లనిరి
మానక నిన్నిట్లు మాకులంబునను
గలపము గావునఁ గావలసినది
పొలమైన ధనమైనఁ బొందుగాఁ గొనుము,
మలపడఁ గులమున మఱిచేరనీము."

నందవరమును నందవైదికులను గూర్చి పైనివ్రాసినవిషయము ధరణిమధ్యరాయకవిప్రణీతమగు నందవైదికచరిత్రమునఁగూడ గానవచ్చుచున్నది. విషయ మొక్కటియే కావున గ్రంథవిస్తరభీతిచే నందలిపద్యములిం దుదాహరింపనైతిని. ఈనందవర్ధికులు కాలక్రమమున నత్యభివృద్ధికి వచ్చి జీవనోపాధులు చాలక కర్నూలు మండలమందేకాక, అనంతపురము, బళ్లారి, కడపమండలములలోఁగూడ విశేషముగా వ్యాపించి వేదాధ్యయనాది కర్మనిరతులు గాక జీవయాత్రకై లౌకికవృత్తి నవలంబించి యార్వేలవారికంటె హెచ్చుగా గ్రామాధికార పదముల నాక్రమించుచు వచ్చినట్లు తెలియుచున్నది. ఈమండలములలో నిప్పటికిఁగూడ నియోగివైదికభేదము వాడుకలో లేకపోవుటచేతను, ఆకాలములో నెల్లెడల గ్రామకరణములుగా నున్నయార్వేలవారు దమనామంబుల తుద నమాత్యపదము గలిపికొనుట చూచుటచేతను గ్రామకరణముల కిది బిరుదనామమని తలంచి కాఁబోలు నందవైదికులుగూడఁ గొంద ఱాకాలంబున నమాత్యపద ముపయోగించికొనినట్లు కనఁబడుచున్నది. ఇందులకు మనుచరిత్రగద్యములోఁ గానవచ్చు చొక్కయామాత్య శబ్దమే నిదర్శనము. దీనింజూచి భ్రమసి కొందఱు "పెద్దనార్యుఁడు నందవరీకనియోగిబ్రాహ్మణుఁడు అని వ్రాసిరి. కాని పైనివ్రాసిన నందవైదికచరిత్రమును బట్టి యావ్రాఁత నిరాధారమని తోఁచకపోదు. ఇదియుంగాక పెద్దన దాన శాసనములలో నెల్ల నతనితండ్రిపేరు చొక్కరాజనియే యుండుటచే లేఖకు లెవరో మనుచరిత్ర గద్యములో నాతనినామమున కమాత్యపదము దగిల్చిరని యూహింప వలసివచ్చుచున్నది. అట్లుగాక, పెద్దనయే వ్రాసియుండునని యూహించుట సరియైనదే యైనను, దనతండ్రి గ్రామకరణ మగుటచే నతఁ డట్లువ్రాసియుండును.

కాని, యమాత్యపదము నియోగిత్వమున రూఢ మనియుఁ దాము నియోగులమనియుఁ దెలిపికొనుటకుఁ బెద్దన యుపయోగింపలేదని విశ్వసింపవచ్చును. ఈవిషయముంగూర్చి యనంతపురమండలములోని నందవరీకు లను గొందఱి నడుగఁగా, వారు "మాపూర్వులు చిరకాలముగా లౌకికవృత్తి నవలంబించి జీవించుచు వచ్చుటచే మేము లౌకికులమని మాలోఁ గొందఱు సెప్పెదరుగాని తొలుత మేము నందవైదికులమే మాదేశములో నార్వేలవారికి మాత్రమే కాక మాకు నియోగులనెడి వ్యవహార మెన్నఁడును లే" దని చెప్పిరి. [1] ఇఁక దీనింగూర్చి వ్రాయ నేల?

పెద్దనార్యుని జన్మస్థానముఁగూర్చి సరియైన యాధార మేదియుఁ గానరాదు. "బళ్లారిప్రాంతమందలి దూపాడుపరగణాలోని దోరాలగ్రామ మీతని జన్మస్థలమని కవుల చరిత్రయు, "దూపాటిసీమలోని ద్రోణాదుల" యాతని వాసగ్రామ మని కవిజీవితమును దెల్పుచున్నవి. కాని యీరెండునుగూడ సరిగా లేవు. "దూపాడు" జాగీరుగా నున్నది. కాని 'పరగణా, సీమ' యనెడిపేరున లేదు. ఇది కర్నూలుమండలములో మార్కాపురముతాలూకాలో నిది కాని బళ్లారిప్రాంతమందలిది గాదు. ఈదూపాడు జాగీరులో దోరణాల యనుగ్రామము గలదుగాని 'దోరాల, ద్రోణాదుల' యనుగ్రామములు గానరావు. దీనంగూర్చి 'కర్నూలు మాన్యాలు' అనుగ్రంథ మిట్లు చెప్పుచున్నది.

"ప్రతాపరుద్రీయకృతి నాయకుఁడగు, వీరప్రతాపరుద్రమహాదేవరాజు శ్రీశైలయాత్రకై వచ్చి యక్కడి నుండి స్వదేశనిరీక్షణకుతూహలమునఁ దూర్పుగా బయలు వెడలి కంబముమీఁదుగా వచ్చి గండికోట దర్శించి పదపడి కొచ్చెర్లకోటను విచ్చేసి తత్ప్రాంతమందలి యడవిని ఛేదింపఁజేయ, నందు 'దూపాడు' అనెడి చిన్నపల్లె యొకటి గానవచ్చె ప్రతాపరుద్రుఁడు దాని నొకపెద్ద గ్రామముగా నొనర్చి యందుఁ జుట్టుపట్టుల నున్నకొన్ని గ్రామములను చేర్చి దూపాడుజాగీ రనుపేరుపెట్టి దాని ననుమకొండనివాసియగు శ్రీనాథరాజునకు నొసంగెను.

(1) నందవరము గ్రామకరణము వెంకటసుబ్బయ్యగారుగూడ దమగ్రామములో నున్న శాసనాదులంబట్టి చూడ 'నందవరీకులు, వేదాది విద్యలు నేర్చినవారు. వైదికులు. వీరు యుధిష్ఠిరశకము ౨౦౫౭ లో నందవరాగ్రహారమునకు వచ్చిరి.' అని, 29-9-1917 నాకొక జాబువ్రాసిరి.

అదియిపుడు కర్నూలుజిల్లా మార్కాపురముతాలూకాలో నున్నది.

ఈదూపాడుజాగీరులోని దోరణాల గ్రామమువన వి మొదటినివాసగ్రామము. పెద్దనార్యుఁడాశ్వలాయనసూత్రుఁడు. ఋక్శాఖీయుఁడు. వాసిష్ఠగోత్రుఁడు. ఈతని తండ్రి చొక్కరాజు. ఇతఁడు తనగోత్రమును వ్రాసికొనక పోవుటచేతను, ఇపుడున్నకొంద అల్లసానివారు శ్రీవత్స గోత్రులగుటచేతను, పెద్దనార్యునిది శ్రీవత్సగోత్రమని భ్రాంతిగలుగవచ్చునుగాని యితఁడు వ్రాయించినకరాచి సీమలోని యన్నూరుశాసనమునుబట్టి యితఁడు వాసిష్ఠగోత్రుఁడయినట్లు తెలియుచున్నది.

తక్కిన యీకవివృత్తాంతమును, కృతివిమర్శనమును గవులచరిత్రమువలన దెలియుచున్నవి గావున వాని నిందుఁ దెలుపఁబనిలేదు. కాని యొక్క యంశమును గూర్చి మాత్రము తెలుపవలసియున్నది.

«అచటఁ బుట్టిన చిగురుకొమ్మైనఁ జేవ.»

అనుపద్యమందలి చిగురుశబ్దమునకు వ్యాఖ్యాతలు గూడఁ బ్రమాదవశంబున నేదేదో యర్థమువ్రాసిరి. దత్త మండలములలో "చిగురుచెట్టు" అనియొకచెట్టు గలదు. దానికిఁ జేవగలుగుట దుర్లభము. అది వంటకట్టెలకు మాత్రమే తఱచుగా నాదేశమున నుపయోగింపఁబడును. పెద్దన యామండలములోనివాఁడగుటచే దీనిని మనసులో నుంచుకొని యాపురమునఁ బుట్టినచిగురుచెట్టు కొమ్మగూడఁ జేవగలిగియుండు ననెడిభావమును దెలుపుటకై చిగురుకొమ్మ యని ప్రయోగించెను ఇపు డచ్చటివారు దానిని సిగిరిచెట్టని వాడుదురు. ఇక నిట్టి ప్రయోగములు కొన్ని గలవు. వానిని మఱియొకప్పుడు వివరింతును.

నే ననంతపురములో నున్నపుడు పెద్దనార్యునిపై వృత్తాంతము వినియున్నాను. విన్నసంగతి ప్రకటింపక పోనేల యని యిపుడు ప్రకటించితిని. మఱియు నిప్పటి కొందఱు నన్నయార్యుఁడు నియోగి యనిసాధించుటకై ప్రయత్నించుచున్నట్లుగాఁ బెద్దనార్యుఁడు వైదికుఁడని సాధించుటకై యిది వ్రాసినదిగాదు. నా కట్టిభేద మిసుమంతయు లేదు. అట్లు సాధించుటవలన నాకుగాని యితరులకుఁగాని కలుగులాభము లేదు. క్రొత్తకథ. కొంచెము చిత్రముగానున్నదిగదా యని ప్రకటించితిని. ఇదే నా మనవి.

---

(1) 'అల్లసాని పెద్దన్నగారు దోరణాలకాపురస్తులు' అని దోరణాలగ్రామకరణము వెల్దండ నరసయ్యగారు 28-9-1917 తేదిని నాకొకజాబు వ్రాసిరి. దానిని పెద్ద ఆర్వీడుగ్రామములోని వెంకటకృష్ణయ్యగారు బలపఱచిరి. (2) ఈశాసనము 633, బి. 1915. ఎపిగ్రాఫికల్ రిపోర్టు, 1916, మదరాసులో నున్నది.

# తిక్కన సోమయాజి స్తుతి

## పొన్నలూరి సూర్యనారాయణశర్మ గారు

నరులెల్లన్ నుతియింత్రు తిక్కనకవీంద్రా! నిన్నిలన్ "నానృషిః
కురుతే కావ్య" మటంచు; సత్య మది; నీకుం గల్గె మార్గంబు
స్వర్గరసాధోభువనంబులందుఁ; బరివారం బెన్న నందందు స్థా
వరముల్ జంగమముల్; త్వదీయమగు నైశ్వర్యంబు సామాన్యమే?

శా. సర్గంబుల్ ప్రళయంబు లెన్ని సనినన్ శాంతిం బ్రసాదించు నీ
మార్గంబుల్ గడు శాశ్వతంబు లయి నైర్మల్యంబుతో నొప్పెడున్
దుర్గంబుల్ సరసుల్ వనుల్ దరువు లెందున్ బ్రాణులుం గల్గి నీ
సర్గంబుల్ ప్రళయంబులం జెడవు విశ్వాతీతవైజ్ఞానికా! ౧

సీ. అంతరిక్షమున గాఢాంధకారముతోడ
నీలమేఘంబులు వ్రేలుచుండఁ
దెరనుండి వెలువడు తెలుఁగువేసములట్లు
సౌదామినులు మింట జౌరుసేయఁ
బ్రబలివీచెడు సమీరణతరంగములందు
నాసాగ్ర మందందు నలమికొనఁగఁ
బొదలతోఁ దరులతోఁ బుడమియంతయు సమ
స్థితినున్నయట్లుగాఁ జెలువు మెఱయ
నడచు నభిసారికలును హంతకులుఁ బరము
నడలుచుండియుఁ బరికిని నడచుచుండి
చోరులును నిన్నుఁ గానఁగా నేరరనిన
నీనిగూఢత నెంత వర్ణింతు సుకవి! ౩

సీ. గిరిశృంగములనుండి పరువిడు సెలయేళ్ల
లీలారవంబు లాలింతు వీవు;
అంబుజముకుళంబులందు డాఁగిన భృంగ
సంతానగాన మాలింతు వీవు;
కాననంబుల హంతక శ్రేణి యొనరించు
వింతరహస్య మాలింతు వీవు;
అంతఃపురమునందు యావతయువకుల
లీలోక్తులెల్ల నాలింతువీవు;
వేయిపల్కు లేఁకేల? యీవిశ్వమందు
నీదు చెవిఁ జేరనట్టిది లేదుసుమ్ము;
సకలలోకంబులందలి సకలవిషయ
సంతతులు నీశ్రవణకుహరాంతికములు. ౪

సీ. స్థావరజంగమాత్మకవిశ్వమును లోన
వెలి జూడఁగల్గు నీవీక్షణములు;
చూడ్కికి మదికిని జొరరాని పదమందుఁ
బరిసర్పితములు నీపదతలములు;
సకలలోకములకుఁ జైతన్య మొదవించి
విలసింపఁజేయు నీ పలుకుగములు
నవరసంబులయందు నవనవరీతులఁ
బచరించుచుండు నీభావగతులు;
బళిర కవిచంద్ర! విబుధసంభావనీయ!
నీదులీలలు వర్ణింప నేర్పుగలదె?
నీదుకావ్యామృతాబ్ధిలో నిరుపమాన
మోదమ్మున మున్గి తేలెడిబుధుల కెల్ల. ౫

సీ. భర్గజటాజూటపరినిర్గళద్గాంగ
ఝరముతోఁ దులఁదూఁగు సరసధార
వాణీకరాగ్రముల వ్యారూఢవీణాని
నాదంబుఁ బురుడించు నవ్యగీతి
యమృతపారావారహారి సారాభంగ
భంగశీకరపాకభవ్యసుఖము
కలికిమిన్నల యపాంగప్రసారములట్లు
లలితమోహనరచనల బెడంగు
నీదుకావ్యంబుఁ బఠియింప నిశ్చయముగ
వెలయు నెవ్వానికైన నెవ్వేళనైన
నీవలనఁ గాదె కవితయు నిల్చియుండె;
నవరససరోజహంస సత్కవివతంస! ౬

చ. ప్రకృతికి జీవితంబునను బంధనమై చెడు జీవితంబునన్
వికృతియొకింత గల్గినను వీడ్వడఁజేయక దానితోడనే
ప్రకృతిని మార్చుచుండెదవు భావము సర్వము సర్వవేళలన్
సుకవులకుం దలంపులను బ్లెడురు సూచుచునుండెదు సత్కవీశ్వరా!

చ. పులి కెడునట్లు, తాపమునఁ గుంతనముండెడునట్లు, భీతిచేఁ
దలఁకెడునట్లు, మోదమునఁ దూర్కొనునట్లు, హిమానిఁగంపనం
బులఁజనినట్లు, నిర్వికృతిపూర్ణత నొప్పినయట్లు దోఁచు నీ
విలసితనవ్యకావ్యములు వేడుకమైఁ బఠియించుచుండఁగన్. ౭

మ. కవియై పుట్టుటయ బ్ర; మందు బుధుఁడై కావ్యం బొనర్పంగ విం
త విశేషంబగు; నందునన్ సకలహృద్యస్థేమ చాతుర్యతా
వివిధత్వంబునఁ గైత సెప్ప టరుదౌ విశ్వంభరన్; గోవిద
స్తవనీయోన్నతకావ్య! నిన్నుఁ బురుడించంజాల రెవ్వారలున్. ౮

# ఆత్మిక శక్తులు

**ఆర్య సుఖదేవ వర్మ గారు**

గీ. తాను వసియింపఁ బ్రేమతో దైవమిడిన, మందిరమ్మగు దేహమ్మునందు నుండు
యంత్రముల గూర్చి యెఱుఁగని యజ్ఞుఁడెట్లు, కడుసుఖమ్ముగ వసియింపఁగలఁడు మనస.

మన కెన్ని శక్తులుగలవు? వాని నెట్లు వికాసమునకు దేవచ్చును? అను నీ విషయముల మానవుఁడే విచారింపఁగలఁడు. కావున నీ మానవజన్మ మన్నిఁటి కంటె నుత్తమోత్తమము. గనుక నెవఁడు తన దైనిక జీవనక్రమమును బట్టి తన శక్తుల వికాసమును, క్షీణతయుఁ గనుఁగొనఁజాలఁడో, యట్టివాఁడు తన యోగ్యత నెంత మాత్ర మభివృద్ధిపఱచుకొనఁ జాలఁడనుట నిర్వివాదాంశము. ఏ వర్తకుఁడు తనవ్యాపార వ్యవహారములకు సంబంధించు లెక్కలను ప్రతిదినము జూడక, లాభమును సంపాదించు నుపాయముల నన్వేషింపకుండునో, యట్టి వాఁడు దివాలా తీయుటకుఁ జాల కాలము పట్టదనుట నిక్కముగదా. ఏరాజు తనరాజ్యము నుత్తమ మార్గమున శాసింపక, తన చతురంగ బలమును వృద్ధిపఱచు నుపాయముల నెదుకఁడో, అట్టివానిశక్తి క్షీణించి రాజ్యము చెల్లాచెదరై పోవుననుట నిర్వివాదాంశము. ఈవిషయమే ప్రతివ్యక్తికిఁ గూడఁ నన్వయించుచున్నది. కాఁబట్టి, ప్రతిమనుష్యుఁడు తనసమస్త శక్తులనిశ్చిత జ్ఞానమును, వికాస మార్గమును పోషక శక్తులను, ఘాతకశక్తులను, ఇంద్రియములను స్వాధీనపఱచుకొను సాధనాంతరములను ముఖ్యముగా దెలిసికొనవలసియున్నది.

వీనిని విచారించుటకుఁ బూర్వము మన శక్తుల స్వరూప విజ్ఞానమును దెలిసికొను టత్యంతావశ్యకము. మనలోపల రెండు విధములైన శక్తులుగలవు. వానిలో మొదటిది- ఆత్మికశక్తి. రెండవది - ప్రాకృతిక శక్తి. ఈ యాత్మిక శక్తి ప్రాకృతిక శక్తితోఁ జేరి తన ప్రభావమును వెల్లడిచేయుచుండును. ప్రతియవయవమున దూరి జరుగవలసిన కార్యముల నెల్ల జేయుచున్న మన యాత్మికశక్తి కెంత పరిమాణము గలదో, విచారింపవలసియున్నది. సామాన్య దృష్టితో వివేచన చేసితిమేని మన శక్తి కడు నల్పమనియు, దీర్ఘముగ నాలోచించితిమేని ఆశక్తియే యపారమై యున్నదని విస్పష్టమగుచుండును. ఉదాహరణమున కొక గోధుమగింజను పరీక్షింతము. దీనిలో నిమిడి యుండెడు శక్తిని బరిశీలింపుఁడు. ఈ గోధుమగింజను యోగ్యమైన భూమిలోనాటి, యుత్తమమైన యెరువును వేసి, కావలసినంత నీరును భద్రముగ రక్షించితిమేని, యొకసంవత్సరములోపల నా విత్తనము వలన రమారమి 200 విత్తనములను బడయఁగలము. ఈ రెండు వందల విత్తనములను మరల వెదజల్లితిమేని, యొక్కొక్క దానికి రెండువందల విత్తనముల చొప్పున పండగలవు. ఇవ్విధముగ నేడెనిమిది సంవత్సరములు చేసితిమేని, కోటాన కోటి విత్తనములు సమకూరగలవు.

పాఠకులారా! చూచితిరా! ఒకగోధుమగింజలో నెంతటి యపారమైన శక్తిగలదు. ఈ శక్తి యొక్కొక్క బీజమందు విద్యమానమైయున్నది. ఒకబీజమందొక వృక్షమును మాత్ర ముద్భవించు శక్తియేగాక యనేక వృక్షములను బుట్టించునట్టి యపారమైన శక్తిగలదు. ఒక్కొక్క బీజమందెంతటి శక్తి నింపబడి యున్నదో, యూహింప శక్యమా? ఎవని యగాధమగు శక్తిసామర్థ్యముచే నీబీజముత్పన్నమై యున్నదో, అట్టివాని శక్తిసామర్థ్యము లెంతయగాధములై యున్నవో, యూహింప మఱెంత దుస్సాధ్యముగదా! ఇఁక మన బీజరూపమగు వీర్యమును గురించి యాలోచింతము. ఒకవీర్యపు బిందువుచే మానవశరీర మేర్పడుచున్నది. ఇంతటి గొప్ప శక్తి యావీర్యపు బిందువునందు గలదుగదా. ఎవరు స్థిరవీర్యులో, ఋతుగాములో, అట్టిదంపతులకు సంతానము తప్పక లభించును. తద్విరుద్ధముగ ప్రవర్తించువారి వీర్యము వ్యర్థమగుటయే గాక, భావిసంతానోత్పత్తి బీజములు సయితము నశించి పోవును. సారాంశమేమన:— ఒక విత్తనమున కెంతటి శక్తిగలదో, అట్లేవీర్యపు బిందువునం

## డాక్టరు జీ. బీ. గారి

# సుగంధనస్యము

అంగములయందెల్ల శిరస్సును, ఇంద్రియములయందెల్ల నయనములును, ప్రధానములను విషయము సర్వజనులకును తెలిసిన విషయమే కదా! ఈ రెంటియందును కలుగు వ్యాధులు సాధారణముగా ప్రాణహాని కలిగింపకున్నను అవి వ్యాధిగ్రస్తుని జన్మమును నిష్ప్రయోజకముగాఁ జేసి యామరణాంతమును బాధించుచుండును. ఇట్టి వ్యాధులకు లోనికి తీసికొను మందు లనేక ముపయోగింపఁబడుచు వచ్చిన గాని యవి యా వ్యాధులను నివారింప లేక పోవుటయే గాక రసవిషగంధకాదులు చేరినవిగా నుండుటచేత తుదకు దేహారోగ్యము నంతను చెడఁదీయునవిగాఁ గూడ నేర్పడినవి. తరువాత పై పూతలును పట్లును నవనాగరికులచేత మంచివైద్యములుగా తీర్మానింపఁబడి యట్టి మందులుకూడ ననేకము లిప్పు డుపయోగింపబడు చున్నవి గాని యవిగూడ నంత ప్రయోజనకరములుగా గ్రహింపఁబడుట లేదు.




ఈ సందర్భము లన్నియును యోచించి చిరకాలము పరిశ్రమచేసి యాయుర్వే దాంగిలేయ యూనానీవైద్యముల ద్వారా లోకోపకారార్థమై తమ సర్వస్వమును వినియోగించుచున్న డాక్టరు, **జీ. బీ. గారీ సుగంధనస్యమును** కనిపెట్టిరి. ఇది యిదివరకే లోకమందంతటను వ్యాప్తము చేయబడి సుప్రసిద్ధమైనది కాబట్టి దీనినిగురించి మేము విశేషించిశ్లాఘింపవలసిన పనిలేదు. ఒకసారి యుపయోగించిన యెడల దాని యుత్కృష్టగుణము నదియే స్థాపింపగలదు. దీనిచే బాధానివృత్తి గాంచి కృతజ్ఞతాపూర్వకముగా గొప్పవారును కొందివారును పంపిన యోగ్యతాపత్రికలు లెక్కకు మిక్కిలిగా నున్నవి. గత డిసెంబరుమాసములో బరోడాయందు జరిగిన భారత పారిశ్రామిక ప్రదర్శనమునందు బంగారు పతకమును బహుమానమును పొందినది.

ఈ సుగంధనస్యము నుపయోగించుటవల్ల మెదడు, ముక్కు, కన్నులతో సంబంధించిన సమస్త వ్యాధులును సమూలముగా నశించును. పీనసము, ఒంటితలనొప్పి, తలలోనిపోట్లు, జలదోషములు, మొదలైన కంఠమునకు పై బడిన గల వ్యాధులకును ఈ సుగంధ నస్యము పెట్టినది భిక్షము. ఇట్టి గుణవిశేషము గలిగి యింతసులభముగా విక్రయింపబడు నౌషధ మిదితప్ప మఱియొకటిలేదు. చిరకాల ముంచినను చెడని సుగంధ విశేషమువలన, పొడి యభ్యాసములేని వారికి సహిత మిది హితవుగా నుండును.

సాధారణముగా పొడివేయువార లీ సుగంధ నస్యమును కట్టి రెండుసారులుపయోగించిన యెడల, ఇది సాధారణపు పొడి ౧౦, ౧౫ సారు లుపయోగించినంత పనిచేయును. కాలణా వెలగల సాధారణపు పొడిలో నీ సుగంధనస్యము నొకచిటికె కలిపిన యెడల నా పొడి యంతయును మిక్కిలి పరిమళవంతమగును. ముఖ్య గమనింపు ఆంధ్ర లేక అంగ్లభాషలలో విలాసమును విడివిడిగాను వ్రాయవలెను.

బుడ్డి ౧ కి అ. ౦-౮-౦ వి. పి. ఖర్చు అ. ౦-౪-౦ డజను ౧ కి రూ. ౨-౮-౦. వి. పి. ఖర్చు ౦-౮-౦.

విలాసము:— **గురుబసవ అండు కంపెనీ లిమిటెడ్,**

పోస్టుబాక్సు 510 మద్రాసు.

Swarajya Flag Bearers after Nagpur Victory



స్వారాజ్య పతాక యోధులు, నాగపురము విజయానంతరము

Procession of the National Flag, Nagpur





నాగపూరు స్వరాజ్యపతాకసంరంభము

# OM

## THE MYSORE GOVERNMENT SECURITY

# Life and Marriage Assurance Company Limited.

## Head Office: Life and Marriage Assurance Buildings, Mysore (South India).

Capital (Fully subscribed) Rs. 5,00,000; Capital Paid up exceeds Rs. 3,00,000.
Government Securities held Rs. 1,50,000; Life Insurance policies issued Rs. 15,00,000.
Annual Premium income Rs. 50,000

Necessary security Deposit furnished to the Government of India as per Indian Life Assurance Companies Act 1912. **Loans from Rs. 1,000 to Rs. 5,000.** Will be given with and without interest and security to our life Policyholders and bondholders. Next drawing for granting loans on 31st July 1924. Wanted Agents everywhere on liberal terms. Apply for particulars sharp to:—

## Messrs. P. K. Rau & Sons.

Chief Agents, for Madras Presidency. 289, Thambu Chetty Street, MADRAS.



## మైసూరు గవర్నమెంటు సెక్యూరిటి లైఫ్ అండు మ్యారేజి అస్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

హెడ్ ఆఫీసు: లైఫ్ అండు మ్యారేజి అస్యూరెన్సు బిల్డింగ్సు: మైసూరు. (దక్షిణ ఇండియా)

ముఖ్యమైన ఏజన్సీలు: ఇండియా, బర్మా, సిలోను మొదలగు జాగాలలో గలవు.

**మూలధనము** { పూర్తిగా చందాలువేయబడినవి రూ. **5,00,000** / చెల్లించబడినది **3,00,000** లకు పైగానే గలదు. } ఇండియా గవర్నమెంటువారివద్ద రు **1,50,000** ధరావత్తుకట్టబడినది

జారీచేయబడిన భీమా కంపెనీ పాలిసీలు రూ **1500000** సం॥రము ప్రీమియం వరుమానము రూ **50,000**

1912 సం॥రం ఇండియన్ లైఫ్ అస్యూరన్సు కంపెనీల నిబంధన ననుసరించి ముఖ్యమైన ధరావత్తు ఇండియా గవర్నమెంటు వారికి కట్టబడినది. లైఫ్ పాలిసీదారులకు, బాండుహోల్డరులకు వడ్డీ తాకట్టులతోను, వడ్డీ తాకట్టు లేకుండాను ఋణము లిచ్చు ప్రత్యేక సదుపాయములు గలవు. ఋణములు యిచ్చుట, లాటరీ 31-7-1924 తేదీన జరుగును. ధారాళమైన షరత్తులపై పనిచేయుటకు ఏజంట్లు అన్నిచోట్లలో కావలెను. వివరములకు తక్షణమే ఈదిగువ విలాసమునకు వ్రాయవలెను:—

మెసర్సు పి. కె. రావు అండు సన్సు, చీఫ్ ఏజంట్లు, చెన్నరాజధాని, 289, తంబుశెట్టి వీధి, మద్రాసు

అద్భుతమగు మానవసృష్టి బీజములు దాగియున్నవి. పాఠకులారా! చూచితిరా! వీర్యపు బిందువులోని యపార శక్తిసామర్థ్యమును! ఈరహస్యమును మన పూర్వ ఋషులు చక్కగా దెలిసియుండుటం జేసిమన క్షేమమునకు సంబంధించు నట్టి ఋతుధర్మములను అనఁగా (గృహస్థాశ్రమ మందుండు నప్పటికిని నింద్రియ లోలుఁడు గాక ఋతుగామియై యుండు నట్టి సూత్రములు) శాస్త్రములందు వ్రాసిపెట్టియున్నారు. ఈయింద్రియనిగ్రహమునకై మనపూర్వులు యోగాభ్యాసాది ప్రయోగములను సాధించి, తన్మూలమున అద్భుతమగు నింద్రియ వికాసమును బడసిన శ్రీకృష్ణాదుల సచ్చరిత్రములే తార్కాణములై యున్నవి. చదువరులారా! ఇంద్రియ నిగ్రహపు మహిమ నింకనైన గ్రహింప గల్గితిరా! లేదా! ఇట్టి మహత్తరమగు శక్తిని పాడుచేయు వారి నేతరగతిలోఁ జేర్చవలయునో, మీరలే యూహించుకొనుఁడు. ఎప్పుడు మానవుఁడు తన సుప్తశక్తులను వికాసపఱచునో, అప్పుడే వాని వికాసక్షేత్ర మపారమై యుండును. దీనికి, నియమానుకూల్యమైన యాచరణమే మూలసాధనమై యున్నది. అనియమములవలన హాని గల్గుటయే గాక, వానిశక్తులు గూడ వికసింపవు. ఈ జ్ఞాన కర్మేంద్రియముల విలక్షణమగు శక్తిని విచారించుచు మానవుఁ డాశ్చర్య సముద్రమున మునుగుచున్నాడు. కావుననే, గీతయం దిట్లు చెప్పఁబడియున్నది, "ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః; ఆశ్చర్యవచ్చైన మన్యః శృణోతి శ్రుత్వాప్యేనం వేదన చైవ". గీత. 2. 29. అనఁగా కొందఱీ దేహమును కడు నాశ్చర్యకరమైన దృష్టితో విలోకించు చుందురుగాని, దాని యందలి యద్భుత శక్తులను మాత్రము కనుఁగొనఁ లేరు. ఇంతటి విలక్షణమగు శక్తిగల నీ దేహావ యోగ మెఱింగినవారు మిక్కిలి యరుదు. చూడుఁడు. మనముఖమం దద్భుతమగు వక్తృత్వ శక్తిగలదు. ఈ వాక్శక్తి మిక్కిలి ప్రబలమైయున్నది. ఇది యెండవారల మధ్య ప్రేమానురాగ ముత్పన్నము జేసి మైత్రిని కుదురించగలదు. లేదా, మిత్రులయందు ద్వేషాగ్నిని ప్రజ్వలింపఁ జేసి కలహములను పుట్టించగలదు. ఇంతియగాక, నేటి, దైనిక-వార-మాసికవృత్తాంత పత్రికలును, నుత్తమోత్తమములైన గ్రంథరాజములును, వక్తృత్వాదిసమస్తములును శబ్దసృష్టియొక్క యావిష్కారములై యున్నవి. మానవుని శక్తి శబ్దరూపమున నొకచోట సమకూరుచున్నది. ఇది యొకానొకప్పుడైనను మిక్కిలి యుపయోగకరమై యుండగలదు. ప్రతియొకఁడును మాట్లాడుచుండునుగాని, శబ్దములద్వారా వెలువడుచుండు నట్టి తనశక్తినెఱుంగు వాఁడు మిక్కిలి యరుదు గదా! వాక్శక్తిని వ్యర్థము చేయకూడదను భావ మెఱింగిన మనపూర్వఋషులు మానముదాల్చి మునివర్యులై యుండిరి. గనుకనే వారు పలికిన ప్రతిపలుకు వేదవాక్యమైయుండెను. అయిచే, నేఁడు శబ్దవృష్టి గురియుచుండినను, వాని ప్రభావమెంత మాత్రమును గానరాదు. కారణమేమి? ఆవాక్శక్తియందు సంయమ శక్తి బొత్తిగా లేదనుటయే. ఇక చెవిలోని శ్రవణశక్తిని విచారింతము. ఇదిగొప్పది. దీనివలననే శిష్యుడు గురువులనుండి విద్యను గ్రహించగలడు. అదిహృదయమున జేరి తన ప్రభావము స్థిరపఱచును. సుసంస్కారమువలనఁ నతఁడు యోగ్యుఁడై శ్రేష్ఠుఁడగును. కుసంస్కారమువలన చెడిపోవును. కనుక, కర్ణేంద్రియముల శక్తిగూడ మిక్కిలి ప్రబలమైయున్నది. ఇవ్విధముగనే, నాసికయందలి ప్రాణశక్తి జీవనమొసఁగు చున్నది. నేత్రములలోని దర్శనశక్తి సృష్టిదర్శనమును జేయించుచున్నది. ఇట్లు నానావిధములైన యింద్రియముల శక్తులు వేర్వేరు విధముగ తమ యద్భుతశక్తులను ప్రకటించుచున్నవి. సజ్జనులారా! ఇట్టి గొప్పశక్తులు మనరోమరోమములందు నయితము నిండియున్నవి. కాఁబట్టి ప్రతివారును ధర్మానుకూల్యముగ ప్రవర్తించి, తమయందిమిడి యుండు నద్భుత శక్తులను వికాసపఱచి, యౌన్నత్యమును బడసి కృతకృత్యులగుదురు గాక!

# శ్రీ కృష్ణదేవరాయలు

జాధ్యాల వేంకటశివకవులు

రక్షించె నెవ్వాఁ డార్తత్రాత యౌటచే, శరణొందు దుర్బలసమితి నెల్ల
శిక్షించె నెవ్వాఁ డక్షీణబలుఁడౌట, సాధుబాధకులైన శాత్రవులను
పోషించె నెవ్వాఁ డమోఘకృపుఁడౌట, దైన్యంబు వాపి బీదలగు జనుల
భూషించె నెవఁడు మనీషివరుఁడౌట, దిగ్దంతులైన సుధీనిధులను
అట్టి రాజాధిరాజవిఖ్యాతబిరుదుఁ, డనుపమగుణాంబురాశి మహామహుండు
ఆంధ్రకవితాయుతుండు విద్యాధికుండు, భూమిపాలుండు కృష్ణరాట్పుంగవుండు.

సీ. నావాడముఖదేశనాథులు కప్పమ్ములను గొంచు ద్వారమ్ములను వసింప
గేయప్రబంధపఙ్క్తిని వందిమాగధుల్, జయబిరుదావళుల్ సదువుచుండ
సప్తదిగ్గజములై నట్టి పెద్దనముఖ, కవివరుల్ కృతులఁ గాన్కలను నొసఁగ
నిరుపక్కలను వన్నె నింపుచుఁ గత్తుల, చేఁబూను భటుల సుశ్రీ చెలంగ
గీ. సకలరాజన్యమస్తకస్థగితపద్మ, రాగమణికాంతిపుంజనీరాజితాంఘ్రి
జలజుఁడై సింహపీఠిని గొలువుదీర్చు, కృష్ణరాయలప్రాభవ మెన్నఁ దరమె?

మ. ఉదయాహార్యము ముట్టడించె, నటుపై నోహో యనన్ గొండవీ
టిఁ దగన్ బట్టికొనెన్, బదంపడిని దాడిం జమ్మిలోయాఖ్య, నా
పిదపన్ గొట్నము, బొట్టునూరు, నటుపై వేగన్ హరించెన్ జయా
స్పదుఁడై మీఱినకృష్ణరాయల కిలన్ సాటెవ్వరంచున్ మదిన్. (?)

చ. అల సురభాషఁ బ్రోచెను మహామహుఁడై యలరారుభోజుఁ డ
ట్టుల మన తెల్గుబాసను గడుంగఁ బ్రోచెను, విద్దెలోనఁ బె
ద్దలయిన పెద్దనాదులను దద్దయుఁ దన్పుచుఁ గృష్ణదేవరా
యల కెనరారు లోకమున నంచు జనుల్ గొనియాడ నిచ్చలున్.

శా. ఏలోకమ్మున నున్నవాఁడొ మృతుఁడై యీయాంధ్రదుఃఖమ్ముఁ దా
నాలోచింపక యే సమస్తకకుబబ్జాస్యాశిరోదేశస
ల్లీలాకల్పితవార్త్తికాయితయశోలీనస్వరూపమ్ముచే
నీలోకమ్మున నున్నవాఁ డనుచు వాపింపుండు చేతమ్మునన్.

# ఆంధ్రసారస్వతము - హాస్యరసము

ఆంధ్ర-శేషగిరిరావుగారు.

నవ్వు జనింపఁ జేయునది హాస్యము. అది ఆనందప్రదము. ఆనంద మారోగ్యదాయకము. హాస్యము నవరసములలో నొకటి. అపారమగు ఆంధ్రసారస్వతమున హాస్యరసము చాలఁ గొలఁది. మృగ్య మని చెప్పుటకూడ సాహసముకాదేమో! శృంగారరస మేమి పుణ్యమొన రించెనో కాని ఆంధ్రకవిపుంగవులచే నది గన్నమన్ననలో సహ స్రాంశమైన మిగిలినరసములు నోఁచియుండలేదు. మనసారస్వతమున నున్నంత పిచ్చిగాఁ బచ్చిగా సుకుమారశృంగార ప్రబంధములు మఱి యేసారస్వతమున నుండవు. ముచ్చటకుఁగాని మచ్చునకుఁగాని కన్ను లీడుచుకొని చూచిన మన్నను ఆంధ్రవాఙ్మయమున కేవలహాస్యరస ప్రధానమైన గ్రంథమొక్కటియుఁ బ్రబంధయుగమందుఁ బొడసూప లేదు. ఆంధ్రకవితల్లజుల కల్లరపు శృంగారరసప్రవంతిలో 'మునుఁ గానాం, తెలానాం'తో సరిపోయినది. పుణ్యకాలము కాస్తయు-చిల్ల పెంకులలోఁ జింతామణు లన్వేషింప దొరకొనినట్లు ఆంధ్రప్రబంధ ములం దౌషధప్రాయముగనైన హాస్యరస ముపలబ్ధమగు నేమో తడుముల్లాడుదము.

భారతము నవరససంపోషిత మని కదా పండితనిర్వచనము. అట్టి భారతమునందుసయితము గాలించిచూచిననే ఒక్కటిరెండుతావుల తప్పజాతి హాస్యముండినట్లు గుర్తింపనగును. ప్రథమాంధ్రమహాకవి యగు నన్నయభట్టారకుఁడు హృద్యమగుహాస్య మక్కడక్కడ చిలుక రించియున్నాఁడు. ఈతనిహాస్యము చదివినవెంటనే మనమునకుఁ దట్టి, కడుపు చెక్కలుచేయునంత అతిగాక పరిశమును సరసమునునై మంద హాసజనకముగా నుండును. 'నలుని తిలకించితిరా?' యని సార్థ వాహులను దమయంతి ప్రశ్నింపఁగా వారు:—

క. నలుఁ గాన మివ్వనంబున
గల వెప్పుడు కాంతు ముగ్రకరులను సింహం
బుల ఋక్షంబుల నిదిము
ట్యల కవిసయ వాతపంబు దూఱదు దీనిన్. —అరణ్యపర్వము.

అని చెప్పి రనుటలో నెంతటి చమత్కారహాస్యము! అర్జునుఁడు ద్రుపదుని గట్టి తనకాళ్లముందర నుంచ, ద్రోణుఁడు మహారాజుం గాంచి.

క. వీరెవ్వరయ్యా, ద్రుపదమ
హారాజులె! యిట్లుకృపణు లయి పట్టువడన్
వీరికి వలసెనె! యహహా! మ
హారాజ్యమదాంధకార మదివాసెనొకో! —ఆదిపర్వము.

అని మొగము తగులవైచినట్లు చేసిన దెప్పిపొడుపులు చదువరుల కెంతయైన ఆహ్లాదము సంపాదించును.

కవిబ్రహ్మ యగు తిక్కనసోమయాజి హాస్యరసపరిపోషణము తెప్పగాఁ జేయలేదని నాతలంపు. ఉత్తరగోగ్రహణవర్ణనాసం దర్భమున హాస్యరసప్రయోగమున కెంతయేని అవకాశము కలదు. కాని యాఘట్టమున నేకవియు నిజమైనహాస్య ముపయోగింప నేరఁడు. ఎట్లందురా! ఉత్తరుఁడు పిఱికిపంద. ఆతనివచనములు సొఱకాయ కోఁతలని చదువరులకు విదితము. అట్లగుటనే పాఠకులమనములు హాస్య మునకై తెఱువఁబడవు. నాచనసోమనాథుఁడు సరసహాస్యప్రయోగ మున దిట్ట. నారదునకుఁ 'గయ్యమన్న సంభావనఁ గన్నరీతి' నుండునని వర్ణించియున్నాఁడు. ఇట్టి తేలికహాస్యము మన గ్రంథములందుండుట అరుదు. ఈయుగపువాఁడే యగు గౌరనమంత్రి-హరిశ్చంద్రోపాఖ్యా నమందలి కాలకౌశికవీరబాహువర్ణనలో మనోరంజకమగు హాస్యము కలదు.

ఈనాఁటి కవులలో శ్రీనాథుఁడు మేలుచేయి హాస్యరస ప్రయోగమునకు. జామాతయగు శివునిపైఁ గోపము పెట్టి యాతని విశేషగుణములను హిమవంతుఁ డెట్లుగాఁ దీసికొనెనో చమత్కార ముగా వర్ణింపఁబడినది పరీక్షింపుఁడు.

సీ. తలమీఁది చదలేటి దరిమీలఁ దిన జేరు
కొంగలు చెలఁగి కొంకొంగు రనఁగ
మెడఁదన్ను పునుకల నిడుపేరు లొండొంటిఁ
బొరిఁబొరిఁ దాఁకి బొకబొకు రనఁగఁ
గట్టినపులితోలు కడకొంగు సోఁకి యాఁ
బోతుతత్తడి చిఱ్ఱుబుఱ్ఱు రనఁగఁ
గడియంపుఁబాములు కకపాలలో నున్న
భూతి మైఁజిలికిన బుస్సు రనఁగఁ
తే. దమ్మిపూఁజూలి పునుకకంచమ్ము సాఁచి
దిట్టతనమున బిచ్చము 'దేహి' యనుచు
వాడవాడల భిక్షించు వాఁడుగాని
యిట్టిదివ్యాన్నములు మెచ్చునే శివుండు.

హరవిలాసము.

విసువుచేఁ గల్గిన ఈవిరోధభావములు పాఠకుల కెంతయైన నవ్వుబుట్టింపఁజేయును. వడ్డనసమయమందు జరిగిన ఈ చమత్కారమును జూడుఁడు:—

కూర్చి పృచ్ఛించినాఁడు! నా రాతనితో 'ఈరేడుజగములలోఁ బోగాకు ముఖ్యమనిరఁట. ఆహా! ఎట్టి చమత్కారహాస్యము. హాస్యరసమున కవధియో యనిపించుచున్న దీపద్యము. అసలు వర్ణించిన కొసరు దిగువకందమునఁ గనుఁగొనుఁడు. శివుఁ డద్రి శయనించుటయు, విష్ణువు శేషశాయియగుటయు, రవిచంద్రులు మింట నుంటయుఁ, గారణము మీకుఁ దెలియునా? తెలియకున్న నీపద్యము చదివి తెలిసికొనుఁడు. బాగుపడెదరు.

క. శివుఁ డద్రిని శయనించుట
రవిచంద్రులు మింటనుంట రాజీవాక్షుం
డవిరళముగ శేషునిపైఁ
బవళించుట నల్లి బాధ పడలేక సుమీ!!

మర్త్యుడును మఱియొకటి చిత్తగింపుఁడు. చాకలివానిపైఁ జమత్కారముగాఁ జెప్పఁబడిన దీ దిగువగీతము.

ఆ. వె. చాకివానితోడ జగడాలు పడలేక
సిరి గలాఁడు పట్టుచీర గట్టె
శివుఁడు తోలు గప్పె సీ యని మది రోసి
భైరవుండు చీర పాఱవైచె.

బూతులమాట మఱచితిమేని చంద్రశేఖరవిలాపము నిజముగా హాస్యరసప్రబంధరాజము. ఇందలి హాస్యము చాలవఱకు సంఘదురాచారతిరస్కారప్రతిపాదకము. ఈర్ష్యచేతనే యనుకొనుఁడు జగ్గకవి యీగ్రంథము రచియించినది. ఎట్లైననేమి దీనిని వెల్వరించి ఆంధ్రసారస్వతమున నూతనమార్గగామియైనాఁడీతఁడు. అనుకరణము మనకవులకు గోఁజుకట్టుటాది గలగుణమేయైనను ఏలొకో చంద్రశేఖరవిలాపమునకుఁ బ్రతిబింబములు బయలుదేఱలేదు. అది మనయదృష్టమే. ముప్పదియేండ్ల అమ్మాయి యగు చీపికన్నులచంద్రి నలువదియేండ్ల అబ్బాయియైన చిదుముపొక్కుల సింగరాజును వలచి-వలపించి-వలలో వైచికొనుటయే ఇందలి ఇతివృత్తము. ఇందపూర్వవిషయ మొకటి కలదు. వీరభద్రతంబళికి నరసింగార్యసంబి వాక్రుచ్చినపాట యీవృత్తాంతము ఆంధ్రకవులు కనివినియుండని విచిత్ర మిది. దేవాలయపూజార్చనలు విధ్యుక్తవిధుల విడిచి వదుపుముచ్చట్లతోఁ గాలక్షేపము చేయుచుండిరని కదా దీనితాత్పర్యము. తమకాలము నాఁటిజనతాస్థితిని కావ్యదర్పణములందుఁ బ్రతిఫలింపఁజేయుట ప్రతిభావంతులగు కవుల చమత్కారము. ఇట్టివిషయములు మనసారస్వతమునం దరిది; అపూర్వము. మొన్న మొన్నటి బొబ్బిలిచరిత్రమునఁడు నారదుఁడే ఇంద్రునకు నివేదించినట్లు రంగరాయ చరిత్రమునఁ గలదు. ఇదియెంత అసంభవముగా నుండునో పాఠకమహాశయులే యూహించుకొందురు గాక! జగ్గకవి యీపూర్వవిషయప్రతిపాదనమునందు విశేషప్రతిభాప్రాగల్భ్యముఁ జూపి సంఘదురాచారము చమత్కారముగా నాగరికముగాఁ బరివాని తనములోఁ జేసియున్నాఁడు. కవికాలమునాఁటికే పూర్వపుఁగట్టుఁబాట్లను బాపి క్షేత్రమునందు గౌరవము గోల్పోయిన బ్రాహ్మణసంఘమును గవి ఒకానొక పాత్రముచే నెట్లు తిట్టించినాఁడో.

క. ఓం భూలు చేసికొంచును
జంభంబులు గొట్టుకొంచు జడమతి నకుభా
రంభము లరయుచుఁ దిరిగెడి
దంభపువిప్రునకు నీకుఁ దగ దిది చనుమా.

సంఘవిషయకమును, అట్లయ్యు అబాధకమునునగు నిట్టిచమత్కారహాస్యము పరిపోషించిన జగ్గకవిబుద్ధివైశద్య మసదృశము. అపారము. విశేషించి శ్లాఘాపాత్రము.

హాస్యరసపోషణమునకు బూతులే ప్రధానము లని యూహించిన కవిచౌడప్ప నయితే మొక్కొక్కచోఁ బ్రసాదమైనహాస్యముఁ బ్రయోగించియున్నాఁడు. మచ్చునకు

క. ఆడినమాటలు దప్పిన
గాడిదకొడుకంచుఁ దిట్టఁగా విని మదిలో
వీఁడా కొడుకని యేడ్చెను
గాడిదయును కుందవరపు కవిచౌడప్పా.

అను దానిని చూడనగును. ఇందలిహాసము మనోహరమై ఇంపు వింపుచున్నది. పిండిప్రోలు లక్ష్మణకవి మొదలగువారు శ్లేషకవిత్వము స్వార్థమునకు, శత్రుదూషణతిరస్కారములకు వాడుకొన్నట్లే అడిదము సూరకవి, కూచిమంచి తిమ్మకవి, జగ్గకవి, ఇత్యాదు లిటీవల హాస్యమును తమకుఁ గిట్టనివారలను తిట్టుటకుఁ బనిముట్టుగా ప్రయోగించిరి. నిదర్శనముగా రామలింగేశ మకుటేశ్వరశతకములను బరిశీలింపనగును.

ఆధునికయుగమందలి హాస్యరసపరిపోషణము విమర్శింపదొరఁకొనుటకు మున్ముందు భామకలాపములు, చాటువులు, శతకములు మన సందర్శనమును విమర్శనమును వాంఛించును. పగటిభాగవతులు అసభ్యమైన హాస్యమునకుఁ బుట్టినిండ్లు. 'గొల్లకలాపము' వినిపించు వేశ్యాంగనలవెనువెంటఁ దప్పక విదూషకుఁ డొకఁడుండును. ఇట్టివిదూషకులు చెప్పు హాస్యము సాధారణముగాఁ బచ్చిబూతులతోఁ దెప్పలు తేలుచుండును. పామరజనసమ్మతమగును గాని ఈబూతుహాస్యము నాగరికులకు, రసికులకు, అనిష్టజనకమై, హేయమై, భావించుటకుఁ గూడ నాభాసపాత్రమై జుగుప్సాకరమై యుండును. పప్పులోఁ బచ్చివిరియపుఁగాయ కొఱికించినట్లు నిద్రాదేవికి దమదేహముల ధారాదత్తము చేసిన ప్రేక్షకులలోఁ జులుకుఁబుట్టించుటకుఁ గల్పింపఁబడి యుండును ఈహాస్యము. ఇట్లగుటనే కాఁబోలు తనప్రబంధమునకు సాదృశ్యముగా నే కవులును కృతిఁ జెప్ప నేరరని తన్ను మిన్నగా శ్లాఘించుకొన్నాఁడు. 'హాస్యకవిజాణ' యని రఘునాథరాయల పేరోలగమందును 'తెంటికోణంగి' యని ఆంధ్రపండితప్రకాండులచేతను మెండుగా గొండాడఁబడుచున్న కవిచౌడప్ప యేమనెనో—

క. పదినీతులు పదిబూతులు
పదిశృంగారములు గల్గు పద్యముల సభం
జదివినవాఁడే యధికుఁడు
గదరప్పా కుందవరపు కవిచౌడప్పా.

క. నీతుల కేమి యొకించుక
బూతాడక దొరకు నవ్వు పుట్టదు ధరలో
నీతులు బూతులు లోక
ఖ్యాతులురా కుందవరపు కవిచౌడప్పా.

బూతాడఁగూడదనువారిని దలవాఁచ చీవాట్లు పెట్టి వారినో కట్లతడు కొక్కానో చూచితిరా.—

క. బూతు తెగడుదురు తమతమ
తాతలు ముత్తాత మొదలు తరతరములవా
రేతీరున బూతెలేగిరి
ఖ్యాతిగ మఱికుందవరపు కవిచౌడప్పా!

కంటిరా! 'పదిబూతులు సభలోఁ జదివినవాఁడే యధికుఁడఁట-బూతాడక నవ్వుపుట్టదఁట-బూతులులోక ఖ్యాతులఁట'—పాపము! ఇది కేవలము కాలదోషము. నీతిబాహ్యవర్తనము నెడ సామాన్య జనములకు దోఁకపుట్టించుట కిట్టిబూతు లావశ్యకమని వారూహించిరి కాబోలు. ఈ రోగము మన ఆంధ్రమునకే పట్టలేదు. సంస్కృతమునకును గల అంటురోగమే. ప్రతాపరుద్రీయమందలి హాస్యరసలక్ష్యములు తిలకించినవారికి నాటకములందలి సత్యము సకలము విదితమగును. ఇంకను అనుమానము వీడనివారు కాళిదాసప్రహసనమని నామాంతరముగల లంబోదరప్రహసన మొక్కసారి చిత్తగించిన నిజము తేటతెల్లమగును. 'తీటగల భాగ్యశాలికి' గ్రింది కందమందలి సమాచార మనుభవ పునరుక్తమే.

క. తీటగల భాగ్యశాలికి
నీటుగలుగు గోళ్లు వేడినీళ్లు లభింపన్
దాటించి ఒఱుక సాగిన
దీటరయ దేవేంద్రపదవి తీరముగ జగతిన్.

ఇందలిహాస్యము నిరుపమానముగదా! 'నానాఁటికిఁ దీసికట్లు నాగంభట్లూ' అన్నసామెత చతురతగాఁ బద్యమందిమిడ్చి ఎట్లు హాసము కలుగఁజేసెనో అరయుఁడు.

క. ఏనాఁటి యగ్రహారము
మానాఁటికి కంద్రికాయ మాపని దీరన్
మీనాఁడు మాన్యమాయెను
నానాఁటికిఁదీసికట్లు నాగంభట్లూ!

అబాధకములును అతిసుకుమారసుందరములునగు నిట్టి హాస్యపుజాటువులు, పుంఖానుపుంఖములుగాఁ 'చాటుపద్య సంపుటములందు' మూలమూలల మూల్గుచు ప్రకాశమున ప్రజాదరణమును నిరీక్షించుచున్నవి.

శతకముల నొకటి రెండింటి మన మీసందర్భమున సమీపించి పరామర్శింపవలయును. హాస్యరసాన్వేషణపరులమై మనలో విశేష ప్రచారముగల 'వేణుగోపాల కుక్కుటేశ్వర రామలింగేశ్వర' శతకములుమొదలు హాస్యముతో జుగుప్సాకరములగు బూతులతో నిండియుండి రసికుల కేహ్యపాత్రములైయున్నవి. 'మూర్ఖహృద్భయాభ్యాగత శూలమో'యన రచింపఁబడిన 'చంద్రశేఖరశతకము'నందు దుచ్యమగు హాస్యము కలదు. తమాషాకథలు గ్రామ్యభాషలోఁ జెప్పుచుఁ గవియిందు హాస్య ముజ్జీవింపఁజేయును. మాదిరికి నొక్కటి.

ఉ. ఇంగితకాడ పాడకికి సాలిచు నీవదిపాడినందుకున్
యింగితె మెంచి నేను మరి యిన్నదుకున్ సరిపోయె వింటివా
అంగున నే తలూపినటి అప్పుకు తంబుర యీడ పెట్టిపో
జంగుడు బాపనాడ యని పల్కును మూర్ఖుఁడు చంద్రశేఖరా!

ఈహాస్యమున కాధారము 'నీవుపాడినందులకు నేను విన్నందుకు సరిపోయింది, పైఁగా నేను తలయూపినందుకు తంబురా యిచ్చిపో' అనెడిసామెత. ఇట్టివింకను ఆశతకమునఁ బెక్కులున్నవి. విస్తరభీతిచే నీవిషయ మింతటితోఁ గట్టిపెట్టి ఆధునికయుగహాస్యరసస్వభావపరిపోషణపరీక్షణముపకుఁ గలమున కనుజ్ఞ నిత్తము.

ఆధునికయుగారంభముతో నాంధ్రభాషాయోష కదృష్టపురేఖ బయలుపడినదని జనవాక్యము. ఈయుగమున తొలుదొల్త స్మరింపవలసినవారు వీరేశలింగము పంతులు. ఆంధ్రభాషాపురోభివృద్ధి నాలించి మనసారస్వతమున నూతనమార్గముల నవలంబించి పలుత్రోవలు ద్రొక్కిన పంతులువారు సంఘదురాచార తిరస్కారప్రతిపాదకము హాస్యమును నెలకొల్పనుద్యమించిరి. నూతనపథమగుటచే వీరియుద్యమ మెంతయు నభినందనీయమైనను నిది ఆంధ్రభారతికి అంగవికారము దెచ్చిపెట్టెనే గాని అలంకార మొడఁగూర్పలేదు. వీరిగ్రంథములలో హాస్యరస ప్రధానములైనవి ప్రహసనములు. అభాగ్యోపాఖ్యానము, సత్యరాజ పూర్వదేశయాత్రలు మొదలగునవి. వీరిప్రహసనములు సంఘదురాచారదూషణమునకు వ్రాయఁబడినవని ఇంతకుముందే నివేదించియున్నాను. దూషింపఁబడిన దురాచారములు ద్రుంగుడుపోయిన తోడనే వీనివ్యాప్తి తగ్గును. మఱియు నిట్టివి సర్వజనామోదకములుగావు. అట్లగుట వానికి సారస్వతమున బలుకుఁబడియు చిరస్థాయిత్వము లేదన్నమాట. స్టీలు ఎడిసను వ్రాసిన సాంఘికవ్యాసము లాంగ్లసంఘసంస్కరణాభివృద్ధి యొనర్చినట్లు వీరిగ్రంథము లాంధ్రసంఘసంస్కరణ మొనర్పలేదు. వీరిప్రహసనములకు 'విశ్వశ్రేయమును విశ్వవ్యాపకమును' లేమి నుత్తమకృతులలోఁ జేరవు. పంతులవారి 'అభాగ్యోపాఖ్యానము' బూతులులేని 'చంద్రరేఖావిలాపము'నకు అచ్చుబొమ్మ. ఇందువీరు వికృతాకారములును వికారచేష్టలును వర్ణించుటచే హాస్య ముజ్జీవింపఁ బ్రయత్నించిరి. కాని ఇది సర్వోత్కృష్టమైన హాస్యము కాదు. సత్యరాజపూర్వదేశయాత్రలందలి హాస్యముకూడ నీకుదిటిలోనిదే.

పంతులవారి ప్రహసనము లాదర్శములుగ నిడుకొని చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు కొన్ని ప్రహసనములు రచియించిరి. సంఘాచారములందలి విపరీతములను వింతయైన ఆచారములను వినోదచర్యలుగా మార్చి, వెక్కిరించి, సంఘదురాచారములను వెలార్చుటే వీరిఆశయమైనను ఈ ప్రహసనములు వ్రాయఁబడునప్పటికే ప్రాతపడి త్రుప్పు

పట్టిన సాంఘికాచారములను కెక్కిరించి వెక్కిరించుటచే నివి ఆంధ్ర జనాదరణమును బడయ లేదు. జనాదరణము బడిసినను వీరి 'వినోదము' లందు సయితము స్వతస్సిద్ధమును నవ్యమును నగు హాస్యము యిల్ల. వీరి నాటకములందుఁగూడ శరోత్కృష్టమైన హాస్యము నాస్తి. విదూషక పాత్రలు వచించు హాస్యవచనములు జనపరంపరముగా ముదుసళ్ళ నుండి వెల్వడుచుండు సామాన్యహాస్యవచనములే. వీరినాటకములలోఁ జతురచంద్రహాసమున కొంచెము మెఱుఁగైన హాస్యము కలదు.

సంఘవిషయములగూర్చి అబాధకములగు చమత్కారకావ్యములు వ్రాసిన ఆంధ్రకవులలో దాసు శ్రీరాములుగా రగ్రణ్యులు. వీరి 'తెలఁగునాడు' లోనిది తేలికయైన హాస్యము. మచ్చునకై.

ఉ. లేవరు రెండు లెండనిన లేచినవా రయినం దటాలునం
పోవరు పోవుచుం నిలిచి 'పోదుము-పోదుము త్రోయవం'డటం
చీవరునందు గేస్తు నలయింతురు పెండిలిలో సదస్యసం
భావనవాఁడు చూడవలె బాపన సాముల సాము లన్నియుం.

అనునది చేఁగొనవగును. ఇట్టి లలితరమ్యహాస్యమున కెంతయేని తావుకలదు ఆంధ్రసారస్వతమున.

ఈసందర్భమున తిరుపతివేంకటకవులను మన మెన్నఁటికిని మఱవరాదు. శ్రీనాథుని తరువాత, అతనికంటె మిన్నగా విరివిగా హాస్యముపయోగించి ప్రబంధములు రచించినవారు ఆంధ్రకవీశ్వరులలో వీరే. శత్రుతిరస్కారమునకు హాస్య మాయుధముగ నెడపడప నుపయోగించిన వారే యయ్యు వీరు పలుతావుల మనోహరహాస్య రససంపోషణమొనర్చి ఆంధ్రభారతికి అలంకారములను ఆరోగ్యమును చేర్చి కూర్చినారు. ఉదాహరణముగా రెండుమూఁడు పద్యరత్నములు చేకొననగును.

మ. ఒకయేగానికిఁ జిన్నిపుట్టినికి నాయుష్కర్మ చేయుంచి దా
నికినైకాని యొసంగి 'లెక్కసగముం దెమ్మన్న' 'నాచేత లే
దకటా!' నాఁగను క్షౌరపుంగృతికిఁదా నంగీకృతిం జొన్పె లో
భ్యనులాయమ్మగు ముద్దరాలి చరితం బాలించితే తిర్పతీ.

ఉ. గారెల పిండివంటకయి కాంతుఁడు కాంతను బ్రచ్చనేయ నా
సారసనేత్ర ఱ్రేలొకటి చయ్యనఁజూపి 'యిదొక్కఁ డున్నదా
ధార' మటన్న సామెతగ ... ... ... ... గీరతము.

శ్రీబాలజ వైకవేద్యమ్ములగు నిట్టికథలు సంభాషణశైలికిమిక్కిలి సమీపమగుశైలిలోఁ జెప్పి మందహాసము కల్గించుటయే వారి ప్రతిభ, అదియే వారొనర్చు చమత్కారము. ఇట్టి వినోదకథలఁ జొప్పించి హాస్య ముజ్జీవింపఁ జేయుటయేకాక 'వైదిక చాదస్తము'-'మండలలోఁ బాండిత్యము' 'యంబ్రహ్మ' 'కొండుభొట్లుకుఁ బరీక్షా'-'గడేకారు'-మొదలగు నవ్యతాలిమాటలలో లలితహాస్యము పోషించియున్నారు. ప్రబంధములలో నింతసొంపుగా నింపుగా హాస్య ముపయోగించిన వారు మఱి ఆంధ్రకవులందు లేరు. ఈవిషయమున శ్రీనాథుఁడు గూడ వీరికిఁ దీసికట్టే.

'ప్రతాపరుద్రీయము'-'కన్యాశుల్కము'-'వరశుల్కము'- ఈ మూఁడును హాస్యరసప్రధానములగు ఆంధ్రనాటకరాజములు. ఇవి ఆంధ్రజనాదరణము బడసినవి. అయినను వీనియందలిహాస్యము సర్వోత్కృష్టమనుపాపమునకు నే నొడిఁగట్టఁజాలను. సులభసుందరగ్రాంథికభాషనడుమ స్వరయుక్తమగు గ్రామ్యభాషను తురకషష్టినిఁ జొన్పి మాటలాడించి నవ్వించుటయే ప్రతాపరుద్రీయమందలి హాస్యము. తెలుగుముక్కలతో వచ్చిరాని ఇంగ్లీషు ముక్కలు గుచ్చెత్తి దొర్లించి పాత్రలచే మాట్లాడించిహాసప్రహాసముల జనింపఁ జేయుట కన్యాశుల్కమునందలి నవ్వునకుఁ గారణము. అరవ తెలుఁగువలన వరశుల్కనాటకమున హాస్యము పోషింపఁబడినది. మూఁడు నాటకములలోఁ గూడ హాస్యము గ్రామ్యభాషవలనను, 'నానాభాషలసంకర సోమయాజుల' కలగాపులగపుఁ దెలుఁగువలనను కలుగుచున్నది. అంతియే కాని గ్రంథకర్తల రచనాసామర్థ్యముచేఁగాని, హాస్యరసప్రవీణతచేఁగాని, ప్రజ్ఞాచమత్కారముచేఁగాని కల్గుటలేదని ఘంటాపథముగ వాకొని వాదింపవచ్చును.

హాస్యరసతారాపథమున శుక్రతారయై, ఆంధ్రసారస్వతమున హాస్యరసక్షామమును బోద్రోలిన పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులువారిని హాస్యరసవిషయకమగు నీవ్యాసమున నింత వఱకుఁ దలపెట్టకుండుట మహాపాతకము. పంతులవారు హాస్యరసప్రయోగమున కూలంకషప్రజ్ఞాధురీణులు. హాస్యరసమును సర్వతోముఖముగ వాడియున్నారు. ఈవిషయమున వారు చొరబారని దారులు లేవు. నాట్యముచేయని సారస్వతరంగములు లేవు. వారుముట్టని విషయములు లేవు. వారెత్తికొనని ప్రస్తావనలు లేవు. హాస్యరసవిషయమున వారన్నియు నుచ్ఛిష్టము గావించి వదలివేసిరి. ఇఁకముందాంధ్రకవులెవరు హాస్యరస ముపయోగించినను బంతులుగారి ననుసరించుటయే యగును. వీరిహాస్యరసమును విభాగించి విమర్శించుట తలకు మీఱినపని. అయినను ఆంధ్రసారస్వతపురోభివృద్ధి నుపలక్షించి నాయోపినకొలఁది విభాగించి విమర్శింప యత్నింతును. నవ్వు జనింపఁ జేయుటకు మార్గములు తలవెంట్రుకలన్ని. అందు ముఖ్యమైనవి చేకొని పరామర్శింతము. గ్రంథమునందు వచ్చుపాత్రములు చేయుకార్యములచే హాసము జనింపఁజేయుట యొకమార్గము. ఈమార్గమును వీరు 'కంఠాభరణము'-'సరస్వతి' నాటకములందుఁ ద్రొక్కియున్నారు. గ్రంథకర్తవచనరచనాచమత్కారముచే, కలగాపులగపుఁ దెనుఁగుచే నవ్వించుట వేఱొకమార్గము. ఇట్టిది వీరిగ్రంథములందు సర్వత్ర సాధారణముగాఁ గానిపించుచునే యుండును. ఒక నిదర్శనము. వంటలవాఁడనై పొట్టల నట్టెట్టో గడుపుచున్నా ననుటకు బదులు- 'అసావాదిత్యోబ్రహ్మ' యన్నట్లుండ్లొకతెయుగుడుగా 'మహానసాంతరచిత్రాన్నదధ్యోదనరచనాసమర్థుఁడనై' యున్నా ననుటచే నెవనికి నవ్వురాదు? సంఘదురాచారములఁ బరిహసించి హాసింపఁజేయుట యింకొకమార్గము. ఇది వీరి 'సాక్షి' వ్యాసరాజములందుఁ గావలసినంత ప్రతిపక్షులపైఁ బగదీర్చికొనుటకు వారిగ్రంథములఁ బరిహాసపాత్ర

ములుగఁజేసి నవ్వించుట వేఱొకమార్గము. ఇది వీరి 'విమర్శాదర్శ)మర్శాదర్శము'న కానవగును. ఈప్రతిపక్షదూషణ వివయిక హాస్యము మనకు ఆదికవి నన్నయ, సూరకవి, కూచిమంచిసోదర వులు నేర్పినది. దీనినే వీరేశలింగముపంతులు కొక్కొండవారిపై ప్రయోగించి ఆధునికయుగమున ఇట్టిహాస్యప్రయోగమునకుఁ బితామహులైనారు. ఈవిషయమున అతికిఁ బరుగిడక హాతాదుగా నుండి నందులకు లక్ష్మీనరసింహారావు పంతులుగారు స్తుత్యులు. సర్వతోముఖమగు వీరిహాస్యము ప్రత్యేకించి విపులముగా విమర్శింపవలయునే గాని ఇట్టి చిన్నివ్యాసమున అంటీ అంటనట్లుగా నాపాతమాత్రముగా తాఁకి వదలవలసినది కాదు.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిని మఱియొక్కసారి స్మరించకగాని ఈవ్యాస ముపసంహరించుటకు నామనస్సొప్పదు. రూపకములందలి వీరిహాస్యము రుచిరమును, లలితమును, నవీనమును గాకపోయినను వీరినవలలయందు సర్వోత్కృష్టము - సర్వజనాహ్లాదకరమునగు హాస్యము తాండవించుచుండును. ఆంగ్లకవిశేఖరుఁడగు ఛార్లెస్సు డికెన్సువలె వీరు నవలలందు తేలికహాస్యము నెడనెడ వాడి చదువరుల డెందమున. కమందానందము సంధానింతురు. వర్ణనలయందును సంభాషణలందుం హాస్యరసము మేళవించి పండితకోటిని మెప్పించుటయే వీరిప్రతిభ. వీరి 'హేమలత'— 'రామచంద్రవిజయము'— 'రాజరత్నము'—లందు రుచిరము, లలితము, నవీనము, నగుహాస్యరసము సదృశముగాఁ గూర్పునేర్పుతోఁ బోషించియున్నారు. వీరి 'గణపతి' హాస్యరసమున కవధి. లక్ష్మీనరసింహద్వయ మాంధ్రసారస్వతమునకు హాస్యరసాలంకారములు సంపాదించుటలో నాంధ్రులకృతజ్ఞతకుఁ బాత్రులు. వారిగ్రంథములను తఱచు చదివి, అందలి ఆనందరసాస్వాదనసౌఖ్యలహరిలో మనమోలలాడుచుండుటయే వారికి మన మొనర్చు ప్రత్యుపకృతి.

నిర్దుష్టము, నిరుపమానము నగు హాస్యరస గ్రంథరాజములతో లక్ష్మీనరసింహద్వయ మాంధ్రభారతికి నివాళు లొసంగుచుండ డబ్బుకక్కుర్తికైకొందఱు 'తగుదుమమ్మా'యని హాస్యరసగ్రంథరచనలో వ్రేలు పెట్టి ఆంధ్రభారతికి వికారరూప మాపాదించుచున్నారు. ఆంధ్రసారస్వతపురోభివృద్ధి నభిలషించువారి కిట్టి 'చిల్లరవాఙ్మయ నిర్మాణము' చిచ్చుఱపిడుగు తలచినట్లుగా హృదయవేదన కల్గించును. ఇట్టి గర్హ్యహాస్యగ్రంథములు వ్రాయుట హాస్యరసబాల్యావస్థను దెల్పునుగాని పరిపక్వస్థితిని వెల్లడిచేయఁజాలదు. ఈహాస్యము రామరాసబూతులలో దిగుచు, జగ్గకవికాలమును తలఁపించుచు, ఏమిచెప్పుదుం గురునాథా' అనిపించుచున్నది. ఈ 'చిడుముపొక్కుల సింగారము'- ఈ 'చిల్లరవాఙ్మయము' సత్వరముగా మొదలంట వదల్చుకొనకుండిన చోఁబెచ్చుపెరిఁగి ఆంధ్రసారస్వతమునంతను బచ్చుముపాడొనర్చును. హాస్యరసమను పేరితో ఆంధ్రసారస్వతమహావృక్షమునకు వేరుపురుగుగానున్న ఈ 'రైలువాఙ్మయము' నాకనుచ్చువలె విడిపోయి మాడిపోవుటకు ఆంధ్రులు తపస్సు ధారవోసి లబ్ధమనోరథులై ఆంధ్రభారతి ఉపలాలన లందికొని ఉత్తము లగుదురుగాక!

## వేఁకువ

### శృంగారకవి సర్వారాయఁడుగారు

దీకొని కొక్కొరో యనుచుఁ దేఁకువఁ గూయఁగ నాగెఁ గోళ్లుఁ, లోఁ
దాఁకిన బత్తి మేల్కొలు పుతానము లార్యులు పాడుచుండి, రెం
తే కమలానుమోదముల దేలిన వాయువు వీచుచుండె, ఘం
టాకలనాదమున్ ఘణఘణస్థితి మ్రోగుచు విన్పడెం గడుం,
గాకులు కావుకావు మని గాఢతరధ్వనిఁ గూయఁజొచ్చెఁ, బెన్
గేకలఁ బిల్చుచుం జని రొగిం బనిపాటుల కేగువారు, కన్
చీఁకటి మాయఁగాఁ దొడఁగెఁ, జీపురుగట్టలచప్పు డెల్లెడన్
బ్రాఁకె, బుడుంగు, బుడ్గు మనుభాండనినాదము నిండె, జవ్వనుల్
వాకిళు లూడ్చి ముగ్గులిడువారలు, కొందఱు నీళ్లబిందెలన్
జేకొని పోవువారు, కొని చెచ్చెరఁ దెచ్చెడువారు, పిల్లలన్
వేఁకువయయ్యె లెండనుచు నిద్దురలేపెడువారు, నైరి; యాఁ
గాకని లేచి బైటికి, షికారునకుం, జనువారు, పుల్లలన్
గైకొని పల్లుదోముకొనుగాణలు, తోఁచిరి; స్నానసంధ్యలన్
మేకొని చేసి నెన్నుదుటనిండ విభూతిని బూసి వైదికుల్
ప్రాకటకార్యులైరి; యిటులిం దనరారి నిశాంత మెంతయున్
శ్రీకరమై విధాత్రనవసృష్టికి నాది యి దంచుఁ దెల్పెడున్॥

# Kaminia Oil

**(Registered)**

**The best & the most brilliant hair oil of the world delicately perfumed.**



చెన్నపురిలో నున్న ఇండియన్ పేట్రియేటు యిటు వ్రాసినది:— కామినియా తైలమును గురించియే ప్రతిగృహమునందును మాట్లాడుచున్నారు. ప్రతిపురుషుడు, స్త్రీ దానిని గుఱించి వినుటయేగాక, దాని సువాసనను, ఎచ్చట అది విక్రయమునకు దొరకునది కూడ బాగుగా తెలిసికొనియున్నారు. దానియొక్క మంచిగుణములు, పరిమళము, యివిగాక యితర మంచి గుణములు మున్నగునవి చేరి అది జనానురంజకమైనది. దాని ఉపయోగముచే గలిగిన గుణములు మిక్కిలిమనోహరముగాను, అకర్షణీయముగా నున్నవి.

ఖావాజాఘోలంపిర్, 54, మహోవాహోలి, డక్కా యిట్లు వ్రాయుచున్నారు:- నేను 6 మాసములనుండి మీ కామినియా తైలమును వాడుచున్నాను. అది మిక్కిలి చులుకు గలది, మెదడును చల్లగా నుంచును. నేను అనేక తైలములను వాడితిని గాని యిది ఒక్కటి మాత్రమే నాకు తృప్తిని కలుగజేసినది. దయచేసి 3 బుడ్లు కామినియా తైలమును పంపకోరెదను.

ఠాకర్ సాహెబ్, బహద్దర్ ఆఫ్ కేరా ఎస్టేటు యిట్లు వ్రాసిరి:- మీరు దయచేసి సుప్రసిద్ధమైన మీ కామినియా నూనె 6 బుడ్లను వి. పి. పి. గా మా విలాసమునకు పంపకోరెదను. దానియొక్క సుగుణమును మంచి సువాసలను పొగడక మానముగా ఉండజాలను.

# వసుచరిత్రము - చంద్రికాపరిణయముల కథావస్తునిర్మాణము

శ్రీ శేషాద్రి రమణకవులు

తెలుఁగుభాషలలోఁ బ్రబంధయుగము పినవీరభద్రుని శాకుంతలముతో మొదలుపెట్టఁబడిన దని కొందఱు, అల్లసాని పెద్దనార్యుని మనుచరిత్రముతో మొదలుపెట్టఁబడిన దని మఱికొందఱు, శాసించియున్నారు. దూరమాలోచించితి మేని శ్రీనాథమహాకవి శ్రీహర్షనికృతమగు నైషధము నాంధ్రీకరించుటతో నారంభింపఁబడె నని మావిశ్వాసము. పెద్దనార్యుఁడు శృంగార నైషధమును దృక్పథమునం దుంచి మనుచరిత్రమును రచించెను. పినవీరభద్రుఁడు నామసామ్యము సైతము గ్రహించి శృంగారశాకుంతలము ప్రబంధ ఫక్కిలో విరచించెను. తరువాతికవులందఱు, తమతమ గ్రంథములలో శ్రీనాథుని శైలి సైతము తలఁదాల్చి సాంస్కృతికజటిలమగు భాషలోఁ గవిత వ్రాయసాగిరి.

ప్రబంధయుగమున దలసూపిన గ్రంథములలో నెన్నఁ గొనఁదగినది వసుచరిత్రము. ఏతద్గ్రంథకర్తయగు రామరాజభూషణుని ప్రశస్తి యెఱుంగనిరసవిదు లుండరు. శ్రీకృష్ణదేవరాయ మరణానంతరము సదాశివరాయలను నామమాత్రమునకు రాజును జేసి యాంధ్రరాజ్యచక్రమును ద్రిప్పిన రామరాజు నీరామరాజభూషణకవి కృత్యాదికములచే రంజింపఁ జేసి సత్కారము లొందినటులు వసుచరిత్రమునఁ గలదు. ఇంతియగాక విద్యానగరపతనానంతరము తిరుమలదేవరాయలు రాజధానిని పెనుగొండకు మార్చుటయుఁ బిమ్మట నతనికుమారుఁడగు వేంకటపతిరాయలు మహమ్మదీయులచేఁ బరాభూతుఁడై చంద్రగిరిదుర్గము చేరుటయు వసుచరిత్రమునఁ జెప్పఁబడుటచే వసుచరిత్రము రామరాజునంత్యకాలమున వేంకటపతిరాయలరాజ్యారంభమునందు (అనఁగా క్రీ. శ ౧౫౬౦ మొదలు ౧౫౭౦ వఱకు గ్రంథరచన మొనరించుచు,) ప్రసిద్ధుఁడగు రామరాజభూషణునిచే రచింపఁబడెనని చరిత్రకారులు విశ్వసించుచున్నారు. రసభావములయందు శ్లేషయమకాదులయందు నద్వితీయమగు వసుచరిత్రమునకుఁ బిమ్మటఁ బెక్కు ప్రతిబింబకావ్యములు బయలువెడలెను. అట్టివానిలో మొట్టమొదటిది చంద్రికాపరిణయము.

కావుననే చంద్రికాపరిణయమునకు వసుచరిత్రమునకు నెక్కుడు సంబంధము గలదు. చంద్రికాపరిణయమును జటప్రోలుసంస్థానపరిపాలకుఁడును రేచెర్లగోత్రీయుఁడునగు సురభిమాధవరాయకవి రచించెను. ఈమాధవరాయకవి అళియరామరాజువలన సంస్థానపు సనదు నొందెను. మాధవరాయకవిపుత్రులు గోలకొండనవాబగు అబ్దుల్ హాసను కుతుపుషా (తానీషా) వలన ఫసలీ ౧౦౯౬లో (క్రీ. శ ౧౬౮౬) సంస్థానపు సనదు నొందియున్నారు. ఇవియన్నియు సమన్వయించితిమేని మాధవరాయకవివర్యుఁడు భట్టుమూర్తికి సమకాలికుఁడై వసుచరిత్రమును స్వయముగఁ జూచి పఠించి ఆనందించి యావలచంద్రికాపరిణయమును రచించినట్టు లూహింపవచ్చును: సురభివంశచరిత్రకారు లుదాహరించిన ఈ క్రింది

"చ. సురభికులామలాబ్ధిఁ బొడసూపినమాధవరాయచంద్రుఁ డా
సరసపదార్థరంజనము సత్కవిహృద్యము గాఁగఁ జంద్రికా
పరిణయముక్ రచించె నది భావ్యము నీవసుచర్య చూడఁగాఁ
బరఁగెనిగూఢవృత్తి నటువర్తిలె నీకును మూర్తినాముఁడే॥"(?)

అను పద్యమువలన జంద్రికాపరిణయము రచించినటులు గూడ స్పష్టమగుచున్నది. మాధవరాయకవి కాలనిరూపణము చేయుటలోఁ బలువురు పొరపడి యింక నాధునికుఁడని చెప్పియున్నారు. ఆచరిత్రాంశము లన్నియు మానిజామురాష్ట్రాంధ్రకవులచరిత్రములో విరళముగాఁ జర్చింపఁబడును. జటప్రోలు చెంతనున్న బట్టుపల్లియే రామరాజభూషణుని నివాసస్థలమనియు నీయుభయకవులు పరస్పరపరిచయముగలవారని సైతమొకానొకరు వ్రాసియున్నారు. ఎట్టులైననుమల్ల

భూవిభునకు భర్తృహరిసుభాషితము నంకితముగా నొసంగిన యెలకూచిబాలసరస్వతి, మాధవరాయలు, రామరాజభూషణులు సమకాలికు లనుటలో సాహసము లేదు. వసుచరిత్రమును జూచి మాధవరాయలు పలుమాఱు పఠించి యట్టిశైలితో నేదేని గ్రంథరాజము రచింపవలయునని సంకల్పించి చంద్రికాపరిణయమును వ్రాసియుండును. కావున నే చంద్రికాపరిణయములోనిపద్యములు వసుచరిత్రకథాంశములోని పద్యముల యనుకరణమును చాటుచుఁ గొన్నిచోటుల సారహీనములుగ నున్నవి. మాధవరాయకవి చంద్రికాపరిణయమును వసుచరిత్రమువంటి శ్లేషగ్రంథముగ నొనర్పనెంచెను. కాననే పరస్పరసాదృశ్యము నెలకొనినది.

ఇంతవఱకుఁ గవికాలము సమకాలికులు కవినివాసవిశేషము మాత్రమె చర్చించితిమిగాని చంద్రికాపరిణయము కేవలకవితాగ్రంథమా, కథాగ్రంథమా, సాహిత్యగ్రంథమా యనునంశమును జర్చింపలేదు. ప్రబంధయుగమును స్మరించునపుడు కవికాలనిరూపణముతోఁ దృప్తినొందక ఔచితీపోషణము రసవిశేషము, కథాకల్పనము గూడ విమర్శించుట యుక్తము. చంద్రికాపరిణయమునఁ గథాకల్పన మెట్లున్నదో యందలి ముఖ్యకథాంశముల కేగ్రంథము మాతృకయో స్వతంత్రభావములపట్ల నీకవి యెంతవఱకుఁ గృతార్థుఁడయ్యెనో తెలిసికొందము. ఇంతవఱకు మనము చంద్రికాపరిణయమునకు వసుచరిత్రమునకుఁ గల కథాసంబంధమును జర్చింపలేదు. వర్ణనసందర్భములలోఁ గలసామ్యములఁ దెలిసికొంటిమి. కథాకల్పనమున నీ యుభయగ్రంథములకుఁ గలసామ్యము తెలిసికొందము. ముందు వసుచరిత్రమే జనించిన దగుటచే నందలి కథాంశమును బరిశీలించి పిమ్మటఁ జంద్రికాపరిణయమును బరింతము.

వసుచరిత్రము కేవలము లక్ష్యగ్రంథము. అందుఁ గవితాపరికరములు చాలినన్ని లేవు. శబ్దాలంకారములు, శ్లేష, వైదగ్ధ్యము, వర్ణననైపుణ్యము, పదాడంబరము మాత్రమె కానవచ్చును. ప్రతిపద్యము నూతనభావమును వెల్లడించును. రసము వెదఁజల్లును. భాషామాధుర్యము తేటపఱచును. కాన, యాపద్యరత్నములు కథాసూత్రముతో గ్రుచ్చ వీలుపడదు. భట్టుమూర్తి సాహిత్యరసపోషకుఁడు - సంగీతసాహిత్యనిధి. వసుచరిత్రములోని ప్రతిపద్య మాయంశమునే వెల్లడించును. సాహిత్యరసపోషకునకు రసపోషణమున నేమి కొఱంత? భట్టుమూర్తి సాహిత్యసముద్రము మథించి పద్యరత్నములను బ్రోగుచేసెను. సానఁబట్టెను. క్రొత్తమెఱుంగులు వెలయించెను. లాభమేమి? సారస్వతపీఠము పాలించుభారతికి రత్నములరాశి నొసంగెఁ గాని, కథాసూత్రమున వానిని నందచందములతో గ్రుచ్చఁజాలకపోయెను. కవితాశిల్పమునకుఁ గథావస్తువు ప్రధానమని రామరాజభూషణుఁ డెఱుంగనివాఁడు కాఁడు. అతఁడె వసుచరిత్రమునందు

ఉ. "కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరిఁ బుట్టురత్నము లవారితసత్కవికల్పనావిభా
పావహపూర్వవృత్తములు సానలుదేరినజాతిరత్నముల్
కావున నట్టిమిశ్రకథగా నొనరింపుము నేర్పువెంపునన్."

అని చెప్పియున్నాఁడు. కళాపూర్ణోదయమువంటి కల్పనాప్రబంధముల భట్టుమూర్తి యామోదించువాఁడు కాఁడు. కథావస్తువు స్వల్పముగాఁ గల్గి సమయోచితవర్ణనములతోఁ గథావిస్తరముతో నున్నవగు మనుచరిత్రాదులపై గౌరవబుద్ధి కలవాఁడు. కాని వసుచరిత్రములో నీతఁడు క్రొత్తత్రోవఁ ద్రొక్కెను. స్వల్పకథాంశమును వర్ణనములతో విస్తరింపఁజేసి చిత్రకల్పనములు కవితాశిల్పములు శ్లేషచిత్రములు సమకూర్చి కథావస్తువు నిర్జీవము గావించి పూర్వనియమములు చాలవఱకు జవదాఁటెను. వసుచరిత్ర మాఱాశ్వాసముల ప్రబంధము. ఇందు రమారమి 850 పద్యములు కలవు. సగముపద్యములు వర్ణనాంశముల క్రిందఁబోయి యుండవచ్చును. మిగిలినసగములోఁ గూడఁ గ్రంథాంశము కొలఁదిగ నున్నది. వసుచరిత్రములోఁ గవి తనశిల్పమును జూపినాఁడు గాని, కథానిర్మాణశక్తిని జూపలేదు. వసుచరిత్రమునందలి కథాంశమ్ముపై రసవిదు లింతవఱకంతగా బుద్ధిఁ బోనిచ్చి యుండరు. అందలికథకు జీవకళ లేమియే దీనికి హేతువు. నైమిశములో శుకశౌ[illegible]

దులు సూతుని గాంచి "యేరాజు దేవచిహ్నములతో భూమిఁ బాలించెనో తెలుపు" మన, నాతఁ డా శ్రోతలకు వసుచరిత్రముఁ జెప్పనారంభించెను.

అధిష్ఠానపురపాలకుఁడు వసురాజు. ఈతఁడు తన పురిచెంతఁ బ్రవహించు శుక్తిమతిని గోలాహలపర్వతము అడ్డగింపఁగాఁ గినిసి దానిని గోట మీటి దూరముగఁ బాఱఁదోలెను. తరువాత నా శైలమును గేళిశైలముగ శుక్తిమతిని గేళీసరస్సుగ నుపయోగించుకొనెను. ఇంతలో వసంతము వచ్చెను. వసంతసందర్శనమునకు రాజు చెలికానితో వనముల కరిగెను. ఇది ప్రథమాశ్వాసములోఁ గలముఖ్యకథ.

ఇఁక ద్వితీయాశ్వాసమునను తృతీయాశ్వాసమునను రాజు వనములోఁ బ్రవేశింప విదూషకుఁడు వనమును వర్ణించి దాని గొప్పతనము రాజున కెఱింగించునంతలో నెటనో యొకమనోహరగానము విన వచ్చెను. రాజు గాన మెటనుండి వచ్చెనో కనుఁగొను మన నర్మసఖుఁడు మెల్లగ నేగి మణిభిత్తికలలోఁ బ్రతిబింబమును దర్శించి యువతి యొకతె పాడుచున్నటులు జెప్పి యామెసౌందర్యము రాజున కెఱింగించెను. రాజు మోహముగొని నర్మసఖునిసహాయముతో నచటి కేగి చాటుననుండి వారిని దర్శింపసాగెను. నర్మసఖుఁడు జపివేషము వేసికొని యాసతులనెలవున కేగి శ్లేషతోఁ దన వృత్తము నెఱింగించి మంజువాణివలన నాగాన మొనర్చిన బాల గిరికాదేవి యనియు నామె శుక్తిమతికోలాహలుల పుత్రి యనియు శుక్తిమతిని బంధము త్రెనుగావించి కోలాహలుని గోట మీటుటచే నింద్రుఁడు వసురాజునకు విమానాదిక మిచ్చెననియుఁ జెప్పెను. మాయాజపి యాగంతుక విషయములఁ జెప్పినటులు నటించి వసురాజును గిరిక చెట్టఁబట్టఁగల దనెను. ఆమె ప్రేమపారవశ్య మెఱింగి చెంత నున్నవసురాజును జేరఁబిలువ గిరిక సిగ్గువడెను. ఈసమయమునఁ దల్లి పిలువనంపుటచే గిరిక వెడలిపోయెను. వసురాజు మోహముచే మన్మథదూషణములోఁ గాలము గడపసాగెను.

చతుర్థాశ్వాసము:— గిరిక మోహముతో నవస్థపడుచున్నంతలో చెలికత్తెయగు మంజువాణి యాకాశయానములో వసురాజునొద్ద కేగి యదృశ్యాకారముతో వసురాజును దర్శించెను. అతఁడు మోహావస్థలో నుండ, మంజువాణి యటఁ గల మణిపుత్రికలలోఁ దా నొకతెయై నిలిచెను. వసురాజుమోహోక్తులు విని యతఁడు మూర్ఛిల్లినతఱిఁ దాఁ దెచ్చిన గిరికాహారము వసురాజుకంఠమున నలంకరించెను. వసురాజు హారస్పర్శమువలన మిగుల మోహావస్థలో నుండఁగా నపుడు మంజువాణి ప్రత్యక్షమై గిరికావృత్తాంతముఁ దెల్పి వీడ్కొని, "యతనివలన ముద్రిక నొంది తిరిగి వచ్చితి"ననియు "నిన్ను వసురాజు వరించు" ననియు గిరికకు నెఱింగించి యామెను తృప్తిపఱచెను.

పంచమాశ్వాసము:— ఇంద్రుఁడు కోలాహలుని దర్శింపరాఁగా నాతఁడు తనపుత్రియగు గిరికను జూపెను. ఇంద్రుఁ డామెను వసురాజునకిమ్మన నాతఁ డామోదించెను. పెండ్లి నిశ్చయ మగుటచే బేరంటమునకు మైనాకుఁడు హిమవంతుఁడు మేరుమందరరోహణాచలాదులు వచ్చిరి. ఇంద్రుఁడు వసురాజునొద్ద కీవార్తఁ దెలిపెను. గిరికను శృంగారించుటతో నాశ్వాసము ముగిసినది.

షష్ఠాశ్వాసము:— ఇందుఁ గథాంశము లేదు. రాజపుత్రుఁడు పెండ్లి కేగుచుండఁ బురకాంతలు మేడ లెక్కి చూచిరి. పెండ్లిసంరంభము మధుపర్కములు కట్నములు మున్నగువానితో వివాహము యథాశాస్త్రీయముగ ముగిసినది. కోలాహలుఁడు కూఁతును బుజ్జగించి యత్తవారింటికిఁ బంపెను. అధిష్ఠానపురప్రజలు పెండ్లికి మార్తైను జూడనార్భాటపడుటతో గృహప్రవేశముతో సంభోగవర్ణనముతోఁ గథాంశము గట్టెక్కినది.

ఇది వసుచరిత్రములోని కథాసంగ్రహము. నర్మసఖుఁడు రెండవయాశ్వాసములో వచ్చెను. కాని ప్రయోజనము శూన్యముఁ జేసి యాతని గ్రంథకర్త యదృశ్యము గావించియున్నాఁడు. వసురాజుతో నీతఁడు గృహప్రవేశము గావించి కథారంగమునుండి యంతర్ధానమయ్యెను. వసురాజుపరాక్రమాదులు కవి ప్రథ

మాశ్వాసములోఁ జాలవఱకుఁ జెప్పెను. అంతతోఁ దృప్తినొందక మంజువాణిచే మరలఁ జెప్పించెను. మంజువాణి చెప్పుటలో విమానము నింద్రునివలనఁ బొందిన విశేషాంశ మొక్కటి మాత్రము కలదు. దానిని బ్రథమాశ్వాసములోఁ గవియే చెప్పినను, బ్రథమాశ్వాసములోని వసురాజువృత్తాంతము మంజువాణిచేఁ జెప్పించినను, గథకుఁ బునరుక్తిదోషము తొలఁగియుండెడిది. భట్టుమూర్తి సాహిత్యరసపోషక చక్రవర్తిగాని కథానువర్తి కాఁడుకదా!

ఇట్లు స్వల్పప్రసక్తులు పురస్కరించికొని గిరికావర్ణనము సైతము మూఁడుమూఁడులు ప్రత్యేకస్థలములలోఁ గావింపఁబడి యున్నది. మంజువాణి సామాన్యకాంత. ఈమె యాకాశగమనము గావించుటయు నదృశ్యాకారముగ వర్తించుటయు, మానవధర్మమునకు వ్యతిరేకము. వసురాజునకు విమానయానశక్తిఁ దెలుపుటకుఁ బ్రబంధము నిర్మింప సాహసించిన యీ గ్రంథకర్త మంజువాణిశక్తిసామర్థ్యములను నుగ్గడింపక పోవుటకు హేతువు మృగ్యము. స్వల్పప్రయాణముతోఁ జేరఁదగిన విశాలాపురము మంజువాణి యాకాశయానముతో నేగుటలో విశేషము కానరా[illegible] స్వల్పఫలమునకై కామరూపముఁ జిత్రాకారధారణముఁ జేసితినని మంజువాణి చెప్పికొనుటఁ జూడ గిరికాదేవి నూ[illegible]చుటకై యట్లు మృషావాదము గావించుచున్న[illegible] యని స్ఫురింపఁదగినంత గొప్పగ నున్నది.

నదులు పేరటాండ్రుగను శైలరాజములు పెండ్లిపెద్దలుగనువచ్చిరి. ఈయస్వాభావికకథ యమృతమువంటికవితతో సంగత మగుటచే నిర్జీవములగు పాత్రములు చాలవఱకు సజీవములైనవి కాని కథాదోషముచేఁ బాత్రపోషణము కొఱఁతవడినది. కోలాహలపర్వతుఁడు శుక్తిమతియుఁ గలసికొనిరని మనము సొంతమాటలతోఁ జెప్పికొనినచోఁ బ్రకృతివిరుద్ధమగు నీసంబంధ మేమి యని తోఁచును. కాని యీకథాంశమును బఠించుతఱినిమాత్ర మాసందేహము తోఁపఁజాలదు! సాహిత్యరసపోషకునియమృత[illegible] ధారాశక్తి యున్నది. ఆశ్లేషలుగూడ సందర్భ

శుద్ధిగ నుంటచే గ్రంథము చేత నున్నంతవఱకుఁ గథాంశము నడుచుచున్నటులె కనపించును. ప్రత్యేకముగఁ గథాంశమును విడఁదీయుదుమేని నంద చందములు లేక యస్థిపంజరమువలెఁ గానవచ్చుచుండును. ఈ లోపమునకుఁ గథాంశమే కాక రామరాజభూషణుఁడు గూడఁ గొంతవఱకు బాధ్యుఁడు కాకపోఁడు.

ఆఱవయాశ్వాసమునఁ గథాంశము తక్కువ యననేల? లేనే లేదు. పెండ్లిసంరంభములు వర్ణించుటతోనే కడచిపోయినది. నాటకబీజముల నీప్రబంధములో భట్టుమూర్తి కొలఁదిగఁ బెట్టెఁ గాని వానికిఁ బ్రయోజనము కల్పింపఁజాలఁడాయెను. నర్మసఖప్రవేశము ఆశ్వాసారంభమున నుంచుట నాటకములలోఁ జూడనగును. ఇంతియెగాక విదూషకుని వేషధారణము యవనికావసరము విమర్శించిన నాకాలమున నాటకరచనముపైఁ గల కవుల యభిమానము కొంచె మేని వెల్ల[illegible]కాకపోదు.

ఇఁక బ్రకృత మనుసరింపవచ్చును. వసుచరిత్రమున కావల నెన్నియో ప్రబంధములు బయలువెడలినవి. తఱచుగా నన్నిటియందుఁ గథాంశ మింతియే-రాజవర్ణనము వేటకేగుట ఒకసుందరిని గాంచి మోహించుట విప్రలంభశృంగారము మన్మథదూషణము చంద్రదూషణము రాయబారములు పెండ్లివర్ణనము ఇంతతోఁ బోక యంతఃపురమునకు నింకఁ జొరవఁజేసికొని పడకటింటికి మనకవు లేగి యుగాంతరమునాఁటి యాదంపతుల గుట్లు బయట వేయుదురు. ప్రబంధములు చాలవఱకు వసుచరిత్రములోని వర్ణనములకుఁ గవితాచమత్కారములకుఁ గథాంశములకుఁ బ్రతిబింబము లగుటచేతనే యొకదానిని జూచి మఱియొకదానిని జూడ నవసరము లేకపోవుట తటస్థించినది.

ఈదోషము చాలవఱకుఁ గవులు సమకాలికు లగుటచేఁ జంద్రికాపరిణయమునకు సైతము సంభవించినది. కవి మిగుల వ్యక్తిగలవాఁడగుటచేఁ గథకుఁ గొన్ని నూతనరంగముల నెలకొల్పి స్వతంత్రమార్గములను దీసెను గాని వర్ణనములలో మాత్రము వసుచరితములోని పోకడల మఱచిపోఁజాలఁడయ్యెను. గిరికాదేవియుఁ జంద్రి

కయు నొకరి కొకరు ప్రతిబింబములై. ఇరువురు నొకవిధముగు వాఙ్మయసామగ్రితోఁ బోఁతపోసిన చిత్రరూపములే. గిరికాసంబంధముఁ గుదుర్పవచ్చిన యింద్రుఁడు, చంద్రికాసంబంధము నిశ్చయించిన కుముదుఁడుగను, కోలాహలుఁడు శుద్ధోదయమహారాజుగను, నర్మసఖుఁడు నర్మసఖుఁడుగను, వసురాజువసంతసందర్శనయాత్ర సుచంద్రునిజైత్రయాత్రగను, బోల్పవచ్చును.

కాని చంద్రికాపరిణయములోని స్వతంత్రకథాంశములనుమాత్ర మీకవి వెలితిపఱుపలేదు. శాండిల్యాగమము వసంతుని తపోభంగప్రయత్నము, గంధర్వుని సింహరూపధారణము, చంద్రికాస్వయంవర రాజవర్ణనము, స్వతంత్రకథాంశములు. ఇందు మాధవరాయకవి చాల వఱకుఁ గ్రొత్తబాటలఁ దీర్చి రసపోషణమునకుఁ జాల పాటుపడెను. వసంతతపోభంగము గావించుటకు మన్మథుఁడు కోకిలలు శారికలు తుమ్మెదలు మొదలగుబలముఁ గొని వచ్చెను. వసంతుఁడు మలయమారుతుఁడు దేవవేశ్యలు సహజసంరంభముతో నేతెంచిరి. మునితపస్సు సామాన్యప్రయత్నములతో భంగము కాదయ్యెను. శక్తిలోపములు లేక యందఱు పాటుపడిరి. వసంతుఁ డొకవిధముగను మలయానిలుఁ డింకొకవిధముగను దాడి వెడలిరి. అపుడు మన్మథుఁడు గావించినసంగ్రామము ప్రశంసాపాత్రమైనది. ఇట మన్మథుఁడు ప్రబంధకవులు చిత్రించిన సిగ్గుపడగునసంగుఁడు కాఁడు. శూరశిరోమణియగు వెలమవీరుఁడు. తీర్చిన పంచశరుఁడు. ఈతని సంగరసంరంభము శ్రావ్యము మనోహరము నై యున్నది.

వసంతమన్మథాదులు సంగ్రామము నిశ్చయించి వసంతునియాశ్రమమునొద్ద కేగ నిశ్చయించిరి. విరోధి నెలవు గనిపట్టివచ్చుట కొకవేగులవాఁడు కావలయును గదా! ఇందులకుఁ దగినవాఁ డెవఁడు?

ఉ. గురుజవశక్తి శబ్ది యొకకోయిల వేగరి తద్వసంతభూ
సురశిలకాశ్రయం బిడిసు చుమ్మని తెల్పఁగఁ గంతుఁ డందు నె
ర్తరసతితో నిజాప్తవరజాలముతో వసియించె. . . .

కోకిల వేగరితోడ్పాటుచే మన్మథుఁడు వసంతముని వనములో దరము విడిసెను. మన్మథునిచలి కాఁడును సేనానాయకుఁడునగు వసంతుఁడు మునివనము నంతయు నాక్రమించుకొనెను. ప్రతిపక్షకోటిలోనివారగు జాబిల్లి, ఆమని, గాడ్పు, అంచ మిగులఘాతుకకృత్యమునకుఁ దలపడి మునిని బలిమిమై ముట్టడించిరి.

సీ. శైత్యవత్కరకుంతచటులధారారేఖ
శమి వేత హాటించెఁ జలువమిన్న
తళుతళుక్కున వేగ జళిపించి మావిక్రొం
దళెపుగత్తి నిహాని నఱికె సురభి
కదుఁ జంచరీకసంఘము మ్రోయు ఘనజాల
కంబులనతి మొత్తె గడుసుగాడ్పు
కటురజోస్త్రికణాళి గ్రమ్మఁ జెండొనమందు
తిత్తుల మునిఁ గప్పె హత్తియుంచ.

ఇటు లెంతనిర్దయతోఁ దీవ్రభావముతోఁ దలపడినను శాంతికవచధారియగు మునిధైర్యము తఱుఁగదాయెను. ప్రయత్నము వ్యర్థమగుటచే మారునకుఁ గోపము వచ్చి "చననిసవాగ్రహస్ఫురణముతోఁ బరితేజితాబ్జముకుళాస్త్రపరంపర" నించెను. ఆశరములు మునిపేరెదఁ దాఁకి పరాగము సిందెను. భక్తికవచపుధూళివలె నది యుండెను. మన్మథుఁడు తన ప్రయత్నము వ్యర్థమగుటకుఁ గినిసి "పూమొగ్గనేజను తద్వటమున గుప్పునం బొడిచె." అంతతో నూరకుండక నిర్దయాత్ముఁడై "నూతనపలాశదళంబను బాఁకుదారచేఁ జలమున నయ్యతిఁ నఱకె సారససాయకవీరుఁడు." మన్మథుఁ డొనరించుపశుబలప్రదర్శనము ఆత్మబలశాలి య[illegible]వసంతమహామునియెడ ఫలశూన్యమయ్యెను. ముని బాధనొందఁ డాయెను. అప్పుడు చంద్రచందనపవమానులను బ్రేరేచి

కం. "నడచి యళిఘంటికాధ్వని
యడరఁ బరాగాగ్నికణచయంబులు వెడఁ
గను నపుడు రాగమును మను
బెడిదంబగు శక్తి వైచె భీకరలీలన్."

శక్తిప్రయోగము గావించెను. ఇది తిరుగు లేని దివ్యాస్త్రము. సాధారణాయుధము లశక్తములగుటచే మన్మథుఁడు నారాయణాస్త్రమువంటి శక్తిని బ్రయోగించెను. అళిఘంటికలు మ్రోఁగుచుండఁ బరాగాగ్నికణములు మిన్నుముట్టుచుండఁ బ్రయోగించిన యాబంధూకపుష్పశక్తి విశేషభయంకరముగ నుండెను. అదియు

నిష్ఫల మయ్యెను. మారుఁ డంతతో నూఱక యుండక, "మానితపారిజాతసుమనఃకలికాగద కేలనెత్తి యమ్మౌనిని మోఁదెను." గదాయుద్ధమునకుఁ గంజశరుఁడు పోటరియై మునిపైకి దుమికెను. వసంతమహాముని సాత్వికనిరోధము నారంభించెను. మన్మథుని ప్రయత్నము మంటఁ గలసెను. ఐనను శక్తి యున్నంతవఱకుఁ బ్రయత్నించుట విధి గావునను, వివిధాయుధములలో నొకటియేని పనిచేయదాయెను. విశ్వాసము చేతను మరల సంగరోన్ముఖుఁ డయ్యెను. వెంటనే యొరనుండి యాయుధమును బెఱికెను. "చెల్వగు గేదఁగి ఱేకుఁ జక్కటారంది యనూన రోషగతి నమ్మునిఁ గ్రుమ్మె మరుండు— మాన్యభుజాబల రేఖ హెచ్చఁగన్." అప్పటికి నతని ప్రయత్నము ఫలవంతము గాలేదు. క్రోధము తీఱలేదు. ఫలరహితుఁడై వేల్పుల మొఱ మితఁ డెటులు చూడఁగలఁడు? తనసర్వస్వమును వినియోగించి మరుఁడు గెలువనెంచెను. ప్రయత్నము విఫలమగుకొలఁది నుత్సాహము, క్రోధము మిక్కుటమయ్యెను. కడపటి ప్రయత్నము గాఢమైనది. దీనితో మన్మథుఁడో మౌనియో కృతార్థుఁడై తీరవలసినదే.

చ. సరసబలంబు గొల్వ నునుసాయకుఁ డంతటఁ బోక మౌని డా
పి రమణ మొగ్గయాక్ గుదిఁ జేకొని మొత్తి ప్రవాళసుక్ మహా
పరశువుఁ బూని వేయడిచి బాగగు నుంకెనవంకిఁ బట్టి ప
ల్లరములఁ గ్రుమ్మి యార్చె హిమధాముఁడు గన్గొని మెచ్చనయ్యెడన్.

గద, గండ్రగొడ్డలి బాకు [illegible]డింటిని వెంట వెంటనే ప్రయోగించి నానావస్థలు [illegible]చుఁ దపోభంగము చేయలేక యింకను బ్రయత్నింపఁజొప్పతఱి నాసంగ్రామములో మన్మథునటు లుండు మని చిత్రరేఖ శృంగారించికొని యాటపాటలతో నట్టహాసము చేయసాగెను. ఈయదను గనిపెట్టి మన్మథుని గవివర్యుఁడు మాటు పఱచెను. ఇది యొకవిధమగు నౌచితి.

మన్మథ ప్రయత్నములు సంగ్రామధర్మములుగ మార్చి కవి చూపిన శక్తి మనోహరముగ ననన్యముగ నున్నది. ఈకవి వసుచరిత్రమును లక్ష్యమునఁ దుంచుకొనక స్వతంత్రమార్గముననె పోయి యుండెనేని వాఙ్మయమున కొక యమూల్యగ్రంథరత్నము లభించునదియె గాని, ప్రతిబింబకావ్య మగుటచే మన కొకకృత్రిమరత్నము లభించినది. ఈ మాధవరాయకవి వ్యాకరణతర్కశాస్త్రములలో నభినివేశము గలవాఁడు. నిరర్గళమగు కవితాధార గలవాఁడు. ఐన ఫల మేమి? వసుచరిత్రము బలుమాఱు చదివి యందలి పద్యములఁ గంఠస్థముఁ జేసికొని యట్టి భావములతో మఱియొక గ్రంథము వ్రాయ సంకల్పించుటచే నాయనుకరణపద్యములు తృప్తికరముగ లేవు. స్వాతంత్ర్యమును జంపుకొనుట యాత్మవంచనముగదా? ఆత్మవంచనమునకు సాహసించినచో నన్నియు విషమించును. కాఁన స్వతంత్రపద్యములకుఁ గల శైలిధారాళము, శబ్దపుష్టి, రచనామాధురి, స్వాభావసౌకుమార్యము, ననుకరణపద్యము యెడఁ గానరాదు. భట్టుమూర్తికి శ్లేషకవిత సహజమైనది. అతని దృక్పథము ముందు శ్లేషశబ్దములు తాండవించుచుండును. ఎట్టిదుర్ఘటకథాంశమునైన శ్లేషలతో నలంకరించి యందచందములఁ గూర్ప నేర్పు గలదు. తక్కిన కవుల కట్టిరచనము స్వాభావసిద్ధము. కాకపోవుటచేఁ గావ్యమున రచనవ్యత్యాసములు తెలియుచుగాఁ గానవచ్చుచున్నవి. చంద్రికాపరిణయమున వర్ణనాంశము లొకశైలిలోఁ గథాంశములు వేఱొకశైలిలో నున్నవి. దూరదృష్టిలేనివా రిందు నేచోక్కన్యాయమాత్యునో చొప్పింతురు గాని, బాగుగా నాలోచించినచో ననుకరణకవితకు సహజకవితకుఁ గలభేదము మాత్ర మాయాఘట్టములలో ద్యోతకము కాఁగలదు. ఇది యనుభవరసికులు దక్క తదన్యులు గ్రహింప వీలులేదు.

చంద్రికాపరిణయములో మనోహరములగు భావములుగల పద్యములు పెక్కులు కలవు. స్వాతంత్ర్యభావములేకవికిఁ జాలినన్ని కలవు. అనుకరణదృష్టి వసుచరిత్రముపై నేల యుంచెనో తోఁపదు. ఆంధ్రవాఙ్మయములో సుప్రసిద్ధకవు లనేకు లీయనుకరణపిశాచమునకుఁ దమ యుత్తమోత్తమగ్రంథముల బలి యొసంగియున్నారు. ఇట్టి దురాచారము పదునేడవ శతాబ్దారంభమునుండి వ్యాపించి భాషాప్రపంచమును క్షీణపఱచి క్షీణపఱచి యిప్పటికిఁ జాలవఱకు శాంతించినది. మన్మథుఁ డొనరించిన ఘోరసంగ్రామభాగము మాధవరాయకవి రసోత్తర

ముగ వర్ణించెను. ఇట్టివర్ణనములె స్వతంత్రములైనవి మఱికొన్ని యున్న వసుచరిత్రముకంటెఁ జంద్రికాపరిణయము గౌరవము సంపాదించునదె గాని మాతృక యగుటఁ బ్రకృత మర్యాస్థానము వసుచరిత్రమునకీయకతప్పదు వసుచరిత్రమున ధారాశుద్ధి పదప్రయోగ ప్రయోజనము చాలినంత గలదు. అందలి శ్లేషలు భట్టుమూర్తి యెఱవునకుఁ దెచ్చినవి కావు. ఆతనిపవిత్ర మేదస్సునుండి బయలు వెడలిన విద్యుత్కాంతులు. కథాప్రణాళిక చాలినంత లేకున్నను ప్రతిపద్యమున నొకశిల్పము కలదు. కావున పిల్లవసుచరిత్రములు సంస్కృతీకరణములు బయలు వెడలినవి. చంద్రికాపరిణయము వసుచరిత్రమువంటి స్వతంత్రశ్లేషగ్రంథము కాదు. మనుచరిత్రమువంటి కథాప్రాముఖ్యగ్రంథము కాదు. వసుచరిత్రము తెగలోఁ జేరిన శిల్పకావ్యమని చెప్పవచ్చును.

వసుచరిత్రమునఁ గల వర్ణనములన్నియుఁ జంద్రికాపరిణయములోఁ దూఁచినటులు గలవు. వసుచరిత్రములో వసంతమును దర్శింప వసురాజేగినటులు కలదు. చంద్రికాపరిణయములో సుచంద్రుఁడు తమిస్రదానవుని జంప బయలువెడలినటు లున్నది. వసుచరిత్రము ద్వితీయాశ్వాసము వసురాజనర్మసఖుల వనప్రవేశముతోఁ బ్రారంభింపఁబడినది. చంద్రికాపరిణయములోఁ గూడ నటులె సుచంద్ర నర్మసఖుల ప్రవేశముతో ద్వితీయాశ్వాస మారంభింపఁబడినది. ఇరువురు నర్మసఖులు నభేదముగ వనమును బరిమితపద్యములలో నొకే విధముగ వర్ణించిరి. వసంతశోభ దర్శింప వినోదార్థముగ నేతెంచిన వసురాజుద్యానసందర్శనములతోఁ గాలక్షేపముఁ జేయుట యుక్తముగ నున్నది. మునులబాధల వారింప శాండిల్యునియాజ్ఞ తలఁదాల్చి బయలు వెడలిన సుచంద్రుఁడు వసురాజుతోఁ బోటిపెట్టికొని యతనితో సరిగఁ గాలక్షేపముఁ జేయుట కథాసంవిధానమునకు బాధకము. సుచంద్రునితోఁ గుముదుఁడను దేవసంభూతుఁ డొకఁడు చంద్రికాసౌందర్యము విరివిగ వర్ణించి తెలిపెను. అంతఁ బోక తనవిమానముపైఁ జంద్రికయున్న తావునకు సుచంద్రుని గొనిపోవ నాయువును జూచి మరల సుచంద్రుఁడు దీర్ఘముగ వర్ణించెను. ఈయంశము వసుచరిత్రములోని నర్మసఖుఁడు గిరికాదేవిని వర్ణించుటకు వసురాజు గిరికాదేవిని జూచి వర్ణించుటకు సరియగు ప్రతిబింబము. గిరికాదేవి రాజకుమారుని మోహాగ్నిలోఁ ద్రోచి తల్లి వర్తమాన మంపుటచేఁ బోలేక పోలేక పోయినది. ఇటుఁ జంద్రికాపరిణయములోఁ గూడ నంతియ. పిమ్మట మోహావస్థలోనుండి తెప్పిఱిల్లి సుచంద్రుఁడు పూర్వాంశము మఱవక తమిస్రదానవునిపై కేగి వాని మడియించెను. మొదటనుండి వెంట నంటియున్న నర్మసఖుఁడు మధ్య యదృశ్యమయ్యెను. పాప మీనర్మసఖుఁడు సుచంద్రునితోఁ గుముదుఁడు పరిచయము చేసికొనువఱకుఁ గనిపించి యామహారణ్యమున నదృశ్యమైనాఁడు. మరల వానిగతియే తెలియదు. వసుచరిత్రములోని నర్మసఖుఁడు మెల్లగా నిల్లుచేరినాఁడు. ఈనర్మసఖునిగతి యేమాయెనో నేఁటివఱకు మనకుఁ దెలియరాదు.

ఇంతవఱకు మూఁడాశ్వాసములలోని కథను బరిశీలించితిమి. నాలవయాశ్వాసమంతయు యమకకవిత్వము. గ్రంథమంతయు నొకశైలి. యీయాశ్వాసమంతయు నొకశైలిగ నున్నది. ఇందు ధారాశుద్ధిగాని ధారాసౌకుమార్యముగాని కూర్పుబింకము గాని కానరాదు. దుర్ఘటములగు యమకములు నిర్వహింపఁబడినవి. వసుచరిత్రములో గతానుగతిగ వచ్చినవర్ణములన్నియుఁ గ్రోడీకరించి ప్రబంధమర్మములఁ గాపాడుటకె యీయాశ్వాసము కల్పింపఁబడినటులు దోఁచుచున్నది. ఇందుఁ గథాంశము లేదు. రాజమోహము కొంతసేపు; చంద్రికమోహము మఱికొంతసేపు. ఇరువురిప్రకృతులు మోహము ప్రవర్తనము బాధాభినయము నొక్కటియై నదియె. వసుచరిత్రములో రాజు వనవిహారము చేయునప్పుడు వచ్చిన వసంతమునకుఁ బ్రతిబింబము మాధవరాయ కవివర్యుఁడు జ్ఞాపకముంచుకొని నాలవయాశ్వాసమునఁ బ్రసక్తి కల్పించుకొని యేకరువుపెట్టెను. పూలుగోయుట వనవిహారము జలక్రీడలు మన్మథపూజ కేళీవనప్రవేశము సూర్యాస్తమానము వెన్నెలవచనము చంద్రమన్మథపవమానదూషణము సూర్యోదయము శిశిరోపచారప్రదర్శనము

లోనగు ప్రబంధసంప్రదాయములకె ప్రత్యేకించి యీ యాశ్వాసము వినియోగింపఁబడినది. ఇవియన్నియు నైనపిమ్మటఁ బ్రధానకథాంశము పంచమాశ్వాసమునఁ గొంత చేర్పఁబడినది. స్వయంవరభేరి మ్రోఁగింపఁబడెను, రాజకుమారులందఱు సభావేదికల నలంకరించిరి. కుణదోదయుని ప్రార్థనముచే గౌరీదేవి స్వయంవరాగతరాజలోకమును వర్ణింప నేతెంచెను. రాజలోకమును బార్వతి వర్ణించినపిమ్మట సుచంద్రునిఁ జంద్రిక వరించెను. పార్వతి కుణదోదయున కొకదివ్యమంత్రమును గటాక్షించెను. కుణదోదయుఁడు తన పూర్వపుణ్యము ఫలించినదని యానందించి యారాత్రికె వివాహలగ్నము నిశ్చయించెను.

తుదియాశ్వాసము షష్ఠాశ్వాసము. ఇందుఁ జంద్రికాభ్యంగస్నానము అలంకారములు చేయుట వివాహమండపమునకుఁ దెచ్చుట. సుచంద్రునకు నిటులె జరిగినవి. స్త్రీలే రాజు నలంకరించిరి. రాజును సందర్శించుటకుఁ బౌరాంగనలు మిగుల నార్భాటములు చేసిరి. ఇది యంతయు వసుచరిత్రమున జరిగినదియె. తుదకు వివాహమున సన్నెకల్లు త్రొక్కించుట పెండ్లిపెద్దలు దీవించుట తండ్రి తనయకు బుద్ధులు చెప్పుట యుచితవిధముగా నెఱవేఱిన పిమ్మట మగనితోఁ బెండ్లికుమార్తె యత్తవారింటికిఁ జేరెను. మఱలఁ బౌరాంగనలు పెండ్లికుమార్తెను జూడ సంరంభములు చేసి కొంతవఱకుఁ గృతార్థులైరి. సాయంకాలమునకు నిషేకముహూర్తము. రహఃక్రీడాగృహప్రవేశము. చంద్రికలజ్జాప్రచురణము సుచంద్రుని శృంగారక్రీడాప్రదర్శనములతో దాంపత్యధర్మములతోఁ గథ గట్టెక్కినది. మనము ప్రకృతాంశములోనికి వచ్చితిమి. ఈయంత్యాశ్వాసము చాలవఱకుఁ గథాంశమంతయు వసుచరిత్రమునకు ఛాయగనే యున్నది. ఇందు స్వతంత్రభావములు కొన్నిచోటులలోఁ గలవు. కాని కథాంశము కథాకల్పము భట్టుమూర్తి పాడిపాడి విడిచినదగుటచే నిందు జీవకళ చాలవఱకు మఱుఁగుపడియున్నది. భట్టుమూర్తికృతిలోఁ గథాంశమునకంటె సాహిత్యమునకె ప్రధానస్థాన మీయఁబడినది. వర్ణనములలో సహజములు చాలవఱకుఁ దక్కువ. అప్రతిమానమగు వసుచరిత్రకల్పనము మాధవరాయకవిహృదయమును దన్మయము గావించి యాతనిచే నట్టి యుత్తమోత్తమగ్రంథమును మఱియొక దానిని వ్రాయించినది. ఎంత ప్రతిబింబకావ్యమైనను జంద్రికాపరిణయమునఁ గవితాచౌర్యము గాని భావచౌర్యముగాని లేదు. రామరాజభూషణుని పోకడలు మాధవరాయకవి సార్వత్రికముగ ననుసరించి కథాకల్పనమునకుఁ బ్రాముఖ్యము తొలఁగించెను.

చంద్రికాపరిణయము — ఆంధ్రవాఙ్మయమున నుత్తమగ్రంథము. వసుచరిత్రమున కగ్రస్థానము, ద్వితీయస్థానము చంద్రికాపరిణయమునకు నొసంగవలయును. చంద్రికాపరిణయమె మాతృక యనియు వసుచరిత్రమె ప్రతిబింబకావ్యమనియు వాదించువారుండురు. వసుచరిత్రమునందున్నన్ని యమూల్యభావములు సహజమగు శ్లేషకవిత చంద్రికాపరిణయములోఁ గానరాదు.

చంద్రికాపరిణయములోని శైలి మూఁడుతెఱంగులఁ గానవచ్చుచున్నది. ఇది యంతయు వ్యత్యస్తములగువిషయములఁబట్టి వచ్చినదె కాని వేఱు కాదు. సహజముగ నడుచు కథాంశమున మాధవరాయప్రభువర్యుని శైలి శరత్కాలజీవనదివలె సమవేగముగ గంభీరముగ నిర్మలముగఁ బ్రవహించుచుండును. ఇట్టిశైలికి పద్యము నిదర్శనము గాఁగలదు.

“చం. అని ముని శాపమిచ్చిన భయంబు మనంబున నిండి యుండ న
య్యనఘునిపాదపద్మముల నయ్యెడఁ జయ్యన వ్రాలి భక్తి చే
కొని యిటులంటి నోనియమికుంజర! మీరు గతాగనుండనై
నను నను బ్రోవరయ్య కరుణాసదనంబగు మానసంబునన్.

అనుకరణభాగమున నన్వయక్లిష్టము, అప్రయుక్తపదప్రయోగము, పరుషపదఘటనము తఱచుగాఁ గానవచ్చుచుండును. ధారాళమగు శైలి కొఱఁతపడియుండును. చూడుఁడు.

చ.-అలతిఁ దద్గిరీంద్రతటికాంచనకాంచన మాలతీలతా
వలయలతాంతకాంతతరవాసనవాసనవానిలాళికల్
మలఁచివిభుండు వేడ్కఁ దనమానసమానసముజ్జ్వలాత్మ నె
చ్చెలిఁ గని పల్కె స్వర్ధునిసుమజీవనజీవనభేదనోక్తికన్.

Sri Saradasamajam, Fourth Annual Meeting and Laying of foundation stone, Anantapur.



శ్రీ శారదాసమాజ చతుర్థవార్షికోత్సవము, సమాజభవన శంకుస్థాపనము. 1928. అనంతపురము

Saradanikethanam Girls, Spinning yarn, Guntur.



శారదానికేతనము బాలికలు, నూలువడుకుట, గుంటూరు

Saradaniketanam Girls, Needlework, Guntur.



శారదానికేతనము బాలికలు, కుట్టుపనిచేయుట, గుంటూరు

Prathamakavi Pustaka Bhandagaramu, 1924, Gandhi Asramamu, Vemulavada.



ప్రథమకవి పుస్తకభాండాగారము, 1924. గాంధి ఆశ్రమము, వేములవాడ

Gopalakrishna Library, Ongole.



గోపాలకృష్ణ పుస్తకభాండాగారము, ఒంగోలు

Venkateswara Ayurvedic College, Bezvada.



వేంకటేశ్వర ఆయుర్వేదకళాశాల, బెజవాడ

శ్లేషకవితల చతుర్థాశ్వాసము భేదించుట చాల కష్టము. సాధారణపండితుల కాపద్యములు దురవగాహములని తెలుపుట సాహసము కాఁజాలదు. ఈయాశ్వాసమంతయు నారికేళపాకములో నిమిడియున్నది. శ్రమ చేసి భేదించినఁగాని రుచి తెలియదు. శైలి పరిశీలించిన నీవిషయము స్పష్టము కాఁగలదు.

మ. శరజద్వేషి నిశాకరుం డరణేచ్ఛన్ రాఁగ మున్మున్న బల్
త్వరఁ గాలోపధికారు లానుసవచంద్రజ్యోతిరాశీలస
త్పరివర్ణ్యస్వకవర్ణనిర్ణిహితచంద్రజ్యోతిరాశీలస
ద్గరిమం బెంపయి దోఁచెఁ బ్రాచి నవదాతత్వాట్టకాలం బయ్యెడన్.

మనుచరిత్రమువలెఁ జంద్రికాపరిణయము కథాప్రధానమైనది కాదు. కథాప్రధానముగఁ బ్రబంధములు వ్రాసి సమయోచితములుగ వర్ణనముల నిమిడ్చినచో వాఙ్మయమున కట్టికృతులు చాల సహాయకారు లగును. సాధారణముగ జనసామాన్యమునకు మనుచరిత్రమువలె వసుచరిత్రమును నింక నాతెగలోని యితర కావ్యములును రుచింపక పోవుట కందుఁ బఠనార్హమగు కథాభాగము లేకుంటయె ముఖ్యహేతువని చెప్పవచ్చును. వసుచరిత్రము బయలు వెడలినపిమ్మట నాంధ్రవాఙ్మయమున [illegible] మార్పు కలిగెను. ప్రబంధకవు లంద ఱాశైలియందు నానియమములయందుఁ దన్మయులై యట్టికావ్యములే రచింపసాగిరి. ఈ యుగారంభమున బయలు వెడలిన దగుటచేఁ జంద్రికాపరిణయమునందుఁ బెక్కు గుణములు కలవు. రామరాజభూషణుఁడు సాహిత్యమున సంగీతమున సామర్థ్యము గలవాఁడు. మాధవరాయప్రభువర్యుఁడు సాహిత్యముననే కాక శాస్త్రములయందుఁగూడ నఖండ పరిశ్రమకలవాఁడగుటచేఁ జంద్రికాపరిణయ ముత్తమోత్తమ గ్రంథమనఁదగియున్నది. వసుచరిత్రము ననుకరింపనిచో చంద్రికాపరిణయము వాఙ్మయమునఁ బ్రధానస్థానము నొందనదియే.

చంద్రికాపరిణయము కథాగ్రంథము కాదు. కవితాగ్రంథము కాదు. సాహిత్యగ్రంథము. ఇందు సాహిత్యపరిశ్రమము లెక్కువ గలవు. ప్రాచీనప్రబంధముల నెంతవఱ కనుకరణసంబంధము గలదో విమర్శింపవగును గాని యిందు నౌచితి పాత్రపోషణ విమర్శింపఁదగిన యవకాశము లేదు. కాన నాప్రసక్తి మానితిమి.

ఇట్టియుత్తమగ్రంథము మిగులఁ జక్కఁగ వ్యాఖ్యతో ముద్రింపించి పాఠకలోకమున కుచితముగ నందించుచు శ్రీ శ్రీ శ్రీ రాజా సురభి వేంకటలక్ష్మారావు వారికి పండితజనాభేద్యమగు నీకృతికి సమీచీనవ్యాఖ్య వ్రాసి యలరించిన విఖ్యాతయశులగు అవధానము శేషశాస్త్రి గారికి నాంధ్రప్రపంచము కృతజ్ఞతచూపు టావశ్యకము.

# కావ్యరచన

తాపీ ధర్మారావు పంతులుగారు, బి. ఏ.

గిరిమను శేఖరాగార మఖర్వ పరాక్రమమై భవనంబులన్
బరఁగడివేళ, మర్త్యులలపై సుఖముండి, కృతుల్ రచింపఁ "గ
ప్పురవిడె మాత్మకింపయిన భోజన మింక వదేది యేదియో
దొరకినఁ 'గాద" యంచు నొకదొడ్డ కవీశుఁడు సెప్పె నప్పుడో!

వరమది; యట్టులైనయు విభవంబు సదృష్టవశంబునన్ గణిం
చిరి మునువారు కొందఱు విశేష వివేక విలాసు; లందఱి
ప్పురుషునఁ దూఁగుటుర్విపుల భాగ్యము నందఁ బోసంగు టెట్టులే
వెరపున నట్టి సత్కృతులు వెల్వడఁ గాంతు మహాఠభావముల్?

అర్థము రసజ్ఞపాఠకుల నాముదుకొందు మరింప, నొక్కఁడే
ధరణి విశాల, కాలము తుదం గన నట్టిది, భావసామ్య మె
క్కరుఁడును గల్గఁడే? కృతినిఁ గాంచి ముదంబును బొంద నేటివా
రరుసము నందకున్నఁ "జనె" యంచు రచించె రసాంచితంబుగాన్.

ఒరులిది విందురా యనెడు నూహ మెలుంగక, పొంగి, తేనుగాఁ
బొరలి, హృదంతరాన నెడమున్ గనఁ జాలక, వెల్లి గొంచు, నే
పురు పలదన్న నాఁగక, గుబులెత్తినఁ బాలు మనోనుభావముల్
దొరకక, చెప్ప బెట్టులని తొంటి కవీశులు పాటఁ గూడదే!

పరువపు శాద్వలంబు, నొకపజ్జ మనోహర రావ మొప్పవే
బరువిడు కొండ వాగును, సువాసనలన్ వెదచల్లు చల్లతె
మ్మెరలును, సంజకెంపు జిగి మించు నభంబు, విహంగ గీతముల్,
ద్దొరకక చెప్ప బెట్టులని తొంటి కవీశులు పాటఁ గూడదే!

పరిసరమందు నంబునిధి, భంగ పరంపర పైఁ జెలంగ బం
ధురగతి మ్రోఁగు పానవులునుం, బరిసర్పితి చంద్రకాంతి, శీ
కరభర వాతపోతమును, గ్రందు రవంతియు లేని కాలముల్
దొరకక చెప్ప బెట్టు లని తొంటి కవీశులు పాటఁ గూడదే!

సరసిజ సౌరభంబును గిసాల కషాయితరాగ రాగియౌ
పరభృతమున్, మహాప్రకృతి పావన మూర్తిఁ గనంగఁ జాలు ప్ర
స్తరరచితాసనంబు, నెఱసంజ సుఖంబు, మరుత్కిశోరముల్
దొరకక చెప్ప బెట్టు లని తొంటి కవీశులు పాటఁ గూడదే!

విరిసెడి పెక్కువన్నియల వీవనసా నపరాళి వింత బం
గరు చెలువట్టు లగ్రమునఁ గ్రాల, విహంగమహాజితంబులం
బరమునఁ బర్వఁ బాళ్యముల, స్వైర విహార వినోద సైరికో
త్కరపటుగీతి చాల వెనుకన్ విన వచ్చుచు నందు సుస్థితుల్
దొరకక చెప్ప బెట్టు లని తొంటి కవీశులు పాటఁ గూడదే!

సిరిచిఱు నవ్వులున్, వలపు నేతలు, వన్నెలు, చిన్నెలున్ మనో
హరముగఁ గొన్ని వర్షము లనంతము లంచనుకొంచుఁ గాంచి, యా
శ్వర కృప వింత రూపునఁ బ్రసన్నతఁ గాంచిన యంత, నవ్వియున్
విరవిర నిష్టమాయమయి, విన్నదనంబునుఁ గూర్చ, నింట సుం
దరియు సుతాదులుం దమమనంబుల నున్నఘనార్తిఁ ద్రింగి, దు
ర్భర పరితాప ఘోరవిధిఁ బాసెనొ లేఖడి నేఁటినుండినా
వరుదగు నోర్పుతోడ దరహాసము సేయుచుఁ దన్నుఁ జూచుటల్
దొరకక చెప్ప బెట్టులని తొంటి కవీశులు పాటఁ గూడదే!

పొరిఁగొను నాఁకటం బొరలు పుత్త్రులబావ్వ విరుద్ధ దృష్టులం
బరపుచు నార్తి యూరడిలఁ బల్కఁడు సాధ్వినిఁ జూచి చూడ న
ట్లరసి, నిజార్తి విస్మరణ, నాధునికం బగు లేమి నెంచఁగా
దొరకక చెప్ప బెట్టు లని తొంటి కవీశులు పాటఁ గూడదే!

గరువముఁ గోలుపోయి, విధి కట్టెడి నేతలఁ దొంటి శోకముం
[illegible]రఁగి, విలూన భావయు, విదూషిత తేజయునై, క్షుదార్తితోఁ
బరిభవ మంది కుందు నొక భాగ్య విహీననుఁ గాంచి నంతనే
పౌరజన కుండఁగా నచిరపూర్వపరిస్థితులందు దాని సు
స్థిరవిభవంబు, శేముషియు, దేశము, గీర్తియు నొక్కటన్ హృదం
తరమునఁ బర్వు చుండ, నయనంబుల బాష్పము లూటలూరఁ, గా
తర మతి "దేవదేవ, భయదంబులు నీ చెయిదంబు" లంచు, మే
గరుపడ నెంచు భావమును, జ్ఞానము, బుద్ధి, వివేక సంపదల్
దొరకక చెప్ప బెట్టు లని తొంటి కవీశులు పాటఁ గూడదే!

కరువలి వానమున్ జడిసి కట్టెదుటం బొడసూపు నొక్కని
బ్బరమగు నమ్మకంబు గలపట్టునఁ దాఁ దల దాఁచి, "యద్దిరా
శరణము నిచ్చె నీశుఁ"డని సంతసమందుచు నందు నుండ, వి
స్ఫురముగ, నచ్చటే, శ్రుతి కఠోర విధంబునఁ, బెద్ద పిడ్గు చె
చ్చెరఁ బడి, వాని నొక్కనినె చిత్రవధం బొనరించి, యంతికే
తర విషయంబు లింతయునఁ దాఁకక యుంచుటఁ గాంచి, సాస వ
బ్బురముగ వ్రేలుఁ గొట్టి దివసుం దని, యాపరమేశు లీలల
దరవినయంబు లొప్పఁగ మనంబున నెంచెడు సన్నివేశముల్
దొరకక చెప్ప బెట్టులని తొంటి కవీశులు పాటఁ గూడదే!

# చైతన్యస్వరూపసిద్ధాంతములు

పారనంది జగన్నాథస్వామి గారు, ఎమ్. ఏ., ఎల్. టి,

మనదేశసిద్ధాంతములో ఆత్మమనస్సులు రెండు భిన్న పదార్థములు. పాశ్చాత్యుల శాస్త్రములో వస్తుతః రెండూ ఒకటే కాని, వ్యాపారములవలన భిన్నరీతుల విచారణీయము లగుచున్నవని చెప్పవచ్చును. ఈప్రపంచమునంతను చేతనాచేతనములుగ విభజించి, చైతన్యమునంతను ఒకేపదార్థముగ నిరూపించి చైతన్యముయొక్క భిన్నావస్థలు పరిణామక్రమములో వ్యక్తమగుచున్నవని అన్నిమతములు అంగీకరింపకతీరదు. మనుష్యునిలో వ్యక్తమైన చైతన్యస్థితిని రెండు భిన్నపదార్థములుగ పరిగణించుటకంటె, ఒకేవస్తువుగ నిరూపించుట ఎక్కువ శాస్త్రీయముగ తోచుచున్నది. ఆవస్తువుయొక్క వివిధవ్యాపారములకు వివిధనామము లుంచుట బాగుగానే యున్నది కాని, ఆనామములను వస్తువు లని భ్రమపడుట సంభవించుచుండును. ఈ చైతన్యముయొక్క స్వరూపము వివిధావస్థలు, ఈ వ్యాసములో క్లుప్తముగా విచారింతము.

మనుజుని జాగ్రదవస్థలో వ్యక్తమగుచున్న చైతన్యమే పూర్ణమైన చైతన్యమనిన్ని, తదితర చైతన్యావస్థ మరొకటి లేదనిన్ని నిద్రలో ఈచైతన్యము నిర్వ్యాపారమగుననిన్ని మొన మొన్నటివరకు తలుస్తూఉండిరి. ఈ సిద్ధాంతము శాస్త్రములలో మారినా, సామాన్యులలో ఇంకనూ నాటేఉన్నది. నిద్రలో ఇంద్రియము లన్ని వ్యాపారము లేనివి అగుటచేత, ఇంద్రియములద్వారానే బాహ్యప్రపంచజ్ఞానము కలుగవలెను కాబట్టి, చైతన్యమునకు నిద్రలో స్థితివ్యవహారము లుండవు. ఈసూత్రమును అనుసరించి జాగ్రచ్చైతన్యము, నిద్రాచైతన్యము అని రెండింటిగ చైతన్యమును విభజించుచుండిరి. ఈసిద్ధాంతమునకు కొంచెము పర్యాయముగా నిద్రాచైతన్యమునకు లీనచైతన్య మని పేరుపెట్టి, నిద్రలో చైతన్యము లీనమై యుండునని చెప్పినారు. వారైనా ఈలీనచైతన్యమునకు ప్రత్యేకవ్యాపారమును కల్పించియుండలేదు.

లీనచైతన్యముయొక్క విశేషము స్మృతి, ఏకాగ్రతలలో చక్కగ వ్యక్తమగుచున్నదని త్వరలో చాలామంది గ్రహించినారు. ఇదివరకు కలిగిన అనుభవము జాగ్రచ్చైతన్యమునకు వచ్చినప్పుడు ఆవృత్తికి స్మృతి అని పేరు. ఈవ్యాపారమును చక్కగ విమర్శిస్తే, మూడు అవస్థలు కనబడును. అనుభవజననము, అనుభవస్మృతి, జననస్మృతికాలములకుమధ్య ఆఅనుభవముయొక్క స్థితి. ఈస్థితి లీనచైతన్యము. జననమైనతరువాత ఆ అనుభవము సంస్కారరూపమున లీనమైయుండి, స్మృతికాలమున తిరిగి జాగ్రదవస్థకు వచ్చుచుండును. ఇది లీనచైతన్యముయొక్క ఒకవిధమైన వ్యాపారము.

ఏకాగ్రతను పరీక్షించినచో మరొక విశేషము వ్యక్తమగును. ఏయొక్క నిమిషమందైనను అనేకేంద్రియములు పనిచేస్తూ ఉండును. కాని ఆవృత్తులన్నిటిలో దేనియందో ఒకదానియందు ఏకాగ్రత ఉండును. మిగిలినవన్నీ లీనములగును. ఎట్లన, నేనీవ్యాసమును వ్రాయుచున్నప్పుడు నానేత్రములు చూచుచుండును; నేను వ్రాయుచుండు అక్షరమే కాక మీది అక్షరములు, కలముయొక్క రంగు క్రింద కాగితముపై ఉన్న మచ్చ, వ్రాస్తూ ఉన్న బల్ల ఆకారము, చుట్టుప్రక్కలవస్తువుల ఆకారము, ఇవన్నీ కొద్దిగనో, గొప్పగనో దృగ్గోచరము లగును. ఆ ఇంద్రియవృత్తులకు సంబంధించిన మనోవృత్తు లుండితీరును. ఆవృత్తులన్నీ నా ఏకాగ్రతలోనికి చేరలేదు. అవి అందుచేత లీనములైనవి. ఇట్లు నేత్రేంద్రియము ఎట్లు లీనచైతన్యమునకు సామగ్రిని చేర్చునో అలాగే యితరేంద్రియములు కూడా చేర్చును. లీనచైతన్యమునకు

చేరిన ఇవన్నీ ఒక్కరీతిగా ఉండవు. వాటిలీనత ఎక్కువ తక్కువగా ఉండును. ఈ ఎక్కువ తక్కువ వాటి ప్రసరించినమనస్సుయొక్క ఏకాగ్రతను పట్టి ఉండును. ఏవృత్తులు ఆ కాలమున మనస్సున ఎక్కువగా నాటినవో, ఏవి ఏకాగ్రతలోనున్న వృత్తికి సంబంధించినవో, అవి తక్కువలీనములు అగును. ఏవి తక్కువలీనము లగునో అవి స్మృతికాలములో సులభముగా జాగ్రదవస్థకు వచ్చును.

ఈ సిద్ధాంతమే చాలాకాలమువరకు సర్వాంగీకృతమై యుండెను. నిద్రావస్థ, లీన, అలీనము లనెడి జాగ్రదవస్థ, ఇవి చైతన్యముయొక్క స్వరూపము లని మనశ్శాస్త్రజ్ఞు లందరూ సిద్ధాంతీకరించి యుండిరి. ఇట్లుండగా మనస్సంబంధమైన నూతనసామగ్రి కొంత జిజ్ఞాసకు వచ్చినది. వ్యక్తమైయున్న పంచేంద్రియములద్వారానే అనుభవమునంతా సంపాదించగలము ఒకరికి తిరిగి తెలియజేయగలము అనేసూత్రమునకు విరోధముగా నుండు సంగతులు అనేకములు సందర్భించినవి. వాటికి టెలిపథీ అని పేరు పెట్టినారు. దూరస్థులిద్దరు ఉత్తరములు మొదలైన ఏసాధారణమార్గమున కాకుండా, బాహ్యేంద్రియముల సహాయము లేకుండా, ఒకరి కొకరు ఒకసంగతిని తెలియబరచుకొనగలరు. ఇప్పుడు బాహ్యచైతన్యము ప్రవర్తించ లేదు గదా. అలాగే ఒకవ్యక్తి యోగనిద్రలో ప్రవేశించి, అతడు జాగ్రచ్చైతన్యములో ఎరగని సంగతిని చెప్పుట; ఒకవ్యక్తిని అట్టినిద్రలో ప్రవేశపెట్టగా అట్టి సంగతులను చెప్పుట; జాగ్రదవస్థలో వాటినిగురించి ఎట్టి ప్రశ్నలు వేసినా, ఎంత ప్రయత్నము చేసినా, వాటి అనుభవము ఏమిన్ని లేకుండుట; ఈ విధమైనవాటికి హిప్నాటిజము అని పేరు పెట్టినారు. ఇట్టి సంగతుల పరీక్షవలన లీనచైతన్యస్వరూపవిషయమై సిద్ధాంతము మారవలసివచ్చినది.

లీనచైతన్యమును రెండుసోపానములుగ విభజించినారు. ఒకరకము సులభముగ, సాధారణముగ, జాగ్రచ్చైతన్యప్రయత్నములవలన జ్ఞప్తికి రాగలిగినవి; ఎట్టిప్రయత్నము చేసినా, జాగ్రచ్చైతన్యప్రభావము ఉన్నంతసేపూ స్మరణకు రాకున్నవి, అసాధారణపరిస్థితులలో వచ్చుచున్నవి రెండోరకము. వీటినిబట్టి చైతన్యమునకు వచ్చుటకు, రాలేకపోవుటకు ఒకద్వారమును దాటిరాగలిగి యుండవలె నని ఒకరూపకమును కల్పించి శాస్త్రజ్ఞులు వర్ణించుచుందురు. చైతన్యద్వారమును దాటగలిగేవి, దాటలేనివి, అని రెండువిధముల ఆలీనచైతన్య మున్నదని సిద్ధాంతము ఏర్పడినది. ఈభేదములకు కారణము ఏకాగ్రతాతారతమ్యములని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఎందుచేతననగా అసాధారణపరిస్థితులలో వ్యక్తమగుచున్నవి ఒకప్పుడు అనుభవములోనికి వచ్చియున్నట్లు ఇతరరుజువులు కనబడుచున్నవి. కాని జాగ్రదవస్థలో స్మృతికి రాకుండా ఉన్నవి. జాగచ్చైతన్యములో ద్వారము దాటిరాలేక పోవుట, ర ౦గనిద్రలో వచ్చుచుండుటను పట్టి చూడగా, ఈబాహ్యచైతన్యముకంటె ఆలీనచైతన్యము ఎక్కువ సంపద కలదిగా తోచుచుండును. ఏకాగ్రతలోనికి వచ్చుఅంశము ఒకటైనపుడు, దానిసమయమున లీనచైతన్యమునకు చేరుచున్న సామగ్రి ఇంత అంత అని చెప్ప తరము కాదుగదా. ఈలీనచైతన్యముయొక్క వ్యాపారములను ఆత్మజిజ్ఞాసాసంఘము వారు (Psychic Research Society)* పరీక్షిస్తూ ఈసిద్ధాంతమును స్థాపిస్తూ ఉన్నారు.

ఇంతవరకు చెప్పినదానిని సంగ్రహించినచో చైతన్యముయొక్క భిన్నరూపములను తెలియజేయుటకు ఈ క్రింది పటీని తయారుచేయవచ్చును:—




ఈ రెండు లీనచైతన్యములు వాటికిసందర్భించిన పరిస్థితులలో జాగ్రత్ స్థితికి రాగలిగినవే. ఏరూపమున

* ఈసంఘము వారిపనిని, ఈ టెలిపథీ, హిప్నాటిజము, వ్యాపారములను వర్ణిస్తూ, ఆత్మజిజ్ఞాస, లేక శరీరము విడిచినతరువాత ఆత్మస్థితి అని పేరుతో నేను వ్రాసినపుస్తకము ఆంధ్రపత్రికా కార్యాలయమున దొరకును.

పూర్వఅనుభవములోనికి వచ్చినవో, ఆరూపముననే తిరిగి అనుభవమునకు అలీనచైతన్యములు మనోవృత్తులు రాగలవు. అందుచేత ఇవి చైతన్యములో ఉన్నవే కాని, చైతన్యమునకు అతీతములు కావు.

ఇట్లుండగా మరొకవిధమైన చైతన్యమును అంగీకరించక తీరినది కాదు. సర్వాంగీకారము పొందియున్న పరిణామసూత్రము ననుసరించి చైతన్యపరిణామమును పరీక్షించుటచేత మనుజుని మనోనిర్మాణములో జంతుసంబంధములైన భావములు, వాంఛలు, మొదలైన మనోవృత్తులు వాసనారూపమున లీనములైయున్నట్లు కనుగొనినారు. ఏవాంఛలు జంతువులు నిరాటంకముగ తీర్చుకొనుచున్నవో, వాటిని మనుజుడు బహిరంగముగ ఆలోచించలేకున్నాడు; ఆలాగని అవి వానిమనస్సు కూర్పునుండి తొలగిపోలేదు. ఏభావములు, చర్యలు అనాగరకకుటుంబములలో నిరుద్ధములో, వాటిని నాగరికులు నిర్మూలము చేయలేకున్నా బహిరంగముగ ప్రకటింపలేకున్నారు. ఇట్టివన్నీ పరంపరలో వాసనలుగా పిల్లలలో వ్యక్తమగుచున్నట్లున్ను, వాటిని సాంఘికనియమములచే అణిచివేయ యత్నిస్తూ ఉన్నట్లున్ను శాస్త్రజ్ఞులు కనిపెట్టినారు. ఆభావములను, ఆవాంఛలను, తెగడియు నాగరికులు, ముఖ్యముగ నీతిపరులు యత్నించుచున్నారు. వీటి ఉనికి బాలుల మనస్సుకూర్పులోనే కాకుండా పెద్దవారి మనస్సు కూర్పులోకూడా ఉన్నట్లు మరొకవిధమున ఇటీవల మనశ్శాస్త్రజ్ఞులు కనుగొనుచున్నారు. ఉన్మాదము, అస్థిరత, మతివిభ్రమము, దయ్యముపట్టుట, గ్రహబాధ, ఈ మొదలైనపేర్లతో వ్యవహారములో ఉన్న (R)steria and Merotic disorder) మనస్సంబంధమైన రోగముల పరీక్ష ఇటీవల ఎక్కువైనది. ఆ జబ్బులకు శారీరకచికిత్స ఎంత చేసినా రోగనివృత్తి లేకుండెను; మనశ్చికిత్స చేయవలెనని ప్రయత్నించుటలో చెప్పసిగ్గగు వాంఛలు ఆరోగులను బాధిస్తున్నట్లు స్పష్టమైనది. ఏవో కొన్నివాంఛలు ఉన్నట్లున్నూ, ఆవాంఛల సంగతి సూచించుటకైనా జంకుచున్నట్లున్నూ, ఏవో కొన్నికొన్ని చెప్పినా సాక్షాత్తుగా చెప్పక ఏదోవిధముగా సూచిస్తూ ఉన్నట్లున్నూ, పచ్చిబూతు ఉచ్చరించుటకు నాగరికుడు ఎంత సిగ్గుపడునో అంతకంటె ఎక్కువ సిగ్గుతో ఉన్నట్లున్నూ— ఈమొదలైన సంగతులనేకములు తెలిసినవి. అట్లే స్వప్నముల స్వభావమును తెలుసుకొన ప్రయత్నించిన పరీక్షకులుకూడా ఆలాగే చెప్పుచున్నారు. ఏవాంఛలు జాగ్రత్స్థితిలో మనోవ్యాపారములోనికైనా రాలేవో అవి ఒకొక్కప్పుడు మారువేషముతో స్వప్నములోనికి వచ్చి కొంత ప్రకారాంతరతృప్తిని పొందిపోవుచున్నవని వారి మతము. ఈవాంఛలు, ఈ వాసనలు, బాహ్యచైతన్యమునకు ఎన్నడు రాజాలవు. అవి చైతన్యాతీతములైన లీనచైతన్యములు.

ఈ పరీక్షలవలన చైతన్యస్వరూపనిరూపణ మారవలసివచ్చినది. మనకు జాగ్రత్స్థితిలో వ్యక్తమయ్యే వృత్తులనేకాకుండా జాగ్రత్స్థితికి ఎన్నడూరాలేని వాసనారూపవృత్తులు, మనోవృత్తులున్నూ ఇంకా అనేకములు ఉన్నవనిన్నీ, మనస్తత్త్వజ్ఞులు వాటిపరీక్ష చక్కగ చేయనిది అనేకవ్యాపారముల స్వభావమును సమన్వయించలేదనిన్నీ తెలిసినది. మనుజుని వ్యాపారమును పరీక్షించినపుడు అనేకవ్యాపారములకు చాలా చిన్నచిన్న వాటికి ఉచితమైన కారణములను నిరూపించలేకున్నామని అందరికి తెలిసినవిషయమే. ఈకారణములు లీనచైతన్యములో ఒకచోట ఎక్కడో జన్మ పొందుతూఉన్నవి. సాధారణలీనచైతన్యములోనివైనపుడు వాటిని కనుగొన శక్యమగును. అసాధారణలీనచైతన్యములోనివైనపుడు ఈ బాహ్యప్రయత్నము చాలకున్నది. అతీతలీనచైతన్యమైనపుడు తెలుసుకొనుటకు ప్రత్యేకసాధనసామగ్రి చక్కనిశాస్త్రీయకుశలత కావలసివచ్చుచున్నది. ఈచైతన్యమును నిరూపించుటకు ఉద్యుక్తమైయున్న మతమునకు ఇంగ్లీషులో Psycho Analysis *అనిపేరు. ఈ సూత్రమును సిద్ధాంతముగ అంగీకరించినా, ఈమతముయొక్క సిద్ధాంతముల విషయమై ఇంకా చర్చ జరుగుచున్నది.

ఈరకము లీనచైతన్యముతో కూడా మూడురకముల లీనచైతన్యము, ఒకరకము జాగ్రచ్చైతన్యము సిద్ధమైనవి.

---

* ఆత్మజిజ్ఞాస అను పేరుతో Psychic Research గురించి వ్రాసినట్లు, ఈ Psycho Analysis గురించి ఒక చిన్నపుస్తకము వ్రాయవలెనని కుతూహలము ఉన్నది.

# ప్రబోధము

## వేంకటశేషేశ్వరులు

బాలుడవు కాగలాడవు ప్రథితవంశ,
జాతుడవు నీదుతాతముత్తాత లేప
ధంబు ద్రొక్కిరో దానినే తలపుమయ్యా
ధర్మసూక్ష్మ మియ్యదియె హైందవకుమార!

పాడిపంటల కేతల్లి పట్టుగొమ్మ
[illegible]మాద్వైత సిద్ధాంతమునకు జన్మ
భూమి భారతమాత వాపోవుచుండ
తగునె నిదురింప నీకు హైందవకుమార!

వేషభాషల జూచియె వెఱ్ఱిబడక,
పేర్మిరూపంబు గల్గిన మేడిపండు
పురుగులకు పుట్టినిల్లను బుద్ధితోడ
తత్త్వము గ్రహింపుమయ్యా హైందవకుమార!

ధర్మ మేమూల దాగెనో ధర్మనృపుల
కట్టియుక్కట్టు గల్గెనో యెఱుగరాదు
నేడధర్మంబు ప్రబల కన్నీరువిడచు
తల్లి నొకసారి గనుము హైందవకుమార!

కలవు నీగేహమం దనర్ఘమ్ములైన
రత్నరాసులు వానిపై భ్రాంతివదలి
వెలకు కొఱగాసిన త్తగుల్లలను గోర
దగునె యోజింపుమయ్యా! హైందవకుమార!

పావురంబును గొట్టుదుర్భ్రాంతి గలిగి
క్రిందనున్నట్టిపాము గుర్తింపలేని
బోయవలె మోసపోక సద్బుద్ధి గలిగి
తగినటు లొనర్పుమయ్యా హైందవకుమార!

యుగమహాత్మ్యమ్మనన్ జేసి యోగ్యులకు నొ
కింతకష్టంబు ప్రాప్తించు నంతమందు
ధర్మమే గెల్చు నిద్ది సత్యమ్ము; నీవ
ధైర్యమందకుమయ్యా! హైందవకుమార!

అన్యవస్తువులందు నీ కాస వలదు
నీకు కల్గినదానితో తృప్తిజెంది
దేశసౌభాగ్య మూహించి తిరుగుమయ్యా!
తగ వెలుంగుట మేలు హైందవకుమార!

పాపభూయిష్ఠమయ్యె విశ్వమ్ము; న్యాయ్య
మన్నశబ్దంబె వినిపింపదయ్యె; నన్నృత
మెక్కుడయ్యె; కృతఘ్నత్వ మెల్లదిశల
దాన్యమై చుట్టుముట్టె హైందవకుమార!

అవయవంబులు శుష్కించి శవముపోలె
భరతమాతకు చైతన్యబలముతగ్గె
నామయమ్ము గాదది మనోవ్యాధి గాని
తగినమం దిడుమయ్యా! హైందవకుమార!

ధర్మ పరిపాలనాసంవిధానమందు,
పేరుగొనినట్టి క్షత్రియ వీర్యమెల్ల
నేటి కతాత్రమయ్యె... చింతింపనేల?
దప్పునే కర్మఫలము హైందవకుమార!

సోదరులయందు ద్వేషము జూపకయ్యా!
శత్రువిచ్ఛేదయోగ్యమా సంఘబలము
మాత్మ నూహింపుమయ్యా! అన్యాయమందు,
దగులనీకయ్యా! మనము హైందవకుమార!

# ధర్మశాస్త్రము - మహా మహేంద్రజాలము

పారనంది రామశాస్త్రి గారు

ఇదివఱ కాంధ్రపత్రికలో "నింద్రజాల"మని యొక పుస్తకము
ప్రకటింపఁబడుచున్నది. దానిని వినుటయేకాని చూడలేదు.
దీనిలో జర్మనీగారిడి, యోగదృష్టి, హస్తలాఘవము, ఇంగ్లీషు ఇంద్ర
జాలము, మంత్రశాస్త్రము, భూతవైద్యము, యంత్రములు, అమెరికా
వారి చీట్లు, పేకతమాషాలు, విచిత్రవినోదవిద్యలు, గలవట. ఇంతే
కాక మనుష్యుని మాయముచేయుట, మామిడిచెట్టును బుట్టించుట, జీవ
ముతో సమాధియగుట, శరీరములేని తలకాయచేత మాటలాడించుట,
భూమిపైని గజముఎత్తున గాలిలో మనుష్యుని నిరాధారముగ నిల్పుట,
మొదలగు విచిత్రము లనేకములు గలవట. ఇట్లే ధర్మశాస్త్రములో
మహామహేంద్రజాల గ్రంథములు బయలువెడలుచున్నవి. వానిలోను
ననేకవిచిత్రములు గలవు. హిందూగారిడి. హిందువుల కర్మలను
దారుమారుచేయుట, విలక్షణదృష్టి, హస్తలాఘవము అనగా పూర్వ
ధర్మశాస్త్రములలోని పాఠములను, పూర్వపువ్యవస్థలను మాయము
చేయుట, హిందువుల యింద్రజాలము, తంత్రశాస్త్రము అనగా కల్ప
నాశాస్త్రము, యంత్రములు, ఇప్పటి హిందూపండితుల యభిప్రాయపు
చీట్లు, గృహ్యసూత్రములతమాషాలు, లేనివారికధికారమును కల్పించు
వినోదవిద్యలు, గలవు. ఇంతియకాక యొకజాతిని మాయముచేయుట,
లేని కర్మలను బుట్టించుట, జీవన్న్యాసమును సమాధినొందించుట, విషయ
మెఱుగనివారిచే నెఱిగినట్లు మాటలాడించుట, ఎఱిగినవారికి వాగ్బంధ
మొనర్చుట, లోకమందు నిరాధారముగ మనుష్యులను నిల్పుట, నవీన
ములను పురాణములుగాను, పురాణశ్లోకములను మంత్రములుగాను,
దెలుపుట, మంత్రములను, "మంత్రములు కావ"ని చెప్పుట, అప్పటికి
హాజరులేని గ్రంథముల సాధారముగాఁ జెప్పుట, హాజరైనప్పుడు
దానిలో లేదుగాని మఱియొక గ్రంథములో నున్నట్లు చెప్పుట, ఉన్న
పుస్తకములలోని గ్రంథభాగమునకుఁ గ్రొత్త వ్యాఖ్యానమును కల్పించి
క్రొత్తదానిలో చేర్చి "ప్రాతవ్యాఖ్యానమే" యని భ్రమింపఁజేయుట,
అర్హులయశ్రద్ధను, ననర్హుల శ్రద్ధను శ్లాఘించుట, అయాజ్యయా
జనము, అనధ్యాప్యాఽధ్యాపనము, అసత్ప్రతిగ్రహములను, లోకా
నుగ్రహములుగా జెప్పుట, "సంస్కారణ" శబ్దమునకు సహజమయిన
యర్థమును దుడిచివైచి, యపార్థమును కల్పించుట, చాతుర్వర్ణ్యవిభా
గము గుణకర్మచే నయినదేయని "చాతుర్వర్ణ్యం మయా సృష్టంగుణ
కర్మవిభాగశః" అను దాని కభిప్రాయము, జెప్పుట "జన్మనాజాయతె
శూద్రః కర్మణాజాయతేద్విజః" అను దానికి బ్రాహ్మణుఁడు పుట్టి
నప్పుడు శూద్రుడేయనియు, నుపనయన కర్మచేత ద్విజుడగుననియు
నర్థముఁ జెప్పి శూద్రునకుఁగూడ నుపనయనాధికారమున్నదనియు, నది
పుంస్త్వములేనివానికి క్రియలేని గర్భాధాన సంస్కారమట్లు ద్విజ
త్వము లేనివానికి, వేదమంత్రములు లేని, యుపనయన సంస్కారము
వచ్చునని సమర్థించుట, పూర్వధర్మశాస్త్ర కర్తలగు మహర్షులచే ని
యింపఁబడిన "స్మార్త" సంకేతమును మాపి యట్టివానికి "పురాణో
కర్మ" లను క్రొత్తసంకేతమును కల్పించుట, వ్రాత్యతలేనివారికి వ్రాత
కల్పించి, దానికై ప్రాయశ్చిత్తముకల్పించి, దానికై గృహ్యసూత్రవ
కన్యార్థములను కల్పించుట, ఐహికప్రయోజనకర్మల, నాముష్మి
ప్రదములుగా జెప్పుట, అర్థార్జనమును ధర్మార్జనమనుట, పామరు
భ్రమింపఁజేయుట, మున్నగునవి కలవు. ఇంకను ప్రాయశ్చిత్త పుత
పాలు చూడఁదగినవి. ప్రాయశ్చిత్తముకొఱకు, పాపము సంపాది
దానివలన, పతితులయినట్టివారు, విషాదమును, లజ్జను బొందుట
బదులు సంతసించునట్లుచేయు సమ్మోహనశక్తి. దీనికట్టి యింద్రజ
మైనఁ జాలునా? ఒకగ్రామమున నొక పెద్దనాయడు తనకుమార
నుపనయనసంస్కారముచేత బ్రాతునిగా జేసితి నని సంతసింపగ
కాని తనతండ్రితాతలు మొదలగు దనవారినందరి నధోగతిపాలు
నట్లు తెలియఁజాలఁడు. ఇది మహా మహేంద్రజాలముగాదా? ఇంక
జూడుఁడు. చూచినకొలదిని విషాదమునకు బదులువినోదమే క
వచ్చును. పూర్వధర్మశాస్త్రములలో మహర్షులు పాపములలోన
కృతములకే ప్రాయశ్చిత్తముకాని బుద్ధిపూర్వకృతములకును పుణ్యకర్మలక
ప్రాయశ్చిత్తము లేదనియుఁ జెప్పియున్నారు. కొందఱుమాత్రము
పాపములకు బుద్ధికృతములకు నంగీకరించినారు. బ్రహ్మహత్యా
మహాపాతకములకు బుద్ధికృతములకు మరణాంతముదక్క వేఱుప్రాయ
శ్చిత్తము లేదనియే యేకకంఠముగా నందఱును జెప్పియున్నారు. "శ్లో. అ
మతఃకృతేపాపే ప్రాయశ్చిత్తంవిదుర్బుధాః, కామకారం కృతే ప్యాహుః
రేకేశ్రుతినిదర్శనాత్." అని మనువు. దీనిలో "ఏకే" యనుట
మతాంతరమందస్వరసతను దెలిపియున్నాడు. "శ్లో. ప్రాయశ్చిత్తీ
తాంప్రాప్య దైవాత్పూర్వకృతేనవా, నసంసర్గం వ్రజేత్సద్భిః ప్రా
శ్చిత్తేకృతేద్విజః." దీనిలోఁగూడ "దైవాత్" అనుపదముచేత వని
కృతములకే చెప్పియున్నాడు. ఇక బ్రహ్మహత్యావిషయమున "అ
యము ౧౧ శ్లో. ౭౨ "బ్రహ్మహాద్వాదశసమాః" అని యారంభి
హన్తృభేదమును, జాతిని, జెప్పక సామాన్యముగా నారంభించి "
౮౨ వఱకు ద్వాదశవార్షిక వ్రతమధ్యకృత్యములను జెప్పి "
౮౨ లో "శ్లో. "సమాప్తేద్వాదశేవర్షే బ్రహ్మహత్యాం వ్యపోహ
అనిచెప్పి "శ్లో. ౮౯ లో" ఇయం విశుద్ధిరుదితా ప్రమాప్యాఽకా
తోద్విజం, కామతోబ్రాహ్మణవధేనిష్కృతిర్నవిధీయతే" అని
బుద్ధికృత బ్రహ్మహత్యకు "నవిధీయతే" అనియే చెప్పినాడు. ఇ
అవిధీయమాన మనగా ననిర్దేశ్యము. "మరణాంతమనిర్దేశ్యం"

భావ చేతను, "భృగ్వగ్ని పతనాద్వృతే" అను నితరమహర్షుల వచనము
న్ను మరణాన్తప్రాయశ్చిత్తము సిద్ధించుచున్నది. యాజ్ఞవల్క్య
హర్షి "శ్లో. ప్రాయశ్చిత్తైరపైత్యేనో యదజ్ఞానకృతంభవేత్" అనియే
ప్పుచున్నాడు. పరాశరీయమందు "తథాచమనుః" ఇయంవిశుద్ధిరుదితా
...కామతో బ్రాహ్మణవధేనిష్కృతిర్నవిధీయతే" బోధాయనో ఒపి
అమత్యా బ్రాహ్మణంహత్వా... ఋషయోనిష్కృతింతస్యవదంత్యమ
ూర్వకే; మతిపూర్వంహతేతస్మిన్నిష్కృతిర్నోపలభ్య; తే" స్మృత్యం
ం "యఃకామతో మహాపాపంనరఃకుర్యాత్కథంచన, నతస్యనిష్కృతి
ష్టా భృగ్వగ్నిపతనాదృతే" శాతాతపోపి "అకామకృతే ప్రాయశ్చిత్తం
మకృతే త్వాత్మానమవసాదయేత్;" మధ్యమాంగిరా ఆహ "ప్రాణా
కంచయతో ప్రోక్తం ప్రాయశ్చిత్తంమనీషిభిః, తత్కామకారవిషయం
యంనాత్రసంశయః;" విజ్ఞానేశ్వరముని "గురూణామధ్యధిక్షేపో
నిందాసుహృద్వధః, బ్రహ్మహత్యాసమంజ్ఞేయం అధీతస్యచనా
ం"... అనశనేనకర్శితో ఒగ్నిమారోహేదితి;" ఇదంచమరణాన్తిక
ాయశ్చిత్తం కామకారవిషయం; "యథాహ మధ్యమాంగిరాః "యః
మతో మహాపాపం నరఃకుర్యాత్కథంచన, నతస్యశుద్ధిర్నిర్దిష్టా భృ
గ్నిపతనాదృతే"; హేమాద్రి "జ్ఞానతఃకరణేత్వంగిరాః" యఃకామ
మహా... భృగ్వగ్నిపతనాదృతే"; దేవలుడు "యత్స్వాదనభిసంధాయ
పంకర్మసకృత్కృతం, తస్యేయంనిష్కృతిఃప్రోక్తా కర్మవిద్భిర్మ
భిః" ... ప్రాథమికాదస్మాత్ ద్వితీయేద్విగుణంభవేత్, ...యే
గుణం కృచ్ఛ్రం చతుర్థే నాస్తి నిష్కృతిః, అభిసంధికృతే పాపే
ద్వానేహ నిష్కృతిః."; గౌతముఁడు. 2. "అగ్నౌ సక్తిర్బ్రహ్మ
ః త్రిరవచ్ఛాతస్య. 3. లక్ష్యంవాస్యాజ్జన్యే శస్త్రభృతాం.
ఖట్వాంగకపాలపాణి ర్ద్వాదశసంవత్సరాన్ స బ్రహ్మచారీ
క్షాయ గ్రామంప్రవిశేత్కర్మాచక్షాణః" అని ద్వాదశవార్షికమునకే
వైకల్పికముగా మరణాన్తమును జెప్పియున్నాడు. ఆపస్తంబుఁడు
తేనైవవిధినో త్తమాదుచ్ఛ్వాసాచ్చరేన్నాస్యాఽస్మిన్ లోకే ప్రత్యా
త్తిర్విద్యతే కల్మషంతునిర్హణ్యతే" వ్యా "ఉత్తమఉచ్ఛ్వాసః
ణవియోగః తస్మాచ్చరేత్ ... అశ్వమేధాఽవభృథాదిషుసంభవత్స్వ
స్యాఽస్మిన్ లోకే జీవితేప్రత్యాపత్తిశ్శుద్ధిర్నాస్తీత్యర్థః" కల్మషం
ర్హణ్యతే తస్యపుత్రాదిభిస్సంస్కారాదిఃకర్తవ్య ఇతిభావః" అని
ద్వాదశవార్షికమునకే అనగా నకామకృతబ్రహ్మహత్యా ప్రాయశ్చిత్త
నకేతుల్యవైకల్పికముగా మరణాన్తమును జెప్పినాడు. ఔశనసస్మృతి
బ్రహ్మహత్యాంసురాపానం స్తేయంగుర్వంగనాగమం. కృత్వాచైవం
హాపాపం బ్రాహ్మణఃకామమోహితః, కుర్యాదనశనంవిప్రః పుణ్య
స్థసమాహితః, జలేవాప్రవిశేదగ్నౌ ధ్యాత్వాదేవంకపర్దినం. నహ్య
నిష్కృతిర్దృష్టా మునిభిఃకర్మవేదిభిః;" ప్రాయశ్చిత్తేందుశేఖరము
మహాపాతకేషు బ్రహ్మహత్యాదిషు ప్రాయశ్చిత్తం" "తత్ర బ్రాహ్మణత్వ
కారకజ్ఞానపూర్వకంమారణం కామనయా బ్రాహ్మణవధేమరణా
శుద్ధిః. తచ్చాత్మనో ఒగ్నిప్రవేశేన, భృగుపతనేనవా, అథవా
హ్మహత్యాపాపశుద్ధ్యర్థం బాణలక్ష్యభూతో ఒయమితిజానతాం ధమ
ర్భృతాంగృహాభూమౌస్వేచ్ఛయాలక్ష్యభవనేన" ఇట్లు మహర్షులందఱు
మొరలిడుచుండ వారిమొర లెవ్వరికిని వినఁబడనట్లుచేయుచున్న "ద్విగు
ణంబుద్ధిపూర్వకే" అను నొక యంగిరోవచనమునుదెచ్చి దానిచేతనే
మహాపాతకములకును రెండేసిప్రాయశ్చిత్తము లున్నవనుచు, నవి పాత
కుల యిచ్ఛానుసారముగ నుండవచ్చుననుచు, నందువారికి దమపాపము
పోవలయునని కోర్కియున్నచో, మరణాన్తికము జేసికొనవచ్చునట.
పాపముపోనక్కర లేకసవ్యవహార్యతకొఱకు మాత్రము కోర్కియున్న
చో ద్విగుణప్రాయశ్చిత్తముచేత, నది వారికి సిద్ధింపవచ్చునట. మరణా
న్తికమునకే ద్విగుణప్రాయశ్చిత్తము పర్యాయమట. పాపులకు రెండు
కోర్కులు నుండరాదా? ఈద్విగుణప్రాయశ్చిత్తము శాస్త్రీయమే
యైనచో రెంటిని, నేల చేయఁజాలదు?. కానిచో నొక్కదానినైన
నెట్లు చేయఁగలదు?. ఇది పారిభాషికము గాఁబోలు. పోనిండు.
చూచితిరా యీయంగిరోమహర్షియే యీకల్పనఁ దననెత్తినిఁ బెట్టుదు
రేమో? యని భయపడియే "బాబులారా! నేనట్లు చెప్పలేదు. నేను
జెప్పిన ద్విగుణప్రాయశ్చిత్త మితర పాపవిషయముగాని, మహాపాతక
విషయముగాద" ని రెంటికి నుదాహరణముగ విజ్ఞానేశ్వరమందు
"విహితంయదకామానాం కామాత్తుద్విగుణంభవేత్" తథా, మ్లేచ్ఛనాధి
గతశూద్ర స్త్వజ్ఞానాత్తుకథంచన, కృచ్ఛ్రత్రయంప్రకుర్వీత జ్ఞానేతు
ద్విగుణంభవేత్" అనియు, హేమాద్రియందు "శ్లో. యఃకామతో
పాపం నరఃకుర్యాత్కథంచన, నతస్యశుద్ధిర్నిర్దిష్టాభృగ్వగ్నిపతనాదృతే"
అనియుఁ మొరఁబెట్టుచున్నను, నాతనిమొరనుగూడ వినక "నీవట్లేచెప్పి
నావ"న్న ట్లాతనింగూడ వ్యామోహమొందించునట్లు చేయఁగల యీ
మహామహేంద్రజాలమహిమ తక్కినవారి కెట్లుచేయదు?. ధర్మశాస్త్ర
మందు సామాన్య విశేష భావమును చూడనేరాదట. "ద్విగుణంబుద్ధి
పూర్వకే" అని యున్నది గావున ద్విగుణ మనగా "సిద్ధియైనసరే
కదా" అన్నప్పుడుమాత్ర మట్లు కాదట. విశేషవివక్ష కావలయునట.
"అకామతఃకృతేపాపే ప్రాయశ్చిత్తంనకామతః" అనువచనమున కర్థము
అకామకృతపాపవిషయమునఁ జెప్పఁబడిన ప్రాయశ్చిత్తము కామకృత
పాపవిషయమునఁగాదని" యట "ద్విగుణంబుద్ధిపూర్వకే" అను దానికి
మాత్రము అబుద్ధికృతపాపమందుఁ జెప్పఁబడిన ప్రాయశ్చిత్తమే బుద్ధి
కృతమందు "ద్విగుణ" మని చెప్పుకొనవలయునట. ఓహో యేమి సమన్వయ
చాతుర్యము. ఏమిపాండిత్య స్వాతంత్ర్యము. కాని యది యట్లుండ
నిండు. అబుద్ధికృతపాపస్థలీయప్రాయశ్చిత్తమునకు, బుద్ధికృతస్థల
మందు ప్రాప్తియెట్లు? ప్రాప్తిలేక నిషేధముండునా? శాస్త్రకర్తలట్లు
చేయుదురా? కర్తలేకాదు శాస్త్రసమయమెఱింగినవారైన, నట్లుచెప్పు
దురా?. అదేమైనను "ప్రాయశ్చిత్తంన" అనుదానికి "ప్రాయశ్చిత్తము
లే" దనియే స్మృతిమూలకర్తలు, వ్యాఖ్యాతలునందఱుఁ జెప్పియున్నారు.
"న" దానికి "కాద"ని యపూర్వకల్పనఁ జేసినను, లేదన్న నేమి, కాదన్న
నేమి, సిద్ధించినదేది?. అభావమేకదా, ఈమహామహేంద్రజాల మన్యు
లనేకాక, తన కర్తలనుగూడ వ్యామోహమొందింపఁ గలిగియున్నది.
అచ్చట ప్రతియోగితాఽవచ్ఛేదక మెద్దియో తెలిసికొన్నచో నీకల్పనకే
యవకాశ ముండక పోవును.

# విశిష్టాద్వైతసిద్ధాంతము

మేడేపల్లి వేంకటరమణాచార్యులు గారు

వన్దే వేదాన్తకర్పూర చామీకర కరణ్డకమ్, రామానుజార్య మార్యాణాం చూడామణి మహర్నిశమ్.
చిదచిత్పరతత్త్వానాం తత్త్వయాథార్థ్యవేదినే, రామానుజాయ మునయే నమో మమ గరీయసే.

పూర్వకాలమందు న్యాయవైశేషికములు, పూర్వోత్తర మీమాంసలు, సాంఖ్యయోగములు మొదలగు షడ్దర్శనములు ఋషులచే సూత్రరూపముగ రచింపఁబడినవి. దురవగాహమగు వాని తాత్పర్యార్థమును జిజ్ఞాసువులకు స్పష్టముగాఁ దెలియఁజేయుటకు మఱికొందఱు ఋషులు వృత్తిగ్రంథములను వ్రాసిరి. ఎట్లనఁగా; జైమినీయమున కుపవర్షవృత్తి, బాదరాయణీయమునకు బోధాయనవృత్తి, పూర్వమీమాంస కర్వాచీనులగు భాట్టప్రాభాకరులు వ్రాసిన వివరణము, ఉత్తరమీమాంసకు భర్తృగౌడపాదప్రభృతులు రచించిన వృత్తులు కలవు. ఉత్తరతంత్రమునకు శంకరాచార్యాదు లతిస్వతంత్రముగా వ్యాఖ్యానములను వ్రాసిరనుసంగతి దార్శనికగ్రంథములను జదువుచున్న పాఠకమహాశయులకు వేఱుగాఁ జెప్ప నవసరము లేదు. కాని విశిష్టాద్వైతమతావలంబులగు పూర్వాచార్యు లందఱు నార్షమగు బోధాయనమునే సంరక్షించుకొనుచు వచ్చిరి. ఈ యంశమునే శ్రుతప్రకాశికాచార్యులవారు శ్రుతప్రకాశికావతరణికయందు "పరమర్షి ప్రణీతాని వ్యాఖ్యేయాని, తేషాం చ మహర్షిప్రణీతాని వ్యాఖ్యానాని సన్తి చేత్తా న్యేవానురోద్ధవ్యాని, న హ్యన్యృషేస్స్వాతన్త్ర్యవర్తిత్వమ్, ఋషే రభిప్రాయ మృషిరేవ స్వతో వేదితు మర్హతి" అని వ్రాసియున్నారు. ఇట్టిబోధాయనవృత్తి కాలక్రమమున నశింపఁగా ద్రమిడ, గుహదేవ, టంక, భారుచి ప్రభృతులగు నాచార్యు లార్షమగు నీబోధాయనమతమునే భాష్యము లనియు, వార్తికము లనియు బహుగ్రంథములను రచించి సంరక్షించి వృద్ధినొందించిరి. ఆకాలమం దీమతము బోధాయనీయమత మనియు వృత్తికారమత మనియు సముచ్చయవాదిమత మనియుఁ గొంతకాలము వ్యవహరింపఁబడెను. పిదపఁ గొంతకాలమున కనఁగా శంకరాచార్యుల కాలమం దీమతము భాగవతమతమని వ్యవహరింపఁబడినట్లు గ్రంథప్రామాణ్యమువలననే కానవచ్చుచున్నది. శంకరాచార్యులు సూత్రభాష్యములో ద్వితీయాధ్యాయ ద్వితీయపాదములో నున్న "ఉత్పత్త్యసమ్భవాత్, న చ కర్తుః కరణమ్, విజ్ఞానాదిభావే వా తదప్రతిషేధః, విప్రతిషేధాచ్చ" అను సూత్రములభాష్యములో "తత్ర భాగవతా మన్యన్తే, భగవానేవైకో వాసుదేవో నిరంజనజ్ఞానస్వరూపః పరమార్థతత్త్వమ్" ఇత్యాదివాక్యములయం దీవైష్ణవులను భాగవతులని వ్యవహరించెను. ఆకాలమునాఁటికి భగవద్రామానుజమును లవతరింప లేదు. వారివిభూతిలో నవతరించిన తరువాత నాథముని యామునాచార్యులవారి కాలమున కొకరీతిగా నున్న యీమతమునకు దగిననియమములను సిద్ధాంతములను నేర్పఱచి చక్కఁగా దేశమం దంతటను వ్యాపింపఁజేసిరి. అందువలననే యీమతమునకు రామానుజమత మని పేరు కలిగినది. కాని యీమతమునకు విశిష్టాద్వైతమని పేరున్నట్లేమూలప్రమాణగ్రంథములయందును గానరాదు. అభిజ్ఞులు కొందఱు "విశిష్టం చ విశిష్టం చ విశిష్టే, తయో రద్వైతమ్ విశిష్టాద్వైతమ్" అనఁగా సూక్ష్మచిదచిద్విశిష్టమ్ - స్థూలచిదచిద్విశిష్టమ్ - బ్రహ్మ. ఈ రెండింటికి నద్వైతము విశిష్టాద్వైత మని సమర్థించిరి.

## ప్రమాణనిరూపణము

ప్రమేయజ్ఞానము ప్రమాణాధీనము గావున ముందుఁ బ్రత్యక్షాది ప్రమాణములు నిరూపింప బడుచున్నవి. ప్రమాణ మనఁగాఁ బ్రమాకరణము. యథావస్థితవ్యవహారమున కనుగుణమగు జ్ఞానము ప్రమయనం బడును. అట్టిప్రమకు సాధకమయినది గావున ప్రమాణమని చెప్పఁబడును. ఈ విశిష్టాద్వైతసిద్ధాంతమందుఁ బ్రత్యక్షమనియు, ననుమానమనియు, శబ్దమనియుఁ బ్రమాణములు మూఁడు. వానిలో సాక్షాత్కారిప్రమాకరణము ప్రత్యక్షము. ఇది సవికల్పకము, నిర్వికల్పకము నని రెండువిధములు. వానిలో గుణము, జాతి మొదలగువానితోఁ గూడిన ప్రథమగోవ్యక్తిని బ్రత్యవమర్శతో గ్రహించుట సవికల్పకము. గుణజాత్యాదులతోఁ గూడిన యొకగోవ్యక్తిని మొట్టమొదటఁ జూచినపుడు కలిగెడుజ్ఞానము నిర్వికల్పకము. స్మృతి, ప్రత్యభిజ్ఞ మొదలగునవి ప్రత్యక్షమం దంతర్భూతములు. ఈమతమం దభావము భావాంతరము గావునఁ బ్రత్యక్షాన్తఃపాతి; ఘటప్రాగభావ మనఁగా మృదవస్థ; ఘటధ్వంసము కపాలావస్థ, ఈరెండును పుణ్యపురుషులయం దుండు ప్రతిభావిశేషమును బ్రత్యక్షములోనివియే. "యథార్థం సర్వవిజ్ఞాన మితి వేదవిదాం మతమ్" అని సిద్ధిత్రయమందు యామునాచార్యులవారు సాధించినట్లు భ్రమాదిప్రత్యక్షజ్ఞానము సైతము యథార్థము.

1. అఖ్యాతి 2. ఆత్మఖ్యాతి 3. అనిర్వచనీయఖ్యాతి 4. అన్యథాఖ్యాతి మొదలగుఖ్యాతులను ఖండించి వీరు సత్ఖ్యాతిపక్షమును స్వీకరించిరి. సత్ఖ్యాతి యనఁగా జ్ఞానవిషయసత్యత్వము. శుక్తికయందు రజితభ్రాన్తి యితరవాదులకు భ్రాంతియయినను పంచీకరణప్రక్రియచే సర్వభూతములు సర్వభూతములయం దుండుటవలన శుక్తిక

యందు రజితాంశమున్నది గావున నిది భ్రాంతి కాదు. యథార్థమే. రజితాంశలు స్వల్పముగానుండుటచే రజితవ్యవహారము లేదు. శుక్త్యంశబాహుళ్యమువలన శుక్తియనియే వ్యవహరింపఁబడును. ఈయంశమునే భాష్యకారులు శ్రీభాష్యమం దిట్లు సాధించియున్నారు. "సూత్రకారోపి భూతానాం త్రిరూపత్వం తథావదత్, త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వా దితి తేనాభిధాభిదా" సూత్రకారులు నైతము పృథివ్యాది భూతములు మూడాకారములు గలవి యని "త్ర్యాత్మకత్వాత్తుభూయస్త్వాత్." (3-1-2) అనుసూత్రమందుఁ జెప్పియున్నారు. "సోమాభావేచపూతీక గ్రహణం శ్రుతిచోదితం, సోమావయవసద్భావా దితి న్యాయవిదో విదుః" యజ్ఞముచేయునపుడు సోమలత లభింపనియెడల పూతీకతీగయొక్క ముక్కలను గ్రహింపవలెనని శ్రుతియే విధించుచున్నది. అట్లు విధించుటకుఁ గారణము పూతీకమున సోమలతావయవము లుండుటయే యని మీమాంసకులు చెప్పుచున్నారు.

శ్లో. వ్రీహ్యభావేచ నీవారగ్రహణం వ్రీహిభావతః,
తదేవ సదృశం తస్య యత్తద్ద్రవ్యైకదేశభాక్.

వడ్లులేనియెడల నీవారధాన్యములను గ్రహించుట నీవారధాన్యములలో వడ్లయొక్క అవయవము లుండుటవలన సంభవించుచున్నది. కావున నేవస్తువు ఏవస్తువుయొక్క అవయవములతోఁ గూడియున్నదో ఆవస్తువు ఆవస్తువుతో సదృశమయినది. స్వప్నగతము లగు వారిచే మాత్ర మనుభావ్యము లగునవియు, స్వప్నముండువఱకు నుండునవియు నగు పదార్థములను ఆయా ప్రాణుల పుణ్యపాపానుగుణముగా భగవంతుఁడే సృజించుచున్నాఁడు. కావున నివియు సత్యములే యని సూత్రకారులు "సంధ్యే సృష్టిరాహహి, నిర్మాతారంచైకేపుత్రాదయశ్చ, మాయామాత్రంతు కార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వాత్ (3-2-1-2-3) అను నీ మొదలగు సూత్రములచే సమర్థించియున్నారు.

తెల్లగానుండు శంఖము పచ్చగాఁ గానవచ్చుటలోఁ గారణ మేమనఁగా: నేత్రమునందుండు పిత్తపదార్థముతో సంయుక్తములయిన నేత్రరశ్మలు మనము శంఖమును జూచునపుడు శంఖములో సంయుక్తము లగుచున్నవి. అపుడు శంఖగతధావళ్యము నేత్రరశ్మిలయందుండు పీతిమచే నభిభూత మగుటంజేసి మనకుఁ గానరాదు. కాఁబట్టి యట్టిసమయమున నది బంగారుపూఁతె పూసిన శంఖమువలెఁ గానవచ్చును. నేత్రమునందుండు పిత్తపదార్థముగాని పీతవర్ణముగాని అతి సూక్ష్మముగా నుండుటంజేసి చుట్టుప్రక్కల నున్న వారికిఁ గనఁబడదు. అయితే అవి అతిసూక్ష్మములైనను తన నేత్రములయందుండునవి యగుటవలన పిత్తరోగము గలవానికి మాత్రమే కానవచ్చును. సమీపమందుండునట్టి పీతవర్ణమును నిరంతరము చూచుటచేఁ గలుగు సంస్కారవశమున దూరముగానుండు పదార్థములయందలి పీతవర్ణమును గూడ జూచుట కీనయనరశ్ములు సమర్థము లగుచున్నవి. జపాకుసుమసన్నిధియందు స్ఫటికమణి యెఱ్ఱగాఁ గానవచ్చును. ఈజ్ఞానముకూడ సత్యమే. మరుమరీచికయందుఁ బొడము జలజ్ఞానము పైనఁజెప్పఁబడిన పంచీకరణప్రక్రియచే సత్యమని సమర్థింపఁబడినది. ఒకదిక్కునందు దిగంతరముండుటవలనను, అపచ్ఛేదకము లేకుండ దిక్కని వేఱుగా నొక పదార్థమంగీకరింపఁబడక పోవుటవలనను, దిగ్భ్రమకూడ యథార్థమే. ఇట్లు ద్విచంద్రజ్ఞానము, దర్పణాదులు ముఖమును తెలియఁజేయుట, అలాతచక్రము మొదలగునవి కూడ నీమతమందు యథార్థములే.

## అనుమాన నిరూపణము

అనుమితియను తెలివిం బుట్టించునది యనుమానము. అట్టితెలివి పుట్టుటకు లింగజ్ఞానము సాధనము. అట్టి జ్ఞానమునకు ముఖ్యవిషయము సాధ్యము. అది యున్నట్లు భావింపఁబడుస్థలము పక్షము. పర్వతముపై ధూమమును జూచినవాని కచట వహ్ని యుండునని జ్ఞానము కలుగును. అదియే యనుమితి. అందు సాధ్యము వహ్ని. పర్వతము పక్షము. ధూమము లింగము. అయినను ధూమమును జూచినవారందఱు వహ్ని యుండునని యెఱుఁగరు. అందువలన ధూమ మున్నదని తెలిసికొనుట చాలదు. ధూమ మున్నచోట్ల వహ్నియుండు నని తెలిసికొన్నవాఁడు కొండమీఁదఁ బొగఁ జూచి వహ్ని యున్నదని యూహించును. పొగ యున్నచోట్ల నెల్ల నిప్పుండునని తెలిసికొనుటయే వ్యాప్తిజ్ఞాన మనంబడును. వ్యాప్తి అన్వయవ్యాప్తి యనియు వ్యతిరేకవ్యాప్తి యనియు రెండు తెఱఁగులు. వానిలో హేతువున్నచోట్ల సాధ్యముండుట అన్వయవ్యాప్తి. సాధ్యము లేనిచోట హేతు వుండకపోవుట వ్యతిరేకవ్యాప్తి. ఇట్టి రెండువ్యాప్తులకు దృష్టాంత ముండవలెను. పొగయున్నచోనెల్ల నిప్పుండుననుటకు వంటయిల్లు దృష్టాంతము. అది అన్వయదృష్టాంతము. అదియే సపక్ష మనంబడును. నిప్పులేనిచో ధూమ ముండదనుటకు హ్రదము దృష్టాంతము. దానికి వ్యతిరేకదృష్టాంత మని పేరు. అదియే విపక్షము. నిశ్చితసాధ్యము గలది సపక్షము. నిశ్చితసాధ్యాభావము గలది విపక్షము. ఈయనుమానము తనకుం దాన యూహించినది స్వార్థానుమానము. మఱియొకండు ప్రయోగించిన వాక్యములచేఁ దాను తెలిసికొని యూహించినం బరార్థానుమానము. అట్టివాక్యమునకు న్యాయమని పేరు. దానికిఁ బ్రతిజ్ఞా హేతూదాహరణోపనయనిగమంబులని పంచావయవంబు లుండును.

ఉదాహరణము "కొండమీఁద నిప్పుగలదు. పొగ యున్నది గాన. పొగయున్నచోట్లనెల్ల నిప్పుండును. వంటయింటియందువలె. ఇందు నట్టిపొగ యున్నది. కావున నిందు నిప్పుగలదు. ఈయయిదును వరుసగా బ్రతిజ్ఞాదులని యెఱుంగునది. సాధనంబులవలె దోఁచియు సాధకంబులుగాని హేతువులు హేత్వాభాసములు. అవి సవ్యభిచారము, విరుద్ధము, సత్ప్రతిపక్షము, అసిద్ధము, బాధితములని అయిదు విధములు. ఉపమానమని మఱియొక ప్రమాణము గలదు. ఇది యనుమానమం దంతర్భూతము. అర్థాపత్తి, తర్కము, వాదము, జల్పము, వితండ, ఛలము, జాతి మొదలగునవికూడ ననుమానాంతర్భూతములు.

## శబ్ద ప్రమాణము

ఆప్తుడు కానివానిచేఁ జెప్పఁబడని వాక్యమువలనఁ గలుగుజ్ఞానమునకు సాధనమైనది శబ్దప్రమాణము. కారణదోషములగు భ్రమవిప్రలమ్భాదులు బాధకప్రత్యయము లేని వాక్యమైనను ప్రమాణమని చెప్ప

వచ్చును. "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" అను శ్రుతి చెప్పున భగవంతుఁడు సృష్ట్యాదియందు పూర్వపూర్వక్రమవిశిష్టములైన వేదములను స్మరించి చతుర్ముఖుని కుపదేశించును గావున వేదము నిత్యమనియు నపౌరుషేయ మనియు సిద్ధమైనది. కావున దీనికి గారణదోషములు, బాధకప్రత్యయమును లేవు. "ఆమ్నాయస్య క్రియార్థత్వా దానర్థక్య మతదర్థానామ్, తద్భూతానాం క్రియార్థేన సమామ్నాయః" "దృష్టో హి తస్యార్థః కర్మావబోధనం నామ"
అను పూర్వమీమాంసాన్యాయము ననుసరించి, "ఇంద్రం యజేత, యూపేన పశుం బధ్నాతి, ఆహవనీయే జుహోతి," ఇత్యాది వేదవాక్యముల కన్నింటికి కార్యపరత్వమందే ప్రామాణ్యముగాని "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, య స్సర్వజ్ఞ స్సర్వవిత్, పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ" ఇత్యాదిస్వరూప నిరూపకధర్మ ప్రకాశకములు నిరూపితస్వరూపధర్మ ప్రతిపాదకములు నగుశ్రుతులచే బోధింపఁబడు సిద్ధవస్తువగు బ్రహ్మమందుఁ బ్రమాణములు కావనియు నొకవేళ ప్రమాణ మయినచో "ఉపాసీత, ద్రష్టవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" ఇత్యాద్యుపాసనావిధులకు శేషభూతమయి బ్రహ్మ కన్వయ మని సమర్థించిరి. కాని "నీతండ్రి సుఖముగా నున్నాఁడు. నీకుఁ బుత్రుఁడు జన్మించెను. ఆయేటియొడ్డునఁ బండ్లు నమ్ముచున్నారు" అనునిట్టి సిద్ధవస్తుబోధకములగు లౌకికవాక్యములకుఁ గూడ బోధకత్వము కనఁబడుటవలనను, బాలురకుఁ దలిదండ్రులు "వీఁడు మామ, ఇది అక్క, వీఁడు అన్న" అని వ్రేలితోఁ జూపించి తత్తత్సిద్ధవస్తుబోధకములగు శబ్దములను బ్రయోగింపఁగాఁ గాలక్రమమున వాండ్రు వారిని దెలిసికొన శక్తిఁగలవారగుటవలనను సిద్ధవస్తుబోధకతాశక్తి వేదశబ్దములకుఁ గూడ సంభవించుచున్నది. కావున నప్రామాణ్యశంక లేశమును లేదు. దృష్టఫలప్రదర్శనముచే నదృష్టము లగు స్వర్గాదులు ఫలముగా గల సాధనములయందుఁ బ్రవృత్తినిఁ బుట్టించును గావున శ్యేనయాగాదులను బోధించువాక్యములకుఁ గూడఁ బ్రామాణ్యము కలదు. కావున వేదమంతయుఁ బ్రమాణమే. ఇట్టివేదము కర్మభాగమనియు బ్రహ్మభాగమనియు రెండువిధములు. వీనిలోఁ గర్మభాగము భగవదారాధనపరము. బ్రహ్మభాగము భగవంతునిస్వరూపరూపగుణవిభూతులను దెలుపును.

## పూర్వోత్తరమీమాంసల కేకశాస్త్రత్వ

## సమర్థనము

పూర్వోత్తరమీమాంసలు రెండు నొక్కశాస్త్రమే అని "సంహిత మేత చ్ఛారీరకం జైమినీయేన షోడశలక్షణేనేతి శాస్త్రైకత్వ సిద్ధిః" (ఈ బ్రహ్మమీమాంస జైమినిసంబంధి యగు షోడశాధ్యాయములతోఁ గూడిన శాస్త్రముతోఁ జేరియున్నది. కావున శాస్త్రమొక్కటియే యగుట సిద్ధించును) అనువాక్యముచే నీయర్థమును బోధాయనుఁడే తెలియఁజేసియున్నాఁడు. ప్రతిపాదింపఁబడు విషయములకు భేదముండుటనుబట్టి షట్క భేదంబు నధ్యాయభేదంబును గలిగినట్లే పూర్వోత్తరమీమాంసలకు భేదము గలిగినదిగాని స్వతః భేదము లేదు. "అర్థైకత్వా దేకంవాక్యమ్" (అర్థ మొక్కటి యగుటవలన వాక్య మొక్కటియే యగును) అను న్యాయమునుబట్టి ప్రతిపాద్య మొక్కటియగుట వలన భాగద్వయాత్మకమగు వేదమంతయు నొక్కటియై యుండుట ఉపపన్నము, ఏలయన; "వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః," "సర్వే వేదా యత్పద మామనన్తి" ఇత్యాదిశ్రుతిస్మృతిప్రమాణములచే నది బ్రహ్మపరమై యున్నది. వేదార్థవిచార మనుగతమై యుండుటవలన మీమాంసాద్వయము నొక్కశాస్త్రమే అనుట కాటంకము లేదు. కర్మబ్రహ్మవిచారములు రెండు నొక్కశాస్త్రమే అయినయెడల నారంభమందు "అథాతో వేదార్థజిజ్ఞాసా" అని సాధారణార్థ మేల ప్రతిజ్ఞాతము కాలేదు? "అథాతో ధర్మజిజ్ఞాసా" అని పూర్వభాగమునకు సంబంధించినదియే యేల ప్రతిజ్ఞ చేయఁబడినది?" అని అంటివేని చెప్పెదను వినుము. "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనునదియే ఉభయభాగములకు సాధారణమగు ప్రతిజ్ఞ యని తెలిసికొనుము. కర్మవిచారము బ్రహ్మమీమాంసాతృతీయాధ్యాయమందలి చతుర్థపాదములో సంగతమై యున్నది. అది బ్రహ్మవిచారమం దంతర్భవించినను దానిని వేఱుచేయుట ఉపపన్నము. ఎట్లన; న్యాయశాస్త్రమందు నిగ్రహాంతర్భూతము లగు ఛలము, జాతి మఱియొక ఆహ్నికమందు వేఱుగాఁ జెప్పఁబడినవి. ఇందువలనఁ దేలినఫలిత మేమనఁగా నర్థక్రమము వలన బ్రహ్మమీమాంసాతృతీయాధ్యాయచతుర్థపాదమందుఁ గర్మవిచారము చేయుట యుక్తముగా నున్నది. కాని సుకరముగాఁ దెలియుట కొఱకు మొదటనే కర్మవిచార మారంభింపఁబడినది. ఈరీతిగాఁ గర్మబ్రహ్మభాగములు రెండింటికి నసాధారణార్థప్రతిజ్ఞలు రెండును వేఱు వేఱుగాఁ జేయఁబడఁగా సాధారణార్థప్రతిజ్ఞ అర్థాత్సిద్ధమగును. సాధారణార్థము ప్రతిజ్ఞాతమయినను అసాధారణార్థము వేఱుగాఁ బ్రతిజ్ఞ చేయఁబడవలెను. పూర్వమీమాంసకు మొదట ధర్మజిజ్ఞాస ప్రతిజ్ఞాతమైనను "అథాత శ్శేషలక్షణమ్," "అథాతః క్రత్వర్థ పురుషార్థయోర్జిజ్ఞాసా" అని అవాంతరముగా మఱికొన్ని అసాధారణార్థప్రతిజ్ఞలు చేయఁబడినవి. అందుచేఁ బూర్వోత్తరభాగములు రెండింటికి నసాధారణార్థము ప్రతిజ్ఞ చేయుటచేఁ దదనుగతసాధారణార్థ మర్థముగాఁ బ్రతిజ్ఞ చేయఁబడినది యగు ననునభిప్రాయముతో "అథాతో ధర్మజిజ్ఞాసా" అనియే ప్రతిజ్ఞ చేయఁబడినది. కాని "వేదార్థజిజ్ఞాసా" అని ప్రతిజ్ఞ చేయఁబడలేదు. లేక "అథాతో ధర్మజిజ్ఞాసా" అనియే ఉభయభాగసాధారణప్రతిజ్ఞ యని చెప్పెదము. ధర్మమనగా నలౌకికశ్రేయస్సాధనము. అది సాధ్యధర్మ మనియు సిద్ధధర్మ మనియు రెండువిధములు. సిద్ధధర్మము భగవంతుఁడు. "యే చ వేదవిదో విప్రా యే చాధ్యాత్మవిదో జనాః, తే వదన్తి మహాత్మానం కృష్ణం ధర్మం సనాతనం" అని మహాభారతవచనము. "ద్రవ్యక్రియాగుణాదీనాం ధర్మత్వం స్థాపయిష్యతే, తేషా మైంద్రియకత్వేఽపి న తాద్రూప్యేణ ధర్మతా. (ద్రవ్యక్రియాగుణాదులకు ధర్మత్వము స్థిరపరుపఁబడుచున్నది. అవి యింద్రియగోచరములైనను, ఆరూపముతో వానికి ధర్మత్వము లేదు.

ద్రవ్యాదు లున్నను క్రియలు ప్రధానముగాఁ గలిగియుండుటవలనఁ బూర్వభాగము సాధ్యధర్మమును జెప్పునది. ఉపాసనములు నుపాసనాంగము లున్నను బ్రహ్మ ప్రధానముగాఁ గలది. కావున నుత్తరభాగము సిద్ధధర్మపరమై యున్నది. అందువలనఁ బ్రథమప్రతిజ్ఞ ఉభయభాగ విచారమునకుఁ బోధుపుగా నున్నది. ధర్మశబ్దము సాధ్యధర్మవిషయ మగుట ప్రసిద్ధము. కావున నదియే బుద్ధిస్థమగుటవలనను, పూర్వభాగమందు జెప్పబడినది యగుటచే మొదటిది యగుటవలనను ధర్మజిజ్ఞాసాపదముచేఁ బ్రతిజ్ఞ ఉపపన్న మగుచున్నది. సిద్ధధర్మము సాధారణ ప్రతిజ్ఞచేతనే అర్థముగాఁ బ్రతిజ్ఞాత మైనను బహుగ్రంథవ్యవధానము గలిగియుండుటచే శబ్దముచే బోధింపఁబడదను శంకను పరిహరించుటకు "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అని మఱల ప్రతిజ్ఞ చేయబడినది. జన్మాదిసూత్రముచే దానిలక్షణము చెప్పఁబడినది. కావున నీరీతిగాఁ బూర్వోత్తరమీమాంస లొకటే శాస్త్ర మని సమర్థింపఁబడినది. కాని పూర్వభాగ మార్గమందుఁగూడ సిద్ధధర్మరూపుఁ డగు భగవంతుఁడు సకలకర్మలచే నారాధ్యుఁ డగుటచే నతఁడే ప్రధాన ప్రతిపాద్యుఁ డని తెలియవచ్చుచుండఁగాఁ బూర్వభాగము సాధ్యధర్మప్రధానమని చెప్పుట పైనుదాహరింపఁబడినవచనముతో విరోధింపదా యని పలుకుదువేమో? పూర్వోదాహృతవచనమందున్న వేదవిచ్ఛబ్దము పూర్వభాగ మెఱింగిన వారిని జెప్పుచున్నది: "గోబలీవర్ద న్యాయముగా "విష్ణునామా స వేదేషు వేదాన్తేషు చ గీయతే" అనుదానితో నేకార్థతను గలిగియున్నది. కర్మ అప్రధానమని ప్రతిపాదించుటలో విరోధము లేకపోలేదు. కర్మ ప్రధానమని ప్రతిపాదించుట జైమిని కిష్టమే గాని "రాజపురుషుఁడు" అను షష్ఠీతత్పురుషసమాసమందు సమాసతాత్పర్యమును బట్టి రాజున కెట్లు ప్రాధాన్యము కలదో అట్లనే వాస్తవముగాఁ బ్రాధాన్యము పరబ్రహ్మమున కే. రాజపురుషుని కెట్లు ప్రాధాన్యమో అట్లే శాబ్దముగాఁ గర్మకుఁ బ్రాధాన్యము. పూర్వభాగమందుఁ గర్మ భగవదారాధనరూప మని తెలియచేయఁ బడలేదు. ఆయంశము వచుట దెలియఁజేయుట అనవసరము. ఎట్లన; కర్మలు పరదేవతానిరపేక్షముగా నంతముగల స్వర్గాదిఫలముల నిచ్చునని శ్రుతిస్మృతులు తెలియఁజేయుచున్నవి. "యో హ వా ఏత దక్షరం గార్గ్య విదిత్వా అస్మిఁల్లోకే జుహోతి యజతే తప స్తప్యతే బహూని వర్షసహస్రా ణ్యంతవ దేవాస్య భవతి," "అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ, న తు మా మభిజానన్తి తత్త్వే నాత శ్చ్యవంతి తే" అందువలనఁ బరదేవతానైరపేక్ష్యరూపమగు ప్రాధాన్యము కర్మకుఁ గలదు. కావునఁ బూర్వభాగమందు గర్మకు మొదటఁ బ్రాధాన్యము తెలుపఁబడినది. ఆకర్మ పరమాత్మారాధనరూప మని వెనుకనుండి తెలియఁబడఁదగినదగుటచే విరోధము లేదు. కాఁబట్టి ప్రతిజ్ఞ ఉపపన్నమై యున్నది.

కావున శాస్త్రైక్యము సరిపోయినది. ఆలోచింపఁగా జైమిని కర్మబ్రహ్మమీమాంస లొకటే శాస్త్ర మని చెప్పకపోయినను బాదరాయణుఁ డారెండిటి నేకశాస్త్రముగా నంగీకరించి బ్రహ్మసూత్రములను రచించెను.

భాగద్వయాత్మకమగు నిట్టివేదము ఋగ్యజుస్సామాథర్వణము లని నాలుగువిధములు. ఇది మరల మంత్రమనియు నర్థవాదమనియు విధియనియు మూఁడువిధములు. కర్మప్రయోగంబులో ఫలసిద్ధికై యుచ్చరింపఁబడునది మంత్రము. విధినిషేధవిషయముల ప్రాశస్త్య నింద్యత్వంబులం దెలుపువాక్యము అర్థవాద మనంబడును. ఇట్లు సేయవలయు నిట్లు సేయఁగూడదనియుం జెప్పునది విధి. అది అపూర్వవిధి, పరిసంఖ్యావిధి, నియమవిధియని మూఁడువిధములు. వానివివరణము మీమాంసార్థప్రకాశిక, లౌగాక్షి మొదలగు గ్రంథములలోఁ జూచుకొనవలయును.

ఇట్లు ప్రమాణములను నిరూపించి ప్రమేయమును గుఱించి యిఁకఁ జెప్పఁబోవుచున్నాము.

ఈ రామానుజదర్శనమందు చిత్తు, అచిత్తు, ఈశ్వరుఁడు నని మూఁడు తత్త్వములు. ఈవిభాగము, "భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా" అను శ్వేతాశ్వతరశ్రుతిమూలముగాఁ గలిగినది. వీనిలో భోక్త యనఁగా జీవుఁడు. భోగ్యమనఁగా నచిత్తు. ప్రేరిత ఈశ్వరుఁడు.

"సర్వం ఖ ల్విదం బ్రహ్మ" అని జగద్బ్రహ్మలకు సామానాధికరణ్యముచే బ్రహ్మమొక్కటియే తత్త్వ మనియు, "స దేవ సోమ్యేద మగ్ర ఆసీ దేక మే వాద్వితీయమ్." ఇత్యాదులచేఁ దత్త్వమొక్కటియే యనియుఁ జెప్పఁబడియుండఁగాఁ దత్త్వములు మూఁడనుటకు హేతు వేమి యని యంటివేని, జాతివ్యక్తి, గుణిగుణము, ధర్మిధర్మము ఎట్లు ప్రకారప్రకారి భావాపత్తిచే నపృథక్సిద్ధములై యొక్కటిగాఁ గానవచ్చుచు స్వరూపభేదముచే ననేకములై యున్నవో అట్లనే ప్రకారి యగు నీశ్వరుఁడు ప్రకారములగు చిదచిత్తులు నొకతీరుగాఁ గలిసి తత్త్వమొక్కటియే యన్నట్లున్నవి. స్వరూపభేదముచే ననేకములై యున్నవి. "అనేన జీవే నాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి। త త్సృష్ట్వా త దే వానుప్రావిశత్। య స్యాత్మా శరీరం, యస్య పృథ్వీ శరీరం" ఇత్యాదిశ్రుతులచే నీశ్వరునికిఁ జిదచిత్తులకు శరీరశరీరిభావము తెలియఁజేయబడుచున్నది. "దేవదత్తో గచ్ఛతీ" త్యాదులయందు "దేవదత్త పిండవిశిష్టఆత్మా గచ్ఛతి" యని యర్థమగుచున్నది. దేవదత్తాదిపదసంకేతము శరీరమునకుఁ గాని తద్విశిష్టమగు నాత్మకుఁ గాదు. అయినను "శరీరవాచక పదానాం శరీరిపర్యంతాభిధానమ్" అను న్యాయముచే శరీరవాచకపదములు శరీరిని బోధించునవి. కణాద కృతమై శేషికశాస్త్రము. తృతీయాధ్యాయము. 12 సూత్రము. "దేవదత్తో గచ్ఛతి యజ్ఞదత్తో గచ్ఛ తీత్యుపచారా చ్ఛరీరే ప్రత్యయః". "యద్యపి దేవదత్తత్వం శరీరవృత్తి ర్జాతి స్తేన దేవదత్తో గచ్ఛతీతి ముఖ్య ఏవ ప్రయోగః, యథార్థ ఏవ చ ప్రత్యయః, యద్యపి దేవదత్తత్వం శరీరవృత్తిర్జాతి స్తేనదేవదత్తో గచ్ఛతీతి ముఖ్య ఏవ ప్రయోగః; యథార్థ ఏవ చ ప్రత్యయః దేవదత్తపదం తదవచ్ఛిన్నాత్మ న్యప్యేతి" (ఉపస్కారము) ఈయర్థమునే

భగవద్రామానుజముని వేదార్థసంగ్రహమం దిట్లు ప్రతిపాదించి యున్నారు "అశ్రుతవేదాన్తాః పురుషాః సర్వే పదార్థాః సర్వే జీవాత్మానశ్చ బ్రహ్మాత్మకా ఇతి న పశ్యన్తి సర్వశబ్దానాం చ కేవలేషు తత్తత్పదార్థేషు వాచ్యపర్యవసానం మన్యన్తే వేదాన్తవాక్యశ్రవణేన బ్రహ్మకార్యతయా తదన్తర్యామికతయా సర్వస్య బ్రహ్మాత్మకత్వం సర్వశబ్దానాం తత్ప్రకారసంస్థితబ్రహ్మవాచిత్వం చ జానన్తి. నన్వేవం *వాదిశబ్దానాం తత్తత్పదార్థవాచితయా వ్యుత్పత్తి ర్బాధితా స్యాత్ నైవమ్; సర్వే శబ్దాః అచిజ్జీవవిశిష్టపరమాత్మనో వాచకాః, ఇత్యుక్తం, నామరూపే వ్యాకరవాణీ త్యత్ర; తత్ర లౌకికాస్తు పురుషాః శబ్దం వ్యవహరన్తః శబ్దవాచ్యే ప్రధానాంశస్యైవ పరమాత్మనః ప్రత్యక్షాద్యపరిచ్ఛేద్యత్వాత్ వాచ్యైకదేశభూతే వాచ్యపరిసమాప్తిం మన్యన్తే వేదాన్తశ్రవణేన హి వ్యుత్పత్తిః పూర్యతే; ఏవమేవ వైదికాః శబ్దాః సర్వే పరమాత్మపర్యన్తాః స్వార్థా న్బోధయన్తి; వైదికా ఏవ సర్వే శబ్దాః ఆదౌ వుద్ధృత్య తోఽర్థపృథక్త్వ పరేణైవ బ్రహ్మణా సర్వపదార్థా న్పూర్వవ త్సృష్ట్వా తేషు పరమాత్మపర్యంతేషు పూర్వవ న్నామతయా ప్రయుక్తాః; తథాహ మనుః (1-21) "సర్వేషాం తు స నామాని కర్మాణి చ పృథక్పృథక్; వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్సంస్థాశ్చ నిర్మమే" సంస్థాః—సంస్థానాని, రూపాణీతి యావత్; ఆహ చ భగవా న్పరాశరః, "నామ రూపం చ భూతానాం కృత్యానాం చ ప్రపంచనమ్, వేదశబ్దేభ్య ఏవాదౌ దేవాదీనాం చకార సః" శ్రుతిశ్చ: సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్" సూర్యాదీ న్పూర్వవ త్ప్రకల్ప్య నామాని చ పూర్వవ చ్చకారేత్యర్థః; ఏవం జగద్బ్రహ్మణో రనన్యత్వం ప్రపంచితమ్. (వేదాన్త మెఱుంగని వారు సకలపదార్థములు సర్వజీవాత్మలు బ్రహ్మాత్మకము లని యెఱుంగరు. ఆయాయి పదార్థములను జెప్పు సకలశబ్దములకు నాయాయి యర్థములయందే శక్తియని తలంచుచున్నారు. గురుముఖముగా వేదాన్తవాక్యముల యర్థమును దెలిసికొన్నవారు జగమంతయు బ్రహ్మకార్యమగుటవలనను, జగమునకు బ్రహ్మ అంతర్యామిగా నుండుటవలనను, సర్వము బ్రహ్మాత్మక మనియును, సర్వశబ్దములు వానివానిని ప్రకారముగా గలిగియున్న బ్రహ్మమునే చెప్పుననియును దెలిసికొందురు. ఇట్లయినచో నియతము లగు నాయాయి యర్థములను జెప్పు ఘటము పటము గోవు మొదలగు శబ్దములవ్యుత్పత్తికి బాధకాదా? అందువేమో అట్లు కాదు. వినుము చెప్పెదను. శబ్దము లన్నియును అచిత్తు, జీవుఁడు విశేషణములుగాఁ గలిగియున్న పరమాత్మనే చెప్పు నని నామరూపవ్యాకరణశ్రుతిచేఁ జెప్పఁబడినది. శబ్దములను బ్రయోగించుచుండెడు లౌకికులు ప్రధానాంశమగు పరమాత్మ ప్రత్యక్షాదిప్రమాణములకు గోచరింపనివాఁడగుటవలన శబ్దముచేఁ జెప్పఁబడు నర్థముయొక్క యేకభాగమందే దానియర్థమంతయుఁ బరిసమాప్తమని తలంచుచున్నారు. వేదాంతవాక్యశ్రవణముచే జ్ఞానము పూర్ణమగును. ఈ రీతిగానే వైదిక శబ్దములుకూడ పరమాత్మపర్యంతమగు తమయర్థమును బోధించుచున్నవి. మొట్టమొదట బ్రహ్మ వైదికశబ్దములవలననే సర్వపదార్థములను మును పటివలెఁ బేరుపెట్టెను. మనువుకూడ దనస్మృతియందు ప్రథమాధ్యాయము 21 శ్లోకములో "బ్రహ్మ సర్వపదార్థములయొక్క రూపములను నామములను కర్మలను వేదశబ్దములనుండియే సృజించెను." ఈ యర్థమునే (బ్రహ్మసూత్ర ప్రథమాధ్యాయ తృతీయపాదమం దున్న దేవతాధికరణములో 27 సూ.) "శబ్ద ఇతి చే న్నాతః ప్రభవాత్ప్రత్యక్షానుమానాభ్యామ్" అను సూత్రముచే బ్రహ్మసూత్రకారుఁడు కూడఁ బ్రతిపాదించెను. ఇట్లు ప్రకారప్రకారిభావముచేఁ జిదచిత్తులకు బ్రహ్మకంటె స్వరూపమును బట్టి భేదము, విశిష్టవేషమును బట్టి ఐక్యమును శ్రుతులు చెప్పుచున్నవి. "క్షరం ప్రధాన మమృతాక్షరం హరః", క్షరాత్మానావీశతే దేవ ఏకః" — ప్రకృతి క్షరము, జీవుఁడమృతాక్షరము, ప్రకృతిజీవుల నిద్దరి నొక్కదేవుడే ఆయాయి కార్యములయందు నియమించుచుండును. ఇచ్చటఁ బ్రధానమునుఁ దనకు భోగ్యముగా గ్రహించుచున్నందున హరశబ్దముచే జీవుఁడు చెప్పఁబడుచున్నాఁడు. జీవునికి నాశము లేనందున అమృతమనియు, స్వరూపపరిణామము లేనందున అక్షరమనియుఁ జెప్పఁబడుచున్నాఁడు. "వ్యక్తావ్యక్తం భరతే విశ్వమీశః" ప్రకృతి జీవాత్మకమగు నీవిశ్వము నీశ్వరుఁడు భరించుచున్నాఁడు. ఇచటఁ బ్రకృతిజీవులు ధార్యులు. ఈశ్వరుఁడు ధారకుఁడు. ఇందువలన భేదము బోధింపఁబడుచున్నది.

"స కారణం కరణాధిపాధిపో న చాస్య కశ్చిజ్జనితా న చాధిపః"-ఆయీశ్వరుఁడు జగత్తునకుఁ గారణము. ఇంద్రియముల కధిపతి యగు జీవునికిఁ బ్రభువు. ఆయీశ్వరునికిఁ గారణముగాని యధిపతిగాని యింకొకఁడు లేఁడు. ఈశ్రుతిలోఁ బరమాత్మకు నీశితృత్వము జీవులకీశితవ్యత్వము చెప్పఁబడియుండుటచే జీవేశ్వరులకు భేదము చెప్పఁబడెను. "ప్రధానక్షేత్రజ్ఞపతి ర్గుణేశః" ప్రకృతికిని జీవులకును ప్రభువు. సత్త్వరజస్తమోగుణములకు నియామకుఁడు. ఈశ్రుతిచేఁ గరణాధిపాధిప శబ్దము వివరింపఁబడినది. "పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతం శివమచ్యుతమ్" పరమాత్మ విశ్వమునకుఁ బతియును, జీవాత్మల కీశ్వరుఁడును, నిత్యుఁడును మంగళస్వరూపుఁడును వినాశములేనివాఁడు నగుచున్నాఁడు. ఈశ్రుతి పరమాత్మకంటె మఱియొక్కయీశ్వరుఁడు లేఁడనియు, జగత్తంతయు నీశ్వరునికి శేషమనియు, దానికిఁ బరమాత్మ శేషియనియు నిట్టిభేదమును నిరూపించుచున్నది. ఇచ్చటి పతిశబ్దము శేషివాచకముగాని రక్షకవాచకము కాదు. పతిశబ్దము శేషియందు రూఢము. శేషశేషిలక్షణము ముందు వివరింపఁబడును.

"జ్ఞాజ్ఞౌ ద్వావజావీశనీశౌ"-జన్మరహితులగు జీవేశ్వరులలో నొకఁడు సర్వజ్ఞుఁడు. మఱియొకఁడు కించిజ్జ్ఞుఁడు. ఒకఁడు నియన్త, మఱియొకఁడు నియామ్యుఁడు. ఈశ్రుతి కించిజ్జ్ఞత్వసర్వజ్ఞత్వాదులచే జీవేశ్వరులకు భేదమును దెలుపుచున్నది. "నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్"- నిత్యులు చేతనులు నగు ననేకజీవులకు నిత్యుఁడును, చేతనుఁడునగు నొకఁడైన యీశ్వరుఁడు కర్మఫలముల నిచ్చుచున్నాఁడు. ఈశ్రుతి జీవేశ్వరుల కుత్పత్తిప్రళయములు లేవనియు, జీవులకుఁ గర్మఫలభోక్తృత్వమును,

శ్వరునికిఁ గర్మఫలదాతృత్వమును, ననుభిన్నధర్మములు గలవా రని బ్రతిపాదించుచున్నది. "భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా"-భోక్తయగు జీవుఁడు, భోగ్యమగు ప్రకృతిని, ప్రేరకుఁడైన పరమాత్మను దెలిసికొని ముక్తినొందును. ఈశ్రుతి జీవప్రకృతిపరమాత్మలకు భోక్తృభోగ్యనియంతృత్వములచేత భేదమును బోధించుచున్నది.

"తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్న న్నన్యో అభిచాకశీతి"—జీవేశ్వరులలో నొకఁడైన జీవుఁడు కర్మఫలము ననుభవించుచున్నాఁడు. మఱియొకఁడైన యీశ్వరుఁ డాకర్మఫలము ననుభవింపక యే ప్రకాశించుచున్నాఁడు. ఈశ్రుతియందు జీవేశ్వరులకుఁ గర్మఫలభోక్తృత్వాభోక్తృత్వములచే భేదమున్నదని తెలుపుటయే కాక యీశ్వరస్వరూపము దోషాసంస్పృష్టమని కూడ బోధింపఁబడుచున్నది. "పృథగాత్మానం ప్రేరితారం చ మత్వాజుష్ట స్తత స్తే నామృతత్వ మేతి" జీవాత్మను పరమాత్మను వేఱుగాఁ దెలిసికొని యట్టిజ్ఞానముతోఁ గూడిన వాఁడై ముక్తినొందునని యీశ్రుతి చెప్పుచున్నది. ఇట్టిశ్రుతులు వందల కొలఁది యున్నవి. గ్రంథవిస్తరభీతిచే వాని నన్నింటి నిచట వ్రాయ లేదు. స్మృతివచనములుకూడ నీయర్థము నే ప్రకటించుచున్నవి. ఎట్లన; "భూమి రాపో ఽనలో వాయుః ఖం మనోబుద్ధి రేవచ, అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా" "అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్, జీవభూతాం మహాబాహో! య యేదం ధార్యతే జగత్ (గీత 7 అ 5 శ్లో 6) భూమి, ఉదకము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు లోనగు నింద్రియవర్గము, మహత్తత్త్వము, అహంకారము, అను నెనిమిది భేదములు గలిగి ప్రపంచకమున కుపాదానకారణమైన ప్రకృతి నాసంబంధమైనది. దీని కపర ప్రకృతి యని పేరు. దీనికంటె విలక్షణమగు మఱియొకప్రకృతి కలదు. దానినిఁ బరాకృతియనియు, జీవుఁడనియుఁ దెలిసికొనుము. దానిచే నీయచేతనజగమంతయు ధరింపఁబడుచున్నది. ఇట్లనివిధవిధములుగా నున్న ప్రకృతి నాసంబంధ మయినదని శ్రీకృష్ణభగవాను లర్జునుని కుపదేశించుటచేఁ గారణదశయందును ప్రకృతిజీవపరమాత్మలకు భేదము సిద్ధించుచున్నది. "సర్వభూతాని కౌంతేయ! ప్రకృతిం యాన్తి మామికాం; కల్పక్షయే పున స్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్ (గీత 9 అ7 శ్లో) ప్రళయకాలమందు స్థావరజంగమాత్మకములగుసర్వభూతములు నాశరీరమయిన ప్రకృతియందుఁ బ్రవేశించుచున్నవి. మరల సృష్టికాలమందు వానిని సృజించుచున్నాను. "ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునఃపునః। భూతగ్రామ మిమంకృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్" (గీ 9 అ 8 శ్లో) నాసంబంధమైన ప్రకృతి నెనిమిదివిధములుగాఁ బరిణమింపజేసి గుణత్రయాత్మకమయిన నాప్రకృతికి లోబడియుండు చతుర్విధభూతములను సృష్టికాలమందు మాటిమాటికి సృజించుచున్నాను. "మ యాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరం। హేతు నానేన కౌంతేయ! జగద్ధి పరివర్తతే" (గీ. 9 అ-10) ప్రకృతి నన్నధ్యక్షునిగాఁ బొందినదయి చరాచరప్రపంచమునుసృజించుచున్నది. ఇందుచేతనే జగత్తు మాఱుచున్నది. "ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభా వపి" (గీ-13-20) ప్రకృతి జీవుఁడు అనాదు లని తెలిసికొనుము. ఈవిధముగా సర్వావస్థలయందు భోక్తృభోగ్యరూపములతో నున్న చిదచిత్తులు పరమాత్మకు శరీరమనియు నియామ్యములనియుఁ బరమాత్మకంటె బృథక్‌స్థితి లేనివనియుఁ బరమాత్మ చిదచిత్తులకు నాత్మగ నున్నాఁడనియు మఱి కొన్నిశ్రుతులు ప్రతిపాదించుచున్నవి. "యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా మంత రోయం పృథివీ నవేద। యస్య పృథివీ శరీరం, యః పృథివీమంతరో యమయ త్యేష త ఆత్మాం తర్యా మ్యమృతః । య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽన్తరో య మాత్మా న వేద; య స్యాత్మా శరీరం, య ఆత్మాన మంతరో య మయతి, ఏష త ఆత్మా న్తర్యా మ్యమృతః" ఎవఁడు జీవునియందున్నవాఁడై జీవునిలోపలనుండునో యెవనిని జీవుఁ డెఱుఁగఁడో ఎవనికి జీవుఁడు శరీరమో ఎవఁడు జీవునిలోపల నుండి యాజీవుని నియమించుచుండునో అతఁడు వినాశములేనివాఁడు.

ఇట్లు బృహదారణ్యకోపనిషత్తులోని అంతర్యామిబ్రాహ్మణమంతయు నీయర్థమునే చెప్పుచున్నది. సుబాలోపనిషత్తులో "యః పృథివీ మన్తరే సంచరన్, యస్య పృథివీ శరీరం, యం పృథివీ న వేద" అని యారంభించి "యో ఽక్షర మన్తరే సంచరన్ య స్యాక్షరంశరీరం య మక్షరం న వేద, యో మృత్యు మన్తరే సంచరన్ యస్య మృత్యు శ్శరీరం యం మృత్యు ర్న వేద, ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా. సర్వాత్మకుఁడైన పరమాత్మ సకలజనులయొక్క హృదయమందుఁ బ్రవేశించి శాసకుఁడైయున్నాఁడు. ఈ శ్రుతియును జీవేశ్వరులకు శరీరశరీరిభావమును బోధించుచున్నది. సగుణశ్రుతులు, నిర్గుణశ్రుతులు, భేదశ్రుతులు, అభేదశ్రుతులు, ఘటకశ్రుతులునని శ్రుతు లైదువిధములు. వీనిలో ఘటకశ్రుతులు భేదశ్రుతులకు నభేదశ్రుతులకు గలవిరోధమును దొలఁగించి యేకార్థత్వమును సమర్థించునవి. ఈప్రకారము సర్వావస్థలయందును చిదచిత్తులను శరీరముగాఁ గలవాఁడై యున్నందునఁ బరమాత్మయే కారణదశను కార్యదశను పొందియుండి, సృష్టికిఁ బూర్వమందు సూక్ష్మరూపమును, సృష్టికిఁ బరమందు స్థూలరూపమును ధరించి జగదాకారముతో నిలిచియున్నాఁడు. "స దేవ సో మ్యేద మగ్ర ఆసీ దేక మే వాద్వితీయమ్; త దైక్షత బహుస్యాం ప్రజాయే యేతి, త త్తేజో ఽసృజత"ఇత్యాది శ్రుతులు కార్యకారణదశలను బొందిన ప్రపంచము పరమాత్మయని నిర్దేశించుచున్నవి. "తద్ధేదం తర్హ్య వ్యాకృత మాసీ త్తన్నామరూపాభ్యాం వ్యాక్రియత" అనుశ్రుతి సృష్టికిఁ బూర్వ మీప్రపంచకముయొక్క నామరూపములు వ్యక్తములు గాకుండెననియు సృష్ట్యనంతరమందు నామరూపములతో నీప్రపంచకము వ్యక్తమయ్యెననియుఁ గావునఁ గార్యావస్థనొందినవాఁడును, కారణావస్థనొందినవాఁడును, స్థూలసూక్ష్మ చిదచిద్వస్తుశరీరకుఁడైన పరమాత్మయే అయినందునఁ గార్యకారణములకు భేదము లేదనియు, నందువలనఁ గారణవిజ్ఞానముచేఁ గార్యవిజ్ఞానము కలుగుచున్నదనియుఁ దెలుపుచున్నది.

భగవద్రామానుజముని వేదార్థసంగ్రహమం దిట్లు ప్రతిపాదించి యున్నారు "అశ్రుతవేదాన్తాః పురుషా స్సర్వే పదార్థా స్సర్వే జీవాత్మానశ్చ బ్రహ్మాత్మకా ఇతి న పశ్యన్తి సర్వశబ్దానాం చ కేవలేషు తత్తత్పదార్థేషు వాచ్యపర్యవసానం మన్యన్తే వేదాన్తవాక్యశ్రవణేన బ్రహ్మకార్యతయా తదన్తర్యామికతయా సర్వస్య బ్రహ్మాత్మకత్వం సర్వశబ్దానాం తత్ప్రకారసంస్థితబ్రహ్మవాచిత్వం చ జానన్తి. నన్వేవం గవాదిశబ్దానాం తత్తత్పదార్థవాచితయా వ్యుత్పత్తి ర్బాధితా స్యాత్ నైవమ్; సర్వే శబ్దాః అచిజ్జీవవిశిష్టపరమాత్మనో వాచకాః, ఇత్యుక్తం, నామరూపే వ్యాకరవాణీ త్యత్ర; తత్ర లౌకికాస్తు పురుషా శ్శబ్దం వ్యవహారంతః శబ్దవాచ్యే ప్రధానాంశస్యైవ పరమాత్మనః ప్రత్యక్షాద్యపరిచ్ఛేద్యత్వాత్ వాచ్యైకదేశభూతే వాచ్యపరిసమాప్తిం మన్యన్తే వేదాన్తశ్రవణేన హి వ్యుత్పత్తిః పూర్యతే; ఏవమేవ వైదికా శ్శబ్దా స్సర్వే పరమాత్మపర్యన్తా న్స్వార్థా న్బోధయన్తి; వైదికా ఏవ సర్వే శబ్దాః ఆదౌ వుద్ధృత్య పరేణైవ బ్రహ్మణా సర్వపదార్థా న్పూర్వవ త్సృష్ట్వా తేషు పరమాత్మపర్యంతేషు పూర్వవ న్నామతయా ప్రయుక్తాః; తథాహ మనుః (1-21) "సర్వేషాం తు స నామాని కర్మాణి చ పృథక్పృథక్; వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్సంస్థాశ్చ నిర్మమే" సంస్థాః—సంస్థానాని, రూపాణీతి యావత్; ఆహ చ భగవా న్పరాశరః, "నామ రూపం చ భూతానాం కృత్యానాం చ ప్రపంచనమ్, వేదశబ్దేభ్య ఏవాదౌ దేవాదీనాం చకార సః" శ్రుతిశ్చ: సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్" సూర్యాదీ న్పూర్వవ త్పరికల్ప్య నామాని చ పూర్వవ చ్చకారేత్యర్థః; ఏవం జగద్బ్రహ్మణో రనన్యత్వం ప్రపంచితమ్. (వేదాన్త మెఱుంగనివారు సకలపదార్థములు సర్వజీవాత్మలు బ్రహ్మాత్మకము లని యెఱుంగరు. ఆయాయి పదార్థములను జెప్పు సకలశబ్దములకు నాయాయి యర్థములయందే శక్తియని తలంచుచున్నారు. గురుముఖముగా వేదాన్తవాక్యముల యర్థమును దెలిసికొన్నవారు జగమంతయు బ్రహ్మకార్యమగుటవలనను, జగమునకు బ్రహ్మ అంతర్యామిగా నుండుటవలనను, సర్వము బ్రహ్మాత్మకమనియును, సర్వశబ్దములు వానివాని ప్రకారముగా గలిగియున్న బ్రహ్మమునే చెప్పుననియును దెలిసికొందురు. ఇట్లయినచో నియతము లగు నాయాయి యర్థములను జెప్పు ఘటము పటము గోవు మొదలగు శబ్దములవ్యుత్పత్తికి బాధకాదా? అందువేమో అట్లు కాదు. వినుము చెప్పెదను. శబ్దము లన్నియును అచిత్తు, జీవుఁడు విశేషణములుగాఁ గలిగియున్న పరమాత్మనే చెప్పు నని నామరూపవ్యాకరణశ్రుతిచేఁ జెప్పఁబడినది. శబ్దములను బ్రయోగించుచుండెడు లౌకికులు ప్రధానాంశ మగు పరమాత్మ ప్రత్యక్షాదిప్రమాణములకు గోచరింపనివాఁ డగుటవలన శబ్దముచేఁ జెప్పఁబడు నర్థముయొక్క యేకభాగమందే దానియర్థమంతయుఁ బరిసమాప్తమని తలంచుచున్నారు. వేదాంతవాక్యశ్రవణముచే జ్ఞానము పూర్ణమగును. ఈ రీతిగానే వైదికశబ్దములుకూడ పరమాత్మపర్యంతమగు తమయర్థమును బోధించుచున్నవి. మొట్టమొదట బ్రహ్మ వైదికశబ్దములవలననే సర్వపదార్థములను మును పటివలెఁ బేరుపెట్టెను. మనువుకూడ దనస్మృతియందు ప్రథమాధ్యాయము 21 శ్లోకములో "బ్రహ్మ సర్వపదార్థములయొక్క రూపములను నామములను కర్మలను వేదశబ్దములనుండియే సృజించెను." ఈ యర్థమునే (బ్రహ్మసూత్ర ప్రథమాధ్యాయ తృతీయపాదమం దున్న దేవతాధికరణములో 27 సూ.) "శబ్ద ఇతి చే న్నాతః ప్రభవాత్ప్రత్యక్షానుమానాభ్యామ్" అను సూత్రముచే బ్రహ్మసూత్రకారుఁడు కూడఁ బ్రతిపాదించెను. ఇట్లు ప్రకారప్రకారిభావముచేఁ జిదచిత్తులకు బ్రహ్మకంటె స్వరూపమును బట్టి భేదము, విశిష్టవేషమును బట్టి ఐక్యమును శ్రుతులు చెప్పుచున్నవి. "క్షరం ప్రధాన మమృతాక్షరం హరః", క్షరాత్మా నావీశతే దేవ ఏకః" — ప్రకృతి క్షరము, జీవుఁడమృతాక్షరము, ప్రకృతిజీవుల నిద్దరి నొక్కదేవుఁడే ఆయాయి కార్యములయందు నియమించుచుండును. ఇచ్చటఁ బ్రధానమునుఁ దనకు భోగ్యముగా గ్రహించుచున్నందున హరశబ్దముచే జీవుఁడు చెప్పఁబడుచున్నాఁడు. జీవునికి నాశము లేనందున అమృతమనియు, స్వరూపపరిణామము లేనందున అక్షరమనియుఁ జెప్పఁబడుచున్నాఁడు. "వ్యక్తావ్యక్తం భరతే విశ్వమీశః" ప్రకృతి జీవాత్మకమగు నీవిశ్వము నీశ్వరుఁడు భరించుచున్నాఁడు. ఇచటఁ బ్రకృతిజీవులు ధార్యులు. ఈశ్వరుఁడు ధారకుఁడు. ఇందువలన భేదము బోధింపఁబడుచున్నది.

"స కారణం కరణాధిపాధిపో న చాస్య కశ్చిజ్జనితా న చాధిపః"—ఆయీశ్వరుఁడు జగత్తునకుఁ గారణము. ఇంద్రియముల కధిపతియగు జీవునికిఁ బ్రభువు. ఆయీశ్వరునికిఁ గారణముగాని యధిపతిగాని యింకొకఁడు లేఁడు. ఈశ్రుతిలోఁ బరమాత్మకు నీశితృత్వము జీవులకీశితవ్యత్వము చెప్పఁబడియుండుటచే జీవేశ్వరులకు భేదము చెప్పఁబడెను. "ప్రధానక్షేత్రజ్ఞపతి ర్గుణేశః" ప్రకృతికిని జీవులకును ప్రభువు. సత్త్వరజస్తమోగుణములకు నియామకుఁడు. ఈశ్రుతిచేఁ గరణాధిపాధిపశబ్దము వివరింపఁబడినది. "పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతం శివమచ్యుతమ్" పరమాత్మ విశ్వమునకుఁ బతియును, జీవాత్మల కీశ్వరుఁడును, నిత్యుఁడును మంగళస్వరూపుఁడును వినాశము లేనివాఁడు నగుచున్నాఁడు. ఈశ్రుతి పరమాత్మకంటె మఱియొక యీశ్వరుఁడు లేఁడనియు, జగత్తంతయు నీశ్వరునికి శేషమనియు, దానికిఁ బరమాత్మ శేషి యనియు నిట్టి భేదమును నిరూపించుచున్నది. ఇచ్చటి పతిశబ్దము శేషివాచకముగాని రక్షకవాచకము కాదు. పతిశబ్దము శేషియందు రూఢము. శేష శేషిలక్షణము ముందు వివరింపఁబడును.

"జ్ఞాజ్ఞౌ ద్వా వజా వీశానీశౌ"—జన్మరహితులగు జీవేశ్వరులలో నొకఁడు సర్వజ్ఞుఁడు. మఱియొకఁడు కించిజ్జ్ఞుఁడు. ఒకఁడు నియన్త, మఱియొకఁడు నియామ్యుఁడు. ఈశ్రుతి కించిజ్జ్ఞత్వసర్వజ్ఞత్వాదులచే జీవేశ్వరులకు భేదమును దెలుపుచున్నది. "నిత్యో నిత్యానాం చ్చేతన శ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్"—నిత్యులు చేతనులు నగు ననేకజీవులకు నిత్యుఁడును, చేతనుఁడునగు నొకఁడైన యీశ్వరుఁడు కర్మఫలముల నిచ్చుచున్నాఁడు. ఈశ్రుతి జీవేశ్వరుల కుత్పత్తిప్రళయములు లేవనియు, జీవులకుఁ గర్మఫలభోక్తృత్వమును,

ఈశ్వరునికిఁ గర్మఫలదాతృత్వమును, అనుభిన్నధర్మములు గలవా రని బతిపాదించుచున్నది. "భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా"- భోక్తయగు జీవుఁడు, భోగ్యమగు ప్రకృతిని, ప్రేరకుఁడైన పరమాత్మను దెలిసికొని ముక్తినొందును. ఈశ్రుతి జీవప్రకృతిపరమాత్మలకు భోక్తృ భోగ్యనియంతృత్వములచేత భేదమును బోధించుచున్నది.

"తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్న న్నన్యో అభిచాకశీతి"—జీవేశ్వరులలో నొకఁడైన జీవుఁడు కర్మఫలము ననుభవించుచున్నాఁడు. మఱియొకఁడైన యీశ్వరుఁ డాకర్మఫలము ననుభవింపక యే ప్రకాశించుచున్నాఁడు. ఈశ్రుతియందు జీవేశ్వరులకుఁ గర్మఫలభోక్తృత్వాభోక్తృత్వములచే భేదమున్నదని తెలుపుటయే కాక యీశ్వర స్వరూపము దోషాసంస్పృష్టమని కూడ బోధింపఁబడుచున్నది. "పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా జుష్ట స్తత స్తే నామృతత్వ మేతి" జీవాత్మను పరమాత్మను వేఱుగాఁ దెలిసికొని యట్టిజ్ఞానముతోఁ గూడినవాఁడై ముక్తినొందునని యీశ్రుతి చెప్పుచున్నది. ఇట్టిశ్రుతులు వందల కొలఁది యున్నవి. గ్రంథవిస్తరభీతిచే వాని నన్నింటి నిచట వ్రాయ లేదు. స్మృతివచనములుకూడ నీయర్థమునే ప్రకటించుచున్నవి. ఎట్లన; "భూమి రాపో ఽనలో వాయుః ఖం మనోబుద్ధి రేవచ, అహంకార ఇ తీయం మే భిన్నా ప్రకృతి రష్టధా" "అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్, జీవభూతాం మహాబాహో! య యేదం ధార్యతే జగత్" (గీత 7 అ 5 శ్లో 6) భూమి, ఉదకము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు లోనగు నింద్రియవర్గము, మహత్తత్త్వము, అహంకారము, అను నెనిమిది భేదములు గలిగి ప్రపంచకమున కుపాదానకారణమైన ప్రకృతి నాసంబంధ మైనది. దీని కపర ప్రకృతి యని పేరు. దీనికంటె విలక్షణమగు మఱియొకప్రకృతి కలదు. దానినిఁ బరాకృతియనియు, జీవుఁడనియుఁ దెలిసికొనుము; దానిచే నీయచేతనజగమంతయు ధరింపఁబడుచున్నది. ఇట్లెనిమిదివిధములుగా నున్న ప్రకృతి నాసంబంధ మయినదని శ్రీకృష్ణభగవాను లర్జునుని కుపదేశించుటచేఁ గారణదశయందును బ్రకృతిజీవపరమాత్మలకు భేదము సిద్ధించుచున్నది. "సర్వభూతాని కౌంతేయ! ప్రకృతిం యాన్తి మామికాం; కల్పక్షయే పున స్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్ (గీత 9 అ7 శ్లో) ప్రళయకాలమందు స్థావరజంగమాత్మకములగుసర్వభూతములు నాశరీరమయిన ప్రకృతియందుఁ బ్రవేశించుచున్నవి. మరల సృష్టికాలమందు వానిని సృజించుచున్నాను. "ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునఃపునః | భూతగ్రామ మిమంకృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్" (గీ 9 అ 8 శ్లో) నాసంబంధమైన ప్రకృతి నెనిమిదివిధములుగాఁ బరిణమింపజేసి గుణత్రయాత్మకమయిన నాప్రకృతికి లోబడి యుండు చతుర్విధభూతములను సృష్టికాలమందు మాటిమాటికి సృజించుచున్నాను. "మ యాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరం | హేతు నానేన కౌంతేయ! జగద్ధి పరివర్తతే" (గీ. 9 అ-10) ప్రకృతి నన్నధ్యక్షునిగాఁ బొందినదయి చరాచరప్రపంచమును సృజించుచున్నది. ఇందుచేతనే జగత్తు మాఱుచున్నది. "ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభా వపి" (గీ-13-20) ప్రకృతి జీవుఁడు అనాదు లని తెలిసికొనుము. ఈవిధముగా సర్వావస్థలయందు భోక్తృభోగ్యరూపములతో నున్న చిదచిత్తులు పరమాత్మకు శరీరమనియు నియామ్యములనియుఁ బరమాత్మకంటె బృథక్‌స్థితి లేనివనియుఁ బరమాత్మ చిదచిత్తులకు నాత్మగ నున్నాఁడనియు మఱి కొన్నిశ్రుతులు ప్రతిపాదించుచున్నవి. "యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా మంత రోయం పృథివీ నవేద | యస్య పృథివీ శరీరం, యః పృథివీమాన్తరో యమయ త్యేష త ఆత్మాం తర్యా మ్యమృతః | య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽన్తరో య మాత్మా న వేద; య స్యాత్మా శరీరం, య ఆత్మాన మంతరో యమయతి, ఏష త ఆత్మా న్తర్యా మ్యమృతః" ఎవఁడు జీవునియందున్నవాఁడై జీవునిలోపలనుండునో యెవనిని జీవుఁడెఱుఁగఁడో ఎవనికి జీవుఁడు శరీరమో ఎవఁడు జీవునిలోపల నుండి యాజీవుని నియమించుచుండునో అతఁడు వినాశము లేనివాఁడు.

ఇట్లు బృహదారణ్యకోపనిషత్తులోని అంతర్యామిబ్రాహ్మణమంతయు నీయర్థమునే చెప్పుచున్నది. సుబాలోపనిషత్తులో "యః పృథివీ మన్తరే సంచరన్, యస్య పృథివీ శరీరం, యం పృథివీ న వేద" అని యారంభించి "యో క్షర మన్తరే సంచరన్ య స్యాక్షరంశరీరం య మక్షరం న వేద, యో మృత్యు మన్తరే సంచరన్ యస్య మృత్యు శ్శరీరం యం మృత్యు ర్న వేద, ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా. సర్వాత్మకుఁడైన పరమాత్మ సకలజనులయొక్క హృదయమందుఁ బ్రవేశించి శాసకుఁడైయున్నాఁడు. ఈశ్రుతియును జీవేశ్వరులకు శరీరశరీరిభావమును బోధించుచున్నది. సగుణశ్రుతులు, నిర్గుణశ్రుతులు, భేదశ్రుతులు, అభేదశ్రుతులు, ఘటకశ్రుతులునని శ్రుతు లైదువిధములు. వీనిలో ఘటకశ్రుతులు భేదశ్రుతులకు నభేదశ్రుతులకు గలవిరోధమును దొలఁగించి యేకార్థత్వమును సమర్థించునవి. ఈప్రకారము సర్వావస్థలయందును చిదచిత్తులను శరీరముగాఁ గలవాఁడై యున్నందునఁ బరమాత్మయే కారణదశను కార్యదశను పొందియుండి, సృష్టికిఁ బూర్వమందు సూక్ష్మరూపమును, సృష్టికిఁ బరమందు స్థూలరూపమును ధరించి జగదాకారముతో నిలిచియున్నాఁడు. "స దేవ సౌ మ్యేద మగ్ర ఆసీ దేక మే వాద్వితీయమ్; త దైక్షత బహుస్యాం ప్రజాయే యేతి, త త్తేజో ఽసృజత"ఇత్యాది శ్రుతులు కార్యకారణదశలను బొందిన ప్రపంచము పరమాత్మయని నిర్దేశించుచున్నవి. "తద్ధేదం తర్హ్యవ్యాకృత మాసీ త్తన్నామరూపాభ్యాం వ్యాక్రియత" అనుశ్రుతి సృష్టికిఁ బూర్వ మీప్రపంచకముయొక్క నామరూపములు వ్యక్తములు గాకుండెననియు సృష్ట్యనంతరమందు నామరూపములతో నీప్రపంచకము వ్యక్తమయ్యెననియుఁ గావునఁ గార్యావస్థనొందినవాఁడును, కారణావస్థనొందినవాఁడును, స్థూలసూక్ష్మ చిదచిద్వస్తుశరీరకుఁడైన పరమాత్మయే అయినందునఁ గార్యకారణములకు భేదము లేదనియుఁ, నందువలనఁ గారణవిజ్ఞానముచేఁ గార్యవిజ్ఞానము కలుగుచున్నదనియుఁ దెలుపుచున్నది.

అచిత్తు హేయమనియు నీశ్వరస్వరూప ముపాదేయమనియుఁ దెలిసికొనుటకు ముందు జ్ఞాత ఆవశ్యకుఁడు గావున చిదుపక్రమోద్దేశ ముపపన్నమగుచున్నది.

వీనిలో నాత్మస్వరూపము దేహేంద్రియమనఃప్రాణబుద్ధుల కంటె విలక్షణము, అజడము, ఆనందరూపము, నిత్యము, అణువు, అవ్యక్తము, అచింత్యము, నిరవయవము, నిర్వికారము, జ్ఞానాశ్రయము, ఈశ్వరునికి నియామ్యము, శేషము, ధార్యము నగుచున్నది.

1. అజడమనఁగా స్వయంప్రకాశమానము దీపము దీపాంతర నిరపేక్షముగా స్వవ్యవహార హేతువయినట్లు ప్రకాశాంతరనిరపేక్షముగా స్వవ్యవహార హేతు వగుట. ఇందుకు "హృద్యన్తర్జ్యోతిః పురుషః, అత్రాయం పురుషః స్వయంజ్యోతిర్భవతి, ఆత్మా జ్ఞానమయో ఽమలః" ఇత్యాదిశ్రుతులు ప్రమాణము.

2. ఆనందరూపమనఁగా;—"అనుకూలం సుఖం దుఃఖం ప్రతికూల మితి స్థితేః, స్వాత్మా స్వ స్యానుకూలో హి. త్యాత్మసాక్షిక ఏవ సః" అన్నట్లు తనకుఁ దానెల్లపుడు సుఖరూపమై యుండుట. "నిర్వాణమయ ఏవాత్మా, జ్ఞానానందమయ స్త్వాత్మా," ఇత్యాదిశ్రుతి స్మృతులచే నాత్మయొక్క ఆనందరూపత్వము స్పష్టమగుచున్నది.

3. నిత్యమనఁగా నెల్లపుడుండునది. ఆత్మ యెల్లకాలమున్నవాఁడైనచో "ప్రజాపతిః ప్రజా అసృజత," "యతో వా ఇమానిభూతాని జాయన్తే," "యతః ప్రసూతా జగతః ప్రసూతిః తోయేన జీవాన్ వ్యససర్జ భూమ్యామ్" ఇత్యాదులచే నాత్మకుఁ జెప్పఁబడు జననమరణము లెట్లుపపన్నములగును. అని శంక రాఁగా నా శ్రుతివచనములచేఁ జెప్పఁబడు జన్మమనునది దేహసంబంధముగాని మఱియొండు గాదు. మరణమనఁగా దేహవియోగము. ఆత్మ నిత్యుఁడైనచో సృష్టికి ముందీశ్వరుఁ డొక్కఁడే యుండెనని చెప్పఁగూడ దంటివేని "ఒకఁడుగా నుండుట యనఁగా నామరూపవిభాగశూన్యుఁడై యుండుట. కావున నట్లు చెప్పవచ్చును. సంహారదశయం దాత్మలేనియెడల నీశ్వరుని కృపాదానత్వము సిద్ధింపదు. అకృతాభ్యాగమ (చేయనికర్మకు ఫలప్రాప్తి) కృతవిప్రణాశములు (చేసినకర్మలు నిష్ఫలములగుట) సంభవించును. "న జాయతే మ్రియతే వా విపశ్చిత్," "నిత్యో నిత్యానాం," "ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభా వపి," "న త్వేవాహం జాతు నాసమ్" అని ఆత్మనిత్యత్వప్రతిపాదకములగు శ్రుతిస్మృతులు వేనవే లున్నవి.

ఆత్మ అణువగుటయెట్లు? హృదయప్రదేశమునుండి బయలువెడలి వెళ్లునదియు, వచ్చునదియు నై యుండునని నిర్దిష్టమగు శాస్త్రము చెప్పుటచే నాత్మ యణువుకావలయును. 'హృది హ్యేష ఆత్మా' అని హృదయమందుండునది యనియు, "తేన ప్రద్యోతే నైష ఆత్మా నిష్క్రామతి చక్షుషో వా మూర్ధ్నో వా అన్యేభ్యో వా శరీరదేశేభ్యః" అని ఉత్క్రమణమును, "యే వై కే చాస్మా ల్లోకాత్ప్రయంతి చంద్రమస మేవ తే సర్వే గచ్ఛంతి," అని గమనమును, "తస్మా ల్లోకా త్పున రేత్య స్మై లోకాయ కర్మణే." అని ఆగమనమును శాస్త్రము చెప్పుటచే నాత్మ అణువు విభు వైనయెడల నీ చెప్పిన క్రియలలో నొకటియును సంభవింపదు. సూత్రకారులును, "ఉత్క్రాంతిగత్యాగతీనామ్" అను సూత్రముచే నాత్మాణుత్వమును సాధించెను. "ఏషోఽణు రాత్మా చేతసా వేదితవ్యః," "వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ, జీవో భాగ స్సవిజ్ఞేయః" "ఆరాగ్రమాత్రో హ్యవరోపి దృష్టః" "స్వరూప మణుమాత్రం స్యాత్ జ్ఞానానందైకలక్షణమ్" ఇత్యాది శ్రుతిస్మృతులచే నాత్మాణుత్వము సంప్రతిపన్నము. ఆత్మ అణువై హృదయమందుమాత్ర మున్నయెడల, "పాదే మే వేదనా, శిరసి మే సుఖమ్" అని శరీరమం దంతటను గలిగెడుసుఖదుఃఖముల నదియెట్లనుభవింపగలదనఁగా;-మణి, సూర్యుఁడు, దీపము మొదలగు కాంతిగలవస్తువు లొక్కచోట నుండునవి యైనను, వానికాంతి దూరముగాఁ బ్రసరించునట్లు ఆత్మ హృదయప్రదేశమందుమాత్ర మున్నను, దానిధర్మమగుజ్ఞాన మంతటను వ్యాపించుటచే శరీరమం దంతటను గలుగు సుఖదుఃఖముల ననుభవించుటకుఁ బ్రతిబంధకము లేదు. ఈయంశమును "గుణాద్వాలోకవత్" అను సూత్రముయొక్క భాష్యమందు శ్రీభాష్యకారు లిట్లుపపాదించియున్నారు: "ఆత్మా స్వగుణేన జ్ఞానేన సకలదేహం వ్యాప్యావస్థితః ఆలోకవత్ యథామణిద్యుమణిప్రభృతీనా మేకదేశవర్తినామాలోకో ఽనేకదేశవ్యాపీ దృశ్యతే తద్వత్ హృదయస్థ స్యాత్మనో జ్ఞానం సకలదేహం వ్యాప్య వర్తతే" ఈయంశము బృహదారణ్యకమందుఁగూడ వక్కాణింపఁబడినది. "ప్రజ్ఞయా వాచం సమారుహ్య వాచా సర్వాణి నామా న్యాప్నోతి, ప్రజ్ఞయా ఘ్రాణం సమారుహ్య ఘ్రాణేన సర్వా న్గంధా నాప్నోతి, ప్రజ్ఞయా చక్షు స్సమారుహ్య చక్షుషా సర్వాణి రూపా ణ్యాప్నోతీత్యాది. సౌభరివలె నొకఁడే కాలమం దనేక దేహములను బరిగ్రహింపఁగలిగియుండుట జ్ఞానవ్యాప్తిబలముచేతనే అని యెఱుంగనలయును.

5. అవ్యక్త మనఁగా ఛేదనాదియోగ్యములగు ఘటపటాదిపదార్థములు వు లే ప్రమాణములచే వ్యజ్యమానము లగుచున్నవో ఆ ప్రమాణములచే నాత్మ తెలియబడదనుట. ఆత్మ—మానసజ్ఞానగమ్యము గాని ఇంద్రియకజ్ఞానవిషయము కాదనుట.

6. అచింత్యమనఁగా నచిత్సజాతీయమని తలంచుటకు వీలులేక యుండుట.

7. నిరవయవ మనఁగా—విజ్ఞానఘనః, విజ్ఞానమయః, ఇత్యాదిశ్రుతులు చెప్పినట్లు జ్ఞానైకాకార మగుటచే నచిద్వస్తువువలె నవయవసమూహరూప మయినది కాదు.

8. నిర్వికార మనగా "అమృతాక్షరం హరః, ఆత్మా శుద్ధో ఽక్షరః" అన్నట్లు అక్షరశబ్దవాచ్య మగువస్తు వగుటవలన క్షణక్షరణస్వభావము గలదియగుటచే క్షరశబ్దవాచ్యమగు నచిత్తువలె వికరించుట లేకుండ నెల్లప్పు డేకరూపమై-యుండునది యని యర్థము.

9. జ్ఞానాశ్రయ మనగా జ్ఞానమున కునికిపట్టై యుండుట. జ్ఞానమనగా దనయునికిచేఁ దన కాశ్రయమయినవస్తువును చేరియుండి స్వపరవ్యవహారములకు హేతువై యుండెడు నొకయాత్మధర్మము దీనినే యీమతస్థులు ధర్మభూతజ్ఞానమని వ్యవహరించెదరు. దీని కాత్మ

శ్రయమై యుండుట యనగా దీపము ప్రభయు రెండును తేజోద్రవ్యములయి యున్నను దీపము ప్రభ కాశ్రయమై యున్నట్లు ఆత్మ జ్ఞానస్వరూపమైనను స్వధర్మమగు జ్ఞానమునకుఁ దన్ను విడిచి పృథక్ స్థిత్యుపలంభములు లేకుండ తా నాధారమై యుండుట. "అథ యో వేదేదం జిఘ్రాణీతి స ఆత్మా, న పశ్యో మృత్యుం పశ్యతి, విజ్ఞాతార మరే కేనవిజానీయాత్, జానాత్యేవాయం పురుషః, ఏష హి ద్రష్టా శ్రోతా ఘ్రాతా రసయితా మంతా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః" ఇత్యాదిశ్రుతులచే నాత్మయొక్క జ్ఞాతృత్వము సిద్ధమగుచున్నది. కర్తృత్వభోగ్యత్వములు రెండును జ్ఞానావస్థావిశేషము లగుటచే నాత్మ జ్ఞాత యని చెప్పుటవలననే యివి రెండును సిద్ధించుచున్నవి. "హేయోపాదేయతా జ్ఞానమూలం జ్ఞాతృత్వ మాత్మనః, తత్పరిహాణోపాదానచికీర్షా కర్తృతాశ్రయా" ఆత్మయొక్క జ్ఞాతృత్వము ఇది విడువఁదగినది యిది స్వీకరింపఁదగినది అని తెలిసికొనుటకుఁ గారణ మయినది. ఆత్మయొక్క కర్తృత్వము ఆయా విషయములను వదలుట, స్వీకరించుట—వీని విషయమై కలిగెడు ఇచ్ఛకుఁ గారణ మయినది అన్నట్లు ఆత్మయొక్క జ్ఞాతృత్వము హేయోపాదేయముల నెఱుంగుటకుఁ గారణ మయినది. హేయములను విడుచుటచేతను, ఉపాదేయములను స్వీకరించుటచేతను కలిగినచికీర్ష కర్తృత్వము మూలముగాఁ గలది. కర్తకే కదా చికీర్ష పుట్టును. ఈచికీర్ష జ్ఞానముయొక్క అవస్థావిశేషము. దానితోఁ గర్తృత్వమునకు గల సంబంధము నుద్దేశించి కర్తృత్వము జ్ఞానావస్థావిశేషమని ఔపచారికముగాఁ జెప్పఁబడుచున్నది. లేనియెడల గర్తృత్వ మనునది క్రియాశ్రయత్వము గావున దానిని జ్ఞానముయొక్క అవస్థయని ముఖ్యముగాఁ జెప్పఁగూడదు. క్రియయనునది జానాతి, ఇచ్ఛతి, ప్రయతతే కరోతి అని జ్ఞానచికీర్షాప్రయత్నానంతరభావియగు ప్రవృత్తియగుటచే నట్టిప్రవృత్తి కాశ్రయమయి యుండుట కర్తృత్వ మనుటచేతను దానిని జ్ఞానముయొక్క అవస్థావిశేషమని చెప్పుటకూడ నౌపచారికమే. భోక్తృత్వ మనగా భోగమున కాశ్రయమై యుండుట. భోగమనఁగా సుఖదుఃఖరూపమైన అనుభవజ్ఞానము. అదియు జ్ఞానముయొక్క అవస్థావిశేషము. దాని కాశ్రయమైనదానిని జ్ఞానముయొక్క అవస్థావిశేష మని చెప్పుటచే నదియు నౌపచారికముగఁ [illegible]బడినది యగును. ఇట్లు జ్ఞాతృత్వమునకును వీనికిని గలిగినసంబంధాతిశయముచే దానితో నైక్యముగఁ జెప్పఁదగియుండుటచేతనే జ్ఞాతృత్వమును జెప్పినపుడు కర్తృత్వభోక్తృత్వములుకూడ సిద్ధించుచున్నవనుట కాటంకము లేదు.

ఆత్మకు సహజముగనుండు కర్తృత్వము లేదనియుఁ, బ్రకృతికే కర్తృత్వమనియు, వాదించుసాంఖ్యుడు ప్రత్యవస్థితుఁ డగుచున్నాడు. కఠవల్లియందు "నజాయతే మ్రియతే వా విపశ్చిత్" అని ప్రారంభించి "హంతా చే న్మన్యతే హంతుం హత [illegible] శ్చే న్మన్యతే హతం, ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే" అని ఆత్మకు హననాదిక్రియల[illegible] గర్తృత్వము నిషేధించుటవలనను, గీతలలో సర్వేశ్వరుఁడు తానే. "నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి । కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే । ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః । అహంకారవిమూఢాత్మా కర్తాహమితి మన్యతే "పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే" అని చెప్పుటచేత నీరీతిగా నధ్యాత్మశాస్త్రమం దాత్మ అకర్తయనియుఁ బ్రకృతి గుణములకే కర్తృత్వమనియుఁ జెప్పుటచేతఁ గర్తృత్వము ప్రకృతికేఁ గాని ఆత్మకు లేదనియు నాత్మకు భోక్తృత్వముమాత్రమే యున్నదనియు సాంఖ్యుఁ[illegible] వాదించుచున్నాఁడు.

ప్రకృతికే కర్తృత్వ మొప్పి ఆత్మకుఁ గర్తృత్వము లేదన్నచో విధినిషేధరూపమగు శాస్త్రమునకుఁ దా నధికారి యనియు దానికి లోఁబడి నడవవలసియుండుటు, విహితనిషిద్ధకరణప్రయుక్తసుఖదుఃఖరూపఫలభోక్తృత్వము కుదురదు. చేతనుఁడు కర్త కానిచో శాస్త్రమునకు వైయర్థ్యము ప్రసక్తమగును. "శాస్త్రఫలం ప్రయోక్తరి" "కర్తా శాస్త్రార్థవత్త్వాత్" అనియా న్యాయము. "స్వర్గకామో యజేత," "ముముక్షుః బ్రహ్మోపాసీత," ఇత్యాది శాస్త్రవిధులు స్వర్గమోక్షాదిఫలభోక్తనే కర్తగా నియోగించుచున్నది. అందువలన ఫలభోక్తయగువాఁడే కర్తయయి యుండవలెను.

సాంసారికప్రవృత్తియందుఁ జేతనునికున్న కర్తృత్వము స్వరూపప్రయుక్తము కాదు. అది ఔపాధికము. శాస్త్రార్థవత్త్వముకొఱకు కర్తృత్వ మాత్మధర్మ మని గ్రహింపవలెను. కర్తృధర్మము లగు జ్ఞానేచ్ఛాప్రయత్నములు భగవదధీనములై యుండుటవలనను, అజ్ఞానాదులు భగవదనుమతి లేకుండఁ గ్రియాహేతువులు కాఁజాలకపోవుటవలనను, చేతనుని కర్తృత్వ మీశ్వరాధీనము. ఈయంశమును "పరాత్తు తచ్ఛ్రుతేః" అను సూత్ర[illegible]యొక్క భాష్యమందు శ్రీభాష్యకారులతినిపుణముగా సమర్థి[illegible]న్నారు. గ్రంథవిస్తరభీతిచే నిచట నావిషయ మంతయును వ్రాయుట కవకాశము లేకపోయినది. చేతనుని బుద్ధిమూలమగు ప్రయత్నము నపేక్షించి యీశ్వరుఁ డనుమతి యొసంగుటచేఁ దత్క్రియానిబంధనమగు [illegible]ములు చేతనునికే చెందుచున్నవి. చేతనుని కర్తృత్వము [illegible] విధినిషేధవాక్యములకు వైయర్థ్యము [illegible] "కృతప్రయత్నాపేక్షస్తు విహితప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః (శా. శి పా) అను సూత్రభాష్య[illegible] వైయర్థ్యము పరిహరింపబడినది. ఎట్లనఁగా [illegible] ప్రథమప్రయత్నము నపేక్షించి యీశ్వరుఁడు వీనినిఁ బ్రవర్తింపఁజేయును. ఎట్లన, సకలచేతనులకు స్వభావసిద్ధముగా జ్ఞాతృత్వముండుటచే సామాన్యముగాఁ బ్రవృత్తినివృత్తియోగ్యత్వ ముండనే యున్నది. ఇట్టి స్వరూపమును నిర్వహించుట కీశ్వరుఁ డంతరాత్మగా నున్నాఁడు. ఉదాసీనుఁడై యున్న పరమాత్మ పూర్వవాసనారూపమగు చేతనుని విధినిషేధప్రవృత్తులయం దనుమతియు [illegible] గలవాఁడై విహితములయం దనుగ్రహమును నిషిద్ధములయందు నిగ్రహమును జేయుచుండును. స్వానుగ్రహరూపమగు పుణ్యమునకు ఫలమగు సుఖమును, నిగ్రహాత్మకమగు పాపమునకు ఫలమైనదుఃఖము నాయాచేతనుల కొసంగుచుండును.

Sjt. Lakshman Singh garu



శ్రీయుత లక్ష్మణసింగుగారు

Sreemati Subhadra Devi garu



శ్రీమతి సుభద్రాదేవిగారు

Dr. Syed Mahammad



డాక్టరు సయ్యదు మహమ్మదుగారు

Dr. Hardikar



డక్టరు హార్డికారుగారు (బెంచి)

Mr. Hambulkar, Mr. Halve, Mr. Jayendra Prasad



హాంబల్ కర్ గరు, హాల్వేగారు, జయేంద్ర ప్రసాదుగారు

Gandhi Das
Kallakuri Krishnamurthy garu



గాంధిదాసు కాళ్లకూరి కృష్ణమూర్తిగారు

Sjt. Motilal Ghosh



శ్రీయుత మోతిలాల్ ఘోషుగారు

S.jt. Nori Ramasastri Garu



శ్రీయుత నోరి రామశాస్త్రులుగారు, ఆయుర్వేదభూషణ

Members of the Sree Sitharamanjaneya Nataka Samajam, Ellore



శ్రీ సీతారామాంజనేయనాటకసమాజసభ్యులు, ఏలూరు

[illegible]మనే పూర్వాచార్య లోక శ్లోకరూపముగా సాధించియున్నారు. "ఆదా వీశ్వరదత్తయైవ పురుషః స్వాతంత్ర్యశక్త్యా స్వయం తత్తత్ జ్ఞానచికీర్షణ ప్రయత్నా న్యుత్పాదయ న్వర్తతే, తత్రోపేక్ష్య తతోనుమత్యా విదధ త్తన్నిగ్రహానుగ్రహౌ తత్తత్కర్మఫలం ప్రయచ్ఛతి తత స్సర్వస్య పుంసో హరిః" (సర్వేశ్వరుఁడు సర్వప్రవృత్తులయందు చేతనుని ప్రథమప్రయత్నము నపేక్షించి ప్రవర్తింపఁ జేయుచుండును. చేతనుని అశాస్త్రీయప్రవృత్తులయందుపేక్షఁజేయుచు శాస్త్రీయప్రవృత్తులయం దనుమతించుచు నాయాయివిషయములయందు నిగ్రహానుగ్రహములను జూపుచు నాయాయికర్మఫలములనిచ్చుచుండును. [illegible] "ఏష హ్యేవ సాధు కర్మ కారయతి, తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతి ఏష హ్యేవాసాధు కర్మ కారయతి, తం యమధో నినీషతి." (ఉత్కృష్టలోకమునకు గొనిపోవు కోరికతో నొకనిచే మంచిపనిఁ జేయించుననియు నధోలోకమునకుఁ బడవేయుతలంపుతో నొకనిచే దుష్కర్మఁ జేయించుననియుఁ జెప్పు నీశ్రుతి యెట్లు సంగచ్ఛమానమగునని ప్రశ్నింతువేని యిది సర్వచేతనసాధారణము కాదు. ఎవఁడైతే భగవద్విషయమం దత్యంతానుకూల్యము గలవాఁడై ప్రవర్తించునో అట్టివాని ననుగ్రహించుచు భగవంతుఁడే స్వప్రాప్తికుపాయములైన సత్కర్మలయందు రుచిపుట్టించును. ఎవఁడైతే భగవద్విషయమం దత్యంతవిరోధముగలవాఁడై ప్రవర్తించునో అట్టివాఁడు తనకు దూరమగునట్లు సంతతము దుష్కర్మలఁ జేయించును. సర్వేశ్వరుఁ డీయర్థమును గీతలలో స్వయముగా వక్కాణించియున్నాఁడు. "తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం, దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే" "తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్, క్షిపా మ్యజస్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు." కావున అనుమంతృత్వము సర్వసాధారణమనియును ప్రయోజకత్వము విశేషవిషయమనియు నెఱుంగవలెను.

ఆత్మ—జ్ఞానమున కాశ్రయమై యుండుయెడల "విజ్ఞానం యజ్ఞం తనుతే, జ్ఞానస్వరూప మత్యంతనిర్మలం పరమార్థతః" అని దీనిని జ్ఞానమని శ్రుతులెట్లు వ్యవహరించుచున్నవి? అని పలికితివేని చెప్పెద వినుము. జ్ఞానము స్వాశ్రయమునకు స్వయంప్రకాశకమై యున్నట్లాత్మయును జ్ఞాననిరపేక్షముగాఁ బ్రకాశించుటచేతను దీనికి జ్ఞానము సారభూతగుణమగుటచేతను స్వరూపనిరూపకధర్మమగుటచేత నిట్లు చెప్పవచ్చును.

ధార్యమగుట యనఁగా—"ఏష సేతు ర్విధరణః లోకానా మసంభేదాయ, ఏత త్సర్వం ప్రజ్ఞానే ప్రతిష్ఠితం, ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః", ఇత్యాది శ్రుతులయందుఁ జెప్పఁబడిన ట్లీశ్వరుఁడు సకలచేతనాచేతనములను గుఱించి యెల్లప్పుడు ధారకుఁడై యుండును. ఈశ్వరుని నిత్యేచ్ఛాకార్యమైన సంకల్పము లేనపుడు తనసత్తకు హాని కలుగునట్లుండుట.

శేషమై యుండుట యనఁగా:—[illegible]తాంబూలాదులవలె నీశ్వరుని కిష్టవినియోగార్హమై యుండుట. చన్దనకుసుమతాంబూలాదులు తమ కని యుండు నొకయాకారము లేనివై తమ్ము నుపయోగించువారి కిష్టమువచ్చినట్లు వినియోగపడుటకొఱకుఁ దగియున్నవిధమున నీయాత్మయుఁ జేతనమై యున్నను స్వప్రయోజనగంధము లేకయే తనయొక్క స్వరూపస్వభావవైలక్షణ్యముల నన్నిటిచే శేషియగు శ్రీమన్నారాయణుని కతిశయకరమై కావలసినట్లు వినియోగపడుటకొఱకుఁ దగియుండుట. "యథేష్టవినియోగార్హం శేషశబ్దేన కథ్యతే, ఈశ్వరేణ జగత్సర్వం యథేష్టం వినియుజ్యతే, పరగతాతిశయాధానేచ్ఛ యోపాదేయత్వ మేవ యస్య స్వరూపం స శేషః, పర శ్శేషీ," అని శేషశేషిలక్షణము. "యస్యాస్మి పత్యుర్న తమన్తరేమి, దాసభూతా స్స్వత స్సర్వే హ్యాత్మానః పరమాత్మనః స్వోజ్జీవనేచ్ఛా యది తే స్వసత్తాయాం స్పృహా యది, ఆత్మదాస్యం హరేస్స్వామ్యం స్వభావం చ సదా స్మర" ఇత్యాదిశ్రుతిస్మృతులచే నీశేషశేషిభావము చెప్పఁబడుచున్నది.

ఇట్లు చిత్తు నిరూపించినతరువాత నచిత్తు నిరూపింపఁబడుచున్నది.

అచిత్తనఁగా చైతన్యమున కాధారము కానివస్తువు. శ్రుతిలో నుండు భోగ్యశబ్దముచేఁ జెప్పఁబడునది. ఇది జ్ఞానశూన్యము. వికారాస్పదము. వికారమనఁగా మృత్తు ఘటరూపమును బొందినట్లు మఱియొకయవస్థ నొందుట. ఇది శుద్ధసత్త్వమనియు, మిశ్రసత్త్వమనియు సత్త్వశూన్యమనియు మూఁడు[illegible]ములు. వీనిలో శుద్ధసత్త్వ మనునది రజస్తమోగుణములు కలయిక లేని కేవలసత్త్వము, నిత్యము, జ్ఞానానందజనకము, కర్మచేఁ గాక, కేవలభగవదిచ్ఛచే విమానగోపురమండపప్రాకారాదిరూపముగాఁ బరిణమించునది. నిరవధికతేజోరూపము, నిత్యముక్తేశ్వరులచేఁ గూడ నింతపరిమాణము గలదని పరిచ్ఛేదింప నలవి గానిది. దీనిని గొందఱు జడమనియు మఱికొంద ఱజడమనియు వ్యవహరించెదరు.

మిశ్రసత్త్వము—సత్త్వరజస్తమస్సులను మూఁడుగుణములతోఁ గూడినదియై చేతనులజ్ఞానమున కావరకమై, విపరీతజ్ఞానజనకమై, నిత్యమై, ఈశ్వరునికిఁ గ్రీడాపరికరమై, ప్రకృతి, అవిద్య, మాయ యను నామములతో వ్యవహరింపఁబడునది యచిద్విశేషము. మహత్తు అహంకారము మొదలగు వికృతులను దననుండి పుట్టించునది గావున "మూలప్రకృతి రవికృతిః" అను సాంఖ్యకారికోక్తి ననుసరించి దీనికిఁ బ్రకృతి యని పేరు. జ్ఞానవిరోధి యగుటచే నవిద్య యనఁబడును. విచిత్ర సృష్టికారిణి యగుటచే మాయ యనంబడును. [illegible]ప్రకృతి విభక్తతమస్సనియు నవిభక్తతమస్సనియు అక్షరమనియు నన్నియవస్థల నొందియుండును. సత్త్వరజస్తమోగుణముల వైషమ్యముచే నిది మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు, ఏకాదశేంద్రియములు, భూతపంచకము నను నిరువదిమూఁడు తత్త్వములను బుట్టించును. వానిలో సత్త్వగుణము "తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయం, సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ, (గీ-14-6) అన్నట్లు నిర్మలమైన దగుటచే జ్ఞానజనకము, ఆరోగ్యజనకము. సుఖమందు జ్ఞానమందు నాస

క్తిని గలిగించును. "రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సంగసముద్భవమ్" అన్నట్లు రజోగుణము రాగతృష్ణాసంగములను కర్మసంగమును బుట్టించును. "తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినాం, ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత!" (గీ. 14-8) అన్నట్లు తమోగుణము ప్రాణులకు ప్రమాదాలస్యనిద్రలను గలిగించును. ప్రకృతి వలనఁ బొడము ప్రథమవికారము మహత్తు. ఇది బుద్ధి. దీనివలన వైకారికము, తైజసము, భూతాది యని మూడువిధములగు నహంకారము పుట్టుచున్నది. అహంకార మభిమాన హేతు వైనది. వీనిలో వైకారికాహంకారమునుండి పదునొకం డింద్రియములు పుట్టినవి. భూతాద్యహంకారమునుండి శబ్దతన్మాత్ర, దీనినుండి ఆకాశము, స్పర్శతన్మాత్ర దీనినుండి వాయువు, రూపతన్మాత్రయు, ఇందునుండి తేజస్సు, రసతన్మాత్రయు, దీనినుండి జలము, గంధతన్మాత్రయు దీనినుండి పృథివియును బుట్టినవి.

సత్వశూన్య మనఁగా కాలము. ఇది నిత్యమై యీశ్వరునికి క్రీడాపరికరమై శరీరమై యుండును.

### ఈశ్వరుఁడు

సర్వేశ్వరుఁడు, సర్వశేషి, సర్వకర్మసమారాధ్యుఁడు, సర్వకర్మఫలప్రదుఁడు, సర్వాధారకుఁడు, సర్వకార్యోత్పాదకుఁడు, సర్వశబ్దవాచ్యుఁడు, సర్వజ్ఞుఁడు నగువాఁ డీశ్వరుఁడు. ఇతఁడే జగత్తున కుపాదాననిమిత్తసహకారికారణఁ డగుచున్నాఁడు. సూక్ష్మచిదచిద్విశిష్టవేషముచే నుపాదానకారణము, సంకల్పవిశిష్టవేషముచే నిమిత్తకారణము, కాలాదుల కంతర్యామిగా నుండుటచే సహకారికారణము. కార్యరూపముగా వికరించుటకు దగినవస్తు వుపాదానము. కార్యరూపముగాఁ బరిణమింపఁజేయునది నిమిత్తము. కార్యోత్పత్తి కుపకరణమగు వస్తువు సహకారి. ఇట్లు శ్రీమన్నారాయణుఁడే త్రివిధకారణ మని విశిష్టాద్వైతవేదాంత ముద్ఘోషించుచున్నది. న్యాయయుక్తము లగు వేదాంతవాక్యములను బాగుగ విమర్శించినయెడల శ్రీమన్నారాయణుఁడే జగత్కారణ మని స్థిరపఱుపఁబడుచున్నది. ఎట్లంటేని; "తదైక్షత బహు స్యామ్" అను శ్రుతిలోఁ జెప్పఁబడిన యీక్షాపూర్వక మగుసృష్టి యచేతనమగు ప్రకృతి కుపపన్నము కాదు గావునఁ బ్రకృతి జగత్కారణము కానేరదు. ఛాందోగ్యమందు సదాకాశప్రాణశబ్దవాచ్యములకు జగత్కారణత్వము ప్రతీయమాన మగుచున్నది. వాజసనేయకమందు బ్రహ్మవాచ్యము కారణమని ప్రతీయమాన మగుచున్నది. సర్వశాఖాప్రత్యయన్యాయముచేతను, ఆకాశము, ప్రాణము, బ్రహ్మ, ఆత్మ మొదలగు సామాన్యశబ్దముల కేకవిషయత్వము ప్రతిపాదింపవలసి యుండఁగా భాగవతన్యాయముచే సామాన్యశబ్దములకు విశేష మగు బ్రహ్మయందు పర్యవసానము చెప్పవలసి యున్నది. మరల నీబ్రహ్మశబ్దవాచ్యునికి "ఆత్మా వా ఇద మేక ఏ వాగ్ర ఆసీత్, నాన్య త్కించన మిషత్" ఇత్యాద్యైతరేయశ్రుతిలోఁ జెప్పబడిన ఆత్మశబ్దవాచ్యునియందుఁ బర్యవసానము కలుగఁగా నీయాత్మశబ్దవాచ్యుఁ డెవఁడు? ఇంద్రుఁడా? అగ్నియా? ఉపాస్యుఁడని ప్రసిద్ధిగాంచిన సూర్యుఁడా? సోముఁడా అని సంశయము కలుగఁగా [illegible] లందఱు కర్మవశ్యులు, పరిమితైశ్వర్యులు నని శ్రుతులలోఁ జెప్పఁబడుచుండుటచే వీరు జగత్కారణభూతులు కాఁజాలరు. శ్వేతాశ్వతరమందు "ఏకో హి రుద్రో న ద్వితీయాయ తస్థుః, య ఇమాన్ లోకా నీశత ఈశనీభిః," అని రుద్రునికి కారణత్వము చెప్పఁబడినది. అథర్వశిఖయందు "శంభుఁడే సర్వాత్మకుఁ డనియు, తైత్తిరీయమందు "హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే" అని హిరణ్యగర్భుఁడు జగత్కారణ మనియు గనఁబడుచున్నది. కాని యీయాయీశబ్దములచే ప్రసిద్ధముగా వ్యవహరింపఁబడు రుద్రచతుర్ముఖాదులు జగత్కారణము కారు. ఏలయన; "యో బ్రహ్మాణం విదధాతి పూర్వమ్," తత్ర బ్రహ్మా చతుర్ముఖో ఽజాయత", "ప్రజాపతిః పుష్కరపర్ణే సమభవత్", "హిరణ్యగర్భం పశ్యత జాయమానమ్", అని అనేకశ్రుతులయందు శ్రీమన్నారాయణునిచే సృజింపఁబడినవాఁ డనియు, "న బ్రహ్మా నేశానః", "బ్రహ్మ శివౌ ప్రలీయేతే", అని సంహరింపబడువాఁ డనియు బ్రహ్మ చెప్పబడుచున్నాఁడు. అట్లనే రుద్రుఁడుకూడ "నారాయణా ద్రుద్రో జాయతే" "బుద్ధ్యదా త్ప్రత్యక్షః శూలపాణిః పురుషో ఽజాయత", సంవత్సరే కుమారో ఽజాయత, తం ప్రజాపతి రబ్రవీత్, కుమార కిం రోదిషి? సో ఽబ్రవీత్, అనపహతపాప్మా ఽహ మస్మి," ఇత్యాదిశ్రుతులచే రుద్రుఁడు సృజింపబడినవాఁడనియు, ననపహతపాప్ముఁడనియుఁ జెప్పఁబడుచున్నాఁడు గావున జగత్కారణము కానేరఁడు. కావున శివ శంభు శంకర మహాదేవాదిశబ్దము లన్నియు "యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః" అన్నట్లు గౌణవృత్తిచే భగవత్పరములుగా సమన్వయింపఁబడినవి. కూరనాథప్రణీత శ్రీవైకుంఠస్తవమందు "ఆత్మేశ్వరో ఽసి న పరో ఽస్తి తవేశ్వరో ఽన్యో విశ్వస్య చాసి పతి రస్య పరాయణంచ, నారాయణాచ్యుత పరస్త్వ మిహైక ఏవ బ్రహ్మేవ యో ఽపి భవదీక్షణలబ్ధసత్తః. సర్వశ్రుతివ్యనుగతం స్థిర మప్రకంప్యం నారాయణాహ్వయధరం త్వయి వాన్వవద్యమ్, సూక్తం తు పౌరుష మశేషజగత్పవిత్రం త్వాం మత్తమం పురుష మీశ ముదాజహార. యన్మూలకారణ మబుద్ధ్యత సృష్టివాక్యే బ్రహ్మేతి వా సదితి వా త్మగిరాథవా తత్, నారాయణ స్త్వితి మహోపనిష ద్వ్యవీవితి సౌబాలికీ ప్రభృతయో వ్యనుజగ్ము రేనామ్". అని చెప్పినట్లు మహోపనిషత్తు, నారాయణోపనిషత్తు, సుబాలోపనిషత్తు, మైత్రాయణీయము, పురుషసూక్తము, నారాయణానువాకము, అన్తర్యామిబ్రాహ్మణము మొదలగువానియందు శ్రీమన్నారాయణుఁడే పరమకారణ మనియు, సర్వవాచ్యుఁ డనియు, జగచ్ఛరీరకుఁ డనియు, మోక్షప్రదుఁ డనియు నుపపాదింపఁబడుచున్నది.

బ్రహ్మ యొక్కటియే సత్యము. అది నిర్గుణము, తద్వ్యతిరిక్తమగు జ్ఞాతృజ్ఞేయాదివికల్పము లన్నియు బ్రహ్మయందుఁ గల్పితములు గావున మిథ్య యనఁబడును. బ్రహ్మకవిద్యచే సంసారము కలుగుచున్నది. తత్త్వమసీత్యాదివాక్యజన్యజ్ఞానము సంసారనివర్తకము. కావున నిర్విశేషచిన్మాత్రబ్రహ్మమునే వేదాంతములు చెప్పుచున్న వని యద్వైతులు ప్రతిపాదించుచుండగా వేదాంతములను నారాయణునియం

ట్లు తాత్పర్యము. అతనికి సమస్తకళ్యాణగుణాత్మకత్వ మెట్లు సంగచ్ఛమానమగునని శంకించెదవేమో సమాధానమును జెప్పెద వినుము.

కారణత్వమును బ్రతిపాదించు శ్రుతులచే నారాయణుని కారణత్వము సిద్ధింపగా భేదశ్రుతులకు నభేదశ్రుతులకుఁ గలవిరోధము ఘటకశ్రుతులచేఁ బరిహృతము కాఁగా నిర్గుణశ్రుతులు హేయగుణనిషేధపరము లగుటవలనను, జ్ఞాతృజ్ఞేయాది వికల్పములను బోధించు నవిద్య యను నది యొకటి కలదని చెప్పుటకుఁ బ్రమాణము లేకపోవుటవలనను బ్రహ్మకార్యమగుజగత్తు సత్యమగుటవలనను, అవిద్యచే సంసారము కలిగిన యెడల జీవగతదోషము లన్నియు బ్రహ్మయందు సంభవించుటవలనను, అట్టి అవిద్యను దొలఁగించుటకు సాధనాంతర మొకటి కలదని చెప్పుటకు శక్యము కాకపోవుటవలనను, అద్వైతవాద మసంభావ్యము గావున నిర్విశేషచిన్మాత్రబ్రహ్మము సిద్ధింపదు.

అందువలన శ్రీమన్నారాయణుఁడే నిఖిలజగత్కారణుఁడు నిఖిలహేయప్రత్యనీకకళ్యాణగుణైకతానుఁడు, మోక్షప్రదుఁడు నని సిద్ధాంతీకరింపఁబడినది. సూక్ష్మచిదచిద్విశిష్ట మగుబ్రహ్మకారణము, స్థూలచిదచిద్విశిష్ట మగు బ్రహ్మ కార్యము. కారణముకంటె కార్యము వేఱు కాదని విశిష్టాద్వైత వేదాన్త సమ్ప్రదాయము. ఈమతస్థులు సర్వజ్ఞుఁడు, సర్వశక్తియగు నీశ్వరు నంగీకరించుటవలన నిరీశ్వరసాంఖ్యమతము, మీమాంసకమతము నిరసింపఁబడినవి. పరబ్రహ్మ కుపాదానకారణత్వముకూడ నొప్పుకొనుటచే నీశ్వరుఁడు నిమిత్తకారణుఁడే యని వాదించుయోగులు పాశుపతులు నిరసింపఁబడు చున్నారు. కార్యమునుగుఱించి యీశ్వరుఁ డుపాదానమునిమిత్తము నయినట్లే కర్తృత్వము ప్రేరకత్వము నియంతృత్వము అనుమంతృత్వము సహకారిత్వము, ఉదాసీనత్వము మొదలగునవి కూడ నుపపన్నము లగుచున్నవి. శరీరగతములగు బాల్యయౌవనాద్యవస్థ లేరీతిగా జీవునికంటవో అట్లే చిదచిచ్ఛరీరకుఁడగు పరమాత్మకుఁ జిదచిద్గతదోషము లెంతమాత్ర మంటవు గావున నిర్వికారశ్రుతికి భంగము లేదు. శరీరలక్షణములైన ఆధేయత్వవిధేయత్వశేషత్వాదులు జగత్తునకుఁగూడ సమన్వయించుచున్నవి గావున జగచ్ఛరీరకుఁ డైన యీశ్వరుఁడు తద్గతదోషాసంస్పృష్టుఁడై యున్నాఁడు.

## మోక్షస్వరూపము

సకలజగత్కర్తయు, సర్వజ్ఞుఁడు, సర్వశక్తి, సమస్తకల్యాణగుణాకరుఁడు, నిఖిలహేయప్రత్యనీకుఁడు నైన పరమాత్మయొక్క అనుగ్రహముచే జీవుఁడు నివర్తితాశేషబంధనుఁడై అర్చిరాదిమార్గము ద్వారా అప్రాకృత నిత్యవిభూతి నొంది ఆవిర్భూతగుణాష్టక స్వరూపుండై నిరంతరభగవదనుభవజనితమహానందార్ణవనిమగ్నుఁడై పునరావృత్తిరహితుఁడై యుండుటయే మోక్షము. అట్టిమోక్షమునకు ముఖ్యసాధనము భగవదనుగ్రహము. దాని కుపాయము జ్ఞానధ్యానవేదనోపాసనాదిశబ్దవాచ్యమగు భక్తియోగము. ఇంతకంటె మోక్షసాధనము మఱి లేదని "తమేవం విద్వా నమృత ఇహ భవతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ" ఇత్యాదిశ్రుతులు పలుకుచున్నవి. ఈభక్తియోగమునకు యజ్ఞదానాదులు, నిత్యనైమిత్తికకర్మలు, శమదమాదులు నుపకారకములు.

# మకరసంక్రమణము

## వడ్డాది సుబ్బారాయుఁడు గారు

విన్నను మన్నుఁ బేదకు సుభిక్షముగా నొనరింపఁజాలు నక్క
సన్నుతిఁ గన్న దీమకరసంక్రమణంబు; బలిఘోరపాతకుల్
సన్న మెయిం దొఱంగి, యట స్వర్గసుఖంబు ఘటిల్లు; గంజితోఁ
దిన్నగఁద్రావఁ జేకుఱని దీనులకుం బరమాన్నమా నిటన్.

ఉ. అల్లుర వత్తిలిండులకు, నమ్మల యిమ్ముల కాఁడుబిడ్డలం
బిల్లలతోడఁ జేర్చు, ననఁ బెద్దయె! నోములు గట్టులేఁగలం
దల్లులపాయి సర్వమును ద్రావఁగ నిచ్చును; బందిశృంఖలల్
సళ్లఁగఁజేయు; నీమకరసంక్రమణంబు మహామహం బహో!

చ. అరుణరుచిం గ్రసించి, తలయంట్లతఱిం బొగమంచు మించెఁ గ
న్నెరయయి పండుగం బ్రజకు నింగికిఁ బ్రాఁకు నినుండు నిండుచం
దురుఁ బురుడింప భూరుహాతతుల్ సహజాతరసాలసూనమం
జరులకు దావకేళి యనుజాలిని బాష్పకణాళి రాలుపన్.

ఉ. వెల్లలు గోడలన్నిటను, వీథులయందు నెగళ్లు, నిండ్లవా
కిళ్లను ముగ్గుబ, ట్లరుఁగుఁ గ్రేవల సున్నపుబొట్లు జేగు, ఱు
త్పల్లపుఁ బూసరుల్ పసుపుఁబూఁతలు ద్వారములందుఁ గుంకుముల్
పల్లెలఁ బట్టణాలఁ గనుఁబండువు సంక్రమణంపుఁ బండుగన్.

ఉ. కొమ్ములు నెత్తి మెల్దిరిగి క్రొవ్వుపొటేళులఁ జిత్రవర్ణప
ర్ణమ్ముల మేల్తనుత్రములు రమ్యశిరస్త్రము లూనుతామ్రమూ
ర్ధమ్ములు, శక్రు చీకటి కొలం దలఁపించుచు, గోపురికా యథే
చ్ఛమ్ము చరించు, నీమకరసంక్రమణమ్మున శౌర్యధుర్యముల్.

చ. కడచెను దద్దినాలయమఘాతుకకాలము; వచ్చెఁ బెండిలుల్
వడుగులఁ జేయుశోభనపువాసరముల్ గలయుత్తరాయణం;
బెడలెడు వల్లభూజనుల కల్ల ఘటిల్లినకాకిరూపికం;
గడగుడి డాయఁగంటె; మెఱుగంటియుగాదిశుభాదిఁ గావుతన్.

# నన్నయభారతమందలి ఛందోవిషయములు

గిడుగు వేంకట సీతాపతి గారు, బి. ఏ. యల్. టి

నన్నయకు పూర్వము తెలుఁగుకవిత్వము లేకపోలేదు; గాని, మనకు తెలిసినంతవఱకు ఆంధ్రసారస్వతమందు నన్నయ రచించిన భారతమే మొదటిగ్రంథము. గనుక, ఆంధ్రవ్యాకరణమునకున్ను, ఆంధ్రఛందస్సునకున్ను నన్నయభారతము ప్రధానమైన లక్ష్యగ్రంథము.

లోకమందలి వాడుకనుబట్టి కవులున్ను, కవులవాడుకనుబట్టి లాక్షణికులున్ను భాషకు సంబంధించిన పద్ధతులు కాలానుసారముగా నిర్ణయించుకొంటూ ఉండవలసినదే కాని, ముందుగా నియమము లేర్పరచి వాటిని అనుసరించి కవులున్ను, లోకమున్ను ఉండవలెనన్న వ్యవస్థ ఎంతదొడ్డలాక్షణికుడేర్పరచినా నిలవదు. లక్షణములు కాలానుసారముగా మారకపోతే, లక్షణము లోకత్రోవా, కవిప్రయోగములు ఒకత్రోవా కాక తప్పదు.

భాష మారుట లేదనిన్ని లక్షణములను కవులు పూర్తిగా అనుసరిస్తూ ఉన్నారనిన్ని పెడత్రోవ త్రొక్కి వాదించేవారికి, నన్నయభారతమందలి వ్యాకరణ విషయములున్ను ఛందోవిషయములున్ను ప్రత్యేకించి చూపిస్తేనే కాని ఈ రెండువిషయములలోను కవుల ప్రయోగములు రానురాను ఎట్లు మారుతూవచ్చినవో బోధపడదు.

లోకవ్యవహారసిద్ధమైనభాషావిషయములో కవికి స్వాతంత్ర్యము తక్కువ గాని, ఛందోవిషయములో కవికి కావలసినంత స్వాతంత్ర్యమున్నది. సంగీతశాస్త్రమువలెనే ఛందశ్శాస్త్రమున్ను కళకు సంబంధించి ఉన్నది. కళానిపుణులు క్రొత్తమార్గములను అవలంబించి జనుల హృదయములు రంజింపజేయవచ్చును. అప్పుడు ఆమార్గములను పరిశీలించి, కొన్నిలక్షణములను ఏర్పరచి, లాక్షణికులు తమలక్షణగ్రంథములలో చేర్చుకొంటారు.

నన్నయభారతమందలి ఛందోవిషయము లన్నీ మొదట జాగ్రత్తగా పరిశీలించి, ఆంధ్రఛందస్సు నేటివరకు ఎట్లు పరిణమిస్తూ ఉన్నదో వివరించి, మధురకవితలు ఇప్పుడిప్పుడు ఎట్లు పండితులకున్ను పామరులకున్ను ఆదరణీయము లగుతున్నవో చర్చించి వ్యాసములు వ్రాయదలచినాను. ఈ విషయములలో మొదట పేర్కొన్న విషయమైనా పూర్తిగా చర్చించుటకు ఈ సంచికలో స్థలము చాలదేమో. గనుక, ముఖ్యమైన విషయములు సంగ్రహించి తెలియజేస్తున్నాను. నన్నయ యథేచ్ఛముగా చేసుకొన్న ఛందోనియమము లేవో తెలుసుకోవలె నన్నకోరికతోనే ఈవిమర్శ తలపెట్టినాను. మన కుచితమైనవి కావన్నా ఆ నియమములనే మన మిప్పుడు పాటించవలె నన్నఉద్దేశము నాకెంతమాత్రమును లేదు. మన కిష్టమయినవే నన్నయకుకూడా ఇష్టమయినవని రుజువుచేయుటకు సంకల్పించి, అన్వేషిస్తే, సత్యము తెలుసుకొనుట కష్ట మవుతుంది.

## వచనములు, పద్యములు

నన్నయభారతమందు మొదటిశ్లోకము, ఆశ్వాసాంతగద్యలు కాక 1492 వచనములు, 2497 పద్యములు ఉన్నవి. ఈపద్యములలో ఏవేవి ఎన్నెన్ని ఉన్నవో చూడండి:—వృత్తములు మొ॥ :—

| | | | |
|---|---|---|---|
| శా. 18 | స్ర. 1 | వసంత 3 | అంబురుహ 1 |
| మ. 61 | మ.స్ర. 2 | స్వాగతం. 2 | రథోద్ధత. 1 |
| ఉ. 185 | మానిని. 2 | తోటకం. 1 | మణిభూషణం. 1 |
| చ. 241 | కవిరా. 2 | పద్మకం. 1 | లయగ్రాహి 3 |
| మత్త. 26 | మాలిని. 7 | ద్రుతవి. 1 | దండకం. 1 |
| తరల. 25 | పృథ్వి. 5 | వనమ. 1 | మొత్తము. 591 |

సంస్కృతములో లేని జాత్యుపజాతిగీతాదులు:—

| | | | |
|---|---|---|---|
| క. 1223 | ఆ. వె. 195 | ఉత్సాహ. 4 | మధ్యాక్కర. 39 |
| సీ. 251 | తే. గీ. 181 | తరువోజ. 12 | మధురాక్కర. 1 |

మొత్తము 1906.

తెలుగుభాషకు ఎటువంటిపద్యములు సహజముగా అమరియుంటవో ఏవి సులువైనవో మొదలయినవిషయములు మరియొకవ్యాసములో చర్చించదలచుకొన్నాను.

నన్నయ వాడిన వృత్తములలో కొన్నిటం కొన్నివిశేషములు కలవు.

## పృథ్వి

నన్నయ 11 అక్షరముల తర్వాత వడి నిల్పినాడు. చూడండి.

"భ్రమాకులితచిత్తుఁడై తగిలి ♦ పాఱుచుఁ ముందటన్" (ఆది. 2. 163)—అప్పకవి, అనంతుడు, విన్నకోటపెద్దన, కవిజనాశ్రయకర్త ఇట్లే నియమము చేసినారు. తాతంభొట్లు 13 అక్షరముల తర్వాత వడి నియమించినాడు. పెద్దనమాత్రము సంస్కృతమర్యాద ననుసరించి 8 తర్వాత తొమ్మిదింట వడి నిల్పినాడు.

## పద్మకము

నన్నయ ఎనిమిదింట వడి నిల్పినాడు. చూడండి:—"కొడుకు పల్కు విని ♦ కూడదునాకదురాత్ముఁడై" (ఆది. 6. 227) అనంతుడు, అప్పకవి మొదలయినవారు 11-వది విరామాక్షరమని నియమించినారు.

## కవిరాజవిరాజితము

అప్పకవి మొదలయిన లాక్షణికులు ప్రతిచరణములోను 8-వ అక్షరము, 14-వ అక్షరము, 20-వ అక్షరము, విరామాక్షరములుగా నియమించి, ఇవి మొదటి అక్షరముతో మైత్రికలవి కావలెనని లక్షణము చేసినారు. ఈ నియమము కంకంటిపాపన మొదలయినవారు

కొందరు పాటించినారు; గాని నన్నయ, పెద్దన, జక్కన 14-వ చోటనే వడి నిల్పినారు. తిక్కన రచించిన స్త్రీపర్వములో రెండు పద్యము లున్నవి. అందులో ఒకటి నన్నయ పాటించిననియమమును, రెండవది లాక్షణికులు చెప్పిన నియమమును అనుసరించి ఉన్నవి.

## మధ్యాక్కరలు

అప్పకవి మొదలయిన లాక్షణికులందరున్ను ఒక్కవిధముగానే మధ్యాక్కరకు లక్షణము చెప్పినారు. ప్రతిపాదములోను రెండు ఇంద్రగణములు, ఒక సూర్యగణము, రెండు ఇంద్రగణములు ఒక సూర్యగణము. అందరున్ను మూడవగణము తర్వాతనే వడి నియమించినారు. నన్నయ రచించిన మధ్యాక్కరచరణములలో నాల్గవగణము తర్వాత వడి కనబడుచున్నది. యుద్ధమల్లుని శాసనాక్కరలలో సైతము నాల్గవగణముతర్వాతనే వడి ఉండడముచేత పూర్వకాలములో అట్లే ఉండేదని ఊహించవలసి ఉన్నది. తిక్కన మధ్యాక్కరలు చెప్పలేదు. ఎర్రాప్రెగడ మూడవగణముతర్వాతనే వడి పాటించినాడు. మరి యేకవిన్నీ మధ్యాక్కరలు చెప్పినట్లు కనబడదు. లాక్షణికులు ఎర్రాప్రెగడ పాటించిన వడినియమమును అనుసరించి లక్షణము చెప్పినారు గాని నన్నయ పాటించిన వడినియమము గురించి చెప్పనే లేదు.

వడి విషయములోనే కాక గణములవిషయములో సైతము నన్నయమధ్యాక్కరలకున్ను లాక్షణికులు చెప్పిన మధ్యాక్కరలకున్ను భేదమున్నట్లు కనబడుచున్నది. నన్నయ మధ్యాక్కరలకు పాఠభేదములు అనేకముగా ఉన్నవి. నన్నయ ఎట్లు రచించినాడో తెలుసుకొనుట కష్టముగా ఉన్నది. అచ్చుపడ్డప్రతులు చూచినయెడల వాస్తవము ఏదో తెలియదు. పరిష్కర్తలు లాక్షణికులు చెప్పినట్లు సవరించుటకే ప్రయత్నించినారు గాని వాస్తవము తెలుసుకొనుటకు ప్రయత్నించలేదు. ఇంతకూ ఆప్రయత్నమైనా సఫలము కాలేదు. అచ్చుపడ్డ ప్రతులలో దృష్టాంతముగా వేమూరివారు ప్రకటించినది చూడండి:—

"తనదివ్యశక్తి నప్పాశముల విడిచి ♦ తన్ముని నాధు (ఆది.8.112)

"సమరంగ ధర్మువు రక్షించుఁ బ్రీతి ♦ వని శత్రులందు (అర.1.225)

ఈవిధముగా కొన్నిచరణములలో గణములతీరు లాక్షణికులు చెప్పినట్లు లేదు.

కొన్నిచోట్ల చాలావ్రాతప్రతులలో ఒక్కవిధముగానే ఉన్న పాఠములు అచ్చుపడ్డప్రతులలో కనబడకపోవుటచేతను, అచ్చుపడ్డ పుస్తకములలోని పాఠములు కొన్ని "రాజు గావలె" (ఆది. 4. 175) "పూజింపుము" (అర.2.355) నన్నయ వ్యవహారమందున్న "రాజుగావలయు, పూజింతురు" అనేప్రయోగములకు విరుద్ధముగా ఉండుటచేతను, పరిష్కర్తల పాఠములు ప్రమాణమైనవి కావని ఊహించవలసి ఉన్నది. గనుక, నన్నయమధ్యాక్కరలపై తుది నిర్ణయించుటకు శక్యము గాకున్నది.

ఈవిషయము కొంతవరకు విమర్శించినవారు శ్రీయుతులు వేటూరి ప్రభాకరశాస్త్రి... మల్లంపల్లి సోమశేఖర... మల్లి రాజగోపాలరావు పంతులుగారు, బ్రహ్మశ్రీ వఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు మొదలయినవారు. నేను కొంతవరకు విమర్శించి నాయభిప్రాయములు అనంతుని ఛందోదర్పణమునకు నేను వ్రాసిన ఉపోద్ఘాతములో ప్రకటించినాను. ఈవిమర్శనము ఇంకా పూర్తి కాలేదు. "భారతి" సంచికలలో "నన్నయమధ్యాక్కరలు" అనే శీర్షికక్రింద కొన్నివ్యాసములు వ్రాయదలచినాను; గనుక, ఇక్కడ వీటిచర్చ ఇంతటితో చాలిస్తున్నాను.

## సీసములు; ఆటవెలదులు; తేటగీతులు *

నన్నయభారతమందు 251 సీసములు, 195 ఆటవెలదులు, 181 తేటగీతులు ఉన్నవి. ఈ 251 సీసములలోను ఆటవెలది గల సీసములు 224; తేటగీతిగల సీసములు 27 మాత్రమే. దీనినిబట్టిచూడగా నన్నయకు తేటగీతులకంటె ఆటవెలదులపై అభిమానము ఎక్కువగా ఉన్నట్లు కనబడుతున్నది. అంతేకాదు. నన్నయగ్రంథమందు 2497 పద్యము లున్నవి; అందులో కందములసంఖ్య (1223) అన్నిటికంటె ఎక్కువ; కందములతర్వాత ఆటవెలదులసంఖ్యయే (419) ఎక్కువ.

ఈ సీసాదులలో నన్నయ కొన్ని అసాధారణనియమములు పాటించినాడని తోచి, సుమారు పదిసంవత్సరములక్రిందట పరిశోధించుటకు ప్రారంభించినాను. అంతకుపూర్వము ఈవిషయమును గురించి లాక్షణికులు, విమర్శకులు ఏమైనా వ్రాసినారేమో అని పరిశీలించినాను. కవిజనాశ్రయము, కావ్యాలంకారచూడామణి, అనంతుని ఛందోదర్పణము, అప్పకవీయము — ఈ గ్రంథములలో చెప్పిన సీసభేదములకున్ను నన్నయ రచించిన వివిధసీసములకున్ను సంబంధము అట్టే కనబడలేదు. అయితే, అప్పకవిమాత్రము సీసభేదములను పేర్కొని "సప్తవిధము లివియ; శబ్దశాసనుండు, పంచమామ్నాయ ఫక్కిలోఁ బల్కెఁ గాని, కడమకవు లాయుసీసముల్ విడిచిపెట్టి, చెలఁగి సమసీసపద్యమే చెప్పినారు."అని వ్రాసినాడు; గాని, ఇందులో శబ్దశాసనుని (అనగా నన్నయ) గురించి చెప్పినదానికి అట్టే ఆధారము కనబడలేదు. అప్పకవి పేర్కొన్న ఏడువిధములైన సీసములలోను రెండుమాత్రమే నన్నయభారతమందు కనబడుతున్నవి:— (1) వడిసీసము; అనగా సర్వత్ర వడినియమమే కలది; (2) అవకలి వడిసీసము; అనగా సర్వత్ర ప్రాసయతినియమమే కలది.

ఈ క్రింద నుదాహరించిన సీసములు అప్పకవి చెప్పిన సర్వతః ప్రాససీసమునకున్ను, అక్కిలిప్రాససీసమునకున్ను కొంతవరకు సంబంధము కలవిగా కనబడుతున్నవి; గాని పూర్తిగా అప్పకవి చెప్పినట్లు లేవు.

"సీ. పలుకులముద్దును ♦ గలికి క్రాల్గన్నుల

తేలుపును వలుందచన్నులబెడంగు

---

* తెలుగుపత్రిక సం.1. సంచిక. 2. (1919-అక్టోబరు)లోను, వావిళ్లవారు ప్రకటించిన అనంతుని ఛందోదర్పణమునకున్ను, యథామూలముగా ఇప్పుడు వావిళ్లవారు ప్రకటించిన అప్పకవీయమునకున్ను నేను వ్రాసిన ఉపోద్ఘాతములలోను ఈవిషయము సవిస్తరముగా చర్చించినాను.

నలఘుకాంచీపద ♦ స్థలములయొప్పును
లలితానసేందుమం♦డలమురుచియు
నళినీలకుటిల కుం♦తలములకాంతియు,
నెలజవ్వనంబున ♦ విలసనమును
నలసభావంబును ♦ బొలుపును మెలపును,
గలుగ నగ్గిరికన్య ♦ దలఁచి తలఁచి
ఆ. ముదితయందుఁ దనదు ♦ హృదయంబు నిలుపుటఁ
జేసి రాగ మడర ♦ భాసురముగ
రమణతో వనాంత♦రమున రేతస్కంద
మయ్యె నవనిపతికి ♦ నెయ్య మమర ఆది. 3. 27

దీనికే వృత్తప్రాసనీసమనికూడా పేరు కలదు

ఇందులో ఆటవెలదియందు సైతము ప్రాసాక్షరము సీసపాదములలోని ప్రాసాక్షరము (అనగా 'ల') అయితేనేకాని అప్పకవి చెప్పిన సర్వతఃప్రాససీసము కానేరదు.

సీ. అంత దేవాహితు ♦ లమృతంబు గానక,
యెంతయు నలిగి బ♦లీంద్రుఁ గూడి
మంతనం బుండి య♦మర్త్యులతో డీకొ,
త్రెంతయు చాలు నిం♦కేల యనుచు
సంతనకట్టి యు♦త్సాహ మేతులై,
యంతంబులేని ర♦థాశ్వములను
దంతుల నమితప♦దాతుల నొడఁగూర్చి,
యంతకాకారులై ♦ యార్చి యమర
ఆ. వరులఁ దాకి యేసి ♦ దురతరశరపఙ్క్తి
జాతవాతరయవి ♦ ధూతమగుచుఁ
జెదర జలదపంక్తి ♦ బెదర వజ్రాయుధు
హృదయ ముదిలగొనఁగఁ ♦ ద్రిదశగణము. ఆది 2-21.

ఇందులో ఆటవెలది మొదటిచరణమందున్ను, మూడవచరణమందున్న ప్రాసాక్షరము సీసపాదములలోని ప్రాసాక్షరము (అనగా 'ంత') అయితేనేకాని అప్పకవి చెప్పిన అక్కిలిప్రాససీసము (లేక, వృత్తప్రాససీసము) కానేరదు; అయితే, అనంతుడు "వృత్తంబులకుఁ బోలె వెలయు నాల్గడుగులఁ బ్రాసముల్నిల్పి విరతులు నునుపఁ" అని చెప్పిన వృత్తప్రాససీసము కావచ్చును; గాని, లాక్షణికులు చెప్పని విశేష మొకటి ఈ నన్నయసీసమం దున్నది: పూర్వార్ధములందలి ప్రాసాక్షరము 'ంత' పశ్చిమార్ధములందున్ను ఉన్నది.

అప్పకవి చెప్పిన సమసీసము, విషమసీసము, సర్వలఘుసీసము నన్నయభారతమందు లేవు. నన్నయసీసములలో వడి, ప్రాసనియమములు ఒక వ్యవస్థావిశేషమును[illegible]న్నవి; గనుక, వాటిలో ఏదిన్ని సమసీసము కాదు. నన్నయ నాల్గు ఉత్సాహాలు మాత్రమే రచించినాడు; వాటిలో రెండింటితర్వాత వచనములున్ను, రెండింటితర్వాత ఆశ్వాసాంతగద్యలున్ను ఉన్నవి; గాని, తేటగీతిగాని, ఆటవెలదిగానీ లేదు; గనుక, నన్నయ విషమసీసము రచించలేదనుట స్పష్టము.

అయితే, నన్నయ పైని చెప్పిన రెండువిధములయిన సీసములే (అనగా సర్వత్ర వడినియమమే కలవి, సర్వత్రప్రాసనియమమే కలవి) కాక, మరికొన్నివిధములైన సీసములు రచించినాడు. వీటినిగురించి లాక్షణికులెవరును చెప్పియుండలేదు. ఈసీసభేదములు ఏవ్యవస్థనుబట్టి ఏర్పడినవో చూడండి. గీతరహితమైన సీసములు నాలుగు విధములు: (1) సర్వయతిసీసములు; అనగా నాలుగుపాదములలోను, రెండుదళములందున్ను వడినియమమే కలవి. (2) సర్వప్రాససీసములు; అనగా నాలుగుపాదములలోను, రెండుదళములందున్ను ప్రాసనియమమేకలవి. (3) ప్రథమదళయతి ద్వితీయదళప్రాససీసములు; అనగా నాలుగుపాదములలోను మొదటిదళములందుయతినియమమున్ను ద్వితీయదళములందు ప్రాసయతినియమమున్ను కలవి. (4) ప్రథమదళప్రాస ద్వితీయదళయతి సీసములు; అనగా నాలుగుపాదములలోను మొదటిదళములందు ప్రాసయతి నియమమున్ను ద్వితీయదళములందు యతినియమమున్ను కలవి. సీసములకు చేర్చిన ఆటవెలదిగాని తేటగీతిగాని, మొదటిచరణమున్ను, రెండవచరణమున్ను ఒకపంక్తిగాను, మూడవ చరణము, నాల్గవచరణము ఒకపంక్తిగాను ఉంచిచూచినయెడల, పైనిచెప్పిన నాలుగువిధములున్ను గీతములందుకూడా కనబడుతున్నవి. ఈవిషయము చాలాకాలముక్రిందట * పాడి వేంకటస్వామిగారు అముద్రితగ్రంథచింతామణిలో వ్రాసినారు. అయితే, గీతసహితమైన సీసములు ఎన్నివిధములుగా ఉన్నవో, ఏయేవిధముల సీసము లెన్నెన్ని ఉన్నవో వారు విమర్శించలేదు. అంతేకాక, వారివ్యాసములో కొన్ని పొరపాట్లు కనబడినవి. "నన్నయకవిత్వములోఁ బ్రథమదళయతిసీసముల్క్రిందఁ బ్రథమదళయతిగీతాటవెలఁదులు లేనేలేవు" అని వారు వ్రాసినారు. గాని, ఉన్నది; చూడండి:—

సీ. పుణ్యకర్మంబులు ♦ వొలిసిన సుర్యికి,
నేతెంచునట్టి య♦యాతివోలె
*          *          *          *
ఆ. శార్ఙ్గమప్రియావ♦సన్న దేహుండనై
యుడిగి రథముమీఁదఁ ♦ బడితి నేను అర. 1. 191
*          *          *          *

వీరేశలింగం పంతులుగారు ఆంధ్రకవులచరిత్ర ప్రథమభాగము (1917) పుటలు 72-74 లో చాముండికావిలాసకర్తృత్వమునుగురించి వ్రాస్తూ "నన్నయనియమమునకు కేవల విరుద్ధముగా పైసీసపాదములు పూర్వార్ధమందు ప్రాసమును ఉత్తరార్ధమందు వడిని కలవిగా నున్నవి" అని వ్రాసినారు. దీనినిబట్టి నన్నయసీసములలో పూర్వార్ధమందు ప్రాసయతిన్ని ఉత్తరార్ధమందు వడిన్నిగల సీసములు లేవని పంతులవారి అభిప్రాయమైనట్టు స్పష్టము; గాని ఇది పొరపాటు; చూడండి:—

* వ్యాసము వ్రాసినవారు వేంకటస్వామిగారే అయినా ఈ విషయము మొదట పరిశోధించి కనుగొన్నవారు మ-రా-శ్రీ వడ్డాదుటి వీరరాజుపంతులుగారు అనిన్ని, ఆవిషయము వేంకటస్వామిగారు తెలియజేయక పోవడము పొరపాటనిన్ని నాకు ఇటీవల తెలిసినది.

సీ. కలహంస పలికిన ♦ పలుకులు గణియించు,
వడి దానిపోయిన♦నలన చూచు

*   *   *   *

ఆ. నందు బుద్ధి నిలిపి ♦ కందర్పబాధిత
యగుచునున్న యది ధ♦రాధినాథ.   అర. 2. 26.

*   *   *   *

నన్నయ పాటించిననియమముల వ్యవస్థ పరిశీలించినయెడల 16 విధము లయిన సీసములు ఏర్పడనచ్చును. అవి ఈదిగువ ప్రస్తరించి చూపించినాను:—

## సీసముల ప్రస్తారము

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| సీ. యతి | సీ. యతి | సీ. యతి | సీ. యతి |
| గీ. యతి | గీ. ప్రాస | గీ.య-ప్రా | గీ.ప్రా-య |
| 5 | 6 | 7 | 8 |
| సీ.ప్రాస | సీ. ప్రాస | సీ. ప్రాస | సీ. ప్రాస |
| గీ. యతి | గీ. ప్రాస | గీ.య-ప్రా | గీ.ప్రా-య |
| 9 | 10 | 11 | 12 |
| సీ.య-ప్రా | సీ.య-ప్రా | సీ.య-ప్రా | సీ.య-ప్రా |
| గీ. యతి | గీ. ప్రాస | గీ.య-ప్రా | గీ.ప్రా-య |
| 13 | 14 | 15 | 16 |
| సీ.ప్రా-య | సీ.ప్రా-య | సీ.ప్రా-య | సీ.ప్రా-య |
| గీ. యతి | గీ. ప్రాస | గీ.య-ప్రా | గీ.ప్రా-య |

ఇందుకు తెలివిడి రెండింటికి చెప్పినయెడల తక్కినవి సులభముగా తెలుసుకోనచ్చును.

(I) సీ. యతి / గీ. యతి అంటే సీసపాదముల నాల్గింటను రెండుదళము లందును, గీతపాదముల నాల్గింటను యతినియమమే కలది.

(II) సీ. య-ప్రా / గీ. య-ప్రా అంటే సీసపాదముల నాల్గింటను మొదటి దళములందున్ను గీతప్రథమతృతీయచరణములందు యతినియమమున్ను తక్కినచోట్ల ప్రాసనియమమున్ను కలది

ఇందులో 12, 14, 15 సంఖ్యలక్రింద చెప్పినసీసభేదములు మాత్రము నన్నయభారతములో లేవు. తక్కిన పదమూడువిధములయిన సీసభేదములున్ను కలవు. ఏయేవిధముల సీసములు ఎన్నెన్ని ఉన్న వంటే:—

(1) 158 (ఆది.1.27 మొ.); (2) 3 (ఆది II. 21 మొ.); (3) 2 (ఆది VIII. 82, అర. II. 344); (4) 3 (సభా I.46;187); (5) 3 (ఆది.1.33 మొ.); (6) 33 (ఆది.I.7) (7) 1 (ఆది. VIII. 115); (8) 4 (ఆది.III.115మొ.); (9) 16 (ఆది.I.80మొ.); (10) 5 (ఆది.III.14); (11) 1 (అర.I.191); (13) 21 (ఆది. III.50మొ.); (16) 2 (అర.II.26,94) మొత్తము 251.

ఆనందముద్రణాలయ ముద్రితప్రతిలో చూస్తే 15 సీసములలో పైనిచెప్పిన నియమము ఒక్కొక్కచోట తప్పినట్లు కనిపిస్తుంది; గాని తాళపత్రప్రతులు చూచి సరియైనపాఠములు గ్రహించినయెడల నన్నయ రచించిన 251 సీసములున్ను పైని పేర్కొన్న నియమములను అనుసరించియే ఉన్నవని స్పష్టమగును. ఈపాఠములగురించి ఇక్కడ విస్తరించి వ్రాయుటకు అవకాశము చాలనందువ రెండింటినిమాత్రమే వివరించి వ్రాస్తున్నాను. అర. II. 230 "ఇన్నలోపాఖ్యాన మెప్పుడు" అనే సీసము సర్వయతిసీసము కావలసినదే. కాని అచ్చుపుస్తకములో ఆటవెలది మూడవచరణము "నుతచరిత్రుఁడైన ♦ ఋతుపర్ణుఁ గీర్తింప" అని ఉండుటచేత నియమము తప్పినట్లున్నది. కాని అనేక తాళపత్ర ప్రతులలో "ఋజుచరిత్రుఁ" డని "ఋషిచరిత్రుఁ" డనిపాఠములున్నవి. అర. III. 162 "మతిహీనుఁడైతన ♦ సుతులపల్కులు" అనేసీసము సర్వప్రాసయతిసీసము కావలసినదే. కాని అచ్చుపుస్తకములో "ధనము నిట్లుసేయ ♦ దగునె విధికి" అని ఉండుటచేత నియమము తప్పినట్లున్నది. కాని కొన్ని తాళపత్రప్రతులలో "జనునె విధికి" అన్న పాఠము కనబడినది.

నన్నయ (సీసములతో కలపక ప్రత్యేకించి) రచించిన తేటగీతులలోను ఆటవెలదులలోను పైని చెప్పిన నియమములు కలవు. అచ్చుపడ్డ ప్రతులు చూస్తే, వీటిలో కూడా ఒక్కొక్కచోట నియమము తప్పినట్లు కనిపిస్తుంది; గాని తాళపత్రప్రతులుచూచి సరియైనపాఠములు గ్రహించినయెడల నన్నయ రచించిన ఆటవెలదులు, తేటగీతులుకూడా సీసములవలెనే పైని చెప్పిన నియమములను అనుసరించి ఉన్నవని తేటపడును. ఇందుకు తార్కాణగా మూడు ఉదాహరణములు చూడండి:—

తే. సాక్షియును ధర్మదర్శియు ♦ సాక్ష్యవిధులు
దప్పఁగాదు తప్పినను న♦ధర్మయుక్తి
వరుణపాశసహస్రంబు ♦ వానిఁ గట్టి,
పాయు నేఁటేట నొక్కొక్కఁ ♦ డాయతముగ.   సభ. 2.242.

ఇందులో మొదటిదళమందు యతినియమమున్ను, రెండవదళమందు ఒకచోట అనగా రెండవచరణమందు యతినియమమున్ను మరియొకచోట, అనగా నాల్గవచరణమందు, ప్రాసయతినియమమున్ను కలవు గనుక మీద చెప్పిన నియమము తప్పినట్లున్నది. వ్రాతప్రతుల లోని పాఠము చూడండి:—

"సాక్షియును ధర్మదర్శియు ♦ సాక్ష్యధర్మ
విధులు దప్పంగఁ జెప్పిన ♦ నధమవృత్తి

అని ఉన్నది. ఇందులో మొదటిదళమందు యతిన్ని రెండవ దళమందు ప్రాసయతిన్ని కలవు. పైనిచెప్పిన నియమములు నిలిచినవి.

"తే. వీనిపుట్టినపాపంపు♦వేళఁ బెక్కు
దుర్నిమిత్తముల్ పుట్టిన ♦ నిర్ణయించి
యేను జెప్పితిఁ దొల్లియు ♦ వీనిచేత,
నెట్టుఁ గౌరవులకు నెగ్గు ♦ పుట్టు ననియు"   అర. 1.49.

దీనిలో నియమముతప్పినది. వ్రాతప్రతులలోని పాఠము చూడండి. నియమము నిలిచినది. 3 వ పాదము "యేను జెప్పితిఁ దొల్లియు ♦ నితని చేత" అని ఉన్నది.

"ఆ. సైవ భీమ్యరుండు ♦ నలుఁ డప్పు డసమర్థుఁ
డగుటఁజేసి తన్ను ♦ నన్యు లెఱుఁగ
కుండ నుండఁగాన ♦ యురుసభాంతరముల
కరిగి యిట్టు లనఁడు ♦ వరుస మీరు" అర. 2-156

ఇది సర్వత్ర యతినియమముకలది కావలసియుండెను. అచ్చుప్రతిలో ప్రాసనియమము నాల్గవచరణములో ఉన్నది. వ్రాత ప్రతులలో ఈ నాల్గవచరణము "కరిగి యరిగి యిట్టు లనఁడు మీరు" అని ఉన్నది.

ఇటువంటినియమములు నన్నయ పాటించినాడని తెలియడము వల్ల ఒక గొప్పమేలు కలిగినది. ఈ విరామస్థలములో పాఠభేదములు కనబడినప్పుడు ఏపాఠము నన్నయ రచించినదో తెలుసుకొనుటకు కొంత అవకాశము కలిగినది. ఇందుకు దృష్టాంతముగా మరియొకటి చూడండి:—

సీ. అ. మునివరేణ్యు శాప♦మునఁజేసి యిప్పాట
నవయుచున్నవాఁడ ♦ నాఁటఁగోలె (అర. 4-119)

ఇది సర్వప్రాసనీసము కావలసినది; గాని, అ. 4 వ చరణములో ప్రాసయతికిమారుగా యతినియమము అచ్చుప్రతులలోను, కొన్ని వ్రాతప్రతులలోను ఉన్నది. ఒక వ్రాతప్రతిలో మాత్రము; "శాపమునఁ జేసి నవసి యి, ప్పాటనున్నవాఁడ ♦ నాఁటఁగోలె" అని ఉన్నది. ఇదియే సరియైనపాఠమని నన్నయపాటించిన నియమవిశేషసరణిబట్టి నిశ్చయించవచ్చును. ఇక్కడఖండాఖండ ప్రాస మున్నదని ఈపాఠము విడిచిపెట్టరాదు. ఈప్రాసము నన్నయభారతమందు ఇంకా కొన్నిచోట్ల కనబడుతున్నది.

## యతి

లాక్షణికు లందరిలోను యతిభేదములను ఎక్కువగా వివరించి చెప్పినవాడు అప్పకవి గనుక, అతడు చెప్పినవాటిలో ఏవి నన్నయ భారతమందు నాకు కనబడలేదో వాటిపేళ్లున్ను ఆయతులు ఎటువంటివో నావ్యాసము చదివేవారు సులభముగా తెలుసుకొనుటకై జ్ఞాపకార్థము ఒకొక్కదానికి ఒకొక్కఉదాహరణమున్ను ఈక్రిందను వివరిస్తున్నాను.

1. లుప్తవిసర్గ స్వరవళులు (అ-నాపోహము)
2. ఋత్వసంబంధవళులు (కృ-ఇ)
3. ఋత్వసామ్యవళులు (కృ-కృ)
4. వృద్ధివళులు (ఇ-లౌకిక)

} స్వరవళులు

5. బిందుయతులు (౦త-న)
6. తద్భవవ్యాజనిత్ర్సశమములు (జ్ఞ-న)
7. విశేషవళులు (జ్ఞ-క)
8. అనుస్వారసంబంధయతులు (౦త-౦ట)
9. అనునాసికాక్షరయతులు (౦త-ణ; ౦డ-న)
10. మకారయతులు (ముని-భూమి)
11. మవర్ణవిరామములు (మ-౦య, ౦ర-౦హ)
12. అభేదవిరతులలో ల (ళ) డలకు మైత్రి
13. అంత్యోష్మసంధివళులు (సా-వాఙ్మ)
14. వికల్పవిరమణములు (న-మరున్నందనా)

} వ్యంజనాక్షరవళులు

15. దేశ్యనిత్యసమాసవిశ్రాంతులు (ఉక్క-అ-అ)
16. రాగమసంధివళులు (అ-జనరాండ్ర)
17. విభాగవళులు (ఇ-నాలుగేసి)
18. సామాఖండవిశ్రమములు (అ-వెంకప్ప)

} ఉభయవళులు

పైని పేర్కొన్న ఉభయవళుల నాలిగింటికిన్ని నన్నయభారతమందు ఎటువంటిప్రయోగమూ లేదు. ఈదిగువను పేర్కొన్న ఉభయవళులలో నేటికి ఎటువంటిప్రయోగములు నన్నయభారతమందు కనబడవో వివరిస్తున్నాను.

(1) యుష్మదస్మచ్ఛబ్ద యతులు:—"త్రస్తాత్ముల మైన యస్మదాదులకల్లక్" (ఆది. 2-215) అని వ్యంజనమునకుమాత్రమే ప్రయోగమున్నది; గాని, స్వరమునకు లేదు.

(2) పరరూపవిరతులు:- ఒక్క 'వేదండ' శబ్దమునకే ప్రయోగమున్నది. అది ఆదిపర్వములో (3-227) మత్తకోకిలము. "దండితాహిత" అనేపద్యములో ఉన్నది. అయితే దానికి రెండువిధములైన పాఠములుకలవు. "వే! దండమండలచండతుండ వి♦దారణాసిభుజార్గళా" అని కొన్నిప్రతులలోను "వే! దండగండవిదారిఘోరత ♦ రాసిధారసిభుజార్గళా" అని కొన్నిప్రతులలోను ఉన్నవి. అప్పకవి 'వేదండ, సారంగ' శబ్దములకు రెండేసిపద్యములుచొప్పున ఒకటి స్వరమునకున్ను ఒకటి వ్యంజనమునకున్ను ఉదాహరించినాడు. వేదండశబ్దముక్రింద వ్యంజనమునకు ఉదాహరణముగా భీష్మపర్వములోని పద్యమున్ను, స్వరమునకు ఆదిపర్వములోని ఈపద్యమున్ను ఉదాహరించినాడు. కూచిమంచి తిమ్మకవి కూడా అచ్చుకు వడి నిలిచిఉన్న పాఠమునే తన సర్వలక్షణసారసంగ్రహములో ఉదాహరించినాడు. గాని, పాఠభేదము లుండుటచేత నన్నయ ఎట్లు రచించినాడో నిశ్చయముగా చెప్పలేము; గాని, స్వరము ప్రత్యేకించవచ్చునన్న జ్ఞానము భాషాపండితులకే కాని సాధారణుల కుండదని చెప్పవలసిన పరరూపాదిశబ్దములు విరామస్థలమందు వాడినప్పుడు, నన్నయ వ్యంజనమునకే కాని స్వరమునకు వడి నిల్పడని నా అభిప్రాయము. ఈ అభిప్రాయము సరియైనదవని, తక్కిన ఉభయవళ్లవిషయములో నన్నయ ఎట్లు వడి నిల్పినాడో చూచినతర్వాత స్పష్టము కావచ్చును *

* వేదండశబ్దమునకు వ్యుత్పత్తి విమర్శించవలసి ఉన్నది. "వేదః సామవేదః అండః జననకారణం యస్య సః వేదండః సామోద్భవ ఇతి ప్రసిద్ధిః" అని అప్పకవీయములో చెప్పినట్లే కొందరుపండితులు చెప్పుతున్నారు. గాని, దీనికి సిద్ధాంతకౌముదిలో ఆకరము కనబడదు. శబ్ద

### 3. ప్రాదియతులు:—

వీటికి లక్ష్యములుగా ఈక్రిందను ఉదాహరించినవి నన్నయ భారతమందు కనబడుతున్నవి:—

ప్ర—ప్రాప్త (ఆది. 3.141); ప్రార్థించి (ఆది. 7.15); ప్రారబ్ధ (ఆది. 7.150); ప్రారంభ (స. 1. 106, 246.)

ప్రతి—ప్రత్యక్ష (ఆది. 7. 35)

అతి—అత్యంత (ఆది. 7. 58)

అభి—అభ్యుదిత (ఆది. 3. 124); అభీప్స (ఆది. 3. 82; అర. 3. 317) అభ్యుదయ (స. 1.18)

సమ్—సముంచిత (ఆది. 1. 89); సమర్పణ (ఆది. 2. 40); సముల్ల (ఆది. 4. 39); సమీహిత (ఆది. 4. 127); సమక్షము (ఆది 6. 49); సమర్థిత (ఆది. 6. 49) సమృద్ధ (ఆది. 8. 15); సమేత (ఆది. 8. 256); సముదయ (అర. 2. 282) సమగ్ర (అర. 1.359)

అప—అపేత (ఆది. 4. 20); అపార్థీకృత (అర. 1. 28)

వి—వ్యపగత (ఆది. 1. 149); స. 1. 35); వ్యాపాదిత (ఆది. 3. 117)

నిర్—నిరంతర (ఆది. 1. 72; అర. 4. 65);

ఉత్—ఉదాత్త (ఆది. 1. 10; 8. 53); ఉదగ్ర (ఆది. 7. 118; స. 1. 160; అర. 1. 305, 361)

వీటిలో వ్యంజనమునకే కాని స్వరమునకు ఎక్కడనూ వడి నన్నయ పాటించలేదు.

సమున్నత (ఆది. 3. 159); నిరర్థక (ఆది. 8. 31); నిరాగసుండ (స. 1. 184) ఈ మూడింటిలోమాత్రము స్వరమునకే వడి నిలిచియుండుటచేత ఈపాఠములు సరియైనవో కావో చూడవలసి వచ్చినది.

"ఉ. నిగ్రహమేది నన్ను ధర♦ణీవర! కూపము వెల్వరించునా॥ దుర్గమయూథసాక్షిగ స♦మున్నతదక్షిణపాణిఁ జేసి"

అని వేమూరివారిప్రతి (1907) లో ఉన్నది. అందులోనే శుద్ధపత్రికలో "ఒప్పు" అనే శీర్షికక్రింద "దుర్గమయూథసాక్ష్యముగ ♦ నున్నత" అన్నపాఠము కనబరచినారు. ఈపాఠమే తక్కిన ప్రతులలో ఉన్నది. ఈలాగుననే 'నిరర్థక' 'నిరాగసుండ' అనేశబ్దములు గల చోట్ల పాఠభేదము లున్నవో అని చూచినాను గాని, భిన్న పాఠములు నేను చూచిన ప్రతులలో కనబడలేదు. ఇంకా మరికొన్ని ప్రతులు చూస్తేనే కాని నన్నయ ఏమి ఉద్దేశించినాడో చెప్పలేము. 'నిర్' అనే ఉపసర్గతో నున్న శబ్దములు స్వరప్రధానవడికే వాడినట్లు స్పష్టమైతే కావచ్చును. అప్పుడు,—"భారత్యమరాపగౌఘము నిరంతరసంతత" (ఆది. 1. 72) ఈచరణములో నన్నయ అఖండవడి ఉద్దేశించినట్లు స్పష్టము.

### 4. నిత్యసమాసవిశ్రాంతులు

అనంత (ఆది. 1. 6, 104; 5. 174; 8. 182, 196)

అనన్య (ఆది. 3. 169; 8. 141)

అనిష్టుండు (అర. 1. 132)

అనూన (సభ. 1. 43; 88; అర. 1. 360; 4. 107)

అనేక (ఆది. 3. 160; 5. 17; స. 1. 9; 2. 93)

ఈ నఞ్ సమాసములలో స్వరమునకే కాని వ్యంజనమునకు నన్నయ వడి పాటించలేదు.

నారాయణ (అ. 2. 22) విశ్వామిత్ర (ఆది. 4. 35; 7. 94)

సాంబు (అర. 1. 159) ద్వార (ఆది. 6. 302; స. 1. 175)

ఏకాంత (ఆది. 8. 74); సాంగ (ఆది. 4. 167.)

ఈ సమాసములలో వ్యంజనమునకే కాని స్వరమునకు వడి పాటించలేదు. 'నారాయణ' అనే శబ్దముమాత్రము "పాయక పాకశాసనికి" అనేపద్యము (ఆది. 1. 24) లో స్వరమునకు 2 వ చరణములోను, వ్యంజనమునకు 3 వ చరణములోను వడి నిలిచేటట్లు, ఉపయుక్తమైఉన్నది. అయితే, కొన్నిప్రతులలో ఈపద్యమే కనబడలేదు. (అదికనబడ్డప్రతులలో 'దానును' అనుటకు మారుగా 'వానస' 'వాణస' అనేశబ్దము కనబడుతున్నది) ఈపద్యము నన్నయ రచించినది కాదని కొందరంటున్నారు.

### 5. నిత్యయతులు

ఎందేని (ఆది. 3.85); తగఁడేని (ఆది. 6.47), శక్తుఁడేని (ఆది. 7.145) ఉండిరేని (సభ. 2.237).— వీటిలో స్వరమునకే కాని వ్యంజనమునకు ఎక్కడనూ వడి పాటించలేదు.

ఉన్నేని (ఆది. 7.141)— దీనికి పాఠభేదము లున్నవి.

అచ్చుప్రతిలో "ఉన్నేనిమోఘముగాదు దిగ్ధర ♦ ణీరవిందు లెఱుంగఁగాక" అని ఉన్నది. గనుక ఈచోట మాత్రము నన్నయ వ్యంజనమునకు వడిపాటించినాడని కొందరు అనుకోవచ్చును; గాని వ్రాతప్రతులలో "ఉన్నేని దిగ్ధర♦ణీందుభాను..."అని ఉండుటచేత ఈ నిత్యయతులలో నన్నయమతమున స్వరము ప్రధానమేగాని వ్యంజనము కాదని ఊహించవచ్చును.

---

కల్పద్రుమములో ఈశబ్దము లేదు. ఆప్టే సంస్కృతనిఘంటులోను, కిటెల్ కన్నడ నిఘంటులోను "వేతండ" అనే రూపాంతరము కూడా ఇచ్చినారు. ఈనిఘంటులలో 'వితండ' శబ్దము (=ఏనుగు)కూడా ఉన్నది. 'విదండ' శబ్దము ఎక్కడనూ కనబడలేదు. 'వితండ' శబ్దమునుండి 'వేతండ' శబ్దము వచ్చిఉండునేమో! 'వేతండ' శబ్దమే 'వేదండ' శబ్దముగా మారినదేమో? తెలుగుభాషలో 'వెతకు' 'వెదకు' 'బ్రతుకు' 'బ్రదుకు' అని రూపాంతరము లున్నట్లే సంస్కృతభాషలో సైతము "కుటంగక 'కుడంగక; 'చేటక,' 'చేడక;' 'పారత' 'పారద' 'అన్తిక' 'అన్దిక;' 'కుటప,' 'కుతప,' 'కుడబ' అని రూపాంతరములున్నవిగదా. "ప్రథమ ద్వితీయయో: తృతీయచతుర్థౌ" అని చందునివ్యాకరణము (3.11) లో ఉన్నట్లు వేతండశబ్దము "వేదండ"ముగాప్రాకృతములో మారి సంస్కృతభాషలోనికి వచ్చినదేమో? గల్లతటాకాది శబ్దము లెన్నో సంస్కృతము లయినవిగదా.

### 6. పంచమీవిభక్తివిరామము

ఇందుకు మూడుప్రయోగములు మాత్రమే కనబడినవి. యాజకోత్తములకంటె (ఆది. 2. 223); వారలకంటె (ఆది. 8. 43) ఇంతకంటెను (స. 2. 269) వీటిలో వ్యంజనమునకే కాని స్వరమునకు ఎక్కడా వడి పాటించలేదు.

### 7-8. కాకుస్వర; ప్లుతవిరామములు

మహిమా (ఆది. 1. 116); ఒకో (ఆది. 8. 169); కావే (ఆది. 4. 242) జన్నే (ఆది. 8. 179); మఱచితే (8. 316); క్షత్రియవులుండవే (అర. 1. 290); కాకుస్వర ప్లుతవిరామములకు లక్ష్యములుగా చూపించదగిన ప్రయోగములు ఇవిమాత్రమే నాకు కనబడినవి. వీటిలో వ్యంజనమునకేకాని స్వరమునకు ఎక్కడా వడి పాటించలేదు. వేటూరివారిప్రతిలో "మాయిద్దఱిలోనం దెవ్వరి వలతు సెప్పుమా" (ఆది. 8. 110) అని ఉన్నది; గాని, చాలాప్రతులలో "వలతు సెపుమ ◆ యనవుడు నా" అని ఉన్నది.

వీటినిబట్టి చూడగా, అనంత మొదలయిన నఞ్సమాసముల లోను, ఎందేని మొదలయిన శబ్దములలోను సంధికార్యము స్పష్టముగా ఉండుటచేత స్వరమునకే వడి కూర్పవలెనవిన్ని, తక్కినవాటిలో శబ్దములవ్యుత్పత్తి తెలిసిన భాషాపండితులకే కాని సాధారణులకు స్వరము విఱుగునన్నజ్ఞాన ముండదు గనుక వ్యంజనమునకే వడి కూర్పవలెనవిన్ని నన్నయ ఉద్దేశించినట్లు కనబడుతున్నది.

అప్పకవి మొదలయిన లాక్షణికులు ఉభయవళ్లకు లక్ష్యములుగా పేర్కొన్న శబ్దములలో ఏవి నన్నయ భారతమందు కనబడుతున్నవో వాటిలో ప్రతిశబ్దమున్ను స్వరయతికో, లేక వ్యంజనాక్షరయతికో-ఏదో ఒకదానికేకాని, ఉభయవళ్లకున్ను ఉద్దేశించి నన్నయ ప్రయోగించినట్లు కనబడదు. "పాయక పాకశాసనికి" అనే పద్యము నన్నయరచించినదే అని రుజువయినా, ఈ సిద్ధాంతము నిలబడగలదనియే నానమ్మకము. ఎందుచేతనంటే, "నా| రాయణునట్లు... ధ◆రామరవంశ..." అనేచరణములోనివడి కేవలము స్వరమైత్రి కలదే కాదు; వ్యంజనమైత్రి కలదికూడాను. "నారాయణ" వంటి శబ్దములలో అనగా స్వరము విఱుగునన్న జ్ఞానము కేవల భాషాపండితులకే కాని తక్కినవారికి లేని శబ్దములలో, ఆ స్వరము గల వ్యంజనమునకు మైత్రి గల వ్యంజనముకూడా వడిస్థలమందు నిలపడేము నన్నయకు ఇష్టము. అంతేకాని, వ్యంజనముతో పనిలేని కేవల స్వరమైత్రి ('నారాయణ' మొదలయిన శబ్దముల విషయములో) నన్నయకు ఇష్టము కానట్లు కనబడుతున్నది. అనగా, "అటుసననీక వి◆శ్వామిత్రుఁ డనియె" (హరిశ్చంద్ర) ఇందలియతి నన్నయకుఇష్టము కాదు; గాని "సరసి| జాక్షి నిజాచి వి◆శ్వామిత్రుఁ డనియె" ఈ విధమువ నన్న యతిమాత్రము నన్నయకిష్టమని నా యభిప్రాయము. ఇందుకు నిదర్శనముగా నన్నయప్రయోగము చూడండి: "నుతుం| డురుతేరభీమరూపుఁడు ఘ◆టోత్కచు..." (ఆది. 6. 282)

అంతేకాదు, వ్యంజనముతో పనిలేక, స్వరప్రధానమైనవళ్లలో సైతమువ్యంజన మైత్రి నన్నయకు ఇష్టమయినట్లు కనబడుతున్నది. ఇందుకు లక్ష్యము లనేకముగా ఉన్నవి; గాని, అన్నీ చూపించుటకు ఇక్కడస్థలము చాలదు గనుక, ఏవో కొన్నిమాత్రమే చూపిస్తున్నాను;

"శా| ర్యాలంకారు...ఘనుఁ గ◆ర్ణాఖ్యుఁ" (ఆది. 6. 30)
"పా| లార్వఁగ సేలనావుడు బ◆లాఢ్యుఁడు" (ఆది. 6. 213)
"ఉ| గ్రానలదగ్ధులై రని ధ◆రామర" (ఆది. 7. 21)
"అధర| ణాపలి లలిఁ దెచ్చియిచ్చె ◆ నధికప్రీతిఁ" (స. 1. 257)
"ఇష్టు| డలుక సెడి సుచిత్తుఁ ◆ డయ్యెనొక్కొ" (అర. 1. 208)

పాదాద్యక్షరమునకున్ను విరామస్థలమందున్న అక్షరమునకున్ను ఉచ్చారణలో మైత్రి పూర్తిగా కుదిరినప్పుడే వడినియమము సార్థకమగుతుంది. "ద్విపద. నాకవాసుల నేను ◆ ప్రార్థించివాఁడ | నాకవాసులకృప ◆ నఖిలభాగ్యములు" రెండు చరణములలోను స్వరప్రధానమైన వళ్లే ఉన్నా, రెండవచరణమందు వ్యంజనమైత్రికూడా ఉండుటచేత, శ్రావ్యత ఎక్కువయినది. ఇటువంటివడి నన్నయకు ఇష్టము గాని, మొదటిచరణములోని వడి నన్నయకు అసమ్మతమని నా అభిప్రాయము. ఉభయవళ్ల తలంపు నన్నయకులేదనే నా నమ్మకము. అఖండవడి సమ్మతించని లాక్షణికులు తెచ్చిపెట్టిన ఉభయవళ్ల ప్రసక్తి అఖండవడి వాడిననన్నయకు అనవసరము.

### అఖండవడి*

కవిజనాశ్రయకర్త, సులక్షణసారము రచించిన లింగమగుంట తిమ్మకవి, కవిలోకసంజీవిని రచించిన ముద్దరాజురామన్న, లక్షణసారసంగ్రహము రచించిన చిత్రకవి పెద్దన, సర్వలక్షణసారసంగ్రహము రచించిన కూచిమంచి తిమ్మకవి, సుకవి మనోరంజనము రచించిన కూచిమంచి వెంకటరాయడు, లక్షణదీపికా కర్త అఖండవడి గ్రాహ్యమని పరిగణించి, దానికి లక్షణము చెప్పినారు. అప్పకవికి మాత్రము ఇష్టముకాకపోవుటచేత, అఖండవడి అగ్రాహ్యమన్న అభిప్రాయము కొందరికి కలిగినది. శ్రీనాథాదిమహాకవులు అఖండవడి తరుచుగా వాడినారు. అచ్చుప్రతులలో పరిష్కర్తలు తమ ఇష్టానిష్టములబట్టి గ్రంథము తారుమారుచేయుటచేత, కనబడకపోయినా, వ్రాతప్రతులలో భారతాదిసద్గ్రంథములందున్ను అఖండవళ్లు కనబడుతున్నవి. అఖండవడి గ్రాహ్యమన్న సిద్ధాంతము ఏర్పడినప్పుడు ఉభయవళ్లు అనవసరముకాక తప్పదు. ఉభయవళ్లకు లాక్షణికులు లక్ష్యములుగా పేర్కొన్నశబ్దములు ఎట్లు నన్నయ తనగ్రంథమందు విరామస్థలములలో వాడినాడో చూచినతర్వాత నన్నయకు అఖండవడి ఇష్టమే అన్న నమ్మకము నాకు తోచినది. ఎందుచేతనంటే, స్వరప్రధానమైన వళ్లలో సైతము వ్యంజనమైత్రి కూర్పవలెననిన్ని, స్వరమునకైనా వ్యంజనమునకైనా వడికూర్పవచ్చునన్న స్థలములలో సైతము చాలాచోట్ల వ్యంజనమునకే వడికూర్పవలెననిన్ని కోరిన నన్నయకు వ్యంజనమైత్రి ప్రధానమైన అఖండవడి ఇష్టముకాకపోవునా?

* "తెలుగు" పత్రిక (సం 1. సంచికలు 9-10) లో ఈ విషయమును సవిస్తరముగా చర్చించి నే నొకవ్యాసము వ్రాసినాను.

అచ్చుప్రతులలో నిలిచియున్న అఖండవళ్లు చూడండి:—

1. నలినాక్షి యందొక్క ♦ నాగకన్యక కామ,
పరవశయై వాని ♦ బట్టి తిగిచి,
కొని నాగపురమున ♦ కొనరంగ జని...(ఆది. 8. 128)

2. యభిలాష మేర్పడు ♦ నట్లుండగా బల్కి,
వేడ్కతో మఱుమాట ♦ వినగ దివ్యరు
నతిఘనలజ్జావ♦నత యగు నక్కన్య,
పై బడి (ఆది. 3. 37)

ఈ రెండింటిలో ప్రాసయతి కనబడుతున్నది గదా యతి విచార మెందుకని కొందరికి తోచును. పరిష్కర్తలకు అట్లుతోచినది గనుకనే దిద్దక విడిచినారు. ఈ రెండుసీసములున్ను సర్వత్ర యతి నియమము గలవి గనుక, ఇక్కడ నన్నయ ఉద్దేశించినది యతియేకాని ప్రాసయతి కాదు.

3. వీరలు దైవశక్తి ప్రభ ♦ వించినవా రను శేముసందియం
బీ రమణీయకాంతి నుప♦మింపగ (ఆది. 5.155)
భావిపురాతనావ్యతన ♦ పార్థివలక్ష్ములు పాండవేయు ల
క్ష్మీవిభవంబుతోడ నుప♦మింపగ (స. 2. 114)

ఈరెండింటిలో ఏదో ఒకటి అఖండవడి యని చెప్పకతప్పదు. ఇటువంటిది ఉభయవళ్లకు లక్ష్యముగా లాక్షణికు లెవ్వరును పేర్కొని యుండ లేదు. "ఉపమించు" మొదలయిన క్రియారూపములలోని 'ఇంచుక్' ప్రత్యేకించుట కూడదన్న వాదము నన్నయకు సమ్మతమనియే నాయభిప్రాయము. ఇటువంటి క్రియారూపములు వాడినప్పుడు అతడు వ్యంజనమునకే వడి కూర్చినాడు. చూడండి:— పరిచరించు (ఆది.2. 152) ; అనుగమింపఁగ (అర.2.305) ; బాధించి (ఆది.6.294) ; ప్రార్థించి (ఆది.7.15) గావించె (సభ.1.16); నిర్మించె (స.2.160).

4. పర్వం | బ కడుఁ మేలనఁగ శాంతి♦పర్వము వెలయున్. (ఆది.1.57) పర్వంబు + అ (ఏవార్థకమైనఅకారము) ఇక్కడస్వరము ప్రత్యేకించుట కూడదంటే, ఈ ఉదాహరణము అఖండవడికి లక్ష్యము కాదని చెప్పవలసి ఉంటుంది. కాని, కొంతమంది పెద్దపండితులు ఇటువంటిచోట్ల స్వరము ప్రత్యేకించుట కంగీకరించినట్లు కనబడుతున్నది. అముద్రితగ్రంథచింతామణి సం. VIII. సంచిక. 1. లో మండపాక పార్వతీశ్వరకవిగారు రచించిన మాలికలో "ఏకైమేకయి నట్లు చుల్కనగుప♦ల్కే మల్కియై" అని ఉన్నది. అందులోనే "ఇం| తేకాదా మనసోమనాథకవియం♦తేవాసి" అని వ్యంజనమైత్రి గల ప్రయోగముకూడా కనబడుతున్నది.

నన్నయభారతం వ్రాతప్రతులలో కనబడుతూ ఉన్న అఖండ వళ్లు చూడండి:—

1. కొడుకుం ద్రిలోకవిజయుం
బడయుదు నని ఘోరమగు తపం బొనరింపం
దొడఁగె సురరాజు నెడ్ద(=ప)లో
నిడికొని యేకాగ్రబుద్ధి ♦ నిష్ఠాత్ముండై. (ఆది.5.120.)

"నిష్ఠాత్ముండై" అనుటకు మారుగా "నేకాంతమునన్" అని అచ్చులో మార్చినారు. "నిష్ఠాత్ముండై" అనియే నన్నయ రచించి ఉండునని దానితర్వాతి వచనములో "ఇట్లతినిష్ఠ నేకపాదస్థితుండయి" అని ఉండుటచేత స్పష్టమవుతున్నది.

2. నీవ కడు నేర్పకాడవు
గావలవదు వీనిఁ గొన్నిగఱచితి మేమున్
నీవిద్య లెల్లఁ జూపుదు
మీవీరులు నూచి మేలు ♦ మేలని పొగడన్. (ఆది.6.33)

అచ్చుప్రతిలో "మే వీరలు" అని దిద్దినారు. ఇక్కడ "చూపుదుమే" అంటే అర్థము సరిపడదు.

3. "నూవె మనంబునఁ దలంచు♦చుండుదు నేనున్"(ఆది.5.135) "నూవె......సుందరి యెపుడున్" అని ఒకరున్ను, "నూవె...జోలవక యేనున్" అని దిద్దినారు.

4. "నల్లనైతోఁ తెంచునట్టి తనువు" (ఆది.6. 211) అని ఒక వ్రాతప్రతిలో నాకు కనబడినది; గాని, ఇది సర్వత్ర ప్రాసయతినియమముగల సీసముగనుక ఈపాఠము సరియైనదికాదు. మరికొన్ని ప్రతులు చూడగా అచ్చుప్రతిలోని పాఠమే కనిపించినది.

'బోరన' శబ్దము "బోరు + అన" అని విడదీయుటకు అవకాశమున్నదేమో విమర్శించవలెను. 'బోరు' అనుకరణపదముగదా? ఇందు స్వరము విడదీయుటకు అవకాశమున్నదంటే, "బో|రనఁ గీర్తించిరి సంతతస్తుతి పదా♦రావంబు"లో అఖండవడి ఉన్నదని చెప్పవలెను. ఇట్లే మరిమూడుచోట్ల 'బోరన' శబ్దము విరామస్థలమందు నన్నయ్య వ్యంజనమునకే వడి నిల్పి ప్రయోగించినాడు.

(చూ. ఆది. 4. 190; అర. 1. 287; 2. 29.)

యతికి సంబంధించినవి శేషములు మరికొన్ని గలవు.

"పొలుపడి నిల్చులాఁతివా ప్రాసమునకు
జాతివాకు సవర్ణమై శంక లేక
యతికిఁ బంచమవర్గాద్య మగుటఁజేసి
చెల్లదు పకారమునకు లక్ష్మీభుజంగ" అప్ప. 2. 249

"లాఁతిజాతికి వడికి నిల్పఁదగదనుచు
సూత్రమునఁ జెప్ప లేదని చూడవలదు
నన్నయార్యుఁడు పంచమామ్నాయమునను
నిలుపులక్ష్యంబులకు మాఱు వలుక వశమె." అప్ప. 2. 251

దీనినిబట్టి చూడగా జాతివా లాతివాలకు వడి నిల్పరాదనిన్ని నన్నయ అట్లు నిల్పలేదనిన్ని అప్పకవియభిప్రాయ మయినట్లు కనబడుతున్నది. నిల్పలేదని చెప్పినదానికి లక్ష్యము లెట్లు చూపించుటకు సాహసించినాడో తెలియకున్నది. పైని ఉదాహరించిన పద్యముల తర్వాత "భూసుతకీర్తి బ్రాహ్మణుఁడు ♦ వుట్టెఁడు" అనే పద్యము ఆదిపర్వమునుండి (1. 157) ఎత్తి, తన లక్షణమునకు లక్ష్యమైనట్లు కనబరచినాడు. "జాతివాలాతివాలకు" నన్నయ వడి నిల్పలేదని చెప్పినవాడు "భూ" లాతి "వు" లకు వడిగలపద్యము ఉదా

హరించిన నేమిప్రయోజనము? ఇంతకూ జాతిలాతివాలకు వడినిల్పిన పద్యము నన్నయభారతమందు లేకపోలేదు.

సీ॥పా॥ "వేణి సరస్వతి ♦ వెన్న యైరావతి... (స. 1. 71) భారతమందు గసడదవాదేశము నిత్యమైనట్లే కనబడుతున్నది.

తిక్కనప్రయోగములు

1. ఒం। దుగడ (విరా. 1. 130); 2. ఒం। టిదిరుగు (విరా. 1. 103); 3. శ్రీ వాలింపంగ (ఉద్యో. 1. 143)

ఎర్రాప్రెగడప్రయోగము

ఉ। ర్వి సలింపంగ (హరి. ఉ. పు. 259)] నన్నయభారతములో ప్రాసస్థలమందుమాత్రము ఈ ఆదేశమునకు లక్ష్యములు కనబడలేదు.

వపలకు మైత్రి లేదన్న అభిప్రాయముతో కొందరు పరిష్కర్తలు "మహీ।వల్లభ తత్కథము నె♦పంబున..."అని (ఆది.1.125) ఉంటే, "నెపంబున" అనేశబ్దము "నెవంబున" అని మార్చి అచ్చు వేయించినారు. "నెవంబున" అనేశబ్దముయొక్క సాధుత్వమునిల బెట్టుటకు ఈపద్యమే ప్రమాణముగా చూపిస్తున్నారు. 'నెపము'అనేశబ్దము అందరికీ తెలిసినదే "ద్రుపదతనూజం" అనే పద్యములో (సభా.2.222) నాల్గవచరణము "నెపమునఁ బరిభూతయయ్యె ♦ నిష్కారణులచేత" అని ఉన్నది. "వీరుఁడగు నరుని యేయున, పారశరావలులనడుమ ♦ వారింపంగా" (ఆది.7.197) ఇక్కడ దిద్దిమార్చివేయలేదు.

ఉభయవల్లు ఉండవలసినదని వాదించేవారు పంచమీవిభక్తి విరామముతోపాటు చతుర్థీవిభక్తి విరామముకూడా చేర్చుకోవలసి ఉంటుంది. నన్నయభారతమందు ఈవిభక్తిప్రత్యయము విరామస్థలమందు ఒక్కచోటనే ఉన్నది. "అనఘ మామామకేకుని నా♦కైకడంగి" (స.2. 174).

"కృతవీర్యధనమెల్ల♦ గ్జప్తినేసి" (ఆది.7. 132) ఋకార రికారములకు మైత్రి కలదని లాక్షణికులు చెప్పలేదు. దీనినిబట్టి లక్షణము చేయవలసి ఉన్నది.

## ప్రాస

నన్నయభారతమందు అప్పకవి మొదలయిన లాక్షణికులు చెప్పినప్రాసభేదములు కొన్నిమాత్రమే కనబడుతున్నవి. అవి ఏవంటే,

### 1. ఖండాఖండప్రాసములు

1. వీఁకఁ బఱతెంచి...(ఆది. 8. 200)

2. ఆపన్నగముఖ్యులఁ దన, వీఁపున (ఆది. 2. 42)

అప్పకవి వీటిని ఉదాహరించినాడు. ఇవేకాక, ఆదిపర్వమునందు అని "మత్త. తీఁగయుయ్యెల" అనేపద్యముకూడా ఉదాహరించినాడు; గాని, ఈపద్యము నన్నయభారతమందు నాకెక్కడా కనబడలేదు.

### 2. సంయుతాసంయుతప్రాసము

రేఫద్విత్వమునకు—"ఉ. క్షత్రియవంశులై ..."(ఆది. 2. 173)

### 3. ఉభయప్రాసము

1. దుర్నిమిత్తముల్ పుట్టిన ♦ నిర్ణయించి (అ. 1. 49)

2. కనకగిరిం......। త్రిణయన (అర. 4. 38)

### 4. ప్రాసమైత్రిప్రాసము

1. ఇమ్ముగ సర్వలోక...వం। ద్యుంబరముం...(ఆది.1. 76)

ఈపద్యమునే కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసారసంగ్రహమందు ఈ ప్రాసభేదమునకు లక్ష్యముగా ఇచ్చినాడు. కొన్ని వ్రాతప్రతులలో "ఇంమ్ముగ" అనే ఉన్నది. అచ్చుప్రతులలో ఇమ్ముగ అని మార్చినారు.

2. ఉ. "అమ్మునియల్లి...మగ్రతం।బమ్మిన...(ఆది. 4. 37)

3. ఉ. "పంబినశోకభారము...।యంబుధి...(ఆది. 7.119;8.85

'పంబిన, పమ్మిన' అని రూపాంతరము లున్నవనుటకు ఇటువంటిపద్యములే ఆధారమగుటచేత వాస్తవమేదో తెలియదు. 'ంబ,మ్మ' వీటిని ప్రాసాక్షరములుగా ఒకపద్యములో నిలపకూడదన్న వాదమువల్ల వచ్చినరూపాంతరములు కావా?

### 5. స్వవర్గజప్రాసము

డఢలకు "శా. ఏడక్షౌహిణు...। రూఢిం... (ఆది. 1. 69)

దధలకు "ఉ. కాదన...సం। బోధన...(ఆది. 2. 200)

### 6. ఋప్రాసము

1. గారవమున నిచ్చి ♦ యాఋషితోడ...(ఆది. 7. 86)

2. ఆఋషి...। చీరలు (అర. 3. 104)

### 7. అభేదప్రాసము

"ప్రల్లద మేది...। త్రుళ్లుదు...(స. 2. 69)

'డ, ద'లకు ప్రాసము అప్రశస్తమని అప్పకవి చెప్పినాడు. కాని సభాపర్వమందలి పద్యము (2. 111) ఒకవ్రాతప్రతిలోను, అహోబలపండితీయములోను ఎట్లున్నదో చూడండి:—

"ఉ. మండితసూర్యరశ్మి...గటు।

స్యందిసుగంధి......" మరికొన్ని వ్రాతప్రతులు చూచి, ఈ పాఠములయొక్క సాధుత్వము నిర్ణయించవలసి ఉన్నది.

### కొన్ని ఇతరవిషయములు

అద్రువ (ఆ.2.70; 5.128; స.1.209; అర.1.162; 4.73) నగణముగా ప్రయుక్తమై ఉన్నది. ఈవిధముగానే 'ఎడ్డ' రెండులఘువులుగా వ్రాతప్రతులలో కనబడుతున్నది. చూ. ఆది. 5. 120. "ఎడ్డలో" (సగణం) అయితే, "ఏ నొకపాపభావమున ♦ నెడ్డ దలంపక..." (అర.2.214) అనికూడా కలదు. విద్రుచె, చిద్రుపలు, ఎద్రిచి మొదలయినవి ఇటువంటివే. "మొగినకేలుమొగిచి ♦ మ్రొక్కిరంత" (అర.2.102) ఇందు 'మొగిచి' అనుటకు మారుగా 'మొగిడ్చి', అని వ్రాతప్రతులలో ఉన్నది. 'అద్రువ' వలెనే 'మొగిడ్చి' నగణము.

ఇదివరకు అచ్చుపడ్డభారతప్రతులలో ఒకటయినా నిర్దుష్టమైనది కనబడలేదు. సరియైనవ్రాతప్రతులతోడ్పాటు లేకపోవుటచేతనూ, పరి

ష్కర్తలు తమ ఇష్టానిష్టములనుబట్టి మూలమునకు విరుద్ధముగా వ్రాత ప్రతులలోనిపాఠములు దిద్ది అచ్చువేయించుటచేతనూ, ఇప్పుడు అచ్చుపడ్డప్రతులలో అపపాఠములు అనేకముగా కనబడుతున్నవి. లేఖకప్రమాదములవల్ల గలిగినకీడుకంటె పరిష్కర్తలు అయుక్తముగా చేసినదిద్దుపాట్లవల్ల కలిగినకీడు ఎక్కువగా ఉన్నది. కవి ఉద్దేశించినదేదో తెలియదు. కొన్నిచోట్ల ఈ అపపాఠములు చూచి మోసపోయి నన్నయమతమునకు విరుద్ధముగా లక్షణముచెప్పడముకూడా సంభవిస్తూ ఉన్నది. స్పష్టముగా కనబడుతూ ఉన్న లేఖకప్రమాదములు మాత్రము సవరించి పాఠభేదములన్నీ చూపిస్తూ భారతమయినా యథామూలముగా అచ్చువేయిస్తేనే కాని, ప్రాచీనభాషాలక్షణము, ప్రాచీనఛందోలక్షణము పూర్తిగా తెలుసుకోలేము. ఇప్పుడు నేను వ్రాసిన విషయములు మూడు అచ్చుపడ్డ ప్రతులు, ఆరువ్రాతప్రతులు మాత్రమే చూచి వ్రాసినాను. ఇంకా మరికొన్ని ప్రతులు చూచినయెడల నా యభిప్రాయములు నేను మార్చుకోవలసివచ్చునేమో! చూచినప్రతులయినా సరిగా చూడక పోవుటచేత నేను కొన్నిచోట్ల పొరపాటుపడి ఉండవచ్చును. వాస్తవమేదో తెలుసుకోవలెనన్నకోరికేకాని నేను చేసిన సిద్ధాంతమే నిలబెట్టుకోవలెనన్న దురభిమానము కలవాడను కాను గనుక, నా పరిశీలనలో లోపములున్నయెడల వాటిని కనుగొన్నవారు వెంటనే నాకు తెలియజేయవలసినదని వినయపూర్వకముగా వేడుకొంటున్నాను.

# ఈశ్వరప్రార్థనము

**గోదావరి సత్యనారాయణ, బి. ఏ.**

శ్రీ సంధిల్లగ భారతీయులకు నక్షీణోరుసౌభాగ్యముల్
వాసిం జెందగ సంపదావళుల దుర్వారంబుగా నిచ్చి యు
ద్భాసిల్లంగ ననుగ్రహించి రుధిరోద్గారిన్ వెసన్ లోకసం
త్రాసంబుల్ దొలఁగింపవయ్య పరమాత్మా! భక్తసంరక్షకా!

మ. అతివర్షంబున కొన్నిదేశముల వర్షాభావతన్ గొన్నిటన్
క్షితిసస్యంబులు నాశమయ్యె కఱవుల్ నిత్యంబు దేశస్థులన్
వెతలం బెట్టఁగసాఁగె తీవ్రగతులన్ వేధించె భూకంపముల్
గతసంవత్సరమందు నీదుదయ తగ్గన్ భక్తసంరక్షకా!

శా. పాపంబుల్ భువి సల్పుచుండురని భావంబందు మర్త్యాళిపై
కోపం బూనుట న్యాయమా శిశువుపై గ్రోధించునే మాత నీ
రూపం బెవ్వరు చూడఁగల్గుదురు చిద్రూపాత్మకా! దేవ! నీ
ప్రాపుం జూచియె కాదె నిల్చెనము దేవా! భక్తసంరక్షకా!

మ. కఱవుల్ వానలు కాటకంబులును భూకంపంబులున్ జావులున్
వెఱపుం బుట్టఁగఁ జేసి భూజనుల నీవిశ్వప్రభావోన్నతిన్
విరతంబుల్ స్తుతియింపఁజేయు గరము న్నీమాయ లెవ్వారికిన్
బరికింపంగఁ దరంబుగాదు పరమాత్మా! భక్తసంరక్షకా!

శా. యోగాభ్యాసగరిష్ఠులౌ మునులకు న్యోచింప దుస్సాధ్యమై
భాగ్యాకన్నులఁ జూడరాని దయి సద్వాగింద్రియాతీతమై
రాగారణ్యము గాల్ప దావ మగుచున్ రాజిల్లు నీరూపమున్
వేగం బిప్పుడు చూప నిండుదయ రావే భక్తసంరక్షకా!

మ. రవిచంద్రాదుల సృష్టిచేసి జగముల్ రక్షించి నిశ్శంకతో
పవలుం రేయియు గల్గునట్లు విధు లేర్పాటింతగాఁ జేసి య
బ్భువనాతీతుఁడవై సమస్తమును సమ్మోదంబుతోఁ గాచి పే
రవనీభారము దాల్చుచుందువు రమేశా! భక్తసంరక్షకా!

శా. ఆపద్వేళల భీతి దోప నెద ధైర్యంబంతయున్ దూలఁగా
బాపాత్ముండను పాహిపాహియని నిన్ ధ్యానంబులో నెంచినన్
తాపం బార్పఁగవచ్చి ప్రోతు వహహా తథ్యంబుగా దీనర
క్షాపారీణుఁడవయ్య! నీవు జగదీశా! భక్తసంరక్షకా!

మ. ధరలో మే లిది చేష్ట యంచు ప్రజ సిద్ధాంతంబు లెన్నెన్నియో
సరగన్ జేయుచు నుంద్రు సంతతము ప్రాస్వాద్యదృష్టులన్ జూచి నీ
యురుదృష్టిన్ సకలంబు లోకహితమై యొప్పారు నీసేవకుల్
చరితార్థుల్ గద భూమిపైని భువనేశా! భక్తసంరక్షకా!

శా. భోగంబు ల్వెనుమాయ లంచు మది సంపూర్ణంబుగా నమ్మి స
ద్యోగాభ్యాసము సల్పి నిన్నుఁగనఁ నుద్యోగింత్రు పుణ్యాత్ములౌ
భోగ్యాయత్తమనస్కు లెన్నడును నిన్ బూజింపగానేర రో
యోగీంద్రేశ్వర! శ్రాంతచిత్తములతో నోభక్తసంరక్షకా!

మ. ధనసందోహము వస్తువాహనములున్ దారాసుపుత్రాదులున్
మన సింపారఁగఁ గల్గియుం భువిజనుల్ మత్తిల్లి దర్పంబునన్
నిను ధ్యానింపక బుద్ధియు బధిరుఁడై నిత్యంబు స్వార్థార్థియై
దనివిం జెందును మూఢుఁ డెట్టు జనవంద్యా! భక్తసంరక్షకా!

# వృక్షములు, మనుష్యులు

పార్నంది సత్యనారాయణమూర్తి గారు

మనుష్యులవలెనే, వృక్షములుకూడ, నాహారమును స్వీకరించి, రూపపరిమాణములందు మార్పుల నొంది సంతానాభివృద్ధిని జేయుచున్నవి.

మనుష్యులు తమకు గావలసిన వస్తుసంపాదనకు సంచారమును జేయుచున్నారు. వృక్షములు, చలింపకయే యాహారసంపాదన జేయునట్లు భగవంతు డనుగ్రహించియున్నాడు.

వృక్షములను మనుష్యులతో పోల్చునపుడు, వానియంగములకును, మనుష్యాంగములకును, గల సమానత్వమునుగూర్చి, తెలిసికొనుటకు ప్రయత్నింపవలెను. ఇంతవఱ కట్టి ప్రయత్నములనుగూర్చి ప్రకటింపనందున నేనందులకు పూనుకొంటిని. ఇందెంతవఱకు కృతకృత్యుడనైతినో పాఠకులే నిశ్చయింపగలరు.

## అంగనిర్మాణము

**1.** చర్మము=పట్ట, మనకు చర్మమువలెనే వృక్షకోటికి పట్ట యుపయోగించుచున్నది.

**2.** కండరములు=కాష్ఠనాళపుంజము, (బెండు పదార్థము) మనలో కండరమువలె వృక్షములం దివి యుపయోగించును.

**3.** నాడులు = కాష్ఠనాళపుంజములందలి వర్ధకావ 8 (ఇది ...ణమునకు పైభాగమున గలదు) మనలో నాడీమండలము చేయుపనిని వృక్షములం దిది చేయును.

**4.** అస్థిపంజరము=కాష్ఠభాగము (చేవ); మనకు నెముకలెట్లుపయోగపడుచున్నవో యటులె వృక్షములందు చేవ యుపయోగపడుచున్నది.

**5.** గుండెకాయ=ఆకుభాగము, శరీరపోషణకు గావలసిన రక్తమును హృదయము శరీరమంతటికిని బంపునటులె, ఆకులు వృక్షపోషకరసమును వృక్షభాగమంతటికిని బంపుచుండును.

**6.** నెత్తురుగొట్టములు= కణములు. మనలో ధమనులు, సిరలు, కేశనాళికలు, రక్తమును తీసికొనిపోవునటులు వృక్షములలో వేళ్లనుండి వచ్చినయాహారము సిద్ధాహారముగా మాఱుటకు ఆకులలోనికి తీసికొనిపోవుటకును, ఆకులలో తయారైన పోషకరసమును ఆయా భాగములలోని కిచ్చుటకును, కణములను గొట్టములు గలవు.

**7.** రక్తము=పోషకరసము, మనశరీరమునందు రక్త మున్నట్లు వృక్షములందు పోషకరసముండి మనలో రక్తము చేయుపనిని చేయును.

**8.** ఆహారము=వేళ్లనుండివచ్చునాహారము, మనకువలెనే వృక్షములకుకూడ ఘన, ద్రవపదార్థము లవసరము. ఆపదార్థములను వేళ్లు సంపాదించును.

**9.** ధాన్యకొట్టములు = కాండము, సంవత్సరమందు వేర్వేరు ఋతువులలో పండుధాన్యాదులను మనము సంగ్రహించుకొని యవి పండనికాలమందైనను మనయవసరముకొలది వానినుపయోగించుకొను విధమున వృక్షకోటి యాకులలో తయారైవచ్చిన యాహారము యొక్క ...వైన దానిని కాండమందుంచుకొని యాకులు రాలిపోయి యాహారము తయారుకాని సమయమున సంగ్రహించుకొనిన యాహారమును యుపయోగించుకొనుచుండును.

**10.** చేతులు=వేళ్లు, మన మాహారము సంపాదించుకొనుటకు చేతుల నెట్లుపయోగించుచున్నామో యటులే వృక్షముల వేళ్లు ఆహారసంపాదనకొఱ కుపయోగించుచున్నవి.

**11.** గోళ్లు = మూలరక్షణములు, మనకు గోళ్లెట్లుపయోగించుచున్నవో యటులే, వృక్షములయొక్క వేళ్లకొనలయందు గల మూలరక్షణము లుపయోగపడుచున్నవి. అవి యరిగిపోయిన మరల పుట్టుచుండును.

**12.** కాళ్లు=వేళ్లు, సంచరించుటకు మనకు కాళ్లెట్లుపయోగపడుచున్నవో యటులనే వృక్షములవేళ్లు కొంతదూరమువఱకు నాలుగు దిశలకు వ్యాపించి యాహారము సంపాదించుటకును, వృక్షభాగములను భరించుటకును నుపయోగించును.

**13.** జీర్ణాశయము=ఆకుభాగము, మనము తీసికొనిన యాహారము ఆహారనాళముద్వారా జీర్ణాశయములోనికిపోయి కొన్ని రసములసహాయమున జీర్ణమై రక్తముగామాఱి, శరీరపోషణ కుపయోగించు విధముననే వేళ్లనుండి వచ్చునాహారము గొట్టములద్వారా ఆకులలోనికి పోయి జీర్ణసాధనరసములవంటి, సూర్యకిరణవాయుసహాయమున, పోషకరసముగా తయారై వృక్షపోషణ కుపయోగించుచున్నది.

**14.** నోరు=ఆకులు, వేళ్లు, మనకు నోరుపయోగించునట్లు, వృక్షములకు ఆకులు, వేళ్లు, నుపయోగించుచున్నది.

**15.** శ్వాసకోశములు=ఆకులు, వేళ్లు, మనశ్వాసకోశము లెట్లు వాయువును గ్రహించి రక్తమును శుభ్రపఱచుచున్నవో యటులే వృక్షములందలియాకులు వాయువును గ్రహించి పోషకరసమును తయారు చేయుచున్నవి. వేళ్లుకూడ వాయువును పీల్చుకొనును.

**16.** ముక్కురంధ్రములు=ఆకులలోని రంధ్రములు (స్టోమేటా) మన ముక్కురంధ్రములు ఉచ్ఛ్వాస, నిశ్వాసములు జరిగించునటు లాకులలోని రంధ్రములు గాలిని పీల్చుట ప్రాణవాయువును విడుచుట జరిగించుచున్నవి.

17. చర్మమందలి సూక్ష్మరంధ్రములు=కాండమునందలి రంధ్రములు, మనచర్మమునందువలెనే వృక్షములకు కాండముపై రంధ్రములు గలవు. అవి గాలిని పీల్చుటకు మాత్రము కొంతవఱకు కుపయోగపడుచున్నవి. నీటినిగూడ విడుచును.

18. బాహ్యావయవములు=ఆకులు, చర్మము, శ్వాసకోశములు, ప్రేగులు, మూత్రపిండములు మనలో బాహ్యావయవములలో ముఖ్యముగా గణింపబడుచున్నవి. వృక్షములలో నీయవయవము లన్నియును జేయుపనుల నాకులు, కాండము జేయుచున్నవి. (గాలివిడుచుట, నీటిని వదలుట)

19. టిస్స్యూలు=కణములు, మనశరీరమందలి వేఱువేఱు భాగములందు నేకవిధము లగు టిస్స్యూలు (అణువులు) చేరియున్నట్లే వృక్షములందుకూడ కొన్ని విధములగు కణములు గలవు.

20 ఇంద్రియములు=మనకువలెనే వృక్షములకుకూడ, నిద్ర, సుఖము, భయము, బాధ మొదలగు నింద్రియజ్ఞానము గల దని పరిశీలించి ఒక పండితవర్యుడు పత్రికలలో ప్రచురించెను. చిరిసెన, సీమఖర్జూరము మొదలగు వృక్షముల యాకులు రాత్రులయందు ముడుచుకొని నిద్రించుచున్నట్లుండును. కొన్ని చెట్ల యాకులపై చేయివేసిన భయపడునట్లు ముడుచుకొనిపోవును. మనుష్యునిశరీరమునం దనేకము లగు నవయవములు చేయుపనులను వృక్షములయందు ఆకులే చేయవలసియున్నందున భగవంతు డొక్కొక్కవృక్షమునందు వేలకొలదియాకులను ప్రసాదించియున్నాడు. అట్లు ఎక్కువగా నాకు లుండనియెడల నిన్నిపనులు ఒకటిరెండాకులు చేయుట కష్టము గదా?

ఇంతవఱకు మనుష్యునియొక్క యవయవములకును వృక్షాంగములకును గల సమానత్వమునుగూర్చి తెలిసికొనినారము. ఇటుపై సంతానాభివృద్ధినిగూర్చి మనుష్యులతో నెంతవరకు పోల్పవచ్చునో తెలిసికొందము. ప్రారంభశరీరశాస్త్రము మాత్రమే తెలిసికొనినవారు దీనిని గ్రహించుటకు అవకాశ ముండదు. కనుక గర్భోత్పత్తినిగూర్చి తెలిసికొని పిమ్మట దీనిని జూడ బ్రార్థితులు.

## సంతానవిషయములో సమానత్వము

1. అవయవసౌష్ఠవము= పుష్పదళములు, సువాసన, స్త్రీపురుషులకు గలుగు సంపర్కసందర్భమున పురుషులమనస్సు నాకర్షించునది స్త్రీ గదా! అట్లాకర్షించుటకు స్త్రీయొక్క సౌందర్య మెటులు కారణ మగుచున్నదో యావిధముగనే పుష్పదళములు శోభాయమానమై సువాసనగలిగి సంపర్కకారణములగు కీటకాదుల నాకర్షించుచున్నవి.

2. పురుషాంగము=కేసరములు. ఇవి గర్భోత్పత్తికి హేతువులగు సూక్ష్మబీజములను (పుప్పొడిని) తమయం దుంచుకొని యవసరసమయమున తిత్తులనుండి బయటకు వచ్చునట్లు చేయును.

3. స్త్రీయంగము =కీలము, (అండాశయము) గర్భాశయమందలి యండములు గర్భధారణకు తగుయోగ్యత నొందుసమయముల దీని యగ్రమందలి దిమ్మెనుండి యొకవిధమయిన జిగటపదార్థము (రజస్సు) స్రవింప కీటకాదులచే తీసికొనిరాబడిన పుప్పొడి దానియందంటుకొని నాళముగుండా గర్భాశయములోనికి పోవును.

4. గర్భకోశము=అండకోశము—ఇందులో అండములు గలవు. ఆయండములలో స్థూలబీజము లుండును. మనుష్యులలో మాసమున కొకయండము గర్భకోశమునకు పై నిరుపార్శ్వములందు గల బీజములనుండి రజోరక్తముద్వారా వెలువడి (అరుదుగా రెండింటినుండి రెండండములు వెలువడుట గలదు. అప్పుడే కవలపిల్లలు గలుగుదురు) సంపర్కసందర్భమున సూక్ష్మబీజసంపర్కముచే పిండముగా మాఱును. పుష్పములం దట్టియండములు కొన్ని గర్భకోశమువందుండి సూక్ష్మబీజ (పుప్పొడి) సంపర్కము తమయందలి స్థూలబీజములకు కలుగగానే యంకురములుగ (విత్తనములు) మాఱును.

5. పిండము, అంకురము, మనుష్యులలో పురుషసంబంధమగు సూక్ష్మబీజము. ఋతుసమయమున వెలువడి మార్గమందుండిన యండమందు సూక్ష్మరంధ్రములగుండా ప్రవేశించి స్థూలబీజముతో జేరి పిండముగా మాఱునటులు పుష్పములలో సూక్ష్మబీజములు (పుప్పొడి) కీలమందలి గొట్టముద్వారా అండాశయములో ప్రవేశించి, అందులో నుండు నండమునందలి సూక్ష్మమార్గమున బ్రవేశించి, అందుండు స్థూలబీజముతో జేరి, యంకురముగా మాఱును. మనుష్యులలో సాధారణముగా నొక్కసంతానమే కలుగుచుండగా వృక్షములం దన్నిబీజములు కలుగుటకు కారణ మేమని సందేహమును పొందనలదు. సాధారణముగా మనుష్యులు, కొన్ని జంతువులు, పక్షులు లేమ యాహారముకొఱకు వృక్షములం దాధారపడునట్లు చేసిన భగవంతు డట్లధికసంతానమును వృక్షముల కీయకుండిన నెట్లగును?

6. పిండవృద్ధి = అంకురవృద్ధి, మనుష్యులలో గర్భమందలి పిండము నాభిమార్గమున తల్లి తీసికొనిన యాహారమును స్వీకరించి క్రమాభివృద్ధి నొంది జన్మించువిధమున నండాశయమందలి యంకురము తల్లితో సమానమగు వృక్షములోని పోషకరసమును పువ్వుయొక్క తొడిమనుండి బీజబంధకతంతువులద్వారా స్వీకరించి యభివృద్ధి నొంది కాయనుండి వేడిమి మొదలగువానిచే విడబడి భూమిపై బడును. (కాయలు పండి రాలునంతవఱకు మనము వాని నుంచక తీసివేయుచున్నాము.)

7. స్తనములు=అంకురదళములు, అంకురచ్ఛదనము, జన్మించిన శిశువును పోషించుటకు స్తనములను భగవంతుడు కలిగించినట్లే వృక్షములం దంకురపోషణకు నంకురదళములను నంకురచ్ఛదనమును కలిగించియున్నాడు.

8. స్తన్యము=పప్పుపదార్థము, పిండిపదార్థము, శిశువు జన్మించుసరికి స్త్రీలలో స్తన్యము కలిగించి కొంతకాలము శిశువును తల్లిచే పోషింపబడునట్లు చేసినదేవుడు వృక్షములలో మొలక యాహారమును సంపాదించుకొనునంతవఱకు నంకురదళములలోను నంకురచ్ఛదములోను, నొకవిధమైనపప్పు, పిండిపదార్థములను కలిగించి యంకురము పోషింపబడునటులు చేసియున్నాడు.

## సంతానము కలుగకుండుట

స్త్రీ, పురుషులరక్తములు, పరస్పరాకర్షణ లేకుండిన, సన్నిహితసంబంధము లయినను, ఉభయులలో నొకరు రోగయుక్తులై సంతానబీజములు చెడినవారై యుండినను, ఉద్దేశపూర్వకముగా నాబీజములను చెడగొట్టుకొనినను, గర్భస్రావకారణములను కలిగి యుండినను, సంతానము కలుగదు. ఆవిధముగానే పుష్పములయందు నాత్మసంపర్కముచేతను స్త్రీయంగమందు కీలము లేకుండుటచేతను చీమలు మొదలగువానిచే నాయంగము కొఱికివేయబడినను, పురుగు పట్టి చెడగొట్టబడినను, పుష్పము కాయగా మాఱకుండును.

## సత్సంతానము

మనుష్యులు జ్ఞానముగలవారగుటచే సత్సంతానము నొందుటకు తగు నంశములను తెలిసికొని యాప్రకారముగా ప్రవర్తించుచు యోగ్య సంతాన మొందగలరు. ఆవిధముగ ప్రవర్తించుటకు తగునట్లు మన శ్రేయఃకాము లగుమనపూర్వు లనుభవపూర్వకముగ కొన్నిగ్రంథముల వ్రాసి మనము వానిని తప్పక యనుసరించుటకు గాను వానిని ధర్మములుగా జెప్పి యతిక్రమించినవారు కులదూరు లగుదురనియు నరకగాము లగుదురనియు శాసించియున్నారు.

వధూవరు లొకేవిధ మగురక్తము కలవారైనయెడల నట్టివారికి సంతానమే కలుగదనియు, కలిగినను, (కొంత భేదము గలవారికి) శిశు వు లాయుర్వృద్ధిబలాదులను కలిగి యుండ రనియు, వారిచే చెప్పబడినశాస్త్రములు మనకు బోధించుచున్నవి.

ఆకారణముచేతనే సంబంధములను జేయునపుడు పితృమాతృపక్షముల కొన్నితరములవఱకు యోచించి చేయుచుందురు. వృక్షము లిట్టియంశములను దెలిసికొని ప్రవర్తించుటకు వీలులేకుండుటచేతను భగవంతు డొక పుష్పమునందుండు స్త్రీపురుషాంగము లేకకాలమున పక్వము గాకుండునట్లును కేసరములకంటె కీలము పొడవుగా పెరిగి యుండునట్లును (ఆత్మసంపర్కము కాకుండునట్లును వేఱువేఱు పుష్పములందలి స్థూలసూక్ష్మబీజములకు సంబంధము కీటకాదులచే కలుగునట్లు పరసంపర్కము) జేసియున్నాడు.

మనలో కొందఱు బుద్ధివిశేషముగలవారమని గర్వించి పూర్వులు విధించిననియమముల నతిక్రమించి మేనమామకుమారితలను, మేనత్తకూతుండ్రను, యక్కచెల్లెండ్రపిల్లలను, పినతండ్రి, పెదతండ్రిబిడ్డలను (మహమ్మదీయులలో నీయాచారముగలదు) వివాహ మొనర్చుచున్నారు. మఱియు పరిపూర్ణతనొందని యవయవములు గలపిల్లలకు గర్భాధానము నేర్పఱచుచున్నారు.

అట్టిస్త్రీపురుషులకు రక్త మొక్కవిధమైనదగుటచే పరస్పరాకర్షణశక్తిలేనివారై యుండును. కాబట్టి వారలు దాంపత్యసుఖమును గాని సంతానమును గాని పొందక విచారించుచుందురు. సంతాన మొందినను సత్సంతానముగానందున కొందఱు దుఃఖించుచుందురు. ప్రసవసమయమున కొందఱు మృత్యువువాత పడుచుందురు.

ఈ విషయములో మనుష్యులకంటె వృక్షకోటియె భగవదాజ్ఞ ననుసరించి సత్సంతానము నొందుచున్నదని చెప్పవచ్చును.

## వలసపోవుట

మనుష్యులలో కుటుంబము అభివృద్ధినొందినకొలఁది జీవనోపాధి కొఱకు వేఱువేఱు స్థలములకు బోయి ప్రత్యేకముగా నుండునటులు వృక్షకోటికూడ తమసంతానము తమదగ్గఱనే యున్నయెడల జీవనోపాధి కవకాశముగా నుండదని విత్తనములను వ్యాపింపజేయుచున్నవి. ఇట్టివ్యాప్తి మనుష్యులు, జంతువులు, పక్షులవలనను, వాయువుచేతను, నీటిప్రవాహసహాయమున జరుగుచుండును.

## ముగింపు

వృక్షకోటియందుగల ఈవిచిత్రసృష్టివిధానమును దెలిసికొని పరమేశ్వరలీలావిలాసమును వేనోళ్ల శ్లాఘించి సాధ్య మగునంతవఱకు వృక్షకోటికి హానిచేయకుందురని పాఠకులను హెచ్చరించుచు విరమించుచున్నాఁడను.

పరిశీలనచే అధికాంశముల నెఱిఁగించువారికి కృతజ్ఞుఁడ నయ్యెదను.

The Flag Procession, Cocanada



"జండా" ఊరేగింపు, కాకినాడ

The Gandhi Nagar, Cocanada



గాంధీ నగరము, కాకినాడ

The Main Entrance to the Congress Pandal, Cocanada






౩౮-వ జాతీయమహాసభ - సింహద్వారము, కాకినాడ

# 38వ దేశీయమహాజన సభ — కాకినాడ

## ఆహ్వానసంఘాధ్యక్షులు లగు కొండ - వెంకటప్పయ్య పంతులుగారి స్వాగతోపన్యాసము

శ్లో. నిత్యం నిరాకృతి నిజానుభవైకమాన మానందధామ జగదంకురబీజ మేకమ్ -
దిగ్దేశకాలకలనాదిసమస్తహస్త మర్దానహం దిశతు శర్మ మహా న్మహో వః.

శ్లో. యథాతథాపి యః పూజ్యో యత్రతత్రాపి యోఽర్చితః
యోఽపివా సోఽపివా యోఽసౌ దేవ స్తస్మై నమోఽస్తుతే.

ఆర్యులారా, ప్రతినిధు లగు సోదరసోదరీమణులారా!

ఆంధ్రదేశీయుల పక్షమున తమ కెల్లరకు హృదయపూర్వకముగ స్వాగత మొసంగుచున్నాను.

ఈ దినము ఆంధ్రదేశచారిత్రమునం దద్వితీయముగ పరిగణింప దగినది. భారతదేశ స్వాతంత్ర్యసంపాదనాబద్ధకంకణులును, త్యాగమూర్తులు నగు తమకు, సన్మానసత్కారము లొసంగెడి మహాభాగ్యము ఆంధ్రదేశమునకు నేటికి లభించినది.

ప్రసిద్ధమగు ప్రాచీనభారతవర్ష యితిహాసమునందు ఒకకాలమున ఆంధ్రులు ప్రధానస్థానము వహించి, తచ్చారిత్రమునకు వన్నె దెచ్చిరి. క్రీస్తుశకమునకు రమారమి మున్నూరు సంవత్సరములకు పూర్వమే కృష్ణాతీరమున (ధరణికోట) ధాన్యకటకమును రాజధానిగా జేసికొని పూర్వపశ్చిమసముద్రతీరముల రెంటిమధ్య నున్న రాష్ట్రము నంతయును పరిపాలనము చేయుచు క్రమక్రమమున తమ రాజ్యమును ఉత్తరహిందూస్థానమున వ్యాపింపజేసి మగధదేశము నాక్రమించి సామ్రాజ్యమును స్థాపన గావించి పాటలీపుత్రమునందు నన్నూరు సంవత్సరములు రాజ్యపాలన నడిపించిరి. [illegible] లోకప్రసిద్ధము లగు తక్షశిల నలంద మొదలగు విశ్వవిద్యాలయములవలెనే ప్రఖ్యాతమైన విశ్వవిద్యాలయమును ధాన్యకటకమునందే ప్రతిష్ఠాపనజేసిరి. ఇచ్చటి బౌద్ధస్తూపము చిత్రవిద్యానైపుణ్యమునం దసన్యమగుటచేత అందలి ప్రధానశిలాచిత్రములు లండనుపట్టణమునందలి ప్రశస్తవస్తుప్రదర్శనశాలకు గొనిపోబడి యున్నవి.

తురుష్కరాజ్య ప్రాబల్యకాలమునందు సహితము ఆంధ్రులు విజయనగరసామ్రాజ్యమును స్థాపించి, చిరకాలము భారతీయ నాగరికతను పోషించిరి. ఆంధ్రమండలములు ఆంగ్లేయ ప్రభుత్వమునందు జేరిన పిదప, ప్రజాభ్యుదయము లెక్కింపబడక, ఆంధ్రులు అన్యభాషాప్రజలతో కలుపబడి పరిపాలింపబడుటచే, ఆంధ్రవ్యక్తిత్వము బొత్తిగా మఱుగుపడిపోయెను. కాని వంగరాష్ట్ర విభజన కాలమున, అఖిలభారతదేశమునందు వ్యాపించిన జాతీయోద్యమప్రభావముచే, మేల్కాంచి, జాతీయాశయముల దేశమున వ్యాపింపజేయుటయే గాక, జాతీయతను దృఢపఱుప, భారతదేశమునందు భాషాప్రయుక్తరాష్ట్ర నిర్మాణముకొఱకు "ఆంధ్రోద్యమము" కొనసాగించిరి. దేశీయమహాసభవారిచే ఆసూత్ర మంగీకరింపబడుటకై, ప్రయత్నము గావించి, ఆంధ్రదేశమును ప్రత్యేక రాష్ట్రముగ పరిగణింపవలెనని కోరిరి. ఆ ప్రయత్నమందు కీర్తిశేషు లగు లోకమాన్య తిలకుమహాపురుషు డొనర్చిన సహాయము కృతజ్ఞతాపూర్వకముగ స్మరింపదగినది. ఆ ప్రయత్నము వలన కాంగ్రెసు వ్యవహారములందు, ఆంధ్రదేశము ప్రత్యేకరాష్ట్రముగ సంగీకరింపబడెను. అప్పటినుండియు ఆంధ్రుల ప్రత్యేకవ్యక్తిత్వము ప్రకటించుటకు కొంత యవకాశము కలిగినది. తర్వాత, అసహాయోద్యమ ప్రారంభమునందే విశాలహృదయమును, దూరదృష్టి గల గాంధీమహాత్ముడు భాషాప్రయుక్తరాష్ట్ర సూత్రమును స్వరాజ్యప్రాప్తికి ప్రధానసోపానముగ గ్రహించి, దీని ననుసరించి రాష్ట్రవిభాగము గావించి, ఆయారాష్ట్రముల ప్రత్యేకవ్యక్తిప్రాబల్యమున కవకాశము కలిగించెను. అట్లు చేయుట అన్ని రాష్ట్రములవారును భారతజాతీయతాభివృద్ధికి తమ తమ వ్యక్తిప్రాబల్యము ననుసరించి యథాశక్తి దోహదము గావించిరి. దానిం బట్టియే నేడు ఆంధ్రదేశమునకు, తోడిరాష్ట్రములవారి నందఱి నాహ్వానము గావించి, సన్మానించు భాగ్య మబ్బినది.

ఆంధ్రదేశమునందు ఈగోదావరిమండలము సుప్రసిద్ధమైనది. ఈ మండలము గోదావరీజలములచేత పావనమై, రసవంతమై, ధనధాన్యసమృద్ధిచేత నొప్పారుచున్నది. ఆంధ్రచాళుక్యవంశ రాజులలో యశోవంతుడును, ఆంధ్రభాషాపోషకుడు నగు రాజరాజనరేంద్రుడు ఇక్కడకు సమీపమునన్న రాజమహేంద్రవరమును రాజధానిగా జేసికొని, ఈ దేశమును పాలన చేయుచుండెను. ఆంధ్రకవిపుంగవుడును, ఆంధ్ర మహాభారతకర్తయు నగు నన్నయభట్టారకుడు రాజరాజనరేంద్రునికే ఆ గ్రంథము నంకితము జేసెను. అటుపిమ్మట పలువురు రాజవరులు, కవిశ్రేష్ఠులు, మహావిద్వాంసులు, వేదవేదాంగకోవిదులు తమతమ చారిత్రములవలన ఈ మండలమునకు వన్నె దెచ్చిరి. మఱియు సంఘసంస్కర్త, వివేకవర్ధనీ పత్రికాసంపాదకులు, కవీశ్వరుడు నై అనేకములగు ఆంధ్రగ్రంథములు రచించి, ఆంధ్రవాఙ్మయము నభివృద్ధి జేయుటయే గాక ప్రకృతమున ఆంధ్రదేశమున నెంపొందియున్న పారహితైక జీవితాశయముల నంకురింపజేసిన కందుకూరి వీరేశలింగకవి ఆ

రాజమహేంద్రవరమునందే తన జీవితమునరసెయు గడపెను. ఇప్పటికిని ఈ మండలము ఐశ్వర్యమునందువలె విద్యాసంపదలందు సహితము వన్నె గాంచియేయున్నది. ఇట్టి మండలమున ఆంధ్రదేశమునంతకును పురరాజ మని చెప్పదగిన కాకినాడపట్టణమున అపూర్వమగు ఈ మహాసభను సాగించుట ఈ మండలగౌరవమునకు తగియే యున్నది. ఇందుగూర్చి ఈ మండలవాసుల - అందు ముఖ్యముగ ఈ పురవాసుల యుత్సాహము గణనాతీతము.

ఈ మహాసభాసమావేశభారమును వహించుట మాకిది ప్రథమ మగుటచేతను, ఇంతవరకు పేర్గాంచిన కలకత్తా, బొంబాయి మున్నగు రాజధాని పట్టణములందువలె సౌకర్యములు సమకూర్చుట మాకు సాధ్యము కాకపోయినను హృదయపూర్వకముగ ఆదరణ నొసంగుట యందు దేనికిని వెనుదీయువారము కామని వక్కాణింప సాహసించుచున్నాను. కావున సత్కారవిధులందు మావలన కలుగు లోపముల సహించి, దయతో మన్నింప వేడుచున్నాను.

ఈమహాసభ ఎంతవైభవముతో సమావేశమైనను లోకపూజ్యుడును, ఉత్కృష్టభారతీయుడును అసహాయోద్యమసారథియు నగు గాంధిమహాత్ముడిచ్చట లేమి కొరంతదీర్చుట యసాధ్యము. భరతఖండమును దాస్యమునుండి విముక్తిజేయుటకై, ఇదివర కెన్నడును కనివినని అసహాయోద్యమమున నిరుపమానమగు అహింసాతత్త్వముతోడ సంధించి, ముప్పదియేండ్లు సంవత్సరముల కాలమునుండి దేశీయమహాసభా ప్రయత్నములు సాధింపజాలని యాందోళనము కొనసాగించి, ఆసేతు హిమాచలము దేశమందంతటను స్వరాజ్యకాంక్షను ప్రజ్వలింపజేసిన మహాశయుడు, ఇపుడు ఎఱవాడ చెఱసాలయందు బద్ధుడైయుండుట మన యసహాయతను ప్రకటించుచున్నది.

1921 వ సంవత్సరమున, ఆయన గావించిన యుపదేశము శిరసావహించి, పలువురు దేశనాయకులు ఆయనతోడ నడచుచు ఉద్యమము సాగించిరి. ఉద్యమము సముచితముగ ప్రయోగించినయెడ జయము చేకూరునని బాలురకు సయితము తేటపడునంతటి స్పష్టమైన దగుటచేత, అనుకొనినట్లు జయము సమకూడకపోవుట అనుష్ఠానయుతమే కాని, సిద్ధాంతలోపము గాదని యొప్పుకొనక తప్పదు. గాంధిమహాత్ముడు ప్రజోత్సాహము గమనించి, స్వరాజ్యము సంవత్సరము లోపల సాధ్యమగు నని వక్కాణించి యుండిరి. అది నేడు దూరమై పోవుటకు ప్రజలలో పట్టుదలయు, దీక్షయు, ఉద్యమతత్పరత్వమును లేకపోవుటయే కారణము.

గాంధిమహాత్ముడు కారాగృహబద్ధుడైనపిదప మహోద్యమము మొక్కపోయినది. ప్రముఖులలో తర్కములు బయలు వెడలినవి. కొందఱు శాసనసభాప్రవేశము గావించి, ప్రతిష్టంభములు చేయుట కర్తవ్యమని వాదింప మొదలిడిరి. మరికొందఱు దానికి ప్రతిఘటించి, పూర్వమువలెనే యుద్యమము సాగించి శాసనోల్లంఘనమునకు ప్రయత్నములు చేయవలయునని పట్టుబట్టిరి. ఇట్లు రెండు సంవత్సరముల కాలము వాదప్రతివాదములలో వ్యర్థమయ్యెను. ఎట్టులో ఢిల్లీపట్టణమున, శాసనసభాప్రవేశాభిమానుల కడమిచ్చుచు, అసహాయోద్యమమండలి విశ్వాసమును మరల ప్రకటించి, నిర్మాణకార్యక్రమమునకు కంకణబద్ధులై గడంగవలయునని తీర్మానము గావించుటయ్యెను. కాని మొత్తమునకు శాసనసభల యెన్నికల యావేళమున మరి యే యితర పనులు సాగించుటకు నవకాశము కానిపింపదయ్యెను. శాసనసభాప్రవేశమున కడమిచ్చుటతోడనే ప్రజాదృష్టి శాసనసభలపై ప్రసరించెను.

ఇప్పటికి శాసనసభల యెన్నిక లన్నిప్రాంతములను ముగిసినవి. ముందు జరుగవలసిన కార్యమును గూర్చి మరల తర్కములు ప్రారంభమైనవి. శాసనసభాప్రవేశయత్నము సాగినంతవరకు జయప్రదముగ నున్నదని స్వరాజ్యపక్షమువారు సంతసించి, ముందు శాసనసభలలోని కార్యక్రమమును ఈ మహాసభలో నిర్ణయించుకొని, ముందు నడువవలయునను అభిప్రాయములు సూచించుచున్నారు. శాసనసభల కిష్టమైనవారు పోవచ్చు నన్నంతమాత్రముననే, ఇదివరకు ఉద్యమమునందు విశ్వాసము లేనివారు కొందఱు, స్వరాజ్యపక్షమువార మని పేరిడికొని తక్కిన కార్యక్రమమును నిరసించి, కొన్నిచోట్ల ప్రతిఘాతముగ సహితము పనులు గావించుచుండుటచేత, మరల బహిష్కారత్రయమూలకమగు అసహాయోద్యమమును సంపూర్ణముగ నవలంబింతుమని తీర్మానించుట యావశ్యకమని తక్కినవా రభిప్రాయపడుచున్నారు. ఢిల్లీ సభలో, శాసనసభాప్రవేశమున కడమిచ్చుట మాత్రమే గాని, తక్కిన కార్యక్రమ మంతయు సంపూర్ణవిశ్వాసముతోడ నెఱవేర్పవలయుననియే, తీర్మానము గావింపబడినది. అందులకు భిన్నముగా కొందఱు నడచుచుండుట మిక్కిలి శోచనీయము.

దేశవిముక్తికి అసహాయోద్యమమే శరణ్య మని యింతవరకు నమ్మి పనిజేయు టయ్యెను. చేసినదానికి ఫలము చేకూరలేదని యసంతృప్తితోడ నుద్యమమునే త్యజించుట మిక్కిలి యశక్యము. ఇది యిరుపక్షములవా రంగీకరింపునదియే. కాని యుద్యమమును సంస్కరింపవలయు నను అభిప్రాయము గలవారు కొందఱు, ఉన్నది యున్నట్లే సాగింపవలయు ననువారు కొందఱు నుండుటచేత, కర్తవ్యము నిర్ణయము గాక, కార్యసాధన కడ్డుగలుగుచున్నది. శాసనసభాప్రవేశ కార్యమింతటితోడ తీరినది గాన, దాని జోక్యము మాని తక్కిన కార్యక్రమమును ఉభయపక్షములవా రేకముఖమున సాగించుట యుక్తము. ఢిల్లీలో నిర్ణయమైన దిదియే. శాసనసభలలో సభ్యులుగ జేరినవారు, వారికి తోచినమార్గమున, ఆ సభా కార్యములను గుఱించి, వారిలో వారు నిర్ణయించుకొనెదరు గాక ! మరల ఈ సభ వారికి ఆ జోక్యము కలిగింపకుండుట యుచితము. లేకున్న వాదప్రతివాదములు ప్రబలి, మరల కార్యక్రమము నిలిచిపోవుటకు కారణము కలుగును.

మరియును, బహిష్కారత్రయమును పునరుజ్జీవితము గావింపవలయునా? సంస్కరింపవలయునా? లేక త్యజింపవలయునా? యను సమస్య పలువురచే చర్చింపబడుచున్నది. అసహాయోద్యమమునందలి ఈభాగము, దేశమునందు అనుష్ఠానమున వెనుకబడినదగుటచేత, నామమాత్రముగ నుంచుటవలన జనులలో నుద్యమముపట్ల గౌరవము నశించు

మన్న దని కొందఱు అభిప్రాయపడుచున్నారు. ఈవిషయమున వలసినంత సానుభూతి ప్రజలు చూపలేదనుట నిశ్చయమే గాని, సంఖ్యయందల్పములైనను, మహాప్రబలములైన అనుష్ఠానదృష్టాంతము లుండుటచేత నవి యుద్యమగౌరవమును కాపాడుటయే గాక ప్రజలయందుత్సాహము సహితము పూరింప సమర్థములై యున్నవి. భారత దేశనాయకులలో సుప్రసిద్ధు లగు పండిత మోతీలాలు నెహ్రూ, దేశబంధుదాసు మొదలగు వారివలెనే, ౧౯౨౧ వ సంవత్సరమున పలువురు వృత్తిత్యాజ్యము గావించి జీవితసౌఖ్యముల నిరసించి, శ్రీ గాంధీ మహాత్ముని సందేశమునే యాదల నిడుకొని దేశముకొఱకై పాటుపడుటకు సంసిద్ధులైనవారనేకులు పల్లెగ్రామప్రాంతములలో సైత ముండిరి. ఇప్పటికిని అనేకులు కలరు. కొలదిమందియైన అట్టి అనుష్ఠానసంపన్నులుండుట అవసరము. వారివలన మందెప్పటికైనను మరల నుద్యమము తీవ్రరూపము ధరించుట కవకాశము కలుగును. ఎప్పటికైనను, ముప్పదికోట్ల ప్రజలును గాంధీతత్త్వావలంబకు లగుట యసంభవము.

బహిష్కారత్రయమును విసర్జించినపిదప, అసహాయోద్యమము అనుగాఁడిన పాత్రమే యగును. కాని బహిష్కారత్రయమును ప్రజలు బాగుగా నవలంబింపలేదు. [illegible] వదలివేయవలయు ననుటయు క్రమము గాదు. ఏదియోయొక్క [illegible] రముతోపాటు ఏకోదినిమందియో సాగించిన బహిష్కారత్రయమూలక మగు అసహాయోద్యమ ప్రయత్నము ప్రభుత్వమును దద్దరిల్ల జేసినది, నూఱుయేండ్ల సంవత్సరములనుండి వేరుబడిన ఆంగ్లేయ ప్రభుత్వపునాదులు గడగడ వడంక సాగినవి. భూగర్భమునకు సయితము వేళ్లుప్రాకిన ఈ ప్రభుత్వమహావృక్షము మహోద్యమప్రవాహముచేత నల్లలనాడినది. ఆ యాందోళన ప్రభావమును మఱువ రెట్లు! ఎందఱో వృత్తులవదలి, ఎందఱో చెఱసాలలకేగి, ఎన్నియో శ్రమల కోర్చి, ఎంతయో ద్రవ్యము వ్యయపెట్టి, ఎన్నియో ప్రాగల్భ్యములు పడి ఇప్పుడు వెనుకబడుట వెఱ్ఱితనము గాదా? పుణ్యశ్లోకుడును లోకవిఖ్యాతుఁడు నగు శ్రీ గాంధీమహాత్ముండు చెఱసాలయం దుండగనే, మనమిట్లు ప్రవర్తించుట సంతాపకరమగు విషయము.

మరియు, అసహాయోద్యమకర్త యగు గాంధీమహాత్ముని యశస్సు దశదిశలను వ్యాపించినది. ఆయన బోధించిన అసహాయోద్యమతత్త్వము పరదేశవాసులలో ప్రముఖులు కొందఱు శ్లాఘించినారు. యుద్ధములు చేసి, రక్తపాతము గావించి, హింసామూలకముగ రాజ్యస్వత్వములకై ఘోరముగ పోరాడిన పాశ్చాత్యులలో సైతము, ఈ అహింసాతత్త్వమును సంపూర్ణముగను, అసహాయవాదమును భాగికముగను అనుష్ఠేయమను సంకల్పముల పురికొల్పినది. మనసోదరులు, రణశూరులు, భారతీయులు నగు అకాలీలు మన మితవాదసోదరులకు సంశయాస్పదముగ గన్పట్టిన దౌర్జన్యరహిత మగు అసహాయోద్యమసత్యమును ప్రకటితము గావించిన శాంతమూర్తులు, మరల ఆ మార్గమునన్నే, తమహక్కుల గాపాడుకొనుటకై ప్రభుత్వముతో శాంతసమరమునందు ఈ మహాస్త్రమునే దీకొనుచున్నారు. ఇట్టి సమయమున ఉద్యమము నశించినదని చెప్పవచ్చునా? అట్లు చెప్పుట ప్రతిపక్షుల సాంప్రదాయము. అసహాయోద్యమమునకు సమాధికట్టి, దానిపైన శిలాశాసనము చెక్కించుకాలము వచ్చినదని రష్‌బ్రూకు విలియంస్ ఇప్పటికి షుమారు రెండు సంవత్సరముల క్రిందటనే వ్రాసియుండెను గాని, యిది కేవలము పైకి చెప్పెడి మాటయే. ఉద్యమ మింకను బ్రతికి యున్నదని ప్రభుత్వమువారు నమ్ముచునే యున్నారనియు, దాని నణచివేయుటకు నిదురలేకుండ నిరంతరము చింతామగ్నులై యున్నారనియు, స్పష్టమగుచున్నది. ఉద్యమము తాత్కాలికముగ నిద్రాణము జెందియున్నంత మాత్రమున, అంతరించినదని యూహించుట పొరబాటు. నాయకులలో దృఢనిశ్చయమును, ఏకభావమును చిగురెత్తినయెడల ప్రజలలో నుద్యమోత్సాహము పొడముట ప్రారంభించును. అసహాయోద్యమ గభీరనాదమును పాంచజన్యమున పూరించి బ్రహ్మాండము నింప గలిగిన మహానాయకుడు మరల కనబడినయెడల మూలమూలల నుండి సహితము ప్రజలు ఇప్పటికిని వేలకొలదిగ వెంబడించెదరు.

కావున నిరాశచెందక శంకలు మాని రెండుపక్షములవారును దేశమున ప్రబోధము మొదలిడి, అసహాయోద్యమాందోళనమునకు పునాది యగు నిర్మాణకార్యక్రమమునందు సర్వప్రయత్నములను ప్రకృతము కేంద్రీకరింప జేయవలయును.

## నిర్మాణకార్యక్రమము

స్వరాజ్యపక్షమువారు శాసనసభలపై మాత్రమే లక్ష్యముంచక నిర్మాణకార్యక్రమమునందు దృష్టి నిలిపి సంపూర్ణవిశ్వాసముతో పనిచేయుదురుగాక! వివిధాభిప్రాయములు నాయకులలో నున్నంతకాలము కార్యసాధన కడ్డుపాట్లనేకములు కల్గుచునే యుండును. నిర్మాణ కార్యక్రమ విషయమున, నాయకులును ప్రజలును ఏవిధమగు భిన్నాశయముల కెడమీయక, 1921-వ సంవత్సరమున గాంధీ మహాత్ముని నాయకత్వము క్రింద నడచినరీతిని ఐకమత్యముతో తీవ్రముగ పనులు సాగింపవలయును. ప్రజాహృదయము సంపూర్ణముగ నాకర్షింపగల మహానాయకుడు గాంధీమహాత్ముడు తప్ప మరియొక్కరు లేరనుట నిశ్చయమైనను, దేశమునందు మరికొందఱు ప్రజ్ఞావంతులును, త్యాగస్వరూపులు నగు నాయకులు కలరు. వారు ఐకకంఠ్యమున శాసించిన మార్గమున దేశము నడచుటకు సంసిద్ధమైయుండు ననుటయును సందియము లేదు. ఒక్క శాసనసభావిషయమై కొందఱకు భిన్నాభిప్రాయములుండిన నుండుగాక! అసహాయోద్యమమునందు వారందఱు నిండు నమ్మకము వెల్లడించు దీక్షాపరులై, తదనుసారమగు కార్యక్రమమున ముందంజ వేసినయెడల, అనుగదప్పక వారు నడచినత్రోవను నడచుటకు వేనవేలు ప్రజలు నడుముగట్టికొని యున్నారని చెప్పుట యత్యుక్తి గాదు.

నిర్మాణకార్యక్రమము నెఱవేరుటకు ఉత్సాహపూర్వక మగు ఏదియో యొక కారణ ముండినగాని సాధ్యముగాదని కొందఱి యభిప్రాయము. స్వరాజ్యకాంక్షకంటె ఉత్సాహప్రేరకమగు కారణము నిర్ణయించుట శక్యము గాదు. స్వరాజ్యమే భారతవర్ష మిప్పుడు కాం

క్షించుచున్నది. ఇదిరఱ కెట్లున్నను ఇప్పుడు రాజకీయశాఖలవా రందఱును స్వరాజ్యసంపాదన అత్యంతావశ్యక మని గట్టిగ వక్కాణించుచున్నారు. ఈ సమయమున భారతజాతిని లోకమున పరిగణించువారు లేరు. భారతీయుల నితరదేశములలో నుండనీయక, కష్టములను అవమానములను కల్పించుచున్నారు. మన యిప్పటి పరిపాలనకర్తలు, ఆంగ్లేయ పరిపాలనకర్తలైనను తమవశములో నున్న రాజ్యములలో సహితము భారతీయుల గౌరవస్వత్త్వముల కాపాడుటలేదు. కెనియాలోని భారతీయులనుగూర్చి, బ్రిటిష్ పార్లమెంటువా రొనర్చిన తీర్మానము అన్యాయముగ వారి స్వత్త్వములను నిరసించుటయే గాక, భారతలోకమునంతయును నవమానితము జేసినది. ఆ తీర్మానము పునర్విమర్శింపవలెనని మన మితవాదనాయకు లొనర్చిన ప్రయత్నములు వ్యర్థము లయ్యెను. ఆ సందర్భమున అధినివేశములమంత్రు లొనర్చిన ప్రసంగములవలన మనకు స్వరాజ్యము లభించువఱకును శ్వేతజాతులతోడ సమాన స్వత్త్వముల కర్హత యంగీకరింపబడదని స్పష్టమైనది. ఇంటగెలిచి, రచ్చగెలువు మన్నట్లు మనదేశమున మనకు స్వరాజ్యము లేనంతవరకు మన మాటను పాటించువా రుండరు. ఒకజాతికి లోబడిన వారు స్వతంత్రులగు పరజాతులతో సఖ్యత నొడగూర్చుకొను టెట్లు? సమానత్వము బడయు టెట్లు! కేవలము మన ఆత్మగౌరవము కాపాడుకొనుటకైనను స్వరాజ్యమే సాధనము, సర్వానర్థములను బాపుటకును స్వరాజ్యమే సాధనము. మరియును ప్రభుత్వమువారు ప్రజాభిప్రాయముల నరకు గొనక, మితవాదులనుగాని, జాతీయవాదులగాని, లెక్కరీతిని మన్నించుచు, నానాటి నిరంకుశత్వము ఎక్కుడైనందున ప్రభుత్వవిధానము ప్రజలకు దుర్భర మగుచున్నది. మీదుమిక్కిలి వారి లోపముల నిర్భయముగ నెన్నినప్పుడు సంస్కరణశాసనము రద్దుజేయుదుమని బెదరించుచున్నారు. సంస్కరణశాసనము నిష్ప్రయోజన మని మొదటినుండియు నుద్ఘోషించుచుండుటచేతను, మితవాదులు మొదలగువారిని మనలనుండి విడదీయు శాసనమే గావున దానిని మరల ఉపసంహరము గావించుటకంటె నుత్కృష్టమైన కార్యము లేదని మనము సంతసించెదము. ఇప్పటికన్ని రాజకీయశాఖలవారికిని తెలియవచ్చినందున, స్వరాజ్యము సత్వరముగ సంపాదించుట యావశ్యకమని అందఱు నను కొనుచున్నారు. స్వరాజ్యకాంక్ష యనుమనస్సుల దృఢముగ నాటుకొని ప్రతిరక్తనాళమునందు ప్రవహించి, హృదయకోశము నావరించి సర్వాంగములందు జాజ్వల్యమానమగు ఉద్రేకము గల్గించుటచేత, అందు కొఱకు జేయు సర్వప్రయత్నములకు ఉత్సాహము కల్పించును. తాత్కాలికావేశములు నిజమైన ఫలసాధకములు కానేరవు. నిండు యోజనపై కార్యక్రమము నిర్ణయించుకొని, శాంతమనస్కులై కార్యమునకు గడంగుట కార్యసాధకుల కర్తవ్యము.

నిర్మాణకార్యక్రమమునందు ఈ సమయమున మిక్కిలి కఠిన సమస్యగా నేర్పడిన హిందూమహమ్మదీయసఖ్యతావిషయమును ముమ్మొదట పరిష్కరింపవలసియున్నది. అది లేనిదే స్వరాజ్యప్రాప్తి యసంభవ మగుటచేత అన్ని కార్యములు కట్టిపెట్టియైనను, అట్టిసఖ్యత నొడగూర్చుటకు సర్వప్రయత్నము లొనర్చుట యావశ్యకము. ఈసమస్య ఉత్తరహిందూస్థానమున మిక్కిలి క్లిష్టమై, మహావిపత్తులకు కారణమగుచున్నది. ఈ కలహకారకులు ఘోరదుష్కార్యముల నొనర్చి, మతధర్మము పేరిట స్వధర్మములను త్యజించుచున్నారు. ఇట్టి మత దురభిమానమును నాయకు లగువారు మహాపాతకమని ఖండించి, అట్టిభావముల నిర్మూలము గావించిననేగాని ఈ విపత్తుల వారించుటకు శక్యము గాదు. మత విషయకము లగు ఆచారములయెడ, అన్యోన్యగౌరవము సహనము లేకపోవుటచేత, ఈ కలహములు సామాన్యముగ బయల్పడుచున్నను, ఆర్థికాదికము లగు కారణాంతరములు సహితము అచ్చటచ్చట కలవని యూహింపవచ్చును. ఇట్టి కారణముల సంపూర్ణముగ, నిష్పక్షపాతముగ విమర్శ గావించి, వానిని తొలగించుటకు తగిన ప్రయత్నములను వెంటనే చేయుట యవసరము. దేశమునందు పేర్గాంచిన నాయకులు పలుకుబడి గలిగిన స్థానిక నాయకులతో సంప్రతించి, ఆయా స్థానికములగు పరిస్థితులను చక్కబెట్టుటకు దృఢప్రయత్నముల గావింపవలయును. ఈ సందర్భమున అజ్మీరులో డాక్టరు సయ్యద్ మహమూదు మొదలగు నాయకులు ఉభయసంఘములలో సఖ్యత నొడగూర్చుటకై చేసిన ప్రయత్నములు శ్లాఘ్యములు. మరియును ఉభయసంఘములవారును ఒండొరుల స్వత్త్వముల నిరసింపక, లక్ష్యముతో ప్రవర్తించునట్లు ఆయాసంఘనాయకులు తమ తమ సంఘములలో గాఢమగు ప్రబోధము గావించి, దిట్టముగ కట్టుబాట్లను గావించుట కర్తవ్యము. మహమ్మదీయులము హిందువులము, క్రైస్తవులము, పార్సీలము అను ప్రత్యేక సంఘభావముకంటె మన మెల్లరము భారతీయులమను దేశాభిమానము ప్రజలయందు వ్యాపింపజేయుట మిక్కిలి యావశ్యకము. కాని ప్రత్యేకసంఘములలో, ఆయా సంఘనాయకులు తగు సంబంధముల కల్పించుకొని, వారి ముఖ్యస్థలములందన్నిటను పాల్గొనుచుండిననేగాని అట్టి ప్రబోధము గావించుట కవకాశముండదు. అంటియుంటక దూరదూరముగనుండు నాయకులు వారెంత గొప్పగొప్పవారైనను వారియందు జనులకు లక్ష్యముండుట సాధ్యపడదు. ఖిలాఫతునందు మహమ్మదీయనాయకు లెట్టి శ్రద్ధవహించుచున్నారో, హైందవనాయకులు హైందవసంస్థలయం దట్టి శ్రద్ధ నే వహించి, వానిని యుక్తమార్గముల నిర్వహింపనియెడల నిప్పుడు గల్గియున్న దుస్స్థితుల తొలగించుట దుష్కరము. జాతీయ సమాఖ్య నివేదించుట కేర్పడిన ఉపసంఘము, వారి నివేదికయందు ఈ సమస్యనుగూర్చి తగిన యేర్పాట్లు సూచించెదరని నమ్ముచున్నాను. ఈ సభవారు వానిని విమర్శించి, తగినమార్పులతో నంగీకరింతురు గాక! కాని సూచనలెంత యుత్కృష్టములైనవియైనను కార్యాచరణముకలనగాని అవి సాఫల్యము గావు. కాన నాయకులందఱు ఇందువిషయమున దృఢప్రయత్నముల గావించి, ఉభయసంఘములకును సఖ్యత దేశమునందంతట పెంపొందింతురు గాక!

వివిధప్రాంతములవారి సంయోగమునకును, జాత్యైక్యత బలపరచుటకును సామాన్యభాష యవసర మన్న విషయ మెల్లరంగీకరించినదే. ఇట్టి భాష హిందీయే యని యందఱు అంగీకరించియున్నారు. కాన కాంగ్రెసు కార్యము లా భాషామూలకముగ సాగింపవలయునని తేలు

చున్నది. ఇందువలన, హిందీ తెలియనివారు అన్యప్రాంతీయులతో చక్కగ వ్యవహరించుటకును కాంగ్రెసుకార్యములందు పాల్గొనుటకును, ఆ భాషను సత్వరము నేర్చుకొనవలయునని చెప్పకయే యూహింప దగియున్నది.

నిర్మాణకార్యక్రమమునందలి తక్కిన యంశములలో అస్పృశ్యతానివారణయు ఖద్దరు నిర్మాణమును అత్యంతావశ్యకము లైనవి.

ఖద్దరు నిర్మాణ మన్నిటిలోను సుకరమైనదైనను దానియందు తగినట్లు వ్యాపకము చేయలేకపోవుట విచిత్రముగ నేయున్నది. ప్రజలలో ఐక్యము లేకపోవుటయును ఉద్యమము కొంత తగ్గిపోవుటయును దీనికి కారణములు. మరల నుద్యమము ఉత్సాహముతోడ ప్రారంభమైనయెడల, ఈకార్యమును జనులు తీవ్రముగ నెఱవేర్పగలరు. ఖద్దరు వ్యాపకమునకు ఈ క్రింద నుదాహరించిన మూడువిషయములు అత్యంతావశ్యకములు.

౧. ప్రతిరైతును తనభూములలో తనకుటుంబమునకు ప్రతిసంవత్సరమునకు కావలసినంతవఱకైనను ప్రత్తి పండింపవలయును.

౨. ప్రతి కుటుంబ యజమానియు తనకుటుంబమునకు ప్రతివత్సరమునకు వలసినంత దూది ముందుగ పంటకాలమునందే నిలువ జేసికొనవలయును.

౩. ప్రతియింటను ఒక్కరాటమైన నుంచి, దానిమీద తమ కుటుంబమునకు కావలసిననూలు వడుకవలయును.

ఇట్లయిన దేశమున వస్త్రములకు కొఱతయుండదు. కొలదికాలములోనే భరతవర్షమంతయు ఖద్దరువస్త్రమునే ధరింపగలదు. అభ్యాసము జేసినకొలది సన్నవస్త్రములు గూడ తయారుజేయుట దుస్సాధ్యము కాదు. కావున సన్నవస్త్రములపై అభిమానము గలవారికి సహితము కొలది కాలములోనే అవి లభ్యమగుటకు సందియ ముండదు. వస్త్రముల ధరల హెచ్చుతగ్గులు ప్రజలను బాధింపజాలవు. విదేశవస్త్రములతోడ పోటీయు నుండబోదు. ఒక్క ఈ ఖద్దరునిర్మాణకార్యమును దేశము సంపూర్ణముగ నెఱవేర్చినయెడల స్వరాజ్యము సాన్నిధ్యమున నున్నదనియే చెప్పదగును. ఖద్దరునందు విశ్వాసములేనివా రింకను దేశమందున్నయెడల సబర్మతీ మహర్షి స్వరూపమును స్మరణకు దెచ్చుకొని, చెఱసాలయందు ప్రవేశించినప్పుడు భారతీయుల కాయన యొసంగిన సందేశమును గమనింపవలయును.

అస్పృశ్యతానివారణవిషయమున దక్షిణహిందూస్థానమందు పూర్వాచారపరత్వము ఆటంకము కలిగించుచున్నది. తీవ్రాందోళన కలిగించిననే గాని అది జయప్రదము గాజాలదు. ఈ సమస్య తీరనంతవరకును, స్వరాజ్యసిద్ధి దుస్సాధ్యమే.

## కాంగ్రెసు సంస్థానిర్మాణము

కాంగ్రెసు సంఘములనిర్మాణము లేనిది ఎట్టిపనులనైనను సాగించుట యసాధ్యము. పలుచోట్ల ఈ సంఘములు నామమాత్రావశేషముగ నున్నవి. ప్రచారకులకు తగిన సహాయప్రోత్సాహములు లేకపోవుటచే కార్యనిర్వహణము వెనుకబడిపోయినది. గ్రామసంఘము స్వరాజ్యసౌధమునకు పునాదు లగుటచే, గ్రామసంఘ నిర్మాణముకంటె ప్రధానమగుకార్య మొక్కటుండబోదు. పట్టణవాసులకంటె గ్రామవాసులలో రాజకీయప్రబోధము తీవ్రముగ జరుపవలసియున్నది. ఈ భరతవర్షమునందు పట్టణప్రజలకంటె పల్లెటూళ్లప్రజలే బహుసంఖ్యాకులుగ నున్నారు. వీరియాశయములు, వీరియుత్సాహము వీరిత్యాగము, వీరి పట్టుదలలమీదనే భారతదేశాభ్యుదయ మాధారపడియున్నది. భారతదేశస్వరాజ్యమునకు వారే నిర్మాణకర్తలు. కావున పల్లెటూళ్లలో కాంగ్రెసుకార్యములు విరివిగ సాగించి, ప్రబలము గావింపవలెను. అందుకు ప్రచారకులలో ప్రధానులు కొందఱు పట్టణములందుకంటె గ్రామములలో నివాస మేర్పఱచుకొని కాంగ్రెసు కార్యవిధానమును పల్లెలలో సాగించుట యవసరము. పల్లెటూరి జనులలో మహోద్యమముపట్ల భక్తివిశ్వాసములు ప్రబలి, ఉత్సాహము మహాప్రవాహమువలె పొంగి పొరలినప్పుడు, పాశ్చాత్యవ్యామోహమునందు మునిగియున్న పట్టణవాస్తవ్యులు త్వరలో మేల్కాంచి, ముందంజ వేయ ప్రయత్నింతురు. మరియును స్వరాజ్యనిధి సమకూర్చుటకు గ్రామములలో తగినంత ప్రబోధము దుస్సాధ్యమగుచున్నది. స్వరాజ్యసంపాదనార్థమై జరుగుచున్న యాందోళనము ఇంచుక దీర్ఘకాలము నడువవలసియుండుటచే, ప్రచారకులకు వలయు ద్రవ్యసముపార్జనకు స్థిరమగు ఏర్పాట్లు కొన్ని ముఖ్యగ్రామములలో నేర్పడవలసియున్నది. దేశీయమహాజనసభాకార్యములు ప్రభుత్వకార్యములవలెనే, సరియైన కట్టుబాటుతో నడపుట యావశ్యకము. అందుకు ధనమును కార్యనిర్వహణదక్షులును కావలయును. వివిధప్రాంతములందు జరుగవలసిన కాంగ్రెసు కార్యములు నడపుటకు బాధ్యతవహింపగలవారు కొందఱను నియమించుట మిక్కిలి యవసరము. వారిలో యావద్భారతకార్యములపట్ల భారము వహించువారు కొందఱు, ఆయారాష్ట్రప్రాంతముల కార్యభారమును వహింపగలవారు మరికొందఱును ఏర్పడవలయును. ఇట్టివారిలో ద్రవ్యసహాయముతోడ నావశ్యకము లేక యుండువారు కొందఱుండినను మరికొందఱకు అట్టిసహాయ మొనర్చిననేగాని వారి జీవయాత్ర గడపుటకు సాధ్యము గాదు. అట్టివారికి వారివారి యవసరము ననుసరించి ద్రవ్యసహాయము చేయుటకు తగినధనము సమకూర్చి, వారలమూలకముగ కార్యక్రమము నడిపింపవలయును. స్వరాజ్యప్రయత్నము కొంతకాలము గాఢముగ అన్నిప్రాంతములలో నడపిననేగాని సాఫల్యమగుటకు అవకాశము కలుగ నేరదు. కావున నిట్టి నియామకముల రాబోవు సంవత్సరము మొదలుకొనియైనను అఖిలభారత సంఘమువారు గావించి, అందుకు వలయుధనము సమకూర్చి, సూచనలు రాష్ట్రములవారికి చేయుట కర్తవ్యము. ఆయారాష్ట్రములవారును తమతమ రాష్ట్రములలో జేరిన వివిధ మండలములందును ఇట్టి ఏర్పాటులనే జేయుట యవసరము. ఇట్టి కార్యనిర్వాహకుల నియామకము దేశీయమహాసభాకార్యములలో ప్రధానవిషయముగా అంగీకరించిననేగాని, ఉద్యమమును పటుత్వముతో నడపుటకు సాధ్యముకాదు. ఇన్నిటికిని, ప్రధాననాయకు లగువారు గావించు

త్యాగము ప్రబోధము లోనగువానివలన దేశము మరల నుత్సాహపూరితమై కార్యసాధనకు గడంగకలసియున్నది.

ఈ మహాసభ సమావేశమునకు మౌలానా మహమ్మదాలీగారు అధ్యక్షత వహించుట మనభాగ్యము. వీరు మాతృదేశ సేవాపరతంత్రులగు మాననీయులలో అగ్రగణ్యులు. దేశహితైకదీక్షతో వీరును, వీరి యగ్రజులగు మౌలానా షౌకతాలీగారును, చేసినకృషి జగద్విదితము. మౌలానా మహమ్మదాలీగారు కామ్రేడుపత్రికా సంపాదకులుగ నుండి ప్రభుత్వమువారి యాక్రమచర్యల, నిరంకుశ ప్రవర్తనముల నిర్భయముగ ఖండించుచువచ్చినకతన, పెక్కుకష్టములపాలైరి. అసహాయోద్యమ ప్రచారమునందు గాంధీమహాత్ముని యనుయాయులై వీరు చేసిన సేవ, ఆయుద్యమము కెంతయు ప్రోద్బలము కలిగించెను. ప్రభుత్వమువారు వీరిని తిరుగ నిర్బంధించిరి. వీరి విడుదల ప్రజలయం దధికోత్సాహము పుట్టించెను. వీరి రాక దేశమునం దాశాజనకమయ్యెను. వీరు కారాగృహము వదలినది మొదలు కాంగ్రెసు కార్యభారము వహించి, కాంగ్రెసునందును, ఐకమత్యమును శాంతియు సంస్థాపించుటకు వీరు కృషి సల్పుచున్నారు. హిందూమహమ్మదీయ సఖ్యతావశ్యకమును గూర్చి ప్రబోధించుటకు, వీరును, వీరి జ్యేష్ఠభ్రాతయు, దేశమునందంతట సంచరించుచు, శాంతిసందేశము నిచ్చుచున్నారు. ఈ కాంగ్రెసుమహాసభ యాలోచింపదగిన యంశము లెవ్వియు లేవనియు, ఈ సభకేమియు ప్రత్యేక ఉద్దేశము లేదనియు కొందఱనుచున్నారు. కాని, ఈ మహాశయుని నేతృత్వమున, దేశమునందు కాంగ్రెసు కార్యముల భంగపరచి, జాతీయసౌభాగ్యాపేక్షకుల కెల్లరకు దుఃఖజనకమైనది యగు హిందూమహమ్మదీయ వైషమ్యముల పారద్రోలి, ఐకమత్యమును సంస్థాపించి, జాతీయోద్యమ ప్రవాహము నవగ్గళముగ సాగింపజేయగల్గితిమేని మనమొక యుత్కృష్ట కార్యమును సాధించినవార మగుదుము.

వీరి తల్లిగారగు బీయమ్మగారి సేవాపరతలను మనము మఱవజాలము. వార్ధక్యమందున్నను, దేశమునందన్ని భాగముల దిరుగుచు, అసహాయోద్యమ సూత్రముల బోధించుచుండిరి. దేశసేవాదీక్షచే వీరు పర్దా పరిత్యజించుట అసహాయోద్యమ చారిత్రమునం సువర్ణాక్షరముల ప్రస్ఫుటముగ లిఖింపదగిన అసాధారణ ఆత్మత్యాగము. ఇట్టి సతీమతల్లిసుపుత్రుడు సభాసమాలోచన కధ్యక్షులుగ నుండుట, వీరిసందేశము ఉద్యమమునందు నూతనోజ్జీవము, నూతనోత్సాహముల పురికొల్పి, ద్విగుణీకృతోత్సాహుల జేసి గాంధిమహాత్ముడు మన సాన్నిధ్యమం దుండగ కల్పించిన ఆశల సఫలీకృత మొనర్చునట్లు కార్యాచరణకు మనల బ్రోత్సహింపగలదు.

ఇక వృథా కాలము వ్యర్థముచేయక మౌలానా మహమ్మదాలీగారి నధ్యక్షపదవి నలంకరింప బ్రార్థించుచు, మీకెల్లరకు హృదయపూర్వక స్వాగత మొసంగుచున్నాను.

వందేమాతరమ్

# మౌలానా మహమ్మదాలీగారి అధ్యక్షకోపన్యాసము

మిత్రులారా! సోదర సేవకులారా!

జాతీయ మహాసభ కధ్యక్షత వహించిన మాననీయులందఱును, సోదర భారతీయు లేభారతీయునకైన నొసంగగల మహోన్నత గౌరవమును తమకు ప్రసాదించినందులకు వందనము లర్పించుట యాచారమైయున్నది. అట్టిపదవి నలంకరించుటకు తమ కర్హత లేదనియు, అంతకు పూర్వ మాపీఠ మధిష్ఠించినవారితో తామెంతేమాత్రమును సరిరామనియు చెప్పుటకూడ నాచారమే. అపలుకు లాయధ్యక్షుల వినయ శీలత్వముల ప్రకటించుటం జేసి, కేవలము లాంఛనామాత్రములని చెప్పజనదు. నేనును పద్ధతి ననుసరించి యామాటలనే వచించుచు, వానినింకను నిస్సారము లొనర్పబూనుట, నావినయ సంపత్తిమూలమున కాదు. రెండుసంవత్సరముల క్రిందట, నేను చెఱసాలకేగుటకు కొంచెము ముందుగ కొన్ని రాష్ట్రసంఘములు కాంగ్రెసు సభాధ్యక్ష పదవికి నానామమునుకూడ సూచించినవి. అప్పుడు నేనాపదవి నంగీకరింప జాలనని విన్నవించి, నాకు (నానామమును సూచించుట వలన) గల యాశ్చర్యమును కొంతవరకైనను వెల్లడింపగల స్థితియందుంటిని. కాని ఈపర్యాయము విధివశమున నాకట్టియవకాశ మణుమాత్రమును లేక పోయెను. నేనుచెఱసాలనుండి విముక్తినొందిన వెంటనే, ఇచ్చటి సన్మానసంఘము తామ కొలదిదినములలో సమావేశమై నా ఎన్నికవిషయమై వివిధరాష్ట్రములను గావించిన తీర్మానములను స్థిరపరుపనుంటిమని నాకు తంతినంపిరి. అట్టితరుణమున నైనను, నాయనంగీకారమును తెలిపియుందును. కాని, ఢిల్లీమహాసభకు కారణభూతములైన పరిస్థితులను బట్టియు, ఆమహాసభలో నేర్పడిన సందర్భములను బట్టియు, నేనీ యధ్యక్షపదవి నంగీకరింప కుండుట యొకింత అధర్మమగు నేమోయని సంశయించితిని.

నేనీపదవి నలంకరింపబూనుట మిగులసాహసకార్యము. నాయీ సంశయమునకుగల కారణమొకటి మీకెల్లరకును తెలిసియే యుండును. నాకు కాంగ్రెసుతోడి సంబంధము నిన్నమొన్నటిది. నేను కాంగ్రెసుకు మొట్టమొదట ప్రతినిధిగా వచ్చినది 1919-వ సంవత్సరముననే. అప్పుడైనను నేను క్రమపద్ధతిని సభాకార్యములందు పాల్గొనలేదు. ఐరోపాసంగ్రామకాలమున కడపటి నాలుగు సంవత్సరములను మాసోదరులిరువురమును రాజకీయ నిర్బంధితులమై, అమృతసరసభనాటికి 'చేటూలు' చెఱసాలనుండి విముక్తులమైతిమని తమలో కొందరికి తెలిసియే యుండును. విముక్తినొందినంతనే, ఎకాయెకి, భారతీయరక్తముచే పునీతమైన అమృతసరస్సున కేగితిమి. అప్పటికే కాంగ్రెసుసభ ప్రారంభమయ్యెను. మేము సక్రమముగ ప్రతినిధులమగుటకు వీలులేకపోవుటచే అమృతసరపౌరులు దయాపూర్వకముగ మమ్ము తమప్రతినిధులుగ నంగీకరించిరి. మరుసటివత్సరము నాగపుర మహాసభకు మేము క్రమపద్ధ

తిని ప్రతినిధులమై వచ్చితిమి. నేటివరకును అట్లు రాగలిగిన దొక్క నాగపురమునకే. నాకుపూర్వ మీ యధ్యక్షపీఠము నధిష్ఠించినవారెల్లరును, తమజీవితమంతయు కాంగ్రెసు సేవకై ధారవోసిన ధీరులు. కావున కాంగ్రెసు వ్యవహారములందు కేవలము పసిపాపడ నగు నేను, ఈ యప్రతిమాన గౌరవమును నాకొసంగినందులకై కృతజ్ఞతా పూర్వక వందనములర్పించుట లాంఛనమాత్ర మెట్లగును?

ఏమహామహుడు నావలె నిటీవలెనే కాంగ్రెసు రంగమున ప్రవేశించియు నాయకాగ్రగణ్యుడయ్యెనో; ఇచ్చట సమావేశమైన సదస్యులెల్లరు నెంత వెదకినను ఏమహామహుని దివ్యస్వరూప మిచ్చట కానరాదో; ఆమహాత్ముని సాహచర్యభాగ్యము (నేను కాంగ్రెసునందు ప్రవేశించిన) ఈ స్వల్ప కాలమునందు నాకబ్బుటయే ఈ నా ప్రస్తుత పదవి కొకింత యర్హతగలిగించి యుండవచ్చును. నేను మొదట 1919-వ సంవత్సరమున ప్రతినిధినై కాంగ్రెసును సందర్శించిన నాటనుండియు ఆమహాత్ముడే ప్రజాహ్లాదయము నాకర్షించి, కాంగ్రెసునందు ప్రథమగణ్యుడయ్యెను. మునుపటికన్నను నేటి పరిస్థితులలో నాయన నాయకత్వము మనకత్యావశ్యక మగుచున్నది. అట్టిస్థితిలో, ఆయనయెడ భక్తి విశ్వాసములందెవనికిని తీసిపోక పోయినను, శక్తిసామర్థ్యములయందల్పుడ నగు నావంటివా డాయన స్థానమాక్రమించుకొని, నేటి సభా కార్యముల నిర్వహించుటయే దైవసంకల్పమైనచో,

"ఉత్తములు గతించుటంజేసి, మేముత్తములమైతి"

మని నుడివిన ఆంగ్లేయదేశ కవిపుంగవునివలె నేమును చింతించుట తప్ప నేమియు చేయజాలకున్నాను.

మహాత్ముని నిర్బంధమునకు ముఖ్యకారకుడైన యాతడు, మహాత్ముని "బ్రతికి యుండగనే భూస్థాపితము" కావించుటవలన ప్రజలలో నాయన జనింపజేసిన మహాశక్తి యణగి పోవునని యాశజెందినను, నేనుమాత్రము మహాత్మునిటుల సజీవుడై యున్నాడో అటులనే ఆ నవీనశక్తియు నింకను సజీవముగనున్నదని నిశ్చయముగ నమ్ముచున్నాను.

మిత్రులారా! దైవమునై భారమువైచి, తాముతప్పక తమ దయారసమును నాపై వర్షించెదరని నమ్మి, నేనీయున్నతస్థానము నలంకరింపగల యర్హత కొంచెమైనను ప్రసాదింపగల యా మహాశక్తిని నేడాధ్యానించుచున్నాను.

మిత్రులారా! అమృతసరస్సు, కలకత్తా, నాగపురము, అహమ్మదాబాదు మహాసభలకు సభాధ్యక్షులుండినను, ఏమహనీయుడు ప్రధాన పురుషుడై మిమ్ములనడిపించెనో, ఆ మహనీయుడొక్కడే మిమ్ములనేడు నడుపదగినవాడు. మన సేనాని యుద్ధరంగమున పట్టుబడి శత్రువులచే జిక్కియున్నాడు. ఆయనలేని లోపమును తీర్పగలవారెవ్వరు? నేనన్ననో, మీ ప్రేమాతిశయమువలన సామాన్య సైనికవర్గమునుండి నాయకత్వమువహింప నాహ్వానింపబడినవాడను. ఈ సభా నిర్వహణమునందును, కాంగ్రెసు నిబంధనల ననుసరించి నే నధ్యక్షపదవియందుండవలసిన సంవత్సరపర్యంతమును, అట్టి ప్రేమాతిశయమే నాపై చూపవేడెదను.

## అధ్యక్షుని కార్యభారము

ఒక్కవిషయమున మాత్రము మీరు నేను వాగ్దానమొనర్పవలసియున్నది. అందులకు నాకెట్టి సంకోచమును లేదు. నాజీవితమంతయు పోరాటమునందే గడపితిని. నాసహజవ్యగ్రోత్సాహమును, తీక్ష్ణతయు నాపోరాటములందు ప్రదర్శించుట నాకలవాటు. మీరు నన్నధ్యక్షునిగ నెన్నుకొనుటచే, నాస్వేచ్ఛకు భంగమువాటిల్లినది. అందునకు కాకపోయినను, నాస్వేచ్ఛకొఱకైనను, ఈసభ కధ్యక్షత వహించు మహాభాగ్యమును సంతసముతో విడనాడి యుందును. ఎట్లున్నను, నాకు క్రొత్తయైన శాంతిస్థాపన కార్యభారము నాపైనబడినది. ఈలోకమున సమరమునకన్న వాంఛనీయ మెద్దియైన నున్నచో, అయ్యది శాంతియేనని, నావంటి సంగ్రామాభిలాషి సైతమొప్పుకొనక తీరదు. కావున శాంతైక్యముల నెలకొల్పుటకై నేను పోరాడు నవకాశమును వదలుకొంటిని. అందులకు చింతింపను. అధ్యక్షపదవియందుండి, నాశక్తికొలది మీకు సేవచేయుటకై ఏతెంచితినేకాని, బానిసల యజమానివలె నధికారమూనుటకు కాదు. ఇట్టి రాజకీయసంఘముల యాచారము ననుసరించి, నేటి మహాసభను నాయధ్యక్షోపన్యాసముతో నుపక్రమించుటలో, నిరంకుశాధికారివలెగాక, సేవకునిభంగి మెలంగదలచితిని. మీరు వివిధ విషయములను చర్చించి నిర్ణయించుటయందు నేను తోడ్పడెదను. కాలయాపనము, దేహమనోబలముల దుర్వ్యయమును కాకుండ, నిర్దుష్టములైన నిర్ణయములను కావించుటకై మీతోడిసేవకుడ నగు నేను నాశక్తికొలది తోడ్పడెదను. ఆ నిర్ణయములన్నియు మీయవియే అయి యుండవలెను నాయవి కాకూడదు. మీరును, నేనును సంప్రతించి కావించిన తీర్మానములైననై యుండవలెను.

మహాత్ముని యప్రతిమాన వశీకరణశక్తినిగూర్చి మనవి చేసియుంటిని. కొలదిమంది ఆయనచే సమ్మోహితులు కాకుండ తప్పించుకొన యత్నించినను, వారల కది దుస్సాధ్యమయ్యెనని మన మంగీకరింపక తప్పదు. స్వకీయాభిప్రాయములను విడనాడి, మహాత్ముని యభిప్రాయములనే యవలంబింపవలసినదని ఆయన ఎవ్వరిని కోరియుండలేదు. అది యాయన యభీష్టమును కాదు. ఆయనతో శీఘ్రముగను, హృదయ పూర్వకముగను, నేకీభవించిన యనుచరులు పలువు రాయన కార్యక్రమమునందు సంపూర్ణ విశ్వాసముచేగాక, కేవలము మహాత్మునియందలి భక్తిచేతనే ఆయన ననుసరించితిమను విషయమును గ్రహింపజాలక పోయిరి. మహాత్ముడు చెఱసాలకేగుటకు పూర్వ మీవిషయమును గుర్తించి, మిగుల చింతించెనని నాకు తెలిసినది. మహాత్ముని జనవశీకరణశక్తి నాకు లేదని చెప్పుటకు సైతము నాకర్హతలేదు. కావున, నేపక్షమున మీసమ్మతుల నొసంగినను, జాగరూకతతో పరిశీలించి, బాధ్యతల గుర్తెఱిగిగాని యొసంగరాదని మనవిజేయుచున్నాను. ప్రాముఖ్యవిషయములగూర్చి నేనొసంగు నభిప్రాయములు మీకు రుచింపవేమోయని వెరగొంది మిన్నకుండినచో, నావిధ్యుక్త ధర్మమును నెఱవేర్పజాలకుందును. ఇంతియకాక, నేనట్లొనర్చుట ప్రజాస్వామిక సిద్ధాంతములకు విరుద్ధముగ నుండును. అటులనే, సభాధ్యక్షుని సంత

సింపజేయుటకై ప్రతినిధులు స్వకీయాభిప్రాయముల వెలిబుచ్చుటకు స్వాతంత్ర్యము నొసంగకుండుటయును; ఏకొలదిమంది సానుభూతినో బడయుటకై, అధికసంఖ్యాకుల నోళ్ళు కట్టివేయుటయునుకూడ ప్రజాస్వామికము నపహాస్యస్థితికి తేగలవు.

## కాంగ్రెసు సమావేశము

### శత్రులకు తావుకాదు

అయినను, భారతీయులు ఆరువేలమంది ప్రతినిధుల నెన్నుకొని నదియు, మన మెల్లరమును నానాదిశలనుండియు కాకినాడ పట్టణమునకు ప్రయాణ మొనర్చినదియు, మన మిల్లుబయలు దేరకపూర్వమే మనహృదయములు నావరించియుండిన యభిప్రాయముల ననుసరించి ఏదైన, నొకపక్షమున సమ్మతుల నొసంగుటకు కాదు. పారశీక కవివరుడు 'ఓమరు' జెప్పినట్లు "వచ్చినత్రోవనే మరలపోయినచో," మన కుగాని యొరులకుగాని, యెట్టి మేలొనర్చినవార మగుదుము?

మనమిచ్చటకు బయలుదేరక పూర్వము మనకుగల యభిప్రాయములను, మన సోదర ప్రతినిధులతో సరిపోల్చి జూచి మార్చుకొనక పోతిమేని, యీ ప్రయాణమంతయు వృధయగును. వ్యయప్రయాసలు నిష్ప్రయోజనములు.

మనభావములు దోషభూయిష్ఠము లని మనము సంపూర్ణముగ దలంపకపోయినను, మనకన్న వివేకులును, అనుభవశాలురును నగు పెద్దల యభిప్రాయముల గౌరవించుటచే గాని; ప్రత్యేకవ్యక్తులు మనకన్న నధికులు గాకపోయినను, ఒండొరుల సంయోగముచే నేర్పబడిన బహుజనాభిప్రాయము నాదరించుటచే గాని; మన యభిప్రాయముల మార్చుకొనట మన కెంతయు గౌరవప్రదము గాని లజ్జాస్పదము గానేరదు. ఒరుల దృఢ విశ్వాసముల గౌరవించుటలో నే నెరికిని దీసిపోవను. కాని ప్రతియభిప్రాయమును మనస్సాక్షి ప్రేరితమని దలంచుట పాడిగాదు. ఈసందర్భమున సుప్రసిద్ధరాజనీతివిశారదు డగు 'క్రామువెల్లు' నుడివినవచనములు నా సిద్ధాంతమును బలపరచుచున్నవి. ఆయన యెల్లపుడును, తన యనుచరులతో "నొకవేళ మీరే పొరబడితిరేమో యను సంగతి మరువవలద"ని జెప్పుచుండువాడట.

## ఆత్మనిగ్రహము

ప్రతినిధులు సర్వవిషయముల తమ యభిప్రాయములను యథేచ్ఛగ వెల్లడింపగల స్వాతంత్ర్యము గలదు. తమ మదికిదట్టిన తీర్మానముల నుపపాదింపవచ్చును. ఇతరు లుపపాదించినతీర్మానములకు తమ యిచ్చవచ్చినన్ని సవరణల నుపపాదింప వచ్చును. ఎన్నిమారులైనను సమ్మతుల లెక్కింపవలెనని గోరిన గోరవచ్చును. కాని యితరుల యభిప్రాయముల పాటింపక, వారల కష్టసుఖముల గమనింపక, దుర్దశనందిన నో వైకల్యమున గుందు భారత జాతి క్షేమమును సరకుగొనక యీ యధికారముల చెలాయింపబూనినచో కార్యభంగమగును. సభాస్థలిని జేరినపుడు, ప్రజల యుత్సాహము శిక్షణ శూన్యమై నిగ్రహ విరహితమై యుండుట శోచనీయమని వాపోవుచు, నిష్కళంకముగ వారల సరళశాంత స్వభావముతే వారలకు గొంతవరకైనను రక్షించెనని మహాత్ముడు జెప్పుచుండెడివాడు.

జనసామాన్యమునకు, ఆత్మనిగ్రహ శిక్షణాదులలవడ జేయగల నాయకులు ప్రతినిధులే కావున, వారల (ప్రతినిధుల) నిగ్రహ శిక్షణములు ప్రజలసద్వర్తనమునకు ఆధారభూతము లగుచున్నవి. ఇంతకన్నను ముఖ్యమగు విషయ మింకొక్కటిగలదు. మన యభిప్రాయము లెంత దృఢతరమైనను, వానిని వెలిబుచ్చుటలో దుశ్చింత పరదూషణల కవకాశ మొసంగు పాక్షికభావముల నవలంబింపకుందుము గాక. మన నాయకోత్తముడు లోకమందెల్లెడ నహింసా సందేశమును జాటియున్నాడు. మన వాక్కులయందైనను, దౌర్జన్యమును, దరిజేరనీయని యా మహనీయుని శిష్యులమైయుండియు, మన మిత్ర సత్తములయెడ నైనను అహింసా సూత్రమును పాటింపజాలకుండుట హాస్యాస్పదము. నే నెన్నటికిని, ప్రజోత్సాహమును జల్లార్చి ఉదాసీనభావమును బెంపొందింప నిచ్ఛగింపను. మనకు గావలసినది శిక్షణము. మృతిగాదు. యంత్రమును ద్రిప్పుటకు యావిరి యెట్లావశ్యకమో యటులనే, జాతీయ పురోవృద్ధికి నుత్సాహ మావశ్యకము. కాని యయ్యావిరి క్రమమార్గమున నడిపింపవలయును. దీనికి సంబంధించినదే రాజధర్మము. మనయుది భిన్నసిద్ధాంత సంఘర్షణ వలన జనించిన సంగ్రామము దక్క వేరొండుగాదు. కావున శాంతిస్థాపనకొఱకైనను మన సిద్ధాంతముల విడనాడజాలము. కాని, నేటి స్థితినిబట్టి మనతో ప్రతివిషయమున నేకీభవింపజాలకపోయినను, మనవలెనే నిశ్చల జాతీయ వాదులైనవారిని కూడగట్టుకొనుటకై యెట్టి త్యాగమైనను గావింప సంసిద్ధులమై యుండవలయును. మన నాయకోత్తముడు రాజకీయరంగమును ఆధ్యాత్మిక మొనర్చి, పవిత్రవంతము గావించుటవలన మన యుద్యమము యుత్కృష్టమయ్యెను. కావున నీతిబాహ్యమైన రాజకీయ జీవనము మనల నెంతమాత్రమును సంతృప్తిపఱుపజాలదు. కాని రాజకీయరంగమున సామాన్యముగ యుత్కృష్ట వాంఛితములు జేకూరక పోవచ్చును. మన జీవితమంతయు నున్నదానితో తృప్తినొందగడుపవలసి వచ్చుచున్నది. అట్లగుటచే ఉత్తమ వాంఛితము లభింపనంతమాత్రమున యొక్కింత తక్కువస్థితి నంగీకరించుట కెట్టి యభ్యంతరమును నుండరాదు. ఏలన అట్లంగీకరించుటవలన దేశీయులలో పలువుర మనలో గలుపుకొని విజయపథమున జరియింపగలుగుదుము. బానిసత్వమును నిర్మూల మొనర్చి స్వాతంత్ర్య విజయమును బడయవలసియుండ, వేగమె మన కోదండ దుర్నయముల పటాపంచలు గావించి, ధర్మసంస్థాపన మొనర్పవలసియుండ స్వపక్ష విజయమునకై పెనగులాడుటనుచితము.

మిత్రులారా! సలహాపూర్వకమైన యీ యుపోద్ఘాతమునకు నన్ను మన్నింపుడు. అట్లొనర్చుట మీకును నాకునుగూడ శ్రేయోదాయకమని నమ్మితిని. ఇంక నుపక్రమింతము.

## ముసల్మానులకును, కాంగ్రెసు సభాసంస్థకును గల సంబంధము

### సైనికవిప్లవము: ముసల్మానులపై యేతత్ఫలితములు

కాంగ్రెసు మహాసభతోడ నాకుగల్గిన సంబంధము నిన్న మొన్నటిదేయని నుడివియుంటిని. నాకేకాదు. కాంగ్రెసుసభ నా సంఘమునకుగూడ క్రొత్తయే. ఆసంఘముయొక్క రాజకీయ జీవితము సంగ్రహముగా నిచ్చుట యొక్కింత ముచ్చటింపవలసియున్నది. అట్లు ముచ్చటించుటవలన, నేడు మనల గలవర పెట్టుచున్న విషమసమస్య సుగ్రాహ్యమగును. ౧౮౮౫ సంవత్సరమున హైందవ నాయకులు కొందరు ఆంగ్లేయ ప్రముఖుల సాయంబుగొని, అఖిలభారత జాతీయ మహాసభను ప్రతిష్ఠాపిత మొనర్చినపుడు, ఎవరో కొందరుదప్ప భారత భూమిని వసియించు మహమ్మదీయు లెవ్వరును నీ యుద్యమమున బాల్గొనలేదు. పాశ్చాత్య విద్యా సాంప్రదాయముల ననుసరించి విద్యాభ్యాస మొనర్చిన మహామహులచే ప్రారంభింపబడిన యీయుద్యమమున, పాశ్చాత్యవిద్యాసంస్కారము లేమింజేసి, నా మహమ్మదీయ సోదరులు బాల్గొను నర్హత గల్గకపోయినను, వారల రాజకీయ భావములు ఏ రాజకీయోద్యమమున కైన భంగము వాటిల్లజేయునవియై యుండెను. వారలకు హైందవ రాజ్యమును పాలించు భాగ్య మడుగంటినను యంతరింపలేదు. ఇందువలన పాశ్చాత్య విద్యాపద్ధతులు వారలకు మరింత హేయమయ్యెను. 'ప్లాసీ' యుద్ధ కాలమునుండి సైనిక విప్లవము దనుక యీ నూరు సంవత్సరముల కాలమునను, చల్లచల్లగా ఎవ్వరికిని తెలియక నే హైందవ రాజ్యపాలనము మహమ్మదీయుల హస్తతలములనుండి జారిపోయెను. భారతవర్ష మాంగ్లేయుల వశమయ్యెను. అయినను నూతన రాజ్యాధిపత్తులు నాగరికతా విజ్ఞాన సంపదలందు దమకు సరిరారని ముసల్మానులు దలంపక మానరైరి. ఒక్క శతాబ్దమిట్టి అయిష్టాద్వేషములు పెరిగి పెనుగాలులై ౧౮౫౭ సంవత్సరమున నొక్క పెట్టున భారతవర్షము నూగులాడింప జొచ్చెను. ప్రథమమున నియ్యది హైందవ సైన్యములకు సంబంధించి కలకత్తానగర ప్రాంతమున నుద్భవమైనను కలహక్షేత్రమగు డిల్లీనగరమునను తత్పరిసరప్రాంతములను ఆంగ్ల పరిపాలనమనిన గర్హింపువార లెల్లరును కలహకారులతో గలసిపోయిరి. మతరాజకీయ వ్యవహారములు సమ్మిళితమై యభేద్యమయ్యెను. ఆంగ్లేయులకే విజయము చేకూరునను నాశ లెవ్వరకును జనింపకయున్నె మహమ్మదీయు లెంద రెందరో తమ కౌదవు నాపదల దలంపక యీ కలవరమున సాంగ్లేయులకు తోడ్పాటొసంగిరి. కాని కలవర మడంగినంతనే ఆయా ప్రాంతముల వసియించు మహమ్మదీయు యున్నతవంశ సంజాతులే ఆంగ్లేయ క్రోధానలమునకు గురియై మహాకష్టము లనుభవించిరి. పరాసు మహావిప్లవము పరాసురాజ్యమందలి ఉత్తమ సంజాతుల ప్రాభవ మడంచినట్లే నీ సైనిక మహాకలవరమును మహమ్మదీయ సామంతుల యౌన్నత్య మంతరింపజేసెను. భీభత్సమున నంతగా గాకపోయినను, నీ విషయమున సిపాయివిప్లవము పరాసు విప్లవమును బోలి యున్నదని చెప్పిన నిందతిశయోక్తి లేదు. అట్లు విభవమును గోల్పడి యైశ్వర్యహీనులైన యుత్తమవంశ సంజాతులు తమకింక రాజ్యాధికారము మరల జేకూరదను నాశల వీడిరి. అయినను నూతన పరిపాలకుల యాచార విజ్ఞాన సాంప్రదాయముల గర్హించుచు, వాని పరిచయము నభిలషింపక దూరమున దొలగిజనిరి. మహమ్మదీయ రాజ్యాంగక్షేత్రములుగూడ విప్లవరంగములైన వత్సరముననే, కలకత్తా బొంబై చెన్నపట్టణముల ప్రతిష్ఠింపబడిన విశ్వవిద్యాలయముల గరుపబడు విద్యావిధానమున బాల్గొన పరిత్యజింపరైరి. అందుచే విప్లవ ప్రారంభమైన ముప్పది వత్సరములకు, పాశ్చాత్య విద్యాభ్యాస మొనర్చి పాశ్చాత్య పద్ధతుల ననుసరించి ప్రతిష్ఠించిన రాజకీయోద్యమమున నా మహమ్మదీయ సోదరులు పాశ్చాత్య విద్యా సంపర్కము లేమింజేసి పాల్గొనజాలకపోయిరి. కాని అఖిలభారత జాతీయ మహాసభ 'భారత' 'జాతీయ' యను బిరుద నామంబులు సార్థకము జేసికొనుటకు మహమ్మదీయ సోదరు లిందు బాల్గొనుట యవసరమయ్యెను.

### సయ్యదు అహమ్మదుఖాను కాంగ్రెసు ఉద్యమమున బాల్గొనరాదని ప్రతిఘటించుట

కాంగ్రెసు మహాసభకు, మహమ్మదీయులుగూడ ప్రతినిధులుగ బంపుటకు ప్రయత్నములు నల్పకపోవలేదు. కాని అట్టి తరుణమున మహమ్మదీయ లోకమున పాశ్చాత్యవిద్యా సంస్థాపకుడని బిరుదు నందిన సయ్యదుమహమ్మదుఖాను రాజకీయరంగమున బ్రవేశించి ౧౮౮౭ వత్సరమున డిసంబరు ౨౮ వ తేదిని లక్ష్మణపురమున నొక్కటియు, ౧౮౮౮ సంవత్సరమున మార్చి ౧౬ వ దినమున మీరటు పట్టణమున నొక్కటియు రెండు మహోపన్యాసములగావించి, ముసల్మానుల కాంగ్రెసు మహోద్యమమున బాల్గొనవలదని యుద్బోధించి యట్టిప్రయత్నముల వారించెను. ఈ యుపన్యాసముల విమర్శించుట యొకకష్ట కార్యముగాదు. ఏలనన, రాజకీయ వ్యవహారములయందభిరుచిగల నేటిమహమ్మదీయులు విశ్వసింపని హేత్వాభాసము లెన్నియో యందుగలవు. సయ్యదు మహమ్మదుఖానువలె వాదప్రతివాదముల నారితేరినవారి నోటనుండి సహజముగ వెలువడుగొన్ని అవాచ్యంపు బల్కుల నాధారముగ గైకొని యాతడు హిందూమహమ్మదీయైక్యతకు విరోధియని వాదించు వారిలో నేనొక్కడను గాను.

### ఆయన వ్యతిరేక భావమేల వహించెను?

సయ్యదు అహమ్మదుఖానుగారు తమ యుద్యోగమును చాలించుకొనిన పిమ్మట స్వసంఘోద్ధరణకై యుద్యమమును ప్రారంభించినను ఆయనకు మహమ్మదీయాభిమానమేకాక భారతీయాభిమానమును, నిశ్చలదేశభక్తియు నున్నటుల ననేక యుపన్యాసముల వలన వెల్లడికాగలదు. భారతజాతీయైక్యతయం దాయన కెక్కుడు విశ్వాసము. తన హిందూస్నేహితులనాత డెంతగ ప్రేమించినదియు, ఆయనను స్వయముగ నెరిగినవారెల్లరకును విదితమే. కొందరాయన కారోపించినసంకుచితభావములే యుండినచో నదియెట్లు సాధ్యమైయుండును.

మహమ్మదీయు లెన్నటికిని రాజకీయ జీవనమున పాల్గొనరాదని ఆయన నిశ్చయించెనను నిందారోపణకూడ సరియైనదిగాదు. నేను దహరించిన రెండుపన్యాసము లందును ప్రోద్గ మహమ్మదీయుల నమ్మించుటకై ఎట్టివాదనల గావించినను, మహమ్మదీయు లప్పటికింకను రాజకీయ రంగమున ప్రవేశింపరాదని ఆయన తీర్మానించుటకు గల ముఖ్యకారణములు రెండనితోచుచున్నది. భారత ప్రభుత్వాధికారము మహమ్మదీయులనుండి తొలగి, ఆంగ్లేయుల హస్తగతమగుటచే, తమ పదవి నాక్రమించుకొనిన వారిని తెగనాడుటకన్న మహమ్మదీయులకు సంతోషకార్యము వేరొకండులేదని ఆయనబాగుగ నెరుగును. అట్లొనర్చుట మహమ్మదీయుల కెంత సులభమైనను, శాంతి ప్రదమగు కాంగ్రెసు ఉద్యమమునకు భంగము వాటిల్లునవియు నాతనికి తెలియును. ఖానుగారు రాజకీయవిషయములలో స్వసంఘీయులను వెనుకకులాగుటకుగల ప్రథమకారణ మిదియే. రెండవకారణమును అంత ముఖ్యమైనదే. మహమ్మదీయులు తమసంఘము నుద్ధరింప దలచినచో, ముందుగ విద్యావంతులు కావలెను. కాని, తమకొకకొక ప్రత్యేక విద్యాలయమును, నిర్మించి, ప్రభుత్వ సంస్థాపనలలో వలెనొక సామాన్య విద్యతోపాటు మతవిద్యసహిత మొసంగినను కూడ, మహమ్మదీయులకు పాశ్చాత్యవిద్యపై నభిమాన ముదయింప జేయుట సులభసాధ్యము కాకుండెను. ఉద్రేకరహితమైన, విద్యావిధాన నిర్మాణకార్యమున పాల్గొనుటకన్న, "కాఫరుల" ప్రభుత్వమును, నిందించుటయే మహమ్మదీయుల కెక్కుడు సులభమును, ఉల్లాసకరమును నగుటచే, వారట్లొనర్చుదు రేమోనని ఆయన భీతిల్లెను. అందువలన, రాజకీయ జీవనమెంత యాకర్షవంతమైనను, తాత్కాలిక ప్రయోజనరహితమగుటచే, మహమ్మదీయుల కార్యదీక్షయంతయు నావంకకు మరలకుండ నాయన సర్వప్రయత్నముల గావించెను. కార్యము ముగిసినపిమ్మట, మంచిచెడ్డలను పరిశీలించుట సులభమే. అందువలననే గతించినవారి చర్యలను మనము విమర్శించి వంకలుదీర్ప సాహసించుచున్నాము. అట్టి విమర్శన దృష్టితో పరికించినను, సయ్యదు అహమ్మదుఖానుగారి భావము సమంజసమైనదనియే చెప్పవలసియున్నది. ఆయన పలికిన వాక్యములు కొన్ని అసలే పలుకకుండిన నెక్కువ బాగుండెడిదేమోయని నాకుతోచినను, మహమ్మదీయులయొక్కయు, భారతభూమియొక్కయు శ్రేయోభిలాషు లెవరైనను సరే, ఖానుగారు మహమ్మదీయుల నడపిన మార్గమునకన్న విశేషము భిన్నముగ సంచరించియుండరని నే నొప్పుకొనవలసియున్నది.

మహమ్మదీయ సంఘమునకు నాయకత్వము వహించి, పైపద్ధతిని నిర్ణయించిన ఖానుగారియెడ స్వసంఘీయులకు మహమ్మదీయులలో నైతము విశేష సంఖ్యాకులకు సదభిప్రాయము లేకుండెననుసంగతి మనము గమనింపవలెను. ఆయన 'కొరాను' గ్రంథము నన్వయించుటలో తీవ్ర హేతువాదముల నవలంబించెను. మహమ్మదీయ మతసిద్ధాంతముల కెట్టిసంబంధమును లేకపోయినను, చిరకాలానుగతము [illegible] ప్రజామోదమును వడసి పూర్వాచారపరాయణులలో పలువుర నావేశించియున్న మూఢవిశ్వాసములను, దురాచారములను, ఆయన తీవ్రముగ ఖండించెను; కావుననే పలువురు స్వమతస్థు లాయనను ద్వేషించుచుండిరి. లక్షలకొలది ఆయనను తిట్టిరి. నిందల నారోపించిరి. చాలకాలమువరకును, ఆయన స్థాపించిన అలీఘరు కళాశాలయనిన, భక్తిపరులైన మహమ్మదీయుల కసహ్యముగ నుండెను. ఇటిస్థితియందు నైతము, రాజకీయ విషయములలో మాత్రము మహమ్మదీయు లందరును నేకగ్రీవముగ నాతని నాయకత్వ మంగీకరించిరి. ఆయన కేవలమతర్కములను, రాజకీయ పన్నాగములను, ప్రయోగించియుండినచో నంతమహిమ గలిగియుండునా? కావున, ఖానుగారి పలుకుబడికి ముఖ్యకారణమాతని పద్ధతియందలి ప్రాశస్త్యమేయని నా నమ్మకము.

అలీఘరు కళాశాల స్థాపించినపిమ్మట ఇరువది సంవత్సరముల వరకును, మహమ్మదీయులకు రాజకీయజీవనము గాని, అంతగ చెప్పదగిన రాజకీయ సంస్థలుగాని లేవు ఒకవేళ కాంగ్రెసుకోర్కె లెవ్వియైనను సఫలమైనచో మహమ్మదీయుల కపకారము జరుగునని ఖానుగారికి గాని; ఆయన బ్రిటీషుమిత్రులకుగాని—వీరిమాట వేరుగ చెప్పనేల—తోచినవెంటనే, 'మహమ్మదీయ స్వాత్వసంరక్షక సంఘము'నకు చెందిన తన స్నేహితులను, అందు ముఖ్యముగ తనకళాశాల నిర్వాహకులను, సమావేశపరచి ఏదోయొక తీర్మానము కావించెడివాడు. ఆతీర్మానము 'పయనీరు' పత్రికయందును, ఖానుగారి స్వకీయవారపత్రికయందును ప్రకటింపించెడి వాడు. ఆదినములలో మహమ్మదీయుల రాజకీయ జీవన మింతకన్న నేమియులేదు.

తన మిత్రులగు సర్కారుద్యోగసులకీపద్ధతి మిగుల రుచించెననియు, వారి కసమ్మతమగు వేరొకపద్ధతి నవలంబించినచో తన కళాశాలకును విద్యాసభకును సర్వవిధముల నాటంకముల కలుగజేయుదురనియు, ఆయన బాగుగ నెరిగి యుండెనని నే నంగీకరించెదను. కొందరు రాజకీయవిమర్శకు లాతని కారోపించిన దాస్యభావ మాతనియందు లేదని, నేనాతని స్వభావమును బాగుగ పరిశీలించి స్పష్టముగ చెప్పగలుగుచున్నాను. స్వతంత్రభావపూరితుడగు ఖానుగారికీసమయానుకూల ప్రవర్తనమైనను సంపూర్ణముగ నంగీకారమైయుండి యుండదు.

౧౯౦౭ వ సంవత్సరములో, మహమ్మదీయ మహాసభ సంస్థాపనమూలమున వారి రాజకీయజీవనమున నూతనశక మారంభమైనకొలది దినములకే, అలీఘరు కళాశాలా విద్యార్థులు సమ్మెకట్టుట సంభవించెను. పోలీసుభటులు కళాశాలయందొక విద్యార్థితో కలహించిన సందర్భమున, ఆంగ్లేయులగు కళాశాలాధ్యక్షుడును, పండితులును, పోలీసువారి పక్షమూనుటయే, ఈ సమ్మెకు కారణము. దాదాపుగ నాసమయముననే, ఖానుగారి జ్ఞాపకార్థము కళాశాలలో ప్రతి వత్సరమును జరుగు "సంస్థాపక స్మారక వర్ధంతి" వచ్చెను. నాటి యుత్సవమునకు, స్వర్గీయుడైన సంస్థాపకునిగూర్చి నేను కొన్ని పద్యముల 'ఉర్దూ' భాషయందు వ్రాసితిని. విద్యార్థుల యాత్మగౌరవమునకును, పరదేశీయుల దురభిమానము నడంచుట కవసరమగు త్యాగమును చేయగల మనస్థైర్యమునకును, నిదర్శనమైన యాసమ్మె వ్యవహారమునుగూర్చి ముచ్చటించుచు, ఖానుగారియాత్మ నుద్దేశించి ఇట్లంటిని.

"మాకిట్టి 'అల్లరి' వంతయు నేర్పినది నీవే. నీవు ప్రారంభించితివి. మేము పూర్తి కావించితిమి.

## ప్రధానవిరోధి

సయ్యదు అహమ్మదుఖానుగారి స్వభావమును సిద్ధాంతములు నిట్టివే యని దలంచువాడ నేనొక్కడనే గానని దెల్పుటకు, బెక్కు నిదర్శనములు గలవు చిత్రమగు నొకసంభాషణ మిచ్చట బేర్కొనియెద. నాసోదరు డింకను ఉద్యోగి పదవియందుండిన కాలమున నొకానొక తరుణమున వృద్ధుడగు నొకయాంగ్లేయ యుద్యోగి నాసోదరు నవలోకించి "భారతవర్షమున ఆంగ్లప్రభుత్వమునకు ప్రబల విరోధి యెవ్వరని తలంచెదవు!" అని ప్రశ్న జేసెను. అందులకు నాసోదరు డేదియో వచియింపుచుండ వారించి యాయుద్యోగి, "కాదు, కాదు, ఆంగ్లరాజభక్తాగ్రగణ్యుడనిపించుకొనుచున్న సయ్యదు మహమ్మదు ఖానుదక్క ఆంగ్లేయప్రభుత్వమునకు ప్రబలవిరోధి వేరొక్కడు గాదని" వచించెను. ఆతని పల్కుల కచ్చెరువంది అయ్యది వాస్తవముగా నేరదని నాసోదరుడు వాదింపుచుండ, మరల నాయుద్యోగి, 'హేరో' 'వించెస్టరు' (సీమరాజ్య మందలి పట్టణములు) నగరములందు విద్యాభ్యాసమొనర్చు విద్యార్థుల వలెనే విద్యాభ్యాస మొనర్చుచు, వారివలెనే జీవనము గడపుచు, వ్యాయామ పరిశ్రమాదుల వారినైన ననలీల నోడింపగల అలీఘరు విద్యార్థులు, సీమనుండి యిచ్చటికరుదెంచు తెల్లయుద్యోగులకు వశవర్తులై సేవలొనర్తురని దలంచుచుంటివా? అదికల్ల. పాకతల్లీ! హైందవరాజ్యమున ఆంగ్లేయపరిపాలనకు అంత్యకాలము దాపరించుచున్నది. విశ్వాసపాత్రుడగు సయ్యదు అహమ్మదుఖానే నేడు ఆంగ్లేయ పరిపాలనకు ప్రధాన విరోధి" అనెను.

మనలో బెక్కండ్రవలె యీసీమ యుద్యోగియు, ఆంగ్లేయ పరిపాలకులచే బ్రతిష్ఠింపబడిన పాఠశాలలో గరుపబడు విద్యావిధానమువలన జనించు యరిష్టముల గుర్తింపజాలడయ్యెను. విద్యావిధాన ప్రాబల్యముచే తప్పక జనించు యసంతుష్టినే యాతడు జూడగల్గెను. ధనధాన్యయుక్తమ్యును ఉత్తమాదర్శములకాకరమైన విద్యాలయమొకవంక జెన్నారుచుండ, (నేటికి మూడువత్సరముల క్రిందట, నాపూర్వ విద్యాలయమిట్టి పరిణామము జెందెను) ఆంగ్లపరిపాలకులపోషణ మందుచు, జాతీయాదర్శ విరహితమై, శ్రీమంతుల యాదరణకే పాత్రమై, యసంఖ్యాకులగు యుపాధ్యాయ విద్యార్థులతో నిండియుండు ప్రాత విద్యాలయమింకను నానగరమున బెంపొందుచుండ "నీయాంగ్లప్రభుత్వ ప్రధాన విరోధి" దనపోరాటమున జయము గాంచెనని గర్వింపజాలను. ఆతని విద్యార్థి సంతతులు ఆంగ్లప్రభుత్వమునకు జోహారు లొనర్పకుండ మెలంగ గల్గునంతటి యుత్కృష్టదశ యచిరకాలముననే భారత భూమికి గల్పింప కృషిసల్పకపోయినను, యాతడు స్వమతాభిమానులగు మహమ్మదీయులను, దేశాభిమాన పూరితులగు భారతీయులను, ఐక్యమొనరుజేయుట నభిలషించెననియు, యయ్యదియె యాయన లక్ష్యమనియు, నేను దృఢముగ వక్కాణింపగలను.

## అలీఘరు కళాశాల: మహమ్మదీయ మహాసభ

భారత భూమియందలి ముఖ్య రాజధానీనగరములలో దాదాపు ముప్పది సంవత్సరముల క్రిందట విశ్వవిద్యాలయ స్థాపనమయ్యెను. దేశమున నూతన జాతీయజీవన నిర్మాణ కాలముకూడ నీముప్పదివత్సరములే! అట్టికాలముయొక్క యవశ్య పరిణామముగ భారత జాతీయ మహాజనసభా సంస్థబయల్వెడలెను. ౧౮౫౭ సంవత్సరపు విప్లవమున ముఖ్యరంగమగు భూభాగమందు, తనమతస్థులకొరకై సిపాయి కలవరము జరిగిన యిరువదివత్సరముల లోపలనే యొక మహమ్మదీయ కళాశాలను స్థాపింపగలుగుట సర్ సయ్యదు అహమ్మదుఖానుగారు చేసిన మహత్కార్యము మరల సరిగ ముప్పదివత్సరములకే, ప్రభుత్వ విశ్వవిద్యాలయ సౌకర్యములను పొంది తత్ఫలితమగు రాజకీయ విజ్ఞానోదయమున పాల్గొనజాలని ముసల్మానుల కొరకు నూతనరాజకీయసంస యొకటి స్థాపింపబడెను. కాలానుగుణములగు పరిణామములు కల్గుట ప్రకృతి నియమమేకదా! మరియు ౧౯౦౬ సంవత్సరాంతమున ఢక్కా పట్టణమున జరిగిన మహమ్మదీయ మహాసభనుస్థాపించినవారిలో ముఖ్యులు సయ్యదు అహమ్మదుగారి స్వంతకళాశాలలోని విద్యార్థులగుటకూడ సకారణముగ నున్నదనియే తోచుచున్నది.

ఈనూతన మహాసభాస్థాపనము భారతదేశము నందలి మహమ్మదీయుల రాజకీయ జీవనమున నూతన శకమును సృజించెను. అప్పటికి కొన్నిమాసములకు పూర్వము త్వరలో రానున్న మింటో మార్లేసంస్కరణముల సందర్భమున, మహమ్మదీయుల కోరికలను అప్పటి రాజప్రతినిధియగు మింటో ప్రభువుగారికి నివేదించుటకు రాయభారమొకటి తరలెను. రాయభారముయొక్క నివేదికము "ప్రేరణ" వలన జరిగినదని చెప్పుట, యుద్ధకాలమున కొందరు పత్రికాసంపాదకులన్నట్లు "ఇప్పుడేమియును ప్రమాదము లేదు" ప్రభుత్వమువారు హైందవ విద్యావంతుల కోరికలను త్రోసివేయజాలరనుట నిశ్చయము. కావున యలవాటుచొప్పున కొన్నివత్సరములవరకు భారతీయుల పోరు చల్లార్చి వారినోళ్లు కట్టుటకు కొన్నిసంస్కరణములను బిచ్చము పెట్టుటకు సిద్ధముగనుండిరి. పూర్వమొక కాలమున నైర్లండునందు న్యాయాధికారి విచారణ కాలమున నొకఖైదీని "నీపక్షమున వాదించుటకు న్యాయవాది యెవ్వడైనను న్నాడా!" యని యడుగ వాడు తన యుద్దేశ్యమును దాచక, "అట్లు లేకపోయినను విచారణ సంఘమున నామిత్రులు కలర"ని బదులుచెప్పెనట! ఆఖైదీయెట్టిస్థితియందుండెనో యాకాలమున భారతదేశమునందలి మహమ్మదీయులస్థితి యట్లుండెను. కాని అప్పటికి ప్రభుత్వమునందు మహమ్మదీయులకు గల్గుమిత్రులు, రహస్యముగ, నితరులవలెనే వారినికూడ తగిన న్యాయవాదులను కుదుర్చుకొనుడని పురికొల్పిరి. ఆప్రేరణ యెట్టిస్థలమునుండి వచ్చినను ఆపర్యాయము మహమ్మదీయపక్షము బాగుగా వాదింపబడెనని చెప్పుట కెట్టి యభ్యంతరమునులేదు. అందరకును సామాన్యముగ దేశభాగములనుబట్టి నియోజకవర్గము నేర్పరచు పూర్వపు పద్ధతిలో, ముసల్మానులకు సరియైనట్టియు తృప్తికరమైనట్టియు ప్రాతినిధ్యము లభించినదని చెప్పుటకు వలనుపడదు.

మరియు మహమ్మదీయులు ప్రథమమునుండియు తమకు కావలెనని వాదించుచున్న ప్రత్యేకప్రాతినిధ్యము మంచిది కాదని వాదించువా రందరును అట్టిప్రాతినిధ్యము హిందూమహమ్మదీయులకుండు అభిప్రాయ భేదములయొక్క ఫలితమె కాని, వాని కదికారణము కాదని జ్ఞప్తియం దుంచుకొనవలయును.

## ప్రత్యేక నియోజకవర్గము జాతీయైక్యత

మహమ్మదీయులకు అధికారవర్గమునందుగల మిత్రులు ప్రత్యేక నియోజకవర్గ స్థాపనము అచిరకాలమున హిందూ ముసల్మానుల యైక్యతకే తోడ్పడునని యప్పటికి కొంచెమైనను కనుగొనలేకపోయిరి. భారతీయులకు యెంత సంకుచితముగనైనను ప్రాతినిధ్యము నొసంగుట కిదియే ప్రథమప్రయత్నము. అట్టిసందర్భమున బ్రిటిషుపాలనా ప్రారంభము నుండియు నున్నరీతిగ హిందూ ముసల్మానులింకను విముఖులుగను అప్పు డప్పుడు పరస్పర కలహముల సల్పుకొనువారుగనే యున్నయెడల, సామాన్య నియోజకవర్గ స్థాపన ముభయజాతులకును ముఖ్యయుద్ధ కారణమై వారల కదివరలోనున్న భేదములను మరింత వృద్ధిపొందించి యుండును. ప్రతియభ్యర్థియు 'స్వసంఘ సంరక్షణము'ను మిషతో విమతస్థులయెడ తనకు నందరికంటె యెక్కువగనున్న ద్వేషము నూతగా చేసికొని, తన సోదరమతస్థులను తనకే వోట్లనియ్యమని కోరి యుండును. ఈపద్ధతి దోషభూయిష్ఠమగుటయే గాక దానిచేత యెన్నికలయందు రెండుజాతుల పరిస్థితులును నసమానములగుటచే అట్టి యెన్నికల ఫలితములు రెండు మతములవారికిని హానికరములుగా పరిణమించి యుండెవి. ఏలనన తన ప్రతినిధి నెన్నుకొనుటలో సఫలత నొందలేని సంఘము జయమొందిన విరోధిసంఘము నెడ తప్పక యసూయా పూరితమై యుండియుండును.

రెండు సంఘములకును నేర్పడిన భేదములు సాంఘిక, లేక, మత సంబంధమైన వగుటచే ఎన్నికల సమయమున వివిధరాజకీయాభిప్రాయ ప్రాబల్యమున కవకాశము లేకుండెడివి. జాతివైషమ్య మెక్కువగా నున్నకాలమున, ప్రత్యేక నియోజకవర్గముచే నెన్నుకొనబడు ప్రతినిధులుకూడ, తప్పక శత్రుజాతియెడ సుప్రసిద్ధా సూయాగ్రస్తులై యుందురని నాకు తెలియకపోలేదు. కాని ప్రత్యేక నియోజకవర్గముల నేర్పరచుట జాతివైషమ్యములను తగ్గించుటకు కారణమైనది.

## వివిధమత సమ్మేళనము

మహమ్మదీయులకు ప్రత్యేకసంఘ ప్రాతినిధ్యము నొసంగవలెనను చర్చలో నేనుకూడ సంపూర్ణముగ పాల్గొంటిని. కాని ౧౯౧౦ సంవత్సరమున నూతన శాసనసభల యెన్నికలలో మహమ్మదీయుల హక్కులు ఆచరణ రూపమున స్థిరపడినవెనుక, భారతదేశ రాజధానియగు ఢిల్లీనగరమునుండి దేశమునందలి రాజకీయాందోళనములో మహమ్మదీయులు తగునట్లు పాల్గొనుటకు సహాయకారిగ నుండుటకై వారపత్రిక నొకదానిని సంపాదింప నిశ్చయించితిని. తాత్కాలికావసరములకొరకు ప్రయత్నించుటలో నప్పుడప్పుడు సంఘమునందలి భిన్న వ్యక్తులకు సంఘర్షణములు తప్పక జరిగినను, మహమ్మదీయులు తమ ప్రత్యేకావసరములను సకల భారత జాత్యవసరములతో సమన్వయము చేయవలయునను భావమును పురికొల్పుటకు మిక్కిలి శ్రమపడితిని. మతమన్న పడిచచ్చు ననేకకోట్ల జనసంఖ్యతో నిండియుండియు, భిన్న భిన్నములగు నంతర్జాతులును, మతములును, సంఘములును గల భారతదేశమునందు, యీ మతవైషమ్యముల బరిమార్చి సర్వమత సమన్వయమునకు గడంగుట భగవన్నిర్దిష్టమైన కార్యమని నానమ్మకము. ౧౯౧౪ సంవత్సరమున, అనగా నేనింకను నాక్స్ఫర్డునుంచి వచ్చి రెండు సంవత్సరములు గాకమునుపే, మహమ్మదీయ విశ్వవిద్యాలయ స్థాపనమును గూర్చి కొంచెము జంకుతోనైనను విస్పష్టముగ ముచ్చటించితిని. అప్పుడు నేను చెప్పిన దీక్రింద వివరించుచున్నాను:

"అన్ని మతములవారును కలసి యొకపరుని (విదేశప్రభుత్వమును) ద్వేషించుట యను కారణమున దక్క మరియేయితర నూతనశక్తిచేనైన నీ భరతఖండమునందలి ప్రజలందరును నొక్కటిగ బంధింపబడినచో, హిందూదేశమననది వ్యక్తిత్వములేని యొక భూభాగముయొక్క నామమైపోవచ్చును. అట్లు కానిచో నీదేశమున సర్వమత సంయోగమైన కావలెను." భరతఖండమందలి యన్నిమతములందును భిన్నత్వమును పెంపొందించు బీజములున్నవని తెలిసియు, దేశమునందలి నమ్మకము, ఆశ, సంపూర్ణ స్వాతంత్ర్యేచ్ఛయు చూడ, నైకమత్య బీజములుకూడ కలవనునమ్మకము నాకు కలిగెను. మతములందలి సిద్ధాంతభేదములు కేవల మతసంయోగమునకే యవకాశము నొసంగుచున్నవి కాని, మరియొక విధమైన మతసమ్మేళనమున కవకాశమున్నట్లు తోచదు. కాని నేననువదించిన యుపన్యాసభాగమున చెప్పినట్లు, యీసిద్ధాంతభేదములు స్థానికములును, జాతీయములునుగాక, మతసంబంధములయినవి. ఇరువది సంవత్సరములనుండియు నెల్లప్పుడును, నమెరికా సంయుక్తరాష్ట్రములకంటె మహత్తరమైనట్టియు, పవిత్రమైనట్టియు, నాధ్యాత్మిక లక్షణములు గలిగినట్టియు, నొకమత సంయోగమున్నే లక్ష్యముగా నుంచికొనియుంటిని. మరియు ప్రస్తుత రాజకీయజ్యోతిష్కులు, హిందూ మహమ్మదీయ విభేదములు ప్రాచీనకాలమునందువలె నిప్పుడుకూడ పెంపొందగలవని భావిఫలమును సూచించినప్పుడుకూడ నేనాలక్ష్యమును మరువక దృష్టిపథమునందుంచికొని యున్నాను. ఈలక్ష్యమును కార్యరూపముగ నొనర్చుటకే నావారపత్రికను ప్రారంభించి దానికి సార్థకముగ "కామ్రేడ్" అని నామకరణ మొనర్చితిని. 'కామ్రేడ్' అన సర్వజనమిత్రమును, నిష్పక్షపాతియును నని యర్థము.

సోదరులారా! నాపత్రికయొక్క ప్రథమ సంచికయందు నేనప్పుడువ్రాసిన యుపోద్ఘాతవాక్యముల ననువదించుట కేవల మప్రస్తుతమని తలంపకుడు. తత్కాలమున భారత భూమియందు రేగియున్న రాజకీయాందోళనముచే, సంశయాత్మకమును, ప్రాపంచికవిషయనిమగ్నమునగు ప్రపంచమునకు నామనోగతభావములను తేటతెల్లముగ నాప్రధానవ్యాసము తెలుపుటకు సహజముగ సంకోచించితిని. కాని ఉన్నతభావ పరంపరలకులోనగు ప్రతివారికిని, నాకుగల భావోన్మాదమే, ఆదర్శములే, తప్పక నేర్పడియుండును. ౧౯౧౧ వ సంవత్సరము ౧౪ వ జనవరి తేదీన నేనిట్లు వ్రాసితిని.

"భారతభూమి యైకమత్యము కల్గియున్నదనుమాటను మేము విశ్వసింపము, ఏలన, యట్లేయున్నయెడల, యీ సంవత్సర కాంగ్రెసు మహాసభాధ్యక్షుని శ్రమపెట్టి అన్యదేశమునుండి తీసికొను నవసరమేల? మృష్టాన్న స్మరణమాత్రమున, బుభుక్షాపూర్తికా నేరదు. సర్వభక్షణా శయగర్భిత వ్యాపారమునకు అభిమానార్ద్రిత దేశభక్తియొక్క వైఖరి నిప్రతిపాదించు నింద్రజాలమందు ప్రజ్ఞావైశిష్ట్యముగల ఛాందసవృత్తి మాపట్లకు మరింతనైరస్యము కలదు.

"మిథ్యాఫలవంచితములై నేత్రానందమాత్రముచే తృప్తినొంద జాలక క్షుత్తాపపీడితులై వంతనొందు విహంగములమాడ్కి"

మిథ్యానిమ్మల తళ్కుగాంచి కాంచనభ్రాంతి తప్పించుకొన నేరని మనవారు కొందరుకూడ నటునలెనే శ్రుతితర్పణమందియు హృద్వేదననను భవింతురు. కాని మనకు ప్రేమాస్పదుడయ్యు ఎక్కువగ భీతిల్ల జేయువాడును మనమునమ్మజాలని వాడును ఎవర నిన, వ్యవహార ప్రజ్ఞావిరహితుడగు కేవల లక్ష్యమూర్తియే. ఆంగ్లకవివరుండగు బైరను నుగూర్చి "యత్యంత ప్రతిభాశాలియయ్యు విమాంసకు గడంగినప్పుడు మాత్రము శిశుప్రాయుడని" జర్మనుమహాకవియగు గెటే వచించియున్నాడు. అఖండలక్ష్యసంపన్నుడయ్యు నేర్మిలేని వానిని మనముకూడ నీరీతి గనే గణింతుము. బుద్ధివైకల్యమునందిన యీదేశమునం దైకమత్యోన్ముఖమైన లక్ష్యప్రతిపాదనము నుద్యమించిన యత్నపరంపరలు సముదితములును, అసముదితములును లెక్కకు మిక్కిలిగ నిష్ఫలములగుటచే మరియొక యవాలోచితమగు యత్నము నిష్ఫలమైనచో అందునగూర్చి స్వల్పముగ నైనను సానుభూతిని చూపజాల కున్నాము. తునిగిన గాజుపెంకులను గోదుతో సంధింపజూచి వైముఖ్యతచే విసికించు యత్నభంగమునకు వగజెంది విముఖి యగుచుండు వస్తుతత్త్వమును నిందింపజూచు దుర్నయమునకు మాత్రము మనము లోనుగాజనము. అనగా స్థితిగతులను ధీరులమై యెదుర్కొందుము. ప్రత్యక్షస్థితిని గమనింతుము. ఎట్టి వికారాకృతిని వహించియున్నను, ఆదరణపాత్రము కాకపోయినను, ప్రత్యక్షస్థితిని యథాతథముగ గమనింతము. అవశ్యములగు వ్యవహార యాథార్థ్యములు తృణీకరింప జూచుట నయహైన్యతను దెల్పుచున్నది. ఐకమత్యమున కాటంకము కాజాలి లోతుగా పాతుకొన్న పట్టుదలను, భేదప్రతిపాదకము లగు నాశయప్రాబల్యములను నిష్కపటరీతి గమనించుట, యైకమత్యసాధనమునందు ప్రధానమైన పదముగా సెంచదగును. నేటికి సంభారముల సేకరించినను, రేపనుమాటను మరువజనగు.

"హిందువులును మహమ్మదీయులును, పరస్పరానుకూల్యతలేక గాని పరస్పరవిరుద్ధముగగాని కార్యసిద్ధి నూహించినచో నభయభ్రష్టత్వము జెందుటయే గాక యధోగతిపాలగుదురని మా యభిప్రాయము. మార్గమున కడుజాగరూకతతో నడుగిడుచుండకలయును. ఆధునికాల వర్తస్థితికి సాదృశ్యము నొందగల స్థితివిశేషము ప్రాచీన, లేక ప్రస్తుత చరిత్రముల నెందు గాన్పించదు. పురావృత్తము (చరిత్ర) పునరావృత్తి నొందదు. దానిలోకమున కింకనుమార్గద్యోతకమగుచున్నది. మనలనుకూడ శ్లాఘించ సమర్థమై యున్నది. భారతీయధర్మసందేహము లించు మించు నానారాజ్యధర్మసందేహముల వంటివి. అయినను యూరపు ఖండాంర్వర్తులగు నయకోవిదులును వదాన్యులును నైతము జాత్యభిమానచోదితులై స్వార్థపరత్వమునకై తాండవించు యుద్ధజాలముల దగుల్కొయున్నప్పటికిని, దండనీతిని వారింప నింకను నిరాశ జెందక రణాధిష్ఠాన దేవతయొక్క సింహాసనమున శాంతికన్యకను నెలకొల్పి వెనుదీయుయున్న స్థితియందు, భారతజాతీయ భవిష్యత్తునుగూర్చి మనము నిరాశజెందజనునా? సమధర్ములగు నాల్గుకోట్ల జపానుదేశీయులచే సమ్మానింపబడు నత్యంతార్ద్రదేశభక్తియు నిశితజాత్యభిమానావేశవిజృంభణమును వర్తమానమున మనభావక్షేత్రములందు మన మంకురింపజేయంజాల పోవచ్చును. అయితే కనడా రాజ్యమందు వర్తించుచున్న యైక్యసంపదను నెలకొల్పుట దుస్సాధ్యము కానేరదు. ఇత్యాది రసలలనచే కాని కల్పనాచమత్కృతిచే కాని శోభితమగు గాంధర్వపరిణయము కాకపోవచ్చును. పరస్పరానుకూల్యతలో నుద్భవిల్లిన వైవాహిక సంబంధము నిరసింపదగినది కాదు. రసికవాగ్వ్యాపారము నీడి వివేచనాసహితమై నీరసవహోభణితినే యనుసరింతము. రసాధిష్ఠాన దేవత శుభలేఖార్థములను నిరాకరింపకుండ ననుగ్రహించుగాక! ఇదియును సులభమార్గము కాదు. కాకపోయినను భారతీయ సంతానమున కాదరణపాత్రమున నిరంతరస్థానయోగ్యమునై విలసిల్లుచున్నది.

* "ఓ ! ఐకమత్యమా!!"

క. వచ్చెదవు నరుల కైక్యం
బిచ్చెద విక జాతిజాతి నేర్పడ కూర్మిన్
గ్రుచ్చెదవు; మాకుగతి యిక
చిచ్చునఁ జేరుటయె, జాగు చేసిన వెనుకన్."

స్నేహితులారా! మూడు సంవత్సరముల క్రిందట నేను లక్ష్యముగా నుంచికొనిన యాదర్శముయొక్క యసంపూర్ణాకారము నైనను సందర్శింపభాగ్యము లభించెను. ఆయాదర్శముము మనము తలంచినంత సంపూర్ణముగ పొందజాలకపోతిమను మాటను మన మొప్పుకొనక తప్పదు. ఇట్టి పరిస్థితులకు ముఖ్యకారణము లెవ్వియో జంకులేకుండ నిష్పక్షపాతబుద్ధితో మన మాలోచింపవలసియున్నది. అట్లు చర్చించుటకు పూర్వము వెనుకనుండి నేను వివరించుచున్న నా ప్రథమ ప్రతిజ్ఞా ప్రయత్నకాలమునాటి పరిస్థితులకు మరలివత్తును.

---

* "Thou wilt come, join men, knit nation unto nation;
"But not for us who watch to-day and burn.
"Thou wilt come; but after what long years of trial,
"Weary watching, Patient longing, dull denial! ,,

## ముసల్మానులు

### విదేశ వ్యవహారములు

నేనుతలచిన ట్లన్ని శాసనసభలలోను, ప్రజాశయములనే వాదించుటలో పరస్పరసాహాయ్యము చేసికొనుట కభ్యంతరము లేనట్టి హిందూ ముసల్మానులనే యీ ప్రత్యేక నియోజకవర్గము సభ్యులుగా నెన్నుకొనెను. అట్లయ్యు దేశమునందు సంఘములలో పరస్పరభేద మడుగంటకపోయెను. పాశ్చాత్యజాతులు ముసల్మానులయెడ చూపు దౌర్జన్యమువలనను, నాదౌర్జన్యము భారతదేశమునందలి ముసల్మానులలో గావించిన భావోద్రేకమువలనను, పరిస్థితులలో నకస్మాత్తుగ నొక నూతనవర్తనము కలిగెను. మహామ్మదీయేతర దేశభక్తులలో నిప్పటికిని, విదేశ మహామ్మదీయుల పరిస్థితులు హైందవ మహమ్మదీయులలో కలుగజేసెడి భావపరివర్తనము నెడల ననంగీకారమును చూపువారగున్నారు. కాని కొంచె మాలోచించినయెడల నేనిప్పుడు వచించిన పరిస్థితులలోని క్రొత్తమార్పు, హిందూదేశమునందలి మహమ్మదీయుల దృష్టిని స్వదేశ వ్యవహారములనుండి నిస్సంశయముగ కొంతవరకు మరల్చినను, యీవిదేశీయ ప్రభుత్వమును నమ్మిన లాభము గలుగుననెడి చిరకాలానుగతమైన మహమ్మదీయుల నమ్మకమును నిర్మూలింపతోడ్పడెను. ఇట్లు చేయుటచే భారతజాతీయైక్యము మిక్కిలి యభివృద్ధియయ్యెనని చెప్పుట కభ్యంతరము లేదు.

### ౧౯౧౧ సంవత్సరమునందలి పరిస్థితులు

భారతదేశమునందలి యన్నిమతసంఘములయొక్క సంయోగావశ్యకతనుగూర్చి నాకు గల యభిప్రాయములను ప్రచురించుటకు 'కామ్రేడు' పత్రికను నిర్ణయించితిని. ప్రపంచమునం దెచ్చటనున్నను ముసల్మానుల యెడల సానుభూతిని చూపవలయుననుట, మహమ్మదీయ మతసిద్ధాంతములలో ముఖ్యమైనను, అట్టిసానుభూతి కేమాత్రము భంగకరముకాకుండ స్వదేశాభిమానమును సాధించుటలో హిందూ దేశమునందలి మహమ్మదీయులకు సాయముచేయుటకు నాపత్రిక నిర్ణయింపబడినది. నేను ప్రథమమున పత్రికాసంపాదకత్వమునకు గడంగినప్పుడు నాస్వదేశమునకు బయటనుండు వ్యవహారములు నాదృష్టి నంతయెక్కువగా నాకర్షించునని తలంచనయితిని. ఈజిప్టుదేశమునందలి యప్పటి పరిస్థితులంత సంతృప్తికరముగా లేనిమాట వాస్తవమే! ఇంత కాలమునుండి యైరోపాయందలి రాజ్యములలో నొక్కయింగ్లాండుతోనే మనకు సంబంధముకలదు. అట్టిపరిచితమైన యింగ్లాండు దేశము, టర్కీ పరిషియాలయందు క్రొత్తగ సాహసముగస్థాపింపబడిన రాజ్యాంగ సంస్కరణములయెడ ప్రథమమున సానుభూతియున్నట్లు చాటియు తరువాత మనమనుకొనునంతటి శ్రద్ధను చూపకపోయెను. మనరాజకీయ దృష్టిలోనికి వచ్చిన రెండవదేశము రష్యాదేశము. నూరుసంవత్సరముల క్రిందట ఫ్రాన్సుదేశమునకు జరిగిన సంపూర్ణాపజయకాలమునుండియు రష్యా యైరోపా ఖండమునందలి రాజ్యములలో మిక్కిలి బలము కలదని యెంచబడుచుండెను. మరియు నాసియా ఖండమందుకూడ నంతకంటె బలము సంపాదింప వలయునని ప్రయత్నించెను. ఇట్లున్నంతకాలము రష్యా మానవజాతికి ప్రబలశత్రువనియు, నందుచే నారాజ్యము నోడించి తత్ప్రయత్న భంగము గావించుటయే, యింగ్లాండుయొక్క పవిత్ర కార్యమనియు పాలకులు మనకు బోధనములు గావించిరి. కాని జపానుదేశముయొక్క సత్వరాభ్యుదయమును, తూర్పున దానికి గలిగిన సంపూర్ణ జయమును, నితర ప్రాచ్యదేశములను సగర్వముగ తలలనెత్తి తిరుగుటకు ప్రోత్సహించుటయే గాక, రష్యాదేశస్థితిగతులలో సంపూర్ణములైన మార్పులను గలుగజేసెను. రష్యాను సంపూర్ణముగ జయించిన జపానుదేశమిప్పుడును వెనుకనుకూడ నింగ్లాండునకు మిత్రదేశమయ్యేయుండెను. అయినను రష్యా పూర్వ మొకప్పుడున్న గర్భశత్రుస్థానమునుండి తొలగి రష్యా యింగ్లాండుదేశములకు సంపూర్ణమైత్రి సమకూరెను. ఈ కారణములచే సమీపప్రాచ్య రాజ్యాంగవ్యవహారములలోకూడ మార్పులు కలిగెను. పరిష్యాలో బహిరంగముగ నిరంకుశత్వమును చూపుటయేగాక యసంఖ్యాకములగు యుద్ధసందేశములను పంపనుద్యుక్తమైన రష్యాయెడల యభిప్రాయములు మారెను. టర్కీయందుకూడ చిరకాలానుగతమైన ట్యూటన్ స్లావు విరోధము నూతన బలముతో తలచూపి తుదకు ఫ్రాంసు మిత్రమండలి, బాల్కను రాష్ట్రమిత్రవర్గమునకును వైరముగా పరిణమించెను. సమీప ప్రాచి మరియొకమారు యూరపునందలి రాజ్యాంగవైరము యొక్క కేంద్రస్థానమయ్యె.

ఇంతకాలమువరకును, బాల్యమునుండియు మహమ్మదీయ రాజ్యములయెడ నింగ్లండును మిత్రముగను, రష్యాను శత్రువుగను పరిగణింప నలవాటు పడిన హైందవ మహమ్మదీయులలో నీపరిస్థితులు కొంతకలవరము కలిగించెను. కాని భారతదేశమునందలి హిందూమహమ్మదీయ విభేదములు వారప్పటికి గమనింపవలసిన ముఖ్యవిషయములుగ గన్పట్టెను. టర్కీ, పరిష్యా పరిస్థితులు దూరస్థలములగు విషయములుగ నుండె, పరస్పర వైషమ్యముల కలన కలిగిన భావోద్రేకము, భారతదేశమునందలి హిందూ మహమ్మదీయ విభేదములే కొంపలు మునుగు గొప్ప యంతర్జాతీయ విషయములనుగా జేసెను.

వ్యవహారములు సరిగా నేనుసూచించినంత యుత్సాహకరముగా పరిణమించలేదు. ౧౯౧౧ సంవత్సరము మహమ్మదీయ రాజ్యములపట్ల ధూమకేతువయ్యెను. టర్కీ పరిష్యా మొరాకో దేశములందలి నూతన రాజ్యాంగ సంస్కరణముల యాచరణము విఘ్నపరంపరాహతమై తుదకు వాతావరణముమారి తుపాను చెలరేగెను.

### ఢిల్లీదర్బారున చేయబడిన రాజ ప్రకటన

హిందూదేశమునందలి మహమ్మదీయులపట్లకూడ ౧౯౧౧ సంవత్సర మెవ్వరు సూచింపజాలనంత యపకారి యయ్యెను. తత్సంవత్సరాంతమునకు కొన్ని దినములకు బూర్వము చక్రవర్తిగారు ఢిల్లీలో నొక విపత్సూచకమగు ప్రకటనమును గావించెను. 'తానాసంవత్సరమున పట్టాభిషిక్తుడనైతినని స్వయముగ వచ్చి నిండుపేరోలగమున తెలియజేయుటయే దర్బారుయొక్క యుద్దేశ్యమని పైకి కన్పట్టెను. "అట్లు

రాజు తనస్వదేశమును వీడివచ్చుట బ్రిటిషు ఆచారమునకును, రాజ్యాంగవ్యవహారపద్ధతికిని మార్గమైన పెద్దత్రోవయని" యందరిచే నంగీకరింపబడెను. ఈ యాచార నూతనత్వమును, భారత ప్రజలకేగాక రాష్ట్రీయప్రభుత్వములకును తెలియకుండ తత్సందర్భమున ననుసరింపబడిన రహస్య ప్రవర్తనమును, సమర్థనీయము లనియే చెప్పవచ్చును. ఏలన యీ రాజప్రకటనము, భారతదేశమునందు బ్రిటిషురాజ్య ప్రారంభము నుండియు ప్రకటింపబడినవానిలో నుదాత్తతమమై యున్నది. మరియు నా ప్రకటనమే చేయబడకముందు, ప్రభుత్వమునెడల ప్రజలమైన యనూయను పుష్టింప సమర్థమైనట్టియు, విశాలవ్యాప్తమై యణగద్రొక్కుటకు దుస్సాధ్యమైనట్టియు, నాందోళనము నెట్లు శమింపజేయవలెనో యను బహిరంగచర్చ యీ యాందోళనము నపారముగ చేసి యుండును. ఆప్రకటనమునందలి యంశములలో రెండు మిక్కిలి ముఖ్యమైనవి. లార్డుకర్జను బంగాళీలయెడ చిరకాలమునుండి తననున్న పగదీర్చుకొనుటకు గావించిన బంగాళా విభజనమును రద్దుకావించి పునస్సమ్మేళనము చేసి, ప్రాచ్యపశ్చిమభాగములను కలిపినవెనుక బీహారు ఒరిస్సాలను ప్రత్యేక రాష్ట్రముగ మార్చుట మొదటిది. కలకత్తానుండి ఢిల్లీకి రాజధానినిమార్చి పరోక్షముగా బంగాళమును శిక్షించుట రెండవది. ఈ రెండువ్యవహారములను, ప్రభుత్వమువారు చేసిన కాల స్థల పద్ధతుల మరచి, పరస్పర సంబంధములేని రెండు ప్రత్యేక విషయములుగ పరిగణించినయెడల రెండును నాకు సమ్మతములేయని నేను 'కామ్రేడు' పత్రికలో వ్రాసియుంటిని. ఈబంగాళాసమ్మేళనము ౧౯౦౫ సంవత్సరమున జరిగియుండవలసినది. రాజధాని మార్పు ౧౮౫౮ సంవత్సరమున జరిగియుండవలసినది. కర్జన్ మిడిల్టన్ ప్రభువులు త్వరపడి తప్పుగావించిరి. హార్డింజి క్రూ ప్రభువులు జరిగిన తప్పునకు తీరికగ పశ్చాత్తాప పడుచుండిరి. ఆప్రకటనమునందలి యన్ని వ్యవహారములకును ఢిల్లీని రాజధానిగా జేయుట మిక్కిలి ముఖ్యమైనదనియు, రాజధానిమార్పు యొక్క ఫలితముగ మాత్రమే బంగాళా పునస్సమ్మేళనము జరిగెననియు, బంగాళీయుల యభిప్రాయములను తృప్తి నొందింపజాలు ప్రత్యేక విషయములకలన బంగాళీలు సంతృప్తి నొందుదురని ప్రభుత్వమువారు తలచిరనియు, రాజధానిమార్పునకు విరుద్ధముగ కొందరు బంగాళీలు చెప్పు నభ్యంతరములకు బంగాళా సమ్మేళనము ప్రతిఫలముగ నొసంగబడెననియు, రాజ ప్రకటనమువలనను భారతప్రభుత్వమునకును నిండియా కార్యదర్శికిని జరిగిన యుత్తరప్రత్యుత్తరములవలనను తెలియగలదు. తూర్పు బంగాళమునందలి యార్థికములైన చిక్కులు, అస్సామును బంగాళముతో ముడిపెట్టుటవలన గలుగు నష్టములు, రాజసాహేబ్ద్ధక్కాలమధ్య ప్రయాణాది సౌకర్యలోపములు, మొదలగు నంశములు, 'నిశ్చితవిషయము' న నిశ్చితము గావించుటలో కారణములగుటకు తగియుండినను, భారతప్రభుత్వ మిండియా కార్యదర్శికి వ్రాసిన యుత్తరములలో వీనిలో నొక్కటియైనను పేర్కొనినట్లు గాన్పింపదు. ఆయుత్తరమున, ౧౯౦౫ సంవత్సరమున చేయబడిన బంగాళావిభజనము తత్కర్తలకు గల రెండభిప్రాయములను సఫలము గావించెనని వ్రాయబడెను. అందిట్లున్నది.

"మిక్కిలి భారమైన బంగాళాపాలనమును సులభము చేయుటయె గాక, తూర్పుబంగాళమునందలి మహమ్మదీయులకు యిదివరకు ననుభవింపని కొన్ని సౌకర్యముల నందుటకు వీలుగలిగెను."

కాని భారతరాజధానిని తన రాజధానిగా చెప్పుకొను గౌరవమును బంగాళము కోల్పోయెను. అంతియెగాక భారతప్రభుత్వమున సమీపమునుండి విమర్శించుటకును, దానికి నిరంతరము నొత్తిడి కలిగించుటకును, సౌకర్యములను కూడ కోల్పోయెను యీరాష్ట్రపు ఖండము యొక్క విదేశ రాజ్యాంగ వ్యవహారములలో "లాభాలాభములు సమానములుగా నుండవలెను" ను సూత్రము పలుమారు మన కనుభవైకవేద్యమగుటచే మనకు దానియెడల సంపూర్ణమైన జుగుప్సకలిగినది. ఆసూత్రానుసారముననే యీజిప్టుతో నింగ్లాండు తనయిష్టము వచ్చినట్లు ప్రవర్తించు నధికారమునకు ప్రతిఫలముగ ఫ్రాన్సునకు మొరాకో యొసంగబడెను. అట్లే యిటలీదేశమునకు ట్రిపోలీదక్కెను. తదను సారముననే జర్మనీ ఆగాడిర్ నందు దురాశాప్రేరితమైన యాక్రమణమును గావించెను. ఈపాడుసూత్రము భారతదేశముయొక్క పరిపాలనా వ్యవహారములలోనికికూడ మెల్లగ ప్రవేశించినది. ఇండియా ప్రభుత్వమువారొక మారిట్లు వ్రాసిరి:—

"తూర్పుబంగాళము, అస్సాము, బంగాళా విభజనమువలన నిస్సంశయముగ లాభమునందినవి. రాష్ట్రమునందలి ప్రజలలో నధిక సంఖ్యాకులగు మహమ్మదీయులు రాజభక్తిగలిగి సంతృప్తులైయున్నారు. కాని రెండురాష్ట్రములందును భూస్వాములందరును బంగాళీలే! వారే యధిక సంఖ్యాకు లుద్యోగములం దున్నారు. దేశవ్యవహారములలో కూడ వారికే పలుకుబడి యెక్కువగ కలదు. అట్టిబంగాళీల యసంతృప్తి యథాప్రకారముగ బలవత్తరముగనే యున్నది"

ఆకాలముననే నిట్లు వ్రాసితిని:—

"దేశభక్తి గల్గినట్టియు, తృప్తులైనట్టియు, నొక సంఘమునందలి వారి కొలదియాస్తులను బలాత్కారముగ దొంగిలించి, యసంతృప్తులైనట్టియు, రాజభక్తి విగహితులైనట్టియు, మరియొకసంఘమునకు బలవంతముగ కట్టిపెట్టుటకంటె సులభకార్యమేమున్నది." మహమ్మదీయుల కంతటి దురాశయేలేదు. దురాశలేనపుడు ప్రతిఫలములేకపోవుట రాజనీతిలోనిసుప్రసిద్ధసూత్రమేకదా?

## రాజప్రకటనవలన మహమ్మదీయ రాజకీయ వ్యవహారములలో గలిగిన మార్పులు

నేను 'కామ్రేడ్' పత్రికలో "మహమ్మదీయులు సర్కారు వారి నిర్ణయము నంగీకరింపవలెననియే మాయభిప్రాయమని వ్రాసితిని. కాని, వారికన్యాయము జరిగినదని చెప్పక తీరినదికాదు. వంగదేశ విభజనకు పూర్వము వారికెట్టి యిబ్బందులుండినను, బలహీనులకు సహజమైన యోరిమితో వానినన్నిటిని సహించి మిన్నకుండిరి. వంగదేశ విభజన కావలయునని యాందోళన కావించినది వారు కాదు. విభజనవలని లాభమును పొందుటకు వారర్హులే యైనను, అది వారికి తలవని

లంపుగ ప్రాప్తించిన వరమయ్యెను. వారిస్థితి బాగుపడ నారంభించెను. గానితో వారియాశలును వాంఛలునుకూడ వృద్ధినొందెను. నడమంత్ర ప్రసిరి దాపరించిన వారందరి వలెనే మహమ్మదీయులును ఒక్కొకప్పుడు స్విష్టులై పింఛము విప్పుకుని తైతక్కలాడు నెమళ్ళవలె సంచరించిరని వాడ నంగీకరింపవచ్చును. కాని కైపెక్కినవానిని తాత్కాలికానందము వలెనే, ఈనూతనస్థితి విశేషకాలముండలేదు. అకస్మాత్తుగను, నతి తీవ్రముగను పతనము సంభవించెను. స్వాతంత్ర్యమును బడసిన బానిసలను మరల విక్రయించినట్లయ్యెను. పగసాధించుట యనిన ప్రతివారికిని మహదానందమేకదా! బానిసలను మరల తమయజమానుల కొప్పగించినంతనే యజమానులు కొరడాలను పాదరక్షలను నధికముగ ప్రయోగించినందులకు యజమానుల నేమనగలము! తూర్పుబంగాళమునందు మహమ్మదీయులు పాలకుల పక్షము వహించి తోడి దేశీయులతో పోరాడిరి. ఇట్లు ప్రయోగింపబడిన మహమ్మదీయులగతి తుదకేమయ్యెను! దేశీయులతో పోరాటమింకను సాగించుట చిక్కుగానున్నదని పాలకులు గ్రహించినంతనే, అతిత్వరితముగ సంధిచేసికొని, తమకంతవరకును తోడ్పాటొనరించిన మహమ్మదీయులను తోడిదేశీయుల యాగ్రహమునకు గురిజేసి విడనాడిరి. ఇటుల 'రాజభక్తి' పరుల కన్యాయము కావించి వారు గాబట్టుకొనిన హక్కులను నశింపజేసి, 'సంతృప్తి' యను మహాపాతకమున కొడిగట్టుకొనినవారిని శిక్షించిన నీవింతద్రోహమునకన్న నీచమైన సందర్భము ప్రపంచ చరిత్రయందు గాంచుట కష్టము. రాజప్రకటన కావింపబడిన వెనువెంటనే నేను ఆరాష్ట్రాధిపతియగు సర్ చార్లెసు బెయిలీగారిని (ఈయన నిప్పుడొకమూలకు త్రోసినారు) సందర్శింప నేగినపుడు సింహప్రభువును, సకౌ వినోదమిత్రరును నగుపడి రాజప్రకటనగూర్చి నాయభిప్రాయమేమని యడిగిరి. "వంగదేశపు హిందువులకు సంబంధించినంత వరకును 'కొంతలాభము కొంతనష్టము'; "బలశీలురును రాజభక్తియుతులును" నగు బేహారు ప్రజలకు 'కేవలము లాభము'; తూర్పుబంగాళపు మహమ్మదీయులకు 'కేవలము నష్టము'; మహమ్మదీయుల రాజభక్తికిని బహుమానముగ కావలసినంత పరాభవము జరిగెను" అని చెప్పితిని. పరాభవమధికమై అజీర్ణపుబాధమాత్రము రావుండు గాకయని నెమ్మదిగ నాలో నేను ప్రార్థించి వెడలిపోతిని. అంతకు కొంచెము పూర్వము దర్బారు సమయమున నే నేనతిత్వరితముగ రాజప్రకటనను చదువుచుండ నాప్రాతస్నేహితుడును సి. ఐ. డి. అధికారియు నగు సర్ చార్లెసు క్లీవులాండు గారు నన్ను పలుకరించిరి. పత్రికాధిపతుల శిబిరములో ప్రకటన ప్రతులను పంచిపెట్టుచుండిన యుద్యోగివద్దనుండి మొట్టమొదట నొకప్రతిని సంపాదించినవారిలో నేనొకడను. క్లీవులాండు గారునన్ను "గూర్చి" ప్రకటనలోనికఁగాని నాకుగాని ఏమైన బహుమతికలదా" యని చమత్కారముగ నడుగ నాకోపము నణచుకొనజాలక "నాకేమియు లేదుగాని మీకుమాత్రము చేతినిండ పనికలుగగలద"ని యంటిని. నాజ్యోతిష మబద్ధమైనదని ఎవ్వరనగలరు?

మిత్రులారా! మహమ్మదీయుల రాజకీయ పురోగమనమునం రాజప్రకటన ప్రాధాన్యమును వహించుటచే, దీనివిషయమై నేనింత విపులముగ చెప్పవలసి వచ్చినది. సోదరదేశీయులనుండి తమ్ముకాపాడుకొనుటకై మహమ్మదీయు లెంతకాలము విదేశీయ ప్రభుత్వమును నమ్మకొనియుందురో, అంతవరకును నిట్టిద్రోహములు జరుగుచునే యుండునని, వారికి స్పష్టముగ తెలియుటు కింతకన్న నేమికావలెను స్వదేశ, విదేశ వ్యవహారములం దెందును ప్రభువుల తోడ్పాటును నమ్మియుండరాదని మహమ్మదీయులు గ్రహించిరి. ఒక వేళ నంత మహత్తరత్యాగమును కావింపకయే, సోదరదేశీయులతో పొత్తుగలుపుకొని, శాశ్వత శాంతియు, సౌహార్దమును సంపాదింపగలుగుదు మేమోయని వా రాలోచింప నారంభించిరి.

## స్వరాజ్యము మహమ్మదీయ మహాసభవారి లక్ష్యమగుట.

మహమ్మదీయ మహాసభ ఎన్నడును హిందువులకుగాని, కాంగ్రెసునకుగాని, వ్యతిరేకమైన సంస్థాపన కాకపోయినను; దేశమునందలి ఇతర సంఘములతో చెలిమియు సహకారమును వెంపొందించుట వారి యుద్దేశములలో చేరియుండినను; వంగదేశ విభజన విషయమై యాందోళన తీవ్రముగనుండిన దినములలో ప్రారంభింపబడిన దగుటచే సహజముగ ప్రత్యేకసంఘ ప్రయోజనముల సంరక్షణయు, రాజభక్తియు మహమ్మదీయమహాసభోద్దేశములలో జేర్పబడెను. ఢిల్లీ ప్రకటనమైనపిమ్మట నొకసంవత్సరమునకు, మహాసభాకార్యనిర్వాహకవర్గము సభాధర్మములు మార్పుకావలెనని సూచించుచు, నూతనలక్ష్యమునందు "భారతవర్షమున కనువగు స్వపరిపాలనము"నకు ప్రధానస్థానమొసగిరి. తరువాత మార్చినెలలో జరిగిన మహాసభా సమావేశములో నీమార్పు ఆమోదింపబడెను. ఇందునుగూర్చి నేనిట్లు వ్రాసితిని:

"మహమ్మదీయుల నూతనలక్ష్యము మార్గమధ్యమందలి విశ్రమస్థానమువంటిది. అచ్చటనుండి పరికించినచో, వారిగమ్యస్థానము స్పష్టముగ కాన్పింపగలదు."

నేటికి మహమ్మదీయుల యభిప్రాయములు సక్రమముగ బోధపడుటకై, జాతీయవాదు లెల్లరును, మహమ్మదీయు లైనను, యితరు లైనను, ఆనాదినములలో 'కామ్రేడు' పత్రికకు వ్రాసిన వాక్యములను జాగ్రత్తగ పరిశీలింప గోరెదను:—

"స్వపరిపాలనా సంపాదన, పాలకులు పరిపాలనావిధానమునందు కావించు సంస్కరణములమీదగాని, పాలకపాలితుల యన్యోన్యసంబంధ విశేషముమీద నైననుగాని, సంపూర్ణముగ నాధారపడియుండదు. ఆత్మవికాసముయొక్క అవశ్యపరిణామమే స్వపరిపాలనము. కాని భారతవర్షమింకను సంపూర్ణముగ నాత్మవికాసమును పొందలేదు. పరస్పర విరుద్ధములైన ప్రయోజనములు, మతములు, సంఘములు వారెల్లరును, భారతవర్షమునకు భౌతికాకార మొక్కటైనటులనే, ఆత్మకూడ నొక్కటియే నని గ్రహింపవలెను. ఇంతమాత్రమే చాలదు. మానవ శరీరమునందు వివిధావయవములుండినను, మానవుని మానసిక, నైతిక ప్రవృత్తు లెప్పటికప్పుడు మార్పుచెందుచుండినను, తన ప్రత్యేక వ్యక్తిత్వము ననుభవించిన రీతిగనే, భారతీయ ప్రజలెల్ల

Hoisting of Swaraj Flag, Cocanada



స్వరాజ్యధ్వజారోహణము, కాకినాడ

The Congress Pandal, Cocanada



దేశీయమహాసభామందిరము, కాకినాడ

Weaving Exhibition of the Khadi Asrama, Bontala Kodur, Cocanada



ఖద్దరునిర్మాణవిధానము - బొం. తలకోడూరుసంపలి ఖాదీఆశ్రమమువారి ప్రదర్శనము, కాకినాడ

The Industrial Demonstration made by the Andhra Jatheeya Kalasala, Machilipatnam, at The Cocanada Congress



బందరు ఆంధ్రజాతీయకళాశాలవారి పారిశ్రామిక ప్రదర్శనము, కాకినాడ కాంగ్రెసు

రును తమ నైక్యతను గుర్తించినచో, నిక స్వరాజ్య సంపాదనమును బ్రతిఘటింపజాలిన వారీ భూలోకమున [illegible] లేరు. కాని తమ రాజకీయ లక్ష్యమును నిర్ణయించుటకు జా[illegible]లతో మెలంగుడని మేము బోధించినటులనే, జాతీయ పునర్నిర్మాణపద్ధతులందు నైతము కేవలము పరుల ననుకరింపరాదని హెచ్చరించుచున్నాము. భారతవర్షమున జాతీయైక్యతకు భంగకరముగ కన్పట్టు చిన్న చిన్న సంఘములను వశింపజేయుటవలన గాక, వాని ప్రాబల్యమును, ఆవశ్యకతను నంగీకరించుటవలననే, రాజకీయ సమ్మేళన మేర్పడగలదు. భారతజాతీయ నిర్మాతలకు తగిన లక్ష్యమును సూత్రప్రాయముగ చెప్పవలసినచో, అమెరికా సంయుక్తరాష్ట్రము లంగీకరించిన, "భిన్నత్వమున నేకత్వము" అనునదియే యుత్తమోత్తమముగ గాన్పించుచున్నది.

## మహమ్మదీయులు: విదేశ వ్యవహారములు.

విదేశ వ్యవహారములలో ౧౯౧౧ సంవత్సరారంభమున, మహమ్మదీయుల సంతాప మధికమయ్యెను. గతించిన సంవత్సరమంతయు తమకష్టము లెట్లులైనను గట్టెక్కునని యాశగొనియుండిరి. అది నెరవేరలేదు. సరిగదా, పైవచ్చు సంవత్సరప్రారంభమునాటికంటె సంవత్సరాంతమున కెక్కుడు విషమస్థితు లేర్పడెను. ౧౯౧౧ సంవత్సరశరత్కాలమున ట్రిపోలీదేశము నిటాలియనులు అన్యాయముగ దోచుకొనిన సందర్భమున, మహమ్మదీయుల కంతర్జాతీయ ధర్మముల యెడ గల విశ్వాసము క్షీణించెను. వారికి మిగుల సంతాపకారణ మయ్యెను. ఆ విశ్వాసము సంపూర్ణముగ నడుగంటుటకు, పర్షియాదేశమున రషియావారి చర్యలును, ఇంగ్లీషువారందుల కొసంగిన యర్ధాంగీకారమును విశేషముగ తోడ్పడెను. ఈ రెండు సందర్భములందును పాశ్చాత్యుల రాజ్యకాంక్ష దుస్సాహసములకు హింసలకును, దురాగతములకును, కారణభూత మయ్యెను. ట్రిపోలీ సుక్షేత్రములోని ఘోరహత్యలెవ్వరు మరువగలరు? కర్బెలా రణరంగమందలిదుర్గతియొక్క వర్ధంతినాడు పారశీకసంవత్సరోత్సవము జరిగెను. నాడు జరిగిన ఘోరములను, అందు ముఖ్యముగ, ఉత్తరపారశీకమున ప్రధానమతాచార్యులై, "తన విజ్ఞానము, సత్ప్రవర్తనము, పరమతసహిష్ణుత లోనగుగుణగణముచే మహోన్నతగౌరవ మనుభవించిన" 'షేకత్ ఇస్లాము' బిరుదాంచితుడగు పుణ్యపురుషుని యురిదీయుటయు మరచు టెట్లు? మహమ్మదీయుల మనస్సంతాపము నింకను వృద్ధిచేయగల విషయము లింకను కావలసియుండినచో, ఇటాలియనులు మిగుల పవిత్రమగు 'కాబా' పై నాకాశవిమానముల దాడిసాగించెదమని బెదరించుటయు, 'మెషాదు'ను రషియావారు ముట్టడించి, ఫిరంగులు కాల్చుటయు, ఆపనిని పూర్తిగావించెను. (పారశీక దేశమునందు కొంతకాలమునుండి పారశీకులయెడ స్నేహభావమూనుటచే దేశమునుండి వెడలగొట్టబడిన) షూస్టరుగారు లండను నగరమున 'పారశీకసంఘము' చే నొసంగబడిన విందుసందర్భమున నిట్లు నుడివెను:—

"నాకు గలిగిన కష్టమును నేను పాటింపను. కాని, అంతర్జాతీయ వ్యవహారములలో క్రైస్తవమత నియమములు వర్తింపవని మహమ్మదీయులు కనుగొనుటచే పొందిన కోపాతిశయమును గూర్చి నాకు సానుభూతిని వ్యక్తపరుపక పోయినచో, కేవలము మోసకాడ నగుదును."

పైవాక్యము లెంత సత్యములు! ౧౯౧౨ సంవత్సర శరత్కాలములో ప్రారంభమై, ఒకప్పుడు ౫౦౦ సంవత్సరములనుంచి స్థావరముగనున్న తురుష్కులను ఐరోపాఖండమునుండి తరిమివేయునట్లుగపడిన బాల్కనుయుద్ధము ప్రారంభ మయ్యెను. అందలి యనుభవములు మహమ్మదీయుల కోపానలమును మరింత ప్రజ్వలింప జేసెను.

## భారతవర్షమునందలి మహమ్మదీయుల భావములు మార్పునొందుట

౧౯౧౧ సంవత్సరమాదిగ, తురుష్క, పారశీక మొరాకో రాజ్యముల శత్రువులపట్ల యాంగ్లేయుల ప్రవర్తనము, హైందవ మహమ్మదీయుల కుపితులనొనర్చి, ఆంగ్లేయ పరిపాలనయెడ విముఖుల నొనర్చివైచెను. ఈకారణమున, భారతవర్షమున నాంగ్లేయులకును మహమ్మదీయులకును గల పూర్వపు గౌరవస్నేహ భావములకు భంగమువాటిల్లెను. పరిపాలనమున గుందు ప్రజాళికసాధారణ మగు ధైర్యసాహసములతో వారలాంగ్లేయపరిపాలనమును విమర్శింపజొచ్చిరి. అక్కాలమున నింగ్లాండు దేశమున బరిపాలనా కార్యముల నిర్వహించు నతివాదులపై భారతవర్షమునందలి తెల్లయుద్యోగులు గినుకదాల్చినను అట్టి ఆంగ్లప్రభుత్వచర్యలనుగూర్చియే విమర్శనల జేయసాహసించు, భారతీయులగాంచి, యనుమానాస్పదులైరి. 'కామ్రేడు' పత్రికపై తేబడిన యభియోగము, యిప్పుడంతరించిన ముద్రణశాసన మెంతహాని యొనర్పగలదో, భారతీయులకు సువ్యక్తమొనర్చెను.

తురుష్కదేశమునుండి యరుదేరిన కరపత్రమును స్వాధీమొనర్చుకొనుటకే 'కామ్రేడు' పత్రికపై యాయభియోగము దేబడెనని మీ రెల్ల రెరింగినవిషయమే. మాసిడోనియా రాజ్యమున బాల్కను రాష్ట్రపాలకు లొనర్చిన ఘోరహత్యలవర్ణించుచు బాల్కను రాజ్యమును నిర్జింప క్రైస్తవుల తోడ్పాటునకై యీ కరపత్రమూలమున నాంగ్లేయుల వేడుకొనిరి. 'కామ్రేడు' పత్రికా విచారణ యింకను ముగియలేదు. ఇంతలో కాన్పూరుపట్టణమున జరిగిన విషయములు ముసల్మానుల మరింత కుపితుల నొనర్చెను. కాన్పూరు నగరమున నొక చిన్న మసీదులోని యొక పార్శ్వమును బడగొట్టుటయు ముసల్మానులాగ్రహపూరితులగుటయు మున్నగునవి సంభవించెను.

ఇక్కారణమున, నెవ్వరికిని నుపకారిగాక హైందవమహమ్మదీయులం గలవరింపజేయు విదేశరాజ్యాంగపద్ధతులను, హైందవపరిపాలనా వైఖరులను, విడనాడుడని బ్రిటిషుపరిపాలనాధికారుల వేడుకొనుటకై నేనును, ఆతరుణమున మహమ్మదీయ మహాజనసభాకార్యదర్శియు, గలసి యింగ్లాండు రాజ్యమునకు బయనమైతిమి.

ఇక్కార్యమున మేము గొంతవరకును విజయమును గాంచితిమి. అంత నొక్క సంవత్సరములో, ప్రపంచమంతను గల్లోలపరచిన మహా

విషయములు సంభవించెను. ఐరోపామహాసంగ్రామము కొనసాగుటయు, తురుష్కసామ్రాజ్యము ఆంగ్లేయ దేశమునకు శత్రుపక్షమున జేరి సమర మొనర్చుటయు, తత్కారణమున లార్డుహార్డింజిగారొద్దకు భారతీయ మహమ్మదీయు లంపిన రాయభారము ఫలరహిత మగుటయు సంభవించెను.

## సంగ్రామ ప్రారంభము; భారతవర్షమున మహమ్మదీయ సంచలనము

జర్మనుమహాయుద్ధము ప్రారంభమయినతోడనే ౧౯౧౪ సంవత్సరము ఆగస్టు 12 తేదిని నేను 'కామ్రేడు' పత్రికయందు వ్రాసిన వ్యాసమున, బ్రిటీషుపరిపాలకులకు జోవారు లొనర్పజాలని మహమ్మదీయ విద్యాధికుల యభిప్రాయముల వ్యక్తపరచితినని దలంచెదను. అందిట్లు వ్రాసితిని:—

"భారతీయులలో వివేకవంతులింకను కలరు. వారలు ప్రభుత్వమునకు సేవలొనర్చెదమని యార్భాటములు జేయక ప్రజలలో వారికి గల పలుకుబడిని వినియోగించి పరిపాలకులచిక్కులు తగ్గింపజాలుతురే గాని వృద్ధియొనర్ప బ్రయత్నింపరు. భారతవర్షమున బ్రస్తుతస్థితియందు బ్రిటిషుసామ్రాజ్యముతోడి సంబంధ మత్యంతావశ్యక మని విశ్వసింతురు. వారలు సద్భావప్రేరితులని జెప్పుటకు వేరొండు నిదర్శన మేమి గావలయును?

ప్రభుత్వ విమర్శకులు స్వలాభాపేక్షితులయ్యు, "చిత్తము మహాప్రభో" యను నామమాత్ర రాజభక్తుల కంటె విశ్వాసపాత్రులు.

తురుష్క, పారశీక, మొరాకో, రాజ్యములతోడిసంబంధములలో ఇంగ్లాండు దేశము, భారతీయ మహమ్మదీయుల యభిప్రాయముల గౌరవించినను గౌరవింపకున్నను; మొన్నటి మహాసంగ్రామమున తురుష్కుల ప్రవర్తనమును గూర్చి సార్వభౌముని యమాత్యులు నుడివిన నుడువులు, సమంజసమైనను గాకపోయినను, పరస్పర విరుద్ధములైనను గాకున్నను, ఆస్ట్రియారాజ్యము బాస్నియా హెర్జిగోవినా రాష్ట్రములలోను, యిటాలియారాజ్యము ట్రిపోలిమైన రాష్ట్రములోను, సంధిసూత్రముల మంటగల్పితరి యాంగ్లేయులవర్యలు సంధి సూత్రములు పరమపవిత్రములని వారొనర్చిన ప్రకటనలకు విరుద్ధములైనను గాకపోయినను; ట్రిపోలిబాల్కను రాష్ట్రముల, స్తన్యపాన మొనర్చు పసిగ్రుడ్డులను, నిస్సహాయులగు యబలాసంతతులను, వృద్ధాప్యమున నడువ నేరక మంచమున బడియుండు ముదుసలి జనంబులను, హత్యలగావించిన యుదంతమును విన్న, వారల యంతరాత్మల వేదన, జనించినను జనింపకున్నను; యేకసామ్రాజ్యముననే వలసరాజ్య పాలకులు, శ్వేతేతరులకు, సోదరపౌరులమైన నెరవు బరిపాలనము, నరసమైనను గాకపోయినను; తల్లిరాజ్యము తన యధికారమంతయు వినియోగించి, వలసరాజ్యాధికారులు గావించు దుర్న్యాయంబు వారించినను, వారింపజాలక "నేనేమియు జేయజాలనని, గాల్లుజాచినను"; తురుష్కబాధ్యతల క్రమవిభాగముకొరకును, తమ రాజ్యంపు భారతీయు లొనర్చు యాందోళనమును, భారతీయ నిరంకుశ ప్రభుత్వము స్నేహభావముతో వీక్షించినను అనాదరాగ్రహభావములతో వీక్షించినను; వంగదేశ విభజనాందోళన సందర్భమున వారల రాజభక్తికి దగినట్లు వారల గౌరవించినను, వారల స్వామిభక్తిని ద్వణీకారభావముతో ద్రోసిపుచ్చినను; వారల పుణ్యక్షేత్రముల పవిత్రతయు, వారల పూజ్యతయు, ఎల్లెడల గౌరవించినను, గౌరవింపక, బ్రతిష్ఠాపితాచమును, సంతృప్తిచేయుటకు, కప్పుడప్పుడు బలిపెట్టినను; యీసందర్భము లెవ్వియు బరికింపకయే, మన ప్రకృతస్థితిని బరికించి, భారతజాతీయ వికాసమునకు ఆంగ్లేయరాజ్యరక్షణ మావశ్యకమని తలంచి స్వాతంత్ర్యాభిలాషులమైన మే మాంగ్లేయరాజ్యమునకు హృదయపూర్వకముగ, రాజభక్తిపరాయణులమై మెలంగెదము. ఆంగ్లరాజ్యము, జర్మనురాష్ట్ర నావికాదళమును భస్మీభూత మొనర్చి యైరోపా ఖండమునకు సర్వరాజ్యాధికారమును బట్టముకట్టుకొనినను;అట్లుగాక,తద్రాజ్యముయొక్క (ఆంగ్ల) బ్రహ్మాండనావికాదళమంతయు,ఉత్తరసముద్రములో మునిగి మటుమాయమైపోయినను, (Leige) లీజి లండనునగరముల ముట్టడించుచు, తద్రాజ్య (ఆంగ్ల) సైన్యంబులన్నియు హతమైనను, మేముచలింపక విశ్వాసపాత్రులమై యిట్లే మెలంగెదము. ఇంగ్లాండు రాజ్యమునకు మాయవసరము లేకపోయినను, నారాజ్యముతో మా కవసరము లదు. రాజ్యాంగ వ్యవహారములలో ఛాందసముగాక, పవిత్రతను విశ్వసింపుచు, శాంతి ప్రబలియున్న కాలమున భారతవర్షమునందలి నిరంకుశ రాజ్యాధికార వర్గముతో వివాదమునకు గడంగితిమి. యుద్ధసమయమున అంతఃకలహము సమసిపోవలయును! వివాదము లంతరింపవలయును.

"అనాలోచితముగ, మా కడనే శూన్యమగు సమరోత్సాహము నితరులలో జనింపజేయజాలక పోయినను మేమును, మాకు వశవర్తు లగువారలును సంబంధించినంతవరకు, పాలకులు భయముదక్కి కండెలపై జేతులువైచి కొనుడని ధైర్యము గరపెదము. రాష్ట్రపాలకులను మండలాధికారులను, అటుండనిండు. పౌరసంక్షోభము నడంపవలసిన యెడ క్షుద్రరక్షకభటులకైన తోడ్పడి వారికి వశవర్తులమై మెలంగెదము. ఇంతకంటె అధికముగ చెప్పజాలము. తక్కువ యొప్పుకొనజాలము. ఇత్యాదియే మాసిద్ధాంతము. దీని నెన్నడును విడనాడజాలము."

మిత్రులారా! కామ్రేడు పత్రికలోని నాదీర్ఘవ్యాసభాగములచే మిమ్ముల విసిగించియుందును. నాయుద్దేశము నెఱింగెదరేని మీరు నన్ను దప్పక మన్నింతురు. ఎట్టి అన్యాయములకును, నిరంతర నిర్లక్ష్యములకును గురియైనను మేమెట్టి సహనమును బ్రదర్శించితిమో దెల్పుటకును భారతవర్షమున వసించు మహమ్మదీయు లెట్టి సద్భావములు గ్గి మెలంగిరో లోకమునకు జాటుటకును, యీవ్యాసభాగము నిందు వివరించితిని.

## టర్కీపట్ల భారతీయ మహమ్మదీయుల భావము

టర్కీ యుద్ధరంగమున ప్రవేశించుటకు పూర్వము, ప్రభుత్వప్రేరణవలనను వారిద్వారాను కీర్తిశేషులైన తలాట్ పాషాగారికి యుద్ధప్రవేశమును గూర్చి బహుజాగరూకతతో నాలోచించి దిగవలయునని

డాక్టరు అన్సారీగారితో కలసి నేను తంతివార్త నంపితిని. లండను టైమ్సు మొదలగు పలుకుబడిగల పత్రికలయొక్క దుష్టములగు బెదరింపులచే టర్కీ యుద్ధమున ప్రవేశించుట తప్పని సరియగుసమయమున కూడ "టర్కీయొక్క కర్తవ్యమును" గూర్చి నాచే వ్రాయబడినట్టియు, దీర్ఘమయినట్టియు, ఆంగ్లపత్రికా సంపాదకులచే మెచ్చుకొనబడి తమపత్రికలయందనువదింపబడినట్టియు, టైమ్సునందలి వ్యాసమునకు ప్రత్యుత్తరమైనట్టియు, 'కామ్రేడు'నందలి వ్యాసముచేత, హైందవమహమ్మదీయులు తమవిదేశీయప్రభుత్వమునకు సహాయముచేయుటకెంతవరకు సిద్ధపడిరో తెల్లముకాగలదు. విపులదీర్ఘాలోచనముచేసి తేల్చినట్టియు, ముసల్మానులకు తమనిశ్చితతీర్మానముగా చేసికొనుడని సలహా నిచ్చినట్టియు నా వ్యాసమునందలి యభిప్రాయముల నిందు బొందుపరచుచున్నాను:

"నిజమైన దేశభక్తులందరును, హక్కులకొరకధికారవర్గముతో తమరుసల్పు నాందోళనాధ్యాయమును కట్టిపెట్టి దానివయిపున కిప్పటిలో దృష్టిని మరల్పజాలరు. మనమనుభవించు నిబ్బందులును, మనము కోరుచున్న సంస్కరణములును నెట్టివైనను, యింతకంటె తగినసమయముకొరకై వేచియుండగలవు.

"మన సమస్తకోరికలును తీర్చబడినను అనగా మనము కోరువగతులకు సమ్మతించుచు మనకు మహమ్మదీయ విశ్వవిద్యాలయమొసంగబడినను, పత్రికాశాసనము రద్దుచేయబడినను, యింతయేల— సంపూర్ణస్వాతంత్ర్యము లొసంగబడినను, నిప్పుడిట్టివిషయములకు తరుణము కాదని ప్రభుత్వము వారియెడల నమ్రముగ నివేదించి యట్టి సంస్కరణములను వందనములతో నిరాకరింపవలసియున్నది. శాంతికాలమే సంస్కరణముల నిచ్చిపుచ్చుకొనుటకు తగిన కాలము. మనము రష్యాదేశమునందలి పోలులవంటివారము కాము! మనకు లంచము పెట్టనవసరము లేదు!"

'మార్నింగుపోస్టు'యొక్క కలకత్తావిలేఖరి వంటివానికికూడ నట్టియుద్దేశ్యము సమంజసముగానే గన్పట్టెను. అయినను, యీవ్యాసమును వ్రాసినందులకే నా 'కామ్రేడు' పత్రికా ముద్రాశాలయొక్క ధరావతును కోల్పోవుటయు, తత్ఫలితముగ నాపత్రిక నాపివేయుటయు తటస్థించుట చిత్రము!! అట్టి సందర్భముననే యింగ్లండునందలి ప్రసిద్ధవారపత్రికలలో నొకటియగు 'న్యూస్టేటు మను' పత్రిక "భారత దేశమున రాజభక్తిని ప్రోత్సహించుట"యను పరిహాసగర్భితమగు శీర్షికతో వ్రాసిన [illegible]నవ్యాసమువ యుండియూ ప్రభుత్వమును తీవ్రముగ ఖండించెను. టర్కీతో యుద్ధము సాక్షాత్తుగ సంభవించినప్పుడు, భారతీయ వార్తాప్రచురణసంఘముయొక్కయు, రూటరుయొక్కయు, ప్రతినిధియొకడు ఢిల్లీలో నాతో సంభాషించి, తరువాత మరియొకమారు కలసినపుడు రాజప్రతినిధియును సంభాషణము నాపత్రికలలో ప్రచురించుటకు పూర్వమే చదివి యానందించిరని నాతో చెప్పెను. టర్కీతో నింగ్లాండునకు యుద్ధము తటస్థించినను, భారతీయ మహమ్మదీయుల రాజభక్తినిలిచియే యుండునని నేను పెక్కు పత్రికలలో వ్రాసియుంటిని. ఇప్పుడుకూడ నావిశ్వాసము గట్టిగ నిల్చియే యున్నదని సంభాషణనందు తెల్పితిని. భారతదేశముయొక్క శాంతిని కాపాడుటకుగాను, ఆత్మలను భగవదర్పణము చేయుచు యుద్ధమున మాత్రము ప్రభుత్వమునకు సాయము చేయవలయు నని నేను ముసల్మానులను కోరితిని. పరస్పరము పోట్లాడుకొనుదంపతుల సంతానముయొక్క స్థితితో వారిస్థితిని పోల్చితిని.

"తల్లిదండ్రులలో న్యాయాన్యాయము లెవ్వరివైనను, ఎల్లప్పుడు దానివలన నిబ్బంది వచ్చునది సంతానమునకే కదా."

## మహమ్మదీయుల "రాజభక్తి"యొక్క పరిమితి.

ఈ సంభాషణమునందును, 'కామ్రేడు' పత్రిక యంతరింపక పూర్వము వ్రాయబడిన యంత్యవ్యాసమునందును కూడ, బ్రిటను చేతను తన్మిత్రులచేతను, మహమ్మదీయమతమును గూర్చియు, తత్పవిత్రక్షేత్రముల గూర్చియు చేయబడిన పవిత్రవాగ్దానమువై, ముసల్మానులు సంపూర్ణవిశ్వాసము కలిగియున్నారని గట్టిగ చెప్పితిని. అరేబియాదేశముపై దండెత్త గూడదనియు, పవిత్రక్షేత్రములపై స్వతంత్ర మహమ్మదీయరాజ్యముయొక్క యధికారమున కెట్టి భంగమును కలుగగూడదనియు నేను నొక్కి వక్కాణించితిని. మతరాజభక్తులలో వారి రాజభక్తియే మాకు కావలయును గాని, వారి మతమెట్లైనను మాకు జోక్యము లేదని, మన మహమ్మదీయేతరప్రభుత్వమువారక్షిప్రాయమే పడుచో, భారతీయ ముసల్మానుల యీ మాత్రపు కోర్కెలనైనను పాటింపవలెనా? ప్రతివాడును ఏవిషయముల రాజాజ్ఞకు లోబడవలయునో, యేవిషయముల దైవాజ్ఞకు లోబడవలయునో తెలిసి ప్రవర్తింపవలయు నను క్రీస్తునాజ్ఞలను తప్పక భారతీయ ముసల్మానులు నిర్వర్తింతురని చెప్పి నా సంభాషణమును పూర్తి చేసితిని. వార్తాపరీక్షాధికారి తమ మతమునందాసక్తి గల క్రైస్తవుడయ్యు, మిగిలినవార్తనంతయు నున్నది యున్నట్లుంచి, యేసుక్రీస్తునాజ్ఞగలభాగమును మాత్రమే కొట్టివేసెనని, యీసంభాషణమును వ్రాసికొనిన ప్రసిద్ధపత్రికాప్రతినిధి నాకు తెలియజేసెను. దూరదర్శియగు నా యధికారి మతముకంటె రాజ్యాంగమే ప్రధానమని తలంచెగాన, రాజునెడల కర్తవ్యమును వారికి తెలిపినయెడల, వారికి మతముపట్ల చూపవలసిన కర్తవ్యమెక్కడ జ్ఞప్తివచ్చునో యని భయపడెను కాబోలు!

## మస్లిము మతతృణీకారము; వారి హక్కులయెడ నిరసనము

అచిరకాలముననే నేను చెప్పినట్లు జరిగెను. మనయెడల వారిచే చూపబడిన కృతఘ్నతయొక్క చరిత్రము కేవలము మొన్నమొన్నటిదగుటచే దానిని విపులముగ తెల్పుట యనావశ్యకము. యుద్ధకాలమున ఖాలీఫాపైనను, మతరక్షణకొరకై పోరాడువారిపైనను యుద్ధముచేయుచున్న మన ప్రభుత్వమునకు, తమ మతధర్మములకు విరుద్ధమైనను కూడ, భారతీయ మహమ్మదీయులు సాయముచేయవలెనని

్రను. సిరియా, పాలెస్తీనా, మెసపొటేమియా, భాగములుగాగల కీరతుల్ అరబ్ దేశము, తమ మతధర్మానుసారముగ నెన్నడును మహామ్మదీయేతర పాలనమునందుండునట్లొప్పకొనకుండుట విధియై యుండగను, బ్రిటనుచేతను తన్మిత్రులచేతను నది యాక్రమింపబడి, వారిమతకర్తయొక్క యంత్యాజ్ఞావిరుద్ధముగ నిప్పటికిని విదేశీయ పాలనమునందే యున్నది. మతకర్తయొక్క వంశీయుడును మహామ్మదీయమత పాలకుడును నగు ఖాలీఫా యధీనమునుండి మహామ్మదీయుల పవిత్ర క్షేత్రము లపహరింపబడెను. ఆ క్షేత్రములు కేవలభవనములవలె చిన్నవికావు. విశాలదేశభాగములు. ఖాలీఫాయే వానికి ధర్మానుసారముగ పాలనకర్త. వానిలో నత్యంతపవిత్రములగు మెక్కా, మెదీనా, జెరూసలెమను మూడు పవిత్రనగరము లిమిడియున్నవి. ఈనాటికిని వాని నాక్రమించి పాలించి కాపాడునవకాశము ఖాలీఫాగారికి కలుగకపోయెను. ఖాలీఫాగారి రాజ్యము విచ్ఛిన్నముచేయుటయు, అందలి భాగములపై మహామ్మదీయేతరపరిపాలనమును విధించుటయు, విమత రాజ్యముల యొత్తిడిచే, టర్కీని తేనస్వమతమును రక్షించుకొనజాలనంత బలహీనము జేయుటయు, తమవిధ్యుక్తధర్మము లని మిత్రమండలిలోని రాజ్యములన్నియు గొంతెత్తిచెప్పినవి. అట్లనిన కోరినవారిలో తుదివరకును భూత్తుగ నిర్దయతో వాదించిన దొక్క బ్రిటనుదేశమే.

రణధర్మములకును శాంతిధర్మములకును కూడ విరుద్ధముగ తాత్కాలికసంధియైనతరువాతకూడ పైని చెప్పిన నిరంకుశవిధానము నమలులోనికి తెచ్చుటలో గ్రీసుదేశ మింగ్లాండుచే నియమింపబడిన ప్రతినిధియయ్యెను. లానేనుసంధిలో యిస్మతుపాషాగారికి మిత్రమండలివారందరునుకూడ విఘ్నముల గల్పించినను ఈ విషాదకరమగు చరిత్రయొక్క తుదివరకును ఘాజీముస్తఫా కమాల్ పాషాగారి కింగ్లాండే ముఖ్యప్రతికక్షి. మహామ్మదీయేతరులచే బలవంతముగ నాక్రమింపబడినట్టియు పరిపాలింపబడుచున్నట్టియు దేశములందలి మహామ్మదీయులకు స్వయంనిర్ణయాధికారమును నిరాకరించుట మొదలగు పరోక్షసాధనములచే కూడ మహామ్మదీయ ప్రజలును రాజ్యములును శిక్షింపబడిరి. పరిస్థితు లిట్లుండ శాంతిసభయందు ప్రాతినిధ్యము లేకపోవుటచేతను, మిత్రమండలిసభా వేశములలో ప్రాతినిధ్యమున్నను ప్రతినిధులనబడువారు నిజమైన ప్రజాప్రతినిధులు కాకపోవుటయును గాక పత్రికాశాసనము, హిందూ జేశరక్షకశాసనము, 1818 సంవత్సరపు 3 వ సూత్రమును, ఇవిచాలక దేశమునందు కొన్నిభాగములలో నీపైవానికి తోడుగ సైనికశాసనమును నుపయోగించుట మొదలగు హేయములయినట్టియు భయంకరములైనట్టియు నిరంకుశాయుధములచే భారతమహామ్మదీయాభిప్రాయముల నణచుటకు ప్రయత్నములు సలుపబడెను.

## కాలము పునస్సమ్మేళనమునకు తగియుండెను

మహామ్మదీయ రాజ్యముల యెడలను, ప్రజలయెడలను దానిచే జూపబడిన విరోధమునకు ఫలితముగ దానికొరకన్ని విధముల త్యాగము గావించినను నీవిదేశమహామ్మదీయేతర ప్రభుత్వముయొక్క సహాయ సానుభూతులపై యాధారపడియుండుట పొరబాటునియు, తమకు నిజముగ సహాయసానుభూతులు వలయుచో హిందూదేశమునందలి సోదరమతసంఘములతో న్యాయమైనట్టియు శాశ్వతమైనట్టియు సంధి చేసికొనవలయుననియు, భారతీయమహామ్మదీయుల యభిప్రాయములు మారెనని మున్నె విన్నవించితిని. తూర్పుబంగాళమునందలి మహామ్మదీయుల యెడల చూపబడిన ద్రోహముచేత నైయభిప్రాయములే నిజమైనవని స్థిరపడిపోయెను. అంతియెగాక మరల హిందూమహామ్మదీయమైత్రి యేర్పడుటకు తగినకాలము తటస్థించెను.

## వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే

యనునట్లు వ్యవహారములందును, మైత్రియందును, పరిణయమునందును, బాంధవ్యమునందును, యెవ్వరెవ్వరు కలియనున్నారో వారి వారికి భేదములు తక్కువగను, సామ్యము లెక్కువగ నుండుట యవసరము. రాజకీయమున కూడ ఈసూత్రము వర్తించుచున్నది. సంపన్న, దరిద్రులయొక్కయు, బాలవృద్ధులయొక్కయు, పండితపామరులయొక్కయు, కలయిక, సంభవమేయైనను, సర్వేసర్వత్ర కనప్పట్టువిషయము కాదు. ఒక్కతరమునకుపూర్వము బలవంతులను దుర్బలులను నొకకాడినకట్టి నడపుటకును ప్రతిఘటించుట సయ్యదుఅహమ్మదుఖాను గారిసహజదూరదర్శిత్వమును చాటుచున్నది. మింటో-మార్లేసంస్కరణములనుగూర్చి చర్చింపబడుచున్న కాలమున, రాజ్యాంగవ్యవహారములలో ముఖ్యముగ కావలసిన స్వపక్షనిర్వాహణదీక్షను కొంత సంపాదించిరి. ట్రిపోలీయుద్ధము సంభవించిన దాదిగ వారు ప్రభుత్వముయొక్క నిర్బంధవిధానమును ప్రతిఘటింపవలసియే వచ్చెను. భారతభూమియందలి మహామ్మదీయ సంఘము, తనకంటె రాజకీయవ్యవహారములయందు ముందంజవేసిన సంఘములతో కలసికొనుటకీమహాత్కాలమున బహుపట్టుదలతో శ్రమపడి దాదాపు వానితో కలిసికొనగలిగెనని చెప్పటలో నాకు నాసంఘమును పొగడుకొను నుద్దేశ్య మెంతమాత్రమును లేదు.

## కలయిక

మేము నిర్బంధితులమై యుండ, నేనును నాసోదరుడును సూచించిన ప్రకారము, 1915 సంవత్సరమున మహామ్మదీయమహాసభ బొంబాయి నగరమున సమావేశమాయెను. ఇచ్చటనే ఆసంవత్సరము కాంగ్రెసు మహాసభయు జరుగనుండెను.

చిరకాలము కాంగ్రెసు వ్యవహారములలో బాల్గొనినధీరుడు మజురల్ హకుగారీ మహామ్మదీయమహాసభకు మహావైభవముతో నధ్యక్షు డయ్యెను. ఈతడు, మహామ్మదీయ మహాసభాసంస్థాపకులలో పేరెన్నికగన్నవాడు. మహామ్మదీయులందరును, ముప్పదిసంవత్సరముల క్రిందట సయ్యదు మహమ్మదుఖాను చెప్పిన మార్గముననే నడచుచు కాంగ్రెసు మహోద్యమము పట్ల, వైమనస్యమును చాటుచున్నను, ఈతడు మాత్రము ధీరుడై కాంగ్రెసునే యనుసరించియుండెను. కాంగ్రెసు, మహామ్మదీయ, మహాసభల ప్రముఖుల రావించి యొక్కచో సమావేశ మొనర్చి, యుభయకక్షులకును మైత్రి సమకూర్చుటకై యొక సభగావింప మహామ్మదీయసంఘముచే నీత డనుజ్ఞాతు డయ్యెను. జిన్నా

గారి ప్రేరేపణయు, సభాధ్యక్షుని బలసత్త్వములును, మహమ్మదీయుఁడై సుప్రసిద్ధ దేశభక్తాగ్రగణ్యుఁడైన, మౌలానా హాజరతు మోహినీ గారి అకుంఠితధైర్యసాహసములును, అన్నియు గలసి, యీయుభయకక్షుల కును, నైకమత్యమును నొనగూర్ప తోడ్పడెను. ఈ కలయికయే, యితి హాసప్రసిద్ధ మగు, లక్ష్మణపుర యొడంబడికకు కారణభూతమై చెన్నారెను.

మహమ్మదీయ సంఘాభ్యుదయ మెంతత్వరితగతిని బెంపొందెనో యొకానొక మహమ్మదీయవిమర్శకుడు గావించిన హాస్యరసపూరిత మగు నీక్రింది విమర్శనలబట్టి సుబోధక మగును:—"బొంబాయినగర మున జరుగనున్న అఖిలభారతజాతీయమహాజనసభ కధ్యక్షుఁడును, వంగదేశీయుఁడు నగు లార్డుసింహాగారును, పరిసరరాష్ట్ర మగు బీహారు నందు వసించు సోదరన్యాయవాది మగు, మహమ్మదీయమహాజన సభ కధ్యక్షుఁడును నగుమజారుల్ హాక్కు గారును, నొక్క రైలుబండి మీదనే బొంబాయి నగరమునకు బోవుచుండుట తటస్థించెను. అట్లిద్దరును గలసి బొంబాయికి బయన మొనర్చుచు, పోల్చిచూచుకొనుటకై వీరలొండొరులు తమ యధ్యక్షకోపన్యాసముల, యడిగి తీసికొని పొరబాటున నెవరి యుపన్యాసముల వారు మరలదీసికొన మరచిరట. అంతట విధివశమున మజారుల్ హాకు గారు, నిశితవాగ్జాలపూరిత మగు వంగదేశీయుని యుపన్యాసము తనమహమ్మదీయ సభాస్తారులకు జదివెనట. నిరంతరరాజభక్తిపరాయణు డగు మజారుల్ హాకు గారి రసవిహీనమై యుత్సాహభావశూన్యమైన యుపన్యాసమును సింహాగారు తన ప్రతినిధులకు జదివి వినిపించెనట."

బొంబాయిసమ్మేళన మెట్టి యనివార్యమగు, భావిపరిణామము లను గారణభూతముగా నుండెనో, ఆంగ్లప్రభుత్వమున కీపట్టున గోచరించెను. ఇట్టి శుభసూచనలతో ప్రారంభమయిన మహమ్మదీయ మహాసభను ఏతత్సభాకార్యనిర్వాహకులు రహస్యముగ ముగింపవలసి వచ్చెను. ఈవిషయము, ఇతిహాసప్రసిద్ధము. కాంగ్రెసు మస్లీము మహాసభ లంతటనుండియు ప్రతిసంవత్సరమును, నొక్కచోటనే సమావేశమై, సంపూర్ణసంయోగభావములతో కార్యనిర్వహణ మొనర్ప దొడంగెను. భావిఫల మనివార్యము. ఈ సందర్భము ప్రభుత్వమువారలు ముందే గ్రహించి యుండుదురు. అహమ్మదాబాదునగరమున కాంగ్రెసు మహాసభాధ్యక్షపీఠము నధిష్ఠింపవలసిన, తరుణమున ఏతత్సభాధ్యక్షుఁడు, అలీపూరు కారాగృహమున బంధింప బడియుండె. ఆసంవత్సరమే మస్లీము మహాసభాధ్యక్షపదవి నలంకరించిన, ఏతత్సభాధ్యక్షుఁడు తన యధ్యక్షకోపన్యాసకారణమున సార్వభౌమునితో రణమునకు బెట్టె నను నెపంబున, విచారింపబడ్డి, న్యాయవిచారణసంఘము (జ్యూరీ) ఆతఁడట్టి దోషము నొనర్పలేదని నిర్ణయించినను, రాజద్రోహ మొనర్చెనని శిక్షితుడై అహమ్మదాబాదు కారాగృహమున బందీయయ్యెను. బంగాళము నందును తదితరప్రాంతములందును, చిత్తరంజనుడు స్వరాజ్యపక్షమునకై దిగ్విజయము జేకూర్చుచుండ, హాజరతు మోహినీ మహాత్మునితో బాటు యెర్రవాడచెరసాలలో నిర్బంధావాస మనుభవించుచుండెను. ఇంతియ కాక, ఖైదీలు నేరములుచేయుటకు అవకాశములు దక్కువగనున్నను, హాజరతు మోహినీ గారట్లో తనశిక్షను ద్విగుణీకృత మొనర్చుకొని, వరలో జ్యూరీ గావించిన పొరబాటును సవరించి, గౌరవప్రద మహమ్మదీయసంఘమున కెంతయు, గీర్తిసంధాయకుడయ్యెను.

## నిఖిలభారతీయక్షేమమును మహమ్మదీయులు గుర్తించుట

నిరంతరమును విదేశపరిపాలకుల తోడ్పాటునకే యాసింపక సోదరసంఘములపై నపోహల దరిజేరనీయక మహమ్మదీయ సంఘముల క్షేమమును బరిరక్షించుటతోడనే యంతయు దీరిపోవలేదు. భారతీయులకును, భారతవర్షమునకును గావింపబడు యన్యాయపరంపరల జూచి, మహమ్మదీయులు, యుపేక్షవహించినయెడల వారలు, మాతృవాతీతులగుదురు గావలయు, పశుప్రాయులైనను గావలయు. ఆంగ్లేయ దొరతనము, ప్రజల కెూడవినకష్టముల నెప్పుడో యొకప్పుడు, నివారింపక పోరని తమనాయకులింతవరకును నుద్బోధించియుండుటచే, మహమ్మదీయులు, "తొందరయేల, నిదానించి చూచెదముగాక" యనుసిద్ధాంతము నవలంబించి, చిరకాలము నిదానించిరి. కాని వారు జూచినదేమి? భారతీయులకుజరిగిన యన్యాయపరంపరలు, దుష్టశిక్షణ మొనర్చినదియు లేదు. దుర్ణయము లొనర్చినవారిని బశ్చాత్తప్తుల జేసినదియును లేదు. ఎట్టకేలకు వారలయోరిమి దరిగిపోయెను. ప్రతిసంవత్సరమును మహమ్మదీయులు తండోపతండములుగ కాంగ్రెసు సభ్యులుగ జేరిపోవదొడంగిరి.

ఇయ్యది యెంతయు శుభసూచకము. ఏలనన మహమ్మదీయులిప్పుడు, స్వల్పములగు ప్రత్యేకసంఘశ్రేయముల నే గాక నిఖిలభారత క్షేమమును బరీక్షించుటగూడ వారివిధ్యుక్తమేయని, వారలు గుర్తింప నారంభించిరి. మహమ్మదీయు లంతమాత్రమున, భారతీయులు గాకపోలేదని వారలు, మునుపటికంటె నెక్కువగ గుర్తింపసాగిరి. కలకత్తా, బొంబాయి, ఢిల్లీనగరములలో జరిగిన భారతీయమహాసభలు "జాతీయ" బిరుదునామమును సార్థకముజేసికొనెను. ముప్పది సంవత్సరముల క్రిందట తాత్కాలికావసరములబట్టి కాంగ్రెసు మహాసభకు బోగూడదని సయ్యదు అహమ్మదుగారు గల్పించిన యాటంకముల సంపూర్ణముగ దెగనాడి 1919 సంవత్సరమున అమృతసరమున గావింపబడు కాంగ్రెసు మహాసభకు బోవుడని మహమ్మదీయ జనసంతతుల బురికొల్పిన మహాపుణ్యము డయ్యరు సేనానికి దక్కెను. అమృతసర కాంగ్రెసుమహాసభ యట్లు భారతజాతీయవికాసమును బ్రకటన మొనర్చెను. డయ్యరు సైనికభటులు విడిచిన తుపాకిగుండ్లు హిందూమహమ్మదీయ విభేదములను బాటింపలేదు, మహమ్మదీయులకంటెను రాజభక్తిపరాయణులగు మనసిక్కువీరులు గూడ హిందూమహమ్మదీయులతో బాటు తమరక్తధారలచే నమృతసరపుణ్యభూమిని దడిపి రక్తసిక్త మొనర్ప భగవాను డుద్దేశించెను.

## మహాత్ముని యాగమనము

జలియనువాలాబాగునందు ప్రజ లనుభవించినకష్టము లనాహూతములు, సంతోషముతో ననుభవించినవి కావు. సిమ్లాను పాలనకర్తలు

చాలమున సైనికశాసనమును బ్రయోగించి బీభత్సపరిపాలనమును రపి తద్రాష్ట్రప్రజలభయభ్రాంతులజేసి నిశ్చేష్టితుల నొనర్చివైచినట్లు గాన్పించెను. కాని అందరును గలసి బాధల ననుభవించుటవలన పాంచాలదేశీయులకు జాతీయమతాభావములు స్ఫురించెను.

ఇందులకు విషాద మొందినది యొక్క పాంచాలరాష్ట్రమే గాదు. దేశారాధకు లెందరో పాంచాలదేశమునకు బోవదొడంగిరి. ఈమహా సందిగ్ధకాలమున జరిగిన యితిహాసప్రసిద్ధ మగు విషయము మహాత్ముని యాగమనము. వారలు సయితమిది ప్రసిద్ధమగు విషయ మని యొప్పుకొందు రని నానమ్మకము. మీకెల్లరకును, ప్రపంచమున తక్కిన రాజ్యములలోని ప్రజలకును, మహాత్ముని యద్భుతకథనము తెలిసియే యుండుటచే మరల నిచ్చట వివరింప నవసరము లేదు. భారతవర్షమున న్యాయము గల్గనిచో, భారతభూమికి స్వరాజ్యము లభింపనిచో, ఖండాంతరముల వసియించు హైందవులకు న్యాయము గల్గునని తలంచుట వెర్రియని మహాత్ముని దక్షిణాఫ్రికా యనుభవములవలననే యాతనికి దెల్లమయ్యెను. దీనియర్థము బ్రిటీషు సామ్రాజ్యముతోడి సంబంధము దెగిపోవలయునని గాదు. ఎవనియోరిమి ప్రశంసాపాత్రమయ్యెనో అట్టిమహాత్ముడే గాక, అంతసమానము గలదని చెప్పుకొన నేరని నావంటి యాతని యనుచరులుగూడ కడపటి నాలుగువత్సరముల నుండియును మహాకష్టము లనుభవించుచుండినను, భారతవర్షమునకు దగినస్వరాజ్యము బ్రిటిషుసామ్రాజ్యముతోడి సంబంధమునకు విరుద్ధము కాదని యిప్పటికిని నమ్మెదరు. కాని బ్రిటిషు పరిపాలకుల హృదయము మార్పునొందవలయును. వారలు పూర్వ మొనర్చిన యకార్యములకు ప్రాయశ్చిత్తము చేసికొనవలయును. మహాత్ముడు మాతృదేశమునకు దిరిగివచ్చినది నిక్కముగ దాస్యబంధనములనుండి భారతభూమిని దప్పించుటకే.

కాని మహాత్ముడు విశ్వసించినట్టియు తనసోదరదేశీయుల కుపదేశించినట్టియు మార్గములు రాజకీయములే. ప్రధానమైన పాశ్చాత్యఖండమున రాజకీయము లని పిలువబడునట్టివి కావు. మానవకళ్యాణమునకే యవతరించిన మహాప్రవక్తలకు వలెనే యీ యనను తత్వశాస్త్రజిజ్ఞాసకై విభాగ మెట్లున్నను జీవితము నిశ్చయముగ భిన్నభావసమ్మేళనము. ఆయనదృష్టియందు మతరాజకీయములు పరస్పరవిరుద్ధములు గావు.

## క్రీస్తుయూదులును: సమాన పరిస్థితులు

అతడొనర్చిన యుపదేశములబట్టియు అతడనుభవించిన కష్టములబట్టియు మహాత్ముని క్రీస్తుతో బెక్కండ్రు పోల్చుచున్నారు కాని యీ యుపమానము పలువురు గుర్తించినదానికంటె నింకను జాలవఱకు వర్తించును. క్రీస్తు యూదుడై జన్మించెను. వాని యనుచరులందరును అతడు దావీదువంశమున జన్మించిన దేవదూత యనియు, అంతరించిపోయిన యూదుల స్వాతంత్ర్యాధికారముల మరల వారికి జేకూర్ప నవతరించెననియు యాతనిని శ్లాఘింప దొడంగిరి. సమేరియా రాజ్యమున వసియించిన దశజాతులకథనమువలన పాపపరిణామధర్మము విదితమయ్యెను. పెద్దకాల మీజాతులు దుష్కృత్యముల గావించి ధర్మగ్లాని యొనర్చుటచే తత్పాపఫల మనుభవించిరి. ఇయ్యది యితిహాసరంగమున జరిగిన గొప్ప విషాదకథనము. క్రీస్తు జన్మింపక పూర్వ మేడువందల సంవత్సరముల క్రిందట నీదశజాతులును అస్సీరియా రాష్ట్రముచే బరాభూతులై హతము గావింపబడిరి. హతశేషులు చెల్లాచెదరైరి.

ఈ పాపపరిణామసూత్రము మరల నూటపాతిక వత్సరములకు బిమ్మట, పాపకృత్యము లొనర్చుటలో వీరికి దీసిపోవని జూడియా ప్రజల విషయమునగూడ నిక్కమయ్యెను. బాబిలోనియా దేశాధీశ్వరు డగు, 'నెబుకాడ్నెజారు' నృపాలుడు, సోలమనుచే నిర్మింపబడిన దేవాలయమును విధ్వంస మొనర్చి యూదుల బందీలగా గొని దేశభ్రష్టుల గావించెను. అప్పటినుండియు యూదులు పగదీర్చుకొనుటకును, పోగొట్టుకొనిన స్వాతంత్ర్యాధికారముల మరల సముపార్జించుకొనుటకును దలంపుగొనిరి. 'సైరసు' విజయమువలన వారల యాసలు ఫలించిన ట్లగపడెను. దేవాలయ పునర్నిర్మాణము ప్రారంభమయ్యెను. దావీదువంశజన్ముడైన, జెరుబ్బాబిలు, వారల కెన్నటికైన స్వాతంత్ర్యసంపాదన మొనర్చి కీర్తిగాంచునని యాతనిపై యాశబెట్టుకొనిరి. దావీదువంశము, జెరుబ్బాబిలుతో పునర్జీవితమై; దేవదూత జ్యోతిషము నిజమయ్యెనని తలంచిరి. కాని యీ కాలమున దేవదూత జ్యోతిషము ఫలింపలేదు. జక్కరయా సింహాసన మధిష్ఠించినంతనే జెరుబ్బాబి లదృశ్యుడయ్యెను. అతడేమయ్యెనో తెలియదు. అతడెన్నడును గిరీటము దాల్పలేదు. అతడు పితరుల సింహాసన మధిష్ఠింపలేదు. యూదులిక నెన్నండును స్వాతంత్ర్యసౌఖ్యము ననుభవింప నీశ్వరు డనుగ్రహింపలేదు. కాని గ్రీకులును, రోమనులును, రాజ్య మేలినంతకాలమున, యూదులు తమ యాశల వీడలేదు. గ్రీకు రోమక నాగరికతలు, మహావైభవముతో ఆసియాఖండమునకు వెడలినప్పుడు, యూదులకు మరల ఆశలు చిగిర్చెను. న్యాయాధికారియై పగదీర్చునని, యూదులు దేవదూత నెంతయు బ్రేరేపించిరి. పరిభవచింతానలముచే క్రాగి, దురభిమానప్రేరితులైన యీ యూదులలో జనించిన క్రోధాగ్నిని జల్లార్చుటకై ప్రపంచమంతను నల్లలాడింపగల యొక మహావిప్లవము, ఒక పునరుద్ధారణ, మావశ్యకమయ్యెను.

రోమకసామ్రాజ్యమునుండి యొకవిధముగ స్వాతంత్ర్యమును సంపాదింపగలిగిన "హెరాడ్" ఏసుక్రీస్తు జనన మొందిన సంవత్సరప్రాంతముననే చనిపోయెను. అతని ముగ్గురుకుమారులును ఆంగ్లేయుల పరిపాలనక్రిందనున్న మన "రాజా" లస్థితిని బోలి, రోమనులకు సామంతులైరి. ఏసుక్రీస్తు బాల్యమునందు రోమచక్రవర్తియగు "అగస్టసు" యెరూషలేము పట్టణపాలకుడైన "ఆర్కిలాసు"ను పదభ్రష్టుని గావించినపిమ్మట, స్వపరిపాలనాఛాయ యైన లేకుండ వశించెను. అంతటనుండియు సామ్రాజ్యప్రతినిధిచే పరిపాలింపబడు, సిరియారాష్ట్రమునందు "జూడియా" యొక అంతర్భాగమైపోయెను. క్రైస్తవమత చరిత్రయందు ప్రసిద్ధిగాంచిన "పాంటియస్ పైలాటు" లోనగు పరిపాలకులు పలువురు రోముపక్షమున నధికారము నిర్వహించుచు ముఖ్యవిషయములలో సిరియాను పాలించు రాజప్రతినిధికి లోబడి వీరందరును

తమపాలనయందున్న ప్రజలలో, నిరంతరము ప్రజ్వరిల్లుచుండిన మహానలమును చల్లార్ప విశ్వప్రయత్నము లొనర్చుచుండిరి. యూదుల మతావేశమువలన రగుల్కొల్పబడిన యశాంతి యాకాలమునందంతటను యెరూషలేము పట్టణమును కలవరపరచుచునే యుండెను. తమప్రాణములకైన సరకుజేయని మతావేశపరులు ప్రతిదినమును రోమకపతమును నిర్మూలింపవలెననియు, హెరడ్ ప్రభువుల కాలములో యూదుమతమునకు విరుద్ధముగ నెలకొల్పబడిన చిత్రకళానిర్మాణముల ధ్వంసము గావింపవలెననియు యత్నించుచునే యుండిరి. "సమారిటను"లు కూడ నిట్టియుద్యమములచే నావేశింపబడి యుండిరి. యూదుల సిద్ధాంతములకు వ్యతిరేకముగ ప్రవర్తించినవారి నెల్లరను సంహరించుటయే తమ ధర్మమని విశ్వసించి, అందులకు సంసిద్ధులైయుండిన "జెలోట్సు" "సికారియై"యను రహస్యహంతకులును బయలుదేర నారంభించిరి. వీని యన్నిటికంటెను ఏసుక్రీస్తునకు సంబంధించినయుద్యమ మొకటి యుండెను. అందు ప్రధానుడు "లీలియా" వాస్తవ్యుడగు "జూడసు" విదేశీయ ప్రభువులచే పన్నుల విధించుటయందుపయోగింపబడుటకై ప్రారంభింపబడిన జనాభా పద్ధతి ప్రజలకెల్లరకును ఏహ్యముగ నుండెను. క్రైస్తవశకము ౬ వ సంవత్సరమున నేర్పాటు గావింపబడిన జనాభావలన విదేశీయ ప్రభుత్వమునెడ గల మతవిద్వేషము మరింత ప్రబలి దేశమునందల్ల కల్లోలము కాజొచ్చెను. యూదుల ప్రతిభాన్విత కార్యములకెల్ల పుట్టినిల్లనదగు నుత్తరప్రాంతమునందు విప్లవము ప్రారంభమయ్యెను. ఫ్రెంచి చరిత్రకారుడగు "రెనాన్" చెప్పినట్టులు, "ఎల్లరును నొకమహాత్ముల ముదయింపనున్నదని విశ్వసించిరి. మతగ్రంథములకు వివిధములైన విపరీతార్థముల కల్పించి తమతమ ల యాశలన్నిటిని ధ్రువపఱచుకొనసాగిరి. ధర్మాత్ములకు శాంతిని ప్రసాదించి, భగవన్నిర్దిష్టకార్యమును శాశ్వతముగ సఫలమొనరింపనున్న, భావిరాజ్యస్థాపనా సూచనలును విధానములునుకూడ ప్రాతనిబంధన గ్రంథములందలి ప్రతిపంక్తియందును వారికి గనుపట్టినట్లయ్యెను."

## ఏసుక్రీస్తు గావించిన నైతికపరివర్తనము

ఏసుక్రీస్తు తనమతబోధనముపక్రమించుసమయమునకు ప్రపంచ పరిస్థితుల పరికించి, సంస్కరణసాఫల్యమునకై నేమార్గము నవలంబించి, యెట్టిసాధనముల నుపయోగింపవలెనో ముందుగ నిర్ణయించుకొనవలసియుండెను. పశుబలప్రయోగము అన్ని సందర్భములందును త్యాజ్యమని ఏసుక్రీస్తు దృఢముగనమ్ముటచే, అహింసాతత్త్వమునందే సంపూర్ణవిశ్వాస ముంచెనని, క్రైస్తవమతాచార్యులు బోధించుచున్నారు నేనట్లు దలపను. దేశకాలపాత్రములబట్టి యప్పటికి దౌర్జన్యపద్ధతుల నవలంబించుట యసంభవమని ఆయన తలంచినందుకలననే ఆయన అనిరోధపద్ధతిని చేపట్టెనని నమ్ముచున్నాను.

అనగా, పశుబలమును ఆత్మసమర్పణచే నిర్జింప నిశ్చయించెను. అటుతరువాత కర్బలా రణరంగమున 'హుస్సేను' సైత మటులనే గావించిననుభయులకు భేదమేమన హుస్సేను పాణితలమున ఖడ్గము ధరించియే మరణించెను. క్రీస్తుచేసికొనిననిర్ణయమునుగూర్చి మనయభిప్రాయమెట్లున్నను 'జూడస్'వంటి ఆనాటి కేవలరాజకీయసంస్కర్తలకునాతనికిని మూలసూత్రమునందే గొప్ప భేదమున్నసంగతి నిశ్చయము. ఆనాడు ప్రజాసామాన్య మవలంబించుచున్న రాజద్రోహ పద్ధతులు నిష్ఫలములని జూడస్ చరిత్రవలన ఆతనికి స్పష్టమయ్యెను. "నారాజ్యమీయిహలోకమునకు సంబంధించినది కాద"ని యేసుక్రీస్తు చెప్పినప్పుడు ఆతనియుద్దేశ మేమి? సైతానును (అనగా ఈలోకపు రాజును) సైతానుసాధనములచే చంపదలపలేదని దీనిభావము. ఆయనపద్ధతులు యీలోకసామాన్యపు" పద్ధతులు కావు. కాని, అంతమాత్రముచే నాతడు "పారలౌకికు"డని చెప్పుటకును వీలులేదు. దానిభావ మేమనగ, ఆతడీలోకసామాన్యపద్ధతి నవలంబించువాడు కాడని మాత్రము అర్థము. ఆతడుతన జీవితారంభమందే రాజకీయవిప్లవకారుడుగ మారుటకెంతయో ఉద్రేకముండెను. కాని అతడాయుద్రేకమునకు లొంగక దానిని జయించెను. ఆతడు గావింపదలచిన విప్లవము నైతికవిప్లవముగాని రాజకీయవిప్లవము కాదు. కాని, పాప మాతనికి "విప్లవకారుల" యవస్థ మాత్రము తప్పినదికాదు. అప్పుడు రాజ్యాధికారిగనున్న "పైలాటు" గారి యుత్తరువుప్రకారము మాతనిని సిలువపై వేసిరి. ఈకొరతవేయునప్పు డాతనిని పరిహసించుటకై ఆతనికి "యూదులరాజు" అనుబిరుదమునిచ్చిరి. పైకి ఇది పరిహాసాస్పదవాక్యముగ గాన్పించినను, ఇది నిజముగ ఆ రోమక అధికారియొక్క అనుమానములను సూచించుచున్నది. స్వతంత్రమనగ అన్నిటికంటెముందు సత్యము ఆత్మపారిశుద్ధ్యములుండితీరవలెనని క్రీస్తుయొక్క మతము. "రెనాన్" అను ఫ్రెంచి చరిత్రకారుడు తనకాలమునకు సరిపోయినమనిషి యని నాతాత్పర్యము. ఆతనికి అన్నిటికంటె రాజ్యావసరములే చాల ఎక్కువైనవి. తక్కినవన్నియు దానిముందర తీసి దూరముగ పెట్టవలసినదే. "దేవునిదూత" నని చెప్పుకొనుచు ప్రతిపనియందును మతాధికారమే యుండితీరవలెనని చెప్పు యేసుక్రీస్తు సిద్ధాంతము రెనాన్ గారికెంతమాత్రమును బోధపడదు. అయినను ఆతడు తేల్చిన యాక్రింది సారాంశముతో మాత్రము నేనేకీభవించుచున్నాను. "గాఢమగు దేశాభిమానియు, నిశితమగు ప్రజాస్వామికవాదియు నగు యేసుక్రీస్తు తనకాలమందున్న లౌకికోద్యమప్రవాహము నడ్డగింప యత్నించియుండడు కాని, రాజకీయము అప్రధానమైనదని చెప్పుటలో ఆతడు లోకమునకు ప్రకటించినదేమనగ:—సర్వమునకు ఒక్కదేశమే కాదు; పౌరుడౌటకంటె మానవమాత్రుడగుట మనకు చాల ప్రధానమైనది; ఉన్నతమైనది." శత్రువులపై పగదీర్చుకొనవలెనని యిశ్రాయేలీయులు లోలోనమండుచుండిరి. కాని పగదీర్చుట మనపనికాదు. ఇది భగవంతుని కర్తవ్యము. దెబ్బకు దెబ్బ కొట్టవలెనని చెప్పువారికి యేసుక్రీస్తుచేసిన బోధయేమనగ:—ఎవరైన నీచెంపమీదకొట్టినచో, ఆతనికి నీరెండవ చెంపను కూడ అందియ్యుము.

ఇంతవఱకు పరదేశస్థుడగు రోమకప్రభువునుగూర్చి చెప్పబడెను. ఇక, తనస్వదేశస్థుని గూర్చి చెప్పెదను. స్వీయుడగు తన దుర్జనుడకు లోనై, పరప్రభువులందలి భయముచే పరప్రభువుల యాశ్రయమున

కములవసూలుచేయు నౌకరియైపోయిన తనస్వదేశస్థుడగు యూదు గూడ యేసుక్రీస్తుయొక్క అపారమగు ప్రేమసముద్రమందు హాయిగ పొల్గొనసగ్నాడు. త్యాగకష్టానుభవములచే సర్వశక్తి సంపన్నతయు, హృదయనైర్మల్యముచే పశుబలోధ్వంసమును సిద్ధించుననుమాట అనాది నుండియును ప్రథమమానవసంతానమగు ఆబెల్, కెయినులనాటినుండియు—వచ్చుచునే యున్నది. కాని, యీసిద్ధాంతము క్రీస్తుకాలపు పరిస్థితుల కెంతయో యెక్కువగ తగియుండుటచేతను, అతనియుపదేశములలో యీభాగముమాత్రము కొంచెమువివరముగ మనకిప్పటికిని మిగిలియుండుటచేతను యీనాటి క్రైస్తవులును, తదితరులును గూడ, దీని నొక విచిత్రముగ—ఒక్క యేసుక్రీస్తు మాత్రమే చెప్పినదానినిగ—తలంచుచున్నారు.

## ఏసుక్రీస్తు—గాంధి

ఏది యెట్లున్నను, మహాత్మాగాంధికూడ ఈవిచిత్రాంశమునే బోధించెను. కాని, సర్వవిధముల ఆయేసుక్రీస్తునే పోలిన యీకాలపు మానవుని పరమదుష్టునిగ భావించుటయు,—సర్వవిధముల శాంతిదూతను బోలి లౌకికవ్యవహారములందు అద్వితీయముగ పాటుబడుచున్నవానిని శాంతికి భంగకారుడని శిక్షించుటయు—నను నీరెండుపనులు క్రైస్తవ ప్రభుత్వముపాలనే పడెను. క్రీస్తు రాకపూర్వము "జూడియా" దేశములో నెట్టిపరిస్థితు లుండెనో, గాంధిమహాత్ముడు రాకపూర్వము హిందూదేశపు రాజకీయపరిస్థితులుకూడ సరిగ ఆస్థితినే పోలియుండెను. పూర్వము జూడియాదేశస్థులకు యేసుక్రీస్తు ఎట్టిమందు చెప్పెనో, యీనాడు గాంధిమహాత్ముడుకూడ భారతదేశపు రోగముల కుదుర్చుటకై వెదకులాడుచున్నవారికి సరిగ అట్టిమందునే చెప్పెను. కష్టసహనమువలన ఆత్మపరిశుద్ధత, రాజ్యభార నిర్వహణకై నైతికసాధన, స్వరాజ్యసంపాదనకు ముందు ఆత్మశిక్షణ—యిది మహాత్ముని ముఖ్యసిద్ధాంతము—ఇది మహాత్ముని గాఢవిశ్వాసము అహమ్మదాబాదు కాంగ్రెసుసభతో మహోన్నతపద మలంకరించిన ఆమహాద్భుతవత్సరమందు నివసించు భాగ్యమబ్బిన మానవులు గాంధిమహాత్ముడు అంతలేసి ప్రజాసమూహములమనోవాక్కర్మములం దనతి కాలములో నెంతటి మహాద్భుతపరిణామముల నొనర్చెనో కండ్లార చూచియుండిరి.

## మహాత్ముడు - సత్యాగ్రహము

గాంధిమహాత్ముడు యిండియాగవర్నమెంటుతో ప్రత్యక్షసంబంధము గలిగియుండెను. అనేకసార్లు వైస్రాయికి సలహాచెప్పెను. బ్రిటిషు గవర్నమెంటు దక్షిణాఫ్రికాలో కష్టదశయందున్నప్పుడు గాంధిమహాత్ముడు యిండియాలో—ఉచితముగ—సైన్యమునకు శిపాయిలనుచేర్చి వారికి సహాయము చేయుచునేయుండెను. అహింసామహాతత్త్వస్వరూపమేయైన యీమహాత్ముడిట్లు రక్తపాత మొనర్చు శిపాయిలను తయారుచేయుచుండుట చూడగ చాలమందికి ఆశ్చర్యము గలిగెను. కాని, యింతరాజభక్తిగలిగిన పౌరుడు—గవర్నమెంటున కింతటి దగ్గరచుట్టమైనవాడు—గవర్నమెంటు చేసిన యొకానొక చట్టమును ధిక్కరింపక తప్పినది కాదు. యుద్ధారంభమందు యిండియాయొక్క ప్రభుభక్తినిగూర్చి యెంతయో కృతజ్ఞతను జూపుచుచేసిన బ్రిటిష్‌వారి ప్రకటనలను చదివినవారెవరు యుద్ధానంతర మాకృతజ్ఞతయొక్క పరిణామ మీరౌతుల చట్టరూపముదాల్చునని కలలోనైన తలంచియుండరు.

భారతరాజ్యాంగమందు భారతీయుల కెక్కువభాగ మిచ్చెదమని పైకిజెప్పెడి సంస్కరణప్రణాళిక యొకటి ఆలోచనలో నుండెను. ఇదిగో! ఈచేతితో భారతికి నెక్కువస్వాతంత్ర్య మియ్యబోవుచున్నామని యొకమూల పైకి మాటలుచెప్పుచుండగనే రెండవచేతితో నిదివరకే దిగ్బంధన మొనర్పంబడియున్న కొంచెపు స్వాతంత్ర్యములనుగూడ త్వరత్వరగ నపహరించుచుండెను. ఆ ౧౯౧౯ సం॥ ఏప్రిల్ ౨౪ వ తేదీని నేనును నాయన్నగారును చింద్వారా ప్రవాసమునుండి అప్పటికి నాల్గుసంవత్సరముల క్రిందట మాస్వాతంత్ర్యము నపహరించిన దేశసంరక్షణశాసనము నల్లంఘించి జైలునకు పోవ నుద్యుక్తులమై యీక్రిందివిధముగ వైస్రాయిగారికి వ్రాసితిమి.

"ఇప్పుడు యుద్ధము ముగిసినది. కాని దానివలన బుట్టిన క్రౌర్యముమాత్ర మింకను యథేచ్ఛగ చరింపుచునే యున్నది. భుజబలముకంటె నెక్కువ న్యాయమైనట్టి పద్ధతిపై ప్రపంచగతిని నిర్ణయించుటకై పారిసుపట్టణమందు సమావేశమైనవారు ప్రజాసేవకులే గాని ప్రజలపై యజమానులు గారని ఒకమూల మహాగంభీరవాక్యముల బ్రకటించుచు నింకొకమూల భారతప్రజలు తమ చావుబ్రతుకులకు సంబంధించినవిషయములనుగూర్చి వారు నోరెత్తి చెప్పుటకైనను వీలులేకుండ ఆటంకపరచుచున్నారు. మానోటికి వేసిన తాళము నింకను తీసివేయకపోవుటయేగాక భగవంతుడు వాగింద్రియము ననుగ్రహించిన ముప్పదిమూడు ప్రాణికోట్లయొక్క నోళ్లను బంధించుటకై గవర్నమెంటువారొక చెప్పనలవిగాని నిరంకుశ రీతిగ నిప్పుడు నిర్మింపబడిన రౌలతు చట్టమువల్ల న్యాయపరిపాలన మంతమొంది తత్స్థానమున క్రౌర్యమే రాజ్యముచేయును.

భారతదేశమందున్న ప్రతిజాతిని ఈ చట్టము బాధించునదైనను, ముఖ్యముగ ముసల్మానులే దీనికి ముందుగ ఆహుతియగుదురు. "ముద్రణశాసనము" వల్ల బాధ నొందినది ముఖ్యముగ ముసల్మనులే. ఏ ఒంటికొట్లలోనో, యే మురుగుడులంకలలోనో, న్యాయవిచారణ గాని, విడుదలయాశ గాని లేక జైళ్లలో మ్రగ్గుచున్న దురదృష్టవంతు లగు బంగాళాయువకులను మినహాయించినచో "దేశసంరక్షణశాసనము" వల్లకూడ నెక్కువగ బాధ నొందినది ముసల్మానులే. "అధికారవర్గము చేతికి రాక్షసబలము నిచ్చినను పరవాలేదు, వారదానిని రాక్షసబుద్ధితో నుపయోగింపరు. అని పాపము!—లేని ఆశను తెచ్చిపెట్టుకొని ఆశించువారికికూడ మా స్వానుభవము నొక్కసారి చూచినచో వారిని బాధించుచున్న యీపిచ్చిభ్రమ తొలగిపోగలదు. గవర్నమెంటువారీచట్టమును "జాగ్రతగ, విచక్షణతో" నుపయోగింతురనుట యెట్లో మాకు బాగుగ తెలియును. నేర మేమో

చెప్పక, "విచారణాధికారులు" చాటున రహస్యముగ కూర్చుని చేయు ఈ వగుబాట్ల "విచారణ" యెట్లుండునో మాకు స్వానుభవవిదితమే. ఒకన్యాయచట్టముగాని, సూత్రముగాని లేక అడ్డగోలుగ ప్రోగుచేయబడిన రహస్యపు సాక్ష్యముతో, వ్యవహారమును నడపుచు, నలుగురి మొగమును చూడజాలని రహస్యపు రిపోర్టులను తయారుచేయుచు, ఇంత శ్రమపెట్టి తుదకు నిరపరాధి యని త్రోసివేయుచు, కూర్చుండు ఈ "విచారణాధికారులను మేము బాగుగ నెఱుగుదుము. స్వానుభవముచే నిన్ని సంగతుల నెఱిగినమాకీవిషయమై గట్టిగ మాట్లాడుట కధికారము గలదు. కావున ఈచట్టము విషయమై మేము చెప్పునదేమనగ:— ప్రపంచమందు అయిదవవంతు మానవకోటిని ధర్మేతరమార్గముల శిక్షించుటకై యేర్పడినచట్టమే యీక్రూరనిరంకుశచట్ట మని మా నిశ్చయాభిప్రాయము.

సత్యాగ్రహమును ప్రారంభించిన తత్క్షణమే రౌలతుబిల్లుల యొక్క సంపూర్ణస్వభావమును గాంధిమహాత్మునకు తెలియజెప్పిన వారము మేమే; ఆభాగ్యము మాకే అబ్బినది. ఆసహాయోగోదయము యొక్క ప్రథమదశ యిదియే. ఢిల్లీ, అమృతసరము, లాహోరు, అహమ్మదాబాదు, తదితర గుజరాతుప్రాంతములలో జరిగిన విషయములు తదుపరి వచ్చినవి. "నేను చేసినతప్పు హిమాలయపర్వతమంతయెత్తు ఉన్నది"ను మహాత్మునివాక్యమును గవర్నమెంటువారును, తదనుచరులును ప్రపంచమునకు చాటించుచున్నారు. కాని, ఆకాలమందు మహాత్ముడీ రీతిగ దేశస్వాతంత్ర్యసంరక్షణార్థమై ప్రజాశక్తుల నన్నిటిని ఐక్యమొనర్పక ఊరకున్నచో, ఆతడొనర్చిన తప్పు హిమాలయపర్వతశిఖరములకంటె నింక నెత్తుగ దాటిపోయెడిది. కాని, యీసంగతిని ఒప్పుకొందమను సరళస్వభావము వారికెవరికిని నున్నట్లు గనపట్టదు.

మహాత్ముడొనర్చిన "హిమాలయమంతటితప్పు"—ఎంత యెక్కువగ చూచుకొన్నను—ఏమిటిది? ప్రజలలో నెంతవఱకు ఆత్మనిగ్రహము కలదో, యెంతవఱకు సాధనకలదో,—సరిగా అంచనావేసికొనలేకపోయెను.—అంతియేగాని, అంతకెక్కువతప్పు లేదు. కాని మహాత్ముడు రౌలతుచట్టము నెదిరింపక ఊరక కూర్చుండియున్నచో ఆతడొనర్చినపాపమునకు మితియే లేకుండెడిది. ఎన్నిప్రాయశ్చిత్తము లొనర్చుకొన్నను దానిని వదలించుకొనలేక పోయెడివాడు. క్రోధోద్రేకపూరితులైన ప్రజాసమూహములయొక్క దౌర్జన్యమునంతను త్రాసులో నొకప్రక్క నుంచుడు; ఈబిల్లులవల్ల మనజాతిపై బడవేయనెంచిన మహాదాస్యమునకు మాఱుమాటాడక తలయొగ్గుటలో గల పిఱికితనమును త్రాసులో రెండవప్రక్క నుంచి చూడుడు.

ఇట్టి దౌర్జన్యమందు నాకెంతటి అసహ్యమున్నను నేను త్రికరణశుద్ధిగ చెప్పునదేమనగ:—శుద్ధస్ఫటికాకృతియగు ఆమహాదేవుని సింహాసనము నెదుట నే నావిచారణదినమందు ఈ దౌర్జన్యమువలన కలిగిన పాపమునంతను నెత్తిపై వేసికొని నిలుచుండగలను గాని, అంత పిఱికితనముగ దాస్యమునకు తలయొగ్గుట యను అవాచ్యపు పాపమునకు మాత్రము నేనాదేవుని యెదుట సమాధానము చెప్పజాలను.

ఇట్లు చెప్పుటలో నాఱుదీర్ఘవర్షములు కఠినశిక్ష తీఱవలయునని శాసించిన న్యాయాధికారియెదుట మననాయకుడెంత తనతప్పునొప్పుకొనెనో యప్పటికి నాల్గు వర్షములకు పూర్వపు సంగతులగూర్చి మాటలాడుచున్నాను. ఆ మహనీయుడు "నేను నిప్పుతో చెల్లాటము చేయుచున్నాను" అనుటయెగాక "నేనట్లుచేయనే చేసితిని నన్నిప్పుడే వదలినను ముందుకూడ నట్లే చేయగలను" అనికూడ సెలవిచ్చెను. కేవల ముపయోగించినపద్ధతులనె గాక తుదివఱకుకూడ ఆయన యేసుక్రీస్తునే యనుకరించెను. ఏమైననుసరే! తానొనర్ప గంకణము కట్టికొనినపనిని చేయనుద్యుక్తుడయ్యెను. దానివలన తనకు మరణదండన విధింపబడునను భయముకూడ తనకర్తవ్యమునుండి యాయనను మరల్ప జాలక పోయెను.

## దౌర్జన్యరాహిత్యము

దౌర్జన్యరాహిత్యసూత్రముపై నావంటివారి యభిప్రాయమును గూర్చి మరల కొంచెము ముచ్చటింతును. నేను దుర్మార్గము నెట్టిదైనను యెదిరింపగూడదను ధర్మమును నమ్మక్రైస్తవుడనుగాను. అధికసంఖ్యాకులగు క్రైస్తవులును క్రైస్తవరాజ్యములు కూడ నిట్లే నమ్ముచు ధర్మములో గాకపోయినను నాచరణములో నాతో నేకీభవించినారు. ఈరాజ్యములకును, ప్రజలకును మొన్న జరిగిన యూరోపాసంగ్రామము, తమమతధర్మమగు దౌర్జన్యరాహిత్యసిద్ధాంతమును ఆచరణమునం దుంచుటకు మంచియవకాశమును కల్పించెను. కాని యొక్కరాజ్యమైనను ఆసూత్రము నాచరణమునకు తెచ్చుకొనలేక పోయెను. యుద్ధము చేసి ధర్మమును సాధించుటె పాప మని మనస్సాక్షి కల్గి, నమ్మినదాని నెల్ల నాచరణమునం దుంచుకొనుచున్న కొందఱు క్రైస్తవులు "దొంగలని హేళనముచేయబడి పరిహాసాస్పదులై తుదకు దేశద్రోహు లని శిక్షింపబడిరి. అంతియగాక ప్రతిదేశమునందలిమతసంఘములును, తమతమజాతీయపతాకముల నాశీర్వదించి ధర్మయుద్ధమునకై తరలునపు డెట్లు పంపబడుదురో తమసైనికుల నట్లు పంపిరి. తుదిమతకర్తయగు మహమ్మదుదేవు డాయన (నాశీర్వదించుగాక!) యొక్కయనుచరుడను నిజమైన ముసల్మానుడను నైన నేను యుద్ధముచేయుట తప్పనియే నమ్ముచున్నాను. యుద్ధముకంటె నింకను గొప్పతప్పు లున్నవనికూడ నమ్ముచున్నాను. కొరాను "మతవ్యవహారములలో బలవంతము లేద"ని చెప్పుచున్నది. ఏలన మతవిశ్వాసములకును, దౌర్జన్యములకును సామాన్యధర్మము కాదు. రెండును భిన్నాధికరణములను కలవి. కాని యొకమహమ్మదీయునకు యుద్ధము తప్పనిసరియగునపుడు, శత్రువునకు దౌర్జన్యమే మార్గమగునపుడును, నేను మహమ్మదీయుడను, మహమ్మదుయొక్క యనుచరుడనైనను వెనుదీయక దానిసాధనముచేతనే వాని నెదిరించి వానియాయుధముచేతనే వానిని శిక్షించుట యవసర మని తలంచుచున్నాను. శత్రువు దౌర్జన్యమునే సాధనముగాగ్రహించి ఆయాయుధమునే నాపై ప్రయోగింప సమకట్టినయెడల వానికెదురెత్తుగ తగ్గింపకుండను నాపకుండను నెంతదౌర్జన్యమును చూపగల్గుదునో యంతయును చూపి నామతమును నేను రక్షించుకొందును.

కొరానుచెప్పినట్లు శత్రు "వస్త్రసన్న్యాసము చేసినపుడు" త్తినికూడ నోరలోపెట్టుకొని తీరవలయును. కొరానుధర్మానుముగ యుద్ధముచేయుట పాపకార్యమే. కాని పరమతపీడనము యుద్ధముకంటె పాప కార్యముగాన, యుద్ధసాధనములతో దాని నాపి వేయవచ్చును. మతపీడన మాగిపోయి, ప్రతివానికిని భగవదనుగ్రహమును సంపాదించుటకు ప్రయత్నముచేయు స్వాతంత్ర్యము లభించినప్పుడు యుద్ధముకూడ నాగితీరవలయును. ఇదియె మహమ్మదీయమతమున దౌర్జన్యముయొక్క పరిమితి యని నాయభిప్రాయము. ఇంతకంటె నెక్కువ దౌర్జన్యము నుపయోగించుట భగవదాజ్ఞోల్లంఘనమే యగును. నేను గాంధీమహాత్మునితో కలిసి పనిచేయుట కొప్పుకొంటిని. ఆయనతో కలిసిపనిచేసినంతకాలము ఆత్మరక్షణమున కైనను దౌర్జన్యమార్గము ననుచరింపకపోవుటయే మాయిద్దరికిని జరిగినయొడంబడిక. నేనుస్వబుద్ధిప్రేరితుడనై యీయొడంబడికను చేసికొనుటకు మూడుకారణములు కలవు. మనము దౌర్జన్యమునకు గడంగకుండగ నేజయము నొందగలమనునది మొదటిది. 32 కోట్ల జనసంఖ్యగల దేశము దౌర్జన్యమునకు గడంగుట యపకీర్తికరమగుట రెండవది. దౌర్జన్యముచే వచ్చిన జయము భారతదేశమునందలి యుద్ధకుశలు లగు జాతులే సంపాదించిన దగుటచేతను, నట్టిజాతులకును సామాన్యప్రజలకును నుండు నంతరములు ప్రపంచమునందలి యన్నిదేశములందుకంటె ఈ దేశమున నెక్కుడుగ నుండుటచేతను ఆజయ మన్నిజాతులును కలిసి ప్రయత్నించి పొందని దగుట మూడవకారణము. మనము కోరు స్వరాజ్యము సర్వజనానుభవనీయము కావలయును. మరియు నందరుప్రజలయొక్కయు బుద్ధిపూర్వకమగు త్యాగముచే పొందగలిగినది కావలయును. అట్లే కాకపోయిన తద్రక్షణకు మరల యుద్ధకుశలు లగు జాతుల సాహాయ్యము కోరుట యవసరమగును. అట్లెన్నడు నుండరాదు. స్వరాజ్యము అల్పసంఖ్యాకుల యత్యధికత్యాగముచే గాక, అధిక సంఖ్యాకుల పరిమితత్యాగముచే సంపాదితమై యుండవలయును. దౌర్జన్యవిరహిత అసహాయోగమున నిర్మాణాత్మకకార్యముయొక్క స్వరాజ్యసంపాదనాశక్తిపై నాకు సంపూర్ణమైన విశ్వాసము గలదు. గాన నాకు దౌర్జన్యమునే పట్టుకొని వ్రేలాడునవసరము లేదు. ఈకార్యక్రమముచే మనము సత్వర స్వరాజ్యసంపాదనమున విఫలుల మైనను, బుద్ధిపూర్వకముగను సంతోషముతోను కష్టముల ననుభవింపగలుగు శక్తి, దౌర్జన్యమే యుపయోగింపవలసి వచ్చుకాలమునకు తగిన క్రమశిక్షణము నొసంగగలదని నాకు తెలియును. మనఃపూర్తిగ నాచరణమునం దుంచియు, తదాచరణమున నవశ్యములగు స్వల్పత్యాగములకు ప్రజల నలవాటుపరచియు, పనిచేసినయెడల తత్కార్యక్రమము భగవదనుగ్రహముచే మనలను విఫలీకృతమనోరథుల జేయజాలదు.

## స్వరాజ్యసంపాదనమున జాతియొక్క కర్తవ్యము

ఈమాత్రపు స్వల్పత్యాగములను చేయజాలని యస్మద్దేశీయులను "యుద్ధమునకు వెడలు సైనికు డెంతటి త్యాగమునకు సంసిద్ధు డగుచున్నాడో యాలోచించితిరా?" యని యడుగుచున్నాను. బైబిలునందు చెప్పినట్లు "మిత్రునికొరకు ప్రాణత్యాగముచేయుటకంటె నధికమగు ప్రేమ మానవుడు చూపజాలడు." 15 లక్షలభారతీయసోదరులు తమకెంతమాత్రమును సంబంధములేనివిషయమున ప్రాణముల నొసంగుటకు యుద్ధమునకు వెడలిరి. భారతజాతీయతయని మిన్నునకు పొగడుకొనుచున్న మనము అసహాయోద్యమఫలితముగ చేయవలసిన స్వల్పత్యాగములు చేయ వెనుదీయవలయునా? మనము చేయుచున్నపని, నిజముగ మనము చేయవలసియున్న కార్యములో నొక లేశమైయున్నది. స్వరాజ్యము కరతలామలకమై లభించినవెనుక యుద్ధభటుడు చేయవలసిన త్యాగముకంటె నెక్కుడుత్యాగము చేయవలసి యున్నది. ఒకధర్మము కొరకై బలియగుట మనమనుకొనునంతటి కష్టకార్యము కాదు. సర్వకాలములందును, సర్వదేశములందునుకూడ నట్లు త్యాగము చేయువారలుందురు. ఒకప్పుడు మిగులక్షుద్రవిషయములకైకూడ త్యాగమాచరించుట సంభవించుచున్నది. ఒక యాదర్శముకొరకై బలియగుట యంతకఠినకార్యము కాదు. ధర్మనిర్వాహణముకొరకై జీవించి కష్టించి తన్నిర్వాహణమున వచ్చుకష్టముల ననుభవించుట అంతకంటె కష్టతరమైన కార్యము. ఇప్పుడు మనము పడుకష్టముయొక్క పరిణామము భారతదేశమును స్వర్గతుల్యముగ చేసి ధర్మసంస్థాపనము చేయుటగాన యది కష్టతమమగు కార్యము.

## అసహాయవాదులదౌర్జన్యము; తత్ప్రతికక్షులదౌర్జన్యము; అందలిభేదము

నాహృద్గతాభిప్రాయము లిట్లుండుటచే, దేశమును కల్లోలవిప్లవములపాలుచేయుటయే యసహాయవాదులకృత్య మని మనకు మనప్రతికక్షు లాపాదించు సాహసమునకు నే నచ్చెరువందుచున్నాను. దౌర్జన్యపక్షమునుండి తమ్మును గాపాడుచున్న మనము దేశమునందంతటను దౌర్జన్యరాహిత్యమును గూర్చి పూచీపడవలయునట! ఎవరు మనకడ్డనుండి యిట్టి వాగ్దానమును కోరుచున్నారు? తమచేతనే జలియన్వాలాబాగునందు వధింపబడిన పసికూనల రుధిరధారలచే సిక్తములైన వారిహస్తము లింకను ఆరలేదు. ఇప్పటికి వారు పశ్చాత్తప్తులైనచిహ్నములు గానరావు. మనమిప్పటికి తత్పాపకారులను శిక్షింపనేలేదు. ఇట్లు వారుచేసినట్టియు కండ్లకు కట్టినట్లగపడుచున్నట్టియు ద్రోహమును, చౌరీచౌరాయందును బొంబాయియందును జరిగిన దౌర్జన్యమునకు మనఃపూర్వకముగ సంపూర్ణబాధ్యతను మన నాయకాగ్రగణ్యుడు వహించుటతో పోల్చినయెడల అసహాయోగులయొక్కయు, నిర్దయులైన తత్ప్రతికక్షులయొక్కయు నైతికశక్తిలోనిభేదము తేటతెల్లము కాగలదు. చౌరీచౌరాహత్యలకు నేనే కారకుడనని చెప్పిన మహాత్మునియొప్పుదల వాక్యముల నీక్రైస్తవప్రభువులు ప్రపంచమునకు చాటుచున్నారు. కాని సెంటుపీటరు మాల్కసుయొక్క చెవిని కోయుటకు కారణము యేసుక్రీస్తు పర్వతముపై చేసినమతబోధ యని యందురు కాబోలు!

చౌరీచౌరావంటి విషాదకరములగు సందర్భముల బరీక్షించినప్పుడు, చేసినదుష్కార్యములనే గాక, నిరోధింపబడిన దౌష్ట్యమును కూడ పరిశీలించుట యావశ్యకము. అసహాయోద్యమారంభమునుండియు

భారతీయజనులకు గల్గిన భావోద్రేకము, భారతదేశచరిత్రమున నశ్రుత పూర్వమైయున్నది. ఉద్రేకపూరితమైన జనసమూహము కోపముచే చేయు రక్తపాతమునుగూర్చి చింతించుటగాక, యింతస్వల్పరక్తపాతముతో భారతదేశముయొక్క పౌరుషము పునరుజ్జీవన మొందినందులకు సంతసింపవలసియున్నది. కోట్లకొలది ప్రజలు స్వాతంత్ర్యరక్షణకొరకై ప్రేరేపింపబడి, గాంధీమహాత్ముల నాయకత్వము క్రిందనున్నంత శాంతిపూరితులైయున్న మరియొకయుదాహరణము ప్రపంచమున లేదనుట నిస్సంశయము. ఇట్టిసందర్భములే క్రౌర్యమున కాటపట్టైన యైరోపాఖండమునందలి దేశములలో జరిగినయెడల రక్తప్రళయమే జరిగియుండును. అట్టి ప్రళయము భారతదేశమున జరుగకుండుటకు గాంధిమహాత్ముడును వారి యనుచరులే ముఖ్యకారణము.

## సహకారము

దౌర్జన్యరాహిత్యమునుగూర్చి చర్చించుచు, ప్రధానవిషయమును మరచితిని. ఇప్పుడు మరల కథాంశమునకు వచ్చెదను. అమృతసరమహాజనసభలో నుపపాదింపబడిన ప్రధానతీర్మానము సంస్కరణములగూర్చియే. ఆ మహాసభ జరిగి, ఇప్పటికి నాలుగువత్సరములేయైనను, ఈ విషయమున గావింపబడిన చర్చలలో శాసనసభాప్రవేశకక్షనాయకుడగు దేశబంధు దాసుగారును, మదీయ గురువర్యుడగు స్వర్గీయ లోకమాన్యుడును, శాసనసభాప్రవేశమున కెంతమాత్రము నంగీకరింపలేదనియు, మహాత్ముడే యాతీర్మానమున కొకసవరణ నుపపాదించెననియు, నెరింగినచో చాలమంది కాశ్చర్యము గల్గును. రాజప్రకటనమున గావింపబడిన వాగ్దానానుసారముగ సంస్కరణములను ఫలోన్ముఖమునకు దెచ్చుటకై యధికారవర్గముతో సహకారమొనర్ప, కాంగ్రెసు సభాముఖమున ప్రజల బురికొల్పుటకై మహాత్మునిచే నొకసవరణ యుపపాదింపబడెను. ఏపక్షమును తమపట్టునువీడలేదు. అట్టితరుణములందు, మామూలుగా జరుగునట్లు విషయనిర్ధారణసభయందు గావింపబడు చర్చలవలన కాంగ్రెసు మహాసభా కార్యక్రమము, నిలిచిపోవ దొడంగెను. కాంగ్రెసుమహాసభ యెంతకును ముగియదయ్యెను. మీతో నిదివరకే మనవిచేసినట్లు నేను కాంగ్రెసు వ్యవహారములలో బాల్గొనుటకదియే ప్రథమము. క్రొత్తవాడనైనను, నేనొనర్చిన కార్యము ఆకర్షణీయమై ప్రాముఖ్యమయ్యెను. నాసోదరుడును, నేనును, చిత్తరంజన, లోకమాన్య, మహాత్ములకు మువ్వురకును, నంగీకారమగు మార్గమునొండు కనుగొనవలయునని ప్రయత్నించితిమి. ఎట్టకేలకు కృతార్థులమైతిమి. "బాధ్యతాయుతపరిపాలనమును సత్వరముగ సముపార్జించు నుద్దేశముతో వీలగునంతవరకును సంస్కరణచట్టమును వినియోగించుకొనవచ్చునని యీసభాస్తార్థులు దలంచుచున్నా"రని, బిపిన్ చంద్రపాలు డొకసవరణ నుపపాదించెను. నేను దానిని బలపరచితిని. అంతటితో కాంగ్రెసుసభ వాతావరణము ప్రశాంతమయ్యెను. వాదప్రతివాదము లుడిగెను. "సంపూర్ణబాధ్యతాయుతప్రభుత్వమును త్వరలో స్థాపించుటకై వీలైనంతవరకును, యీ సంస్కరణముల కొనసాగింపవచ్చునని యీసభవారు నమ్ముచున్నా" రని యుపపాదింపబడిన తీర్మానమును ఉభయకక్షులవారును నామోదింతు మనిరి. భారతవర్షబాధ్యతాయుతప్రభుత్వమునకు తగియున్నదనియు, రాజకీయసంస్కరణములు అసంపూర్ణములనియు అసంతృప్తికరములనియు ఆశాభంగకరములనియు, స్వయంనిర్ణయసూత్రముల ననుసరించి బాధ్యతాయుతప్రభుత్వమును స్థాపించుటకై పార్లమెంటుసభ వేగమే ప్రయత్నములు సల్పవలయు ననియు, మున్నగువరతులతో దాసుగా రొకతీర్మానము నుపపాదించిరి. ఈతీర్మానమును కాంగ్రెసు మహాసభ యంగీకరించెను. మహాత్ముడును, నాతనిసహచరులును, అమృతసరస్సునందుగూడ ప్రభుత్వముతో సహకారమొనర్చుటకు సంసిద్ధులుగా నుండిరని తెల్పుటకే యీవివరముల నిచ్చట ముచ్చటించితిని. ఇప్పటి పరిస్థితులు విపరీతముగ మార్పు జెందినను, నేను చాలకాలము నాసోదరుల నెడబాసి చెరసాలయం దుండియుంటచే నీమార్పు నా కచ్చెరువు గలిగించెను. అంతటనుండియు హిందూమహమ్మదీయు లొకరియెడ నొకరు శత్రుత్వమును పాటించుట మానిరి. ప్రత్యర్థులమనియైన దలంచుకొనరైరి. వా రంతట నుండియు, సోదరులును సహచరులునై మెలంగజొచ్చిరి. ఆచారదూరమై ఆర్భాటసహితమై తైలనష్టియై ఫలశూన్యమైన యుపన్యాసపరంపర లంతమొందెను. కాంగ్రెసు తీర్మానములు నిరుపయోగములగు తీర్మానములే యనియు, ప్రజలు వాని నాచరించుటకై తీర్మానించుకొనిరనియును దెల్పుటకై యొకవిధమగు పట్టుదల ప్రజల నావహించెను. మరియు నికముందు దైవమునకుదక్క మానవమాత్రునకు భీతినొంది భారతీయులే కార్యమును జేయ నొల్లరని తెల్లమయ్యెను. ఈవిపరీతపరిణామము, నన్నాశ్చర్యనిమగ్నుని జేసి, నేనమృతసరస్సున నుపన్యసించుచుండ నొకానొక సోదరపౌరుని పద్యపాదమును జ్ఞప్తికి దెచ్చెను. ఆపద్యమున నిట్లు రచియింపబడియుండెను:—"మద్యపాత్రము మరల దిరిగి వచ్చుసరికి యొకశతాబ్దము గడచినట్లుండెను. మద్యవిక్రయశాలను వీడునపుడు మాకు ప్రపంచమంతయు మార్పు జెందినట్లుండెను."

## సహకారమునువీడి సహాయనిరాకరణము నవలంబించుట

ఇంతవరకును ప్రజల ప్రవర్తనలోను భావప్రపంచమునందును జనించిన మార్పులనే వివరించితిని. ఇంతే గాక వారల రాజతంత్రము గూడ ఆకస్మికముగ మార్పుజెందెను. అమృతసరస్సున ప్రజల నధికారులతో సహకారము సల్పుడని ప్రేరేపించిన మహాత్ముడే, ప్రథమమున సహాయనిరాకరణవాది యయ్యెను. రాజకీయవ్యవహారముల నిట్లు మార్పునొందించినదేది? యుద్ధసమయమునను ముఖ్యముగ ౧౯౧౮ సంవత్సరాంతమున తాత్కాలికసంధి గావింపబడిన పిమ్మటను ప్రభుత్వమునెడ నాయభిప్రాయములుగూడ మార్పుజెందెనని యొప్పుకొనక తప్పదు. ఈ ప్రభుత్వమువలన కేదియో లాభమొనగూర్చునని యాశల వెనంగి, ౧౯౧౧ సంవత్సర ప్రారంభమునను ౧౯౧౪ సంవత్సరాంతమునను వెనుకటి 'కామ్రేడు' పత్రికలలో నేను వ్రాసిన వ్రాతలను మరల నిప్పుడు జదువుచుండ రూపనాశనమైన యొకకళేబరముయొక్క శల్యములను బరికించుచుండినట్లుండును. ప్రభుత్వముతో సహకారమొనర్చు విషయమున ౧౯౧౯ సంవత్సరము డిసెంబరుమాసమువరకును మహాత్మునకును లోకమా

దేశబంధులకును మధ్యస్థముగా నుంటిని. చివరకు కాంగ్రెసుసభ కూ స్థానమునకే వచ్చిచేరెను. అప్పుడుకూడ ప్రభుత్వముతో నట్టిసహకారము సాధ్యమగుననునాశ నాకంతగా లేకుండెను. మహమ్మదీయుల సర్కారుతో) సహకార మెట్టి విపరీతపరిణామమునకు గారణభూతమగునో నాకు విశితమయ్యెను. అమృతసరవీథులందును-ప్రజలుపొట్టచే ప్రాకినవీథులు-జలియన్వాలాబాగునందును మానియన్వాలాభవనమందును జరిగినదురంతములు అధికారుల దురాగ్రహమువలన జనించి యొకదానికొకటి సంబంధము లేని సంభవములు గావనియు ఈదుర్నయపరంపరలు విదేశీయ నిరంకుశప్రభుత్వములకు దప్పక కలుగుచుండు వ్యాధిచిహ్నములనియు నేను దృఢముగనమ్మితిని. ఈరోగము అట్టిరాజ్యాంగపద్ధతితోనే పుట్టుచుండుననియు అట్టిపద్ధతి మారనంతవరకు యట్టిసంభవములు మరల మరల జరుగుచునే యుండుననియు పరిపాలకుల హృదయములు సంపూర్ణముగ మార్పునొందినగాని ప్రభుత్వము జలియన్వాలాబాగుపరంపరలే యగుచుండు ననియు నేనెరింగితిని. నూతన శాసనసభల ప్రారంభోత్సవము సల్పుటకై కన్నాటు ప్రభువు భారతవర్షమున కరుదెంచిన తరుణమున "జరిగినదేదో జరిగినది, జరిగినది మరచిపొండు మన్నింపు" డని వాక్రుచ్చెను. నేను మన్నించుటకు ఇదివరకును సిద్ధముగా నుంటిని. ఇప్పుడును సంసిద్ధముగా నున్నాను. కాని మరచిపోవజాలను.

మరచిపోవను. మరచిపోవుటయన మేల్కొన్నవారలు మరల నిద్రించుటయే యగును. నిజతత్త్వమును దెలిసికొనుటకుబూర్వము కనుచుండు రమ్యమగు కలలనే మరల గనుచుండుట యగును. అప్పటికింకను మహాత్ముడు యథార్థమును గ్రహింపలేదు. ఆయనలో మార్పు తర్వాత జనించెను. అమృతసరసభ ముగిసినపిదప చాలరోజులవరకును, ఇంగ్లీషువారు పశ్చాత్తాపపడుచుందు రనియే ఆయన యాశించుచుండెను. ఖిలాపత్తుయొక్క స్వాతంత్ర్యగౌరవములను, పునరుద్ధరించి "జజీరతుల్ అరబ్బును," వీడిపోయి, పంజాబుదురంతములకు తగిన ప్రతీకార మొనర్తురనికూడ యాశగొనెను. అయ్యది కేవలము ఆశయే గాదు. సంపూర్ణవిశ్వాస మనజెల్లును. ఇదియె యాయన కింతవరకును ధైర్యము గొల్పెను. ఆయనకుగూడ భ్రాంతివిచ్ఛేదమయినతోడనే ఆయన కార్యక్రమమును తయారుచేయుటలో ఇంగ్లీషువారు సద్భావప్రేరితులని దానెన్నడును నమ్మజాలనని సూచించినపుడు, మేముకూడ ఈయన తీవ్రముగా బోవుచుండెనని తలంచితిమి. అందులకాయన "నూతనముగ మార్పుజెందినవాడ నగుటచే మరింత యుద్రేకపూరితుడనైతి"నని తెల్పెను. ఖిలాపత్తు రాయబారుల ద్వారా ఇంగ్లాండునకు సందేశ మంపినపుడు, నారాయబారులు ప్రధానమంత్రియగు లాయడు జార్జిగారిని దర్శించి విఫలమనోరథు లయినప్పుడును, యింగ్లాండుదొరతనమువారి కంపబడిన కడపటి రాయబారమట్లు ఫలరహిత మైనప్పుడును, ఇక దరఖాస్తులతో లాభములేదని తేలినప్పుడును, పంజాబు దురంతములు, పొరపాటున జరిగెనని త్రోసివేసినప్పుడును, నిరపరాధులగు భారతపుత్రుల హతముగావించిన హంతకునకును, దుర్నయముల "పొరపాటు"ని సమర్థించి ఆయుధభటులచే పరివృతుడై హోయిగగొలుపుచుండు యధికారికిని, నిట్టి పేదలగు హైందవుల కష్టార్జితమునుండి పెన్షనుల నిచ్చినప్పుడును, మహాత్మునకును సహకారమునందు విశ్వాస మడుగంటెను.

## సహాయనిరాకరణము

సహాయనిరాకరణమును గూర్చి విశేషముగ పలువురు చెప్పియున్నారు; పలువురు వ్రాసియున్నారు. అట్టి స్థితియందింకను దాని భావము తమకు బోధపడలేదని మనవిరోధులును, కొందఱు మనమిత్రులు సయితము అనినపుడు, నే నీయుపన్యాసమువలన వారినితృప్తిపఱుపజాలను. కావున సహాయ నిరాకరణ మనిన నేమియో క్లుప్తముగ చెప్పి వదలివేసెదను—పాపమును మన మెదుర్కొనజాలకపోయినను అధమపక్షము దానికి సహాయముచేయకుండనైన నుండవలెను. సహాయనిరాకరణసిద్ధాంత మిదియే. సహాయనిరాకరణోద్యమమున కవశ్యమగు, త్యాగపరంపరలఁ గావించుటకు భారతజాతి సంసిద్ధమైనచో, ప్రస్తుతవిదేశీయప్రభుత్వము స్తంభించి పోవునను మాట వాస్తవము. అట్టిఫలితము కలుగవచ్చునని మన మెఱుగుదుము. కాని కేవలమందుకొఱకే మనము కృషి సలుపుటలేదు. మనయుద్యమము విధ్వంసమునకే ఏర్పడినదని దానినామమునుబట్టి తోఁచుచున్నను, నిజముగ నట్టిదికాదు. విధ్వంసమునకన్న నిర్మాణమే దానిముఖ్యోద్దేశమై యున్నది. ప్రత్యక్షముగ నితరులను స్తంభింపఁజేయునుద్దేశము దానియందు లేదు; మన శక్తియే స్తంభించియుండుటచే మనయశక్తతను పాఱఁదోలుటకై సర్వయత్నముల సల్పుట ప్రధానవిషయము. సహాయనిరాకరణకార్యక్రమమందలి ప్రతివిషయమునకును విధ్వంసముతోపాటు బలవత్తరమైన నిర్మాణవిధికూడ గలదు. మననిర్మాణశక్తి నెట్లు విజృంభింపఁజేయుదుమో, దానినిబట్టియే మన జయాపజయములు నిర్ణయమగును. కాని విధ్వంసకార్యమును మానివేసి, అనగా, ప్రభుత్వమువారు తమ శాశ్వతకళ్యాణమునకును మన వినాశమునకును తోడ్పడుటకై నిర్మించిన సంస్థాపనల నన్నిటిని మన మింకను నుపయోగించుకొనదలఁచినచో, మనకు జయమును లేదు, అపజయమును లేదు. మనజాతి కేవలము నశించిపోవును. ఒకవేళ ప్రభుత్వమును స్తంభింపఁజేయుటయే మన ప్రత్యక్షోద్దేశమైనను ఉత్తమనైతికధర్మమునకు వ్యతిరేకము కాదు. నాఁటి ఏసుక్రీస్తు నేఁటి మహాత్మాగాంధిగారల ప్రేమతత్త్వమునకు సైతము వ్యతిరేకము కాదు. మరియు అట్లు ప్రభుత్వమును స్తంభింపఁజేయుట తప్పకసాధ్యమనికూడ నేను నమ్ముచున్నాను. మిత్రులారా! నేను కారాగృహవాస మనుభవించుచుండిన ప్రథమ దినములలోనే మనదేశపు చెఱసాలలలో గన్పట్టు సహకారపద్ధతుల గమనించి యాశ్చర్యమున మునిఁగితిని. మాసమునందంతయు సక్రమముగ ప్రవర్తించిన ఖైదీలకు ప్రతిమాసమునకును కొన్ని దినములు ఖైదు తగ్గింపబడును. ఈ పద్ధతి ప్రతిఖైదికిని వర్తించును. కాని జైలు ఉద్యోగులకు నమ్మకము గలిగించి వారిదయను సంపాదింపఁ గలిగిన ఖైదీలు కొందఱు ప్రతిమాసమునకును తమఖైదునం దెక్కువరోజులు తగ్గింపును పొందుటయేగాక కాపలావారుగను ఓవరుసీర్లుగను ఉద్యోగములను సంపాదింపఁ గలుగు

దురు. వారు ఖైదునందున్నంత కాలమును ఇంకను అనేకములైన సౌకర్యముల ననుభవింతురు. చెఱసాలయని వ్యవహరింపఁబడుస్వాతంత్ర్య ద్వారమును జొచ్చినవారు పలువురీసభాస్థలి నలంకరించి యున్నారని నమ్మెదను.

జీతములు పుచ్చుకొని పనిచేయు మామూలు 'వార్డరు' లతో పాటు, రాత్రివేళల గస్తీతిరిగి చెఱసాలను గాపాడుచుండు నీఖయిదీ వార్డరుల పనివిశేషమును వారెల్లరను (చెఱసాలకేగిన మిత్రులు) బాగుగ నెఱుంగుదురు. జీతము పుచ్చుకొను వార్డరులు కొద్దివుందియును సాధారణముగ సుఖనిద్ర ననుభవించుచునో, లేక కునికిపాట్లు పడుచునో, రాత్రి గడపుచుందురు. అసలు పనియంతయు చేయుచుండు ఖైదీ వార్డరులు, రాత్రి ప్రతి అరగంటకును జైలునాలుగుమూలలు ప్రతిధ్వనించుచున్నట్లు 'అంతా సురక్షితముగ నున్నదని' కేకలువేయుదురు. ఖయిదీ లీప్రకారము సేవఁజేయుచున్నంతవఱకును, జీతము పుచ్చుకొను వార్డరులు నిమ్మళమ్మనహృదయు లైనవారివలె హాయిగ నిద్రపోవచ్చును. మిత్రులారా! ఇదియే సహకారపద్ధతినిగూర్చి నే జెప్పదలఁచిన నీతికథ. మనము మనస్వాతంత్ర్యమును గోల్పోయినాము. మనవలెనే స్వాతంత్ర్యరహితులైన మనదేశీయులు కొందఱు సర్కారుకు తోడ్పడుట వలన, మనల నణఁచిపెట్టుటకు వీలగుచున్నది. ప్రభుత్వమున కీవిధముగ తోడ్పడుచున్న మనదేశీయుల కెవ్వియో కొన్ని స్వల్పసదుపాయము లున్నట్టులగపడినను, నిజమునకు వారును మనవంటి బానిసలే మనతోడి బానిసలు భారతవర్ష మను నీవిశాలకారాగారమున నెల్లదిశలనుండియు "అంతయు సురక్షితముగ నున్నదని యభయమిచ్చుచు కేకలిడుచున్నందున నేగదా, మనయజమానులగు స్వల్పసంఖ్యాకులైన విదేశీయులు హాయిగ విశ్రాంతిగైకొనుచు నిద్రింపఁగలుగుట! ఈ రెండుస్థితులకును గల భేద మొక్కటిమాత్ర మున్నది. మామూలు చెఱసాలలో వార్డరులగను ఓవరుసీరుగను నుండి తమతోడిఖయిదీల నణఁచిపెట్టియుంచినఖయిదీలు, తక్కిన ఖయిదీలకన్న కొంత త్వరితముగ బంధవిముక్తుల మగుదు మని యాశ గలదు. కాని మనసహకారవాదిస్నేహితులన్ననో, మనవంటి బానిసలగుటయే గాక మనకన్న ముందుగ విడుదల నొందఁగలమనుతృప్తి నైన ననుభవింపఁజాలరు. ఇదొక చిత్రము. వీరు దాస్యము ననుభవించుచున్నామను జ్ఞానమైనను లేక, తమ్ము బంధించుసంకెలలఁ జూచుకొని మురిసిపోవుచున్నారు.

నేను చెఱసాలలో వ్రాసినట్లు;

“వెఱ్ఱివాడా! నాకై చింతింపకుము. నీ దాస్యమును గూర్చి విలపింపుము.— నీవు దివ్యాభరణ మని దేనిని చూచుకొని సంతసించుచున్నావో, అదియే నీకు శృంఖల మగుచున్నది.”

## మహమ్మదీయుల కొక ధర్మసందేహము

మిత్రులారా! సిపాయివిప్లవమునాటి నుండి నేఁటిసహాయనిరాకరణశకమువఱకును గల చరిత్ర నంతయు నింతవిపులముగ చర్చించి, మీకును నాకునుగూడ విసుగుగలిగించితినని తలఁచుచున్నాను. పూర్వచరిత్ర వివరించుటలో నాయుద్దేశ మొకటి గలదు. మీపై నిరంకుశకారము నే వహింపఁజాలను. అయినను మీ తోడ్పాటు నాశించుచున్నాను. మహాత్మునికి గల ప్రతిభ నాయందులేదు. మిమ్ము సహమ్మెహితుల జేయవలెనను వాంఛగాని అందులకు వలయు వశీకరణశక్తిగాని నాకు లేవు. నాజీవితకాలమునం దర్ధభాగము శ్రమపడి తప్పుత్రోవల సంచరించి, చివరకు కావించుకొనిన సిద్ధాంతములను మీకును తెలియజెప్పవలెనన్న, మనకు పూర్వము అనేకతరములవారి యనుభవమును బట్టి కూడ నాయుద్దేశముల యాథార్థ్యము కల్లడికాఁగలదని రుజువుచేయుట కంటె వేఱుపద్ధతి కలదా? ప్రత్యక్షానుభవమే మన విజయచిహ్నము. ఏలయన మనల బాధించిన అస్త్రసముదాయమే అనుభవము. అఱువది వత్సరములనుండియు జరిగిన చరిత్రాంశములనుబట్టి నా సోదరమహమ్మదీయు లనుసరింపవలసిన మార్గమునుండి వారిని త్రిప్పివేయవలెనని ప్రబలయత్నములు సల్పఁబడుచున్నవి. కావున నీసందర్భమున వారి యనుభవమే వారికి పరమప్రమాణమని హెచ్చరించుచున్నాను. సహాయనిరాకరణోద్యమము నిష్ఫలమైనదని యొప్పుకొందము. మహమ్మదీయేతరులగు సోదరదేశీయులతోడి సహకారము కేవలము అసంభవము బూటకము వెఱ్ఱియే, అనుకొందుఁడు. (వాదమునకై తప్ప నేను దీనినంగీకరించుటలేదు.) అటులైనను సహాయనిరాకరణముకాక వేఱుమార్గమును మనము సూచింపవలెను గదా! ఈవిషయమున నాసోదరమహమ్మదీయులు నామార్గము నే యనుసరింప నక్కఱలేదు.-నాకే వారు మార్గదర్శకులు కావచ్చును. మనవిదేశీయయజమానులపట్ల సహాయనిరాకరణమును,తోడిబానిసలతో సహకారమును అసంభవములైనచో వేఱుమార్గమేమి చూపెదరు? తక్కినసంఘములతో సమానులముగువరకును ముందునకుసాగి వృద్ధినొందుటకు బదులు వెనుకకు నీడువవలెనా? విదేశీయులగు ప్రభువులతో సహకారమును నెరపి పూర్వమువలె మహమ్మదీయేతర ప్రజలతో పోరాడుదమా? అట్లొనర్చినచో ట్రిపోలీ బాల్కనుయుద్ధముల పిమ్మటను వంగదేశవిభజన రద్దుకావింపబడిన సందర్భమునను జరిగినదాని కన్న నెక్కుడు న్యాయము మనకు గలుగఁగలదను నాశయున్నదా? లేదు. లేదు. స్నేహితులారా! ఆయధ్యాయము ముగిసినది. మరల నావంక చూడఁజాలము. విదేశీయులపట్ల సహాయనిరాకరణము, స్వదేశీయులతో సహకారమును తప్ప మీకుగాని నాకుగాని వేఱుమార్గము లేదు. లేనిదాని విషయమై చర్చించి కాలహరణ మొనర్పనేల?

## మాంటాగుగారి రాజీనామా; దాని ప్రముఖత

లాసేనుసంధి యైన తరువాత మన కసంతృప్తికారణమే లేదని చెప్పుచున్నారు. ఒకటిన్నర సంవత్సరములు దాదాపు ఏకాంతశిక్ష ననుభవించినందుచే ప్రపంచవ్యవహారములతో నాకు సంబంధము లేకపోయెను. ఆకారణమున నాసంధి యెట్లుసంభవించెనో నాకంటె మీకే బాగుగ తెలిసియున్నది. నే నింకను కారాగృహమున నున్నకాలమున చేసికొనబడిన “సెవర్సు” సంధిని మార్చవలెనను ప్రయత్నసందర్భమున జరిగిన విషయములన్నిటినిగూర్చి కొంతకుఱకు ఆకాలమున ప్రకటింపబడినప్రభుత్వవార్తాపత్రిక సూచికలవలన తెలిసికొనగలిగితిని. మంత్రివర్గ

-తములైన రాష్ట్రీయప్రభుత్వములయొక్క సలహా గొని, కేంద్ర ప్రభుత్వమువా రిండియా మంత్రిగారికి పంపిన సుప్రసిద్ధమైన తంతి వార్తను మీ రెఱిఁగియే యున్నారు. అందు మహమ్మదీయ క్షేత్రములపై ఖాలీఫాగారి పరిపాలనముతప్ప, 'జజీరతుల్ ఆరబ్'ను ఖాళీచేయుటను గూర్చి ముచ్చటింపకయే పోయిరి. అందుచే వారు మహమ్మదీయాశయములను తృప్తిపఱుపకపోవుటయేగాక మహమ్మదీయ మతధర్మములనైనను పాటింపకపోయిరి. ఇండియా ప్రభుత్వమువారు "భారతదేశముయొక్క కోరికలను సంపూర్ణముగ సంతృప్తిచేయుట యసంభవము కావచ్చునని మాకు తెలియు"నని వ్రాయుచు, జజీరతుల్ ఆరబ్‌నుగూర్చి తమ రెత్తుకొనలేదని గట్టిగా కాకపోయినను మొత్తముమీద నొప్పుకొనినారు. ఛేంబర్‌లేనుగారు మాత్రము తురుష్కుల ప్రియమిత్రుల కోరికలనుకూడ నివి మించినవి" యని చెప్పుటకు సాహసించిరి. అట్లయ్యు నట్టితంతివార్తయొక్క ప్రకటనమువలన ప్రపంచమునం దంతటను గొప్పకలవరము కలిగెను. ఇండియామంత్రి రాజీనామా నియ్యవలయునని ప్రధానమంత్రి బలవంతముచేసెను. ఆరాజీనామాను శ్రీ చక్రవర్తిగారు "దయతో నంగీకరించిరి." అనగా మాంటాగూగారు నీచముగ పదభ్రష్టుడుగా చేయబడెను. పార్లమెంటున యూనియనిస్టుపక్షములలో నధికసంఖ్యాకులు ఛేంబర్‌లేనుగారి ప్రకటనమును, స్వాగతమును సూచించు గంభీరకరతాళధ్వనులతో గ్రహించి" రని రూటరు ప్రకటించెను. "భారతదేశ గర్భశత్రువులుసంపూర్ణానందముచే నోడలు మఱచిరి" అని రూటరు మరల వ్రాసెను.

"మాంటాగూగారిరాజీనామాను ప్రకటించినప్పటి కరతాళముల ప్రతిధ్వని యెన్నడును వినియుండలేదు, యూనియనిస్టుల స్థానమునుండి బయల్వెడలినను దీర్ఘమగుటచే సార్వజనీనముగ కనబడెను. కొందఱు ద్రేకపూరితులు చేతిరుమాళ్లనుగూడ విసరిరి." స్వపరిపాలనము విదేశీయప్రభుత్వము దాన మియ్యవలయునను నభిప్రాయమునే యిప్పటికిని నమ్ము భారతీయులలో, కార్మికపక్షము అధికారపదవికి వచ్చినయెడల తమ కేమో తవ్వి తలకెత్తుదు రను నమ్మకము కలదు. ఈ పక్షముయొక్కయు మాంటేగూగారి స్వంతపక్షముయొక్కయు అప్పటి యభిప్రాయము నీక్రిందివాక్యముచే రూటరు తెలియజేసెను. "లిబరలు లేబరు పక్షములవారు మూకీభావముతో ప్రకటనమును శాంతముగ గ్రహించిరి."

ఇందుచే నాపక్షములవారికి కూడ మాంటేగుగారి రాజీనామా సాక్షాత్సమ్మతము కాకపోయినను, అసమ్మతము కాదని తేలుచున్నది. ముసల్మానులకును బ్రిటిషుదేశమునకు మధ్యనుండు తగాదాలను సంతృప్తికరముగ పరిష్కరించుటలో మహమ్మదీయనాయకుల కున్నంత పరితాపము ప్రభుత్వమువారికికూడ కలదని యిప్పుడువారుచెప్పవచ్చును. "ఇండియాప్రభుత్వము బ్రిటిషు ప్రభుత్వముయొక్క బహుదూరస్థమైన సేవకప్రభుత్వముమాత్రమే యగుటచే, ఇట్టి సందర్భముల నెట్లు ప్రవర్తింపవలయునో యావిధిని సూచించుట" లార్డు కర్జన్‌గారి "కసహ్యాకరముగ" కన్పట్టుచుండ మన కట్టిపరితాపమువలన నేమిప్రయోజనము కలదు! పోనీయు, మాంటాగూగారు తన్ను మన్నించి [illegible]

రిగదాయని సంతసించుచుండ నాయనను శిక్షించుటకు కొంచెము పూర్వము లార్డుకర్జన్‌గారు పైమాటను వ్రాసిరి. "డెన్షావీ" నగరమున నొక్కతప్పునకే రెండుశిక్షణములున్నవని మాంటాగూగారికి తెలియదు కాబోలు! లార్డుకర్జన్‌గారి న్యాయస్థానము మాంటాగూవంటి నేరస్థులను మన్నించివదలక, అదే నేరమునకు బెదరించియు శిక్షించియు తప్పక రెండు శిక్షలను వేయుగల దని తెలియదు కాబోలు! ప్రభుత్వముతో సహాయనిరాకరణమును, మనలో పరస్పరసహాయమును. ననునీ రెండు పద్ధతులుకూడ రుచింపని మితవాద మహమ్మదీయసోదరులలో నొక్కడైనను బ్రిటిషువారు భారతీయమహమ్మదీయులభావములను లేశమాత్రమైన నాదరించె నని గుండెపై జేయివేసికొని చెప్పగలడా? ౧౯౦౫ సంవత్సరమున బంగాళావిభజనసందర్భమున మహమ్మదీయుల మిత్రుడనని బడాయికొట్టిన వెనుకటి వైస్రాయిగారు, (కర్జను) ౧౫ వత్సరములతర్వాత ఖిలాఫతును భగ్నముచేయుటచే మనకు కలిగిన సంతాపమునుగూర్చి యేమి చెప్పెనో చూడుడు. మాంటాగూగారికి ఆయన వ్రాసినయుత్తరములో నిట్లు వ్రాసెను: "ఈ సందర్భమున హిందూదేశము చేసినట్టియు, చేయుట కనుమతి నొసంగబడినట్టియు సంరంభము నాకర్థమగుటలేదు. ముసల్మానుల వ్యవహారములలో, భారతదేశాభిప్రాయమా ఎల్లపుడును, సిద్ధాంతము" కేంబ్రిడ్జియందు తన నియోజకవర్గము నెదుట మాంటాగూగారి క్రింది విధమున నుపన్యసించిరి:—

"సెవర్సుసంధియందు ఇండియాప్రభుత్వమువారుకూడ పాల్గొనిరి. ఆసంధిచే శాంతియే నెలకొల్పబడినయెడల యిండియాప్రభుత్వము భక్తితో దా నిననుసరించెడిది. నేనెల్లప్పుడును తలచినట్లుగనే శాంతిస్థాపనము కానపుడు వారు దాని మార్పుగోరిరి. తమదేశములందు నాసంధిచే శాంతికి భంగము కల్గునెడల తా మూరకుందురా యని కనడా, దక్షిణ ఆఫ్రికా, ఆస్ట్రేలియా, దేశములను ప్రశ్నించుచున్నాను." అధినివేశరాజ్యములందు స్వపరిపాలనము కలదనియు, తన రాజీనామా తరువాతకూడ నుద్యోగమునే పట్టుకొని వ్రేలాడుచున్న రీడింగుగారి పరిపాలమునందున్న దేశమున నట్టి స్వపరిపాలనము లేనేలేదనియు పాపము మాంటాగూగారు మఱచిరి కాబోలు! ఏవిదేశప్రభుత్వము సెవర్సుసంధిసందర్భమున తన స్వల్పసిఫారసులను సంపూర్ణముగను బహిరంగముగను, తృణప్రాయముగను నిరాకరించెనో, అట్టి ప్రభుత్వముయొక్క యొత్తిడివలన, కొన్ని శతాబ్దములనుండి యశ్రుతపూర్వ డగు మహానాయకుని నాలు వత్సరములు కారాగృహమున నుంచిన దీ యస్వతంత్రమగు నిండియాప్రభుత్వమే! డాక్టరు స్మట్సుగారుకూడ భారతదేశమునకును, అధినివేశ రాజ్యములకును గల యీ భేదమును సామ్రాజ్య సమావేశ సందర్భమున మరచిపోయెను. మనవలెనే యొకప్పుడు కోరికలన్నియు నిరాకరింపబడిన ఐర్లండుదేశ ప్రతినిధి స్మట్సుగారి కప్పుడు జ్ఞాపకము చేయవలసివచ్చెను. మాంటాగూగారు తన కేంబ్రిడ్జి యుపన్యాసమున వాదించిన నానిసే మాంటాగూగారితో మనము వాదించితిమి. కాని మాంటాగూగారు దేనిని వాదించి నిష్ఫలమనోరథులైరో యట్టివాదనము చేసినందుల కిండియాప్రభుత్వము వారనేక విధముల శిక్షించిరి. అప్పుడు మాంటాగూగారు మనయెడల సానుభూతిని చూపు

చున్నారని నాతో చెప్పిన మిత్రులు ఆసానుభూతి యిప్పుడెంత యస మర్థమైనదియు తెలిపికొనగలరు. మాంటాగూగారు బర్తరఫు చేయబడక పూర్వము కనీస మారుమారులు వారికి రాజీనామా నిచ్చుట కవకాశ ములు కలిగెనని నేననేకమారు లభిప్రాయముపడితిని. నాయభిప్రాయ ములు నిజ మనియే మాంటాగూగారి యీ క్రింది వాక్యములు తెలియ జేయుచున్నవి. "నేన నేకమారులు రాజీనామానియ్య బ్రయత్నించితిని. తమకు చేయబడిన పవిత్ర వాగ్దానము తృణీకరింపబడెననియు పునరా వృత్తిరహిత మయ్యె ననియు భారతీయ ముసల్మానులకు తెలియజేయుట కిష్టములేక నేననుమానించితిని." తుట్టతుద కాయన రాజీనామా యివ్వ నేయిచ్చెను. ఇప్పుడాయన ప్రభుత్వవర్గమున లేకపోవుటయే గాక కామ న్సుసభలో సభ్యుడుగాగూడ లేడు. ఇంతకంటె మనయాశయములను పునరావృత్తిరహితముగ కోల్పోతిమని వేఱె దృష్టాంత మేల ?

మిత్రులారా! వస్తుతత్త్వమున కాలము మించలేదు! భగవద నుగ్రహముచేతను మనహృదయపూర్వ కైకమత్యముచేతను మనము మన యాశయములను పూర్తిచేసి తీరుదము! లేదా తత్ప్రయత్నమున ప్రాణము వీడుదము!

## ఇంగ్లాండు, లాసేనుసంధి

వెనుక నేను చెప్పినవిషయములన్నియు ౧౯౨౨ సంవత్సరము నాటివి. మనయభిప్రాయములను తగినట్లాలోచింతుమని మనకు వాగ్దా న మొసంగబడెను. ఇంతలో తురుష్కులధైర్యముతో బ్రిటిషువా గ్దానముల సరకుగొనక తమశక్తిపైనను భగవత్కటాక్షముపైనను నాధారపడి బ్రిటనుయొక్క నిర్ణయప్రతినిధిని గ్రీసును సముద్రమున బడవైచిరి. అప్పు డీవ్యవహారమునుగూర్చి యింగ్లాండుయొక్క యభి ప్రాయ మెట్లుండెను? ఆసందర్భమంతయు నాకంటె మీకే యెక్కువగ తెలియును. అందుచే దానిగూర్చి కాలయాపన మొనరింపను. ఇంగ్లాండు యుద్ధరంగమున జయింపబడి రాజనీతి యను పేరుగల కుతంత్రములచే యుద్ధఫలములను టర్కీకందకుండ జేయవలయునని ప్రయత్నించెను. ఇచ్చటకూడ స్వపరహితనిపుణు లైన తురుష్కులకు విధిసాహాయ్యము సమకూరెను. లాసేనుసంధి తురుష్కులెంత రణశూరులో యుద్ధము చేయుటలో యంతరాజనీతికోవిదు లని స్పష్టీకరించెను. లాసేను సంధి యెట్లు సందర్భపడెనో లార్డుకర్జనుచెప్పినమాటల నాలోచింతము. టర్కీ నుండి త్రేసుదేశమును ఏష్యాయందలి తురుష్కుల గృహములనుకూడ దోచుకొనుడని గ్రీకుల నింగ్లీషువా రుద్బోధన చేసిరి. ఒకకాలమున కాన్‌స్టాంటినోపిల్ పట్టణమును గ్రీకులస్వాధీనము చేయవలయునని ప్రయత్నించిరి. కగ చీ విచారణతరువాత తనపుత్రులను ఫిరంగుల పాలు చేయుటకు నిరాకరించిన భారతదేశమును నమ్మజాలక విజయు లగు తురుష్కులపైన యుద్ధము చేయుటలో నధినివేశ రాజ్యములను సహాయము చేయుడని కోరి విఫలమనోరథులైరి. ఆట్లొనర్చిన బ్రిటిషు వారిప్పటికైనను పశ్చాత్తప్తులైనట్టి సూచనము కన్పట్టుచున్నదా! సెవ ర్సువంటి యొడంబడికలకును లాసేను సంధికిని నుండు కారణములందలి భేదమును కర్జనుగా రీక్రిందివిధమున సామ్రాజ్యసమావేశమున సెలవి నారు. "ఇటీవలిలో యుద్ధానంతరము చేసికొనబడిన యొడంబడిక లన్నియు జయముపొందిన జాతియొక్క బెదరింపులచే జరిగినవి. జయము నొందిన రాజ్యములన్నియు చేరి యపజయము నొందిన రాజ్యములు లేకుండగనే వారికి చెప్పకుండనే వారి షరతులను నిర్ణయించి వారిని శిక్షించుట యాచారమై యున్నది. అంతయు సిద్ధముచేసినతరువాత నేరస్థునకు శిక్షను తెలియజేయుటయు వా డప్పుడు మామూలు ప్రకార ము లబలబలాడుటయుకూడ నాచారము. అట్టి పరిస్థితులలో సెవర్సు సంధిషరతులు తయారుచేయబడి నిర్ణయింపబడెను. కాని టర్కీ ప్రతి నిధు లావరతుల నొప్పుకొననే లేదు. లాసేనునందు పరిస్థితులు మరి యొకలాగుండెను. అచ్చట టర్కీ కూడ యన్నిరాజ్యములతో సమాన ప్రతిపత్తులుంగలిగి సంధికి గడంగెను. సంధియందలి ప్రతిషరతును వారితో చర్చించు నావశ్యకత యుండెను. కత్తిని చూపుటచే గాక చర్చచేతను వాదముచేతను, రాజీచేతను వారి నొప్పింపవలసి వచ్చెను."

లాసేన్ సంధిని కర్జనుప్రభువు సమర్థించెను. మిత్రమండలి యొక్క కుటిలరాజనీతిని గొనియాడెను. ప్రధానములేనైనను అంత ప్రాణావసరములు కాని విషయములను గూర్చి గట్టిపట్టుబట్టి సంధిసభను విచ్ఛిన్నము చేసి, మరల యుద్ధము తెచ్చిపెట్టుటకు మిత్రమండలివారి రాజనీతి సమ్మతింపలేదని కర్జనుప్రభువు చెప్పుచున్నాడు. ఈ విషయంశ మునుగూర్చి విమర్శించుచు ఒక భారతీయపత్రిక—తురుష్కులయెడ అంతసానుభూతి గలదని ప్రసిద్ధిపడయని ఒకానొక పత్రిక యీ క్రింది విధముగ వ్రాసెను:

"యుద్ధము చేయుటకు ఇష్టములేని కారణమున నెమ్మదిగ, జాగ్రతగ సంధిచేసికొనుటయే వివేకమనుకొను రాజనీతి యెన్నడును ప్రశంసాపాత్రము గాజాలదు. కర్జనుప్రభు విట్లు చెప్పుచున్నాడు. మిత్రమండలివారికి యుద్ధముచేయుకోరిక లేదని తురుష్కులకు బాగుగ తెలియును. అయినను తమలోని యతివాదు లెప్పుడును యుద్ధమునకు కాలుద్రవ్వు నుద్రేకములో నుండుటచే తురుష్కులే చాల భయపడు చుండిరి. నిజముగ సంధికై యాశించు తురుష్కనాయకుల కోర్కెలు యెంతవరకు దేశములోని అతివాదులయొక్కయు, జాతీయవాదుల యొక్కయు దుర్నివార్యమగు మహోద్రేకము నాపగలవో మిత్రమం డలివారికి నిశ్చయముగ తెలియదు." కర్జనుప్రభువు చెప్పిన యీవాక్య ములనుబట్టి తేలినసారాంశ మేమనగా:— తురుష్కులు కేవలము కత్తి పోటుచేతనే తమ కోర్కెల నెరవేర్చుకొనిరని సిద్ధించు చున్నది. లాసేన్ సభలో పాలకపాలితులపదవులు తలక్రిందయ్యెను. లాసేన్ వద్ద సంధిషరతులను నిర్ణయించినది తురుష్కులే. వీరు నిర్ణయించిన షరతులకు మిత్రమండలివారు యుద్ధానంతర మిదివరకు జరిగినసంధులలో పైచేయిగనున్న మిత్రమండలివారు ఒప్పుకొనక తప్పినది కాదు....... వేయేల లాసేన్‌లో కత్తి త్రిప్పినవారు తురుష్కులే; మిత్రమండలి వారు గొణుగుకొనుచు విధిలేక తలయొగ్గవలసి వచ్చెను. చాలమంది యీ సంధిని తీవ్రముగ ఆక్షేపించిరి. ఈ ఆక్షేపణకు సమాధానము చెప్పుచు

నుప్రభు విట్లు చెప్పెను: ఈ "ఆక్షేపించువారు కేవల నిష్కళంక హృదయులని చెప్పుటకు వీలులేదు; అప్పటి పరిస్థితులలో నింతకంటె మంచిసంధి యింకొకటి యుండజాలదు."

లాస్సేన్ సభలో తురుష్కులు కొంత సంపాదింపగలిగిరి. ఎట్లు సంపాదింప గలిగిరి? తురుష్కులకు న్యాయము చేయుదు మను మంచి బుద్ధి యింగ్లీషువారికి పుట్టుటవల్ల కాదు. ఖిలాఫతువిషయమై భారతీయ ముసల్మానులకు గల గౌరవ భావమును, మత విశ్వాసములను మన్నింపుదు మను భావము యింగ్లీషువారికి కలుగుటవల్ల కాదు. ఇది గాక, మిక్కిలి యింగ్లీషువారికి తురుష్కులపై బహిరంగముగ ప్రబలమైనద్వేష మున్నప్పటికిని, యిస్లాము మతవిశ్వాసములందు యింగ్లీషువారి కెంతనిరాదరణ యున్నప్పటికిని—తురుష్కులు లాస్సేనునందు జయమొందగలిగిరని ప్రపంచమునకు మరియొకమాటు తెలియ వచ్చెను. లాస్సేనునందు కర్జనుప్రభువు ఇంకొకమాఱు కర్రత్రిప్పెడివాడే; కాని, పాపము!— కత్తి తనచేతిలోనుండ నింకొకనిచేతిలోనికి పోయెను!

నే నింతవఱకు బుద్ధిపూర్వముగ, కేవల మొక్క మహమ్మదీయాశయములనుగూర్చియు, ఖండాంతరములం దున్న తమసోదరమతస్థుల యెడ తమకు గలసానుభూతిని ర్చియు మాత్రమే చర్చించితిని. లాస్సేన్ సంధిసభవల్ల మన జాతీయవ్యవహారము లన్నియు పూర్తిగ పరిష్కారము కాలేదు. భరతఖండస్థులగు సమస్తజాతులవారికి సామాన్యధర్మముగ వర్తించు జాతీయాశయములన్నియు సంతృప్తికరముగ నెఱవేఱలేదు. ఇవి నెఱవేరకపోవుటయే గాక, ముసల్మానులకు ప్రత్యేకముగ సంబంధించిన మతవిషయికమగు "జజిరత్-ఉల్-అరబ్"కూడ యీలాస్సేనుసంధివలన పూర్తిగ పరిష్కారము కాలేదు. కాని, యేది యెట్లున్నను, భారతీయు లెల్లరకును సమానముగ వర్తించు జాతీయాశయములే ప్రత్యేక మహమ్మదీయాశయములకంటె చాల నెక్కువగ నున్నవి. లాస్సేన్ సంధివల్లగలిగిన ఫలితమంతయు ఒక్కటే గలదు:— తురుష్కులు తమస్వరాజ్యమును పోగొట్టుకొనలేదని యీసంధిసభ ప్రపంచమునకు చాటినది. నూటయేబదిసంవత్సరములకు పూర్వము మనస్వరాజ్యము పోయినదని ప్రకటించితిమి, తురుష్కులుకూడ అట్లే తమ స్వరాజ్యముపోయినదని యికకొద్దిలో ప్రకటించెడివారే. కాని యీసంధిసభ వచ్చి తురుష్కులు తమస్వరాజ్యమును పోగొట్టుకొనలేదని చాటినది. ఖిలాపతు సంఘములు కోరినమరతులును, అందు ముఖ్యముగ "జజిరత్—ఉల్—అరబ్"నకు సంబంధించిన మతాశయములును సంతృప్తికరముగ నెఱవేఱక యింతవఱకట్లే నిలిచియున్నవి. ఒకవేళ, యివన్నియు సంతృప్తికరముగ పరిష్కారమైనను ముసల్మానులు గవర్నమెంటుతో సహాయనిరాకరణమును మానుకొందురా? తక్కిన భారతజాతులతో సహకారమును మానుకొందురా? మహమ్మదీయేతరసోదరులవల్ల మనఃపూర్వకముగ అంతసహాయమును పొంది కూడ, మహమ్మదీయు లిప్పుడట్లుచేసినచో నింతకంటె అవాచ్యమును, సిగ్గుమాలినదియునగు మిత్రద్రోహ మఱండబోదు. ఇదియొకసంగతి.

ఇక రెండవ సంగతి యేమనగ:— భారతీయముసల్మానులు తురుష్కులకును, అరబ్బులకును, స్వరాజ్యము రావలెనని ఒకమూల యెంతో యాతురపడుచు, మరియొకమూల తమసొంతస్వరాజ్యము విషయమై బొత్తిగ చూచుకొనుటయే లేదని దీనివల్ల రుజువుకాగలదు. దీనినిబట్టి, "ఉట్టికెక్కనెలేనమ్మ స్వర్గానికెక్కగలదా?" యనుసామెత వీరికి తప్పక వర్తించును.

## సహాయనిరాకరణముగాక వేఱొకభయంకరమగు గత్యంతరము

మిత్రులారా! మీకు మరల చాలశ్రమ నిచ్చుచున్నాను గాబోలు. అయినను దీనికొక కారణము వచ్చినది. అందుకు నన్ను మన్నింతురుగాక. ముసల్మానులు ఇంగ్లండుతో సహాయనిరాకరణము మానుకొనవలసినదని కొందఱు చెప్పుచున్నారు. కాని, వారికి నేను చెప్పున దేమనగ:—

మన మిదివఱకు యింగ్లండుతో చేసిన సహకారమువల్ల కలిగిన విషాదానుభవములయొక్క ఫలితముగ మన మిక వారితో సహకారము చేయగూడదని విధిలేక నిర్ణయించుకొంటిమి. మన మిప్పుడిట్టినిశ్చయమునుండి మరలుటకు పూర్వము నిజపరిస్థితుల నొకసారి పరికించి చూడుడని కోరుచున్నాను. బ్రిటిషు సామ్రాజ్యమందు భారతదేశము కూడ యింగ్లండు అధినివేశములతోపాటు సరిసమానమగు భాగస్వామిగానంతవఱకు— భారతరాజ్యము ఆఱువేలమైళ్లదూరమందున్న బ్రిటిషు గవర్నమెంటుకు లోబడి దానికి ఉపాంగమై యున్నంతవఱకు— యిండియా గవర్నమెంటువారు చాలమంచివారని సంపూర్తిగ రుజువుచేసినను మేముమాత్రము వారు దయాదాక్షిణ్యములతో సంతృప్తి చెందజాలమను మాట నిశ్చయము; ముమ్మాటికి నిశ్చయము. పరప్రభుత్వమునకు భక్తిజూపుటయేగాక, మానవుడు భక్తిచూపవలసిన విషయము లింకను పెక్కులు గలవు. భారతీయముసల్మానులు తమదైవమునకును, తమతుదిప్రవక్తకును భక్తిజూపిరను కారణముచే వారిగవర్నమెంటునకు ద్రోహము చేసిరను నెపమున— మమ్ములను కరాచీలో శిక్షించినట్లు— శిక్షించుచున్నంతవఱకు— మాతుదిప్రవక్త తననిర్యాణకాలమందు మాకు విధించిన భగవన్నియమమునకు విరుద్ధముగ మా యిస్లాముపుణ్యభూములు మహమ్మదీయేతరులచేతులలో నున్నంతవరకు — దౌర్జన్యరహిత సహాయనిరాకరణము గాక, మాకింక మరియొక్కటే గత్యంతరము కలదు. మిత్రులారా! ఆ భయంకరమగుగత్యంతరము యుద్ధ మొక్కటే! మన పద్ధతిని నిరసించువారిలో చాలమంది గవర్నమెంటునిన భయపడి చచ్చిపోనిసలేయై యున్నారు. అదిగాక యేమాత్రము త్యాగముకూడ చేయుట కిష్టపడనివారగుటచే, వారాభయంకర మగు గత్యంతరమును గూర్చి కలలోనైన తలంపజాలరు. కావున మనపద్ధతులను మార్చుకొనవలెనను మాట మనచెవి కిక సోకనీయకుడు.

## మహమ్మదీయేతరులతో మహమ్మదీయ్యులసహకారము

ఇంగ్లండుతో సహకారము చేయకపోయినచో, నిక మనమహమ్మదీయేతరులతోకూడ సహకారము చేయ నవసరములేదని యర్థమగునా!

The Procession held in honour of the Congress President, Cocanada



దేశీయమహాసభాధ్యక్షుని ఊరేగింపు, కాకినాడ

Weaving Industry of the Adi-Andhras, Cocanada



ఆదిమాంధ్రుల ఖాది నేతపరిశ్రమము, కాకినాడ కాంగ్రెసు ఖాదీ ప్రదర్శనము

హిందూమతమందు గాఢమగుభక్తి గల ఆగాంధిమహాత్ముడు యిస్లాము మతమునకై పాటుపడుటవల్ల జైలునకు పోయెను. ఆ మహాత్ముడట్లు జైలునకుపోయినపిమ్మట అట్టివానితోడి మతస్థులతో మనమిప్పుడు సహకారము మానుకొనవలసినంత అవసరమేమి గలిగెను? హిందూముసల్మానులకిప్పుడున్న సంబంధము సరిగ రెండుసంవత్సరముల క్రింద నున్నట్లు లేదని నాకు తెలియును. ఏ ఒక్కజాతిగాని కేవలము నిర్దోషి యనియు, తప్పంతయు రెండవజాతిదే యనియు నిజమగు దేశభక్తుడెవడయిన చెప్పగలడా? మిత్రులారా! కుతంత్రమునందు నాకు నమ్మకము లేదు. అందులో రహస్యతంత్రమునందు నాకు బొత్తుగ నమ్మకము లేదు. కాని కేవలము "ఉభయత్ర దోష మున్న"దను మాటను మాత్రముచెప్పి యీ సమస్యను త్రోసివేయుటకు నేను నిష్టపడను. మలబారు, ముల్టాను, ఆగ్రా, సహారన్‌పూరు మున్నగు ప్రదేశములలో మన దురదృష్టవశమున మహాసంతాపకరము లగు ఘోరకృత్యములు జరిగెను. ఈ యుభయజాతులలో నెవరియం దేదోష మున్నదో కనుగొనుటకై జాతీయపంచాయితీ నొకదానిని నిర్మించుటకు నేను పూర్తిగ సమ్మతింతును. ఈ ఘోరకృత్యములవల్ల నెక్కువగ బాధనొందిన జాతి వారుమాత్రమే గాక తదితరజాతివారుకూడ బాధ నొందినట్లు వారేఒప్పుకొందురు. తామేతప్ప తక్కినజాతివారు బాధనొందలేదని ఎవరును (బాగుగా బాధనొందినవారు కూడ) చెప్పజాలరు. కాబట్టి సరియైన విచారణలేకుండ నేరమునంతను ఒక్కజాతినెత్తిమీదనే వేసి, దానినే నిందించినందువల్ల ఫలితమేమియు నుండదు. అది న్యాయముకూడ కాదు. ఉభయసంఘములనుండి సరియైన ప్రాతినిధ్యముతో నొక విచారణసంఘము నేర్పరచుటకు నేను ఢిల్లీలో నెంతమాత్రమును వెనుదీయ లేదు. కాని యట్టి విచారణసంఘమువల్ల సరియైన ఫలితమెప్పుడును నింతవఱకు లభించియుండలేదు. దానికి కారణముల నేనిట వివరించుట అనవసరము. ఏదియెట్లున్నను, మనకు రెండుసంగతులు మాత్రము స్పష్టముగ గన్పట్టుచున్నవి. ఈ ఉభయసంఘములలో దోషమెవరిదని మనమిచ్చట విచారించుచుండగ గవర్నమెంటు కోర్టులు ఊరకుండవు. వానిపనుల నవిచేయుచునే యుండును. గవర్నమెంటు కోర్టులలో ప్రమాణముమీద నిజమో, అబద్ధమో సాక్ష్యమిచ్చివేసిన పిమ్మట మనజాతీయ విచారణసంఘమువల్ల నిజమును తేల్చుట చాలకష్టమగును. అదిగాక గవర్నమెంటుకోర్టులలో సాధారణముగా అనుమానరహితమని చెప్పుటకు వీలులేని యేసాక్ష్యాధారమువల్లనో — కొందఱు దోషులుగ నెంచబడి శిక్షింపబడినపిమ్మట ఉభయసంఘములకును సమాధానము కుదుర్చుట బహుకష్టమగును; ఏలయనగ,— తప్పు ఎవరిదో కనుగొనుటకంటె కూడ ఉభయసంఘములకును పొత్తుకలుపుటయే చాల అవసరమై యున్నది.

## దివ్యౌషధము

ఇక కర్తవ్యమేమి? ఒకపక్షముయొక్క వాదమునుమాత్రమే యొప్పుకొనుట సమంజసము కాదు. మరియు నట్లుచేయుట, ఎవరిపక్షము విచారణయేలేక నిరాకరించితిమో వారియందు రాజీకిని మార్పునకును కావలసిన మనోధర్మమును కుదుర్చజాలము. వెంటనే యాచరింపవలయునని నేను నొక్కిచెప్పుచున్న ప్రతీకారము అన్నిటికంటె సుకరము. మఱియు నీవిషయమును ఢిల్లీయందు కూడిన యుపసంఘము చర్చించునపు డీపద్ధతినే సిఫారసుచేసిరి. హిందూమహమ్మదీయ వైమనస్యముల పరిణామములుగా నెచ్చటెచ్చట నల్లరులు జరిగెనో యచ్చటికి నెల్ల వెళ్లి విచారణచేయుటకొక యుపసంఘమేర్పరుపబడి, యందుసభ్యులుకూడ నిర్ధారణయైనతరువాత, కొంత చర్చ జరిగినపిమ్మట అందునాయకులభావములలో మంచిమార్పు కొంత కలుగుటచే, నీపద్ధతి నంతను రద్దుపఱచుటకు సిద్ధమైతిమి. రెండువత్సరములకు పూర్వముచేసినట్లు వెనుక జరిగిన విషయముల మఱచి పరస్పరము హృదయపూర్వక సహాయముచేసికొని స్వరాజ్యము సంపాదింపవలెనను నుద్దేశము జనించెను. మహాత్ముడెట్టియైక్యతను బోధించి యాచరించెనో యాయైక్యదేవతాదర్శనభాగ్యము మరల నిరుపక్షముల నాయకులను పొందగలిగిరి. పక్షజయములనొందుట నీచమనియు, మరల తోచెను. కాని యొకస్వల్పకారణముచే భేద ముద్భవిల్లి రెండు సంఘములును విడిపోయెను. సోదరులారా! ఐక్యదేవతాపునరుద్దర్శనము లభించునట్లును యీమూఱు తద్దేవతాకటాక్షము వెనుకటివలె తాత్కాలికము గాకుండునట్లును, భగవంతు డనుగ్రహించుగాక! అంతియెగాదు! జాతీయైక్యమూలమున కలుగు స్వాతంత్ర్య దర్శనములును, తదైక్యమును, మనశ్శత్రువులకు నెదుట కనబడుగాక. అట్టియైక్యమునకు ముందు దాస్యసంబంధముగల్గి సుఖముగ గన్పట్టు సర్వము అనుపమానాసౌందర్యములను వీడి శాశ్వతనాశమును పొందగలదు.

## ద్వేషకారణముల తుచ్ఛత్వము

అట్టి ప్రాముఖ్యవిషయములు అలంకారయుక్తములగు వాగాడంబరముల వలన పరిష్కరింపబడ వని నమ్ముడు. హిందూ మహమ్మదీయ సమస్య, అత్యంత — అత్యంతయేకాదు — ప్రాణావసరమైనసమస్యయైనను, హిందూ మహమ్మదీయైక్యతకు భంగము కలిగించు కారణములు మిక్కిలి తుచ్ఛములు. అన్నిటికంటె ఈకారణముల తుచ్ఛత్వమునకే నేను సిగ్గుపడుచుంటిని. ఈ కారణములెంత తుచ్ఛములైనను, వానివలన కలుగుచున్న అనర్థముల దలంచినప్పుడు సంపూర్ణ బాధ్యతాయుత స్వపరిపాలనమునకు మనకర్హతలేదని మనశత్రువులు మనపై మోపు నపవాదములకు, సమాధానము చెప్పజాలకున్నాము. నా సోదర మానవుల ఆరాధనాపద్ధతుల నెన్నండును పరిహసించు వాడను గాను.

రాజవీథిలోనికి వంగియున్న రావికొమ్మను నఱికి, యొకగజము త్రోవ నాక్రమించినందువలన గలిగినట్టిగాని, ప్రార్థనలు జరుగుచుండగా ప్రార్థనాలయముల యెదుట (మసీదులయెదుట) మృదంగాదులు, తప్పెట్లు మున్నగువానిని వాయించుటవలన గలిగినట్టిగాని, యల్పసంక్షోభకై మతరాజకీయ సంపాదనా ప్రయత్నముల భగ్న మొనర్చు సోదరదేశీయులును స్వస్థులును గలరని తలంచినపుడు నేను మిగుల దిగులుపడుచుందును. మంచి చెడుగుల గుర్తింపలేక, యింత యవివేకశూన్యుల మైత్రి మేని, మర్మమువిడిచి యట్లే యొప్పుకొందము. స్వాతంత్ర్యమునకు

దలంపకుందము. సామ్రాజ్యబహిర్గత స్వరాజ్యము మాటయుండనిచ్చి, సామ్రాజ్యాంతర్గత స్వరాజ్యముమాటనైనదలంపవద్దు. యీ మను మనవంటి బానిసలకును సంబంధ మేమి ? మనకును కెనిడాకును సంబంధమేమి ? వాని గుఱ్ఱపుసాలలో స్థానమునకైన నర్హత లేనప్పుడు సార్వభౌముని ప్రాసాదమున స్థానమునకై పెనగులాట నేల ? మహమ్మదీయ పవిత్రక్షేత్రము బహిరంగ నర్తనశాలలకును, విలాసమందిరములకును, నిలయమైన మన కేల ? మహమ్మదీయ పవిత్రస్థానములలోకెల్ల మహాపవిత్రమైన మెక్కా పుణ్యభూమిని బరిరక్షింప నేర్పరచిన నూతనపాలకుడు సామ్రాజ్యదొరతనముచే బోషింపబడు దుర్బలుడై, సామ్రాజ్యప్రదర్శనములోని యాటబొమ్మగా గాక, భగవానుడు నన్ను మానవునిగా సృజియించెననుమాట నెఱుంగక, తన్ను దామఱచినప్పుడు తన పూర్వీకుల సింహాసనమునుండి ద్రోసివేయబడి, పదభ్రష్టుడైన మనకేమి? అమలకాశ్యత్ వృత్తములును వాయిద్యములతో గూడిన మహోత్సవములును దప్ప నన్యములు మనదృష్టికి గాన్పింపనియెడల మన కాంగ్రెసుసభలును, ఖిలాఫతు సభలును, కేవలము హాస్యాస్పదములు. 'ఇంక విరమింతము, హాస్యప్రదర్శనములవలన ప్రయోజనము లేదు" బాల్యచేష్టల కింక స్వస్తిజెప్పెదము. తత్క్షణమే వెనుకకుమరలి, మన దారిను మనము గుర్తించుకొనుటకై యింతటనుండియు పాటుపడెదము బానిసజాతి కదియే చేయదగినపని. స్వాతంత్ర్య నామమును వృధాగాకళంకభూయిష్ఠ మొనర్పవద్దు. మన యొప్పుదలచే మన వైరులు చెప్పిన మాటలనే బలపఱచెదము. ప్రాచ్యమత ప్రవక్తలెవ్వనిగూర్చి పక్షపాతరహితులై మన కుద్బోధించియుండిరో, అట్టిభగవానుడు, మనల స్వపరిపాలన కనర్హులజేసి, పిరోపాఖండమున వసియించు శ్వేతముఖులకే యట్టియర్హత యొసంగి, భారతవర్ష పరిపాలనము ఆచంద్రార్కము వారలకే పట్టముగట్టి, మానవకోటిలో నైదవవంతు ప్రజల కన్యాయము జేసెనని యొప్పుకొందము. ఆధ్యాత్మికపరు లగు, మనపూర్వీకులగూడ నపకీర్తిపాలు గావింప నిచ్చగింపమేని, పక్షపాతరహితుడగు భగవానుని దూషింప నిచ్చగింపమేని, మన యాదర్శముల సఫలమొనర్చుటకై పరివర్తన మొందెదము. ప్రజాపంతతుల నడుగంటజేయక యుద్ధరింతము.

## ద్వేషమూలము

జనసామాన్యముయొక్క హీనస్థితినిగూర్చి చెప్పితిని గాన, వారినిగూర్చి యింకొకమాటకూడ చెప్పవలసియున్నది. గవర్నమెంటు విశ్వవిద్యాలయములలో నొసంగబడువిద్యను విమర్శించుచు నేను 1920 సం॥లో వ్రాసినవ్రాతలు ఇప్పటికిని నిజముగనే యున్నవి. ఈరోజున కూడ "మూఢత్వమనునది అల్పవిద్యావతులనే మదోన్మత్తుల జేయుచున్నదిగాని అమాయికులును, విద్యావిహీనులు నగు జనసామాన్యమును కాదు" మనమతమందుండు నభిమానముచే గాదు మనము పరమతస్థులతో కలహించుట, మనలోనుండు స్వాతిశయము, తుచ్ఛస్వార్థమువల్లనే మనమిట్లు కలహించుచున్నాము. మహాత్ముని యాగమనమువల్ల ఈచిన్న చిన్న "రాజ్యము" లన్నియు నశించినవి. అంతేయు నేకముగ ఒక్కటే అఖండమగు "రాజ్యము" స్థాపింపబడెను. ఈ అఖండరాజ్యమునకు ప్రధానసేవకుడుగ నుండుకీర్తి ఆమహాత్మునకబ్బెను. కాని తమసింహాసనముల గోల్పోయిన యీ పిల్ల "రాజులు" ఒక్క అఖండమగు జాతీయ పతాకముక్రింద దేశసేవ చేయుదమనుబుద్ధి వీరికి గట్టిగ కలుగలేదు; అందుచే వారు లోలోపల గొణుగుకొనుచునేయుండిరి. కానిమహాత్ముడును వారిప్రధాన అనుచరులును, బయటనున్నంతకాలము ఈచిల్లర రాజులు తిరుగుబాటుచేయుటకు ధైర్యములేక ఊరకుండిరి. వారికి భారతదేశమందు రెండే గత్యంతరములుండెను. పరరాజులకు బానిసలై ప్రజలచే బహిరంగముగ చీవాట్లయినను తినవలెను; లేదా లోలోన గొణుగుకొనుచు మెదలకుండ జాతీయోద్యమమందైన నుండవలెను: కాబట్టి వారు వీనిలో రెండవదానినే యవలంబించిరి. కాని, మహాత్ముడు ఎరవాడజైలునకు పోగానే, వీరు మరల తలలెత్తిరి. కాని, ఆయున్నతస్థాన మలంకరించుటకు వీరికి సమర్థత లేకపోవుటచే, వీరు జాతీయోద్యమమును నాశనముచేసి తమతమ "చిన్న రాజ్యముల"ను తిరిగి స్థాపించుకొనుటకయి వీరు శాఖాభిమానములను, యీర్ష్యలను నిరంతరము—బహిరంగముగ కాకపోయినను—పరోక్షముగనయిన పురికొల్పిరి. మహాత్ముని యాగమమునకు పూర్వము అనేకపిల్లకాలువలు—కొన్ని చిన్నవి, కొన్ని పెద్దవి—దాదాపు ఒకేదిశకు ప్రవహించుచుండెను; ఈకాలువలలో చిన్నపడవలు నడచుచుండెను. కాని మహాత్ముడు రాగానే, యివన్నియు నేకమై ఒక్కమహానదియై గంభీరధ్వానముతో సాగరసంగమ మొనర్చుటకయి ప్రవహించుచుండెను. ఈపిల్లకాలువలన్నియు ఆమహానదికి ఉపనదులయ్యెను. విశాలమగు ఈ గంగాప్రవాహముపై బలిష్ఠమగు నౌకయొకటి నడచుచుండెను. ఈనౌకను ఉత్సాహవంతులగు నావికులు నడుపుచుండిరి; ఈ నావికులకందఱకును మహాత్ముడు నాయకుడుగ నుండెను. ఈనావపై జాతీయపతాక యెగురుచుండెను. మహాత్ముడు జైలునకు పోయిన తరువాత అల్పమానవు లగువారికి గలిగిన అల్పబుద్ధి లేమనగా:—ఈ పెద్దనావను తీసివేసి, చిన్నచిన్న పడవలను జేయవలెనని వీరు సంకల్పించిరి. కాని మహాగంభీరధ్వానముతో సాగరసంగమ మొనర్పబోవు యీమహానదియందుకొరకు ఈచిన్నిపడవలు నిలువనేరవు. కావున వారు ఈప్రకృతినే తలక్రిందు చేయదలచిరి. అనగా, ఈమహానది చీలి వెనుకకుపోయి, చిన్నచిన్న పిల్లకాలువలుగ ప్రవహింపవలెనని వీ రాజ్ఞాపించిరి. కాని, ప్రకృతిని వీరు నిరోధింపజాలరు. గంగాప్రవాహమును వెనుకకు మరల్పదలచుట నిష్ప్రయోజనమని యెంతటిమూర్ఖునకైనను తెలియును. ఈకాంగ్రెసు మహాసభ పేరిటను, భారతజాతియంతటి పేరిటను, వేయేల సర్వనియామకుడగు ఆ భగవానుని పేరిటను, నేనీయల్పాశయులగువారికి హెచ్చరించి చెప్పునదేమనగ:—మీరెంత తన్నుకులాడినను మీరు జయింపలేరు. మీరు పన్ను కుతంత్రములను భారతజాతి యుపేక్షింపజాలదని యెఱుంగుదురుగాక.

## సహనము, భ్రాతృవాత్సల్యపూరితమగు ఆత్మార్పణము

మిత్రులారా! రాజకీయరంగమందుకూడ నేరస్థులను దండించుట నిరుపయోగముకాదు. కాని .రాజకీయవిభేదములనే నివిఱు చెప్పి

నట్లు ఒక్కచే తిరుగులేని మందుకలదు. అందరుకూడ గతంనాస్తి యను కొని వెనుకటిదాని నంతను మఱచిపోయి ఒకరినొకరు మన్నించుకొన వలెను. అందరిలోను ఇట్టిభావము పుట్టునట్లు చేయుటయే దీనికి తగిన మందు. కాని, ఇది ఒక్కటియే చాలదు; సంతాపకర మగు నిట్టియుక్ర త్యములికమీద జరుగకుండ వారింపవలె నన్నచో కలహకారణములను తొలగింపవలెను. అన్ని విషయములలోను సదా ఒకరీతిగ నుండవలెనని మనము తరుచుగ బట్టుబట్టుచుందుము. ఇట్లు పట్టుబట్టువారు ఒక్కసామందులేగాదు; విశాలహృదయులగువారిలోకూడ చాలమంది యిట్టే పట్టుబట్టుదురు. దేశములో చెదరిపడియున్న నానాగకపు మతసిద్ధాంత ములనన్నిటినికలిపి ఒక్కముద్దగచేసి పెట్టవలెనని మతసంస్కర్తలుయత్నించిరి. కాని యిది చాల అపాయకరమైనసంగతి. అదేమో గాని ప్రతిమత సంస్కర్తయు నిట్లే చేసెను. అన్నిమతములలో నుండియు కొంచెము కొంచెముగ తీసికొని ఒకచోట చేర్చి దానిని కలిపి ఒక క్రొత్త మతముగ చేసినచో నిది అందరికిని సమ్మతముగనుండునని వారు తలచిరి. ఈరీతిగ ఐకమత్యము, సమానత్వము సిద్ధించునని వారూహించిరి. కాని సర్వమత ముల నిముడ్చుకొనగల యిట్టిమెత్తనిమతమువల్ల ప్రపంచమందు శాంతి యు ఐకమత్యమును పెంపొందినట్లు చరిత్రయందెచ్చటను లేదు. మీదు మిక్కిలి యిప్పటికి కలహించుచున్న మతములలో నిదికూడ నింకొకటి కాజొచ్చెను. అందుమూలమున నిదివఱకున్న విభేదములు మఱింతయెక్కువయ్యెను. సదుద్దేశములతో ప్రారంభింపబడిన యీ మతసంస్కరణము లిట్లు నిష్ఫలమగుటవల్ల తుదకు ప్రజలు గత్యంతరము లేక పరమతసహనము నేర్చుకొనక తప్పినదికాదు. సహన మనగ ఉపేక్ష కాదు; దృఢ విశ్వాసము లేకపోవుట కాదు. స్వమతమందు మనకున్న గాఢవిశ్వాస ముతోపాటు మనజీవితమం దిదికూడ నింకొక గట్టితత్వమై యున్నది. కేవలము పరస్పరవిరుద్ధాభిప్రాయములు గల తనతోడిదేశీయునితో ఒకానొక అమెరికను దేశస్థుడుచెప్పినమాటలకంటె నే నీవిషయమై యెక్కువగ విప్పి చెప్పజాలను. అతడు చెప్పినమాట లివి:

"నీవు చెప్పిన ప్రతిఅక్షరముతో నేను తీవ్రముగ వ్యతిరేకించు చున్నాను. కాని, నీ వామాటలు చెప్పుటకు సంపూర్ణమైనహక్కు గల దని నేను వాదింతును; అట్టి నీ హక్కును నిలువబెట్టుటకై నా శరీరము లో నెత్తురుచుక్క ఉన్నంతవఱకు పోరాడి తీరుదును." మిత్రులారా! ఇదే! నిజమైన సహన మనగ నిదే! మతస్వాతంత్ర్యమున కెప్పుడైన భంగము కలిగినచో, తద్రక్షణార్థమై ముసల్మానులు పోరాడియైన తీరవలె నని విధించు కొరాను గ్రంథము సహనమునుగూర్చి యీరీతిగ చెప్పు చున్నది.— "నీకు నీ మతము, నాకు నామతము." అను యీ సూత్ర ముపై నడచుట కంగీకరించుచు, అన్ని మతములకు సామాన్యధర్మములుగ నుండువానిని సదాయెత్తిచెప్పుచు, అన్ని మతములకుగల యింపు ఆధ్యాత్మిక సంపత్తిని గ్రహించుచు, మనము వ్యవహరించినచో ఈ లోకమందు కలహ మేయుండదు. ఎల్లెడలను శాంతియు, హాయియు, రాజ్యముచేయును.

**ఈతత్త్వమును ప్రస్తుతపరిస్థితులకు వర్తింపజేయుట**

నేడు భారతవర్షమందు నానాజాతులమధ్య నున్న పరిస్థితులకీ సూత్రమును వర్తింపజేసి చూతము.

ఉదాహరణ:— పల్లీకు రోడ్లవెంట మేళతాళములతో ఉత్సవము చేసికొనుటకు వీలున్నప్పుడు,- ఉచితరీతిని దైవారాధన మొనర్చుకొనుట లోనగు తన సహజహక్కునకు భంగము కలుగనంతవఱకు ముసల్మానులెవరును హిందువులయొక్క గాని తదితర మహమ్మదీయేతరు లయొక్క గాని ఉత్సవములను అడ్డగింపరాదు. ప్రాణమునకు గాని, శరీరము నకు గాని హాని లేకుండ పొడుగుపాటికర్రను ఎత్తుగ వీధులవెంట ఉత్సవముతో తీసికొనిపోవుటకు వీలున్నప్పుడు, మహమ్మదీయేతరు లెవరును అట్టి యుత్సవమును అడ్డగింపరాదు.

ఈ యుత్సవములు శాస్త్రసమ్మతము లగునో కావో సందేహాస్పదము. అయినను ఇట్టి యుత్సవములు చేసికొనుచుండగ మధ్య త్రోవలో నడ్డమువచ్చిన చెట్టుకొమ్మలను కొట్టివేయుటకు దాని యజమాను డంగీకరించి తీరవలెనని ఉత్సవము చేసికొనుచున్న మహమ్మదీయులు పట్టుబట్టుట కెట్టిహక్కును లేదు. అందు ముఖ్యముగ ఆచెట్టు అతని స్థలములో నుండి అతని సొంతఆస్తి అయినప్పుడును, ఆతడు దానిని పూజ్య భావముతో చూచుకొనుచున్నప్పుడును, మహమ్మదీయు లట్లు పట్టు బట్టుట కెట్టిహక్కును లేదు. ఆచెట్టునం దాతనికి పూజ్యభావ మేర్పడుట సహేతుకమో, నిర్హేతుకమో మనము చర్చింప నవసరములేదు. అది మనపనికాదు పారశీకులు అగ్నిని పవిత్రమైన దానినిగ నెంచి పూజించుదురుగాక. పూజ్యమైన యీయగ్నిహోత్రముతో చుట్టను గాల్చి, దాని నపవిత్ర మొనర్పరాదని పారశీకులు తలంతురుగాక. అయినను, బహిరంగప్రదేశములలో చుట్ట కాల్చకూడదనుచట్టము లేనంతవరకు పారశీకేతరులు వీధులలో చుట్టకాల్చకూడదని పారశీకులునిర్బంధింప రాదు. అదే రీతిగ, జంతువులను చంపుట చట్టవిరుద్ధము కానంతవఱకు, తనతిండికొఱకో యితరులకొఱకో, బలియర్పణాదులకొఱకో, ప్రత్యేక మాజంతువు నెడ క్రౌర్యమును ప్రకటించువిధమునగాక సామాన్యరీతిగ నెవడైన కోడినో, ఆవునో, పందినో, తదితరజంతువునో చంపినప్పుడు పొరుగింటివాడు వచ్చి తా నది సహింపజాలననియు, యేప్రాణియు చంపబడగూడదని యు, తాను గోవును తల్లితో సమానముగ జూచుకొందుననియు, అసహ్యకరమగు పందిమాంసమును తినుట తనకు గిట్టదనియు, తన మత రీత్యా జంతువుల నింకొక రీతిగ చంపవలసియుండు ననియు లోనుగా గల కారణములచే అభ్యంతరపెట్టగూడదు. కాని యీసందర్భమందు మన మింకొక విషయమును మాత్రము గుర్తింపవలెను. ఆ చంపబడు జంతువు ఆ చంపువానిదే యైయుండవలెనుగాని, తన పొరుగింటివాని నుండి బలాత్కారముగ లాగికొనినది కాగూడదు. కాని నా హక్కును నేను స్వేచ్ఛగ వినియోగించుకొనుచుండగ, దానిని చూచి రెండవ వాడు సహింపగలస్థితి—అయ్యో!—మనదేశమున కింకను రాలేదు. పైపెచ్చు మనలో చాలమంది ఇదినాహక్కు అని చెప్పుచు, తమ పొరుగువారికి ఇబ్బంది కలుగజేయుద మనుసంకల్పముతోనే వారా హక్కును వినియోగించుచున్నారు. తప్పక పొరుగువారికి నిబ్బంది కలుగజేయు విధముగనే వారా హక్కును వినియోగించుచున్నారు. మతనిబంధనలందు చెప్పబడినరీతిగ నెవరైన ఉత్సవములు చేసికొనుచుండగ తదితరమతస్థులు దానిని చూచి వెక్కిరించుటయు, కొందఱు

ఉపాసనామందిరములలో ప్రార్థనలు చేసికొనుచుండగనో, లేక తకర్మ జరుగుచుండగనో యితరులు వచ్చి డప్పులతోడను, తదితర త్రములతోడను ఒక్కని సంగీతము గాక బుద్ధిపూర్వకముగ మహారణ ణధ్వనిని జేయుచు లోపల జరుగుకర్మకు భంగము కలిగించుటయు, గాంధువులకు పవిత్రములగు చెట్లకొమ్మలను వీథిపై వ్రేలాడుచున్న వానిని, నిర్హేతుకముగ కొట్టివేయుటయు; అందు ముఖ్యముగ కేకింతలు గొట్టుచు నటికివేయుటయు చుట్టపొగను పారశీకుని మొగముమీద గాని, శిక్కు మొగముమీద గాని వదలుటయు; అల్లరికొఱకు జైనుల కెదురుగ అనేక ప్రాణికోట్లను చంపుటయు; ఆవునకు మెడలో పూల దండలువేసి హిందువులున్న వీథులగుండ ఊరేగించి కసాయిదుకాణము నకు తీసికొనిపోవుటయు; లేక హిందువులు చూడకుండ తప్పించుకొన లేని ప్రదేశములలో గోవులను చంపుటయు; — మొదలుగాగల అనేక దుష్కృత్యములు సంఘములమధ్య పట్టుదలలు ప్రబలినపుడు తఱచుగ జరుగుచుండును. ఇట్లు క్రోధము రగుల్కొను పనులు చేయుటచేతను, పొగరుబోతుతనముగ నితరులను జూచి కేకింతలు గొట్టుటచేతను పరుష భాషణములు బయల్వెడలును. దానిమీద చేతులుకలిసి గ్రుద్దులాట కొనికి దిగను. దీనివల్ల తఱచుగ ప్రాణనష్టముకూడ సంభవించును.

## వీనితో నెగ్గుటెట్లు?

ఇటువంటి విషయముల నన్నిటిని సమగ్రముగ పరిష్కరించి శాంతిని గాపాడగల సమర్థమైనపట్టి యొక్కటియు గానరాదు. వీని యన్నిటికిని పూర్తిగవర్తింపగల "జాతీయపు టొడంబడిక" నా కేదియు గానరాకున్నది. ఇతర ప్రపంచము జూచి యెగ్గలకు నవ్వినను సరే యను గాని ప్రతి చిన్నవివరమును, ప్రతి చిల్లర తగాయిదాను ఒక్కదాని నైన వదలిపెట్టకుండ దానిలో నిఱికించి, పెద్దభారతముగ చేయుదము న్నను నాకట్టి "యొడంబడిక" యేదియు గన్పట్టకున్నది. కాబట్టి దీనికి నాకొక్కటే మంచిమందు గన్పట్టుచున్నది. ఎవరి హక్కులను వారు చక్కగ వినియోగించుకొనుటకు తగిన సరియైన వాతావరణమును కల్పింపవలెనని నేను మరల నొక్కిచెప్పుచున్నాను. ప్రధానమగు కలహకారణములను గుర్తించి, ఆయాసంఘములకు చెందిన నాయకుల కొక సమాధానమునకు రప్పించి, ఆకలహకారణముల తొలగింపజేయ వలెను. ఈపని నిర్వహించుటకు కాంగ్రెసువంటి జాతీయసంస్థకు సాధ్యముకాగలదు. ఈపనిని కాంగ్రెసు చేసితీరవలెను. కాంగ్రెసు మహా సభ యిట్టి నాయకుల ద్వారా ప్రజాభిప్రాయమును చక్కగ తనవైపు నకు త్రిప్పుకొనుచు, ప్రజలలో నెట్టియకృత్యములు జరుగకుండ జాగ్రత్తగ కాపాడుకొనుచు, ధైర్యమును ఆత్మవిశ్వాసమును గోల్పోవకుండ నుండవలెను. మరియు నింకొక విషయములోకూడ కడుజాగరూకతగ నుండవలెను. ఏసంఘమునగాని తనహక్కులను వదలుకొనుమని కోర కూడదు. ఇప్పటి పరిస్థితులలో నిట్లు చేసినచో, అది తనకు మించిన త్యాగము కావచ్చును. స్వరాజ్యమే మనయాదర్శము; అది కొద్దిలో మనకు లభింపగలదు; అయినను దానిని మన మింకను పొందవలసి యున్నా మనుమాటనుమాత్రము మరచిపోగూడదు. స్వరాజ్యము మనకు పూర్తిగ హస్తగతమగువరకు, గవర్నమెంటువలె ప్రజలను నిర్బంధించు టకు మన కేమియు అధికారముద్ర లేదు. మనము కేవలము ప్రజలను బ్రతిమాలుకొనుటచేతను, ప్రోత్సహించుటచేతను, మనము స్వయ ముగ చేసి చూపించుటచేతను మాత్రమే ప్రజలజేత పనులను చేయింప వలసియున్నది. రేపు మనకు స్వరాజ్యము వచ్చినప్పుడుకూడ, వారికి తగిన ప్రతిఫలము చూపకుండ తమహక్కులు వదలుకొనితీరవలెనని గొప్పగొప్ప ప్రజాసంఘములను మనము జయప్రదముగ నిర్బంధింప జాలము. అట్లు నిర్బంధించుట న్యాయముకూడ కాదు.

## గోహత్య

ప్రస్తుతము విచారణీయాంశములలో గోహత్య యొకటి. నాహిందూసోదరుల దృష్టిలో గోవు యెంతపవిత్రమైనదో నేనెఱుగుదును. గోవును రక్షించుటకై మానాయకు డెంత తాపత్రయపడెనో నాకంటెను నా సోదరునికంటెను యెక్కువగ తెలిసినవారెవరైనను న్నారా? అంతటి స్వార్థరహితబుద్ధితో ఖిలాఫతు ఉద్యమమును నడిపించిన మానాయకుని మహోదారబుద్ధి కేవలము అతీతమైనది. తాను ముసల్మానుల గోవును—అనగ ఖిలాఫతును— సంరక్షింప నుకట్టితినని ఆమహాత్ముడే చెప్పుచుండెడివాడు. తానిట్లు చేసినచో, దానికి ప్రతిఫలముగ మహమ్మదీయులు తనగోవును సంరక్షింప నుద్యుక్తులగుదురని యాతడుద్దేశించెను. దయకు ప్రతిఫలము దయయె గాక వేరొండు లేదని తమ మతగ్రంథములనుండి నేర్చుకొనిన మహమ్మదీయులు తాను చేసినదానికి ప్రతిఫలముగ తనగోవును సంరక్షింప బూనుదురని ఆమహాత్ము డాశించెను. గోవునందు మహాత్మునకున్న ప్రేమను ఈరీతిగ వ్యక్తపఱచెను. ఖిలాఫతు మహమ్మదీయులకు గోవని మహాత్ముడు మనోహరరీతిగ వర్ణింపకముందే మాయిరువుర సోదరుల మెన్నడును గోవును చంపగూడదని శపథము చేసికొంటిమి. అప్పటి నుండి మాయింటిలో నౌకరులుకూడ గోమాంసమును తినుటనుమాని వేసిరి. మాతోడిమతస్థులనుకూడ యిట్లు చేయుడని ప్రోత్సహించుట మావిధిగ పెట్టుకొంటిమి. నేనుగాని, మా అన్నగారుగాని యెప్పుడును గోవును వధింపలేదు. కాని, మేకలను బలియిచ్చితిమి; యేదోయొక జంతువును బలియిచ్చుట మామతవిధియై యున్నది. ఈరీతిగ మనము చాలవరకు పనిచేయవచ్చును. హిందూమహమ్మదీయైక్యత యేర్పడిన యీమూడునాలుగు సంవత్సరముల యనుభవమునుబట్టి స్వరాజ్యము రాకముందే గోవధను నామమాత్రావశిష్టముగ తగ్గించివేయవచ్చునని తెలిసికొంటిని.

ఆహారమునకై సాధారణముగ సంవత్సరముపొడవునను జరుగు గోవధపూర్తిగ నిలిచిపోవలెనని నాకెంతయో గట్టికోర్కె గలదు. కాని, అది యింతత్వరలో నిలిచిపోవలెనని నేను ఆశించుకోర్కె యిప్పటిలో నెరవేఱునట్లు నాకు గోచరమగుటలేదు. ఎక్కువ ఖరీదు గలమాంసమును కొనుక్కొనగల మహమ్మదీయులు సాధారణముగ గోమాంసమును తినరు. కాని, పట్టణములలోనుండు పేదమహమ్మదీయులకు అదే ప్రధానమైన ఆహారముగానున్నది. గోహిందూదేశమధ్యమరడి

వచ్చిన నేను, వారిప్పటిస్థితిలో గోమాంసభక్షణము మానుకొనుట యెంతకష్టమో యెఱుగుదును. "ధాన్యముతో ధాన్యము కలుపుకొని తిను" మనుష్యులను చూచినప్పుడు పఠాను మనుష్యుడు ఆశ్చర్యపడక మానడు. "మాకు మాంస ముండితీరవలెను; చివరకు కుక్కమాంస మైన సరే మాకుండితీరవలె"నని రాంపురపు హాస్యగాండ్రు చెప్పుదురు. ఒకప్పుడు రాంపురసంస్థానములో, బ్రిటిష్ మునిసిపాలిటీలలో చేసి నట్లు మాంసపు దుకాణములనన్నిటిని మూసివేసి, ఒక్కచోట నే పెద్ద మాంసపు మార్కెట్టును పెట్టిరి. దీనివల్ల ప్రజలందరికిని మాంసము సప్లయిచేయుట బహుకష్టమయ్యెను. సప్లయి చాలనందువల్ల పోటీ యెక్కువయ్యెను. ఈ తరగతిమహమ్మదీయుల విషయములో మాత్రము ప్రస్తుతస్థితిలో ఆర్థికముగ తప్పనిసరి యగుచున్నది

ఈ సందర్భములో గోవధను మాన్పుట కొక్కటే మార్గము గలదు. ఇప్పుడు తక్కిన మాంసము బహు యెక్కువ ఖరీదునకు అమ్మ బడుచున్నది. సామాన్యులు కొనుక్కొనుటకు వీలులేనంత ప్రియముగ నున్నది. కావున ఈ మాంసపు ధరను తగ్గించి గోమాంసమునకును, తక్కిన మాంసమునకును ఖరీదులోగల తారతమ్యమును తగ్గింపవలెను. అసలే పేదపడియున్న యీదేశములో ఏసంఘముయొక్కగాని జీవన విధానమును యెక్కువ ఖరీదు గలవానినిగ జేయుటకు నేను అంగీకరిం పను. అన్ని సంఘములకంటె మా ముసల్మాను సంఘము కడుపేదసం ఘ మని యెల్లరంగీకరించిన విషయమే. కావున వారివిషయములో కూడ జీవితముయొక్క ఖరీదును యెక్కువ జేయజాలము. ఇచ్చట నిం కొక విషయమును చెప్పకతప్పదు. ఎక్కువ ఆవులు హిందువులకే కలవు; అవి పాలిచ్చుట మానివేసిన తరువాత యజమానులు లాగోవు లను అమ్మివేయకుండ తమవద్ద నే యుంచుకొన్నచో గోవధ యిప్పటి కంటె చాల తగ్గిపోవును. మన మిప్పటికైనను గొఱ్ఱెలు, మేకలు, మొ దలగు వానిని వృద్ధిచేసి గోవును సంరక్షింపవచ్చును. మన స్వరాజ్య గవర్నమెంటులో ఆదాయవ్యయనిర్ణయ మొనర్చుకొన్నప్పుడు మిలి టరీ ఖర్చులోనుండి చాలవఱకు తగ్గించి యీపనికై వినియోగింపవ చ్చును. అప్పుడు మన కీపని చాల తేలికయగును. అయినప్పటికి స్వరా జ్యము వచ్చువరకు కనిపెట్టుకొనియుండక యీరోజునుండికూడ గోమాం సభక్షణ మానివేయవలసినదని నా సోదరమతస్థులను వినయపూర్వక ముగ ప్రార్థించుచున్నాను. స్వరాజ్యము వచ్చినపిమ్మట మానివేసినచో అప్పుడది త్యాగమనిపించుకొనదు. భారతదేశమందున్న వివిధసంఘము లకు సాంఘిక రాజకీయ వ్యవహారములందు స్వీయధర్మమైన సమష్టికు టుంబతత్త్వమే యాదర్శముగ నుండవలెనుగాని యింగ్లీషువారనుష్ఠించు చున్న పోటీపద్ధతి పనికిరాదు. ఒకవేళ మనదేశములోని వివిధసంఘ ములకు పోటీయుండవలసినచో అది పరస్పరసహాయమందును, ఆత్మార్ప ణమునందును మాత్రమే యుండవచ్చును. తన కెంతయో ప్రియమైన హక్కులను గాఢముగ నాటుకొన్న భావములను ఏసంఘము వారు సోదరసంఘములకొఱకై భారతవర్షముయొక్క శాంత్యై క్యతలకొఱకై యెక్కువగ వదలుకొందురో ఆసంఘమువారే తుట్ట తుదకు అందరికంటె యెక్కువ అజేయు లగుదురని నామతము.

## ప్రాతినిధ్యమునందును పరిపాలనమునందును వివిధమతములయొక్క భాగనిర్ణయము.

వివిధమతవైషమ్యములకున్న ముఖ్యకారణమును గూర్చియు, విద్యావంతులగువారు తమస్వార్థములకొఱకు వాని కపార్థములు కల్పిం చి యెట్లు దుర్వినియోగము చేసినదియు తమకు వివరించియున్నాను. వైషమ్యములకు గోవధయు సంగీతముతో నూరేగింపులు మొదలగు విషయములు మాత్రమే కారణములు కావు. స్థానికములును రాష్ట్రీ యములును అఖిలభారతీయము లగు సంస్థలలోని ప్రాతినిధ్యమును ఉద్యోగము లనుభవించుటలోని హెచ్చుతగ్గులును పరస్పరవైషమ్యము లకు మూలకారణములై యున్నవి. ఈవిషయములలో సామాన్యజను లపై నేరము మోపుట సమంజసము కాదు. మంచివిగాని చెడ్డవిగాని స్వార్థములును ఇతరతక్షణమనుమివక్రింద నిట్టిపరిస్థితులకు ముఖ్యకారణ ములగుచున్నవి. ఇందువలన గలిగెడి యన్యాయము ఎక్కువ సమర్థత యనియు నెక్కువ విద్యావిషయికములైన యోగ్యతలనియు సమర్థింప బడుచున్నవి. ఎవరు దీనిని సమర్థించుచున్నారో వారేవిదేశీయాధికారు లిట్టి మిషలు కల్పించినప్పుడు దయాశూన్యముగ ఖండించుట చూడ మిక్కిలి యాశ్చర్యము గానున్నది. ఇట్లు పదవు లాక్రమించినవారు తా మందరికంటె ననుభవముకలవారమని నపోహను పోగొట్టుకొననంతకా లము అల్పసంఖ్యాకుల తెలివి ప్రజాశయముల నెట్లు కాపాడగలదో నా కు తెలియకున్నది. వీరు విశాలహృదయులై దేశభక్తితో పాటుపడవల యు నుద్దేశ్యములుకలవారు కానంతకాలము ఒక్కసంఘమువారియొక్క విద్యాధిక్యత యితరసంఘములవారి కుపద్రవకారణముగ తోపకమాన దు. ఒకప్పుడుద్దేశ్యముమంచిదే యైనను ననుమానమునకు కారణమగు చున్నది. సోదరులారా! ఇది వెనుకటి తరమువారు చేసిన యన్యాయ ఫలముగ ననుభవించుచున్న ప్రారబ్ధము. అనవసరముగ కోపపడకుండుమన ము దానిననుభవించితీరవలయును. వర్తకమునవలె రాజకీయమునందుకూడ పలుకుబడిని సంపాదించుకొనవలసి యున్నది. అరిచేప్రజల నాకర్షిం చుటకై చేసెడి ప్రగల్భములకంటె కార్యాచరణమును తత్ఫలితముగా వచ్చులాభములును కాలక్రమమున మనకు పలుకుబడి నియ్యగలవు. అల్పసంఖ్యాకులు గల సంఘములు అధికసంఖ్యాకులు గల సంఘములు చేసిన యాహ్వానముల ననుమానముతో చూడక వారితో కలసి పనిచే సిన యెడల స్వతంత్ర స్వరాజ్య సంపాదనమార్గమున చాలదూరము నడచియుందుము. కాంగ్రెసునుసామాన్యరంగస్థలమున కందరకును మన యుద్దేశ్యములు దేశభక్తిపూరితము లని చాటుటకు మంచియవకాశముల నొసంగుచున్నది. ఆలస్యమైనను పలుకుబడిని సంపాదింప నిది మన మేమియు చేయజాలము. అకారణమైన యనుమానములకు కోపపడుట యు అట్టి యనుమానములు కలవారినోళ్లను మూసి వారికి మనపై లేని నమ్మక మున్నదని చెప్పుచు మోసము చేయుటయు మంచిపని కాదు. శాసనసభలకు వెడలవలెనని తీర్మానించుకొనిన మనవారిని, అధికారి వర్గమువారిని కూడ మనకొసంగబడిన స్వల్పశాఖ్యాంగసంస్కరణముల నిచ్చుటకు బలవంతపెట్టిన లక్ష్మణమునుదొరకకుండ యిప్పటికి బహుసత్య్ర్వ్రష్టి

కుండవచ్చును. ఒకవేళ తృప్తిపడుపకపోయినను మనమందఱము యాదర్శముగా నుంచుకొనిన స్వరాజ్యముకొఱకు ప్రయత్నించి దానిని సంపాదించుటకు మనల నింకను పురికొల్పవచ్చును. అప్పుడు మనము ప్రాతినిధ్యము గల యన్నిసంస్థలందును వివిధసంఘము లనుభవించు భాగలబ్ధములను నిర్ణయించుకొనవచ్చును. సోదరులారా! ఇంకను కొంతకాలమువఱకు ప్రత్యేకనియోజకవర్గము లేకుండ నెగ్గలేరని యనుమానించుచున్నాను. కాని యల్పసంఖ్యాకు లగు సంఘము వారు అట్టి యేర్పాటు లనవసరమను కాలము వచ్చునపుడు మిక్కిలి సంతోషింపగలనని నొక్కి చెప్పుచున్నాను. ఆర్మీనియాయను పేరుగల టర్కీ దేశముయొక్క తూర్పుభాగమునగల క్రైస్తవ సంఘములనుగూడ భారతీయదేశమునందలి పద్ధతిని నెలకొల్పవలయునని నేను గట్టిగా వక్కాణించితిని. అందుచేత నా వ్యక్తిగత నిశ్చితాభిప్రాయములను మీరు బాగుగా తెలిసికొనగలరు.

ప్రత్యేకనియోజకవర్గసిద్ధాంతమును వదలివేయుటకు పూర్వము రెండుపనులు చేయవలయును. అల్పసంఖ్యాకమగు సంఘము తన యిష్టమువచ్చిన భారతీయుని ప్రతినిధిగా నెన్నుకొనుస్వాతంత్ర్యముగలిగి యుండుట మొదటిపని. ఏదినమున నొకమహమ్మదీయేతర సంఘము నన్ను తమప్రతినిధిగా నెన్నుకొనునో యాదినమును నాకు మిక్కిలి గౌరవప్రదమని భావింతును. నేనునమ్మకముతో వోటునిచ్చుటకు ఖిలాఫతు కొఱకు ఘోరయుద్ధ మొనర్చిన శ్రీగాంధిమహాత్ముడుగాక మరియొక మహమ్మదీయుడు కానరాడు!

క్రమముగ పరిస్థితులలో కొంతమంచిమార్పు కలిగినవెనుక ప్రత్యేకనియోజకవర్గము బదులు సంయుక్తనియోజకవర్గము నేర్పాటు చేయుట రెండవపని. మార్లేసంస్కరణములు చర్చింపబడు కాలమున కొన్నితావుల సంయుక్తనియోజకవర్గము నుండనిచ్చి కొన్ని సభ్యత్వములను కోల్పోవుటకంటె సభ్యులసంఖ్య యల్పమైనను ప్రత్యేకనియోజకవర్గమును కోరుట క్షేమకరమని వాదించు శ్రీసయ్యదు అమీరాలీ గారిని ప్రతిఘటించితినని మీలో కొందఱకు తెలియును. సంఘములందలి పరస్పరవైమనస్యములడుగంటినకొలది క్రమముగ ప్రత్యేకనియోజకవర్గములచేత నెన్నుకొనబడు సభ్యులసంఖ్యను తగ్గించి సంయుక్త నియోజకవర్గపు ప్రతినిధులసంఖ్యను హెచ్చింపవచ్చును. తుదకు ప్రతినిధులందరును సంయుక్తనియోజకవర్గముచే నెన్నుకొనబడునట్లు చేయవచ్చును. ఇట్లే యుద్యోగముల విషయమునగూడ సంఘప్రాతినిధ్యము నిచ్చుటకంటె సామాన్యముగ యోగ్యతనే ముఖ్యముగా గొనుపద్ధతి నవలంబింపవలయును.

కొన్నిస్థలములలో చర్చింపబడు విషయము లల్పములైనను ప్రజ లుద్రేకపూరితులగుట కవకాశము లుండుటచే స్థానికసంస్థలప్రాతినిధ్య విషయములలో పైసందర్భములను తప్పక నాలోచింపవలయును. మ్యునిసిపల్ సభ్యత్వముల విషయములలో పంజాబునందున రెండు సంఘములకును వచ్చిన వైషమ్యములకు పైనచెప్పిన విషయములే కారణములని యుదాహరించుట విషాదకరముగ నున్నది. తలచినపుడు జలియన్వాలాబాగును, హైందవులు కడుపులమీద ప్రాకింపబడినవిధియు నిజముగ పంజాబురాష్ట్రమందలివా యని యాశ్చర్యపడుచుందును. ఎంతలో నారాష్ట్రము తనకు కలిగిన యవమానమును మఱచెను.

## సంకుచితదృష్టి

ఈ యుపన్యాసమునందలి అథమభాగమున ౧౯౦౮ సంవత్సరమున నేనిచ్చిన మరియొక యుపన్యాసమునందలి భాగము ననువదించుచు అందఱకు సమానమగు శత్రువు నొకని నెదిరించుట యను సూత్రముపై కేవల మాధారపడి దానికలననే సంఘముల యైక్యము పొసగగలదనుట పొరపాటనిచెప్పితిని. పంజాబున సైనికశాసనోపయోగ కాలమున జరిగిన దురంతములనుగూర్చి యాగక పాడినదే పాడుచుండుటచే నైక్యమును కుదుర్చుకొనగలమని పిచ్చినమ్మకము కలవాడనుకాను. మంత్రివర్గము చేయుపనులయెడల నసమ్మతిని చూపుకాలమందును, కష్టకాలమందును, పెక్కుమారులు సంయుక్త ప్రభుత్వములెన్ని సృష్టికాలేదు! ఎన్నికల జయము చేకూరినవెంటనేగాని, మొదటిదినములోనే ఎన్నిభగ్నము కాలేదు? మనము పొందదలంచినస్వరాజ్యము సంపాదింపవలెనన్నను దానిని నిల్పుకొనవలెనన్నను, బాధానుభవసామ్యము గాక మఱియొక బంధనముచే నన్నిసంఘములకు నైక్యము కుదురవలయును. హిందూమహమ్మదీయులకునుండు పరస్పరవిభేదములను గోరంతలనుకొండంతలుగ చేయు మహానుభావులకు నేనొక్కవిషయము జ్ఞాపకముచేయవలయును. ఒకరెండుసంఘములవారును పరస్పర మొకరినొకరు పెట్టినబాధలు జలియన్వాలాబాగులో అందఱును చచ్చినంతవఱకు కాల్చినను జనరలు డయ్యరుయొక్క నిశ్చయముకంటెను, జనుల కొకవీధిలో పొట్టలతో ప్రాకించిన జాతీయావమానముకంటెను క్రూరవు లైనవియా? ఉత్తరదేశములమైన మేము దృష్టిసంకోచమునకు లోనైయున్నామనియు, కాలము గడచినకొలదిని వెనుక గడచినదానిని క్రమముగ మఱతుమనియు నాయభిప్రాయము. తుదకు ప్రస్తుతము పడుబాధలు కొలదికాలముక్రిందట పడిన భయంకరములైన బాధలను సంపూర్ణముగ మఱపించుచున్నవి. ప్రతిసంఘమును తమయొకటి సంఘము చేతిలో పడిన బాధలను మాత్రమే జ్ఞాపకముంచుకొని తా నితరసంఘములను పెట్టినబాధలను మఱచుట యెంతకంటె విషాదకరము!

## పోకిరీజట్లు

నేనిప్పుడ నేకసంఘములనుగూర్చి మాటలాడితిని. ప్రజలలో కల్లోలములు పుట్టినప్పుడు ఇతరులకు బాధ కలుగజేయునది సంఘములు కావు. ఇండియాప్రజలలోనున్న పోకిరీజట్టులే శాంతిప్రియు లగువారికి బాధ కలిగించుచుందురు. ఈ పోకిరీలు ఏసంఘమునకును చెందరు. వారిది ప్రత్యేక మొకసంఘము. వారికేమి దొరకినను సంతసమే. యుగసమయమున పాంచాలరాష్ట్రమందలి కొన్ని జిల్లాలలో మహమ్మదీయ పోకిరీలవలన శ్రీ[illegible]లగు హిందువులు బాధల నొందినపుడు, లాలా లజపతిరాయిగారు అమెరికాదేశమున ప్రవాసమనుభవించుచు వ్రాసిన వ్యాసము నాకు బాగుగ నచ్చినది. అప్పటికి పర[illegible]

లు విజృంభింతు నేమో యనుభీతి వ్యాపించెను. కాని లజపతిరాయిగారు మాత్రము హిందువులు ధనికులగుటచే బాధింపబడిరి గాని, హిందూ ధర్మము నవలంబించుటచే కాదని సత్వరముగ బోధించిరి. ధనికులకును నిర్ధనులకును గలవైరమే గాని, హిందూమహమ్మదీయవిభేదము కాదు. ఈరెండుసంఘములే గాక, మధ్యనుండి మనపోరాటముల చూచి సంతసించు పరాయివారు (విదేశప్రభువులు) న్నప్పుడు మనమీసందర్భమున ముఖ్యముగ గమనింపవలసి యున్నది. ఉత్తరహిందూస్థానమున మతవిద్వేషములు ప్రారంభమైనపిమ్మట, రవీంద్రనాథకవివర్యులందునుగూర్చి అనేకపర్యాయములు మాటలాడి యున్నారు. కాని వారి యుపన్యాసములను పత్రికలలో చదివినప్పుడు అయనగారే ౧౯౧౭వ సంవత్సరమున బీహారురాష్ట్రమున కంటె నింకను ఘోరమగు విషయములు.

గోహత్య సందర్భమున బుద్ధిపూర్వకముగ సలుపబడినపుడు వ్రాసినదానిని వారే మఱచిపోయినారా యను సంశయము కలిగినది. కవీశ్వరులు రైలుబండిలో బ్రిటీషు సైనికోద్యోగితో కలసి ప్రయాణము చేయుచుండిరి! ఆ యుద్యోగి భారతీయాశయములను పరిహసించుచు "ఏమండీ! వేఱువేఱుమతములవారు ఒకరితో నొకరు కలహించుచు, మధ్యశాంతిస్థాపనకై అప్పుడప్పుడు నన్నును నా సైనికదళమును పిలిపించుకొనవలసినస్థితియందుండి, మీ భారతీయులు స్వరాజ్యము కోరెత్తు రెందులకు?" అనెను. మనబాధల జూచి సంతసించువారున్నారను విషయమును కవిగారాసమయమున జ్ఞప్తికి తెచ్చుకొని, సైనికోద్యోగి కందులగూర్చి తెలియజెప్పెను. బ్రిటీషువారు రాకపూర్వ మీతగాయిదాలు లేకుండెనా అని యుద్యోగి మరల నడుగ, కవిగారిది వాస్తవమేయని యొప్పుకొనుచు, అప్పటికిని భేద మొకటిగలదని వెంటనే బోధించిరి. బ్రిటీషువారు రాకపూర్వమును హిందూమహమ్మదీయ పోరాటములుండెను. కాని, అందువలన శాశ్వతశత్రుత్వ మేర్పడక, అచిరకాలముననే సమాధానము కుదురుచుండెను. కోపము చల్లారినతక్షణమే, మనమందఱమును మంచికో చెడ్డకో కలసి యొకదేశమున నివసింపవలసియుంటి మనియు, ఏదోవిధముగ స్నేహభావమును సంపాదింపనిచో జీవితమంతయు దుర్భరముగ నుండుటచే సత్వరముగ పొత్తు కలుపుకొని ద్వేషభావమును పోద్రోలుటయే సమంజస మనియు, గ్రహించుచుండిరి. కాని మూడవవారైన విదేశప్రభుత్వము వచ్చినప్పటినుండియు, అట్టి పోరాటము లధికమై అట్టి కలయికలు అపురూపమై పోయెను.

## "యీసా" యొక్క చేయి; "జేకబ్" యొక్క స్వరము.

కుటుంబములో భార్యాభర్త లిరువురే గాక, మధ్య మూడవది అత్తగారుకూడ నున్నచో తమ కెంతఘోరముగ నుండునో భారతదేశ స్త్రీలకును, యూరపుదేశపు పురుషులకును బాగుగ తెలియును. కుటుంబములో అత్తగారు స్థిరముగ నుండు వ్యక్తియగుటయే గాక, కుటుంబచక్రమంతయు ఆమె యొక్క తెరచాటు త్రిప్పుచుండును. అట్టిస్థితిలో ఆసంసారముయొక్క పొందిక యెట్లుండునో వేఱుగ చెప్పనక్కఱలేదు. అదిగాక యింతకంటె ఘోరమైనసంగతి యింకొకటి యున్నది:—అత్తగారికి రెండుమోదాలున్నవి. ఆమె భార్యాభర్త లిరువురికిని మాతృస్థానమందున్నది. అందుచే, సందర్భానుసారముగ నిరువురిని కేకచుండును లేదా ఒకరిని ఓదార్చి, రెండవవానిని చీవాట్లు పెట్టును. అందుచే భార్యాభర్తలకు పొత్తుకలియక "ఎవరికి వారు వేఱుండిన, బాగుండును గా" యనిపించుచుండును. కాని రెండుముఖములు గల యీ అత్తగారి మాయలకు లోబడకుండ వివేకముతో నున్నచో యీ మంత్రతంత్రములు మనల నేమియు చేయజాలవు. అవి మనకు నవ్వును మాత్రము పుట్టించును. హిందువునకు కోపము వచ్చునట్లుగ మహమ్మదీయుడు గోవును చంపినప్పుడు గాని, లేక ప్రార్థనజరుగుచుండగ మసీదు ముందునుండి హిందువు లెవరైన మేళతాళములతో ఊరేగినప్పుడు గాని మన మేమి చేయుచున్నాము? ఒకరి గొంతుకల నొకరు నఱుకుకొనుటకు పరుగెత్తుచున్నాము. కాని యీసందర్భమున మన మొకసంగతిని మాత్రము మఱచిపోవుచున్నాము; ఏమనగా:—

గవర్నమెంటువారెవరైన మహమ్మదీయు నొకని ఏ రాజద్రోహనేరము క్రిందనో శిక్షింపదలచినప్పుడు అతనిని పట్టియిచ్చుటకు మన మహమ్మదీయులే యెందఱు బయలుదేఱుట లేదు? అట్లే హిందువులను బట్టియిచ్చుటకై హిందువులే యెందఱు బయలుదేఱుట లేదు? ఈసందర్భములో ఉభయసంఘములును ఒకేతరగతిలో నున్నవి. ఎంత చండాలపుపనినైన చేయుటకు సిద్ధముగనున్నవారు ఉభయసంఘములలోను గలరు; ఇది మనకష్టానుభవైకవేద్యమే. ఒక మహమ్మదీయుడు తనసోదర మహమ్మదీయునే—వేయేల తనమహమ్మదీయసంఘము నంతటినే—హింసించుటకు సిద్ధముగ నున్నప్పుడు ఇక హిందువులు మనలను హింసించినాడని యీ వేళపడనేల? అయ్యో! అసలునిజము అదికాదండి! పోకిరీలవలెనే ద్రోహులుకూడ ప్రత్యేక మొక్కసంఘమునకే చెందియుండలేదు. వారు ఉభయసంఘములలోను నున్నారు. వారిది ప్రత్యేక మొకతెగ. ధనమదాంధులు ఒక్క యింగ్లండులోనే గాక ప్రపంచమందంతటను గలరని తెబరు (కార్మిక) కక్షివారు చెప్పినమాటలు మీరెఱింగియే యుందురు. అట్లే ద్రోహులు అన్ని సంఘములలో నున్నారు. వీరినందరిని మనమంతకంటె నెక్కువగ ఖండింపవలసినదే. ఏమహమ్మదీయులో రాత్రివేళ హిందూదేవాలయములో గోమాంసము వేసియో, విగ్రహములను పగులగొట్టియో దాని నపవిత్ర మొనర్చుచునుందురు. కాని తక్కినమహమ్మదీయసంఘమంతయు (హిందూసంఘమువలెనే) యేపాపమెఱుగక పోవచ్చును. అట్లె యేహిందువుడో మశీదులో పందిమాంసము వేసియో కొరాను పాడుచేసియో దురాగ్రహ మొనర్చు చనుందురు. కాని తక్కిన హిందూసంఘమంతయు కేవలము నిరపరాధము గావచ్చును.

దీనికంటె స్పష్టమగు నుదాహరణ మింకొకటి గలదు. మంత్రి మహమ్మదీయుడైనచో మహమ్మదీయుల కెక్కువయుద్యోగము లియ్యవచ్చును. హిందువుడైనచో హిందువుల కెక్కువపక్షపాతము జూపవచ్చును. వారెవరైనను వారు పరప్రభుత్వమందంతర్భాగములై యున్నారనుట స్పష్టము. చేతులు "యీసా" చేతులే, కాని గొంతుమాత్రము "జేకబ్" గొంతుకయై యున్నది. తయ్యారు, ఒడయులపించనుల నింకను నిలిపివేయవలసియున్న రాష్ట్రప్రజలు, తమజను

...నీలుచేసినవారికి తమసొమ్మునిచ్చితీర్చవలెనని నిర్బంధింపగవర్ను
తో సహకార్యమొనర్చుటకు సిద్ధముగనున్నారు. కాని, తమ
గువారును, తమతో సమానముగ స్వప్నముగ ననుభవించిన వారును
నగు వారితో మాత్రము సహకారము మానుకొనుచున్నారు. ఎందు
వల్ల? ఇతర సంఘమునకు చెందిన మంత్రియెవడో యొకడు తనసంఘము
వారికి, యీసంస్కరణమువల్ల తనచేతికివచ్చిన యేయల్పాధికారమును
బట్టియో, యే తుచ్ఛమగు పక్షపాతమునకో, తన కిష్టములేని విధమున
చూపించెనట! ఈకారణముచే, అసంఘముతో తాము సహకారము
మానుకొందురట! అట్లయినచో సహాయనిరాకరణ మనగ నేమో
నాకర్థమగుటలేదు. ఇప్పుడే యుద్యోగముల మానుకొనుమనుట కొం
చెము కష్టమని తెలిసియుండియు, ఉద్యోగములు రాజీనామాయిచ్చిన
వారిని కాంగ్రెసు బాహాటముగ ఆహ్వానించుచున్నది. గాని కాంగ్రెసు
మనుష్యులమని చెప్పుకొనువారిలో కొందరు, సహాయ నిరాకరణమును
గూర్చి గాంధిమహాత్ముడు తమకు చెప్పినదంతయు మరచిపోయిరి.
ఎందువల్ల ఎవడో మంత్రి తనసంఘమువానికి నెక్కువగ నేవో యల్ప
యుద్యోగపదవుల నిచ్చెనట! ఇట్లు చెప్పిన మంత్రి నాస్వమతస్థుడై
నచో నాకరితాపమునకు మితియేలేకుండెను. అదిగాక యిట్టి యల్ప
యుద్యోగములు తమకు రాలేదనుయేడ్పు నాస్వమతస్థులనుండి వచ్చి
నచో, నాకప్పుడు గలుగుసిగ్గు నైనగలిగిన పరితాపమునకంటె వెయ్యి
మడుగు లెక్కువగ నుండును. ఒకప్పుడు మాస్వమతస్థులుకొందఱు
ముల్తాను మశీదులో పగిలిపోయియున్న పాత్రలను, గోడమీదనున్న
గీట్లను హకీంఅజ్మల్ ఖాన్ సాహెబుగారికి చూపిరని "ఇదిగో! హిందూ
దేవాలయములు పాడైపోయినచో, మన మశీదులుమాత్రము పాడుకా
లేదా"యని యతికి ప్రతిగ చెప్పినప్పుడు తన కెంతటి సిగ్గుబాటును అవ
మానమును గలిగెనో అజ్మల్ ఖానుగారు నాతో చెప్పిరి. వారికి త్వరలో
సంపూర్ణారోగ్యము గలుగుగాక యని మనమందరము ప్రార్థింతము.

## వివేకురాలియొక్కయు అవివేకురాలియొక్కయు నీతికథ

ఈవిషయమై హిందువుల యుద్దేశ్యములు, మంచివికావనియే
తలంచియుంటినేని దీనినెన్నండును నేను ముచ్చటించియుండను. నేనిట్లు
జేయుటకు గారణమేమన మహమ్మదీయుల భావసంచలనముఉత్తమమని
నేను నమ్మజాలను. ఈ యుభయపక్షములును ఈతుచ్ఛభావములకు
లోనైనవియే. మహమ్మదీయులు మెరుగైనను హిందువులనుగూర్చి వచి
యించియుండను.

ఏలయన ఒకసంఘములోని వ్యక్తి వేఱొక సంఘములోని వ్యక్తు
లను మందలించుటవలన లాభము లేదను సంగతి ననుభవమువలన నే
నెరుంగుదును. ఆపని వారలకే వదలివేయవలయును. ఒకేపట్టణమున
ఒకేచోటను వసియించు చిన్న బాలురు కలిసి యాడుకొనుచు, యల్పవిష
యములలో తగవులాడుకొనుచుండుట యెన్నిమారులు మనము చూచి
యుండలేదు? ప్రతిబాలుడును తనతల్లియొద్దకు బరువెత్తి ప్రక్కటివాని
కాంగ్ర దుర్మార్గకథనమును తనసద్గుణసంపత్తి నాలిగలుగునట్లు వర్ణించు
చుందురు. వివేకురాలగు తల్లి వానియందేలోపమున్నదని తన కుమా
రుని జీవాట్లుపెట్టును. తన తనయుడింకను కొండెములుచెప్పుట మాన
కుండునెడల స్నేహపాత్రులుగాని పిల్లలతో నాడుకొనవలదని యామె
వానికి హితముజెప్పును. పిల్లలకందరకును సామాన్య ఆటభూమి యగు
నావీధికి బోవలదని యాజ్ఞాపించును. సద్గుణగరిష్ఠులగు మనబాలు
డొంటరిగా నుండవలసి వచ్చును. కొద్దికాలమెడబాటుతో, తప్పు
తోడిబాలురది కాదని తలంపసాగును. రెండుమూడురోజు లయినతరు
వాత వారల సంపూర్ణముగ దోషరహితుల నొనర్చివేయును. మరల
తనతోడిబాలురతో నాడుకొననిమ్మని తనతల్లి నడిగి యామెయంగీ
కారమును బడయును. తాను మంచివాడనని యు, తోడివారలు చెడ్డ
వారనియు, తోడిబాలురపై దోషముల నెన్నవలదని మందలించి తల్లి
పిల్లవానికి బుద్ధులుచెప్పి మరల వారలతో నాడుకొనబొమ్మనును. శాంతి
గూర్చుటకియ్యదియే మార్గము. వివేకురాండ్రగు తల్లులను, అవివేకు
రాండ్రగు తల్లులనుగూడ జూచియుంటిని. బహుశః రెండవతరగతి
వారలసంఖ్యయే యెక్కువగనుండును. అవివేకురాండ్రగు తల్లులు తమ
తనయులు తోడిబాలురతో తగవులాడి సానుభూతికిని తోడ్పాటు
నకును తమయొద్దకు బరుగెత్తివచ్చినప్పుడు తమ చిన్నతనయుల కొదవిన
కష్టములకు విచారపూరితలై కన్నీరుపుచ్చెదరు. కొంతతడ వట్లు విచా
రించి సక్రోధలగుదురు. వారలకు విషాదముతిరిగి క్రోధ మంకురించును.
పిమ్మట వారలు తమనమే యాదుష్టబాలుని తల్లియొద్దకు బోయి యామె
తనయుడొనర్చిన దుశ్చేష్టలను తమ ప్రియసుతుల కొదవిన కష్టములను
నేకరువుపెట్టుచు యామె తన తనయునికి సరియగు బుద్ధులు గఱపలేదని
నిందింప నారంభింతురు. అందుల కాతల్లి ఫిర్యాదుజేసినబాలుడు పెద్ద
దుష్టుడనియు ఐనను అది వాని తప్పు కాదనియు, ఆపిల్లవానిని
పోషించు తల్లితప్పే యనియు బదులు జెప్పును. తగవులాట ప్రారంభ
మగును. ఉభయకక్షులును తిట్టుకొన నారంభింతురు. ఉభయపార్శ్వ
ములనుండియు దూషణశరజాలములు గురియుచుండును. ఇరుప్రక్క
లను నేదుతరములవఱకును తిట్లుదినని వారుండరు. అంతట మగసైన్యము
రంగస్థలిని బ్రవేశించును. ఆతడును అంతవివేకశూన్యుడును అంతటి
దురభిమానప్రేరితుడును నైనయెడల, దూషణశతఘ్నుల విడువ నారం
భించును. వైరికక్షియొక్క మర్యాదకు మంట గాల్చును. ఈరణగొణ
ధ్వని విని యెదిరిపక్షసహాయసైన్యము యుద్ధభూమికి తటకెనతోడ నేయా
తడు వాగ్యుద్ధమున సంధిగోరును. కాని యెదిరిపక్షవీరుడు కార్య
శూరు డగుటచే తిన్నగ శత్రువీరుని తల పగులవేయును.

అంతటితో నాపోరాటు మంతరించునెడల ఈపట్టణభాగ మదృ
ష్టముజేసికొనినదే కలహకారులగు నాబాలకద్వయము ఒకరిభుజముల
మీద నొకరు చేయువైచికొని, రక్షకభటులు తమ తల్లిదండ్రులను నడి
పించుకొని పోవుచుండ తాము మాత్రము ఉప్పట్లను, బంతులాటను
ఆడుకొనుటకై నడచిపోవుటయే యిందలివిచిత్రము. వివిధకక్షులకుజనించు
అంతఃకలహములు, (నేనప్పుడప్పుడు గావించినట్లు) స్వపక్షసదుద్దేశముల
బ్రకటించుకొనుటవలన గాని, నిష్పక్షపాతమై నిష్పక్షపాతమగు బుద్ధి
తోడ నుభయపక్షములకును మధ్యవర్తిగానుండుటవలన గాని, దీరవనియు,
స్వపక్షదూషణకు గుఱియగుటయే యట్టి యంతఃకలహముల దీర్చుట
కుత్తమమార్గమనియు, ననుభవమువలన విదితమయ్యెను. ఈవిషయమున

నాకును నాసోదరులకును విశ్వాస ముదయించుటచేతను, నేను స్వపక్షదూషణకు బాల్పడియుండుటచేతను నిష్కళంకమైన దేశభక్తుని ధర్మమును నిర్వర్తించుటకు నే నర్హత సంపాదించుకొంటినని నాకు సంతుష్టి గల్గుటయేగాక రెండుపక్షములకును సమాధానము కుదురు నను నాశలు జనించుచున్నవి. వివిధకక్షుల మిత్రులకును నేనీరాజకీయ సాధకముల సిఫారసు జేయుచున్నానని వేఱే జెప్పనక్కఱలేదు.

## సంఘటనము

నాయుద్దేశము నింతతడవు విప్పిచెప్పినబిమ్మట సంఘటనమును గూర్చి వేరే వచింపవలసియుండునని తోచదు. నే నీయుద్యమము నెన్నడును దూషింపలేదు. ఎవ్వరేని యట్లుదలంపక విరుద్ధభావములతో నుండిరేని వారలు పొరపడియుందురు. లేకున్న సందర్భవశమున నే నాడిన మాటలను గాని నేనిచ్చిన యుపన్యాసములను గాని యితరులు పొరపాటుగా జెప్పిన విని యపోహపడియుందురు. ఇయ్యది కేవలము నాహిందూసోదరులకు సంబంధించిన విషయము. సంఘటన మావశ్యకమని వారలు తలంచునెడల నావిషయమున దమ యిష్టమువచ్చినట్లు చేసికొనుటకు వారలకు స్వేచ్ఛ నొసంగవలెను ప్రతిసంఘమును, తనకు అవసరమనితోచిన సాంఘిక సంస్కరణముల గావించుకొనుటకు హక్కు గలదు. అస్పృశ్యతను దొలంగించుటకును అంత్యజుల తత్క్షణమె, సంఘమున జేర్చుకొనుటకును ఈ సంఘటనము నిర్మాణమయ్యెనేని, కాంగ్రెసువాదిగను మహమ్మదీయునిగను గూడ మిగుల సంతసించెదను.

హిందూమతమున కొదవిన నస్పృశ్యతాకళంకమును దొలగించుటకు యావచ్ఛక్తిని వినియోగింపవలెనని నాగపురకాంగ్రెసునందు ప్రతినిధుల హెచ్చరించినప్పుడును నిమ్నజాతులయెడ జూపబడు నిరాదరణ విషయమున హిందూమతము సంస్కరింపబడుట వాంఛనీయమను నుద్దేశమును బెంపొంద జేయవలయునని మతగురువుల వినయపూర్వకముగ వేడుకొననప్పుడును, ఈ సమస్య కాంగ్రెసు మహాసభయొక్క ప్రత్యక్ష సానుభూతిని బడసెను. ౧౯౨౧ సంవత్సరాంతమున స్వరాజ్యవాంఛకు, అస్పృశ్యతానివారణ మొక నిదర్శన మని మహాత్ముడు నిర్దేశించెను. హిందుమతమున నావశ్యకమగు సంస్కరణముల గావింప, పూర్వాచారపారీణతకు నిలయము లగు హిందూమతసంఘములు సంకల్పించుకొనునెడల, ఆవిశాలహృదయుని, నాతని యనుచరులను సంతోషభరితుల జేయును.

కాని యీవిషయము చాలకాలమువఱకు జరుగకయే యుండెను. మలబారులో జరిగిన విషాదసంభవములు దవ్వుల నున్న పాంచాలహిందువుల నాగ్రహపూరితుల జేసినపిమ్మటను, ముల్తాను పట్టణమున వసియించు హిందువులు శిక్షణశూన్యు లగు మహమ్మదీయమూకల ద్వేషానలమునకు గుఱియై వంతలనొందినపిదపను, ఈ సంస్కరణమును గడుదీక్షతో కొనసాగింప మొదలిడిరి. ఈసందర్భములే భారతజాతీయైక్యతకై పరితపించువారలకు విషాదము గలిగించును. ఏలయన నూతనస్థాపితమగు నైకమత్య మింకను బలీయము కాలేదని వారలెఱుంగుదురు. విటీ చికిత్సనుండి, యిప్పుడే కట్లువిప్పబడిన యవయవమునకు, మె బరువు నెత్తజనదు. ప్రతియపోహను ప్రతివదంతిని నిజమని సి పోయినను, వేగమె తొలగింపబడకపోయినయెడల గాని, నిజముకాదని రుజువు కాకపోయినయెడల గాని, దానివలన కల్గుహానినిమాత్రము చులకన చేయజనదు. నిమ్నజాతులను హిందూసంఘమున జేర్చుకొనుట మాత్రమే అస్పృశ్యతానివారణోద్దేశముగాదనియు, ముందుగజరుగబోవు పోరాటములలో నిమ్నజాతులను హిందువులకు సహాయులుగ జేసికొనుటకే యీ యస్పృశ్యతానివారణోద్యమము బయలుదేఱెననియు, కొందఱు మహానుభావులు వదంతులు పుట్టించుచున్నమాట వాస్తవము. "దౌర్జన్యరాహిత్యము అసహాయోద్యమతీర్మానమున ముఖ్యభాగ మగుటచే, దానిని ముఖ్యముగ గమనింపవలసిన" దనియు; వాక్క్రియల యందు దౌర్జన్యరాహిత్యము ప్రభుత్వముపట్ల నెంతయావశ్యకమో ప్రజలలో నొండొరులయెడగూడ నంతియే యవసరమనుసంగతి, ప్రజలకు దెలియజెప్పవలయుననియు, దౌర్జన్యభావములు నిజమగు ప్రజాస్వామ్యతత్త్వమునకు విరుద్ధమగుటయేగాక, సహాయనిరాకరణోద్యమ ప్రణాళికలోని తక్కటి యంశముల యాచరణకుగూడ భంగము గల్పించు ననియు, మహాత్ముని యనుచరుల కుద్బోధించియుండ, ఇట్టి పరిస్థితులు వారికి సంతాపకారణము గాకుండునా? అస్పృశ్యతాకళంకమును నిర్మూలించుటలో దౌర్జన్యమునకు గడంగి, యిదివఱకున్న దౌర్జన్యమును మఱింత వృద్ధి యొనర్చితిమని మనల లోకము నిందించునెడల, మహాత్ముని హృదయము పరితపింపదా? మిత్రులారా! వారల కొదవిన కష్టముల నివారించుటకే నిమ్నజాతులతో చెలిమిజేయనగును. ఇతరులకు బాధకల్గించుటకు గాని, మనకుగల్గిన బాధలకై నితరులపై పగదీర్చుకొనుటకు గాని వారలతో మైత్రి యొనర్పకుడు.

సంఘటనోద్యమముయొక్క యింకొక లక్షణ మేమనగా:— వ్యాయామసాధనయం దెక్కువగ అభిలాషను గలిగించెను. ఇదంతయు మంచిదే. మనభారతప్రజలలో నెవరినుండియైన స్తబ్ధతయు, పిఱికితనమును వీడిపోయినచో, మనము సంతోషింపవలసినదే. కాని, దీనిలోగూడ భావశుద్ధి గావలసియున్నది. క్రిందటి సెప్టెంబరులో ఢిల్లిలో జరిగిన హృదయపూర్వకమగు చర్చవల్ల అన్నిసంఘముల యువకులకును పనికివచ్చు "అఖేడా"లు నిర్మించుట తనకును సమ్మతమే యని పండితమదనమోహనమాళవ్యాగారు లోకమునకు ప్రకటించుటకు అవకాశ మేర్పడెను ఇందుకు నాకు చాలసంతోషమైనది. మఱియు ధనప్రాణాదులయొక్కయు—చెప్పుటకు నాకు విచార మగుచున్నది— సోదరీమణుల మానముయొక్కయు సంరక్షణార్థమై సామాన్యమగు స్థానిక సంరక్షకదళము నొకదానిని నిర్మింపవలె నను తమ మొదటియుద్దేశమును కూడ మాళవ్యాగారు ప్రకటించిరి. తనయుద్దేశము ఒక్కహిందూసభచేతనే చర్చింపబడుటచే, అది అన్నిమతములను బంధింపజాలదను ఉద్దేశముతో శ్రీ మాలవ్యాగారు తమతీర్మానమును సవరించి, హిందూభటదళమును నిర్మించుటకు సమ్మతించెను.

## కాంగ్రెసువా రేర్పఱచిన సమాధాన కమిటీయొక్క సంఘటనము

హిందూనాయకులతో పూర్తిగ నేకీభవించుచు, "హిందూ మహమ్మదీ యైక్యసంఘము" వారు ఈవిషయము లన్నిటిపై కొన్ని తీర్మానములను కాంగ్రెసు సభకు శిఫార్సుచేసి పంపిరి.

ఈ తీర్మానములను కాంగ్రెసు తత్క్షణమే యంగీకరించినది. కావున వానిని మనమాచరణయం దనుష్ఠించునట్లు చూడవలసియున్నది. ఏకమత్యమునకు భంగము గలుగకుండ నివారించుటకై మనము మొట్టమొదట ప్రతిజిల్లా కేంద్రస్థానమందును జిల్లా కాంగ్రెసు కమిటీల యాజమాన్యము క్రిందను, ఖిలాఫతుకమిటీలు హిందూసభలు బాధ్యతగల యితరస్థానికసంఘముల సలహాతోడను, మిశ్రమసంఘములను ఏర్పఱచి జిల్లాలయం దంతటను శాంతిభద్రతలను కాపాడవలెను. ఇట్టి శాంతి భద్రతలకు భంగము గలిగించు నేసందర్భమైన తటస్థించినచో దానివల్ల కలుగు చెడుగును తగ్గించుటకై వీరుయత్నింతురు; సత్యాగ్రహమును సంతృప్తికరమును నగు సమాధానమును కుదుర్చుదురు. ఎవరికైన క్రోధోద్రేకము గలిగినప్పుడు వారు తగిన నిగ్రహముతో వర్తించుటకై పురికొల్పుదురు. తమయిబ్బందులను తీర్చుకొనుటకై తమంతట తామే దెబ్బలాడకుండ ఈకమిటీలవద్దకు వచ్చి చెప్పుకొనునట్లు చేయుదురు. అప్పటినుండియు కొన్ని జిల్లాలలో కాంగ్రెసుకమిటీలు పనిచేయుటయే మానివేసినవనియు కొన్నిచోట్ల కాంగ్రెసులో పనిచేయువారే సంఘములమధ్య కలహముల పెంచుటలో నాయకత్వము వహించినియు వినుటకు నా కెంతయో సంతాపమును దుఃఖమును గలిగించెను. కావున జిల్లాకమిటీలు చేయు పనిని తనిఖీ చేయుటకై తనిఖీబోర్డులను కొంతకాల మేర్పఱుపవలసి యుండును. అసలు జిల్లా కాంగ్రెసు కమిటీలే లేనిచోట యీ తనిఖీ బోర్డే తత్ స్థానమున పనిచేయుచుండును. ఇట్టిస్థిరమైన రాష్ట్రీయ బోర్డును భారతీయ సమాధానబోర్డును అవసరమని నాకుతోచుచున్నది. ఇట్టిబోర్డులే యిదివఱకున్నచో సంతాపకరములగు కొన్ని కలహములు జరుగకుండ పోయెడివేమో. మన మెంతజాగ్రత్తపడినను తప్పకజరిగితీరు సంఘట్టనములనుగూర్చి దరియాప్తుజేసి ముందుగ తెలిసికొనుటకుగూడ ఈబోర్డు లుపయోగపడవచ్చును. అవసరమైనచో దీనినిబట్టి నేర మెవరిదో తెలిసికొనుటకుగూడ అవకాశముండును. మన మియేర్పాటుల నన్నిటిని చేసికొని సిద్ధముగనుందుము; ఇట్టి పోకిరీతనమును రూపుమాపి శాంతిభద్రతలను, అంతర్జాతీయసౌహార్ధమును నెలకొల్పుటకు మనము బద్ధకంకణులమై యున్నామని ప్రజలకు తెలియగనే, యిట్టి తగాదాలన్నియు మాసిపోవును. ఈ తగాదాలను తీర్పవలసిన అవసరమే మనకు తగ్గిపోవును.

### "పౌరభటదళము"

దేశమందంతటను కాంగ్రెసుయొక్క స్థానిక సంఘములు తమ యాజమాన్యము క్రింద పౌరభటదళముల నేర్పఱుపవలసినదని ఢిల్లీకాంగ్రెసు తీర్మానించినది. ఈదళములలో అన్నిమతములవారు చేరవచ్చును. శాంతిభద్రతల గాపాడుటయు తదితర పౌరధర్మముల నెఱవేర్చుటయు యీదళములయొక్క విధి.

ఇంతియగాక, స్థానిక కాంగ్రెసు సంఘములు ప్రజలలో దేహపరిశ్రమయం దభిరుచిని వృద్ధికావించి వారికెల్లవిధముల దోడ్పటునట్లు తీర్మానింపబడెను. ఈవిధముగ మనదేశీయులు స్వసంరక్షణ మొనర్చుకొన నర్హులు కాగలరు. కొన్ని కులములవారు స్వంతముగ 'అఖేడా'లను పెట్టుకొనిరని వినియున్నాను గాని, కాంగ్రెసు సంఘములు కాంగ్రెసు పక్షమున పౌరభటవర్గములను, 'అఖేడా'లను నేర్పఱచుటకు తగినసావకాశము కలిగినటు లగపడలేదు. అజమీరునందుమాత్ర మొక దేహపరిశ్రమపాఠశాల గలదు. అందలి విద్యార్థులు కొందఱు ఢిల్లీకాంగ్రెసుకు వచ్చియుండిరి. వారి శరీరసౌష్ఠవమును జూచి సంతసించితిని, అంతకన్నను, వారిసుహృద్భావమున కానంద మొందితిని, స్థానికముగ నేర్పడిన హిందూమహమ్మదీయకలహములలో, తమ తమ సంఘముల పక్షమున చేరి పోరాడుడని వారి నెంత వేడినను, వారట్లు కావింపక శాంతిధర్మము నే యారాధించిరట. ఈవిషయ మెఱింగినవా రెవరైనను, జాతీయైక్యత శాంతిస్థాపనములను కాపాడు విషయమున కాంగ్రెసు సంస్థలకు పలుకుబడి లేదని చెప్పసాహసించెదరా? మన అర్జునలాలు సేఠీ, మౌలానా మొహమదీను, మిర్జాఅబ్దుల్ కాదరుబేగు గారలవంటి సత్పురుషులెచ్చటనుండినను, అచ్చటనెల్ల శాంతియొనగూడునని మనము విశ్వసింపవచ్చును. ఒకవేళ నశాంతి ప్రబలినను, సాధ్యమైనంత త్వరితముగ యథాప్రకారము శాంతి నెలకొల్ప వీలగును. ఐచ్ఛికభటదళముల నేర్పఱచుటకై డాక్టరు హార్డేకరు గారు కృషిసల్పుచున్నందుల కెంతయు సంతసించుచున్నాను.

మిత్రులారా! నేడు నేనీ కాంగ్రెసుసభాధ్యక్షత వహించుచుండినను, నిజముగ 'హార్డేకరు' గారి స్థానమున నేను నిలిచి పనిచేసినచో నా కెక్కుడుత్సాహకరముగనుండును. మనదేశమునందు ప్రజలు గుంపులుగ చేరినపుడు మిగుల శాంతముగనే ప్రవర్తింతురు. కాని వారి నింకను శాంతముగ నుంచవలెనన్నను, లేక యిప్పటికన్న విశేషముగ సుశిక్షితులొనర్పవలెనన్న, పౌరభటవర్గము లెంత యుపకరించునో సర్కారువారు గ్రహించి యున్నచో, ఐచ్ఛిభటులవైనను, వారిని సమకూర్చు నాయకులవైనను, విపరీతములైన క్రిమినలు చట్టముల నుపయోగించియుండరు. దేశమున శాంతిభద్రతల వ్యాపింపజేయుటను గూర్చి సర్కారువారికి నిజముగ సదభిప్రాయ ముండినగదా వైయాలోచనలు వర్తించుట. ఈవిషయమున నా కొకింత స్వలాభాపేక్షయు కలదు. నిరంతరము ప్రయాణముచేయుచు అసంఖ్యాకములగు బహిరంగసభల కేగుచు, దురదృష్టవశమున నకేకపర్యాయములు ఊరేగింపుటుత్సవములతో నాహ్వానింపబడుచుండు నావంటివానికి, సాధారణముగ నిల్లుకదలనివారికంటె పౌరభటవర్గప్రయోజనము బాగుగ తెలియగలదు. ఒక్కొక్కప్పుడు నాగౌరవార్థము ఊరేగింపుటుత్సవములు జరుగుచుండగనే, ఎవరియుత్తరక్రియలందు వారు పాల్గొన వీలులేదను సంగతిని మఱచి ఆపట్టణమందలి ఐచ్ఛికభటవర్గమునకు నేనే నాయకత్వము వహించి వారిని నడిపింప నువ్విళ్లూరుచుందును.

## మనపోకిరీల గౌరవభావములు

సంఘటనోద్యమమును వదలుటకు పూర్వము మనస్త్రీల గౌరవ రక్షణమునుగూర్చి యొకమాట చెప్పెదను. ఇది నాభార్య చెప్పినదేగాని నాసొంతమాట కాదని యొప్పుకొనుచున్నాను. ఆమె 'ఆల్మోరా' పట్టణమున హిందూస్త్రీలధికముగ నుండిన యొక మహిళాసభయం దుపన్యసించుచుండెను. ఆల్మోరాయందు మహమ్మదీయులు మిగుల స్వల్ప సంఖ్యాకులు. అట్టిప్రదేశమున నొకవేళ, మహమ్మదీయులపై ద్వేషముచే వారిని హింసింప నొకయల్లరి ప్రారంభమైనచో తన్నును తన కుమార్తెను మానభంగము కాకుండ కాపాడుటకు తన పురుషబంధువు లెవరును లేనియెడల తప్పక మొట్టమొదట కాన్పించిన హిందువును— అతడు పోకిరీయైనను సరే—'అన్నా'యని పిలిచి, తన్ను తన పిల్లలను కాపాడుమని వేడియుండునని నాభార్య చెప్పెను. హిందూదేశమందలి పోకిరీలకు సైతము స్త్రీల మానసంరక్షణముపట్ల నున్నతభావములు కలవని యామె విశ్వాసము. భారతదేశమం దెచ్చటనైనను సరే, ఆప్రకారము విపత్తునుండి కాపాడుమని వేడుకొనిన సోదరియొక్క మొఱ నాలకింప నేరని పోకిరీలు విశేషముగ నుందురని తలంపను. మిత్రులారా! ఆయుగుండ్లు తుపాకులు వ్యర్థమైనపుడుకూడ, కేవలము విశ్వాసమువలన దుడుకుతనమును జయింపగలము. కావుననే, మనకన్న మనుజస్వభావమును బాగుగ గుర్తెఱిగిన షేక్స్పియరుమహాకవి యిట్లు చెప్పెను:

"చెడుగునందు సైతము మంచితనముయొక్క ఛాయ కాన్పించును." మనలో పరస్పర విశ్వాసమును పురికొల్పి, తమ విశ్వాస బలిమిచే మనలో నీచాతినీచులగువారియందు సైతము "మంచితనపుఛాయలు" వృద్ధినొందింప తోడ్పడుదురుగాక యని నాసోదరీమణులను ప్రార్థించుచున్నాను.

## శుద్ధి

హిందూమహమ్మదీయుల స్నేహభావమును చెడగొట్టిన మఱియొక యుద్యమము 'శుద్ధి'. 'ప్రబోధకమత' మనిన నాకు గౌరవము కలదు. 'ప్రబోధకమత'మనగా సత్యమును వ్యాపింపజేయుటయు నమ్మకములేనివారికి నమ్మకము పుట్టించి వారిని మనలో కలుపుకొనుటయు, పవిత్రధర్మము లని యుద్ఘోషించుమతము లని నాయభిప్రాయము. "మాక్సుమూలరు" పండితుని యభిప్రాయముకూడ నిదియే. సత్యమని మనసార నమ్మినదానిని మనోవాక్కాయ కర్మములందు వ్యక్తపఱచుటయు, ప్రపంచమునందలి ప్రతిజీవికిని తనసత్యసందేశమును చాటి తాను నమ్మినదానినే మానవులందఱును నమ్మిననేగాని తృప్తినొందజాలకుండుటయు, ప్రబోధకుని లక్షణములు క్రైస్తవ, బౌద్ధ మహమ్మదీయ మతములు 'ప్రబోధక మతములు (Missionary religions) యాదుల పారశీకుల హిందువుల ధర్మము లట్టివి కావని సాధారణముగ నెంచబడుచున్నది.

హిందూమతమునుగూర్చి నా యసంతృప్తికారణ మిదియే. అలహాబాదులో 1907 సంవత్సరమున నుపన్యసించుచు హిందూమహమ్మదీయులలో భేద మిట్టిదని చెప్పితిని:—

"మహమ్మదీయులు కావించిన గొప్ప నేరమేమి? ఏదో భోజనము తనవద్ద నుంచుకొని మహారాజార్హమని దానిని ప్రపంచమందలి యెల్లజనులు తనపదార్థములనే రుచిమాడవలె నంతముగనైన వారినోట గ్రుక్కుడుర్గనియేగదా! హిందువులన్ననో తమపాకశాస్త్రపాండిత్యమునకు గర్వపడుచు ఎవ్వరికిని తెలియకుండ చాటుగ వంటయింట చేరి తోడిమానవులనీడయైన తమభోజనమునకు సోకకుండ ఒకకబళమైన నీయక భుజించుచున్నారు."

నే నీ విషయమును కేవలము పరిహాసముగ చెప్పియుండలేదు. తనమతముతో నిట్టివైపరీత్య ముండుటకు సమాధాన మేమి యని నే నొకపర్యాయము మహాత్మ గాంధీగారి నడిగితిని. హిందువులును తక్కిన మతములవారివలెనే మతప్రబోధ మేల చేయరని పరితపించిన నేను, నేడు నాహిందూసోదరులు చూపుచున్న మతవ్యాపకదీక్షను నిరసింతునా? అట్లొనర్చుట స్వవచనవ్యాఘాతము కాదా?

ఇంతకన్న నొక ముఖ్యవిషయము కలదు. మల్కానా రాజపుత్రులు నిజముగ మహమ్మదీయమతసిద్ధాంతముల నేమియు నెఱుగక హిందువులేయని అందఱును తలంచునట్లు ప్రవర్తించుచుండ, తమతోటి మహమ్మదీయు లీస్థితిని గమనించి వారి నుద్ధరింపవలసిన బాధ్యతను గూర్చి బలవంతముగనైన హెచ్చరిక యొనర్చినందులకు శుద్ధిసంస్కర్తలపట్ల మహమ్మదీయులు కృతజ్ఞులై యుండవలదా? మహమ్మదీయమతమునుగూర్చి యజ్ఞానమున మునిగిపోవుటయేగాక, మహమ్మదీయాచారములనైనను సక్రమముగ నిర్వహింపని లక్షలకొలది తోడి మహమ్మదీయుల స్థితిని వీరు గుర్తింపకుండ నేల యుపేక్ష వహించిరి.

ఉభయమతములవారును స్వీయమతముల బోధించుటకును అవలంబించుటకును సంపూర్ణస్వేచ్ఛ యుండవలయును. ప్రపంచమున వేర్వేఱు విజ్ఞానసాంప్రదాయములు కలవు. ప్రతి సాంప్రదాయమును వ్యాప్తినొందించుటకే సర్వప్రయత్నములును జరుగగలవు. ఉత్తమ మార్గములలో నేది యుత్తమమో మనబుద్ధిచాకచక్యమువలన గ్రహించి నిర్ణయించుకొనవలసిన స్థితియం దున్నాము. ఒకానొక ధర్మము ననుష్ఠించువారిని ధ్వంస మొనర్చుటవలన నాధర్మమును నశింపజేయు విపరీతిపద్ధతిని— నిష్ఫలపద్ధతిని మన మవలంబింప గోర్కె లేదు. స్పెయిను దేశమునందలి (మతమున వేఱుసిద్ధాంతముల నమ్మువారిని హింసించుటకై ఏర్పడిన) "ఇంక్విజిషను' పద్ధతులవంటివి రూపనాశన మొందినవని నమ్మెదను. భేదాభిప్రాయములు గలవారిని చంపి, భేదాభిప్రాయములనే చంపదలచువా రుండబోరు. నేటికాలమున నభివృద్ధిమార్గము వేఱు. ప్రత్యక్షముగ, శాంతముగ, మనమతమునం దితరులను జేర్చుకొనవచ్చును గాని, బుద్ధిపూర్వకముగ విచక్షణ గావించి మతమును మార్చుకొనవలసినదే గాని, బలవంత మెచ్చటను పనికిరాదు, మలబారునందు కొంద ఱుద్రేకపూరితులగు మాపళాలు, హిందూమత సూచకమగు జుట్టును బలవంతముగ గొఱిగించి, మహమ్మదీయ మతములో కలుపుకొనినట్లు చెప్పబడినమతవ్యాపకపద్ధతిని జూచి నిజముగు మహమ్మదీయు డెవ్వడైనను సంతసింపగలడా? ఐహికము లగు వాంఛ

పురికొల్పి మతమునందు చేర్చుకొనుటకూడ, భగవంతునిదృష్టి కన్న నుత్తమము కాదు.

జమీందారులును, షాహుకార్లును, హెచ్చుసంఖ్యగల చుట్టుప్రక్కప్రజలును, వైరీతిగ బలవంతము పెట్టిరని యొకపక్షమువారును అట్లు జరుగలేదని ఎదిరిపక్షమువారును వివాదపడుచున్నారు. జాతీయైకమత్యత కిది మిగుల భయంకరము. ఆఘాతసహితము ఉద్రేకజనకము నగు (బహుసంఖ్యాకుల మొత్తముగా కలుపుకొను) పద్ధతిని వీడవలయునను తీర్మానమును, ఏస్వల్పవిషయమున గలిగినకోపమువలననో, మంటగలిపిరి. అందువలననే ఢిల్లీకాంగ్రెసులో నియమింపబడిన హిందూసమాధానసంఘమువారొక ముఖ్యతీర్మానమును సూచించిరి. వానినే కాంగ్రెసు ఆమోదించెను. 'శుద్ధి' యుద్యమములనను అందులకు వ్యతిరేకముగ బయలుదేరిన యుద్యమములవలనను గలిగిన చిక్కులనుగూర్చి విచారించుటకును బలవంతము భయము అక్రమపు యొత్తిడి లోనగువాని ప్రయోగించి కేవలము మతోద్ధారణోద్దేశమునకు వ్యతిరేకముగ ప్రవర్తించినట్లు ఏయేప్రదేశములనుండి ఆరోపణలు వచ్చెనో ఆప్రదేశముల స్వయముగ వీక్షించి, అట్టివిక ముందెన్నడును జరుగకుండున ట్లొనర్చుట కెట్టిచర్యల నవసరములో సూచించుటకును; ఒకసంఘమేర్పాటు కావలెననితీర్మానింపబడెను. పాశ్చాత్యదేశములందు ప్రతిరాజకీయపక్షమువారును తమగౌరవమునుపట్ల నెక్కుడభిమానమును చూపుచు—లేని యభిమానమునైన నటించుచు—నుందురు. శాసనసభలో "అక్రమపు వర్తనచట్టము" అను పేరిట లంచములు మొదలైన దురాచారముల మాన్పుటకై చట్టములను కావించెదరు.

మన యుద్యమము ఆధ్యాత్మికమైనదని విఱ్ఱవీగుచుండుమనము, మనగౌరవమును నిలువబెట్టుకొనుటకై మిగుల నభిమానపూరితులమై యుండవలెనుగదా. కేవలము చట్టముమూలమున జేయజాలకపోయినను, ఆచరణమందైనను; కాంగ్రెసువంటి జాతీయసంస్థ తనపలుకుబడిని వినియోగించి సర్వసంఘములును కొన్నినియమములను పాటింపవలెనని విధింపవలెను. ఉభయపక్షులవారును, ముందు పది సంవత్సరములకు రానున్న జనాభాలెక్కలను దృష్టియందిడుకొని, (మాసంఘములో ఎక్కువమంది గలరని చూపుటకు) పనిచేయుచున్నారేగాని భగవంతునిమాత్రము మఱచిపోయినారు. అట్టి సందర్భములలో నాకు విసుగుజనించి, మన పూర్వీకులు తలలను లెక్కపెట్టుటకు బదులు (అనగా సమ్మతులను తీసికొనుట) తలలను నరుకుటచే తమ వ్యవహారములను పరిష్కరించిన మహాత్ముల మెప్పుడు మరలి వచ్చునాయని పరితపించుచుందును.

## లోగొనుటలేక మార్చుట

రావిచెట్టు ఉసిరికచెట్లు ఊరేగింపులను గూర్చిన పోరాటములు చిలిపివి. సాంఘిక పరిస్థితులను సరిగ సవరింపనిచో తగాదాకు కారణభూతము గాగల విషయ మొకటి యేర్పడును. ఇదేదనగ, హిందూసంఘము నిమ్నజాతుల తమలో త్వరగ నిముడ్చుకొనలేకపోయినచో వారు మతాంతరులై పోవచ్చును, ఇదివఱకే క్రైస్తవమిషనరీలీపనిని చురుకుగ చేయుచున్నారు. దానికై వారి నెవరు నేమియు ననరు. కాని మహమ్మదీయ మిషనరీలు బయలుదేరినచో హిందువులందఱును తత్క్షణమే గగ్గోలు పెట్టుదురు. మంచిపలుకుబడి గలిగినట్టియు ధనికుడైనట్టియు పెద్దమనిషి యొకరు నిమ్నజాతులను కలుపుకొనుటకై నాకొకమార్గమును చెప్పెను. హిందూనాయకులతో నొకయొడంబడిక చేసికొని దేశము ననేకభాగములుగ విభజించి కొన్నిభాగములలో మహమ్మదీయులును మరికొన్నింటిలో హిందువులును పనిచేయుచు సంవత్సరములోగాని అంతకెక్కువ కాలములోగాని తనమతములోనికి నెంతమంది నిమ్నజాతులను ఇముడ్చుకొనుటకుగాని లేక తీసికొనుటకుగాని వీలుండునో అట్టి అంచనాలను తయారుచేయవలెను.

ఈసంఖ్య, ఆయాసంఘములవారు తెచ్చుకొనగల సొమ్మమీదను, ప్రచారకులమీదను ఇదివఱకు నిముడ్చికొన్న సంఖ్యమీదను ఆధారపడియుండును, ఈరీతిగ నిమ్నజాతులను తమలో నిముడ్చుకొనుటకు ఉభయసంఘములకు చక్కని స్వేచ్ఛ యుండును. ఈమార్గమును మాహిందూసోదరు లెట్లు గ్రహింతురో చెప్పజాలను. అయినను నేను మనఃపూర్తిగ; నిర్మల మగు మనస్సుతో ఈస్కీమును తాత్కాలికముగ వారి యెదుట ప్రసాదించుచున్నాను. నేను చెప్పుచున్న దేమనగ: బరోడా సంస్థానములో నున్న "కాలీపరజులను" మధ్యరాష్ట్రములలో నున్న "గోండులను" చూచితిని. వారిస్థితిజూచినచో మనమందఱమును సిగ్గుతో తలవంచుకొనవలసినదే. అది మన కెంతయు అవమానకరముగ నున్నది. వారిని హిందువులు తమలో నిముడ్చుకొనకపోయినచో, నితరులు ఇముడ్చుకొందురు, ఇముడ్చుకొని తీరవలెను. అప్పుడు పూర్వాచారపరాయణులగు హిందువులుకూడ వారిని అంటరానివారినిగ చూచుట మానుదురు. మతాంతరులు కాగనే వారేమో తమాషాగా మాఱిపోయినట్లు గన్పట్టుదురు అట్లయినచో, వారు మతాంతరులగుట కిది యెక్కువ ప్రోత్సాహము నిచ్చుటలేదా ?

## పత్రికల కర్తవ్యము

నేనింకొకమాట చెప్పనదేమనగా:—మతాంతరులనుగ చేయుటలో అందఱకును సుహృద్భావము ప్రబలుట అన్నిటికంటె నెక్కుడైనట్టియు, తిరుగులేనట్టియు దివ్యౌషధమని మరల నొక్కి చెప్పుచున్నాను. కాని, యీసుహృద్భావము పత్రికల కున్నదో లేదో చెప్పజాలను. ఇప్పుడు మనదేశములో కొన్నిచోట్ల నున్న పత్రికల హద్దుపద్దు లేక పాక్షికదృష్టితో పనిచేయుచున్నవి. నేనుకూడ పత్రికాధిపతినే; పత్రికాస్వాతంత్ర్యసంపాదనకై పాటుబడుటలో నేనుకూడ కొంత కష్టమనుభవించితి ననుసంగతి తమకు తెలిసియే యుండును. పాపము:—గతించిపోయిన ముద్రణశాసనముక్రింద పెట్టబడిన ప్రధానమైన కేసులో నేనుకూడ ప్రధానపురుషుడుగ నుండు గౌరవము—అది గౌరవమేయైనచో—నాకు లభించినది. ఈశాసనమును లేవగొట్టినది నేనే; కాని దానిని చంపివేయుకాలమందు నేను లేకపోయితిని. ఈనిర్బంధములు కొన్ని పోయినవి గనుక మనమే యిప్పుడు యెక్కువనిగ్రహముతో పనిచేయవలసిన యవసరము చాల గలదు. కాని, పంజాబులోని దేశ

భాషాపత్రికలను చూడగ, కాంగ్రెసువారందఱును కలిసి దానిని సర్దుబాటు చేయనిచో, నిరంకుశాధికారు లొనర్చిన ఆదిక్కుమాలినచట్టము మరల సమాధిలోనుండి లేచివచ్చిన బాగుండునురా యనిపింపగలదు! ఆచట్టము మరల బ్రతికివచ్చినచో, దానిని వినియోగించుటకై పంజాబు పత్రికలలో అధికారులకు అవకాశముదొరకుననిగాదు; ఏలయన, పీనల్ కోడ్డు ౧౫౩ ఏ- శెక్షనుక్రింద నేరమును, ౧౨౪ ఏ- సెక్షను క్రింద నేరమును అధికారవర్గమువారిదృష్టిలో సమానములు కావు.

ప్రెస్సు ఇప్పుడు గతించిపోయినను పీనల్ కోడ్డును, శివిలు కోర్టులును గవర్నమెంటుకు చాలును. ఈకోర్టులలో గవర్నమెంటుచేత పెట్టబడి పెట్టబడిన ఉద్యోగస్థులు తమకు గలిగెనని చెప్పినయవమానములకై ప్రతిఫలమును పొందగలరు. కాని ప్రజలకొక్కరికే దిక్కులేదు. కాని ప్రజల నిట్టి దిక్కులేనిస్థితిలో నుంచకుండ రక్షించుట మనపనియై యున్నది. క్రిందటి సెప్టెంబరులో ఈపత్రికల విషయమై యొక తీర్మానమును కాంగ్రెసుకు శిఫార్సుచేయవలసినదని "హిందూ-మహమ్మదీయైక్య" సంఘమును ప్రోత్సహించినవాడను నేనే. భారతదేశమందలి పత్రికలకన్నిటికిని నొక హెచ్చరికపత్రమును పంపించునట్లు వర్కింగుకమిటీని ఆజ్ఞాపింపవలసినదని మేము కాంగ్రెసును కోరితిమి. అందలి విషయము లేమనగ:—

వివిధసంఘముల పొందికకు సంబంధించిన విషయములను చర్చించునప్పుడు బహునిగ్రహముతో ప్రవర్తించుట అత్యవసరము. మఱియు ఈనానాసంఘముల తగాదాలను వివరించునప్పుడును వానిమీద వ్యాఖ్యానించునప్పుడును చాలనిగ్రహము జూపుట అత్యవసరమని హెచ్చరింపవలెను. భారతవర్షముయొక్క అత్యుత్తమక్షేమమునకు భంగకరమై వివిధసంఘములకు పరస్పర ద్వేషమును పెంపొందించునదైనట్టి ధోరణి నవలంబింపవద్దని వారిని నాపత్రికలలో ప్రార్థింపవలెను. ప్రతిరాష్ట్రమందును, చిన్నకమిటీ యొకటి యుండవలెను; సంఘములమధ్య కలహమును పురికొల్పగల యేవిషయమునైన నేపత్రికయైన ప్రకటించుచున్నట్లయిన అట్టిపనిని మానుకొనవలసినదని యాకమిటీవా రాపత్రికను ప్రార్థింపవలెను. సుహృద్భావముతో చెప్పిన యీమాటలను ఆపత్రిక వినకపోయినచో, దానిని బహిరంగపఱుపవలెను.

అప్పటికిని వినకపోయినచో ఆఖరుకు కాంగ్రెసువారందఱును ఆపత్రికను బహిష్కరింపవలెనని ప్రకటింపవలెను. ఈతీర్మానమును కాంగ్రెసు ఆమోదించినది. కాని దాని నింకను ఆచరణలో బెట్టుటకు కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమునకు తీరిక దొరకలేదు కాబోలు. హిందూమహమ్మదీయైక్యతను పునరుద్ధరించుటకు మన మిదిగాక యింకొకపనికూడ చేయవలసియున్నది. అది చాల అవసరము. కాంగ్రెసు క్రింద శాశ్వతముగనుండి పనిచేయుటకు తగినసిబ్బంది నేర్పాటు చేయవలెను. ప్రతిరాష్ట్రములోను ప్రతిజిల్లాలోను నిట్టి సిబ్బంది యుండితీరవలెను కాంగ్రెసులో నట్టితీర్మానములను ప్యాసుచేసి గౌరవముగ సొమ్ము పుచ్చుకొనకుండ పనిచేయుకార్యనిర్వాహకులమీద వదలివేసిన లాభము లేదు. జీతమిచ్చి శాశ్వతముగ కాంగ్రెసుక్రింద పనిసిబ్బందిని తగినంతమందిని ఏర్పాటుచేయవలెను.

మిత్రులారా! మొన్న ఢిల్లీలో చేసినవానినే నేనిప్పుడు మరల నేకరువుబెట్టి మిమ్ములను విసిగించుచున్నానే గాని నే నిప్పుడు క్రొత్తగ చెప్పఁబోవుసంగతు లేమియు లేవని మీరనుకొందురు కాఁబోలు. ఇదివఱకు మనము చేసినతీర్మానములను గట్టిగ కొనసాగించుటకు మనము కంకణము గట్టుకొన్నచో మన కిప్పుడు క్రొత్తగ కావలసిన విశేష ముండనక్కఱలేదు.

ప్రస్తుతపరిస్థితులు మిమ్మును సంతృప్తుల జేయఁజాలవనియు నేకీభావము గల్గియుండుటకు సంకల్పించుకొంటిమనియు, ఢిల్లీ సభలో మనము లోకమునకు ప్రకటింపగల్గితిమి. దీనితో వాతావరణము కొంతవఱకును జల్లబడెను. అదియేకాదు. జాతీయవైషమ్యముల నడంచుటకు ప్రతిక్రియలఁ గూర్చితిమి.

కాని దానినాచరణలోనికిఁ దెచ్చుటకు మాకింకను సావకాశము లభింపలేదు. మన మింతవఱకును ఢిల్లీతీర్మానమును బరీక్షించుటయందును, వాక్యార్థము జేయుటయందును, విమర్శించుటయందును, చాల కాలము గడిపితిమి. కాంగ్రెసువాదులలోఁ జాలమంది ఎన్నికల (శాసనసభ) తొందరలో నుండిరి. జాతీయైక్యతను బునరుద్ధరించుట వేఱొండు మార్గముల నవలంబింపక పోవునెడల నిదివఱకే యవలంబించిన పద్ధతుల నాచరణలో బెట్టుట కార్యనిర్వాహకవర్గముయొక్క విధియై యున్నది. కాని మీరలందఱును సంకోచరహితులై వారికి తోడ్పాటు నొసంగినగాని శాశ్వతఫలితము నొసంగు కార్యము- నెద్దానిని వారలు చేయజాలరు. నిక్కముగ, మీరలే బలీయులగు మీకార్యనిర్వాహకులు ప్రారంభమగు నూతనవత్సరమున మీ యాజ్ఞల నిర్వర్తించుటకు మీచే నియోజితుడనైతిని. కాన మీయాజ్ఞల నిర్వహణమున మీ సేవకునికి తోడ్పాటొసంగెదరుగాక యని మిమ్ము వేడుచుంటిని.

ఈ పరిస్థితుల గుర్తించి కర్తవ్యమునకుఁ గడంగెదరుగాక యని పత్రికానిర్వాహకులకంతఱకును, హృదయపూర్వకమగు విన్నప మంపుకొనుచున్నాను. పత్రికాసంపాదకుఁడనగు నాకు, ఆశాభంగము గల్గింపకుందురుగాక. ఈమధ్య నేను బీజపూరునకు బోయినతఱి, తొలిసారి విఖ్యాతమగు గోపురమును దర్శించితిని. అద్భుతమగు కట్టడమును గాంచి నావలెనే యచ్చెరువొందుచున్న యొకమిత్రుఁడు గొప్పతనమునకై విఖ్యాతిఁగు ఐరోపాఖండమున నెచ్చటనైన, గోల్ గుమ్మాదు వంటి ప్రతిధ్వనించుమహాభవనము లెచ్చటనైనఁ గలవా యని, మెల్లని కంఠస్వరముతో నన్నడిగెను. అంతటి మెల్లనికంఠస్వరముతో మాటాడినను, ఒకమూలనుండి యొకమూలకు నామిత్రునిపలుకు లంత విస్పష్టముగా వినబడుట మిక్కిలి యద్భుతవిషయము. ఒకమాటు పల్కిన, తొమ్మిదిసారులు ప్రతిధ్వనించుట మఱింతద్భుత మయ్యెను. నామిత్రుఁడు బీజపూరుపట్టణపుఁ బూర్వవైభవమును దలంచుకొనుచు నొక్కతృటికాలమున తన్మయుడయ్యెను. తన మహమ్మదీయపూర్వులబుద్ధివైభవమునకును పనితనమునకును సగర్వుఁడయ్యెను. కాని యూరపు

" ప్రతిధ్వనించు భవనము లింతకంటెను నద్భుతము లని మరల కంఠస్వరముతోనే బదులు చెప్పినతోడనే యాతడు తెల్లను. ఐరోపాఖండమునందలి ప్రతిధ్వనించుగృహములు పత్రికా కార్యాలయము (వార్తావశాఖ) లని నేను నుడివితిని. పత్రికానిర్వాహకునియేకాంతమందిరమున రహస్యముగా విడిచిన యెట్టియనృతంపుమాటయైనను ఖండఖండాంతరములకు వినఁబడునట్లు ప్రతిధ్వనించును. పిమ్మట నయ్యదియే సహస్రసంఖ్యాకుల నోటినుండి వెలువడి మహాధ్వని యగును. వాస్తవము నెవ్వరును వినిపించుకొనరు. అసత్యధ్వానములచే ప్రపంచమును మాఱుమ్రోయించుట యెంతసులభమో సత్యఘోషణలచే ప్రతిధ్వనింపఁజేయుటకూడ నంతసులభమే. భారతవర్షమునం గల పత్రికాకార్యాలయములు సత్యమును ప్రతిధ్వనించుభవనములు కానున్నవో, అసత్యమును మాఱుమ్రోఁగించు గృహములు కానున్నవో, యదియే నిర్ణయించుకొనవలయును.

## స్వరాజ్యము - అన్యదేశీయుల దార్జన్యము

హిందూమహమ్మదీయసమస్యనుగూర్చి ముచ్చటించుట విరమింపక పూర్వము నే నొక్కమాట చెప్పి విరమించెదను. స్వరాజ్యము చేకూరునెడల భారతవర్షము హైందవమహమ్మదీయులమతవాంఛల నన్నిటినిదీర్చి వారల సంతృప్తులఁ జేయునని నేను వక్కాణించుచున్నాను. స్వరాజ్యము సర్వరాజ్యము. అందఱు రాజ్యమును స్వరాజ్యము స్వధర్మ మిమిడియున్నది. ప్రాచ్యదేశమున నట్లే యుండవలయును. ఢిల్లీనగరమున మొగలాయి సింహాసనమును ముసల్మానులే యధిష్ఠింప నవసరము లేదు. తురుష్క మహాసామ్రాజ్యము సింహాసనవిహీనమై ప్రజాస్వామ్యముగఁ బరిణామ మొందుట మనము చూచియేయుంటిమి. మహమ్మదు సంతతివారగు ఖలీఫాలు ప్రజాసేవకులై ముప్పది వత్సరములు సత్పరిపాలన మొనర్చిరి. వారల దలంచి యేమహమ్మదీయుఁడు గర్వపడఁడు? నాగరిక ప్రపంచమున చాలభాగము మహమ్మదీయమతమును వ్యాపించెను. అప్పటికిఁ గనిపెట్టఁబడిన ప్రపంచములోని అన్ని ఖండములలోను మహమ్మదీయసామ్రాజ్యము విస్తరిల్లెను. కాని తరువాతి మహమ్మదీయ విజయములును, తరువాతి సామ్రాజ్యవిజృంభణములును మహమ్మదీయులకు మొదటి ముప్పది వర్షములలోఁ జేకూరిన విజయపరంపర లంత ప్రశంసాపాత్రములు గావు. బైజాంటైను ఐరానియను సామ్రాజ్యములనుండి యరుదెంచిన రాయబారులు తమతమయేలికల నిరంకుశాధికారములనుగూర్చి బడాయిగొట్టుచుండ, మహమ్మదీయ రాయబారి తమ యేలికను తామే నియోజించితిమనియు ఈశ్వరధర్మమును ద్రోసిపుచ్చునెడల తత్క్షణమే యాతని పదభ్రష్టుని జేసెద మనియు సగర్వముగఁ బలికిన దీకాలముననే. దైవభీతిగలట్టియు, శౌర్యవంతులైనట్టియు తురుష్కులు హతాశులై ఓటమిఁ జెందుటకు సిద్ధముగా నున్నపుడు విజయమును బడయుట వృథగాదు. విజయానంతరమున అనివార్యముగ గల్గు కార్యములు దీరినపిమ్మట ఈశ్వరసహాయమును గొని 'ఓమరయెడు' 'అబ్బాసెడు' సామ్రాజ్యవైభవముల గాక రాజులు లేనికాల మగు ఖిలాఫతుకాలము నాటి వైభవములనే మరల నెలకొల్పెదను.

ఖలీఫాకును తక్కటి మహమ్మదీయరాష్ట్రములకును గల సంబంధము లెట్లు నిర్ణయింపబడవలయునో యా విషయమును గూర్చి నాకు కొన్ని యభిప్రాయములు గలవు. కాని ముచ్చటించుట కిది సమయము గాదు.

భౌతికవిషయములలో పరిపాలకుఁ డెవఁడైనను, ఈశ్వరుని ప్రభుత్వముదప్ప వేఱొకని ప్రభుత్వము లేదనియు, ఆయనను సేవించుటకే మన మాజ్ఞాపింపఁబడితి మనియు, గుర్తించునెడల తమ మతవాంఛల నన్నిటిని దీర్చుకొనఁగలరని నామహమ్మదీయసోదరులకు నేను మనవి చేయుచున్నాను. అన్ని మతములలో వలెనే మహమ్మదీయమతమునందుగూడ, ప్రతిమహమ్మదీయుడును తప్పక చేయవలసిన కార్యములు గొన్నియు, తప్పక చేయదగని కార్యములు గొన్నియుఁ గలవు. ఈ చేయదగిన పనులకును, చేయదగని పనులకును మధ్యవిశాలమగుభూమి గలదు. అందాతడు దనయిచ్చవచ్చిన తెఱంగున విహరింపవచ్చును.

చేయఁదగిన కార్యముల చేయవలదనిగాని, చేయఁదగని కార్యముల చేయవలసినదనిగాని యాజ్ఞాపించుమనుష్యమాత్రునికి వశవర్తియై ముసల్మానుఁ డెవ్వఁడును మెలంగఁజాలఁడు. అట్టిమానవుడు, తనకుటుంబములోనివాఁడైనను, పరిపాలకులలోనివాఁడైనను, యజమానునకుఁ జెందినవాఁడైనను, స్నేహితుఁడైనను, విరోధియైనను, మహమ్మదీయుఁడైనను, మహమ్మదీయేతరుఁడైనను సరే మతేతరవిషయములందు మహమ్మదీయుల రాజ్యాధికారమునకు భంగము రాకుండునంతకాలము అట్టి రాజ్యాధికారము ఖలీఫా చేతియం దుండునంతకాలము, మహమ్మదీయులు మహమ్మదీయపాలనకు లోఁబడినను మహమ్మదీయేతరులపాలనకు లోఁబడినను సరే విచక్షణ లేదు మహమ్మదీయులు గోరునది తమ మతవిషయములందు తమధర్మముల నిర్వర్తించుటకు స్వేచ్ఛయే. మహమ్మదీయనృపాలుఁడైనను సరే, ఖలీఫాయైనను సరే, యీశ్వరునికి జోహారులొనర్పవలదని శాసించునెడల, అట్టి ఆజ్ఞల నుల్లంఘింపవలెను మహమ్మదీయ ప్రభున కొసంగఁజాలనిది మహమ్మదీయేతర ప్రభువుల కొసంగఁజాలము. ఏలయన, అయ్యది ప్రభున కొసంగబడునది గాదు; ఈశ్వరుని కొసంగవలసినది. ఇట్టి విషయములో స్వరాజ్యస్వధర్మ ప్రభుత్వమునకు, హృదయపూర్వక మగు భక్తివిశ్వాసముల నెందులకు జూపఁగూడదో నాకుఁ దెలియకున్నది.

భారతీయమహమ్మదీయుల సహాయమును గొని అఫ్ఘనిస్థాన ప్రభువగు అమీరుగారు హిందూదేశముపై దండెత్తువచ్చుదు రను అనవసరమగుభయమునకు కేవలము పిఱికితనమును భీతియునే కారణములు. వానిని గెలువవలెనని ధైర్యముపూని యాత్మనిగ్రహము వహింపవలయును. జవాహరలాల్ గారు "స్వరాజ్యప్రాప్త్యనంతరము మనపై కెవరువత్తురో చూత"మని చెప్పినవాక్యములు చదివినపుడు నాహృదయమున నానందము జనించెను. అట్లే జరిగినయెడల నిజముగ నెవరు వచ్చినను మనకు భయము లేదు. 150 వత్సరముల దాస్యానుభవముతరువాత కష్టపడి స్వతంత్రమును సంపాదించినవారి చేతులలోనుండి దానిని లాగికొనుట సామాన్యకార్యము కాదు. అట్లు దండెత్తివచ్చునది హిందువైనను మహమ్మదీయుఁడైనను వాని నెదుర్కొనవలసి వచ్చినయెడల నెవరిని మీరి

ప్పుడు గౌరవించితిరో అట్టినేను శాయశక్తి పోరాడుటకు సంసిద్ధుడనై యొక సైనికపదవి నాక్రమించుకొనుటకు సిద్ధముగా నున్నాను. నేనెన్నటికిని మిమ్ముల ద్రోహముచేయను.

## ఆఫ్ఘనిస్థానము

1921 సంవత్సరమున నేను చెన్నపురిలో నిచ్చిన యుపన్యాసము అధికారివర్గముచే మిక్కిలి రాజద్రోహపూరితమని తలంపబడుచున్నది. అందు బెటూలు చెఱసాలనుండి నేనును నాసోదరుడును కలసి వైస్రాయిగారికి వ్రాసిన యుత్తరములో నేవిషయముల వ్రాసితిమో సరిగా నవియే చెప్పబడినవి. ఆ యుపన్యాసము ఆఫ్ఘనిస్థానమునందుఁ గూడ గౌరవపాత్రము కాలేదు. మనము పలుమాఱు వారికి మనపై దండెత్తివచ్చు నభిప్రాయ మున్నదనుట విని వారికి కొంచెము కోపము కూడ వచ్చియుండుట వింతకాదు. ఆఫ్ఘను అమీరుగారు విదేశీయసాహాయ్యము లేకయే తనరాజ్యమందు కట్టుబాట్లను చేయుటయు ఉన్నశక్తులను వినియోగపఱచుకొనుటయు జరిపించుట వినినయెడల మనకు ఆఫ్ఘనువారు దండెత్తుట యనునభిప్రాయమే యుండకుండును. ఆయనకును ఆయనప్రభుత్వమునకును ఉన్న కాలము తనదేశమునందలి వ్యవహారములకొఱకే సరిపోవఁగలదు. భారతదేశముపై దండెత్తి జయించుట యెట్లను విషయమునకు కాలముచాలదు. ఆఫ్ఘనిస్థానము దండెత్తివచ్చిన నిట్లు చేయుదమని నేను చెప్పినయూహచేతనే వారికింతకోపము వచ్చినయెడల అట్టివిషయము చర్చించుటకు నాకెంతకష్టముగ నుండవచ్చును? నేను మహమ్మదీయుడ నగుటచే నాభారతీయత్వమునకు హానిరాలేదు. అట్టిచో తమదేశ మెంతబలహీన మైనదైనను విదేశీయరాజుయొక్క ముట్టడికి లోనై సులభముగ కబళింపఁబడునని అనుకొనుట మనజాతి కెంత యవమానమో మీరే యూహింపుఁడు?

## "నాల్గవవారు నన్నే కొట్టఁగలరు"

సోదరులారా! మనప్రస్తుతస్థితిని పోల్చుటకు సరిపోయిన యొక కథను చెప్పుచున్నందులకు క్షమింపుఁడు. ఆకథావక్త యెవ్వడో కాని నిశ్చయముగ మనకాలమునాఁటికి మిక్కిలి ప్రాచీనకాలమున వఱలినవాఁడు. ఏలన కోమటి పిఱికివాఁడని చెప్పెను. నావైశ్యస్నేహితులు నన్ను మన్నింతురు గాక. ఈకాలమున వైశ్యులనుగూర్చి యట్లు చెప్పుటకు వీలులేదు. ఏలన ఇటీవలికాలమునందలి భారతీయనాయకులలో నత్యుత్తమధైర్యశాలియగు గాంధిమహాత్ముడును ఆయనముఖ్యానుచరులలో నొకడై ఆయనకు ప్రియమైనవాఁడగు సేట్ జమ్నాలాలుబజాజీగారును వైశ్యులే. శ్రీబజాజీగారిని నేను "నావైశ్యస్నేహితు"డని పిలుచుచుందును. ఒకకాలమునందు నల్గురుబాటసారులు మార్గమధ్యమున కలసి నిర్భీతికొఱకై యందఱును కలసినడుతుమని నిర్ణయించుకొనిరి. ఒకనాఁడు సాయంకాలమున వారు బందిపోటుదొంగలచే పట్టుబడినవారు వారివద్దనున్న వస్తువులనన్నిటిని ఇండని బలవంతపెట్టిరి. అప్పుడు దొంగలుకూడ నల్గురే యని తెలిసికొనిరి. వారిలో నొకరాజపుత్రుఁడు తోడిపఠానుతో దొంగలలో నెల్ల బలవంతుని తాను కడతేర్పఁగలనని రహస్యముగ ననెను. పఠాను స్నేహితుఁడు ప్రత్యుత్తర మొసంగుచు, తరువాతిబలవంతునిఁ గెలువఁగలనని చెప్పెను. మధ్యవయస్సునందున్న మూఁడవవాఁడు ణుఁడు గావున "మూఁడవవాని నేను క్రిందపడవేయఁగలనని చెప్పెను. ట నాల్గవవాడు నన్నే కొట్టఁగలఁడ''ని వాక్రుచ్చెను. అట్టితఱి తాను మొదట వలె నొక్కనితో గాక యిద్దఱితో పోట్లాడవలసివచ్చునని బ్రాహ్మణుఁడు వెనుదీయుటకు నిశ్చయించుకొనెను. పఠానుడుకూడ ముగ్గురతో పోరాడవలసియుండునని వెనుకకు తగ్గెను. రాజపుత్రుడుకూడ నలుగురతో పోలేనందున దొంగలకు లోబడెను. మిగిలిన ముగ్గురు ఒక్కొక డొక్కొకని గెలువగలరని యెంతధైర్యముతో నుండెనో నాలవవాఁడు నాలవదొంగ తన్నుఁ గొట్టగలడని అంతనమ్మకముతో నుండుటచే నింతమూఁడెను.

## ధైర్యమును, నమ్మకమును నుంచవలెను

సోదరులారా! ఇప్పుడు వైశ్యుఁడే మననాయకుఁ డగుటచే, యుద్ధము మొదలిడుటకు పూర్వమే యపజయ మొందెదమను నభిప్రాయమును వీడుటకు తగినసమయము రాలేదు. ఇటీవల నిద్దఱు వృద్ధులును నొకయువకుఁడు నగు అరబ్బులు జరూసలెములో నున్న బీర్ మహమ్మదీయ దేవాలయములను బాగుచేయుటకై ధనము సేకరించుటకు ప్రభుత్వముయొక్క యనుమతితో రాయబారముగ వచ్చియుండిరి. వీరు ముగ్గురును హిందూదేశముపై దండెత్తివచ్చుచున్న అరబ్బుసేనలోని ప్రథమభాగ మని తమ రహస్యవిలేఖరిచే తెలుపఁబడెనని యొక ఢిల్లీ వార్తాపత్రిక వ్రాసెను. ఇట్లు భయపెట్టుటచే, స్వరాజ్యమును సంపాదింపజాలము. ఇదియే మనకున్న కొంచెమునుకూడ కోల్పోవుటకు మార్గము. ఈవ్యవహారములు చూడ బైబిలునందలి, యూదులకు భగవంతు డిచ్చినశాపము జ్ఞప్తికి వచ్చుచున్నది.

## తురుష్కసందేశము

ఇపుడు మహమ్మదీయులకు రెండువిధములైన కర్తవ్యములు కలవు. వారు భారతీయులే గాక వారు భారతదేశీయస్వాతంత్ర్యసంపాదనముకొఱకు పాటుపడుట వారికర్తవ్యము. భారతదేశ మొక్క హిందువులదే కాదు. అందువలన నట్లు జరుగుట యసంభవమైనను, నొకవేళ హిందువులు తత్సంపాదనమునకు వలసినత్యాగమును చేయుటకు వెనుదీసినను, మిగిలిన భారతీయులందఱి సాహాయ్యము లేకయే తామొక్కరే స్వరాజ్యమును సంపాదించెదమని చెప్పి పాటుపడుట వారికర్తవ్యమైయున్నది. వారుమహమ్మదీయులగుటచేఁ గూడ వారు స్వరాజ్యసంపాదనముకొఱకై పాటుపడవలయును. పారీసునందును, స్విట్జరులండునందును, రోమునందును తురుష్కుల గొందఱను నేను గలసితిని. మహమ్మదీయు లధికసంఖ్యాకులుగగల సేనలను తమపై పోరాడుటకు పంపినమనము, వారి పరాజయము తరువాత వారికి సంధిసౌకర్యములు కలుగఁజేయుటకు రాయబారము నంపుట వారి కత్యాశ్చర్యమును గొల్పెను. తురుష్కులకత్తులకు గాని జర్మనులఫిరంగులకు గాని భయపడని భారతీయమహమ్మదీయులలో చాలమంది యుద్ధకండకము లను కత్తులబోనులలో

హాము లన్నను భయపడుదురని పరస్పరవైరుద్ధ్యమును విప్పి, అదివిన్నంతనే నాతురుష్కస్నేహితు లట్లైనతమకు రానున్న యు సంవత్సరము లుండు ధైర్యమున్నను, పోలీసువానికజ్ఞయున్నను, దాస్యమును రాకుండజేయుటకు పూర్వము, వెంటనే యోడలో భారత దేశమునకు వెడలి స్వదేశదాస్యశృంఖలావిచ్ఛేదనము గావింపుమని నన్ను హెచ్చరించిరి. వా రిట్లనిరి:—

"టర్కీయందును, జలసంధియందును నింగ్లాండును జయించితిమి. పాలస్తీనాలోను, మెసపొటేమియాలోను మాతోమిక్కిలి యొత్తిడి కలుగజేయుచున్న మీభారతీయసేనలను మే మాపజాలకున్నాము. మీరు స్వతంత్రులై, ఖాలీఫాసేనలతో పోరాడుటకు మహమ్మదీయులు లాగికొని పోబడుటకు వీలులేకున్నయెడల టర్కీయును ముసల్మాను మతమును క్షేమముగా నుండగలవు. మీస్వదేశమున స్వాతంత్ర్యమును సంపాదించుట మాకును మీకునుగూడ క్షేమకరము. మీహిందూసిక్కు సోదరులు తమకొక్కరికే స్వరాజ్య మపసరమనియు మీకొఱకై యావ త్కరము కాదనియు తలంపకుందురుగాక! వారి నంతసంపూర్ణదాస్యమున నుంచుటకే మనలను బాధింపవలె నని ప్రయత్నించుచున్నది."

## ప్రాచ్యరాజ్యసమ్మేళనము

సోదరులారా! నాహిందూసోదరనాయకు లనేకులు ఇతర ప్రాచ్యరాజ్యములతో కొంతసంబంధము కలుగజేసికొనుటకు ప్రయత్నించుచున్నారని వినుటకు సంతసమగుచున్నది. వారిరాజకీయాభిప్రాయము లుత్తుంగహిమాలయశిఖరములను గభీరసముద్రవైశాల్యమును దాటి వెలికినడచినది. ప్రతిప్రాచ్యముయొక్క స్వాతంత్ర్యము స్వస్వాతంత్ర్యసంపాదనమునకు సాయము చేయగలదనియు వానినన్నిటిని సమ్మేళనము చేయవలయు ననియు నభిప్రాయపడుచున్నారు. అమృతసరములో గాంధిమహాత్ముడు ఖిలాఫతు సమస్యతో నేకీభవించినపుడు ఈయభిప్రాయమునకు పునాదివేసెను. హిందువు లిట్లు ప్రాచ్యరాజ్యసమ్మేళనముకొఱకు పాటుపడుచుండ మహమ్మదీయులు మహారాష్ట్రు లోని యల్లరులు స్మర్నాయందలి రంగములతో పోల్పవచ్చునని చెప్పెడి యొక పత్రికావిలేఖరియొక్క వాక్యముల గొని హిందువులతో సహకార మొనర్పకుండుట బహుచిత్రము! ఇంతకంటె హాస్యాస్పదమును, నసంభవమును, వేఱొకటి కానరాదు! తురుష్క లీపోలికను వినిన యెడల మనలనుగూర్చి యెక్కువగ కృతజ్ఞతఁ బూనుదు రనుకొనుట పొరపాటు.

## ముసల్మానుల యంత్యప్రశ్న

మహారాష్ట్రులలో హిందువులే యెక్కువబాధల ననుభవించిరి. కాని యీమహారాష్ట్రు అల్లరులను సహాయనిరాకరణమునకు సహకారమునకు వచ్చు కారణముగఁగూడ చెప్పెదరు. వారి నొకప్రశ్న యడుగుచున్నాను. "ఇట్టి యకారణమైన బాధలను బ్రిటిషు ప్రభుత్వముండఁగనే ముసల్మాను లనుభవింపలేదా?" ఇదియే నాప్రశ్న. అప్పుడు మండలపాలకుడు హిందువా? లేక యసహాయోద్యమమునందు పాల్గొనుచున్న మహమ్మదీయుడా? తుదకప్పటిన్యాయాధికారి ముసల్మానుడా కాడా? ఆయన సంఘదూరుడై తనసాయకత్వమును గోల్పోయి విదేశీయప్రభుత్వముతో సహకార మొనర్పలేదా? ఇవి మూడును ప్రత్యేక ప్రశ్నలు కావు. అంతయు నొక్కటే ప్రశ్న. ప్రభుత్వమువారును వారికి సహాయముచేయువారును, మహారాష్ట్రునందలి మహమ్మదీయుల సంరక్షింపజాలనపుడు, అట్టి సహకారము నింకను సార్వజనికముచేయ ప్రయత్నము లొనర్చిన నంతకంటె వారు సురక్షితముగ నుందురని పూచి యెక్కడ కలదు? ఇదియే ప్రశ్న! నే నంత యాగిన నీప్రశ్నమునకు ప్రత్యుత్తరము రా దని నాకు నమ్మకము కలదు.

అవి యట్లుండ, ముసల్మానుల పవిత్రక్షేత్రములు మహమ్మదీయేతరుల పాలనమునసే యున్నవి. తప్పక యైదు మాఱులు భగవద్ధ్యానము నొనరించు ప్రతిమహమ్మదీయుఁడును పవిత్రమైన (కాబా) మెక్కానగరమువైపునకు తిరుగుచున్నాడు. నేను బీజపూరు చెఱసాలలోనున్న కాలము నాహృదయమున కొకవిషయము తట్టి యొక్కప్రశ్నమును పద్యమున వ్రాసితిని. దానికింక నెవ్వరును ప్రత్యుత్తర మిచ్చియుండ లేదు.

"మనము ప్రతిదినమునను ధ్యానించుటకే కాబావైపునకు తిరుగుచున్నాము. అట్టి కాబానగరము శత్రుహస్తమైనందుల కాయనకు మన మేమని ప్రత్యుత్తరము నొసంగ గలము?"

## యుద్ధానంతరసదర్భములు

సోదరులారా! హిందూమహమ్మదీయసమస్యనుగూర్చి నే నెంత చెప్పఁగలనో యంతయును చెప్పితిని. ఇంతవిపులమైనచర్చచేతను మనలో మనకు పరస్పరసహకారముయొక్కయు విదేశీయప్రభుత్వములసహాయముయొక్కయు నావశ్యకతనుగూర్చి నేను వారిహృదయముల నమ్మింపలేకపోయినయెడల నేనే యోడిపోయిన ట్లొప్పుకొనవలసియున్నది. ఒక్కవిషయము మాత్రము నిశ్చయము. ఇప్పుడింతగా లస్యమున హిందువులనుండి మహమ్మదీయులుగాని మహమ్మదీయులనుండి హిందువులుగాని తప్పించుకొనజాలరు.

హిందువు లెవ్వరైన నట్టియుద్దేశము గలవారున్న నట్టితరుణము, 1200 సంవత్సరముల క్రిందట సింధుదేశమున మహమ్మద్ ఖాసీ మదుగిననదే వెడలిపోయినదని నమ్మవలెను. అప్పుడు ముసల్మాను లల్పసంఖ్యాకులు. ఇప్పుడన్నో యేడుకోట్లవఱకు వారిజనసంఖ్య వృద్ధియైనది. ఒకవేళ ముసల్మానులకుకూడ నట్టియభిప్రాయమే యున్నయెడల వారికికూడ తరుణము పోయినది. ఆసేతుహిమాచలము వారేకచ్ఛత్రముగా నేలినప్పుడొక్క హిందువైన లేకుండ నాశనము చేయవలసియుండును. ఒకసారికిసా మెత చెప్పినట్లు యుద్ధానంతరము మరల పోట్లాడుకొనవలసివచ్చిన నెవరిచెంపలు వారు కొట్టుకొనవలసియున్నది. ఒకరినొకరు నశింపజేయలేనప్పుడు ఒకరి కొకరు సహాయముచేసి వైమనస్యములను పరిష్కరించుకొనుటయే ముఖ్యావసరము. కావున మహమ్మదీయులు స్వరాజ్యసంపాదనము స్వార్థముకొఱకు మాత్రమే కాక

The Volunteers of the Cocanada Congress



దేశీయమహాసభాస్వచ్ఛంద సేవకులు, కాకినాడ

Srimati Kasturibai Gandhi Addressing the Ladies' Conference, Cocanada



శ్రీమతి కస్తూరిబాయి గాంధిగారి యుపన్యాసము, కాకినాడ

The Khilafat Pandal, Cocanada



ఖిలాఫతు మహాసభా మంటపము, కాకినాడ

The Khaddar Pandal of the 38th Indian National Congress, Cocanada



38-వ జాతీయమహాసభ - ఖద్దరుగుడారము, కాకినాడ

శ్రుతివిరోధమునకని హిందువులకనుమానము పోగొట్టవలయును. హిందువులు తమయధిక సంఖ్యాకత్వమును మహమ్మదీయుల దాస్యమునకై యుపయోగించుట లేదని వ్యక్తీకరింపవలయును. ప్రత్యేకముగ నన్నడిగిన, ప్రస్తుత దాస్యమును వీడి విదేశీయునకుగాక హిందువు ఖామందుగాగల దాస్యము నొప్పుకొనుటకు సంసిద్ధుడనై యున్నాను. ఏలయన నిట్టిమార్పువలన 25 కోట్ల నాదేశీయుల దాస్యమునైన నడ్డగించినవాడ నగుదును. వారు కూడ దాస్యమున నున్నారనిన, పాశ్చాత్యసామ్రాజ్యము మనపై నవిచ్ఛిన్నముగ పారుచున్నదనియే కదా యర్థము! 1916 వ సంవత్సరమున మననాయకాగ్రేసరుడైన శ్రీ॥ శే॥ బాలగంగాధరతిలకు గారితో మహమ్మదీయులకు సౌకర్యము లెక్కువగ నొసంగుచున్నారని తెల్పినపుడు ఆయన "మన మెన్నటికి వారి కెక్కువ యీయజాలము" చెప్పినవాక్యముల నెంతయర్థమును దూరదృష్టియు గలదు! హిందువులు నైక్యమును తలపెట్టకుండగనే హిందూమహమ్మదీయ మైత్రిని చెప్పుట దౌర్బల్యసూచకమని నాతో చెప్పు ప్రతివానికిని "హిందువులతో వ్యవహరించునపుడు దౌర్జన్యమనునదియే లే"దని నేను ప్రత్యుత్తరమియ్యవలసియున్నది. దుర్బలులే యితరులకు దుర్బలులుగ కనబడుటకు భయపడుచుందురని నమ్మవలసియున్నది. ఏసమస్యను సంపూర్ణముగ పరిష్కరింపనిమన మేమియును చేయజాలమో యట్టివిషయము మాటలతో విరమించుచున్నాను.

## కౌన్సిలు ప్రవేశము

ఢిల్లీలో ప్రత్యేకకాంగ్రెసుసభ శాసనసభాప్రవేశమును పరిష్కరించుటకై సమావేశమైనను, అచట చర్చింపవలసిన ప్రధానవిషయము హిందూమహమ్మదీయైక్యతయే యై యుండెను. నేనిప్పుడు విశేషభాగము హిందూమహమ్మదీ యైక్యతనుగూర్చియే చెప్పితిని. కారణమేమనగ:—అది ప్రధానమైనవిషయ మగుటయేగాక రెండవదియగు శాసనసభాసమస్య మన అదృష్టమువల్ల నిప్పు డంతరించినది. ఢిల్లీలో నాప్రార్థనమీద కాంగ్రెసుసభ శాసనసభలపై ఆంక్షను తీసివేసి, మతసంబంధమైనట్టిగాని మనస్సాక్షిసంబంధమైనట్టిగాని అభ్యంతరములు వారులేని అప్పుడు జరిగినయెన్నికలలో వోట్లియ్యవచ్చుననియు, శాసనసభలకు నిలువవచ్చుననియు అనుజ్ఞ నొసంగినది. మఱియు మూడుసంవత్సరముల క్రింద అంతజయప్రదముగ జరిగిన శాసనసభాబహిష్కారప్రచారమును నిలిపివేయవలసినదని కూడ ఢిల్లీ కాంగ్రెసు చెప్పినది. ఎన్నికలు పూర్తియైనవి. సంవత్సరకాలమునకు పైగా మన పని నంతను పాడుబెట్టి మనలో సమాధానమును పోగొట్టి నానాభ్రష్టము చేసిన యీసమస్యను తిరిగి రేపుటవల్ల ప్రయోజనమేమియు నుండదని నాబుద్ధికి తోచుచున్నది. త్రివిధబహిష్కారమునుగూర్చి నాకెక్కువ పట్టుదల యున్నది. వానినిగూర్చి నేను ఢిల్లీవిషయనిర్ధారణసభలో తీవ్రముగ—మాస్వరాజ్య పార్టీ స్నేహితులు చెప్పినట్లు అతితీవ్రముగ కూడ—మాట్లాడితిని. నాకిప్పటికిని ఆయభిప్రాయములే యున్నవి. అవసరమని నాకుతోచినచో, నిప్పుడుకూడ నేనంతతీవ్రముగనే మాటాడుదును. దేశాభ్యుదయమునకును కాంగ్రెసుయొక్క పురోగమనమునకు నిది తోడ్పడునని నాకుతోచినచో, నేను తిరిగి అంతతీవ్రముగనే యీరోజునకూడ మాటాడుటకు సిద్ధముగనున్నాను. కాని యిప్పు డట్టిదున్నట్లు నాకు నచ్చలేదు. స్వరాజ్య పార్టీవారి యభిప్రాయములు నచ్చలేదు. అదిగాక ఏమాత్రము దేశాభిమానముగల భారతీయుడు దేశీయమహాసభనుండి చీలిపోవునట్లు చేయగల యేఒక్కమాటయు నోటినుండి జాఱగూడదని నేను నిశ్చయము చేసికొంటిని. వేయేల! కీర్తిశేషులగు మాన్లేగారు చెప్పినమాటలనే నేనిప్పుడు చెప్పుచున్నాను:—"మితవాదులను దరికి చేరదీయుడు." భారతీయులకు తాను చేయు న్యాయమునే ఇతరదేశీయులుకూడ చేయవలసినదని హెచ్చరించు ధైర్యమును చాకచక్యమును చూపినవాడు మాన్లేప్రభువు. మొన్న తటస్థించిన వీరిమరణముచే ప్రపంచ మిట్టివానినొకని గోల్పోయెను.

## మితవాదులు; సామ్రాజ్యసభ

క్రొత్తటి యెన్నికలవిషయమై నేను పాక్షికదృష్టి వహింపను. వోటు అధికారము బహుసంకుచితముగ నుండుటచే, జాతియొక్క నిర్ణయ మీయెన్నికలవలన సిద్ధింపజాలదు. కాని అన్నిటికంటె నెక్కువ నిశ్చయముగ తేలినవిషయమేదైన నున్నచో అది ఒక్కటే గలదు; ఏమనగ:—భారతవర్ష మిక నెన్నటికిని తనపరిపాలకులతో సహకార మొనర్పదు. సహకార మొనర్చుటకు తిరస్కరించుచున్నది. మనము మొన్న నాలుగుసంవత్సరముల క్రింద నేయభిప్రాయములలో నుంటిమో, యిప్పుడట్టి యభిప్రాయములలో నున్న కొందఱు దేశీయులకు గల భ్రమ వీడుటకై యీమధ్య ననేకసందర్భములు తోడ్పడెను. ఖండాంతరములందలి భారతీయుల స్థితినిగూర్చి సామ్రాజ్యసభలో జరిగిన చర్చలు లోకమందంతటను బాహాటముగ బ్రచురింపబడినవి. ఇవన్నియు విన్నతరువాతకూడ, ఈయల్పమైనయెరకై యాశించుచేప బుద్ధిహీనమైన చేపయై యుండవలెను. లక్షా అఱువదివేలమంది భారతీయులున్న దక్షిణాఫ్రికా బిర్రబిగిసియున్నది. కెనియా మొదలగు "క్రౌను" కాలనీల విషయములో నేనేమి చేయుటకు చేతగాక స్వతంత్రరాజ్యముల అంతరంగిక విషయములలో నేమేమిచేయుటకు మాకు మొగతనము లేదని స్పష్టముగ ఒప్పుకొనక యేదోతుచ్ఛమగు తీర్మానము నొక దానిని చేసికొన్న సామ్రాజ్యప్రభుత్వమువారు తమ తీర్మానము నిప్పుడు రద్దుపరచుకొందు రను ఆశ లేదు. తన తుచ్ఛతీర్మానమును రద్దుచేసికొనుటకు చేతగాక "మరల మీసంగతి యింకొకసారి వినెద"మని చెప్పినది. ఇక తక్కిన వలసరాజ్యములు "సానుభూతిని" చూపుచున్నవట! "సానుభూతి"కేమి తక్కువ! దానికి దమ్మిడీయైనను ఖర్చులేదు. అయినను అది చూడబోయినను "కొమగటామారు" ఓడను సంబంధించిన 1100 భారతీయుల విషయములో ఆ "సానుభూతి" కూడ సున్నయైనది. నూఱుమందిమాత్రముకూడ లేని కెనడాలో కొంచెము బాగున్నది. డాక్టరు సప్రూగారు మనభారతీయులవిషయమై సామ్రాజ్యసభలో చేసిన ఉద్రేకపూరితమగు సేవకు నేను సంపూర్ణమైన విలువ నిచ్చుచున్నాను. వారు పొందిన జయము సంపూర్ణమైనదే. కాని మొదటినుండియు వారిగమ్యస్థానము బహు తక్కువగ నుండెను. కావున వారుపొందినజయము మాకు—వారికివలె ఆతాక్షణముగలనిమాకు—వేడిపుట్టింపలేదు. మా కిది చల్లగనే—చప్పగనే—కన్పట్టెను.

ఈ సందర్భమున నాకొకకథ జ్ఞాపకము వచ్చుచున్నది. నాస్నే కొకడు చాలధనమువచ్చు ఉద్యోగమునువదలివేసి బి.ఏ ప్యాసైన మ్మదీయు డెవఁడును ఇదివఱకు చేయని విధముగ క్రొత్తత్రోవ త్రొక్కి బొంబాయిలో కమిషన్ ఏజెంటుపనిపట్టుకొనెను. అతఁడు నాకొ కరోజున కనిపించి బహుఉల్లాసముతో నావద్దకువచ్చి తనవ్యాపారమున నూ టికి నూఱురూపాయలు లాభమువచ్చినదని చెప్పెను కాని కొంచెము నేను రముల నడిగితిని. అతఁడాదినమున డజను జపాను పేపరుకట్టలన మ్మెనట. వచ్చిన నూటికి నూరులాభము తన ఆఫీసు అద్దెకు సరిపోదట! అనేక సం వత్సరములు కొట్టుకొనఁగ కొట్టుకొనఁగ తుదకు 1921 లో ఖండాంతరముల భారతీయులకు సమానస్థానము నొసంగుట వాంఛనీయమను భావము నంగీ కరించుచు సామ్రాజ్యనాటక ప్రదర్శనముల నన్నిటిని నడపించుఅధికారియై న స్మట్సు సేనాని అసలు ప్రధానపాత్ర లేకుండ ఈ నాటకమును ఆడిం చెను. అట్లయ్యును తనకువచ్చిన నూటికి నూఱులాభమును చూచుకొని ము రియవలసినదని మనభారతదేశము నడుగుచున్నారు. పోనీ అది చూడబో యినను ఆలాభము మనకింకను చేతికిరాలేదు. రెండుసంవత్సరములైన తరు వాత మరల దానికొఱకై సామ్రాజ్యసభలో పోరాడవలసి వచ్చెను. ఈ బేరముయొక్క స్వభావమునుగూర్చి అనుమానములు పుట్టెను. సొమ్ము ఇచ్చివేయుట అవసరమా లేక వాంఛనీయమా యను అనుమానము పుట్టెను. ఈ సందర్భమందు అసలు బేర మునే రద్దుచేయవలసినదని స్మట్సుసేనాని కోరెను. ఈయేజెంటిద్దఱిలో సమాధానము కుదురలేదు. స్మట్సుసేనాని భారతదేశమునకు అంతరంగిక స్నేహితుడను క్రొత్తవిశేషము నొకదానిని యీయిద్దఱి ఏజంట్లలో నొకఆయన కనిపట్టెను. ఈయన కనుగొన్న క్రొత్తవిషయము కొలంబసు కనుగొన్న క్రొత్తవింతకంటె నెక్కువగ నున్నది. ఈ యేజంట్లకు ఇట్లు సమాధానము కుదురకపోయినను, భారతవర్షమునకు మరల అదృష్టము తోడయ్యెను. మనకు మరల నూటికి నూఱులాభములు వచ్చెను. ఈలాభ ము మనచేతికి ఇప్పటిలో వచ్చు ఆశ యేమైన నున్నదేమో స్వయముగ కనుగొని వచ్చుటకై ప్రతిభాగస్వామివద్దకు వెళ్లుట కొక "ఓడసం ఘము" బయలుదేఱును. ఇది మన కిప్పుడు వచ్చినలాభము. డాక్టరు సప్రూగారి ట్రావెలింగు యేజంట్లలో కొందఱు నిరుద్యోగపు పెద్దలు ఉన్నారు. వారికి "జాన్ బుల్, సన్సు అండు కో"వారి భాగస్వాము లతో ప్రత్యక్షముగ వ్యవహారము జరుపుకొను గొప్ప గౌరవము లభింపఁ గలదు.

వచ్చినలాభము నేనేమొతగ్గించి చెప్పుచున్నాననే అనుమానము లేకుండ, "ఇండియా, అండ్ కామన్ వెల్తు" అను సంపాదకీయ వ్యాసముయొక్క తుదిభాగమందు టైమ్సుపత్రిక బహుశ్రమపడి తేల్చిన సారాంశము నిట వివరించుచున్నాను: "బ్రిటిషు గవర్నమెంటు యొక్కయు, ఖండాంతరములందలి అధినివేశరాజ్యములయొక్కయు, ప్రతినిధులు చూపిన సానుభూతియు, సుహృద్భావమును, సమష్టి సామ్రాజ్యమందు భారతదేశమునకు గల భాగమునుగూర్చి వారుత్రికరణ శుద్ధిగజూపిన మెప్పును—ఇవన్నియు ఒకయెత్తు. తదితరభాగస్వాము లతో భారతదేశము స్వయముగ రాయబారములు నడుపుకొనుహక్కు ప్రత్యక్షముగ నంగీకారమగుట యింకొకయెత్తు, రెండవదానికంటె మొద టిది తీసిపోదు. నిజమే, డాక్టరు సప్రూగారును, వారిరాచతోడును కలిసి భారతవర్షమునకు "తదితరభాగస్వాములతో స్వయముగ రాయ బారము నడుపుకొను హక్కుయొక్క ప్రత్యక్షాంగీకారమును" సంపా దించుకొని వచ్చినమాట వాస్తవమే. కాని యీబేరము ఎప్పుడు ముగి యును? సొమ్ము మనచేతిలోనికి యెప్పుడు వచ్చును? అది యెంత మొత్త ముండును?

చక్కఁగ సకాలములందు సామ్రాజ్యసభలు ఒకదానివెంట మరి యొకటి తప్పక జరుగుచునేయుండును; సందేహము లేదు. ఒక్కొక్క సభయందు భారతదేశపు పరాధీనదశ అంతకంత కెక్కువగ లోకము నకు ప్రకటితమగుచునే యుండును. కాని సామ్రాజ్యాధికారపు పొరలు భూగర్భమందలిమట్టిపొరలవలె దట్టముగ మననెత్తిమీఁద అంతులేకుండ నానాఁటికి పెరిఁగిపోవుచున్నప్పుడు మానవస్వభావము ఎంత కాలము ఓరిమితో ఆశపెట్టుకొనియుండగలదు? సామ్రాజ్యమందు మనము పొందు చున్న చీమనడకయభివృద్ధి మాచి యెంతమితవాదియైనను సంతృప్తిఁ జెంద జాలఁడు. మనకు కనీసపు న్యాయమును గలుగఁజేయుటకై యింగ్లండునకు అంతు లేని గడువు నియ్యగల ఉదారుఁడు "లిబరల్సు"(ఉదారులము)అని చెప్పుకొనువారిలోగూడ లేరు. అందులో ముఖ్యముగ తప్పుడు విద్యా పద్ధతివల్ల మనదేశములోని పుంస్త్వము, పౌరుషము నానాఁటికి క్షీణించి పోవుచున్నదనువిషయము వారికిప్రతిదినము ప్రత్యక్షముగ గోచరించు చున్నప్పుడు—గోచరించితీరవలసి యున్నప్పుడు—ఎవ రింక ఓపికపట్టఁ గలరు?

మనము వీడినంత సంపూర్తి మనమితవాదులకు గూడ భ్రమ వీడి నప్పుడుకూడ మనము పరిష్కరింపవలసిన విషయ మింకొకటి యుండియే యున్నది. అప్పుడు "వీరెంతవఱకుపోవుటకు సిద్ధముగనున్నారు!" సహా యనిరాకరణతత్త్వము మొదటినుండియు "అత్యధికసంఖ్యాకుల అత్యల్ప త్యాగము"నే కోరెను. గాంధియుగానంతరము "అత్యల్పత్యాగ"మనఁ బడినది తత్పూర్వయుగమందు సాధారణముగ "అత్యధికత్యాగ" మనఁబడినదానికంటె చాల ఎక్కువయై యుండవచ్చును. కాని పరిమిత త్యాగతత్త్వమువలన స్వరాజ్యము రానూరాదు; వచ్చినను నిలవనూ నిలు వదు. డాక్టరు సప్రూగారిపద్ధతి బాగున్నదనియే యనుకొందము; కాని దాని ననుష్ఠించుటకు ధానిలో నేమున్నది! కేవలము తీర్మానములు, పిటీషనలు, ఖండనలు మిక్కిలియెక్కువగ చేసినచో ఆఖరుకు ఒక దిలిపి హరతాళము! ఇంతేనా! అంతయు నింతేయైనచో యీవెఱ్ఱిరాజకీయము నిఁక కట్టిపెట్టిపోదము. ఎవరిపూర్వజులు "రన్నిమీడ్" రణరంగమందు స్వాతంత్ర్యమును సంపాదించిరో, యెవరిపూర్వజులు "బాస్టిలీ" కోటను నేలమట్టము చేసి స్వాతంత్ర్యమును సంపాదించిరో అట్టివారికి రాజకీయముతో చెలగాటలాడుటకు చెల్లిన చెల్లుగాక! కాని మనమున్నెనో యింకను స్వాతంత్ర్యపట్టాను (మ్యాగ్నకార్టాను) సంపాదించుకొనలేదు; "హక్కులబిల్లు"ను సంపాదించుకొనలేదు; కావున రాజకీయముతో —పాశ్చాత్యదేశస్థులవలె— మనమిప్పుడు చెలగాటములాడుటకు నిం కను వీలులేదు. మనముచాలకాలము "పీనల్ కోడ్డు"ను మించిపోకుండ

యోచించెడివారము "డైసీ" మొదలగు రాజ్యాంగవేత్తల గ్రంథములందలి విషయములను గూర్చి మాటలాడినచో మనము చాలపైకి వచ్చితిమని మన మిప్పుడు తలంచుచున్నాము. కాని మనభావము లీమెట్లనన్నిటిని దాటిపోయి వీనికతీతమగు చారిత్రాంశములను గమనింపవలసియున్న దనువిషయము మఱచితిమి. మితవాదులు చాల తెలివిగలవారని నేనుఒప్పుకొందును; కాని తెలివిమాత్రము చాలదు; దానికి వెనుక శక్తి యుండవలెను. ఇదే ప్రధానమైనది. పరప్రభుత్వమునుండి తనదేశమునకు స్వాతంత్ర్యమును సంపాదించిన ప్రతిమానవుడును అపరిమితమగు బాధ్యతను వహింపవలసియుండెనని ప్రపంచచరిత్ర చాటుచున్నది. అట్లే తానుకూడ తనదేశ విముక్తికై అపరిమితమగు బాధ్యతను వహింపవలసి యుండునని ప్రతిమితవాదియు గట్టిగ గ్రహించినచో చాలును. అంతయు సరియగును. అతనికి కాంగ్రెసుమహాసభయేతగినస్థానమగును. వెనుకటియలవాటువల్ల అతడుమొట్టమొదట నెమ్మదిగ నడచునుగాక. స్వరాజ్యపార్టీనాయకులు తామెంతదూరమైనను పోవుటకు సిద్ధముగనున్నామని చెప్పుటచేతనే నేను వారిని కాంగ్రెసులోనుండి తఱిమివేయుటకు నిష్టపడలేదు.

## బార్డోలీ, స్వరాజ్యపార్టీ

స్వరాజ్యపార్టీలో చాలమంది యీరోజువఱకు తొమిదివఱకు కష్టపడి సంపాదించుకొన్న పాశ్చాత్యమనస్తత్వమును వదలకుండ నిలుపుకొన్నమాట వాస్తవమే. అందుచేత వారు పార్లమెంటరీచర్చలకును వాదప్రతివాదములకును తలయొగ్గుచుందురు. స్వసంరక్షణార్థముసైతము దౌర్జన్యమును ప్రయోగింపరాదను భావమునే మనఃపూర్తిగ వదలివేసిన వీరు తమనోటికి చప్పగనున్న బార్డోలీ విధానమును కొంచెము రుచికరముగ చేసికొనుటకై వాగ్యుద్ధమను మసాలా కావలెనని కోరుచున్నారు. మనభారతీయులయొక్క జీవితవిధానమందు సంపూర్ణమగు గొప్పమార్పును చేయుటయేగాక, ఆర్థికదాస్యమునుండి మనలను తప్పించి అసంఖ్యాకములగు మేళ్లనుచేకూర్పసమర్థమైన రాటమునుయొక్క ప్రభావమును వారిలో చాలమంది పూర్తిగ గ్రహింపలేదు. గాంధిమహాత్ముడు దేశమును స్వరాజ్యద్వారమువద్దకు తీసికొనివచ్చి అకస్మికముగ నిలిపివేసిన తోడనే దేశమందు జనించిన నిరుత్సాహముయొక్క మూర్తీభావమే యీస్వరాజ్యపార్టీయై యున్నది. స్వరాజ్యద్వారముచెంతకు చేరిన తరువాత, సమష్టిశాసనోల్లంఘనముద్వారా ఆతలుపును పగులగొట్టి లోనికిపోవుట వివేకము గాదని మహాత్ముడు ప్రకటించెను. మఱియు శత్రువుమీదికి కవ్వింపను పోవుపద్ధతిని నికమానివైచి మన కాపుదల మీద మనముండవలెననియు మహాత్ముడప్పుడు ప్రకటించెను. ఇదంతయు ప్రజాసమూహముల నిజతత్త్వమెఱుంగనివారికి ఓటమిగా దోచెను. అందుచే నిరుత్సాహము గలిగెను. ఆనిరుత్సాహముయొక్క స్వరూపమే యీస్వరాజ్యపార్టీ. కరాచీజైలునుండి బీజపూరుజైలునకు పోవుచు మధ్యత్రోవలో బార్డోలీలో నేను మహాత్మునితో చెప్పినట్లు అతడొనర్చినమార్పు తనబలమునే సూచించును గాని, బలహీనతను సూచింపదు. ఆయన యింకొక కొద్దిరోజులు బయటనుండినచో, ఈ యుద్యమస్వరూపమునంతయు పూర్తిగ మార్చివేసెడివాడు. బార్డోలీయొక్క నిరుత్సాహపు దెబ్బనుండి ప్రజలు తెప్పిరిల్లక పూర్వమే జైలునకు పంపబడెను. ఆయనను ప్రేమించువారు కోట్లకొలది ప్రజన్నను ఆయనయెడబాటుచేకలిగినబాధ ప్రతివారికున్నను, బార్డోలీ కార్యక్రమమునకు ప్రాణముపోయగలవారెవరును లేకపోయిరి. మఱియు మహాత్ముని దుష్టునిగ భావించి చెఱసాలలో నుంచుటవలన ప్రభుత్వమువారు ప్రజలచేతులలో పెట్టిన ఆయుధమును పూర్తిగ వినియోగింపవారును దొరకలేదు. చౌరాచౌరీయుదంతమైనపిమ్మట దౌర్జన్యరహితమైన సమష్టిశాసనోల్లంఘనము సాధ్యము కాదని నిరుత్సాహవాక్యముల జెప్పినవారిమాటలను వినుటలో మహాత్ముడు సరియైనపనిచేసెనో లేదో నేనిప్పుడు చెప్పజాలను. కాని గాంధిమహాత్ముని చెఱసాలలో వేసినతక్షణమే దౌర్జన్యరహితమైన శాసనోల్లంఘనము సాధ్యమయ్యెడిదని నాదృఢవిశ్వాసము (నేనే యున్నట్లయిన) నేనప్పుడు నానాయకుని మాటనైన తిరస్కరించి గవర్నమెంటు నాచేతికందిచ్చినయవకాశము (ఆయుధము) నాధారము చేసికొని గవర్నమెంటుతో పోరాడియుందును. వైద్యునకు జబ్బుగనున్నప్పుడు మా అన్నగారు చెప్పినట్లు—ఆవైద్యునేమందువేసికొననియ్యరు మహాత్మాగాంధిని చెఱసాలలో ఒడవేసినప్పుడు (బొంబాయిగవర్నరు చెప్పినట్లు బ్రతికియుండగనే పూడ్చినప్పుడు)మన మాతని దౌర్జన్యరహితతత్త్వమును మన్నించిన చాలియుండెడిది. శాసనోల్లంఘనమునుకూడ నిలిపివేయవలసిన దని ఆయన చెప్పిన మాటను పాటింపనవసరముండదు. మన మిట్లు చేసియున్నచో అసలు స్వరాజ్య పార్టీ పుట్టియుండక పోయెడిదేమో!

## కాంగ్రెసునకును, స్వరాజ్యపార్టీకిని నికముం దుండఁబోవు సంబంధము

స్వరాజ్యపార్టీయొక్క యుత్పత్తినిగూర్చి మన కెట్టియభిప్రాయములున్నను అట్టిపార్టీయొకటి యున్నదనువిషయమును మఱచిపోవుటకు వీలులేదు. ప్రారంభదశలో అది కొద్దిగనే యుండెను. కాని, "శాసనోల్లంఘనకమిటీ"వారి సంచారమువల్ల ప్రజలయొక్క దృష్టినిర్మాణవిధానమునుండి మరలి, మనయువకులలో యుత్సాహవంతులగువారిని చాలమందిని శాసనసభాప్రవేశవాదులలోనికి దింపెను. ఈ కమిటీ పర్యటనమువలన మనలో అత్యుత్తములగువారియొక్క కాలమును దృష్టియు శక్తియు దానిక్రింద ఖర్చుపడెను. నిర్మాణకార్యక్రమము చక్కగ కొనసాగుచు, యువకులందఱును తమ కాలమునంతను దానికొఱకే వినియోగించి యున్నయెడల యీశాసనసభాప్రవేశవాదులస్థితి యెట్లుండెడిదో మన మిప్పు డూహించుట నిష్ప్రయోజనము; అట్లూహించుట భావికర్తవ్యనిర్ణయమున కేమైన తోడ్పడవచ్చును. అదిగాక, శాసనసభా బహిష్కార ప్రచారమును నిలిపివేయుచు ఢిల్లీలో చేసిన తీర్మానమే గయలో చేసియున్నచో, మా స్వరాజ్యపార్టీవా రింక నెంత యెక్కువగ ఎన్నికలలో జయమొందెడివారో యూహించిచూడుడని యిటు నాస్వరాజ్యపార్టీ స్నేహితులు నన్ను హెచ్చరించుచున్నారు.

నేను చెప్పుసమాధాన మొకటి యున్నది. అది నాయొక్క వనుమీాద నాధారపడియున్నది. నేనే గనుక గయలోనుండి ...వివేక మని చెప్పుటకు వీలులేని పద్ధతిని తమరు అనుసరింపవద్దని ...రిని బతిమాలుకొని యున్నచో, అసలు స్వరాజ్య పార్టీ యనునది పుట్టియుండెడిదేమో యూహింపుడని నేను వారి నడుగుచున్నాను. ...ని, ఇవన్నియు నిప్పుడు పట్టిగాలిలోని యూహాలు. స్వరాజ్య ... యనునది యీరోజున నున్నది. ఆపార్టీ యందు నానారకములగు తత్త్వములున్నను, అది యీరోజున సంఖ్యయందు బలముగనే యున్నది; అది తన నాయకాగ్రణియొక్క సుగుణసంపత్తియందుగూడ మొదటి నుండియు బలముగనే యున్నది. అదిగాక, అన్నిటికంటె నింకొక్క విశేషమేమనగ:—అది తనస్వీయమైన మతనైతిక బాధ్యతమీాద శాసన సభలకు పోవచ్చునని ఢిల్లీతీర్మానము అనుజ్ఞనిచ్చెను. అది ఎన్నికలకు వెళ్లినది. తనకు ప్రతిపక్షమందున్న యపారశక్తులనుబట్టియు, తనశక్తులను కూడదీసికొనుటకు తనకున్న బహుకొద్ది కాలమునుబట్టియు, తన పార్టీలోనున్న యత్యుత్తములగువారు ఎక్కువకాలము శిక్ష ననుభవించుటచే ఎన్నికలకు నిలుచుటకు వీలుకలుగకపోయినందున గలిగిన యిబ్బందినిబట్టియు — చూచినచో స్వరాజ్యపార్టీ యెన్నికలలో చాల జయము పొందెననియే చెప్పవచ్చును. అది గాక, వోటర్ల జాబితాలు బహులోపభూయిష్టముగ నుండెను. ఏలయనగ, మూడుసంవత్సరముల క్రింద మితవాదులుతప్ప తక్కినవారెవరును వానివైపుగమే చూడలేదు. మొన్న స్వరాజ్యపార్టీలో చేరినవారుకూడ ఆఖరువఱకు స్వరాజ్య పార్టీలో చేరుదమా వద్దా యనియు, ఎన్నికలకు నిలుతమా వద్దా యనియు డోలాయమానమానసులై యుండిరి. వోటర్లలో చాల మంది తమకు వోట్లిమ్మని యడిగిన వ్యక్తులకు వోట్లనియ్యక కాంగ్రెసునకే యిచ్చిరి. అది గాక యింకొకరహస్యము, ఎవరితోను చెప్పవద్దు సుమండీ గాంధిమహాత్మునకే వోట్లనిచ్చిరి! ఈసంగతి విన్నప్పుడు మనస్నేహితులలో చాలమందికి గాఢమైన విచారము కలుగవచ్చును. గాంధిమహాత్ముని నామము నట్లు దుర్వినియోగము చేయుట పాపమని తలంచువారును గలరు.

అట్టివారియందు నాకు చాల సానుభూతిగలదు. అట్టి రాజకీయ పద్ధతులకు నేను సమ్మతింపను. కాని ఆప్రకారముగ ప్రజలు వోట్లిచ్చి పంపిన అభ్యర్థులు తత్ప్రతికక్షులకంటె మహాత్మునకు బహువ్యగ్రులలో నున్నారను విషయముమాత్రము మనము జ్ఞాపకముంచుకొనవలెను. అది గాక యీఅభ్యర్థులలోనే మహాత్ముని వెక్కిరించువారుకూడ గలరు. నవనాగరికతాభివృద్ధి నొందుచున్న యీరోజులలో స్త్రీలుకూడ దూరముగ పాఱవేసిన పనికిమాలిన రాటమును తీసికొనివచ్చి అదే మోక్షమిచ్చునని నమ్ముకొను యీ వెఱ్ఱి యలౌకికమహాత్ముని చూచి పరిహసించువారుకూడఁ గలరు. అధికారధూర్వహులతోడను యుద్ధకాలమందు అమెరికనులంతవారికే పంగనామములు పెట్టిన రీడింగువంటి వైస్రాయితోడను వ్యవహారింపవలసియుండగ ఇట్టితప్పులను అవకతవకలను చేయు యీఛాందసుడు తమ కెక్కడ దొరకెరా యనుకొనువారుకూడ గలరు. తమ ఎన్నికలలో మహాత్మునియొక్క నామమాహాత్మ్యము వీరికి స్వానుభవగోచరమై యుండును. తమ కెంతటి తెలివితేట లున్నను మహాత్మునియనుచరులగు ప్రజాసామాన్య మిచ్చు సాహాయ్యముమీాదనే శాసనసభయందు తనయొక్క బలాబలములు నిలిచియున్నవని వారికి గోచరించియుండును. ఎన్నికలలో వీరికి గలిగిన యీస్వానుభవము చాల విలువయైనది. స్వరాజ్యపార్టీ నాయకులు తాము జయమొందిన సందర్భమందు మేమనుకొన్నరీతిగనే వారు చూపినసుహృద్భావము, నిగ్రహము, ఔదార్యము నిజముగ ప్రశంసాపాత్రములు. ఇవి కాంగ్రెసున కెంతయు నమూల్యములగు ధనములు. వారిస్వీయమునందు వారి కున్నంత నమ్మకము మనకు లేనిమాట వాస్తవమే. నిర్మాణ కార్యక్రమము గాక శాసనసభలే స్వరాజ్యమును తెచ్చిపెట్టునను భావము ప్రజలమనస్సులలో నెచ్చటనైన దాగియున్నచో నొకమూల దానిని తీసి పాఱవైచుచు ఇంకొకమూల తమయిష్టమువచ్చినట్లు చేసికొనుటకు స్వరాజ్యపార్టీవారికి సంపూర్ణస్వాతంత్ర్య మిచ్చుచు, వారికి జయమగుగాక యనికూడ మనము కోరుచుండవలెను. మనము ఢిల్లీలో శాసనసభాబహిష్కార ప్రచారపు హక్కును అమలుజరుపుకొనకుండ ఊరకుంటిమి. అంతమాత్రముచే మనతత్త్వమును వదలుకొనలేదు. ఈరోజునగూడ వదలుకొనము. స్వరాజ్యపార్టీవారు కౌన్సిలులలో చేయవలసినపనిని నడపించుబాధ్యతను మనము వహించుట కంగీకరించినచో అప్పుడు మనతత్త్వమును వదలుకొన్నట్లగును గాని అంతవఱకు కాదు. ఈబాధ్యతను మన మంగీకరింపజాలము. నిర్మాణకార్యక్రమమునకు స్వరాజ్యపార్టీవారు మనవలె తగినంత కాలమును వినియోగపరుపజాలరు.

అయినను, బాధ్యత గల స్వరాజ్య పార్టీనాయకులు తమశక్తివంచనలేక మనకు సహాయముచేయుటకు ఉద్దేశించియున్నారని నాకు పూర్తిగ నమ్మకము కలదు. యీరీతిగ వారు కౌన్సిలులలో తమయొక్క బలమునుకూడ పెంపొందించుకొన నుద్దేశించియున్నారు వారెప్పుడైన నేకముందు శాసనసభలను విడిచి రావలసివచ్చినచో మన సంయుక్త ప్రయత్నములవల్ల నాయానియోజకవర్గములలో నప్పటికి గావింపఁబడి యుండుపని యెట్లుండును? "వారు వెళ్లిపోయినప్పుడు ఒకరుకూడ మెలుగలే"దని అధికారవర్గమువా రనకుండ నుండుటకు వీలేర్పడును. వారు కౌన్సిళ్లలో పడినశ్రమవల్ల స్వరాజ్యము లభించినచో, దానిని నేనుమాత్రము వద్దనను. కాంగ్రెసుప్రతిష్ఠను నిల్పుటకై శాంతియు, సుహృద్భావమును, ఐకమత్యమును ఢిల్లీలో అవసరమైనచో, ఆప్రతిష్ఠను మఱింత హెచ్చుచేసి నిర్మాణకార్యక్రమమును కొనసాగించుటకు మన కీరోజున అవి మఱింత యెక్కువగ కావలసియున్నవి.

## నిర్మాణకార్యక్రమము

ఈకార్యక్రమమందలి యభిమానముచేతనే, నేనప్పుడు ఢిల్లీలో మన తగాదాల నేదోవిధముగ పరిష్కరించుకొని తీరవలెనని అంతపట్టు పట్టితిని. చాలరాష్ట్రములలో ఒకసంవత్సర మంతయు వృథాగా పరస్పరము నిందించుకొనుటలతో పాడయిపోయెను; మహాత్మునివిడుదల కేవలము పిటీషనులవలన గాక మనస్వకృషివలనఁ గావలసియున్నది.

నేను చెప్పుసమాధాన మొకటి యున్నది. అది నాయొక్క [..]వముమీద నాధారపడియున్నది. నేనే గనుక గయలోనుండి [అ]వివేక మని చెప్పుటకు వీలులేని పద్ధతిని తమరు అనుసరింపవద్దని [వా]రిని బతిమాలుకొని యున్నచో, అసలు స్వరాజ్య పార్టీ యనునది పుట్టియుండెడిదేమో యూహింపుడని నేను వారి నడుగుచున్నాను. [కా]ని, ఇవన్నియు నిప్పుడు వట్టిగాలిలోని యూహలు. స్వరాజ్య [పార్టీ] యనునది యీరోజున నున్నది. ఆపార్టీ యందు నానారకములగు తత్త్వములున్నను, అది యీరోజున సంఖ్యయందు బలముగనే యున్నది; అది తన నాయకాగ్రణియొక్క సుగుణసంపత్తి యందుగూడ మొదటి నుండియు బలముగనే యున్నది. అదిగాక, అన్నిటికంటె నింకొక్క విశేష మేమనగ:—అది తనస్వీయమైన మతనైతిక బాధ్యతమీద శాసన సభలకు పోవచ్చునని ఢిల్లీతీర్మానము అనుజ్ఞనిచ్చెను. అది ఎన్నికలకు వెళ్లినది. తనకు ప్రతిపక్షమందున్న యపారశక్తులనుబట్టియు, తనశక్తులను కూడదీసికొనుటకు తనకున్న బహుకొద్ది కాలమునుబట్టియు, తన పార్టీలోనున్న యత్యుత్తములగువారు ఎక్కువకాలము శిక్ష ననుభవించుటచే ఎన్నికలకు నిలుచుటకు వీలుకలుగకపోయినందున గలిగిన యిబ్బందినిబట్టియు — చూచినచో స్వరాజ్యపార్టీ యెన్నికలలో చాల జయము పొందెననియే చెప్పవచ్చును. అది గాక, వోటర్లజాబితాలు బహులోపభూయిష్టముగ నుండెను. ఏలయనగ, మూడుసంవత్సరముల క్రింద మితవాదులుతప్ప తక్కినవారెవరును వానిమొగమే చూడలేదు. మొన్న స్వరాజ్యపార్టీలో చేరినవారుకూడ ఆఖరువరకు స్వరాజ్య పార్టీలో చేరుదమా వద్దా యనియు, ఎన్నికలకు నిలుతమా వద్దా యనియు డోలాయమానమానసులైయుండిరి. వోటర్లలో చాల మంది తమకు వోట్లిమ్మని యడిగిన వ్యక్తులకు వోట్లనియ్యక కాంగ్రెసునకేయిచ్చిరి. అది గాక యింకొకరహస్యము, ఎవరితోను చెప్పవద్దు సుమండీ గాంధిమహాత్మునకే వోట్లనిచ్చిరి! ఈసంగతి విన్నప్పుడు మనస్నేహితులలో చాలమందికి గాఢమైన విచారము కలుగవచ్చును. గాంధిమహాత్ముని నామము నట్లు దుర్వినియోగము చేయుట పాపమని తలంచువారును గలరు.

అట్టివారియందు నాకు చాల సానుభూతిగలదు. అట్టి రాజకీయ పద్ధతులకు నేను సమ్మతింపను. కాని ఆప్రకారముగ ప్రజలు వోట్లిచ్చి పంపిన అభ్యర్థులు తత్ప్రతికక్షులకంటె మహాత్మునకు బహుదగ్గఱలో నున్నారను విషయముమాత్రము మనము జ్ఞాపకముంచుకొనవలెను. అది గాక యీఅభ్యర్థులలోనే మహాత్ముని వెక్కిరించువారుకూడ గలరు. నవనాగరికతాభివృద్ధి నొందుచున్న యీరోజులలో స్త్రీలుకూడ దూరముగ పాఱవేసిన పనికిమాలిన రాటమును తీసికొనివచ్చి అదే మోక్షమిచ్చునని నమ్ముకొను యీ వెఱ్ఱి యలౌకికమహాత్ముని చూచి పరిహసించువారుకూడఁ గలరు. అధికారధూర్వహులతోడను యుద్ధకాలమందు అమెరికనులంతవారికే పంగనామములు పెట్టిన రీడింగువంటి వైస్రాయితోడను వ్యవహరింపవలసియుండగ ఇట్టితప్పులను అవకతవకలను చేయు యీఛాందసుడు తమ కెక్కడ దొరకెరా యనుకొనువారుకూడ గలరు. తమ ఎన్నికలలో మహాత్మునియొక్క నామమాహాత్మ్యము వీరికి స్వానుభవగోచరమై యుండును. తమ కెంతటి తెలివితేటలున్నను మహాత్మునియనుచరులగు ప్రజాసామాన్య మిచ్చు సాహాయ్యముమీదనే శాసనసభయందు తనయొక్క బలాబలములు నిలిచియున్నవని వారికి గోచరించియుండును. ఎన్నికలలో వీరికి గలిగిన యీస్వానుభవము చాల విలువయైనది. స్వరాజ్యపార్టీనాయకులు తాము జయ మొందిన సందర్భమందు మే మనుకొన్నరీతిగనే వారు చూపిన సుహృద్భావము, నిగ్రహము, ఔదార్యము నిజముగ ప్రశంసాపాత్రములు. ఇవి కాంగ్రెసునకెంతయు నమూల్యములగు ధనములు. వారి[illegible] వారి కున్నంత నమ్మకము మనకు లేనిమాట వాస్తవమే. నిర్మాణకార్యక్రమము గాక శాసనసభలే స్వరాజ్యమును తెచ్చిపెట్టునను భావము ప్రజలమనస్సులలో నెచ్చటనైన దాగియున్నచో నొకమూల దానిని తీసి పాఱవైచుచు ఇంకొకమూల తమయిష్టమువచ్చినట్లు చేసికొనుటకు స్వరాజ్యపార్టీవారికి సంపూర్ణస్వాతంత్ర్య మిచ్చుచు, వారికి జయమగుగాక యనికూడ మనము కోరుచుండవలెను. మనము ఢిల్లీలో శాసనసభాబహిష్కార ప్రచారపు హక్కును అమలుజరుపుకొనకుండ ఊరకుంటిమి. అంతమాత్రముచే మనతత్త్వమును వదలుకొనలేదు. ఈరోజునగూడ వదలుకొనము. స్వరాజ్యపార్టీవారు కౌన్సిలులో చేయవలసినపనిని నడపించుబాధ్యతను మనము వహించుట కంగీకరించినచో అప్పుడు మనతత్త్వమును వదలుకొన్నట్లగును గాని అంతవఱకు కాదు. ఈబాధ్యతను మన మంగీకరింపజాలము. నిర్మాణకార్యక్రమమునకు స్వరాజ్యపార్టీవారు మనవలె తగినంత కాలమును వినియోగపరుపజాలరు.

అయినను, బాధ్యత గల స్వరాజ్య పార్టీనాయకులు తమశక్తి వంచనలేక మనకు సహాయముచేయుటకు ఉద్దేశించియున్నారని నాకు పూర్తిగ నమ్మకము కలదు. యీరీతిగ వారు కౌన్సిలులో తమయొక్క బలమునుకూడ పెంపొందించుకొన నుద్దేశించియున్నారు. వారెప్పుడైన నికముందు శాసనసభలను విడిచి రావలసివచ్చినచో మన సంయుక్త ప్రయత్నములవల్ల నాయానియోజకవర్గములలో నప్పటికి గావింపఁబడి యుండుపని యెట్లుండును? "వారు వెళ్లిపోయినప్పుడు ఒకకుక్క కూడ మొఱుగలే"దని అధికారవర్గమువా రనకుండ నుండుటకు వీలేర్పడును. వారు కౌన్సిళ్ళలో పడినశ్రమవల్ల స్వరాజ్యము లభించినచో, దానిని నేనుమాత్రము వద్దనను. కాంగ్రెసుప్రతిష్ఠను నిల్పుటకై శాంతియు, సుహృద్భావమును, ఐకమత్యమును ఢిల్లీలో అవసరమైనచో, ఆప్రతిష్ఠను మఱింత హెచ్చుచేసి నిర్మాణకార్యక్రమమును కొనసాగించుటకు మన కీరోజున అవి మఱింత యెక్కువగ కావలసియున్నవి.

## నిర్మాణకార్యక్రమము

ఈకార్యక్రమమందలి యభిమానముచేతనే, నేనప్పుడు ఢిల్లీలో మనతగాదాల నేదోవిధముగ పరిష్కరించుకొని తీరవలెనని అంతపట్టు పట్టితిని. చాలరాష్ట్రములలో ఒకసంవత్సరగ మంతయు వృథాగా పరస్పరము నిందించుకొనుటలతో పాడయిపోయెను; మహాత్ముని విడుదల కేవలము పిటీషనులవలన గాక మనస్వకృషివలనఁ గావలసియున్నది.

అట్లయినచో, ఆయన హృదయపూర్వకముగ నమ్మిన నిర్మాణవిధాన మును మరల కొనసాగించుట అత్యవసరము. మహాత్ముడు చెఱసాలకు వెళ్లిన తరువాత దేశ మెంత భ్రష్టమయ్యెనో నే నప్పుడు పూర్తిగ తెలిసి కొనలేదు. "మీ రేమిపనులు చేసినా"రని నే నడిగిన ప్రశ్నలకు నాకు వచ్చిన కొన్ని జవాబులవలన నే యేకారణముచే నైన నేమి దేశములో నెంత మాత్రమును పని జరుగలేదని నాకు తెలిసెను. పనిచేసిన గుజరాతువంటి రాష్ట్రములు లేకపోలేదు. ఈపనియొక్క గౌరవము నామిత్రులు శ్రీయుత వల్లభాయి పటేలుగారికిని మహాత్ముడు వెనుక నుంచి పోయిన యనుచరులకును చెందుచున్నది. విద్యావిషయమై వారు చేసినంత పనిని ఏయితరరాష్ట్రములు చూపజాలవు. గుజరాతురాష్ట్రమే లేకపోయి నచో, తక్కినరాష్ట్రములలో తయారైన ఖద్దరు అమ్మకము గాక చాల కాలము నిలిచిపోయెడిదే. మహాత్మునిగొప్పతన మేమనగ, ఆయన గుజ రాతుదేశముయొక్క స్వరూపమునంతయు మార్చివేసెను; అంతియే గాక, భారతదేశముయొక్క స్వరూపమునుకూడ ఆయన మార్చివేసెను. ఆయన యేరాష్ట్రమునుకూడ అదివఱకున్నట్లుగ ఉంచకుండ మార్చివేసెను. గుజ రాతులో నింకొక విచిత్రమైనసంగతి జరుగఁబోవుచున్నది.

మహాత్ముడు చెప్పిన అత్యున్నతపదవినియే కావలె నన్నచో ఏ ప్రాంతమును శాసనోల్లంఘనమునకు సిద్ధముకానే కాదనుకొనువారికి ఆశ్చ ర్యము గలిగించుపనిని గుజరాతుదేశ మిప్పుడు చేయఁబోవుచున్నది కాని గుజరాతు చూపిన నిదర్శనము ప్రజలనంతగ నాకర్షింపలేదు. కాని, మనము స్వాతిశయముతో కన్నులు మూసికొని యుండఁజాలము.

ఒక నౌకాదళములో ఆఖరుపడవ యెంత నెమ్మదిగా నడచునో నౌకాదళమున కంతటికిని అంతవడియే యుండును. మననౌకాదళములో నెమ్మదిగ నడచుపడవలు అయ్యో!—చాల ఉన్నవి. కాని, భగవదను గ్రహమువలన అవియన్నియు సముద్రయానమునకు పనికివచ్చునవిగ నే యున్నవి. డిల్లీకాంగ్రెసు అయినతరువాత "మార్పు వద్ద"ని చెప్పుపార్టీ లో వారొకరు "యంగు యిండియా" పత్రికలో వ్రాసినవానికంటె నేనిప్పుడు "మార్పునల"దను నాస్నేహితులయెదుట ఎక్కువ గట్టి విమర్శనాసిద్ధాంతములను ప్రసాదింపఁజాలను.

"కేవలతర్క హేతువాదములకు పరిమితిగలదు. అవి దాటజాలని మెట్టు ఎచ్చటనో యొకచోట తాఁకుచున్నది. కొన్నితీర్మానములు కా ర్యాచరణవంటివి. అవి హేతువాదమున కతీతములైనవి. హేతువాదము వలన నమ్మకము పుట్టింపఁజాలఁ ప్రత్యక్షానుభవమే మనకు గుణ పాఠముల నేర్పగలదు. మన మట్టిసందిగ్ధావస్థలో పడితి మని గుర్తింప గలిగితిమి. ఒకసంవత్సరపర్యంతమును వాదనల గావించి గావించి తక్కిన పనులన్నియు కట్టిపెట్టుటచే మనకు స్వోత్కర్షయు ఎందుకును పనికిమా లిన సంతృప్తియు నధికమయ్యెను. స్వరాజ్యపక్షమువారికి మాధ్యస్థులకు మహమ్మదాలీ గారికి మాత్రమె గాక మనవంటి మార్పునొల్లని శుద్ధఅస హాయవాదులకు సయితము పరీక్షాసమయ మేతెంచెను. నిజపరిస్థితు లెంత విషమించినను వానిని గమనించుట మనవిధి. కలకత్తా ప్రత్యేక కాంగ్రెసు నాఁటినుండియు గాంధిసిద్ధాంతము సర్వత్ర అజేయమై యుండెను. అందువలన గాంధిశిష్యులకు మనము ఎప్పటి కప్పుడు యోచనాశూన్యత కార్యదీక్షారాహిత్యమునను లో... మను భీతియే కలుగుచుండెను. అపజయ మంద్ధయిను నొ... శుభావహము. మనలో సత్యమే యున్నయెడల అపజయఫలిత నాత్మపరీక్ష కావించుకొని మరల ధైర్య మవలంబింపగలుగుదుము. అట్లు గాక కేవలము స్థబ్దులుగ నుండుటకును ప్రత్యక్షనిదర్శనముల జూచిన పిమ్మట నైనను మనయభిప్రాయముల మార్పు నిచ్ఛగింపకుండుటకు మాత్రమే గాంధిసిద్ధాంతముల నుపయోగింపదలచితిమేని మనగురు మూని నిజశిష్యులముకానేరము. ఆయన ప్రపంచమునకు చాటినదివ్య...దే శమును కాపాడ సమర్థులము. ప్రత్యక్షనిదర్శనమే పరమప్రమాణము."

నిజమే, ప్రత్యక్షానుభవమే తప్పక పరమప్రమాణము; సత్యమై నట్టియు నిశ్చితమైనట్టియు ప్రమాణము. మిత్రులారా! మీరును నేనును స్వరాజ్యవాదులును మార్పునంగీకరింపజాలనివారును ఎల్లరును ప్రత్యక్ష నిదర్శనములచే పరీక్షింపబడుదుము. మనయోగ్యత లందువలన తేలగలవు. కావున నే కార్యాచరణకు గడంగు డని సందేశము నొసంగుచున్నాను. ఇది చెప్పుట సులభమే గాని చేయుటమాత్రము కష్టమైన సందేశము. అందువలన పనిచేయువారికన్న వంకలపెట్టు వారధికముగనున్నారు. సక్రమముగ కార్యనిర్వహణ మొనర్చుటచే గలిగిన మహదానందము పనిలేని విమర్శనములవలన సిద్ధింపజాలదు. కవిత్వమునందలి సృజనశక్తిని గూర్చి యొక సంస్కృతకవీశ్వరుడు చెప్పినట్లు "గొడ్డురాలికి ప్రసవ వేదనానుభవ మెట్లు లేదో అట్లే నూతన శిశుసందర్శనానందమును స్పర్శసౌఖ్యమును గూడ అనుభవైకవేద్యములు కావు." వేదనాఫలితము గనే భారతవర్షము స్వాతంత్ర్యపునర్జీవితము నొందఁగలదు.

## బర్డోలీకార్యవిధానము నెఱవేర్చితీరవలెను

మనమిప్పు డేమిచేయవలెనని మీరు నన్నడుగవచ్చును. పలువురచే నపహసింపఁబడిన బర్డోలీకార్యవిధానముకన్న నుత్తమమైనది వేఱొకటి లేదని నేను దీర్ఘాలోచనాఫలితముగ ప్రత్యుత్తర మిచ్చుచున్నాను. మన కార్యవిధానమందు కష్టపరంపరలు వచ్చుటచే నొకదానివెనుక నొకటిని విడనాడినచో మనమెప్పటికిని నేపనియు చేయజాలము. అసహాయోద్య మము విఫలమైన దని పలువురు చెప్పుదురు. దీనిభావ మేమి? వారో మనమో లేక ఉభయులమో మనలక్ష్యమునకు తగిన త్యాగమును జేయ జాలకపోతిమి.

మహాత్మునికార్యవిధానము సులభసాధ్య మని ఇదివఱకే చెప్పి యుంటిని. తమప్రవృత్తిలో మరల ప్రవేశింపవలసి వచ్చినదని న్యాయ వాదులును వ్యాజ్యము వేయకతప్పినది కాదని కక్షివాదులును, పిల్ల వానిని మంచిపాఠశాలకు పంపకుండు టెట్లని తలిదండ్రులును అను చున్నారుగదా. సర్వసామాన్యుఁడైన యొక యుద్ధభటుఁడు ఎట్టి త్యాగమును గావింప సంసిద్ధుఁడై యున్నాఁడో మీరు జ్ఞప్తియం దుంచుకొనరాదా!

## ఖద్దరుపని: స్త్రీలు

కద్దరుగుడ్డనైనను కట్టజాలనివారినిగూర్చి మన మేమనుకొనుటవల నను ప్రయోజనములేదు. అట్టివారైనను, దేశభక్తిశూన్యులనిగాని,

...ప్పవలనుపడదు. మాంద్యమువలనను అలసత్వమువలనను ...ు. వారిమాంద్యమును పోగొట్టవలసియున్నది. అట్లు చేయగల ...లు భారతనారీమణులకన్న నెవ్వరు గలరు ? ఎవ్వ రెట్లు మార్చు ...దినను, మన స్త్రీలుమాత్రము గాంధిమహాత్మునియున్న తాదర్శములను ...డనాడలేదు. మహాత్మునకును, భారతజాతికిని, తమకును, శ్రేయో ...యకమగుమార్గము నే ద్వారనుసరించుచున్నారు. జమ్నాలాలు బజాజ్, ...లాలు గాంధి, ఛగనలాలు గాంధీ గార్లవంటి అనుభవశాలుర సహాయ ...గోడను, గుమాస్తాలు, లెక్కదారులు మొదలగువారి తోడ్పా ...తోడను, ప్రతి రాష్ట్రమునందును, మండలమునందును స్త్రీలే కద్దరు ...ర్మాణకార్యమును సంపూర్ణముగ తమస్వాధీనము చేసికొని నిర్వహింప ...లరు. పురుషులు కారాగృహముల కేగుచుందురు. కాని, స్త్రీలు మాత్రము సర్వదా తమ కద్దరుపనిని జయప్రదముగ కొనసాగించు చుండవలెను.

తక్కిన శాఖలనుగూడ చక్కనిస్థితియందుంచవలెను. కద్దరు ...రువాత జాతీయవిద్యాశాఖ ప్రాముఖ్యమైనది. యావద్భారతజాతీయ ...ద్యాసంఘమును నిర్మింపుమని నేను బెజవాడలో తగినంతపట్టు పట్టక ...తినని చింతించుచున్నాను. ఇప్పుడైనను యావద్భారతదేశమునకును, ప్రతి రాష్ట్రమునకును, విద్యాసంఘము నేర్పఱచి మనబాలబాలికల ...ద్యావిధానమును మనము నిర్వహింపవలయును. అన్ని శాఖలను ...గూర్చియు ప్రత్యేక ప్రత్యేకముగ చెప్పనవసరములేదు. బార్డోలీవిధానము ...ందలి ప్రతియంశమును అవశ్యాచరణీయమే. కాని మనము 1921 సం ...వత్సరములో నవలంబించినపద్ధతినే తిరిగి యవలంబింపవలయును. అనగా సంవత్సరమునందలి వేర్వేఱు సమయములలో, వేర్వేఱు శాఖల యభి వృద్ధికై ప్రత్యేకకృషి సలుపవలెను.

## ధనము

ధనములేనిది వృథావాగ్వాదమంతయు వ్యర్థమగును గాన, సంవ త్సరమంతయు మనము శ్రద్ధవహించి ప్రయత్నములన్నియు కేంద్రీకరించి పనిచేయవలసినది ధనసంచయము. మహాత్ముని కార్యక్రమమువలననే మనము యరవాడచెఱసాలయొక్క తాళపుజెవిని తయారుచేయగలమని యు, నేపనియు ధనములేనిదే చేయజాలమనియు, దేశము విశ్వసించినయె డల వలయుధనము నీయకమానదు. ఎప్పుడో నిర్ణీతకాలమున మనము ...ోరు చందాలు పెద్దవి గాక, అల్పమైనను బీదలకుకూడ తమశక్తికొలదిని సహాయము చేయుట కనువగుధనసేకరణోపాయములచే జాతీయకోశమును ...ంపవలయు. అప్పుడప్పుడు బీదవాడు దానముచేయుటకువీలగునట్లు తత్కా ...ము వసూలుచేయబడు చందారూపము మొదలగు ననేకవిధముల ధన మును సంపాదింపవలయును. ఇంతియగాక వోటర్లసంఖ్యకు సరిపోవు కాంగ్రెసు సభ్యుల నొక్కవిసరున చేర్చుటకు తగినయేర్పాట్లు చేయవల యును. మనము పట్టుదలతో పనిచేసినయెడల నొకకోటిరూప్యంబులు సేకరించుట యొకకష్టము కాదు.

## కార్యదర్శులు, శాశ్వతోద్యోగులు

ధన మెంతయవసరమో మహాత్ముని కార్యక్రమమును సాధించుటకు వీర్యవంతమైనయొకసంస్థ యంతయవసరము. సంపూర్ణముగ వేతనములులేని జనసమూహము చేయబడిన ఫలపూర్తియగుట దుర్లభము. ఒక జిల్లాలోని యొకిక భాగమ్మునకు చాలని సంఖ్యగల యుద్యోగియులతో నింతవిశాలదేశ మున నింత కాల మింతపనియెట్లుజరిగెను. మిక్కిలియాశ్చర్యకరము. ఇప్పు డు విషమమైన పరిస్థితులు తటస్థించినవి. అర్హతగలిగి నమ్మకముగల ప్రచారకులు జాతీయసేవకు కావలసియున్నారు. అట్టివారెక్కువమంది మనకు లేరు. సంపూర్ణముగ దీనియందు ప్రవేశించినట్టియు, అసహాయోద్య మముచే కొన్ని విధముల నష్టమునొందినట్టియు వకీళ్ళగుంపొకవైపు కలరు. వారుకూడ మన ముపయోగించుకొన నిశ్చయించినయెడల వద్దనువారు కారు. ఈ రెండువిధముల పరిస్థితుల నాలోచించి విషయములను బాగుగా పరిశీలించి విధినిర్ణయముచేయవలసియున్నది. మన ప్రచారకు లను ప్రస్తుతపద్ధతుల ననుసరించి యత్యంతావసరము లగు వేతనముల నొసంగి పనిచేయబడియున్నది. కాని యీ ప్రచారకులు మన కివియిలో సంపూర్ణత్యాగముచేసి జాతికొఱ కన్నివిధముల పాటుపడినవారుగా నుండవలయును. ఒకతరమున సంపూర్ణత్యాగశీలురచే నిర్వహింపబడి న కార్యము మరియొకతరమున దొంగలచే పనిచేయబడవచ్చును. కాని యెంతత్యాగశీలురైనను జీవించియున్నంతకాలము అన్నవస్త్రములు కోరుదురుగదా!

తిండిపోతులు గోరుదానికంటె అత్యధికమగుధనమును దీసికొను చున్నను నవలలోవర్ణించిన ఆలివరుట్విస్టులవలె విజాతీయ సేవకులుచాలదు చాలదని వాపోవుచుండుటజూచుచుంటిమి, "హైందవ సివిలు సేవకులు", హైందవులును గారు సివిలియనులును గారు; సేవకులును గారు; కాకపోయి నను ప్రపంచములో నేప్రాంతముననను నింత గొప్పజీతములుగొను ఉద్యోగి యులు లేరు. ఈయుద్యోగులు ప్రపంచములోని దేశములలో కెల్ల బీదదగు నీదేశమునుండి ధనములాగి పీల్చిపిప్పిచేయుచున్నారు. తక్కటియుద్యో గస్థులకు ధనగ్రహణాదికార్యముల మార్గదర్శకు లగుచున్నారు. ఎన్ని మాఱులు జీతములు హెచ్చించినను వెంటవెంటనే అయ్యో జీతములు చాల వని ముఱ్ఱులిడుచునేయుందురు. అయినను వీరలే జాతీయసేవకుల కళంక మూర్తను లని నిందింతురు. దేశారాధకులకు అల్పవేతనముల నొసంగ కాంగ్రె సుసభకు సిఫారసుచేయు నెడల నీయుద్యోగులును వారల వెనుక తాళ ము వేయు పత్రికా నిర్వాహకులును ఈ నిష్కళంక సేవకులను తూలనా డెదరు. వేలకొలది జీతముల గొనువారలు నూర్లకొలది జీతములగొనువార లపై నధికారముజేతురు. ఇయ్యది నిత్యమును జరుగుచున్నపనియే దానిని గూర్చి మనముచింతింప నవసరములేదు.

ఇయ్యదియే కాంగ్రెసు గావింపవలసిన ముఖ్యవిషయము. కాం గ్రెసుకార్యముల సంవత్సరము పొడుగవను నిర్వర్తించుటకు ఉత్తమ సంస్థల నిర్మాణమొనర్చుటకై ప్రయత్నముల సల్పవలయును. సాధ్య మగునెడల డిల్లీవంటి మధ్యప్రదేశమున జాతీయకార్యదర్శి నొక్కని నెలకొల్పవలయును. అట్లే రాష్ట్రములందును జిల్లాలందును కార్యదర్శి

కార్యాలయములు స్థాపింపవలయును. ఇచ్చట జేయవలసినకార్యముల వివిధ శాఖలగా విభజింపవలయును. కార్యనిర్వాహకవర్గములోని సభ్యులు మధ్యప్రదేశమునైనను అవసరమగునెడల ఎచ్చటగావింపబడినను సభకు హాజరగువారలుగా నుండవలయును. ఈసంస్థలలో జరుగుచున్న పనిని తనిఖీచేయుచుండవలయును. మొదటినెల గడచినపిదప ఆదాయమునకంటె వ్యయము ఎక్కువకాగూడదు. ఇంగ్లాండుదేశమున రక్షణసైన్యము క్రొత్తప్రదేశములకు ప్రచారకుల పంపునప్పుడు వారల కొక వారమునకు భోజనవసతులకు పరిపోవుధనమునిచ్చి పంపెదరు. ఆవారమురోజులలో వారలు రాబోవువారమున భోజనవసతులకు గావలయుధనము నార్జింపవలయు. పిమ్మట వారలు కేంద్రసంస్థకు ధనము సముపార్జించి పంపవలయును. కాంగ్రెసు సభ్యుల జేర్చుటకుబోవు మనప్రచారకులయెడ నిట్టిమార్గము నొక్కదాని నవలంబింప వలయును. ఇట్టిసంస్థల నొక్కసారి నిర్మించునెడల దేశమున మరల సంచలనముగలుగునని నాకు విశ్వాసము గలదు.

అప్పుడు 1921 సంవత్సరములో జరిగినపనికంటె 1924 సంవత్సరములో నెక్కువపని చేయగలుగుదుము. ఇప్పటికిని, 1924 సంవత్సరమునకును ఒక్క గొప్పభేదము గలదు. అప్పుడు కాంగ్రెసు కార్యముల నడిపించుటకు మహాత్ముడు బయట నుండెను. ఆయన నేడు మనకు గానరాకుడినను ఆయన లేనిలోపమే ద్విగుణీకృతశక్తితో మనల కార్యాచరణకు గడంగునట్లు చేయవలయును. సిలువ లేక పోయిన క్రైస్తవమతమును, కర్బాలా విషాదము లేని యెడల మహమ్మదీయమతము ఎట్లు పెంపొందగల్గును? మన సిలువవలన మనము సంపూర్ణమగులాభమును బడయలేదు. కారాగృహమున బంధింపబడియున్న యామహానాయకునియందు వాత్సల్యమేమైన మీకు గలదేని, మిత్రులారా! యిప్పుడైనను కార్యాచరణకు గడంగుడు. ప్రజాసంతతుల మనకు తోడ్పాటొసంగుటకు హెచ్చరించి మహాత్ముని సహస్రసంఖ్యాకులగు నాతని యనుచరులను బంధించియుంచిన బాస్టేలు కారాగృహమును విధ్వంసమొనర్చి భారతవర్షమునకు దాస్యవిముక్తి గల్గింతము.

## సిక్కులును, నభారాజ్యాధీశ్వరుడును

సిక్కుసోదరుల దృష్టాంతము మనకు గలదు. వారలధైర్యము మనస్థయిర్యము అన్నిటికంటెను వారలదౌర్జన్యరాహిత్యము, నాకనూయపుట్టించుచున్నవి. నభాసంస్థానాధీశ్వరుడు, పదభ్రష్టుడయ్యెను. నభామహారాజును రాజ్యములోనికి రానీయకుండ జూచుటకు దానుదృఢసంకల్పము చేసికొంటినని విదేశీయప్రభుత్వాధికారి చేసినప్రకటనయందలిమాటలు దైవదూషణగ నున్నవి. మహారజుగారితరఫున నేను వాదించుటలేదు. కాని యిదిమాత్రము నిశ్చయము. వారిని నిందించువారందఱు చెప్పుమాట నిజమయినను ఆయనయొక్క లోపములను గుఱించి ఆయన పదభ్రష్టుడు కాలేదు. ఆయనయొక్క సుగుణములకు ఆయన పదభ్రష్టుడాయెను. నేనుగూడ ఒక హిందూదేశపు రాజుయొక్క పాలనలోని వాడను. ఇంకను అనేకమయిన హిందూదేశపు సంస్థానములయొక్క యనుభవము నాకు గలదు. హిందూదేశపు సంస్థానములలో రాజకీయసంస్కరణములు జరుగ కోరునట్టి అనేకమంది స్నేహితులు నన్ను సమీపించుచుండె కాని, హిందూదేశపు రాజ్యములు ఇండియాయొక్క తక్కినభాగ కంటె దేశక్షేమాభిలాషులకు అది ప్రస్తుతము ప్రమాదభూయిష్ఠముగా గన్పట్టుచున్నను, అవి మనవి యని వారితో చెప్పి అప్పటికప్పుడు వారిని ఆపుచుండెడివాడను.

ఒకసారి హిందూదేశమునకు స్వరాజ్యము వచ్చినయెడల న్యాయయుక్తమగు శీఘ్రకాలములో స్వదేశరాజ్యములన్నియు మాఱునని నేను చెప్పితిని. ఈ రాజ్యమువచ్చులోగా స్వదేశసంస్థానాధీశుల యొక్క అనుమానములను రెచ్చగొట్టకలదు. వారియొక్క కష్టములను గ్రహించినట్టుగా తెలియజేయు ప్రతిఅవకాశమును మనము ఉపయోగింపవలయును. ఈ అన్యదేశనిరంకుశత్వమునుండి వారుగూడ బాధపడవలయునని మనము గ్రహించినారము. అని వారికి మనము తెలియజేయకలయును. ఇదియంతయు మనపద్ధతిగా ఉండవలయునని చెప్పుచుండెడివాడను. కాని ఆచెప్పుకాలమందు సర్కారువారు మన కింత త్వరగా అవకాశమును కలుగజేసెదరని నేనెఱుంగను. కాబట్టి యిప్పుడు మనకట్టి అవకాశము వచ్చినది. కాని మనము దానిని ఉపయోగించుకోవ వలయును. దానిని ఉపయోగించుకొనుటలో మనమతముయొక్క క్షేమమును మనము ఉపయోగించుకొనినవార మగుదుము. విదేశనిరంకుశత్వపు బరువునుండి స్వేచ్ఛను పొందుటకు స్వమతస్థులయెడ ఆయన సానుభూతిని ధైర్యముతో చూపి వారిపవిత్రమయినగురుద్వారములను సంస్కరించుటకు చేసినప్రయత్నమునకై యీ నాభారాజుగారు కొంతవఱకయినను బాధపడెను. సర్వకాలమును ఇండియాస్వదేశరాజు లందరు తమకు లోబడియుండవలయునని కోరు నిరంకుశ ప్రభుత్వమునకు వ్యతిరేకముగా నిలువబడిన యొక స్వదేశసంస్థానాధీశునికి సహాయము చేయుటకు ధైర్యమును కలిగినటువంటి సిక్కులు వారెంతయో బాధపడుచున్నారు. నేనిదివఱకు చెప్పినట్టుగా గురుద్వార ప్రబంధక కమిటీవారిని, అకాలీదళమును న్యాయవిరుద్ధములగు సభలుగా గవర్నమెంటువారు చెప్పుట అది ఆసంస్థలకు గాని సిక్కుసంఘమునకు గాని ప్రత్యేకముగా కలిగిన అపాయకరమగుదెబ్బకాదు. యావత్తుదేశమునకు వేసిన సవాలు. ఈసవాలు మనము ఒప్పుకొనక పోయినచో జీవింప దలచిన ప్రతిసంఘమును యీప్రకారముగానే చూడబడును. అప్పుడు మనము ఆలోచింపవలసినది యీదఫా యెవరికి కష్టములు వచ్చునాయనియే.

## శాసనోల్లంఘనము

పొల్లుమాటల సానుభూతియే కాకుండ మన సిక్కుసోదరులకు సహాయము చేయుటకు మన మిదివఱకే నిశ్చయించుకొంటిమి. కాని దానికంటె కొంచెమెక్కువగ కావలయును. మహాత్మగాంధిగారి అరస్టుదగ్గఱనుండి రాష్ట్రపు మొత్తముమీద శాసనోల్లంఘనము చేయుటకు మనకు అవకాశము కలిగియుండలేదు. కాని శాసనోల్లంఘనము సులభమైనవిషయము కాదను విషయము మనము మఱపగూడదు. అంతు

... పొందుటకు మనము సిద్ధముగానుండవలెను. ౧౯౨౧ జరిగినంతమాత్రమయినను నిర్మాణ కార్యక్రమము ఈ సంవత్సర న జరుగలేదు. కాబట్టి దేశ మెంతబాధను పొందుటకు సిద్ధముగా నున్నదో తెలిసికొనుటకు కష్టముగా నున్నది. మనము తిరిగి నిర్మాణ కార్యక్రమము ద్విగుణీకృతశక్తితో మొదలుపెట్టినయెడల శాసనోల్లంఘనము సాధ్యముమాత్రమేకాదు ఢిల్లీలో ఏర్పాటుచేయఁబడిన శాసనోల్లంఘనకమిటీవారు విశేషఫలచరితమగుపని చేయుటకుశక్తిగలిగియుందురు. ఏలయెందుకనగా స్వరాజ్యము మనము సంపాదించుటకు పూర్వము శాసనోల్లంఘనము చేయవలయుననిమాత్రము మనము అంగీకరింపవలెను. దీనివిషయమై యేమియును పొరపడవలదు. త్యాగమున కేమాత్రమును వెనుదీయఁగూడదు. స్వాతంత్ర్యసంపాదనకై ధైర్యముగా నిలిచి జయిలునకు పోయివచ్చిన నాస్నేహితులకు ముఖ్యముగా ఈ విషయమును చెప్పుచున్నాను.

ఆపని నే మరలఁ జేసినయెడల మరల కారాగృహవాసమునకుఁ బాల్పడెదమనుభీతిచే అట్టిపనిని మరల జేయుటకు వెనుదీయుదు రేని అట్టివారు మనకు పనికిరారని ఘంటాపథముగాఁ జెప్పుచున్నాను. తొలిసారి కారాగృహవాసము వారలయెడ నిరర్థకమయ్యెను అట్టివారలీ యుద్యమమున బ్రవేశింపకయుండవలసినది. ప్రవేశించి తిరిగి శిక్షింపబడినంత నే విదేశప్రభువుల క్షమాపణ వేడుకొనియుండవలసినది. ఈబాధలన్నిటికిని లోనయి పిమ్మట పశ్చాత్తాపబడుటకంటె తెలివితక్కువ వేఱొకటి యుండఁబోదు. నేను బీజపూరుజయిలులో నుండినప్పుడు ఇట్లు వ్రాసియుంటిని. "పాపము చేయకుండుటకంటె పాప మెద్దియైనకలదేని, అయ్యది శిక్షింపఁబడినపిమ్మట చేసినదానికై వగపు చెందుటయే."

## స్వాతంత్ర్యమునకు దగ్గఱిమార్గము

నెచ్చెలులారా! కడుదీర్ఘమగు కార్యక్రమమును మీయెదుటఁ బెట్టితిని. మీ కియ్యది చప్పచప్పగా నున్నయెడల నేనేమియును చేయజాలను. స్వాతంత్ర్యమునకు రాజమార్గములేదు. దగ్గఱిత్రోవయొక్కటియే గలదు. అది యెద్దియన మృత్యుసదనమునకు బోవుటయే. అరుచియైన పదార్థమునకు రుచి కల్పించునది యేదియన మహాకార్యముల సాధించుటకయి ప్రాణముల నర్పించుటయే. మనకార్యనిర్వాహకవర్గములోని సభ్యులందఱును ఒక్కనాఁడు ప్రాణము లర్పించుటకు సంసిద్ధులగుదురేని స్వరాజ్య మొక్కసంవత్సరములో తప్పక సమకూర్చెదనని చెప్పసాహసించుచున్నాను. వారితీర్మానము కేవలముమామూలువ్యర్థపదసంకలితము కాక సభ్యులదృఢసంకల్పమును సువ్యక్తము చేయవలయును.

అట్టి సంకల్పమును, అఖిలభారతసంఘ సభ్యులే పూనునెడల స్వరాజ్య మొక్కమాసములో బడయగలము. కాన నెచ్చెలులారా! స్వరాజ్యము మనచేతులలో నున్నది. మీరందఱును దేశమాత కేకఁబెట్టినప్పుడు మీప్రాణము బలిదాన మొసఁగుటకు సంసిద్ధు లగునెడల ఈరోజుననే స్వరాజ్యము స్థాపింపఁగలము. మన మిందులకు సంసిద్ధులము గాకుంటిమేని ఉత్సాహశూన్యమై చప్పచప్పగానున్నదని బార్డోలికార్యక్రమమును త్రోసిపుచ్చితిమేని కాంగ్రెసు సభాలక్ష్యమును మార్చుటకై చర్చించుట నిరర్థకము. కార్యాచరణకై నడుములబిగింతము. అవసరమయ్యెనేని, మాతృదేశ స్వాతంత్ర్యసిద్ధికై ప్రాణముల నర్పింప గంకణము గట్టుకొనెదము. ఒక్కవత్సరమట్లు నిష్కళంకమగు కార్యాచరణకు గడంగిచూచెదము. సంవత్సరాంతమున ఈప్రభుత్వము మన నాయకశ్రేష్ఠుని బిలువనంపి పశ్చాత్తాప మొందకపోవునెడల స్వరాజ్యమును ప్రసాదింపకపోవునెడల ఈశ్వరసాక్షిగా నొక్కక్షణకాలమైనను ఆలసింపక స్వాతంత్ర్య ధ్వజము నెత్తెదము. ప్రజాస్వామ్యమును వివిధమతసమ్మేళనము బ్రకటించెదముగాక. మిత్రులారా, మీయొద్ద సెలవుగైకొనుచున్న సభాధ్యక్షుఁడప్పుడు అచ్చటచ్చట సాతడనుమానింపఁబడినట్లు బ్రిటిషు సామ్రాజ్యమున కాతని బంధించు బంధనముల ద్రెంచివేయుట కిచ్ఛగింపకపోఁడు. ౧౯౨౧ సంవత్సరమున మన మొక్క సంవత్సరకాలము నిర్ణయ మొనర్చితిమి. ప్రభుత్వమునకుగూడ నొక్కవత్సరమే గడు వొసంగితిమి. కాని యీయొడంబడికలో మనము నెఱవేర్పవలసిన షరతును నెఱవేర్పలేదు. మనము గాంచిన అసంపూర్ణ కార్యములకు ప్రతిఫలముగ స్వరాజ్యము గోరజాలము. నాగపురకార్యక్రమమునకు మరలుదము లెండు. ఈశ్వరునిపై భారమువైచి మనకు ధైర్యస్థైర్యములను పట్టుదలయు వివేకము నొసంగుగాక, యని యీశ్వరుని ప్రార్థించుచు నాయకశ్రేష్ఠుఁడు నిరూపించిన కార్యక్రమమును నిర్వర్తింప మరల మొదలు పెట్టెదము. మన మాయనకు దగిన యనుచరులమే యగుదుమేని పోయినస్వాతంత్ర్యమును మరల నెలకొల్పెదము. విజయసిద్ధికై యొనర్చుప్రార్థనగాగాక, విజయమును బడసినపిదప గావించు జయధ్వానముగా 'మహాత్మాగాంధికి జై' యనుశబ్దముల గావింతము.

మహాత్మ గాంధికి జై.

# తీర్మానములు

## నాయకులమరణము

(1) దేశమునకు అమూల్యమగు సేవచేసిన శ్రీయుత యస్, కస్తూరిరంగఅయ్యంగారు, బాబు అశ్వినీకుమారదత్తుగార్ల మరణములకు కాంగ్రెసుమహాసభవారు చింతిల్లుచున్నారు.

రోగపీడితులై యున్నను అవమానకరమగు షరతులతో కూడిన స్వాతంత్ర్యమును అంగీకరింపక, కారాగృహమునందు రోగముతో పలుబాధల ననుభవించుచు హరదేవు నారాయణసింగుగారు, పండిత ప్రతాప నారాయణవాజపేయి గార్లు మరణించిరి. వీరిమరణమునకు కాంగ్రెసుమహాసభవారు చింతిల్లుచున్నారు.

## జాతీయబడంబడిక

(2) ఢిల్లీ కాంగ్రెసు సమావేశమున నియమింపబడిన ఉపసంఘమువారిచే తయారుచేయబడిన జాతీయబడంబడికపై ఆ ఉపసంఘమువారు ప్రజాభిప్రాయములను గైకొని తమ సంపూర్ణనివేదికమును యావద్భారత కాంగ్రెసుసంఘమువారికి 1924 మార్చి 31 వ తేదిలోగ పంపవలెను. ఉపసంఘసభ్యులలో నొకరగు సర్దారు మెహతబుసింగుగారు ప్రస్తుతము కారాగృహమునం దుండుటచే వారిస్థానమున సర్దారు అమరసింగుగారు ఉపసంఘసభ్యులుగ నియమింపబడిరి.

## త్రివిధబహిష్కరణము

(3) కలకత్తా, నాగపూరు, అహమదాబాదు, గయ, ఢిల్లీ కాంగ్రెసుమహాసభలయందు ఆమోదింపబడిన అసహాయోద్యమతీర్మానములను ఈసభవారు ఆమోదించుచున్నారు.

ఢిల్లీమహాసభయందు శాసనసభాప్రవేశ విషయమై ఒక తీర్మానము ఆమోదింపబడుటచే, కాంగ్రెసువారి త్రివిధబహిష్కరణవిధానమునందు మార్పు కలిగినదేమోయని కొందరు సందేహించుచుండుటచే ఈ కాంగ్రెసుమహాసభవారు త్రివిధబహిష్కరణమును ఆమోదించుచు బహిష్కరణవిధానము మారకూడదని తీర్మానించుచున్నారు.

ఈ త్రివిధబహిష్కరణ విధానమే కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమమునకు ఆధారముగ నుండవలెను. బార్డోలి కార్యక్రమమును సంపూర్ణముగ కొనసాగించి, శాసనోల్లంఘన ప్రయత్నములకు సంసిద్ధులై యుండవలయునని కాంగ్రెసుమహాసభవారు దేశీయులను ప్రోత్సహించుచున్నారు. త్వరలో ఈ ఉద్దేశములు సఫలమగు విధమున రాష్ట్రీయ కాంగ్రెసుసంఘములు పనిచేయవలెను.

## స్వచ్ఛందసేవకులు

(4) కాంగ్రెసువారిచే నిర్ణయింపబడిన జాతీయ కార్యక్రమము కొనసాగుటకు ప్రజలు క్రమశిక్షపొందుట అవసరము.

యావద్భారత కాంగ్రెసుసంఘమువారి ఉత్తరువులకు లోబడి పనిచేయుటకు సంసిద్ధులైయుండు క్రమశిక్షపొందిన దేశసేవకు లుండుట అవసరము. కావున యావద్భారతస్వచ్ఛందసేవకుల... బడినందులకు కాంగ్రెసుమహాసభవారు సంతోషించుచున్నారు.

## కాంగ్రెసు డిపార్టుమెంటులు

(5) నిర్మాణకార్యక్రమము సంపూర్ణముగ కొనసాగుటకు ఒక్కొక్కపని కొరకు ఒక్కొక్క ప్రత్యేకశాఖ నేర్పరచుట అవసరము. ఇట్లు కాంగ్రెసుకార్యక్రమమును కొనసాగించుటకు ప్రత్యేకశాఖ నేర్పరచు విషయమై కాంగ్రెసు సంఘమువారు యావద్భా... కాంగ్రెసు సంఘమువారికి త్వరలో సలహాలు పంపవలెను. జీతముల పుచ్చుకొని పని చేయు ప్రచారకుల నియమించుట, ఒక్కొక్కశాఖకు కేంద్ర, రాష్ట్రీయ, స్థానికసంఘముల నియమించుట మున్నగు విషయములకు సంబంధించిన సంపూర్ణకార్యవిధానమును కార్యసంఘమువారు తయారు చేయవలయునని కోరడమైనది. అవసరమైనచో కొన్ని మార్పులతో ఈకార్య విధానమును ఆమోదించి, దానిని అనుసరించి పని చేయుటకు యావద్భారత కాంగ్రెసు సంఘమునకు అధికారమియ్య బడినది.

## కెన్యా

(6) కెన్యాయందలి భారతీయులపట్ల తమకుగల సానుభూతిని కాంగ్రెసు మహాసభవారు ప్రకటించుచున్నారు. భారతదేశము స్వరాజ్యము పొందినగాని విదేశములందు భారతీయు లనుభవించుచున్న అక్రమములు కష్టములు అంతమొందవని కాంగ్రెసుమహాసభవారి అభిప్రాయము. అయినను కెన్యాయందలి భారతీయుల పరిస్థితులను పరిశీలించి, అధికారుల అక్రమములను ప్రతిఘటించుటకై సలహాయిచ్చుటకు, కెన్యాయందు జరుగనున్న భారత కాంగ్రెసు సభకు శ్రీమతి సరోజిని నాయుడు, జార్జి జోసఫుగార్లు కెన్యాకు పోవలయునని తీర్మానింపబడెను.

## సిలోను కార్మికులు

7. సిలోనునందలి దక్షిణ ఇండియా కార్మికుల పరిస్థితులను పరిశీలించి ఒకనివేదికమును కాంగ్రెసు కార్యసంఘమువారికి పంపుటకు ఈ క్రింద పేర్కొనబడినవారిని ఉపసంఘముగ నియమించుటకు కాంగ్రెసు మహాసభవారు తీర్మానించుచున్నారు.

ఎం. ఎ. అరుళానందం, ఎ. వి. డయిసు, పెరియసుందరం, ఎల్. ముద్దుకృష్ణను గార్లు.

## విదేశములందలి భారతీయులు

(8) బ్రిటిషుసామ్రాజ్యమునందలి దేశములందు భారతీయులు ఎన్నియో అవమానములకు పాలగుచుండుటచే ఆదేశములకు భారతీయులను కూలీలుగ పంపుట సంపూర్ణముగ ఆపు విషయమై ప్రజలు ఆలోచింపవలయునని కాంగ్రెసుమహాసభవారు సలహా ఇచ్చుచున్నారు. ఈ విషయమై వివరములను పరిశీలించి యావద్భారత కాంగ్రెసుసంఘమువారికి త్వరలో ఒక నివేదికమును పంపుటకు కార్యసంఘమువారిని కోరడమైనది.

## అకాలీల సంగ్రామము

(9) శిరోమణి గురుద్వార ప్రబంధకసంఘము అకాలిదళములను అణగద్రొక్కుటకై ప్రభుత్వమువారు గావించుచున్న ప్రయత్నములు శౌర్యశ్వరహితసంగ్రామమును కొనసాగించుటకు సంఘముల నేర్పరచు కొను హక్కు భారతీయులకు లేకుండునట్లు చేయుటకై కావింపబడు చున్న ప్రయత్నములని కాంగ్రెసుమహాసభవారు ప్రకటించుచున్నారు. ఏవిధమున స్వాతంత్ర్యోద్యమమునే అణగద్రొక్కుటకు ప్రభుత్వము వారు యత్నించుచుండుటచే సిక్కులకు తోడ్పడుట అవసరము. హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, పార్సీలు, భారతీయులందరు సిక్కులు గావించుచున్న పోరాటమునకు ధనసహాయము మను ష్యుల సహాయ మొసగి అన్నివిధముల తోడ్పడవలయునని కాంగ్రెసు మహాసభవారు కోరుచున్నారు.

## సత్యాగ్రహసంఘము

(10) శాసనోల్లంఘన ప్రయత్నముల గావించుటకు డిల్లి కాంగ్రెసుమహాసభయందు నియమింపబడిన సత్యాగ్రహసంఘము రద్దు చేయబడినది. ఈ సంఘమువారు చేయవలసిన పనులను కాంగ్రెసు కార్యసంఘమువారు చేయుచుందురు.

## వినాయక దామోదరు సవర్కారుగారు

(11) ఇంకను వినాయక దామోదర సవర్కారుగారు నిర్బంధమునందుంచుటను కాంగ్రెసుమహాసభవారు ఖండించుచున్నారు. సవర్కారుగారియెడల తమకు గల సానుభూతిని వారికుటుంబమువారికి కాంగ్రెసువారు తెలియజేయుచున్నారు.

## ఖద్దరుబోర్డు

(12) యావద్భారత ఖద్దరుబోర్డును స్థాపించుటకు తీర్మానించడ మైనది. ఈ క్రింద పేర్కొనబడినవారు బోర్డుసభ్యులుగ నుందురు.

సేతు జమనలాలు బజాజుగారు (అధ్యక్షులు) వల్లభభాయి పటేలు, మగనులాలు గంధి, శివశంకరు జగజీవనుజ్వవేరి, వెల్లినప్పడు బెల్గామువాల్ల, షౌకతాలిగార్లు (సభ్యులు); శంకరలాలు బాంకరుగారు (కార్యదర్శి). యావద్భారత కాంగ్రెసుసంఘమువారికి లోబడి భారత దేశమునందంతటను, ఖద్దరు కార్యక్రమమును కొనసాగించుటకు ఈబోర్డువారికి అధికారమియ్యబడినది. అవసరమైనచో అప్పుచేయుటకు కూడ వీరికి అధికారమియ్యబడినది. బోర్డుసభ్యులు మూడుసంవత్సరములు అధికారమునందుండెదరు సంవత్సరమున కొకపర్యాయము లెక్కలను నివేదికమును బోర్డువారు యావద్భారత కాంగ్రెసు సంఘము వారికి పంపవలెను. ఖద్దరు కార్యక్రమమునకు ఈబోర్డు కేంద్రసంఘముగ నుండును. రాష్ట్రీయ కాంగ్రెసు సంఘములవారిచే స్థాపింపబడిన ఖద్దరు డిపోలపై వీరికి అధికారముండును. రాష్ట్రీయకాంగ్రెసు సంఘములతో కలసి బోర్డువారు అవసరమైనచోట్ల ఖద్దరు డిపోలను స్థాపించెదరు.

## కాంగ్రెసు నిర్మాణముసవరణలు

(13) కాంగ్రెసు నిర్మాణమునందు ఈక్రింది సవరణలు గావింపబడెను.

ఆర్టికలు 2 (ఎ) 'క్రిస్తుమసు సెలవులు' అను మాటలకు బదులు 'డిసంబరు కడపటివారము' అని యుండవలెను.

(బి) అధికసంఖ్య గల రాష్ట్రీయ కాంగ్రెసు సంఘముల కోరిక మీదను లేక యావద్భారత కాంగ్రెసు సంఘమువారు స్వయముగ నైనను కాంగ్రెసు మహాసభను సమావేశపరుపవచ్చును. యావద్భారత కాంగ్రెసు సంఘమువారు స్వయముగ కాంగ్రెసు మహాసభను సమావేశపరుచుటకు హాజరైన సభ్యులలో మూడింట రెండు వంతుల మంది కాంగ్రెసు మహాసభ ప్రత్యేక సమావేశమును ఆమోదింపవలెను. ఎచ్చట మహాసభ జరుగవలెనో యావద్భారత కాంగ్రెసుసంఘమువారే నిర్ణయించెదరు.

ఆర్టికలు (3) ఇండియను నేషనలు కాంగ్రెసు నిర్మాణము నందు ఈ క్రింద పేర్కొనబడినవి చేరి యుండును. (1) జాతీయమహాసభ (2) యావద్భారత కాంగ్రెసుసంఘము (3) రాష్ట్రీయ కాంగ్రెసు సంఘములు (4) జిల్లాకాంగ్రెసు సంఘములు (5) సబ్ డివిజనులు, తాలూకాతహశీలు, ఫిర్కా, ఇతర స్థానిక కాంగ్రెసుసంఘములు. (6) కాంగ్రెసువారిచే అంగీకరింపబడిన విదేశములందుండు కాంగ్రెసు సంఘములు. (7) కాంగ్రెసు సన్మానసంఘము.

విద్యాభివృద్ధికిని, ప్రచారము సలుపుటకును పైసంఘములు ప్రత్యేకమహాసభను జరుపవచ్చును.

ఆర్టికలు (5) పంజాబు సరిహద్దురాష్ట్రములు ఒక రాష్ట్రముగ నుండును. ఈసవరణకు అనుగుణమగు విధమున ఆర్టికలునందలి ఇతర భాగములు సవరింపబడవలెను.

ఆర్టికలు (6) (సి). రాష్ట్రీయ కాంగ్రెసు సంఘమువారిచే తయారుచేయబడిన నిబంధనల ననుసరించి కాంగ్రెసుసంఘములు సంవత్సరమున కొకపర్యాయము రాష్ట్రీయ కాంగ్రెసుసంఘసభ్యుల నెన్నుకొనెదరు.

(డి). నవంబరు 30 వ తేదిలోగ రాష్ట్రీయ కాంగ్రెసుసంఘములు తమ నివేదికమును యావద్భారత కాంగ్రెసు సంఘమువారికి పంపెదరు.

(ఇ) రాష్ట్రీయ కాంగ్రెసు సంఘమువారిచే ఏర్పరుపబడిన గడువులోగ కాంగ్రెసు చందా చెల్లింపనివారు ఎన్నికలయందు పాలుగొనగూడదు.

ఆర్టికలు (7) నాలుగణాల చందా సంవత్సరము జనవరి 1 వ తేది ప్రారంభమై డిసంబరు 31 వ తేదితో అంతమొందును.

ఆర్టికలు (18) (బి) సాంవత్సరిక సమావేశమున నియమింపబడు ఆడిటరుచే యావద్భారత కాంగ్రెసుసంఘమువారి లెక్కలు సంవత్సరమున కొక పర్యాయము ఆడిటుచేయబడును. అవసరమైనచో రాష్ట్రీయ

కాంగ్రెసుసంఘముల లెక్కలను పరిశీలించుటకు ఈ ఆడిటరుకు అధికార ముండును.

(సి) రాష్ట్రీయ కాంగ్రెసుసంఘముల లెక్కలు సమముగ ఆడిటు చేయబడుచుండుటకు యావద్భారత కాంగ్రెసుసంఘమువారు తగువిధమున ప్రయత్నించుచుండెదరు.

ఆర్టికలు 19. పేరా 1. ఇందులో 3౯,కి బదులు "360" అని యుండవలెను.

పేరా 7. ఈ పేరాకు బదులు ఈ క్రిందిపేరా చేర్పవలెను.

రాజీనామావల్లను మరణమువల్లను మరి ఇతర కారణములవల్లను యావద్భారత కాంగ్రెసు సంఘమున ఏర్పడు ఖాళీలు, రాష్ట్రీయ కాంగ్రెసుసంఘమున ఏర్పడు ఖాళీలు రాష్ట్రీయ కాంగ్రెసుసంఘముల వారిచే భర్తీచేయబడుచుండును.

8 వ పేరాలో 15 కు బదులు 30 యుండవలెను. ఈ పేరా కడపట ఈ క్రిందివాక్యములను చేర్పవలెను:—సభను సమావేశపఱచుటకు తీర్మానింపబడిన పిమ్మట రిక్విజనన్ కోరిన విషయములే కాక ఇతరవిషయములను కూడ కార్యక్రమమునందు చేర్పవచ్చును. కాని సంపూర్ణ కార్యక్రమము ముందుగ సభ్యులకు పంపబడవలెను.

యావద్భారత కాంగ్రెసు సంఘమునకు కోరము 50 గ నుండును

ఆర్టికలు 24:—సాంవత్సరిక సమావేశము ముగియగనే యావద్భారత కాంగ్రెసు సంఘమువారు సమావేశమై తమలో 9 మందిని ఎన్నుకొనెదరు. ఈ తొమ్మిదిమంది, అధ్యక్షుడు, కార్యదర్శులు, కోశాధ్యక్షులు కాంగ్రెసు కార్యసంఘసభ్యులుగ నుందురు. వీరు అన్ని విషయములందును యావద్భారత కాంగ్రెసు సంఘమునకు బాధ్యులై యుందురు.

ఆర్టికలు 29:—కాంగ్రెసు మహాసభయందు కార్యక్రమము ఈ క్రిందివిధమున జరుగును.

(ఎ) విషయనిర్ధారణసంఘమువారిచే ఆమోదింపబడినవి

(బి) 25 మంది ప్రతినిధులు ఒకతీర్మానమును అధ్య వ్రాసిపంపవచ్చును. ఈ తీర్మానముపై విషయనిర్ధారణసంఘమువా ఆలోచించెదరు. విషయనిర్ధారణసంఘమున మూడింట ఒకవంతు సభ్యులైనను ఈ తీర్మానమును ఆమోదించిన మహాసభయందు ఈతీర్మానమును చర్చకు తెచ్చుటకు అధ్యక్షుడు అనుమతి ఇయ్యవచ్చును.

ఆర్టికలు 31:—ఎన్నికల తగాదాలను పరిష్కరించుటకు మందిని యావద్భారత కాంగ్రెసు సంఘమువారు ప్రతిసంవత్సరము ఎన్నుకొనెదరు. ఈ 12 మందిలో తగాదాపడియున్న రెండుపక్షములవారు ఇద్దరిని పేర్కొనెదరు. కాంగ్రెసు అధ్యక్షుడు మూడవవానిని పేర్కొనెదరు. ఈముగ్గురు ఎన్నికతగాదాలను తీర్చెదరు.

ఆర్టికలు 33:—కాంగ్రెసు కార్యక్రమము సాధ్యమైనంతవఱకు హిందుస్థానియందు జరుపవలెను. ఇంగ్లీషు, ఆయాప్రదేశములందలి దేశభాష ఉపయోగింపబడవచ్చును.

## కార్యదర్శులు

14. కడచిన సంవత్సరము పనిచేసిన కార్యదర్శులకు వందనము లర్పింపబడెను.

## అధికారసభ్యులు

15. ఈ క్రింది అధికారులు రాబోవు సంవత్సరమునకు నియమింపబడిరి.

కార్యదర్శులు:—పండిత జవహరిలాలు నెహ్రూ, డాక్టరుకిచ్లు, గంగాధరరావు దేశపాండే గార్లు.

కోశాధ్యక్షులు:—వేల్జిలక్ష్మినప్పు, కేశవశంకరు జగజీవనుజలేం గార్లు.

ఆడిటరు:—మెసర్సు సి. హెచ్. సోపరివాల అండు కంపెని.

# అఖిలభారత ఖద్దరు ప్రదర్శన ప్రారంభోత్సవము - కాకినాడ

## ఆచార్య ప్రఫుల్లచంద్ర రే గారి మహోపన్యాసము

ఆంధ్రదేశాంతర్భాగమున అఖిలభారత ఖద్దరుప్రదర్శన ప్రారంభోత్సవమును జరుపు గౌరవము నాకొసంగ మీరు దయతో నన్నాహ్వానించినపుడు, అచట సమావేశమైన వివిధరాష్ట్రప్రతినిధు లందరకును రాటము ఖద్దరునుగూర్చి నాభావములను వెలిబుచ్చుటకు మహదవకాశము గల్గెనని సంభావించితిని.

### నిర్మాణకార్యక్రమ స్తంభనము

ప్రప్రథమమున నేను ఒక విషయమునకై గల్గిన మనోవేధను దెలుపవలయును. దాని నిప్పుడే బైటికి చెప్పెదను. ఖద్దరు ఖద్దరు అని నోటితో అనుటతో మాత్రము సరిపోవుచున్నది. రాటమును గూర్చి ఉపేక్షయు పరాభూతియు యెక్కువగుచున్నది. ఇకను నిర్మాణకార్యక్రమమువిషయము మొత్తముమీదగూడ నట్లేయున్నది. శాసనసభల వోటింగుగోలలో రాటముయొక్క మృదుమధురగానమునణిగిపోయినది. ఈసందర్భమున నాకుగల్గిన వేధ యింతింత గాదు. మరల వెనుకటి మందబుద్ధి ఉపేక్షాభావములు ఆవహించుటనుజూడ ఆత్మవిషణ్ణమును జెందుచున్నది. మన మహానాయకుడు గాంధిమహాత్ముడొసంగిన అద్భుతసందేశము నాయకత్వము అన్నియును పిచ్చిగోలలతోను అల్లరులతోను సమసిపోవుచున్నవి. నేను చెప్పునది విశదముగ జెప్పెదను. రాజకీయనాటకము లాడువారితోను, భావోద్రేకులతోను నాకెట్టికలహమును లేదు. ఈభావోద్రేకమును నాటకమును ప్రజల ఉత్సాహమును పురికొల్పుటకు మంచివియే కాని ప్రజలు నిరాటంకముగ అవిచ్ఛిన్నముగ కార్యనిర్వాహణమును జేయకుండిరేని ఈనాటకము లన్నియు వేళాకోళములై దేశభక్తునకు నష్టమును, శత్రువునకు సంతోషమును గల్గుచుండును. దేశముయొక్కస్థితి చూచుసరికి నానోటినుండి యిట్టిమాటలు రావలసివచ్చెను. నిర్మాణకార్యక్రమము దాదాపు అంతయు స్తంభించిపోయినది. ఇప్పటికి సంవత్సరన్నరనుండియు, అదేముఖ్యవిషయమగునటుల శాసనసభాప్రవేశవిషయమును గూర్చి పూర్వాపరములను ఒకటేతీరున లాగుచుండిరి. ఇకను రాటము ఖద్దరు జాతీయపాఠశాలలు, అస్పృశ్యత, పంచాయితీలు, గ్రామసంఘనిర్మాణములు యివన్నియును ఒకమూలజేరెను. అవియన్ని వెక్కిరింపుభక్తి గల్గి నెమ్మదిగ మూలకు ద్రోసిరి.

### ఏమి యీపతనము?

**1921** నుండియు యేమియీపతనము? శాసనసభలలోనికిపోయి ప్రతిష్టంభ అసహాయమును జేయుపని పటుతరమైనదా కాదా యను స్వల్పవిషయమును గూర్చి తగాదాలు పడుటకేనా, విద్యార్థులు వేలకొలదిమంది పాఠశాలలనుండి బయటికి వచ్చినదియు, పిల్లలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు ఒకరికన్న నొకరు ముందుకుజని జెయిలుకు తీర్థయాత్రాస్థలమని జనినదియు, దేశనాయకులు యిదొకకప్పుడును గాననివిధమున ఊపు ఊపినదియు యిందుకేనా? దేశము స్వాతంత్ర్యపు ఆకలితో కొట్టుకొనుచు యీవృథావర్పులుగాక జీవదాయకమగు పదార్థమును గోరెను. అదృష్టవశాత్తు యిట్టి సందిగ్ధసమయమునకు ఒకలోకోత్తరనాయకుడు సంభవించెను. ఆయన మాటల[illegible]. ఆయన మోక్షము నొసంగునట్టి మార్గమును సంకుచితమై క్లిష్టమైనదానిని చూపెను. ఇప్పుడా నాయకుడు మనలోలేడు. అందుకని మనము ఆమార్గమును తప్పుదమా? మోక్షమార్గము సులభమైనది గాదనియు, మంగలకత్తివలె పదునైనదనియు, వానిని పొందుట కష్టమనియు, అందభివృద్ధి గాంచుట కష్టమనియు ఉపనిషత్తులు చెప్పుచున్నవి. ఐతే మిత్రులారా, యిది యొక్కటియే మార్గము. మరియొకటి యేదియును లేదు.

నాహృదయమందలి ఆవేగమువలన నేను వలయుదానికన్న తీవ్రముగ మాటాడియుండవచ్చును. కాని నేను బెంగాలులో నిర్మాణకార్యక్రమవిషయమును జూడ నాహృదయము అత్యంతశోకావిష్టమాయెను. ఇతర రాష్ట్రములందు ముఖ్యముగ మీ ఆంధ్రదేశమునో పరిస్థితులు ఇంతకన్న నెక్కువ ఆశాజనకములుగ నుండవచ్చును. తోటనాయకుడు జాగ్రత్తగ త్యాగముతో వేసిన చిన్నబీజము నాటుకొని అకువేసి పెద్దదైన మహావృక్షము గావచ్చును.

### గృహరాట్నము

దేశము అనుష్ఠింపవలసిన నిర్మాణకార్యము నందలి వివిధాంశములలో, గాంధిమహాత్ముడు ముఖ్యమని నొక్కిచెప్పినదియు, ప్రజల ఆర్థిక సౌభాగ్యమునకు అవసరమును ముఖ్యము నగునదియు విశ్వాసనరణీయము నని రాటమును గూర్చి చెప్పబడెను. ఎంతదుర్బలుడైనను, ప్రతివాడును, స్త్రీపురుషులు అందరును నిత్యాదాయమునకు బాగా డబ్బు చేర్చుకొనునుపాయ మేది? ప్రతివారును తమకు అవసరముగ కావలసిన వాని నన్నిటిని సమకూర్చుకొనుటలోనే ఆ ఉపాయముగలదు. అందుకు మార్గము అందర అందుబాటులోను సులభముగ నున్నది. గృహరాట్నముకన్న యీ కావలసినవాని నన్నిటిని సమకూర్చుమార్గ మేది గలదు? ఎంతటి దుర్బలస్త్రీ యైనను దాని నుపయోగింపగలదు. ఎంతటి బీదవాడైనను దానిని సంపాదించుకొనగలడు. లేదా తయారుజేసికొనగలడు. బాగుచేసికొనగలడు. దానివలన జనసామాన్యము మొత్తముమీద సంపాదించుకొనుదాని కిబ్బడి ఆదాయము వచ్చును. పోనీ దానివల్ల డబ్బురూపముననే అక్కర లేదన్న కాపువానియింటికి కావలసిన గుడ్డల ఖర్చంతయును గిట్టును. అంతియగాక యింకను మిగులు[illegible]. ఇది తప్ప మరి యేమార్గమును లేదు. వ్యవసాయము గలదుకాని దానితో కాపు

వాని కాలవ్యవధి యంతయును తీరదు. శక్తితగ్గదు. ఇంతవరకు పురుషుల మాట జెప్పితిని. ఇకను స్త్రీలు సంవత్సర మంతయును కొంత కాలమును నూలు వడకుటకు వినియోగింపవచ్చును. ఆనూలు కుటుంబమునకు కావలసిన గుడ్డలకు సరిపోవును. తర్కవిచారణచేసి చూచినను యిదియే పటుత్వముగ గాన్పించుచున్నది. స్వానుభవమునుబట్టి ఈసందర్భమున ఒకటి జెప్పెదను. కూల్నాకరువులోను, ఉత్తరబెంగాలు వరదలప్పుడును సహాయము జేయుటకు యీరాటమునే ప్రవేశపెట్టితిమి. సిద్ధాంతమునం దేగాక ఆచరణయందు దీనిసత్యము దెలిసెను. రైతుకు మరియొక జీవనోపాయ ముండినయెడల ఒకసంవత్సరము పండనంతమాత్రమున అయ్యో యెట్లోయని భయపడనక్కరలేదు. మేము రాటమును దూదిని యిచ్చి నూలువడుకుటను ప్రవేశపెట్టినపుడు బీదకాపులు స్త్రీపురుషు లందరును దానిఫలితముల గాంచి అది దైవదత్తమని భావించిరి.

## కొన్ని స్వల్పసంఖ్యలు

కొన్ని స్వల్పసంఖ్యలు చూచినయెడల ఈ విషయమై యేమాత్రమును అతిశయోక్తి జెప్పనటులు దెలియగలదు. భారతీయునకు సంవత్సరమునకు మొత్తముమీద నెంతయాదాయము వచ్చును? నౌరోజీ, డిగ్బీ, రొమేశదత్తు గారలు యీవిషయమును పూర్తిగ చర్చించిరి. కర్జను ప్రభువారితో గూడ నీవిషయమై చర్చించిరి. బ్రిటిషు ప్రభుత్వము క్రింద అత్యంత క్షేమము నొందుచున్న భారతీయునకు ఒక్కొక్కనికి సంవత్సరమునకు మహా 30 రూపాయలు వచ్చునని చెప్పగల్గెను. కావున యీలెక్కవిషయమై సంశయింప నక్కరలేదు. రాజప్రతినిధి వేసిన యీలెక్కప్రకారమే రోజుకు ఆదాయము అణా కాని వచ్చును. రాటము వలన యీయాదాయమునకు నెంతచేరునో చూచెదము. రోజుకు రాటము 8 గంటలు త్రిప్పినయెడల బాగా వడుకగలవాడు రోజుకు 2 అణాలను సంపాదింపగలడు. మనము లెక్కలో జాగ్రత్తగనుండి పనిజేయు గంటలు తగ్గించినను, తయారుతగ్గినను, రోజుకు ఆదాయము యిబ్బడి యగు ననుటకు యేమాత్రమును సందియములేదు.

నేనీ విషయమై యెక్కువగ జెప్పనక్కరలేదు. సంఖ్యలు జూచినచో సంగతు లన్నియు దెలియగలవు. మఱియొక విషయమునుగూడ జ్ఞాపక ముంచుకొనవలయును. నూలువడుకు పనిదానికి మాత్ర మది యుండదు. అందరును దానిని గృహాపరిశ్రమముగ నుపయోగించునెడల అది యితర స్వల్పగ్రామపరిశ్రమలకు ఆధారముగ నుండును. గ్రామమంతయును రాటమును పనిజేయునెడల నేతమగ్గముగూడ త్వరగ పనిజేయుచుండును. దానితోబాటు రంగులు వేయువానికిని వడ్రంగికిగూడ పనిదొరకును. సత్యమును జూచి యెడల నూలువడుకుటయే గ్రామజీవితమునకు ప్రధానపరిశ్రమము. గ్రామమునకు కావలసిన వస్తుజాలమును సమకూర్చుటకును స్వాధీనమై యుండునటుల జేయుటకును యీపరిశ్రమకన్న వేరొకటిలేదు.

## ఖద్దరు - పటుతరపరిశ్రమము.

ఈ పరిశ్రమవలన ధైర్యసాహసములును చురుకుదనమును స్వయంసహాయమును అలవడి గ్రామములందు నూతనజీవితము యేర్పడి యిప్పుడు నెమ్మదినెమ్మదిగ ఆవేశించుచున్నవిన కొనవచ్చును.

ఈసంఖ్యలను వ్యక్తులవిషయమున గాక దేశము నం వర్తించునటుల లెక్కజూచునెడల దీనిఫలితము మరింత యెక్కువగాన్పించును. భారతదేశీయజనసంఖ్య 32 కోట్లప్రకారము జూచినను కర్జను ప్రభువులెక్కప్రకారము సంవత్సరమునకు 960 కోట్లరూపాయలు ఆదాయమువచ్చును. జనసంఖ్యలో 4వ వంతు రోజుకు రెండణాలు వడికినను సంవత్సరాదాయము 90 కోట్లుయెక్కువగును. ఇది నూలు నేతవలనగూడ గాక ఒక్కవడుకుట వల్లమాత్రమే. ఇందు యింకను వడ్రంగులు కమ్మరులు మున్నగుపనివారల ఆదాయముగూడ చేరదు. ఇందువలన విదేశములకుబోవు 60 కోట్లు 70 కోట్లమొత్తము మనదేశములోనే యుండి, దేశము భాగ్యవంతమై, సగము మాడునట్టి బీదకాపుల జీవరక్తము బలపడును.

కొందరీసంఖ్యలవైపరీత్యమును జూచి వేళాకోళము జేయవచ్చును. అట్టివారిని పాపమనిమాత్ర మనవలయును, వారలకుండు సంకుచితభావాదర్శములతో యీపరిశ్రమయొక్క మహాద్భుతఫలితములను వారు గ్రహింపజాలరు. ఈజాయింటు స్టాకుకంపెనీలు, ట్రస్టులు, మున్నగునవి గూడ వానికి సరిరావు. ఇట్లు విశ్వానుసరణీయమైన యెడల, నీపరిశ్రమము చాల పటుతరమైనది కాగలదు.

## విభాగసమస్య

విభాగసమస్య చాల ముఖ్యమైనది. ధనము బైటికెక్కడికి పోకుండ దేశములోనే ఒకచోట నుంచువిషయమైన యెడల, ఆపనిని పెద్దపెద్ద కంపెనీలు యేయెలెక్ట్రికుపవరుమిల్లులలో బెట్టి పనిజేయవచ్చును. కాని యీధనవిభాగమునకు మిల్లులును యితరకంపెనీలును చాలవు. మిల్లులు లాభముల దీయునేగాని వానిని పంచిపెట్టజాలవు. వస్తునిర్మాణముకన్న పంచిపెట్టుట తక్కువ అవసరమైనదికాదు. మనదేశములో అదృష్టవంతులగు మిల్లుయజమానులు విపరీతలాభముల గొట్టి బలియుచుండినయెడల, లక్షలకొలదిమంది మాడునపుడు మనకు వచ్చులాభమేమి? ఇందువలన ధనభాగ్యములలో అసమానత్వమేర్పడును. ఆకలి, పనిలేకుండుట మున్నగునవి మరింతఘోరముగ గాన్పించును. ఇప్పుడున్న క్లిష్టసమస్యకు తోడు మరియొక సంగ్రామము ఒక తరగతికిని మరియొక తరగతికిని సంభవించును. దీనినిబట్టి నేను చెప్పునది పెద్దరకపుపరిశ్రమలన్నియు అణచివేయవలెనన్నను ఆపని జరుగదు. ఐతే అంత అపాయకరముగ నుండని మార్గములవలన అట్టిఫలితమే చేకూరునెడల అది నిజముగా మంచిదే. ఇట్టివిభాగకార్యము రాటమును ప్రవేశపెట్టిన యెడల దానియంతట నదియే జరుగును. ఈవిషయమునే గాంధిమహాత్ముడు చక్కని వచనములలో నిట్లుచెప్పెను. "వర్షము కురిసినటుల మనుష్యుడు యెంత తెలివిగ పనిజేసినను నీరు భూమి యంతను పర్వునటుల జేయజాలడు. దానికి ఇరిగేషను శాఖగాని పూర్వాచారచట్టములుగాని, పరీక్షగాని, నీటితీరువగాని యేమియు అక్కరలేదు. అంతయును సులభముగ నెమ్మదిగ జరుగును. అవి పరిపూర్తి బొందెనేని దానివివ

...రయే లేదు. రాటమునకు గూడ అట్టిపర్వాణ మే గలదు. బహుసులభముగ లక్షలకొలది ఇండ్లలో భాగ్య ...టుల జేయును."

## రాటపువిలువ

రాటమువల్ల కలుగు అమూల్యమగులాభ మొకటియున్నది. ధన ... సమముగ పంచిపెట్టును. ఆర్థికదుర్దశను అంతమొందించుటకు సాధనము. రాటము భారతదేశమునకు క్రొత్తదికాదు వ్యవసాయము ...డుకుటయే భారతదేశ పరిశ్రమలయందు అనాదినుండి అగ్ర... నము నాక్రమించియున్నది నూరుసంవత్సరములకు పూర్వముకూడ గ్రామములందలి ప్రతిగృహమునందును రాటములుపయోగింపబడుచుండెను రాటము లేని గృహము అరుదుగనుండెనో ఎంతమందికి లాభకరముగ ...ండెనో తెలుపుటకు 1798-1814సంవత్సరములందు భారతదేశపు ఆర్థిక ...రిస్థితులను గురించి డాక్టరు ఫ్రాన్సిస్ బుకననుగారు ప్రకటించిన నివే... కమునందలి కొన్ని భాగముల నీదిగువ నుదహరించుచున్నాను:—

"పాట్నా బిహారుజిల్లాల జనసంఖ్య 3364420. వీరిలో 330426 మంది దినమునకు కొన్నిగంటలకాలము రాటముపై నూలు ...డకుచుండిరి. సగటున సంవత్సరమున కొక్కొక్కరు రూ 7-2-9 సంపాదించుచుండిరి. వడకిననూలు ధర రూ 2367277/. ప్రత్తిధర 286272 రూప్యములు పోను 1081005 రూప్యములు మొత్తముమీద లాభము కలుగుచుండెను.

షహాబాదు జిల్లాయందు వడకుట ప్రధానపరిశ్రమగ నుండెను. 59500 మంది స్త్రీలు సంవత్సరమునకు 2253000 రూప్యముల విలువ ...ల నూలును వడకుచుండిరి. ప్రత్తివెలపోను ఒక్కొక్కగృహమునకు ...ంత ఆదాయమైనను ఏర్పడుచుండెను. (ఆకాలము 23 లక్షలు ఈ కాలము కోటిరూప్యములతో సమానముగ నుండునని గ్రహింపవలెను.)

భగల్పూరుజిల్లా జనసంఖ్య 2019900. స్త్రీలు 160000 మంది ...డకుచు సంవత్సరమునకు $4\frac{1}{2}$ రూప్యములు సంపాదించుకొనుచుండిరి.

గోరకుపూరు జిల్లాలో 175600 మంది స్త్రీలు సగటున సంవత్సరమున కొక్కొక్కరు రూ 2-2-0 లాభమును సంపాదించుకొనుచుండిరి.

దినుజాపూరుజిల్లాలో ఉన్నత తరగతులకు చేరిన స్త్రీలు కూడ ...డకుచుండెడివారు. బ్రాహ్మణస్త్రీలుకూడ విరామసమయములందు ...డకుచుండిరి. 3 లక్షలమంది స్త్రీలు సంవత్సరమునకు సగటున ఒక్కొక్కరు మూడురూప్యముల సంపాదించుకొనుచుండిరి.

పూర్ణియాజిల్లాలో వడకుట గౌరవమగు వృత్తిగ పరిగణింపబడుచుండెను. జిల్లాయందలి స్త్రీలందరు విరామసమయములందు వడకుచుండిరి. జనసంఖ్య 2904380.

తూర్పుమైసూరునందు బ్రాహ్మణులు తప్ప మిగతజాతులకు చేరిన స్త్రీలందరు ప్రతివారము నూలుకొని వడకి అమ్ముచుండెడివారు. కోయంబుత్తూరు జిల్లాలో వ్యవసాయదారుల కుటుంబములకు చేరినవారందరు చక్కగ వడుకగలవారు.

## నేతగాండ్రు

నేతగాండ్ర సంఖ్యకూడ అధికముగనుండెను. పాట్నా బీహారు జిల్లాలయందు 750 మగ్గములుండెను 540000 రూప్యముల విలువగల గుడ్డలు ప్రతిసంవత్సరము తయారగుచుండెను. లాభము 81400 రూప్యములు. ఒక్కొక్కమగ్గమున సగటున 108 రూప్యములు లాభముకలుగుచుండెను. ఒకమగ్గమునకు ముగ్గురు పనివారున్న చాలును. ముద్దుగుడ్డలు నేయువారికి మగ్గమునకు 34 రూప్యములలాభము కలుగుచుండెను.

షహాబాదు జిల్లాలో 7950 మగ్గములుండెను. భగల్పూరు జిల్లాలో పట్టుబట్టలు నేయబడుచుండెను. 3276 మగ్గము లుండెను. ఒక్కొక్కపనివారికి సగటున 46 రూప్యములు లాభము వచ్చుచుండెను. ఈ జిల్లాలో పట్టుగుడ్డలు నేయుటకు కాక నూలుగుడ్డలు నేయుటకు 7279 మగ్గము లుండెను. సగటున ఒక్కొక్క పనివానికి 12 రూప్యములు లాభము కలుగుచుండెను.

గోరకుపూరు జిల్లాలో 5434 నేతగాండ్ర కుటుంబములుండెను. 6174 మగ్గములుండెను. ఒక్కొక్క మగ్గమునకు సంవత్సరమునకు 88 రూప్యముల ఆదాయము కలుగుచుండెను.

డంగరుపూరు జిల్లాలో వడుకు ప్రత్తిపేక నూలుతో గుడ్డలు నేయబడుచుండెను. నెలకు ఒక మగ్గమున 20 రూప్యముల వెలగల గుడ్డలు తయారగుచుండెను. 800 మగ్గములు ఈ జిల్లాయందుండెను.

తూర్పుమైసూరునందు నేతగాండ్రు దినమునకు 4 అణాలు సంపాదించుకొనుచుండిరి.

ఈ లెక్కలపై వ్యాఖ్యాన మొనర్చుట అనవసరము. ఈ విధమున నేతగాండ్రు విశ్రామసమయములందు నూలువడుకు స్త్రీలు దేశపు ఆదాయమును కోట్లకొలది రూప్యములు అధికము చేయుచుండిరి. అందరు నూలువడకుచుండుటచేత భారతదేశమునుండి గుడ్డలు విదేశములకు ఎగుమతి చేయబడుచుండెను. ఈ విషయమై మహాత్ముడు చెప్పిన విలువగలమాటలను ఈ దిగువ నుదహరించుచున్నాను.—

ప్రతిగ్రామమునందును, నగరమునందును, జిల్లాయందును, వాటివాటి అవసరములకు కావలసినంత నూలుగుడ్డలు తయారగుచుండెను. ఈ కారణమువల్ల రైల్వేఖర్చులు, కమీషను వర్తకుల దోపిడి లేకుండెను. ఇట్టి పరిస్థితులు ఈ కాలమున ఏర్పడుటకు వీలులేకుండిన విదేశవస్త్రములను బహిష్కరించి ఈదేశమునందు తయారగు గుడ్డలు దేశమందంతయు సమముగా వ్యాపించునట్లు పనిచేయవచ్చును.

## మహాత్ముని అద్భుతవాదము

ఈసమస్యను తనసహజ సుందరవాక్యములతో మహాత్ముడు ఈక్రిందివిధమున వివరించెను:—

మిల్లుగుడ్డలకు బదులు నేతగుడ్డల నుపయోగింపవలెనని నేను బోధించుచు అభివృద్ధికి ఆటంకము కలుగజేయుచున్నానని నన్ను కొందరు ఆక్షేపించుచున్నారు. మిల్లులను అణగద్రొక్కవలయుననుట నాయు

ద్దేశముకాదు. భారతదేశమునం దొక్కొక్కనికి సగటున 13 గ॥ గుడ్డ కావలెను. భారతీయులకు మొత్తముమీద కావలసినగుడ్డలలో సగము వంతుకూడ మిల్లులు తయారుచేయుటలేదు. భారతదేశమున ప్రత్తిపంటమాత్రము సమృద్ధిగ నున్నది. లక్షలకొలది ప్రత్తిమూటలు ప్రతిసంవత్సరము జపానుకు లంకాషైరుకు ఎగుమతి చేయబడుచున్నవి. చేతితో వడకి గుడ్డలునేయుటకు మనకు సామర్థ్య మున్నను విదేశములకు ప్రత్తిని ఎగుమతిచేసి వస్త్రములను దిగుమతి చేయుచున్నారు. వ్యవసాయమునకు తోడుగ మరియొకవృత్తి భారతీయుల కుండుట అత్యవసరము. నూతన యంత్రసామగ్రులవల్ల ఈప్రాచీనరాటపు పరిశ్రమ అంతమొందినదని చెప్పుటయందు సత్యములేదు. ఈస్టుఇండియా కంపెనీవారు దురుద్దేశముతోడను అక్రమపద్ధతులతోడను ఈపరిశ్రమను అణగద్రొక్కిరి. మిల్లు పరిశ్రమాభివృద్ధికి భంగము కలుగని విధమున రాటపు పరిశ్రమకూడ వృద్ధిచెందవచ్చును. ఈప్రాచీనపరిశ్రమ మరల సుస్థాపితమొనర్పబడిన విదేశములకు పోవుచున్న కోట్లకొలది రూప్యములు మనదేశమునందే నిలచియుండును.

## గంగను గంగోత్రికి నెట్టగలమా ?

ఆక్షేపించుటకు వీలులేనివిధమున స్పష్టముగా సహేతుకముగ మహాత్ముడు తనకార్యక్రమమును సమర్థించెను. కాని ఈకార్యక్రమమును ఆక్షేపించువా రెంతమందో యున్నారు. ఈకాలమున విద్యుచ్ఛక్తి స్టీముయంత్రాలయములు అధికముగ ఉపయోగింపబడుచుండగ రాటము నమ్ముకొనుట అవివేకమని కొందరు అభిప్రాయపడుచున్నారు. ఆధునికపద్ధతుల నంతమొందించి ప్రాచీనపరికరముల నుపయోగింపనెంచుట నాగరికతకు భంగము కలుగజేయుట యని కొందఱు చెప్పుచున్నారు. రాటము యంత్రములతో పోటీచేయజాలదనియు ఇతరదేశముల చరిత్ర తనవాదమును నిరూపించుచున్నదనియు గంగను గంగోత్రికి నెట్టజాలమనియు తంతివార్తలు టెలిఫోనులు, రైలుమార్గములు, విద్యుచ్ఛక్తికాలమును సంపూర్ణముగ మార్చుచుండ పిచ్చిభ్రమలకు లోనగుట అవివేకమని కొందరు నిరసించుచున్నారు.

ఆక్షేపణలు అధికముగనున్నను నావిశ్వాస మెంతమాత్రము క్షీణించుట లేదు. ప్రతివాదములు బలవంతములైనవేగాని ప్రతిపక్షులు పరిస్థితులను సమముగ గ్రహించుటలేదు. నాకట్టి పిచ్చిభ్రమలు లేవు. ఆధునికయంత్రాలయములను పొగగొట్టములను అంత మొందింపవలయునని నేను కోరుటలేదు. నాపూర్వచరిత్రవల్ల నాకు పాశ్చాత్యనాగరికతయందును, పాశ్చాత్యయంత్రముల పట్లను ద్వేషము లేదని మీరు గ్రహింపగలరు. నేను 8 సంవత్సరములు ఇంగ్లాండునం దుంటిని. బెంగాలునందు పాశ్చాత్య నాగరికతకు చేరిన ఒకపరిశ్రమ వ్యాపింపజేయుటయందు అధికముగ పాటుపడియుంటిని. దేశీయు లుపయోగించుసబ్బునుబట్టి ఆదేశపు నాగరికతను సూచించుననియు దేశమునందు తయారగు గంధకధృతి ఆదేశపుపరిశ్రమాభివృద్ధిని సూచించుననియు జర్మనీ శాస్త్రజ్ఞుడు లీబిగు నూరుసంవత్సరములకు పూర్వము చెప్పియుండిరి. విదేశములందు తయారగు సబ్బులతో పోటీచేయు సబ్బులను తయారుచేయు వంగరాష్ట్రమునందలి యంత్రాలయములకును నాకు సంబంధమున్నది. బెంగాలు కెమికలు ఫార్మాస్యూటికలు వర్క్సుని స్థాపించినవారిలో నేనొకడను. ఈకంపెనీవారు అధికముగ గంధకధృతిని తయారు చేయుచున్నారు. ఈ కారణములవల్ల పాశ్చాత్యనాగరికతను నేను ద్వేషించుటలేదని స్పష్టమగుచున్నది. కావున రాటము భారతదేశమునకు అధికముగ మోక్షము నొసగునని చెప్పినప్పుడు యంత్రములవలని లాభమునుకూడ గుర్తెరిగి చెప్పుచున్నానని మీరు అంగీకరింపవలెను.

## ఇది మిల్లులపై దండయాత్రకాదు

ఈసందర్భమున మహాత్మునికూడ నిట్లువ్రాసెను:—

"నేను అభివృద్ధికి ఆటంకము కలుగజేయుచున్నానా? యంత్రములకు బదులు రాటములు మగ్గము లుపయోగింపబడవలయునని కోరుచున్నానా? రైలుబండ్లకు బదులు యెద్దుబండ్ల నుపయోగింపవలయునని కోరుచున్నానా? యంత్రాలయముల నంతమొందింపవలయునని కోరుచున్నానా? పలువురు ఇట్టి ప్రశ్నలు నన్నడుగుచున్నారు వారికి తగువిధమున ప్రత్యుత్తర మిచ్చెదను.

యంత్రాలయము లంతమొందిన నేను చింతింపను. అది గొప్ప దురవస్థయని నేను తలంపను. కాని యంత్రాలయములందు తయారు అగు గుడ్డలకు తోడుగ రాటములు మగ్గముల సహాయమువల్ల గుడ్డలు తయారు కావలయుననియు విదేశములకు పోవుచున్న కోట్లకొలది రూప్యములు భారతదేశమునందలి బీదకుటుంబములయందు నిలచియుండవలయుననియు నేను కోరుచున్నాను. భారతీయులందరు తమ విరామకాలమున రాటములపై వడకుటకు సంకల్పించుకొనిన గాని నాయుద్దేశము నెరవేరదు".

## వడకుట-సంసారధర్మము.

రాటము ఆర్థికముగ లాభకరము కాదనియు యంత్రములతో పోటీ చేయజాలదనియు వాదించుట అప్రస్తుతము. యంత్రాలయములందు అధికముగ తయారగు గుడ్డలతో ఖద్దరుగుడ్డలు పోటీచేయవచ్చుననికూడ చెప్పజాలము. ఇదియొక వ్యాపారము కాదు. ప్రతియింటి దొడ్డియందును ప్రత్తిని పండించి ఆప్రత్తిని ఆయింటివారు వడకి, గ్రామమునందలి నేతగానికి స్వల్పముగు కూలి ఇచ్చి ఆనూలును గుడ్డగ తయారుచేయించి ఆగుడ్డలను ఆకుటుంబమువా రుపయోగింపవలెను ప్రతిదినము మనము అంగళ్లయందు అన్నము కూరలు మున్నగునవి కొనుటలేదు. ఇంటియందు వంటచేసికొని భుజించుచున్నాము. మనకు కావలసిన ఆహారమును మనమెట్లు స్వయముగ తయారుచేసికొనుచున్నామో అట్లే కుటుంబమునకు కావలసిన గుడ్డలను కుటుంబమువారు తయారు చేసికొనవలెను. ప్రత్తిని కూడ కొనకూడదు. ఇంటిదొడ్డియందు కుటుంబమునకు కావలసిన ప్రత్తిని పండించుకొనవలెను. ఆహారము ఎట్లు తయారుచేసికొనుచున్నామో అట్లేధరించుకొనుటకు గుడ్డలుకూడ తయారుచేసికొనవలెను. ఈకార్యక్రమమును ఆక్షేపించుట కెవ్వరును సాహసింపరు. ప్రతిపక్షుల ఆక్షేపణలన్నియు ఈకార్యక్రమమునకు అనువర్తింపవు.

ఈవిధమున ప్రతిగృహమునందు జరుగుట అసాధ్యము. ...ది ఇతరవృత్తులయందుండి ఈ వృత్తిని అవలంబింపజాలకపోవ... కొన్నిగృహములందు నూలు అధికముగ తయారు కావచ్చును. నూలుతో తయారగు గుడ్డలు ఇతరులు కొనవచ్చును.

అందరు వడుకవలయునని కాంగ్రెసువారు కోరుచున్నారని కొంద ఆక్షేపించుచున్నారు. లండనునందు ప్రకటింపబడు 'సేవను' పత్రి... వ్రాసెను. — "రాటమును వ్యాపింపచేయుట వెనుకకుపోవుట. ...గంట కాలములో సులభముగ యంత్రములు చేయగలిగిన పనిని పది లెక్కలేని విద్యావంతులు శ్రమపడవలయునని కోరుట విపరీతముగ నున్నది." కాని ఎల్లరు వడుకజాలరను అంశమును ఖద్దరు కార్యమును ప్రతిపాదించినవారు అంగీకరించియేయున్నారు.

## బీదలకు మోక్షము

అందఱు వడుకవలయుననువాదమును కొంతవరకు ఆక్షేపింపవచ్చును. ఒక క్రొత్తఉద్యమము వ్యాపింపవలయువనిన చదువుకొన్నవారు ఆయుద్యమమునందు పనిచేసినగాని సామాన్యజనులు అనుసరింపరు. విద్యావంతులు చేయుపని గౌరవకరమైనదనితలచి సామాన్యులు వారు చేయునట్లు చేయుదురు. కావుననే ప్రారంభమున విద్యావంతులు అందరు వడుకవలయునని మహాత్ముడు కోరెను. కాని నిజముగ ఈరాటము నుపయోగింపవలసినవారు గ్రామములందలి వ్యవసాయదారులు, పనివారు. వారికి వ్యవసాయమువలన వచ్చు ఆదాయము స్వల్పము. పంటలు సమముగ పండకున్న కడుపునిండ కూడు దొరకుట దుర్లభమగును. లక్షలకొలది బీదలకు ఈరాటము ఆర్థికముగ మోక్షము నొసగును.

దేశమునందంతయు గొప్పమార్పు కలుగవలసినపుడు పనివారి యొక్కయేగాక యజమానులయొక్క దృష్టికూడ మారుట అవసరమని ఆర్థికశాస్త్రజ్ఞుడగు జాను స్టూయర్టు మిల్ గారుచెప్పియుండిరి.

## నష్టమైనను స్వదేశీగుడ్డలనే కొనవలెను

ప్రతిగృహమునందును రాటముధ్వని వినబడుచుండి, నేను సూచించిన విధముననే గృహమునకు కావలసిన గుడ్డలు ఆగృహమువారే తయారు చేసికొనుచున్న, గుడ్డల వెల విషయమై ఆలోచించుట అనవసరమగును. విదేశవస్త్రములపోటీ, అధికమగుధరలు మున్నగు ఆక్షేపణలన్నియు అప్రస్తుతములగును. తమగృహములందు తమకు కావలసిన వస్త్రములను తయారుచేసికొనజాలనివారు కొంత దేశభక్తిని చూపవలెను. దేశీయపరిశ్రమలపట్ల సానుభూతి చూపవలెను. మన ప్రభుత్వము జాతీయప్రభుత్వము కాదు. దేశీయ పరిశ్రమలను వృద్ధిచేయవలయునని వారికట్టి యుత్సాహములేదు. ప్రభుత్వమిట్లుండుటవలన మనము దేశక్షేమమును కోరుచు ఈదేశమునందు తయారగు గుడ్డలనే ఆదరింపవలెను. 1906 సంవత్సరమున వాగ్దానమొనర్చిన విధమున నష్టమైనను స్వదేశవస్త్రములనే ధరించుటకు సంకల్పించుకొనవలెను. దీనితోపాటు స్వదేశీగుడ్డలు అధికముగ తయారై వెల అధికము కాకుండునట్లు పనిచేయవలెను. ఇట్లు చేయకున్న రాజకీయోద్రేకము ననుసరించి ఏర్పడు ఖద్దరుఅభిమానము తాత్కాలికమునందుమేగాని శాశ్వతముగ నుండబోదు. ఇష్టమున్నవారు యంత్రములను స్థాపింపవచ్చును. వారిప్రయత్నముల నాక్షేపించువారెవ్వరు నుండరు. కాని మిల్లులను స్థాపించుటవల్ల ఆర్థికసమస్య తృప్తికరముగ పరిష్కరింపబడదు. ధనవిభజనము సమముగ జరుగదు. మిల్లులను స్థాపించుటకు అధికముగ ధనము కావలెను. ఇది ధనవంతులకు సంబంధించినపని. నిజముగ ఈఆర్థికసమస్య అంతమొందవలయునని రాటమే సాధనము. ఏవిధముగ నాలోచించినను రాటముతప్ప వేరుసాధనము కనబడుట లేదు.

## గ్రామములకు మరలుడు

మిత్రులారా! మీరిపుడు, యీపురాతనరాటము, చూడగానే అనుకొనునట్లు నిస్సారమగు ఆర్థికసంపద కాదని నాతో నేకీభవించెదరని తలంచెదను. ఏదో మధ్యయుగమునాటి ప్రాతవస్తువని లెక్కలేకుండ తీసి పారవేయుటకు వీలులేదు. ఆర్థికవేత్తలు నిశ్చయముగ నుండు కాలము పోయినది. మాంచెస్టరునందలి ఆర్థికసిద్ధాంతులు వెనుకటివలె వారి సిద్ధాంతములందు నిరంతరాయముగ విజయమును గాంచుటలేదు. మహామహా ఆర్థికవేత్తలే యీ ఆర్థికశాస్త్రము సరియైనది గాదనియు, చాలవరకు సాంఘికశాస్త్రమనియు, ప్రపంచములో వివిధభాగములందలి సాంఘిక పరిస్థితులు మారుచుండుటతో నదియు మారుచుండుననియు కనుగొనిరి. పారిశ్రామిక విప్లవపు మొదటి మెరపులో, కూలిఖర్చు తగ్గుటయు, కార్మికసామర్థ్యమును పవిత్రములని తలంచినవి అనుమానగ్రస్తము లాయెను. మనుష్యుని మ్రింగివేయు యంత్రసామగ్రి యీ 20 వ శతాబ్దమునందు సిద్ధాంతరూపకముననైనను మనుజునకు యజమానుడుగ గాక సేవకుడాయెను. ఈ యంత్రములవలన గల్గువిసుపుతనము, మొద్దుతనము, తెలివిలేకుండ యేదో త్రిప్పుట మున్నగు నవన్నియు కనుగొనబడెను. "మనుష్యుడున్నాడు, అతని వైపు మరలుడు, గ్రామములకు మరలుడు" అనుమాటయే వినబడుచున్నది. గ్రామములందు కుటుంబమధ్యమున శాంతిముగ పనిజేయు గ్రామస్థునియొక్క వ్యక్తిత్వము, శాంతారోగ్యకార్యమానసములను ఇప్పుడు ఆర్థికవేత్తనుగూడ ఎక్కువ గాన్పించెను. పారిశ్రామిక దేశమగు ఇంగ్లాండులో గూడ 40 సంవత్సరముల క్రిందనే జోసెపు ఛేంబర్లేను గారు '3 ఎకరములకును ఒక ఆవును' ప్రతినిధిగ నుండెను. నేనీవాక్యములను వ్రాయునపుడు బాల్డ్విను ప్రధానమంత్రి గృహపరిశ్రమలను గూర్చి చెప్పినమాటలు జ్ఞప్తికి వచ్చుచున్నవి. ఆయన యేమి చెప్పెనో వినుడు.

"ప్రజలను పల్లెలలో నుంచుటయేగాక, అచటనుండు చిన్న పురాతనపరిశ్రమలు కమ్మరి, రాటము, మాదిగవారల పరిశ్రమలు నాశనముగాకుండ జూచుటకుగూడ ప్రభుత్వమువారు ఆలోచించుచున్నారు."

ఇంగ్లాండులోనే గొప్ప గొప్ప రాజనీతిజ్ఞులు విజ్ఞానవంతులు అట్లు ప్రోత్సహించునపుడు, గృహపరిశ్రమల సంస్కారముగల భారతదేశమున కవి యెంత అవసరమో వేరుగ చెప్పవలయునా? మన సాంఘిక ఆర్థికములకు యెక్కువగ వర్తింపని ఆర్థికాభివృద్ధి సిద్ధాంతములయందున్న గుడ్డిభక్తితో అంతయును పోగొట్టుకొనజాలము.

The Adi-Andhra Bhajan Party, Cocanada




ఆదిమాంధ్రుల భజనసంకీర్తనము - కాకినాడ

The Gandhi Nagar, Cocanada



గాంధి నగరము - కాకినాడ

Members of the Hindestan Seva Mandal, Cocanada



హిందూస్థాన సేవాదళసభ్యులు - కాకినాడ

Lady Volunteers of hte Congress, Cocanada



38-వ జాతీయసభా యువతీసేవాబృందము - కాకినాడ

మనకండ్లయెదుట గాన్పించుచున్న యీ ఆర్థికవిపత్తునే రామ్సే మాక్డొనాల్డుగారు గ్రహించి తమయొక్క 'భారతప్రబోధము' అను గ్రంథమునం దిట్లు వ్రాయుచున్నారు:—

"అభివృద్ధిమార్గమున జరుగు సంగతులగుటచే భారతార్థికమునం దిట్టిమార్పు జరుగవలెనని చెప్పబడెను. ఇది యూ పాశ్చాత్యులు మూర్ఖతతో జేయుసిద్ధాంతము. సంఘనిర్మాణమున విచ్ఛిత్తి గల్గినగాని మోక్షము గలుగదను మాయలో మనమున్నాము. వెనుకటిరోజులలో సంఘజీవనమునందు వివిధప్రయోజనములు అన్యోన్యాంశమునుగ జేయు నిర్మాణమొకటి యుండెడిది. ప్రథమమున దేశమునకు మారకము ముఖ్యమైనది. కామను వెల్తి గలదు, డబ్బును అప్పిచ్చువాడని నిరసించినను ఆయన సంఘమునందు అవసరమాయెను. ఇప్పుడది అంతయును పోయినది. వ్యవసాయదారునకు ఎక్కువపనిగల్గినది. ఆయనదేశము పండిన పంటను మంచిడబ్బు వచ్చును. తనకు కావలసినవాని యన్నిటికిని రూకలనే యిచ్చును. ఆర్థికజాతియంతయు విచ్ఛిన్నమైనది. ఒకపని కింకొక పని మారకము పోయి కొనుకోలునకలసి వచ్చెను. పండినపంట తీసికొనిపోగా దానిఖరీదుమాత్రము మిగులును. ఈదరలు మారుచుండును. డబ్బు అప్పిచ్చువానికి ఇప్పుడు సంఘప్రయోజనము పోయి యితరులపైబడి తినవలసివచ్చెను. తుదకు కాపిటలిసమువలన అది విదేశీయమగుటచే ఇండియాలో [illegible] వినాశమగుచుండెను. పాశ్చాత్యాభివృద్ధిమార్గములు ప్రాచ్యదేశాభివృద్ధిమార్గములు గావు. వెనుకటి పరపతిపద్ధతు లన్నియు తలక్రిందై, కాటకరక్షణోపాయము లన్నియు పోయి వెనుకటి ఆర్థికమంతయు వినాశనమై, యీవినాశనమునుండి అభివృద్ధి వచ్చునని సంతోషించి ఆనందించుచుండుట యేమాత్రమును మంచిది గాదు"

## నిరాఘాటపారిశ్రామికము

ఇట్టి హెచ్చరిక యెప్పుడును గావింపబడలేదు. భారతదేశము సజీవమై యుండవలెనన్న ఈ మాటల సత్యము - జేయ వీలులేదు. స్వాభావికముగ అభివృద్ధి జెందిన పాశ్చాత్యదేశమునందుగూడ యంత్రముల ప్రతిభ విజయవంతము గాలేదు. అట్టితరి వానిని ఇండియాలో తెచ్చి పాతినపుడుమాత్రము విజయమందునా? అమెరికా చూడుడు. ఈ మధ్యనే న్యూయార్కుపట్టణమందు ఆ యంత్రములమధ్య పాడుగాలి పీల్చుట వలన పనిజేయువారల పిల్లలు మామూలు బరువుకన్న 15 పౌనులు తక్కువున్నటుల చదువుచుంటిని. ఇల్లులేక, వాకిలిలేక, డబ్బులేక జనసామాన్యము నిరాఘాటమగు పారిశ్రామికము ననుసరించుచున్నది. మరియొక్క వైపున ధనవంతులు అధికారముతో సంతోషము ననుభవించుచు నెవరైనను సరే తమయుత్తరువు ప్రకారము సంచరించునట్లు చేయుచు, స్వప్రయోజనముల గడపుకొనుచున్నారు. ఇట్టిమహాసంఘర్షణ ముదయించుటచేతనే మార్క్సిజము, లెనినిజము, బోల్షివిజము తలయెత్తి నాగరకత నంతను వమ్ముజేయునట్లు భయపెట్టుచున్నవి.

ఈ విషయము నిరాతంకముగ యథేచ్ఛముగ [illegible] నేని భవిష్యత్తు ఘోరముగ నుండును, ప్రపంచము యథాస్థితి సౌమ్యముగ నుండవలెనన్న, ఈ ప్రకృతి విరుద్ధముగను, మానసికరముగ నుండు విషయములన్నియు రూపుమాయవలయును. [illegible] కట్టి జీవితసౌందర్యభాగ్యము లేదు. అది యంతయు నిస్సారముగనున్నది. సౌందర్యాభిరుచిని బట్టి చూచిన అది క్షంతవ్యమే యగును.

## ఆధునిక నాగరకత

ఆధునిక నాగరకతను గూర్చిన యీ విషయము డాక్టరు ఆర్. ఆస్టిన్ ఫ్రీమనుగారు చక్కగ వర్ణించుచు ఆధునిక నాగరకత వికారమునకును, చేతిపనుల అద్భుతమహిమకును బోల్చిరి. ఆయన యీ యింటివద్ద వడుకు గుడ్డను గూర్చియే వ్రాయుచు నిట్లు వ్రాసెను.

"యంత్రములమీద చౌకగ తయారై రెండుమూడేండ్లు మన దుస్తులను గాక స్వయముగ ఇంటివద్ద వడికి నేసిన గుడ్డలను సగము జీవితము గడపువాడు ధరించు నెడల ఒక పురాతన పరిశ్రమ పునరుద్ధరింపబడును. జాతీయవస్త్రసంస్కారమును అనుభవములోకి దెచ్చుటనుగూర్చి చాల చెప్పవలసియున్నది. మనము కొనువస్తువన్నియు నేపరిస్థితులలో తయారగుచున్నవియో వాని నన్నిటిని తెలిసికొనవలయును. అప్పుడు నోరువాయిలేక ఫ్యాక్టరీ పనివలన తయారగు వస్తువులందుకన్న చేతితో జేసిన వస్తువును జూచినపుడు సంతోషమెక్కువగును. ఇప్పుడు మనస్సులు ఒకఫక్కీకి అలవడినవి. దానికి తగినవస్తువులున్నవి. అవి ఒకదానికొకటి తగ్గిపోయినవి."

## ఇంగ్లాండు భారతపరిశ్రమల చంపినవిధము —

భారతపరిశ్రమలకు రక్షణ నొసంగకుండ, ఇంగ్లాండు వానిని అణచివేయుటకు శక్తినంత నుపయోగించెను. ఇండియాకు ఇంగ్లాండు చేసిన అపాయమునంతను వివరింప గష్టముగ నుండును.

భారతదేశపు నేతగాండ్రకును చిత్రకారులకును గావించిన దురంత అన్యాయములను వివరించుచు పట్టును చుట్టువారల బొటనవ్రేళ్లు తెగగొట్టి చుట్టుటకు వీలులేకుండ జేసినటుల బాల్డుగారు దెలుపుచున్నారు. శిల్పను చరిత్రకారుడు వ్రాయుచు "నిందాశ్చర్య మేమియు లేదనియు; విదేశపు ఉత్పత్తిదారులు రాజకీయ అన్యాయసాధనముల ప్రయోగించి సమానపుగతులతో పోటీ జేయువానికి ఊపిరాడకుండ జేసి" రని వ్రాసెను.

## విద్యావంతుల కొక విజ్ఞప్తి

"లాంకషైరు మూలముగ మనదేశము నీచమై నిరాధారమై పోయినపుడు ఇంకను అచటి గుడ్డలను దెప్పించియే ధరించెదరా?" యని నేను భారతవిద్యావంతుల నడుగుచున్నాను. విదేశపు విలువ గుడ్డ మనశరీరముపయి బరువుగ నుండలేదా? నే నిట్లు మాటాడుట లాంకషైరుపై ద్వేషమువలన గాక, మీరు విద్యావంతులు విదేశీయుల గుడ్డలను తెప్పించక పోయిన యెడల లక్షలకొలది మందికి అన్నము

ప్రేమతో నిట్లు మాటాడితిని. ఇందువల్ల మన పారిశ్రామిక రాజకీయ జీవితమందు నూతనయుగము ప్రవేశించును.

### మహాత్మునకు వినుతి

మిత్రులారా! నే నింతటి దీర్ఘోపన్యాసము గావించి మీకు కష్టము గలుగజేసినందుకు క్షమింపవలెను. మనస్సున కొక విషయము కష్టము గలుగ జేసినపుడు ఆపుకొనుట కష్టము. ఎన్నియో విషయములు బయలుదేరును. నేను చెప్పినది చాలవరకు అనవసరమే. ఏలనగా వాక్కన్న నెక్కువగ మాటల చేతనేగాక జీవితాదర్శమువలన నమ్మహాత్ముని జూచి దాని సత్యమును నమ్మిన మీ యెదుట నేనింతగ జెప్ప వక్కరలేదు. ఆశుష్కశరీరుడు ఖద్దరుఅంగవస్త్రమును ధరించి, మౌన గాంభీర్యముతో భారతదేశమంతయు ప్రబోధము గాంచునటుల జేసెను. ఆయన విధించిన ఆదర్శముల బొందుటకు ఎంతటి కష్టముల నైన బొందునటుల జేసెను. అట్టి మహాత్ముని ప్రబలవిన్నపమునకు నా స్వల్పమాత్రము విన్నపమును తోడు జేసెదను.

నేను ముగించునప్పటికి నాదృష్టి యంతయు ఆ ఎరవాడ జెయిలులో ఇనుపఊచల వెనుక నున్న భారతమహాత్ముని దివ్యపరిశుభ్రాత్మపై బోవుచున్నది. ఆయన భారత మోక్షమార్గము నాలోచించి బోధించి దీవించెను. ఆయన భౌతిక శరీరము అచ్చటనున్నందులకు మనము దుఃఖమును బొంది సిగ్గుపడవలయును. ఐనను ఆత్మ మనతోనే యుండి యెప్పుడు మనము మందమతిలో బడిపోయినను లేవనెత్తుచుండును. ఆ ఆత్మదివ్యాదర్శము మనలను స్వాతంత్ర్యమార్గమున దీసికొని పోవుగాక! మనము అట్టి ఆదర్శపురుషుని నుచితముగ ననుసరింతుము గాక!

గాంధిమహాత్మకు జెయ్

# అఖిలభారత స్వచ్ఛంద సేవకుల మహాసభ - కాకినాడ

## శ్రీయుత జవహరిలాలు నెహ్రూగారి యుద్బోధనము

అధ్యక్షుడగు జవహరలాలు నెహ్రూగా రుపన్యసింపుచు మాతృదేశముయొక్క దాస్యబంధములను తొలగించి విముక్తి యొనర్చుటకును, భారతదేశమునకు సేవయొనర్చుటకును అధికమగు సమర్థతను సంపాదించుట ఎట్లు? అనునదియే ప్రస్తుతసమస్యయని నుడివెను. "స్వాతంత్ర్య వీరులముగా నిచ్చట సమావేశమైతిమి. వీరులవలె మనము కార్యశూరతను గన్పరుపవలెను గాని మాటలతో సంతృప్తినొందరాదు. స్వాతంత్ర్యదేవతయొక్క పీఠముకడ బలియగుటకు సిద్ధముగ నున్న గొప్పస్వచ్ఛంద సేవకదళమును మన మేర్పరుపవలెను. భారత స్వాతంత్ర్య సంపాదనోద్యమమునకు దౌర్జన్యరాహిత్యమే పునాది. అందుచే భారతదేశమున కుపయోగపడు సేవ నొనర్పగోరు స్వచ్ఛందసేవకసంఘములు దౌర్జన్యరాహిత్యమును మూలసూత్రముగా నంగీకరించుట యవసరము."

### క్రమశిక్షణావశ్యకత

భారతదేశములోని స్వచ్ఛందసేవకదళముల పుట్టుకనుగురించియు అభివృద్ధిని గురించియు, ప్రభుత్వమువారు సేవకసంఘములను చట్టవిరుద్ధములుగా నిర్ణయించినపుడు ప్రజ లొసగిన ప్రత్యుత్తరమునుగురించియు నుడువుచు, జాతీయోద్యమమునందు వివిధవిషయములందు విజయము గాకపోయినందువలన గాన్పించులోపములను, నాగపురవిజయము పూర్తియొనర్చునని అధ్యక్షుడు నుడివెను. "వేలకొలది భారతీయ యువకులు ధైర్యముతో బాధల నెదుర్కొని కష్టముల భరించిన విషయమును మీ రెరుగుదురు. అవసరమైనపుడు పిలుపుదగిలినతోడనే ఇంకను వేలకొలది ముందునకు వచ్చెదరనుట కెట్టి సందియమును లేదు. మనస్వచ్ఛంద సేవకులలో క్రమశిక్షణ మెంతశూన్యముగ నున్నదియు, అట్టిస్థితివలన ఇదివరకు మనయుద్యమమునకు ఎంతనష్టము గలిగినదియు మనకందరకును దెలియును. ఇది స్వచ్ఛంద సేవకుల తప్పు గాదు. క్రమశిక్షణను కవాతును నిర్లక్ష్య మొనర్చి మనశక్తినంతను ఉద్బోధనలందును, విజ్ఞాపనలందును వెచ్చించుట మనతప్పు. క్రమశిక్షయు తరిఫీతును గలిగి సైనికులవలె పనిజేయువారు అవసరమా, లేక ధైర్యవంతులును, తరిఫీతులేనివారును బాధల నోర్చి జెయిళ్లకు వెళ్లగలవారు అవసరమా యను ప్రశ్నను మన మిప్పుడు పరిష్కరించుకొనవలెను. తరిఫీతును, క్రమశిక్షయు గల దళము నే సంపాదించుటకు మనము ప్రయత్నింపవలెనని నాదృఢాభిప్రాయము. అట్టిశిక్షణ లేనిది, మనప్రయత్నములును సాహసధైర్యములును సఫలములు గాజాలవు."

### నిర్మాణసూచనలు

తరిఫీతును, క్రమశిక్షయుగల స్వచ్ఛంద సేవకులనుండి కొంతమందిని నిర్మాణకార్యక్రమమునకును కొంతమందిని శాసనతిరస్కారమునకు నిర్ణయింపవలెను. వీరుబాధ్యతాయుతమగు కార్యమునకు నియమింపబడకపూర్వము, కాంగ్రెసు స్వచ్ఛంద సేవకుని ప్రమాణమును గైకొనవలెను. కాంగ్రెసు నాయకులనుండి పూర్తియగు సహాయము లేదని స్వచ్ఛంద సేవకోద్యమము జయప్రదము గాజాలదు. ఈ యుద్యమము ప్రత్యేకముగా నున్నయెడల రెండుశాఖలవారికిని పరస్పరసంఘట్టనోపద్రవము గలుగు నవకాశము గలదు. అందుచే నీయుద్యమము కాంగ్రెసునకు లొంగియుండవలెను. అఖిలభారత జాతీయోపసంఘమువారే ఈయుద్యమమును సరిగ నడపుటకు ఒకవిధానమును నిర్ణయింపవలెను. రాష్ట్రీయకాంగ్రెసుసంఘము ఆయా రాష్ట్రములలో స్వచ్ఛందసేవక సంఘము నేర్పరచి నడపుచుండవలెను. అంతేగాని రాష్ట్రీయసంఘముకంటె తక్కువ సంఘము లెవ్వియు సైనిక సంఘవ్యవహారములలో జోక్యమును పుచ్చుకొనరాదు. వివిధరాష్ట్రీయములలోని సైనిక సంఘముల యన్నిటియందును సహకారము నెలకొల్పుటకు గాను అఖిలభారతస్వచ్ఛంద సైనిక పరిపాలనా సంఘ మొకటి యుండవలెను. ఈ సంఘమువారు కాంగ్రెసు వర్కింగు కమిటీవారిసూచనల ప్రకారము పనిజేయుచుందురు.

ఆకాలీలయొక్క నిజమగు బలము వారి క్రమశిక్షణమునందే ఇమిడియున్నది. స్వచ్ఛంద సేవకసంఘములవారు వారియాదర్శమును గమనించి అందువలన లాభము నందవలెను. చీకటిరోజులు గడచినవి. తిరిగి పని ప్రారంభింపబడుచున్నది. ఇంకను కొన్ని అపజయములు గాన్పించుచుండవచ్చును. కాని దేశముకొరకు పోరాడుటకు ప్రారంభించుటకు ఒక్కశుభశకునమైనను జాలును.

# అఖిలభారత హిందీ సాహిత్యసమ్మేళనము-కాకినాడ

## ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి ఉపన్యాసము

హిందీసాహిత్యసమ్మేళనముయొక్క విశేషాధివేశ సందర్భమునందు ఆంధ్రరాష్ట్రపక్షమున తమకు స్వాగతంబు నొసంగగల భాగ్యము గలిగినందులకు సంతసించుచు నేను మీకీపురమునకు స్వాగతంబు నొసంగుచున్నాను. హిందుస్థానిభాషకు నిలయమైన ప్రయాగక్షేత్రమునకును దక్షిణాపథమునందు గల కాకినాడకును విశేషాంతరము గలదు. కాకినాడ సామాన్యమైనక్రొత్తపట్టణము. కాశీగయాప్రయాగలవలె పుణ్యక్షేత్రము గాని ప్రాచీనపట్టణము గాని కాదు. ఈ సామాన్యపురమునందు సంపన్న గృహస్థులైన తమకు సదుపాయములను గల్పించుట దుర్లభము. పదార్థాభావమువలన లోపములు గలిగినను మా సంకల్పము సత్కారముగ గ్రహించి మా లోపములను మన్నించుదురుగాక. దేశభాషావ్యవహారములం దుత్తరభాగమునకును దక్షిణదేశమునకును భేదమున్నను అనాదిసిద్ధమైన భారతసంస్కారము భారతదేశమును బలవంతమైన భౌతికపాశములచేతను గాక ధర్మయుక్తమైన జ్ఞానపాశముచేతను బంధించుచున్నది. విశాలదృష్టిగల మహర్షులు విజ్ఞానపాశముచేతను భారతవిభాగములను బంధించి విశాలమైన భరతఖండమునందు భావైక్యమును గల్పించిరి. సంస్కృతభాష వేదశాస్త్రములు పురాణాగమములు మతాచారములు సమానప్రయోజనములు నానాప్రాంతములందుగల భారతహృదయములను బంధించుచున్నది. భాషలు వేరైనను భావములు సమానమైనపుడన్యోన్యవిశ్వాసము సులభము. వంగ మహారాష్ట్ర ఘూర్జర కర్ణాటకాంధ్రాదిభాషలు వేరైనను సామాన్యసంస్కారము భేదభావము నంతరింపజేయుచు సహజబాంధవ్యమును పోషించుచున్నది. సామాన్యసంస్కారము గల ప్రజలకు సామాన్యభాషాప్రయోగము సుకరముగనున్నది. సామాన్యసంస్కారము లేని ప్రజలకు సామాన్యభాషాప్రయోగము దుష్కరముగనుండును. సామాన్యసంస్కారము గల భారతప్రజలకు స్వదేశీయమైన హిందుస్థానిభాషను నేర్చుకొనుటయందుగల సౌకర్యములు విదేశీయమైన యాంగ్లభాష నభ్యసించుటయందు గలుగవు. సామాన్యసంస్కారమునకు తోడుగ భాషాబాంధవ్యమును హిందుస్థానిభాషను భరతఖండమునకు సామాన్యభాషనుగ జేయుటకు దగియున్నది.

ఈ యనుకూలపరిస్థితులను వినియోగించి హిందీసాహిత్యప్రచారమును హిందీభాషాప్రచారమును జేయుటకు 1910 వ సంవత్సరమునందు పండితమదనమోహన మాలవీగారియధ్యక్షత క్రిందను కాశీనగరమునందు గూడిన హిందీసాహిత్యసమ్మేళనసభ నేడాంధ్రదేశమునందు గూడుట విచిత్రముగ దోచును. ఈవిచిత్రమునకును నితరవిచిత్రములవలె గాంధిమహాత్ముడు కారణభూతుడు.

హిందీసాహిత్యసమ్మేళన ముపక్రమించిన కార్యమును గాంధిమహాత్ముడు సహజపరిణామమును బోధించెను. హిందుస్థానిభాష భారతభూమికి సహజముగ సామాన్యభాషయై యున్నది. ఈ భాష సులభముగను దేశమునందంతటను తెలియుచున్నది. వీరైనను నీభాషను విజ్ఞానలాభమునకు గాకను నుద్యోగలాభమునకు నేర్చుకొనుచున్నారు. నిరంతరము స్వదేశప్రయాణమున కాంగ్లేయులు సంసిద్ధముగనున్నపుడు ఆంగ్లభాషకును విజ్ఞానమునకును వ్యాపకము గలుగదు.

7 కోట్ల మహమ్మదీయులును 10 కోట్ల హిందూస్థానులును 8 కోట్ల యితరులును...... కోట్ల ప్రజలు గ్రహింపగలరు. ముప్పది కోట్ల ప్రజలయందును 25 కోట్ల ప్రజలకు సామాన్యముగ దెలిసిన హిందుస్థానిభాషను భారతరాష్ట్రభాషనుగ భగవానుడె చేసెను. బ్రిటీషు ప్రభుత్వము కోట్లకొలది రూప్యములను వ్యయముచేసి 150 ఏండ్లు పాటుపడియును 100 కి 9 మంది మాత్రమె ఆంగ్లభాషను నేర్చినవారు గలరు. ముప్పదిమూడు కోట్ల భారతీయులందు 25 కోట్ల ప్రజలకు హిందుస్థానిభాష సహజముగ నర్థమగుచున్నది. నాలుగువందలేండ్లు భరతఖండమును పాలించిన మహమ్మదీయసోదరులకీభాష మాతృభాషవలె నున్నది. ఇంకను 1000 ఏండ్లు గడచినను ఆంగ్లభాష ఎన్నటికిని రాష్ట్రభాష గాజాలదు. ఆంగ్లేయులు భారతభూమిని భాగ్యభోగముల కేర్పడిన పాడియావునుగ జూచుచున్నారుగాని ధర్మారాధనమున కేర్పడిన ధర్మక్షేత్రముగ జూచుటలేదు. సంచులనుగట్టి యాంగ్లభాషను రాష్ట్రభాషను జేయుటకు జేసెడి ప్రయత్నములన్నియును నిరర్థకములై భారతబంధనమునకు దోడ్పడుచున్నవి. పాశ్చాత్యసంసర్గము భారతజీవనప్రవాహమును సంకుచితము చేసినది. భాషయందును భావములందును విజ్ఞానమునందును స్థితిగతులందును పరాధీనస్థితి యేర్పడినది. మనలత్యంతయును మనకు దెలియని విదేశీయభాషమీదను విదేశీయసంస్కారమునందును నిలిచి మనబ్రతుకే దుర్భరమైనది. మిల్టను బైరనాదులమీదను గల యభిమానము మహానుభావులైన పోతనతులసీదాసాదులమీదను లేదు. ఇల్లు ఒళ్లు గుల్లయై ఇరువదేండ్లు శ్రమపడి సాధించినభాషయును విజ్ఞానమును నాత్మోద్ధరణమునకు గాకను ఆత్మబంధనమునకు దోడ్పడుచున్నది. పరాధీనస్థితిని ప్రతిక్షణమును సంస్మరింపజేయుచు దురారాధ్యములైన భాషాసంస్కారములాత్మోద్ధరణమునకు దోడ్పడుట దుర్లభము. దేశోద్ధరణమున కాత్మసమర్పణము చేసిన లోకమాన్యతిలకు లోకమాన్యుని గాంధిమహాత్ముని మహాపరాధులనుగ నిర్ణయించిన సంస్కారమాత్మోద్ధరణమునకు నిరుపయోగము. ఈసత్యమును బాగుగ గ్రహించిన గాంధిమహాత్ముడు హిందీభాషను రాష్ట్రభా

యుటయందు గల యవసరమును గ్రహించి కార్యాచరణ మానుకొనెను. కాంగ్రెసువ్యవహారములందు నిరాటంకముగ నున్న యాంగ్లభాషను దిగద్రోచి హిందీభాషను సింహాసనము నెక్కించి దాని కర్హస్థానము నొసంగి భారతజాతీయజీవనమునందు నూతనశకమును నిర్మించెను. జాతీయ జీవనిర్మాణము స్వల్పసంఖ్యాకులైన యాంగ్లవిద్యాసంభవులనుండి బహుసంఖ్యాకులైన ప్రజాముఖమును జేరినవి. దేశమునం దంతటను హిందీభాషాభ్యాసముమీద నభిలాష గలిగినది. హిందీసాహిత్యవ్యాపనమునకై కంకణముగట్టుకొనిన సాహిత్యసమ్మేళన నిర్వాహకులు చెన్నపురియందు కేంద్రకార్యాలయమును స్థాపించి దక్షిణప్రాంతమునందు హిందీప్రచారమునకు దోడ్పడినవిధమును నాంధ్రదేశమునందలి హిందీప్రచారము విశదము చేయుచున్నది. హిందీప్రచారమున కాంధ్రదేశమునందు ప్రభుత్వావలంబనము గాని ప్రజాదరణము గాని విశేషముగ లేకపోయినను యువజనోత్సాహము వలనను ప్రచారకులయుత్సాహమువలనను ముఖ్యముగ శ్రీయుతులు హరిహరశర్మ హృషీకేశశర్మగారుల పూనికవలనను హిందీప్రచార మతిత్వరితగతిని వ్యాపించినది. ఆంధ్రదేశమునందు వ్యాపించిన విధమునను ద్రవిడకర్ణాటకదేశములందు వ్యాపింపలేదు. హిందీసాహిత్యసమ్మేళనమువారు చెన్నపురియందలి కేంద్రస్థానముద్వారా చేసిన సహాయము మాంధ్రదేశమునందు హిందీప్రచారవ్యాపనమునకు గొంత దోడ్పడినది. అందుల కాంధ్రులపక్షమున కృతజ్ఞతను దెలుపుచున్నది. ముందును హిందీసాహిత్యసమ్మేళనమువా రాంధ్ర హిందీకార్యాలయమునకు పూర్వమువలెనే సహాయము జేయుదురని నమ్ముచున్నాను. ఆంధ్రదేశమునందు హిందీప్రచారము స్వయంసహాయముమీదనే యాధారపడియున్నది. ప్రజల విశ్వాసములే ఈయుద్యమము నింతవరకును బోషించినవి. ముందును నీయుద్యమము నధికతరోత్సాహముతో నాంధ్రులు పోషింపవలసి యుందురు.

ఆంధ్రయువజనులందు హిందీ ప్రచారముపట్ల గల యభిమానమే ఈవిశేషాధివేశనమునకు కారణము. భరతఖండమునందలి సహజమైన భాషాప్రయుక్తరాష్ట్రవిభాగములను బ్రిటీషు ప్రభుత్వ మధ్వాన్నము చేసి దేశభాషలను కుప్పి[illegible]. మూడు నాలుగు దేశభాషలు కలిసియున్న రాష్ట్రమునం దేభాషకును పోషణము లేక అన్ని భాషలును క్షీణించినవి. రాజకీయపరిజ్ఞానము గల కాంగ్రెసు దేశమునందలి సహజమైన భాషాప్రయుక్త భాషావిభాగములను నవలంబించి ప్రజాజీవనమున కుత్తేజము గలుగ జేసినది. ప్రజలు మాతృభాషాముఖమునను వ్యవహారక్రమమును నడుపగల విధము బోధ్యమైనవి. అన్ని వ్యవహారములకును నాంగ్లభాషయె సాధనమను వెఱ్ఱిభావ మంతరించినది. ఆంధ్రదేశమును నొక కాంగ్రెసు ప్రాంతముగను నంగీకరించుటవలననె ఆంధ్రదేశమునందు కాకినాడయందు కాంగ్రెసుగూడుటయును హిందీ సాహిత్యసమ్మేళనము గూడుటయును సాధ్యమైనవి. ప్రత్యేకస్థితివలనను రాజకీయవ్యవహారములందుగలిగిన ప్రయోజనములను సఫలము చేయుటకు గాను హిందీ ప్రచారమునకు ప్రాంతిక కార్యాలయమును స్థాపింప వలయు ననను సంకల్పము గలిగినది. ఆంధ్రదేశమునందు ప్రాంతిక కార్యాలయమును స్థాపించుటవలనను హిందీ ప్రచార మధికవేగముగ జరుగుట నిశ్చయము. ప్రత్యేక వ్యక్తిత్వము గలిగి స్వయంపోషణమున కర్హమైన ప్రాంతములందు ప్రత్యేకకార్యాలయములను నేర్పఱచుటయును వ్యవహారధర్మము. అసంబద్ధకార్యాలయమును పోషించుటకు హిందీసాహిత్యసమ్మేళనము కొంతసహాయమును జేసినను భారమంతయును నాంధ్రులమీదనె యుండు నని యాంధ్రులు గ్రహించి పాటుపడవలసియుందురు.

హిందీప్రచారమును జేయుటయందు సాహిత్యసమ్మేళనమువిషయము కొన్ని సంశయములు గలుగుచున్నవి. హిందీసాహిత్యవ్యాపనమునకును హిందీవ్యాపనమునకును సన్నిహిత సంబంధ మున్నను రెండు విధములైన వికాసములును నుత్తరప్రాంతములందువలె దక్షిణ ప్రాంతములందు సాధ్యము గాదు. ఆంధ్రదేశమునందు హిందీ ప్రచారము వ్యవహారార్థమవసర మగుచున్నది గాని సాహిత్యవ్యాపనార్థమవసరమగుట లేదు. సాహిత్యము మాతృభాషయైన ఆంధ్రభాషాముఖముననె జరుగవలసియున్నది. ఈలక్ష్యమును దిగద్రోయుట వలనను గలిగిన యనర్థపరంపరలను ఆంగ్లభాషాప్రచారము విశదముచేసినది. ప్రజలయందు సహజరీతిని విజ్ఞానవ్యాపనము దుర్లభమైనది. ఆయనర్థజాలములందు తిరిగి [illegible]కుండుటకై ఆంధ్రదేశమునందలి హిందీప్రచారకార్యాలయము శ్రద్ధ వహింపవలయును.

హిందూమహమ్మదీయ సమ్మేళనమునకును భారతజాతీయైక్యతకును స్వధర్మనిర్వహణమునకును స్వాధీనస్థితికిని సాధనంబైన హిందీ ప్రచారవిషయమై మహాసభయందు విషయాన్వేషణము చేయబడి సాధనలు నిర్ణయింపబడును. గాంధి మహాత్ముడు జాతీయవిద్యకు రాటమును, హిందీయు మూలాధారములని చెప్పియుండెను. మహాత్ముని నిర్బంధకాలమందు వారియుపదేశముల నాచరించుచు మన ధర్మమును నిర్వహించి దేశమోక్షమునకు పాటుపడుట మనవిధిగా నున్నది. దేశభక్తుడును త్యాగమూర్తియును విద్యాసంపన్నుడును నైన శ్రీయుత జమనాలాలు బజాజు గారి యాధిపత్యముక్రిందను హిందీ సాహిత్యసమ్మేళనసమావేశము జయప్రదముగ జరుగుటకు భగవంతుని వేడుచు ఆంధ్రదేశపక్షమునను మాస్వాగతంబును గైకొని లోపభూయిష్ఠమైనను భక్తియుక్తమైన యాతిథ్యమును స్వీకరించి మమ్ము కృతార్థులను చేయుటకుగా మిమ్ములను వేడుచున్నాను.

భారతవర్షమున ఏకజాతీయత యేర్పడవలెనన్న ఏకభాషయు ఏకలిపియునుగూడ నుండుట యవసరము. ఏలిపిలో అన్నిశబ్దములను సరిగా వ్రాయవీలగునో ఆలిపియే ఏకలిపిగా నుండవగినది. అట్టి లిపి నాగరీలిపి యొక్కటియే యని నాఅభిప్రాయము. హిందువులు సంస్కృతముతో పాటు ఉరుదుభాషను ముసల్మానులు ఉరుదుభాషతో పాటు సంస్కృతమును (నాగరీ) అభ్యసించి భాషాప్రచార మొనరించి హిందీ ఉరుదుభాషల నభివృద్ధిపొందింపవలెనని గాంధిమహాత్ము డాదేశించెను. దక్షిణాపథమున నివసించుచున్న మనము హిందీ సంస్కృతభాషల నభ్యసించుటకు నాగరీలిపినిగూడ నభ్యసించి మేలుబడయవలెను. ఇష్టమున్నవారు ఉరుదుభాషనుగూడ నభ్యసింపదగును.

## శ్రీయుత బాబూ రాజేంద్రప్రసాదుగారి అధ్యక్షోపన్యాసములోని భాగములు

ప్రపంచమునందలి భిన్నభిన్నములగు రాష్ట్రములయును, జాతులయును చరిత్రమును చూచినచో రాష్ట్రీయతకును భాషాసాహిత్యములకును ఘనిష్ఠమగు సంబంధమున్నట్లు తోచును. ఇట్లుండుట సహజము కూడ. ఏమనగా రాష్ట్రీయతలోనేమి జాతీయతలోనేమి ఐక్యమనునది ప్రధానమగు నంగము. ఇద్యది ఎంత వ్యాపకత్వముతో నున్న నంతటి స్థిరత్వము రాష్ట్రీయతలో కలుగును. ఈ ఐక్యములలో గూడ తక్కిన యన్నిటికిని భాషైక్యమే మూలకందము. రాష్ట్రీయతా నిర్మాణ సాధనములగు భిన్నభిన్నవ్యక్తులు తమతమభావములను పరస్పరము వెల్లడించికొనగల్గిననే భాషైక్యమునకు సార్థకత గల్గును. ఈ మహాకార్యము సాధించుకొనుటకై ఏకభాషావశ్యకత అవసరమగుచున్నది. సాహిత్యమన నేమనుకొంటిరి? మనుష్యజాతియొక్క ఉన్నతాత్యున్నతమును సుందరాతిసుందరమును అగు భావగుచ్ఛమే సాహిత్యము. ఈ గుచ్ఛమునందిమిడియున్న బాహిరమగు సౌందర్యము అంతరమగు సౌగంధ్యము మనస్సులను మోహింపజేయుచున్నది.

భావము తన్వివేచనమును, ఉన్నతిపథము నలంకరింపనంతవఱకును ఆజాతి వివృద్ధి నొందజాలదు. ఎప్పుడీరెండును ఉన్నతిపథము నందగలవో అప్పుడు తద్వికాస మాజాతియొక్క సాహిత్యరూపమున నేయుండగలదు. కనుక నేజాతియొక్క గాని రాష్ట్రముయొక్క గాని విజృంభణముతోపాటు ఆజాతియొక్క గాని రాష్ట్రముయొక్క గాని సాహిత్యము కూడ ఉన్నతిని విజృంభణము నొందుట స్వాభావికమగుచున్నది. ఇట్లే సాహిత్యముయొక్క అవనతికూడ తజ్జాతియొక్క గాని తద్రాష్ట్రముయొక్క గాని పతనస్థితిపై నాధారపడియుండును.

ఉదాహరణమునకై ఇతరప్రమాణము లేల? భరతవర్షముయొక్క చరిత్రను తీసికొనుడు. మహాభారతము రామాయణము ఉపనిషత్తులు మున్నగునవి మనదేశ మత్యున్నతస్థితి నొందిననాడు వ్రాసినవే కదా. బౌద్ధులయొక్క రాజ్యము భరతవర్షమున ఆమూలాగ్రము వ్యాపించి వారియొక్క ప్రభుత్వ గౌరవాదులు ఖండాంతరములకు సైతము ప్రాకిననాడు పాళిభాషయును పాళీసాహిత్యమును వారి సామ్రాజ్యముతోపాటు నిరవధికమగు నౌన్నత్యమును గడించుచు వెలుగ సాగినది. బౌద్ధయుగమునాటి చరిత్రము నెఱింగిన సుప్రసిద్ధ చారిత్రకుడు డాక్టరు రీజు డేవిడ్సు ఏమనినాడో వినుడు — "రాజనైతికస్థితితోపాటు భారతవర్షమునందు భాషాప్రాభవముయొక్క కేంద్రము కూడ మార్పు నొందుచువచ్చినది. తొలుదొల్త ఆ కేంద్రము పంజాబునందును ఆపైని కోసలమునందును ఆ పిమ్మట మగధదేశమునందును ఉండెడిది. చివరకు సంస్కృతభాషయే సమస్తభారతవర్షమునకు ఏకభాషగా నున్ననాడు కూడ పశ్చిమభారతమునందు — (అనగా భరతఖండముయొక్క పశ్చిమప్రాంతములయందు) ఆయా ప్రాంతీయములగు భాష లున్నట్లు తెలియుచున్నది." మఱియును డాక్టరు డేవిడ్సు అభిప్రాయము ననుసరించి బౌద్ధయుగము భారతీయ సాహిత్యముపాలిటికి ఒక స్వర్ణయుగము. బౌద్ధమతముయొక్కయును బౌద్ధసామ్రాజ్యముయొక్కయును అవనతికి పిమ్మట వైదికమా వైదికజాతియును మరల తలయెత్తుటతోపాటుగా సంస్కృతభాషయును తత్సాహిత్యమును కూడ మరల విజృంభించినట్లు పొడగట్టును.

భారతీయచారిత్రకపండితులలో మిక్కిలి ఖ్యాతి వహించిన డాక్టరు భండార్కరుగారు కూడ వ్రాసినారు గదా — "బౌద్ధధర్మము కొంచెమంత తలవాల్పగనే బ్రాహ్మణమతము మెల్లగా విజృంభింపసాగినది. అంతదనుక పాళీభాషద్వారా నిర్వర్తితమగు కార్యమంతయును అది మొదలుకొని సంస్కృతభాషద్వారా నిర్వర్తితము కాసాగినది. ఆకాలపు సంస్కృతభాషయొక్కయును ప్రాంతీయములగు దేశభాషలయొక్కయును చరిత్రమును గమనించినచో రాజనీతియొక్క ఆక్రమణస్థితి గోచరింపగలదు. క్రమక్రమముగా భారతవర్షమునందు మరల హిందూమతము రెండవమాఱు స్థాపితమై గుప్తవంశ్యులగు రాజుల ప్రభుత్వము ఏర్పడిన పిమ్మట సంస్కృతసాహిత్యమునకు గూడ మంచి దినములు వచ్చి పునర్విజృంభణము కలిగినది. మహాకవి కాళిదాసు భట్టబాణుడు మున్నగు కవిపుంగవుల యావిర్భావసౌభాగ్యము ఈ విజృంభణకు గల్గిన ఫలితమే!" — అని.

"గుప్తరాజుల రాజ్యపాలనమున — అనగా దాదాపు క్రీ. ౩౦౦-౬౦౦ వఱకు గల కాలమున — అర్థాత్తు నాలుగయిదు శతాబ్దులలో — అన్నివిధములగు క్షేత్రములందును అత్యధికముగా మనోవికాసస్థితి గలిగినట్టి సమయము. ఈ కాలమును విదేశరాజ్యచరిత్రలతో పోల్పవలసి వచ్చినచో ఆంగ్లచరిత్రమునందలి ఎలిజబెత్తు కాలముతో పోల్పదగియున్నది. భారతవర్షమున కాళిదాసమహాకవియొక్క ప్రతిభయెదుట — ఇంగ్లండులో షేక్స్పియరు నెదుట తక్కిన కవులవలెనే — భారతవర్షపు ఇతరకవులందఱును నిస్తేజస్కులగుచుండిరి. కాని ఎలిజబెత్తునాటి సాహిత్యమెట్లు షేక్స్పియరు లేకున్నను ఉన్నతకోటికి జెందియుండెడిదో, అట్లే భారతవర్షమునందు కూడ కాళిదాసుని గ్రంథములు మిగులక పోయినప్పటికిని, ఇతరకవుల గ్రంథములైనను సాహిత్యదృష్టిని ఆకాలపు అ[illegible]సృష్టిశక్తిని రూపింపగల్గియే యుండెడిది. మృచ్ఛకటిక ముద్రారాక్షసములు కూడ ఈనాటివే యందురు."

ఇక హర్షవర్ధనుని రాజ్యము ఒకవైపు హిమాలయము మొదలు చేసికొని నర్మదామాళవప్రాంతములు ఘూర్జరదేశము సౌరాష్ట్రదేశము వఱకును విస్తృతి నొందినది. సుప్రసిద్ధ చీనాయాత్రికుడు హ్యూయెనుత్సాంగు హర్షవర్ధనుని రాజ్యవ్యవస్థాదులను మిగుల ప్రశంసించుటయే గాక మిక్కిలి ధర్మాత్ముడగు రాజశేఖరుడనియును పొగడియున్నాడు. హర్షవర్ధనుడు మున్నగు గుప్తవంశీయులగు రాజులు కేవలమొక్క ఉత్తరభారతవర్షమునే గాక దక్షిణమున చిట్టచివరవఱకు గూడ తమ రాజ్యమును వ్యాపింపజేసిరి. హర్షవర్ధనుడు కేవలము అద్వితీయుడు. చక్రవర్తిగా మాత్రమే గాక స్వతఃప్రజ్ఞాధికుడగు కవిగాను దార్శనికుడుగాను విఖ్యాతి గన్నవాడు. ఆయన వ్రాసినవ్యాకరణములు నాటకములు మున్నగునవెన్నియో నేటికిని లభించుచున్నవి. "ఉపాధ్యా

...ర్యతి బాణే హృదయవర్తిని" — అన్న ప్రఖ్యాతికి గురియై — ...వ్యప్రపంచమును కాదంబరీరూప కాదంబినీమాలికచేత నలంక...న బాణభట్టు మన యీ హర్షవర్ధనుని ఆస్థానకవియే! ఈ విధము...నే హిందీసాహిత్యముయొక్క చరిత్రమును పరీక్షించినను కూడా — చందబరదాయియొక్క కావ్యరచనము హిందూచక్రవర్తియు హిందూమతప్రాణము అగు పృథ్వీరాజుయొక్క సమయమునను, భూషణకవియొక్క సమ్మానము శివాజీచక్రవర్తియొక్క కాలమునను జరిగినట్టులు కన్పట్టును. కేవలమును ఒక్క హిందీభాషాచరిత్రమే గాక, భారతవర్షమునందలి ఇతరములగు ప్రాంతికభాషలయొక్క స్థితిగతులను పరికించినప్పటికిని ఎచ్చట ఏప్రాంతములలో ఏభాషను మాటలాడుజనులలో రాష్ట్రీయభావము ప్రబుద్ధమై యుండినదో, అచ్చట ఆ ప్రాంతపు ఆ భాషలవారి సాహిత్యమే ఉన్నతశిఖరము నొందినట్టులుగా గూడ కనిపింపక తప్పదు. ప్రస్తుతపు బంగాళీ మరాటీ గుజరాతీ భాషలయొక్క సాహిత్యవివృద్ధియే ఈ పైసిద్ధాంతమునకు ఉదాహరణముగా నుండి సాహిత్యముయొక్క అభ్యున్నతికిని రాష్ట్రీయభావమునకును అన్యోన్యము ఘనిష్ఠమగు సంబంధము కలదని తేటపఱుపగలుగుచున్నవి. ఈ విషయమును ధ్రువపఱుచుటకు యూరపుఖండముయొక్క సాహిత్యచరిత్రము గూడ ప్రబలమగు ప్రమాణము కాగలదు.

[పిమ్మట గ్రీసు ఫ్రాంసు మున్నగు విదేశసంబంధములగు సాహిత్యచరిత్రల వికాసస్థితి చర్చింపబడినది. స్థలాభావమున దాని నిట పరివర్తింపమైతిమి.]

* * * *

నేను మీయొక్క అమూల్యమగు సమయమునంతను విదేశేతిహాసముల నుదాహరించి రాష్ట్రీయతాసాహిత్యములకు గల ఘనిష్ఠమగు సంబంధమును రూపించుటకై వినియోగించితిని. ఇప్పుడు మనము దేశోద్ధారమునకును స్వారాజ్యప్రాప్తికినై అతిమహత్తరమును పవిత్రతమమును అగు సంగ్రామమునందు తగుల్కొని యున్నాము. కాని నామనవి యేమనగా ఐక్యములేని రాష్ట్రీయత వ్యర్థప్రయత్నము. మఱియును రాష్ట్రీయత ఏకతే రాష్ట్రీయవ్యవ[illegible] తనంతదాను సర్వసాధారణమగునట్టి భాషద్వారా తన భావములను వెల్లడింప గోరుచున్నది. నేడు భారతవర్షమునందు అనేకభాషలు వ్యవహరింపబడుచున్నవి. మూడేసిక్రోసుల కొక్కొక్క భాష చొప్పున మాఱుచున్నవన్నను అతిశయోక్తి కాదు. అందునను ముఖ్యములగు ప్రాంతీయభాషలని ప్రసిద్ధిని గడించినవియును, దినదినమును (ప్రాచీనగ్రంథములు మాత్రమే గాక) అనేకగ్రంథములు, క్రొంగ్రొత్తగ విరచింపబడుచున్నవియు నగు బంగాళీ మరాటీ గుజరాతీ అఱవము తెలుగు కన్నడము మలయాళము పంజాబీ సింధీ ఆసామీ ఉరియా మున్నగునవెన్నియో గలవు. ఈప్రాంతీయభాషలు ఆయా ప్రాంతవాసుల అసాధారణమగు ప్రేమకు పాత్రములనుటయు నిజమే. కాని హిందీభాషను రాష్ట్రభాషగా జేయుటకు యత్నించుట యనగా రాష్ట్రీయములును అంతఃప్రాంతీయములు నగు కార్యములను నిర్వర్తించుటకై సర్వవ్యాపియును సర్వజనసాధారణమును అగునట్టి భాష యొకటి యుండవలయు ననుటయే గాని, ఆయాప్రాంతములందలి జనుల ప్రేమకు పాత్రములైన ప్రాంతికభాషలను లోపింపజేయుట గాని వాని స్థానమునందు హిందీభాషకు పట్టాభిషేకము చేయుట గాని ఎంతమాత్రమును గాదు. ఎవ్వరికైనను ఒకవేళ ఇట్టి అభిప్రాయమున్న దనుకొన్నను అది సర్వదా అసంభవము. ఏమనగా బంగాళీ సుందరమగు తన వంగసాహిత్యమును విడువజాలడు. గుజరాతీ తన గుజరాతీసాహిత్యమును కూడను. ఇట్లే తక్కినభాషలు గూడను. అయితే ఒకమాట మాత్రము నిజము అది భరతవర్షమున కంతటికిని ఏదో యొకభాష ఏకభాషగా నుండనిది రాష్ట్రీయకార్యములు చక్కగా నెఱవేఱజాలవు అనుటయే. ఇప్పటికి ముప్పదియెన్మిదేండ్లకు పూర్వము దేశీయమహాజనసభ ఏర్పఱచినప్పుడు అప్పటి నాయకులు కేవలము ఆంగ్లేయమునే మధ్యస్థభాషగా చేకొనగల్గిరి. నాడు మొదలు నేటివఱకు అఖిలభారతవర్షీయము అగు రాష్ట్రీయకార్యముల నిర్వహించుపట్ల ఇంతవఱకు ఆంగ్లమే చాలవఱకు ఉపయోగింపబడుచు వచ్చినది. ఆంగ్లభాషద్వారానే మనదేశముయొక్క రాజకీయభావములు ఆంగ్లభాషాభిజ్ఞులలో ప్రచారమునకు తేబడినవి. మఱియును భారతవర్షమునందలి నవశిక్షితుల సంఘమునందు రాష్ట్రీయభావమును ఆవిర్భవింపజేసిన పుణ్యము నిజముగా నాంగ్లభాషకే దక్కినది. కాని భారతవర్షమునందు ఆంగ్లభాషాశిక్షితులసంఖ్య నేటికి కూడ నూటికి అయిదారుకన్న నెక్కువ కన్పట్టదు. కారణమేమనగా రాష్ట్రీయజీవప్రవాహము ఈకొలదిమందివఱకే ప్రసరించి ఆగిపోవుచున్నది. పోనీ, ఆంగ్లమే సమస్తభారతవర్షమునకు ఏకభాషగా ఎప్పటికైన గాగలదేమో యనుకొందమన్నచో ఆయాశ నిరాశయే! రాష్ట్రీయభావములు భారతవర్షమునందు సర్వే సర్వత్ర - ప్రతి భారతీయుని హృదయమునందు - వాడు ధనికుడైనను దరిద్రుడైనను - స్త్రీయైనను పురుషుడైనను పిల్లలైనను పెద్దలైనను సరియే - సరిసమానముగా వ్యాపింపజేయవలసియుండుట అవసరమగునేని - సర్వసాధారణముగా వాడుకకు రాగల యట్టి ఏకభాషయుండుట అత్యంతము ఆవశ్యకము. పోనీ, ఈ ఏకభాషాజ్ఞానము ఆంగ్లమునకే ఇత్తమనుకొన్నను — నూటయేబదేండ్లకుపైగా ఆంగ్లపాలనము స్థాపింపబడియున్నను, తొంబదేండ్లకుపైగా ఆంగ్లవిద్యాకషాయము దినదినము బలాత్కారముగా త్రాగింపబడుచున్నను, ఇప్పటికి నూటికి ఏ యైదారుగురో ఆంగ్లమును జదువను వ్రాయను నేర్చుకొనగల్గిరన్నచో - ఆంగ్లేయభాష భారతవర్షపు ఏకభాషగా నుండుటకు సర్వదా అర్హత గడించుట అసంభవమని స్పష్టమగుచున్నది కదా! కావుననే మనము దేశభాషల నాశ్రయింపవలసి వచ్చినది.

* * * *

హిందీ ఆయాప్రాంతికములగు భాషలయొక్క స్థానమును ఆక్రమింపజాలదని వెనుకనే చెప్పియుంటిని. దానిని (అనగా హిందీని) సమస్తమగు దేశముయొక్కయును తదంతరప్రాంతీయములయొక్కయును వ్యవహారములపట్టుల వాడవలయును. భరతవర్షమున కంతటికిని

రాష్ట్రభాషగా నుండదగినయోగ్యతగలదు. తక్కినప్రాంతికభాష లెన్ని యున్నను నిజమునకు అవి ప్రాంతికభాషలు మాత్రమే. ఈ ప్రాంతిక భాషలయొక్క సాహిత్యము చాల నుత్కృష్టమైన దనుటయును, ప్రాచీనమైన దనుటయును ప్రస్తుత కాలమునందు వానికి గల గౌరవము ఉత్తమమైన దనియును నేను ఒప్పుకొందును. కాని వాటి ప్రచారము ఆయాప్రాంతములందు మాత్రమేగదా. ఇక హిందీ అన్నచో ఉత్తర భాగము విహారప్రాంతము సంయుక్తరాష్ట్రములు రాజపుత్రసంస్థానములు మధ్యపరగణాలు పంజాబు- ఈ దేశములలోనే గాక సింధు గుజరాతి మహారాష్ట్రము మున్నగు దేశములందున్న జనులందఱికిని చక్కగా తెలిసినభాష. పెద్దపెద్దపట్టణములు మంచిమంచివ్యాపారస్థానములు తీర్థస్థానములు మొదలగు నన్నిచోట్లను హిందీని అర్థము చేసికొని మాటలాడ గల్గుచున్నారు. ఇకను కేవలము దక్షిణదేశమునందు మాత్రము ఇది వ్యాపింపలేదు. రాష్ట్రీయ కార్యములందు నిమగ్నతను వహించి ఆసాము మొదలుకొని జెకోబాబాదావఱకును గల ముఖ్యముఖ్యస్థానముల నన్నిటిని పూనావఱకును, డాకా మొదలుకొని నేను తిరిగితిని. అం[illegible] హిందీతోనే సంభాషించితిని. నేను చూచిన ప్రదేశములలో [illegible]లందఱును నాభావములను చక్కగా నర్థము చేసికొనిరి. స్త్రీల స[illegible]వేశములలోకూడ నేను ప్రసంగించితిని. నా భావముల నన్నిటిని వా[illegible] మనస్సుల కెక్కునట్లుగ నర్పించితిని.

హిందీభాషాసాహిత్యము చాల ప్రాచీనమైనది. సుందరతమమును గౌరవపూర్ణమును నైనది. ఈ విషయమై నేను ప్రత్యేకముగా చెప్ప వలసినదేదియును లేదు. గత అధివేశములు సభాపతుల సంభాషణములను తాము పఠించినచో హిందీసాహిత్యమునందు గల చారిత్రక గ్రంథముల నొకమాఱు వీక్షించినచో దీనియొక్క ప్రాచీనతయును మాధుర్యమును గాంభీర్యమును చిత్తమునకు రాగలవు.

* * * *

మనకు రాష్ట్రీయతను నిర్మించుటకును దేశమునందు ఐక్యమును నెలకొల్పుటకును ఏకభాష మిక్కిలి యవసరము. దేశముయొక్క ఉద్ధరణము ఈ రాష్ట్రీయతపైనను ఐక్యముపైనను ఆధారపడియున్నది.

# అఖిలభారత కిలాఫతు మహాసభ - కాకినాడ

## మౌలానా షౌకతాలీగారి అధ్యక్షోపన్యాసము

మౌలానా షౌకతాలీగారు, తానొక పెద్ద ఉలేమాపండితుడు గాకున్నను, రాజకీయవేత్త గాకున్నను, యీసంవత్సరము సభకు అధ్యక్షునిగ నెన్నుకొనినందులకు ప్రత్యేక సంతోషకృతజ్ఞతలను దెల్పిరి. సామాన్యముగ మహమ్మదీయుల భావమానసముల గ్రహించుటలో, తనసోదరమతపండితులలో, తనకన్న నెక్కువ తెలిసినవారు లేరని ఆయన చెప్పెను.

### బ్రిటిషు ప్రభుత్వము

అంతట ఆయన బ్రిటిషుప్రభుత్వము నెడల మహమ్మదీయులకు గల భావమునుగూర్చి మరల మరల చెప్పెను. "ప్రతిమహమ్మదీయునకును ఇప్పుడు గ్రేటుబ్రిటనునుగూర్చి తెలిసినది. ప్రపంచములో నేభాగమునందైననుసరే మహమ్మదీయునికడ్డకు బోయి ఇస్లాముకు పెద్ద శత్రువెవరని అడిగిన గ్రేటుబ్రిటను ఇంగ్లీషువారనియే ప్రత్యుత్తరము వచ్చును." షౌకతాలీగారింకను ఉపన్యసించుచు ప్రభుత్వమువారు కిలాఫతు నాయకులందరనున్ను వారి హిందూప్రోత్సాహకులనున్ను నిర్బంధింపవచ్చును; లేదా చంపవచ్చును. కాని వారు కిలాఫతు సదుద్యమమును మాత్రము చంపజాలరు. (హర్షధ్వనులు) అట్టిప్రయత్నము లన్నియు సామ్రాజ్యవిచ్ఛిన్నమునకు దారిదీయును. "అన్నిసామ్రాజ్యములును ప్రపంచములోని భాగ్యము లన్నియుగూడ పవిత్రస్థలములపై యెదురు దిరిగి ఒకఅంగుళము ఒక గజ్వంతమైనను తాకజాలవని నేను మరల చెప్పుచున్నాను. బ్రిటిషుప్రభుత్వము విదేశాంగవిధానమును ప్రాచ్యవిధానమును మార్చుకొని సంస్కరించుకొనవలెను. లేకున్నయెడల మహమ్మదీయున కెవనికిగాని శాంతమానస ముండదు. నేను ప్రభుత్వమునకును సామ్రాజ్యమునకును విరోధినని బహిరంగముగ జెప్పుచున్నాను. ప్రభుత్వమువారు వెనుకకు మరలవలెనని నేను చెప్పునపుడు ఆ ప్రభుత్వమునకు కాలకూటవిషము నొసంగకుండ బ్రిటిషుసామ్రాజ్యము రక్షింపబడి జాతీయాస్తిక్య మేర్పడుటకై మంచిసలహా నిచ్చుచున్నానని చెప్పెదను."

### ద్వేషము లేదు ప్రేమయే

షౌకతాలీగారింకను ఉపన్యసించుచు తనకును తనసోదరునకును ఇస్లాముపై ప్రేమలేదనియు, వారు దేశభక్తులు గారనియు ప్రభుత్వమువారునిందించుచు వారికి బ్రిటిషువారియెడ ద్వేషముమాత్రము గలదందురని చెప్పిరి. ఈసందర్భమున ఆయన ఓపియం ఆఫీసరుగ 17 ఏండ్లు పనిజేసినట్లును, ఆయనసోదరునకును బ్రిటిషువారియెడ ప్రేమ గలదనియు ఎన్నెన్నియో విషయములు చెప్పెను. ఆయనసజాతివారు గూడ మొన్నమొన్నటివరకును బ్రిటిషువారియెడ అమితభక్తిగల్గి హిందువుల హక్కుల నణచివేసి యితర మహమ్మదీయదేశముల బానిసలుగ జేయుటలో సహాయముగూడ జేసిరి. అటుల భక్తిగల మహమ్మదీయులే యిపుడు బ్రిటిషువారెట్టివారో కనుగొనిరి. ప్రభుత్వకార్యనిర్వాహకసభ్యులుగ నున్న మహమ్మదీయులు సర్ మహమ్మదు షఫీ, సర్ అబ్దుల్ రహిమాన్ మున్నగు వంటివారలకు గూడ వారిహృదయాంతరాళములందు కిలాఫతువాంఛితములతో సంపూర్ణాంగీకారము గలదని ఆయన నిర్భయముగ జెప్పెను.

### జజీరతులు అరబు

షౌకతాలీగారింకను నుపన్యసించుచు జజిరతులు అరబును మహమ్మదీయులకు వదలివేయవలెనని కోరెను. బ్రిటిషువారు ప్రాచ్య

యూరోపియను ప్రభుత్వములతోగాని, మహమ్మదీయులతోగాని స్నేహభావముతో లేరనియు మహమ్మదీయులతో నైనను యుద్ధము జేయవచ్చిన భారతమహమ్మదీయులు తిరోధించెద రనియు, ఆయన ఇంకను హెచ్చరించెను.

## ఆఫ్ఘనిస్థానము

ఆయన ముఖ్యవిషయముగ ఆఫ్ఘనిస్థానముమాట చెప్పి బ్రిటిషువారు యిదివరలో లంచములకు దిగి ఆఫ్ఘనులను వినీతిపరుల జేసిరని నిందించిరి. సరిహద్దులందు కోట్లకొలది వృథాగా పాతిపెట్టబడెను. ఆఫ్ఘనుల యిండ్లును స్త్రీలును పిల్లలును హతము జేయబడెను. సరిహద్దుపాలనావిధాన మంతయును మార్పగావలయును. ఆఫ్ఘనులతో నెట్టిజోక్యము గలుగకుండ స్వతంత్రముగ జీవించునటుల వదలివేయవలయును. ఆసమస్య యెంతటిబెదిరింపులతోగాని యుద్ధముతో గాని పరిష్కారము గాదు. ప్రభుత్వమువారు ఆఫ్ఘనిస్థానమునకు శాంతిస్థాపకులగు డాను, మహమ్మదాలీగారలు మున్నగు కాంగ్రెసునాయకులను పంపిన వారు శాశ్వతమిత్రత్వము నెట్లు చేకూర్చెదరో చూడవలయును. ప్రక్కనున్న మహమ్మదీయ రాజ్యముతో పోరాటము వచ్చినపుడు అందు బ్రిటిషుసిపాయిలే, బ్రిటిషుధనాగారమునుండి ఖర్చుతోనే పోరాడవలెనని ఆయన విశదము జేసెను. (హర్షము)

## కిలాఫతు ఉద్యమము

ఆగాఖానుగారి లేఖను ప్రచురించుటవలన ఫలితముగ నీమధ్య వచ్చిన కిలాఫతువివాదమునుగూర్చి చెప్పుచు ఆయనకు మీర్ అసదు ఆలీగారియొక్కయు ఆగాఖానుగారియొక్కయు చిత్తశుద్ధియందు సంకోచ మేమియు లేదనియు, సహనముతో నుండి ఆలోచింపవలెననియు గోరిరి. కిలాఫతునుగూర్చి విశదము జేయుటకు వారిరాయబారము అంగోరాకును, యితరస్థలములకును పోనున్నది. ఆగాఖానుగారు వ్రాసినట్టి వ్రాతలు సరియైనవైనను భారతమహమ్మదీయుల భావములను వారు గమనింపకపోవుటవలన భంగకరముగనే యుండును. బ్రిటిషువారు ఏమేమో ఆశపెట్టుటవలన అరబ్బులు అత్యాశాపరులైరని ఆయన భావము. అరబ్బులయెడ మహమ్మదీయులకు ప్రేమ గలదని హామీ జేయుచు పవిత్రస్థలములు ప్రపంచములోని మహమ్మదీయులందరకును జెందియున్నవని ఆయన ప్రకటించెను. ఐతే కిలాఫతుఉద్యమము విజయవంతముగ ముగియుటకు వారు మరల పైకిలేచి పనిజేయుచుండవలెననియు, యిప్పుడు మరల ప్రబోధము గాంచుచున్న ఉత్సాహమును జూచి, యిదివరకున్న దేశమును యెక్కువగ ప్రబోధము గాంచుటకు నాలుగునెలలు చాలుననియు ఆయన చెప్పెను. పనిజేయుట కిప్పుడే నిజమైన అవకాశము గలదు. ప్రచారకులు కావలయును. వారు తమ శక్తినంతను యీపనికే ధారపోయునటుల వారిని కిలాఫతునిధినుండియే పోషింపవలెను. శత్రువులు నిరాధారముగ, నిధులవినియోగము గూర్చి జేయువిమర్శనములవల్ల విధినిర్వర్తనమునుండి వెనుదీయరాదు.

## సంగతాన్ శుద్ధి ఉద్యమములు

జాతివిద్వేషముల గూర్చి చెప్పుచు సంగతాను, శుద్ధి ఉద్యమములు యీసమయమున రావలసినవి కావని జెప్పి మహమ్మదీయులు వానివలన అనవసరముగ ఉద్వేగమును బొందిరని విచారించి జమైతులు ఉలేమావారుగూడ అందుకొంతవరకు పాల్గొనినందులకు చింతను దెల్పిరి. ఏమైనను సరే, వారు కిలాఫతు ప్రశ్ననుండి వేరువిధముగ తమశక్తిని త్రిప్పరాదు.

గోహత్యను సంపూర్ణముగ మానివేయుటయే మంచిదని ఆయన వ్యక్తాభిప్రాయము. కాని జాతీయప్రభుత్వ మేర్పడి ఒకటియో రెండో కోట్లను వెచ్చించి మేకలసంఖ్య వృద్ధియగునట్లుచేసి గొఱ్ఱెమాంసము ధరతగ్గునటుల జేసినచో యిది సాధ్యము కాగలదు.

తుదకు ముగించుచు తమమతస్థులు మరిపవిత్రస్థలములు స్వాతంత్ర్యము బొందుటకై పనిజేయవలెనని విజ్ఞప్తి జేయుచును, బ్రిటిషు ప్రభుత్వము అమెరికా ఐర్లాండు దేశములందువలె అంతయు పోకముందు వెనుకకు మరలవలెననియు విజ్ఞప్తి చేసిరి.

# యావద్భారత గ్రంథాలయమహాసభ - కాకినాడ

## శ్రీయుత జయకరుగారి అధ్యక్షోపన్యాసము

పదిసంవత్సరములనుండి చక్కగ వృద్ధిచెందుచున్న ఆంధ్రగ్రంథాలయోద్యమకార్యవిధానమును పరిశీలించుటకు నాకు అవకాశమేర్పడినందులకు సంతసించుచున్నాను. ఆంధ్రదేశమున నేను కొంచెముగ పర్యటన మొనర్చినను ఆంధ్రగ్రామములు తమప్రాచీనసహజసౌందర్యము కాపాడుకొనియున్నవి. పాశ్చాత్యనాగరికతాభివృద్ధివల్ల ప్రస్తుతము గ్రామములసౌందర్యము అంతరించుచున్నకాలమున ఆంధ్రులు తమగ్రామముల సౌందర్యము కాపాడుకొనుచుండుట ప్రశంసనీయము. ఆంధ్రుల ప్రాచీనసాంప్రదాయములు నాగరికత విజ్ఞానము వారి గ్రంథాలయోద్యమమునందు ప్రకటింపబడినవి. ఆంధ్రగ్రంథాలయోద్యమము ప్రాచీనపద్ధతుల ననుసరించి అవసరమగు పాశ్చాత్యపద్ధతులనుకూడ కొంతవరకు అనుసరించెను. ఆంధ్రగ్రంథాలయము కేవలము పుస్తకభాండాగారముగ లేదు. ఆయా గ్రామములందు సాంఘికరాజకీయ వర్తవాణిజ్యాది విషయములందు సదభిప్రాయములను కలుగజేయుటకు ఈగ్రంథాలయములు యత్నించుచున్నవి. కొన్నిగ్రంథాలయములవారు సాంఘికసేవ చేయుచున్నారు. మరికొందరు పోటీపందెముల నేర్పరచుచున్నారు. ఈవిధమున సంపూర్ణాభివృద్ధి గాంచునట్లు ప్రయత్నించిన యస్. వి. నరసింహారావుగారికి ఇతరులకు వందనము లర్పించుచున్నాము.

మహారాష్ట్రమునందు కూడ గ్రంథాలయోద్యమము వ్యాపించుచున్నది. 120 ప్రతిష్ఠాపన లున్నవి. ఇతరరాష్ట్రములందు ఇట్టి ఉద్దేశములతోనే కొందరు పనిచేయుచున్నారు. చెన్నపురియందు జరిగిన యావద్భారతగ్రంథాలయమహాసభ ప్రథమసమావేశమున తీర్మానింపబడిన విధమున యావద్భారతగ్రంథాలయసంఘమును స్థాపించుట అవసరము.

# భారతదేశీయ సంఘ సంస్కరణ మహాసభ - కాకినాడ

## శ్రీయుత దివానుబహాదరు సర్ టి. సదాశివ అయ్యరుగారి అధ్యక్షోపన్యాసములోని కొన్ని భాగములు

ప్రియమగు సోదరీమణులారా, సోదరులారా!

నన్నీ మహాసభ కధ్యక్షత వహింపుడని కోరినందులకు నేను మీకెల్లరకును కృతజ్ఞుడను. బొంబాయియందు దీనమధ్య డాక్టరు అనిబెసెంటుగారి యధ్యక్షత క్రింద సమావేశమైన సంఘప్రచారకులసమావేశమునందువలె పెద్దవిషయములనుగాక, హిందూసంఘములోని ప్రస్తుతపు ఆచారములకు సంబంధించిన సంస్కరణములను చర్చించుటకే ఇట్టి సభ లుద్దేశింపబడినవని నేను తలంచుచున్నాను "భారతదేశీయ" సంఘ సంస్కరణమహాసభ యను పేరు కొంత అపార్థములకవకాశ మిచ్చును. మన మహమ్మదీయ క్రైస్తవసోదరుల, సోదరీమణుల సంఘములందలి లోపముల నీ సమావేశములందు చర్చించుటయే లేదు. ఒకవేళ వారిలో సుప్రసిద్ధులగు హిందువులు క్రైస్తవులు ఈ మహాసభకు సానుభూతి గలిగి వచ్చి యుండినను, ఉపన్యసించినను గూడ మనము వారి లోపములను గూర్చియు వారి దురాచారముల గూర్చియు మాటలాడుట అధికప్రసంగముగ వారు భావింతురేమో యనియు నేను తలంచుచున్నాను. కనుక "అఖిలభారత హిందూసంస్కరణ మహాసభ" యను పేరు ప్రస్తుతపుపేరుకన్న పెద్దదిగ నుండినను, అపోహల కవకాశ మీయకుండవచ్చును.

### మన కార్యక్రమము

ఈ సందర్భములలో మనపని స్పష్టమైనది. ౧. హిందూకులములు. ౨. హిందూస్త్రీల యభ్యున్నతి. 3. ఆహార, పానీయముల శుచిత్వము, హిందూదాంపత్యము. ౪. ఉన్నతకులములని వ్యవహరింపబడెడు సంఘములవారి విదేశాటనము. ౫. హిందూనిమ్నజాతులు. వారు దేవాలయములోనికి ప్రవేశించుట.

### ప్రస్తుతపు కులములు పోవలెను.

నేను మొట్టమొదట కులములనుగూర్చి ముచ్చటించెదను. ఈ విషయమై కఠినభాష నుపయోగించినయెడల మీరు నన్ను మన్నింతురుగాక! తీయని మృదువచనములు జడమతుల మాంద్యమునుండి పురిగొల్పజాలవని ఆరంస్ట్రాంగు అను ఆంగ్లేయుడొకడు చెప్పియుండెను. పురుషసూక్తమునుబట్టి యాలోచించునెడల, మతము మానవాళిని అధ్యాత్మికదృష్టివంకకు త్రిప్పుటకు మాఱుగ, మనము మతమును ద్రవ్యార్జనసాధనమునకై యెటుల క్రిందికి లాగితిమో వింతగుచున్నది. విమర్శజ్ఞానముతో పలువురు బైబిలులోని ప్రాతసిద్ధాంతములను కొన్నిటిని మార్చిరి. అయినను బైబిలునకు విలువ అట్లే యున్నది. అట్లుండుటయేగాక, నవీనశాస్త్రపరిచయముబట్టి చదువను చదువను బైబిలువంకను ఎక్కువగ పూజించుచున్నారు. ఈదేశమునందు ఆంగ్లేయవిద్య నభ్యసించిన భారతీయులు హేతువాదమునకు చెల్లని పండితుల యభిప్రాయములనే తలల కెక్కించుకొనియుందురు, మనజాతికే విమర్శనాధిక్యత తక్కువ. మనము ప్రశ్నలు చర్చలు, సూక్ష్మభేదములందుమాత్రము కాలమును గడపుదుము. ప్రస్తుతపుకులములపద్ధతి కఠినమైనది. ప్రాతకాపుది. నేటిపరిస్థితులకు సరిపోవునదికాదు. నేడు ఆచరణలో నున్నట్టి పద్ధతిపోవలెను. మొదట మహనీయుడు వైవస్వతమనువు స్థాపించిన కాలమున ఆకులాచారములవలన అనేకశతాబ్దములవరకును సంఘమునకు లాభకరముగ నుండెను కాని ఆకులాచారములు నేడు సంఘమునకు అభ్యంతరములై సంఘాభివృద్ధిని వక్రతపరచుచున్నవి. బ్రాహ్మణశూద్ర నామములు ఇప్పుడేమాత్రమును బ్రాహ్మణుని, శూద్రుని లక్షణములను గాని, వృత్తులను గాని సూచించుటలేదు. నేడు హిందువుల్లను బ్రాహ్మణు అని శూద్రులని ప్రత్యేకముగ వ్యవహరించుట వికృతమైనది. ఆబ్కారి కంట్రాక్టరులు, తప్పుసాక్ష్యమిచ్చువారు, సేద్యముచేయువారు, వర్తకులు, ధనస్వాములుగను, శూద్రులలో ప్రభుత్వకార్యనిర్వాహకసభ్యులు, రాజులు జమీందారులు గురువులు. మన ది. బ. వేంకటరత్నంనాయుడుగారు, బాబు భగవాన్దాసు సర్ జె సి. బోసుల వంటి బోధకులును గలరు. బీదవారికి అప్పిచ్చి వారిని కొల్లగొట్టి వారి కుటుంబములను నిర్మూలముగ గావించెడి బ్రాహ్మణులను కొందరను నెఱుంగుదును. ఆబ్రాహ్మణులే అద్వైతము, అహింస, అనునీతులను చెప్పుచుందురు. ఈనిజమగు వర్ణసంకరము కేవల రక్తసంకరమునకన్నను నీచమైనది. హిందూసంఘమున మతబోధకులుగ ప్రసిద్ధిజెందిన కేశవచంద్రసేను, వివేకానంద, సర్ జె. సి. బోసు, సర్ పి. సి. రే, గాంధియోగి, ప్రొఫెసరు వేంకటరత్నం, రామలింగస్వామియోగి, బాబుభగవాన్దాసు మున్నగు మహనీయులు జన్మతః బ్రాహ్మణేతరులైనపుడు బ్రాహ్మణేతరులలో ఏకొలదిమంది మాత్రమే అట్టివారుందురని వాదించుట వ్యర్థప్రసంగముగ నుండును. మనము కలియుగమునం దున్నాము. మానవులీపరిణామము ననుసరించి మన సంఘాచారములను సవరించుకొనుచుండవలెను. నాలుగు యుగములందును, ఆయాపరిస్థితులనుబట్టి భగవంతుడే తన యాకృతిని తనదేహమును మార్చుకొనెనని మన మెఱుంగుదుము. కలియుగమునందు జపతపములను గావించుటకు జన్మతః శూద్రుడైనను అనర్హుడు కాడని ఉత్తరరామాయణమునుబట్టి మనము స్పష్టముగ గ్రహించుచుంటిమి. బ్రాహ్మణత్వమునకు ఋజుప్రవర్తనయే గాని పుట్టుకయును, సంస్కారమును వేదపఠనమును గావని మహాభారతము తెలుపుచున్నది. మనువు చెప్పినదేమి? "విద్యావిహీనుడైన బ్రాహ్మణుడు కొయ్యయేనుగు తోలుజింక, వంటివాడు. బ్రాహ్మణుడు విద్య నభ్యసించి మతబోధయందు కాలము గడుపక ఇతరవృత్తులందు ప్రవేశించెనేని ఆ జన్మమునందే బ్రాహ్మణత్వమునకు అనర్హుడు.

పుట్టుకవలన బ్రాహ్మణుడును, బ్రాహ్మణుడు ప్రవర్తనము శూద్రుడును అగుచున్నారు. ఈ క్రమమే క్షత్రియునికిని, వైశ్యునికిని గూడ అన్వయించును. ముఖ్యముగ తారతమ్యము గావించు ప్రవర్తనగాని పుట్టుకగాదు." బ్రిటిషు మదరాసు రాజధానియందు నిజముగు బ్రాహ్మణులని వ్యవహరింపదగిన వారు ఒకవందమంది యైనను, కలరని నాకుతోచదు. స్వదేశసంస్థానములు గాక, బ్రిటిషు మదరాసురాష్ట్రమున సుమారు 3 కోట్ల ముప్పదిలక్షల మంది హిందువులు ఉన్నారు. వారిలో జన్మతః 1 కోటి అర్ధలక్షలమంది బ్రాహ్మణు లున్నారు. వృత్తినిబట్టి $1\frac{1}{2}$ లక్షమంది బ్రాహ్మణులు ఉన్నట్లు మదింపువేయబడినది. కాని వీరిలో వంటవారు, దేవాలయములలో చాకిరి చేయువారు, పురోహితులు, తాము చదువు మంత్రముల యర్థముల తెలిసికొనక అక్రమముగ నుపయోగించెడి పంచాఙ్గపు బ్రాహ్మణులు, భిక్షమెత్తుకొను వారు గలరు. ఉపాధ్యాయులలో జీతమునకై కాలముగడపువారు ప్రాథమికవిద్యాలయములందలి యుపాధ్యాయులు గలరు. వీరిని తక్కువతరగతి వైశ్యులనుగ పరిగణింపదగును. బీదరికమునందే యుండవలెనని ప్రతిజ్ఞగైకొని ఏపదిదినముల పోషణకన్న నెక్కువపదార్థములను శేకరించుకొనినవారు, అట్టిస్వార్థత్యాగపరులు, సేవాపరాయణులు సుమారు వందమందికన్న ఎక్కువలేరు. ఈ వందమందిలోను అనేకులు జన్మతః బ్రాహ్మణులు.

## జన్మయా, ప్రవర్తనయా?

మన మందరమును మొదటిలేక స్వాయంభువమను సంతతివారము. ఒకమనువువెంబడి మరియొక మనువు పరంపరగ వచ్చుచు ప్రత్యేక జాతిని ఏర్పరుచుకొనుచుండెను. మనము ఆర్యులము. 7-వ లేక వైవస్వతమనువు సంతతి వారము. చైనా, బర్మా, జపానులం దుండెడి జాతుల ఆదిస్థాపక ఆదిపురుషుడు చాక్షుషమనువునుండి వచ్చినవాడే ఈ వైవస్వతమనువు. కనుక మనమందరమును మానవులము, ఒకేరక్తము, మన నాళములందు ప్రవహించుచున్నది. కులము మొదటలేదని పురాణములయందే స్పష్టము గావింపబడినది. ఈ కులము అవసరమునుబట్టి మొదట త్రేతాయుగమునం దారంభమయ్యెను. కలియుగమునందు మానవుని నిజకులమును కనుగొనుటకు స్వభావము, జ్ఞానము, వృత్తి నే ఆలోచింపవలెనని మధ్యకాలపు మహనీయులును సిద్ధాంతీకరించుచుండిరి. ప్రస్తుతకాలమున మదరాసురాజధానిలోని హిందువు లనేకులు స్వభావమును బట్టియు, వృత్తిని బట్టియు వైశ్యులు. వారిని బ్రాహ్మణులని గాని శూద్రులనిగాని పిలుచుట చోద్యముగ కన్పించును. వైశ్యులము కాబట్టి మనకు ఉపనయనమును, గాయత్రి గలవు. మొదల్యారులు, పిళ్లెలు, నాయడులు, కమ్మలు, రెడ్లు, అయ్యర్లు, అయ్యంగార్లు, రావులు, ఆచార్యులు అందరును చాలవరకు వైశ్యులే. అయినను కోమటిలోనివారికి గూడ వైశ్యులని వ్యవహరించుకొనుట కధికారము లేకుండునటుల కొందరు బ్రాహ్మణనామధారులు సన్యాసు లని వ్యవహరింపబడెడు వారిచే శ్రీముఖముల బంపునటుల చేయుచున్నారు.

మదరాసు హిందువులు శూద్రులని వ్యవహరింపదగినవారు 3 కోట్ల 8 లక్షలలో 2 కోట్లమంది యున్నారు. శూద్రుడనుపదమునకు ఒక గొప్ప అర్థమును, ఒకతక్కువఅర్థమును గలవు. స్పష్టమైనభక్తితో కొలుచువాడు శూద్రుడని గొప్పభావము. ఎట్టిగురువును నిష్కల్మష స్వతంత్రాలోచనము లేక దేహదార్ఢ్యము ననుసరించిన పనులను చేయువాడు శూద్రుడని తక్కువభావము. అట్టిశూద్రులు ప్రస్తుతము చాల కొలదిమంది మాత్రమే యున్నారు. నేను పైన ఒకచోట చెప్పినటుల హిందువు లనేకు లిప్పుడు, కులమును బట్టియేమైన వైశ్యులు. నామి త్రులు వి. గోవిందపిళ్లె (తిరువనంతపురం రిటైర్డుజడ్జి) సర్ శంకరనాయరుల వంటి వారిని శూద్రులని వ్యవహరించుట అసహ్యము, అవమానకరము. తిరువాన్కూరు కోర్టులలో సాక్ష్యమిచ్చుటకు ఎవరైన నాయరులు వచ్చునపుడు, వారు వాఙ్మూలమునందు శూద్రులుగ భావింపబడుచున్నారు. నిమ్నజాతులలో ననేకులు స్వభావము, వృత్తినిబట్టి వైశ్యులుగ పరిగణింపబడ దగినవారు ఉన్నారు. మదరాసు సెన్ససు రిపోర్టును బట్టిచూడ, 1000 మంది పంచములలో 320 మంది భూస్వాములుగను రయితులుగను నున్నారు. ఈ 320 మందియు గాయత్రీమంత్రము నేర్చుకొనుటకర్హులు. భాగ్యమువలన నైతికాభివృద్ధి కడ్డుకలుగవచ్చునని ఏసుక్రీస్తు చెప్పియుండెను. భాగ్యవంతులందు కన్న బీదవారియందు నిమ్నజాతులయందు సుగుణములను వెదకుటకు ప్రయత్నింపవలె నని సి. ఎఫ్. ఆండ్రూసుగారు తెలిపియుండిన యభిప్రాయముతో నేను ఏకీభవించుచున్నాను. మానవసంఘాభివృద్ధికి నాలుగుకులములును అవసరమనుట నిర్వివాదాంశము. ఒక్క కృతయుగమునందుమాత్ర మెట్టిభేదములును లేక వేలకొలది సంవత్సరములకాలము సుఖముగ గడచెను నాలుగు కులములకును ముఖ్యముగ నుండెడి గుణములు నాలుగు గలవు. వానిని అన్నిటిని జనసముదాయలాభనిమిత్తమై యుపయోగింపవలెను. రాజసము అధికమై, ఆశ హెచ్చినపుడు ఆయా కాలమునకు దగినట్లు ఒక్కకులము అవకాశములను గైకొని ఇతరకులముల నణచుటకు ప్రయత్నించుచుండును. ఈకలియుగమునందు, పోరాటములు, పోటీలు ఎక్కువగ నుండునపుడు సహకారము, సమానత్వముమీద నాధారపడెడి ఒకేకుల ముండవలెను. కలియుగమునందు రెండేరెండు కులము లుండవలెనని తమిళయోగిని అవయారు చెప్పెను. స్వార్థత్యాగము గావించువారు ఇతరుల కొసగువారు ఒకకులము. రెండవకులమువారు తక్కువకులము. స్వలాభపరులు, భోగులు. భారతదేశమున లక్షలకొలది సన్యాసనామధారు లున్నారు. వారిలో ననేకులు గంజాయి, నల్లమందు, సారాయి, మున్నగుదురభ్యాసములకు లోనై తక్కువ కులమునం దుండదగిన వారు. వీరు తమ మాంద్యమును వదలి భారతదేశమునకు లాభకరముగ నుండునటుల చేయుట మనకర్తవ్యము. ప్రస్తుత మున్నడు వందలకొలది భేదములు ధర్మసూత్రముల నాధారపడి యుండుటలేదు. చాలవరకును అవి సంఘవైకల్యమును సూచించును. స్వార్థపరులు స్వార్థరహితులు ధర్మమార్గావలంబనులు అధర్మప్రవర్తకులు అను రెండు తెగలనే గుర్తింపదగును.

ఈ కులములను గూర్చి ఇంతదూరము చర్చించినందులకు మీరు నన్ను క్షమింతురు గాక. హిందూసంఘములోని దురాచారము లన్నియు నీకులభేదములపైననే ఆధారపడియుండును గావున దీనిని పరిష్కరించిన గాని ఆదురాచారములు తొలగకను నుద్దేశ్యముతోనే నట్లు చేయవలసివచ్చెను.

## హిందూస్త్రీలు

నేను సూచించిన అయిదు ముఖ్యాంశములలో హిందు స్త్రీల నుద్ధరించుట రెండవది. వ్యవసాయము కూలిపనిచేసి జీవించు కుటుంబములలో స్త్రీలుకూడ పనిచేయవలసినవారగుటచే నితరతరగతులవారికన్న వారిలో పురుషులకును స్త్రీలకును సమానమగు స్వాతంత్ర్యము లున్నవి. విద్యావిషయములందును, సాంఘికవిషయములందును, ఆధ్యాత్మిక విషయములందును పురుషులతోబాటు స్త్రీలుకూడ అభివృద్ధిగాంచుట యవసరము. కేవలము పురుషులఅభివృద్ధివల్లనే మన కోరికలన్నియు నీడేరజాలవు స్త్రీలు అన్నివిధముల నభివృద్ధిగాంచుట సంఘమునకే లాభకరమగును ఉత్తరహిందూస్థానమున వాడుకయందున్న ఘోషాపద్ధతి అంతమొందవలెను.

## బాల్యవివాహము

బాల్యవివాహమును గురించి మార్గరెటు కజిన్సు సతి ఈక్రింది విధమున వ్రాసియుండెను:—బాలికలు రజస్వల కాగానే వారిని తల్లులుగ మార్చుచు సంసారభారమును తలకు చుట్టి విద్యావిషయములందు గాని మరి ఇతరవిషయములందు గాని వృద్ధిగాంచుటకు అవకాశమియ్యకుండుట విపరీతముగ నున్నది. పది పండ్రెండు సంవత్సరములు నిండగానే బాలికలు పాఠశాలలకు పంపబడరు. అదిమొదలు రజస్వల అగునంతవరకు ఇంటియందు ఖైదువలె నుంచబడుదురు. వంటచేయుట తప్ప మిగిలిన ఎట్టివిద్యయందు ఆబాలికలకు శిక్ష ఇయ్యకూడదు. కొన్ని కొన్ని కుటుంబములలో బాలికలు చదువుకొనుట సంగీతము నేర్చుకొనుట తప్పుగ భావింపబడుచున్నది. గడపదాటి వెలుపలకు పోగూడదు. దేహపరిశ్రమ యుండదు. ఎవరో మొద్దుబాలికలుతప్ప ఇతరులు ఎట్టి విపరీత నిర్బంధములవల్ల ఉత్సాహహీనులై క్రమముగ వివేకము సూక్ష్మబుద్ధి లేనివారయ్యెదరు. మతము పేరుచెప్పి పౌరులు హింసింపబడుచున్న విధముననే పాతివ్రత్యమను పేరిట హిందూమహమ్మదీయ స్త్రీలు అణగద్రొక్కబడుచున్నారు. దేశాభివృద్ధికి కాని జ్ఞానాభివృద్ధికి గాని ఎట్టి అవకాశము లేదు. చదువుటకు అవకాశముండదు. ఇతరులతో మాటాడుటకు అవకాశములేదు. కడకు శుభ్రమగు గాలిని పీల్చుటకుగూడ వీలు లేదు. జీవితమునందు అనుభవములవల్ల జ్ఞానము పొందుటకు అవకాశము లేక ఎట్టి స్వాతంత్ర్యములేక వ్యర్థమగువిధమున జీవితములను గడపుచుందురు. సిగ్గువల్లను భయమువల్లను పీడింపబడుచు, పరిచయములేని భర్తనుకూడి స్త్రీలు, వంశోద్ధారకమగు ప్రథమగర్భమును దాల్చుచున్నారు."

పురుషులు స్త్రీలకు తోడ్పడుట అనవసరము. కాని వారిని అనవసరముగ పీడింపక వారి అభివృద్ధివిషయమై కొంత సానుభూతి చూపిన చాలునని వివేకానందగారు చెప్పియుండిరి. శాంతము, ఓర్పు, ఉత్సాహము పట్టుదల మనస్త్రీలకు సహజగుణములుగ నున్నవి. స్మృతి, ధృతి, ఇవి స్త్రీలయందు మూర్తీభవించి యున్నవని భగ. యందు 10 వ అధ్యాయమున శ్రీకృష్ణుడు చెప్పియుండెను.

## వివాహ సమస్య

ఒకభర్తకు ఒకభార్యయుండుట ఈకాలమునకు అన్నివిధముల ఉన్నతాదర్శమై యున్నది. విద్యాభ్యాసము ముగించిన యువకుడు స్త్రీలకు కావలసినవిద్య పొందిన యువతిని పెండ్లాడుట శ్రేష్ఠమగు వివాహము. వంశమును వృద్ధిచేయుట దేహమును ఆత్మను పరిశుభ్రముగ నుంచుకొనుట ఇవి ధర్మబద్ధమగు పుణ్యకార్యములు. పురుషులు స్త్రీలు భిన్నదృష్టులు గలవారగుటచే వారిరువురును కలసి సాంఘికఆధ్యాత్మిక మతవిషయక సంసారధర్మములను నిర్వహించుట వివాహముయొక్క ముఖ్యోద్దేశము. ఇంద్రియసుఖములు ధర్మవిరుద్ధములు కావు. స్త్రీలు పురుషులు సమానహక్కులు బాధ్యతలు గలవారై సంసారధర్మమును గ్రహించుటను వివాహకార్యము సూచించుచున్నది. పూర్వకాలమున మహర్షులు వీరులు సంపూర్ణవిద్యావంతులగు స్త్రీలకు పుట్టియున్నారు. పురుషుని గర్వమువల్లను స్వార్థపరత్వమువల్లను స్త్రీలు అణగద్రొక్కబడుచున్న ఈకాలమునందు ఒక్కవీరునినైనను మనము చూచుట లేదు. ఈ విపరీతపరిస్థితులకు కారకులు మనమే అగుటచే ఈ విపరీతఫలితముల నంతమొనరించుశక్తి మనకున్నదని అనిబిసెంటుగారు చెప్పియుండిరి. ఇదంతయు కర్మఫలితమని దురభిప్రాయపడుట తప్పు. ఈ విషయమై సర్.జానువుడ్రాఫ్ గారు చెప్పినమాటల నీదిగువ నుదాహరించుచున్నాను.—"పురుషులు స్త్రీలు మహాశక్తిగలవారు. వారికిగల సంకల్పబలము ననుసరించి వారిశక్తి వికసించుచుండును. మన మెట్లుండవలయునని సంకల్పించుకొనెదమో అట్లే మనముండగలము. మనము మహాశక్తియందొక భాగమని ప్రతివారు గ్రహించిన అద్భుతమగు ఫలితము ఏర్పడును."

వివాహమంత్రములందు వరుడు కన్యను ఈ క్రిందివిధముగ బోధించును:—

"గృహమునకు అధికారిణిగ నుండుటకై నీవు నీ గృహమునకు పొమ్ము. గృహాధికారిణి యగుటచే మతధర్మముల కొనసాగింపుము. మన మిరువురము గలసి ఏడడుగులు నడుచుటచే మనమిరువురము సంసారమునందు భాగస్థులమైతిమి. నిన్ను విడిచి నేను నన్ను విడచి నీవు వేఱుగనుండుటకు వీలులేదు. మన మిరువురము కలసి యుండెదము. అన్యోన్యప్రేమతో అన్యోన్యమైత్రితో కష్టసుఖములను కలసి అనుభవించుచుండెదము."

## ఆహారము, పానీయము, దాంపత్యము

ఇది మూడవ విషయము. స్వల్పమగు అల్కహాలుతో కూడిన మద్యము పాశ్చాత్యులకు అపరిశుద్ధమగు పానీయము కాజాలదు. కాని అనాదినుండి మద్యమును నిషేధించుచున్న కుటుంబమునకు చేరిన మహమ్మదీయునకు అది అపరిశుద్ధమగుపానీయ మగును. ప్రాచీనకాలమునుండి

ము నిషేధించినబ్రాహ్మణుల కది అపరిశుద్ధమగుపానీయము. ...గు పానీయములను మత్తుకలుగజేయు గంజాయి, నల్లమందు, ... ఋగ్వేదమునందలి మంత్రములు నిషేధించుచున్నవి. పొగాకు ...డ అపరిశుద్ధమైనదే. దేహమునందు తమోగుణమును వృద్ధిచేయునది అపరిశుద్ధమైనదిగ గ్రహింపవలెను. ప్రాణాధారమునకును ప్రాణబలమునకును గాక కేవలము జిహ్వేంద్రియచాపల్యమునకు తిను ఆహారమే అపరిశుద్ధమని చెప్పవలసియున్నది. రజోగుణమును వృద్ధిచేయుపానీయము కొంతవఱకు అపరిశుద్ధమైనదనియే చెప్పవలసియున్నది.

పైని వివరించిన సూత్రములను ఆధారముగ గైకొని శుభ్రమగు ఆహారమును పానమును గ్రహించుచు దేహమును శుచిగనుంచుకొనుట అవసరము. ఆహారవిధానమునందు అకస్మాత్తుగ మార్పు కలుగజేసిన ఇబ్బంది కలుగును. మద్యపానమునందలివిషమును వెలుపలికి తఱిమివేయుటకై దేహమునందలి శుభ్రమగు రక్తము ప్రయత్నించుచుండును. మద్యపానము అధికమైన రక్తముచేయవలసిన యీపని మరింత అధికమై దేహదార్ఢ్యమునకు వినాశకరమగును. ఇంతేకాక ఆధ్యాత్మికవినాశమునకు ఆధారభూతమగు రక్తనాళముల పటుత్వమును మద్యపానము క్షీణింపజేయును. రాజయోగము నభ్యసింపదలచినవారు మద్యమును సంపూర్ణముగ విసర్జింపవలెను. ద్విజులు (బ్రహ్మక్షత్రియ వైశ్యులు) తెలియక మద్యము రుచిచూచిన నైన నూతన యజ్ఞోపవీతములను ధరించవలయునని మన ధర్మశాస్త్రమునం దున్నది.

## దృష్టిదోషము

ఆహారవిషయములందుకూడ ఈసూత్రములే అనువర్తించును. మాంసశాకాహారములం దేవి అపరిశుద్ధములో మనధర్మశాస్త్రమునందును ఇతర స్మృతులందును వివరింపబడినది. ఉల్లిపాయలు మున్నగునవి తమోగుణమును, మిరపకాయలు మున్నగునవి రజోగుణమును వృద్ధిజేయును. సత్త్వగుణ ప్రధానులు, రజోగుణప్రధానులు, తమోగుణ ప్రధానులు ఇష్టపడు ఆహారము భగవద్గీతయందలి 17 వ అధ్యాయమున వివరింపబడినది. పాసిపోయిన ఆహారము చల్ది ఆహారము తమోగుణమును వృద్ధిచేయును. శుభ్రమైనవియు, రుచితోగూడి నవస్తువులు సత్వగుణమును వృద్ధిచేయును. భక్తితోను ప్రేమతోను ఇయ్యబడుఆహారము శక్తిగలుగజేయును. తనపై భక్తిగలశూద్రసేవకునిచేతి ఆహారమును బ్రాహ్మణుడు భుజించుట తప్పుకాదు. దక్షిణదేశమున ఆచరణయందున్న దృష్టిదోష సిద్ధాంతము శాస్త్రసమ్మతము కాదని చెప్పవలసియున్నది. ఈ ఆచారము వివిధసంఘములందలి విభేదములను అధికముచేయుచున్నది. పూర్వాచారపరాయణులగు బ్రాహ్మణులకన్న కొంతమంది ఆంగ్లేయు లెంతయో పరిశుభ్రముగ నుందురు. పూర్వాచార పరాయణులగు బ్రాహ్మణులు కొందఱు అపరిశుద్ధమగుదుర్వాసనతో కూడిన నీటితో ముఖప్రక్షాళన మొనర్చుకొని స్నానముచేసి వీధులయందొకవంక మడిగపోవుచుండుట ఆశ్చర్యము కలుగజేయుచున్నవి

ఇవన్నియు మతసాంప్రదాయముల భావార్థమును గ్రహింపక కేవలము కర్మకాండతో తృప్తిపడుటవల్ల కలుగు అనర్థములు. క్రియ మీద దృష్టియేగాని ఫలితముపై దృష్టిలేదు. స్నానము చేయుట ముఖ్యముగ పరిగణింపబడుచున్నది. కాని దేహశుచి ప్రధానముగ భావింపబడుచున్నది. మతాచారములు సాంప్రదాయములు ఇట్లు విపరీతముగ వ్యాపించుటను పూర్వమునుండియు భక్తులు ఖండించుచుండిరి. దేవాలయములందు దృష్టిదోషముగాని పంక్తిదోషముగాని లేదు. దేవునికి నివేదింపబడిన ఆహారము ఇతరజాతులవారిచే స్పృశింపబడినను పరిశుద్ధమైనదిగనే పరిగణింపబడుచున్నది. పైన సూచించినవిధమున మతాచారములు విపరీతముగ అవలంబింపబడకుండుటకై వట్టిపద్ధతులు ఏర్పడినవి. దేవాలయములం దాచరణయందున్న పద్ధతిని గృహములందుగూడ అవలంబించుట తప్పుకాదు. వైష్ణవులందు ఈ వైపరీత్యము అధికముగ నున్నది.

ప్రార్థనకొఱకు పాశ్చాత్యులు ఆదివారమును ప్రత్యేకించినారు. ఆదివారమునాటి భక్తి శనివారము కడపటివఱకు జీవితమును ప్రోత్సహించుచు పుణ్య[illegible]ర్తనమునకు మార్గదర్శిగనుండవలయునను ఉద్దేశముతో ఈ ఆచారము ఏర్పడినది. కాని ఆదివారమునకు ఇతరవారములకును సంపూర్ణముగ భేదముండవలయునని కాని ఇతరవారములందు తప్పు చేయవచ్చునని గాని ఉద్దేశము కాదు ఇట్లే దేవాలయములందు అవలంబింపబడు పద్ధతులు మనకు ఆదర్శములు. గృహమునందుకూడ అవలంబింపదగినవి కాని వేఱులేదు

ఇతరవర్ణములవారిచ్చు ధనమును పుచ్చుకొని ఆహారము తిను బ్రాహ్మణుడు, ధనమిచ్చువారుచూచిన దృష్టిదోషమేర్పడునని తలచుట విపరీతముగ నున్నది. పరస్పరప్రేమవల్లను భగవన్నామోచ్చారణవల్లను వ్యక్తులు తమ పవిత్రతను కాపాడుకొనవచ్చును.

## దాంపత్యము

స్త్రీపురుషసంబంధ పవిత్రతను గురించి కొంత చెప్పుట అవసరము వ్యభిచారము ౨ విధములు. కామముతో పరస్త్రీని చూచుట కూడ వ్యభిచారమగుచున్నది. మనసునందు వ్యభిచారచింత గలుగుట కూడ ఒక విధమగు వ్యభిచారమని క్రీస్తు చెప్పినారు. స్త్రీపురుష సంబంధములందు పవిత్రత కాపాడుకొనవలయుననిన శుభ్రమగు ఆహారము పానము గ్రహించుట, తగువిధమున దేహదార్ఢ్యమును కాపాడుకొనుట, సృష్టేంద్రియములపట్ల గౌరవభావ ముంచుకొనుట అవసరము. కామోద్రేకమును అణచుకొనుటకు శక్తిలేనపుడు వివాహమాడుట శ్రేష్ఠము. వివాహ ఉద్దేశమును ముందే వివరించితిని. కొన్ని తిథులయందు దంపతుల సంయోగమును మనశాస్త్రములు నిషేధించుచున్నవి. భార్య గర్భము దాల్చినపిమ్మట స్త్రీపురుషసంబంధము విసర్జనీయము. "స్వస్త్రీగమన మపి పరిసంఖ్య"అని చెప్పబడినది. వేదమునందు సూచింపబడిన జీవబలి, సురాపానము, స్త్రీపురుషసంబంధములు అపూర్వ విధులు కావు. కేవలము పారిసంఖ్యవిధులు. ఉద్రేకమును ప్రతిఘటింప శక్తిలేని మానవులకొరకు ఈవిధులు ఏర్పరుపబడినవి. కామమును అణగద్రొక్కుటకు వీలులేకుండిన, దుర్వ్యాపారమువలన మానవుడు అధోగతిపాలు గాకుండుటకై వివాహపద్ధతి ఏర్పఱుపబడినది. కొంతమంది

తమజ్ఞానమును దుర్వినియోగ మొనర్చి కేవలము తుచ్ఛమగుఇంద్రియసుఖమును సంపూర్ణముగ అనుభవించుటకు ప్రయత్నించుచుందురు. ఇట్టివారు జంతువులకన్న అధములు. జంతువుల కొక కాల ముండును.

### పడుపువృత్తి

సంఘమందలి దుష్ప్రవర్తనములు ప్రపంచమునందలి అన్ని దేశములందును అధికమగుచున్నవి. హిందూసంఘమున వ్యభిచారమే వృత్తిగాగలజాతి యొకటియున్నది. ఈసమస్యక్లిష్టమైనది. ఇట్టి విషయములను మఱుగునందుంచుటవల్ల లాభము కలుగదు. ఈవిషయములను ప్రస్తావించుటకూడ తప్పనికొందఱు అభిప్రాయపడుచున్నారు. దేహదార్ఢ్యమును శుచిత్వమును కాపాడుటకేర్పడిన ఉపనయనము బ్రహ్మచర్యజీవితము ప్రస్తుతము నిష్ప్రయోజనమై కేవలము క్రియాకలాపముతో మిగియుచున్నది. సంఘమునందలి ఈలోపములు దోషములు అంతమొందించుటకు శక్తినియ్యవలయునని భగవంతుని కోరుచున్నాను. ఈవిషయమై ఎట్టిసలహా ఇచ్చుటకు నాకు శక్తిగాని అనుభవముగాని లేదు. సాంఘికదుర్వ్యాపారముల తీవ్రతను తగ్గించుటకు వ్యభిచారమే వృత్తిగనుంచుకొను జాతి నొకదానిని ఏర్పఱుచుటవల్ల లాభముండునని పూర్వము కొందరు అభిప్రాయపడిరి. ఏవగింపు గలిగించు ఈసూచన నిష్ప్రయోజనమని అనుభవమువల్ల స్పష్టమగుచున్నది. దక్షిణఇండియాలో కొంతమంది భోగమువారు తమవృత్తిని విడనాడి వివాహము చేసికొనుటకు యత్నించుచున్నారు.

ప్రస్తుత మిట్టివివాహములు అధికముగ జరుగుచున్నవి.

డాక్టరు గోరుగారి చట్టము ననుసరించి ఇట్టి వివాహములు చట్టసమ్మతములగుచున్నవి. భోగముజాతివారు బాలికలను దత్తుతీసికొనుటను కొంతవఱకు నిషేధింపవలెను. ఇట్టి సదుద్దేశముతో ఎవరైనను ఒకబిల్లు నుపపాదింప నుద్దేశించిన పూర్వాచారపరాయణు లందఱు గొల్లని గోలపెట్టెదరు. రజస్వలావివాహమును చట్టసమ్మతి మొనర్ప గౌ॥ శాస్త్రిగారు యత్నింపగ మతసాంప్రదాయములు ధ్వంసముచేయబడుచున్నవని పూర్వాచార పరాయణులు గొప్ప ఆందోళన మొనర్చిరి.

పూర్వాచారములనుండి తప్పించుకొనుట కష్టముగ నున్నవి.

ఈ విషయమై ఈశ్వరచంద్ర విద్యాసాగరు డిట్లుచెప్పెను:—

"ఆచారమా! నీబలము అద్వితీయమైనది. నీశక్తికి అంతులేదు. శాస్త్రప్రమాణముకన్న నీకు ఎక్కువ అధికార మున్నది. క్రమము అక్రమము అను విచక్షణ నీకు లేదు. ఆచారము శాస్త్రమునకు విరుద్ధముగ నున్నను ఆచారమే పూర్వమగుచున్నది. మతసాంప్రదాయములను తిరస్కరించినవారు ఆచారబద్ధులైనంతమాత్రమున సంఘమునందు గౌరవింపబడుచున్నారు. శాస్త్రములగౌరవము అంతమొందినది. సోదరులారా! ఈవైపరీత్యమును అంతమొందింప మీరు ప్రయత్నింపవలెను. శాస్త్రములను ఆధారముగ గైకొనుడు. చాలకాలమునుండి ఆచరణయందున్న చెడువాడుకలను అంతమొందింపుడు. ఈ ఆచారములవల్ల మనము తప్పుదారులయందు ప్రవర్తించుచున్నాము. భర్తృవిహీనలపట్ల కటికమనస్కుల మగుచున్నాము. యుక్తాయుక్తవిచక్షణ లేక పుణ్యపాపపరిశీలనము లేక ఇట్లు ఆచారమునకు దాసులమైపోయము.

### విదేశప్రయాణము

హిందువులప్రాచీనచారిత్రను, ఋగ్వేదమునందలి ఓడప్రయాణముల వర్ణనలను, అరేబియా, సిరియా, పర్షియా దేశములకును భారతదేశమునకుగల వ్యాపారసంబంధమును, చదువువారికి, హిందువులలో ముఖ్యముగ వైశ్యులు ఓడప్రయాణముల చేయుచుండిరని స్పష్టముగ విదితకాగలదు. విదేశములందు సంచరించిన సోదరవైశ్యులను నేటి వైశ్యుల వెలిబెట్టి జూచుట విపరీతముగనున్నది. విదేశములు మోటుస్థితిలో నుండినపుడు, నాగరకులగు హిందువు లచ్చటకు వెడలి కొన్నిదినము లుండి నివాస మేర్పరుచుకొనుట ఏవగింపబడుచుండెను. పూర్వకాలమున హిందూరాజు లనేకులు సముద్రముల దాటి దిగ్విజయయాత్ర సల్పుచుండిరి. శ్రీకృష్ణభగవానుడుకూడ తన మనోహరమగు ద్వారకానగరము సముద్రమధ్యమున కట్టించుకొని ఆరోగ్యవసతుల నన్నిటిని ఒప్పి యుండునటులు ఏర్పాటుచేసెను. ఎవరైన ఆయనను చూడవలసినచో, వారు సముద్రమును దాటవలసి యుండెను. బ్రాహ్మణోత్తము లట్లే చేయుచుండిరి. ఒక్కశిశుపాలుడుమాత్రము శ్రీకృష్ణుడు సముద్రమధ్యమున నివాస మేర్పఱుచుకొని సంరక్షించుకొనినందులకు ఆయన నాక్షేపించెను. మోటువిదేశములకు బోయి శాశ్వతమగు నివాసముల నేర్పరుచుకొనిన కొన్ని ఆర్యకుటుంబములు తమవ్యక్తిత్వమును, తమనాగరకమును పోగొట్టుకొనినందున, మధ్యకాలమున సముద్రప్రయాణము నిషేధింపబడెను. ఇప్పుడు ఇంగ్లాండు, అమెరికా, జపానుమున్నగు విదేశములందు భారతదేశమునందు కొన్ని కొన్ని భాగములందు నాగరకత హెచ్చుగ నున్నది. గతశతాబ్దమధ్యమునుండి సుమారరువది సంవత్సరములక్రిందటివఱకును, వివేచన లేనియువకులకు విదేశములకు వెడలుటవలన జాతీయతకు వికలత్వము గలుగునను భయ ముండెను. కాని ఇప్పుడావిధముగ భయపడవలసినయవసరము లేదు.

మీరుమిక్కిలి కొంతకాలము దేశమును విడిచి విదేశములకు వెడలినయెడల, భారతీయుల దేశాభిమానము హెచ్చునవనియు తలంపవచ్చును. గాంధి మహాత్ముడే విదేశములందు కొంతకాలము నివసించకయుండిన, ఆయన ఇంతటి దృఢమగు దేశభక్తుడై యుండజాలడనియు నేను తలంచుచున్నాను. విదేశములందుండుటవలన హిందువులలోని యుపసంఘములకే యైకమత్యము గలిగినటుల, హిందువులును, మహమ్మదీయులును భారతక్రైస్తవులును, కలిసి ఏకభావమున పనిచేయుదురు ఏకోద్దేశ్యము ననుష్ఠించినగాని, ఒకేవిధముగ కార్యమునుసాధించుటయందవిదేశములందు జాత్యాధిక్యతభావమును గలిగియుండినపుడు ఆ భా ములను ఎదుర్కొనుటయందుగాని జాతీయ ఐకమత్యము అభివృద్ధియగచునే యుండెను. విదేశములందు కూడినవివిధమతస్థులకును అన్యోన్య మతసహనభావము, ఏర్పడెను. భారతీయులు విదేశములందు కూ మన భారతమాతనుగూర్చి సంస్మరించుకొనినపుడుగాని, స్వదేశమునకు ప్రయాణము కావలెనను అభిలాష జనించినపుడుగాని, జాతి, మతభే

రింపకుండెను. వంటపాత్రలను ముట్టరాదు, కపటాచార ంటరానితనము మున్నగునవి విదేశయాత్రలవలన పోవును. ణము, మన పవిత్రదేశమునందలి భాగములకు వెడలుట సనోవికాసమునకు, మానవాళియెడ ప్రేమ మున్నగు గుణములకు డ్పడును. మనయువకులు విద్యార్థులు జపాను, అమెరికా, ఇంగ్లాండు దేశములకు బోయిరేని దేహకష్టము నెడల వారి కుండెడి నిర్లక్ష్య భావము మాసిపోవును.

విదేశప్రయాణముల గావించినందులకు సంఘబహిష్కరణము గావించుట ఈకాలమున ఆత్మవినాశకరముగ నుండును. వివేకానంద స్వామిని మలబారు దేవాలయమునుండి వెడల నడిపినపుడు "ఈభాగము ఉన్మత్తులనివాసస్థానమని నేనూహింపనైతి" నని చెప్పెను. సర్ శంకరనాయరుగారు ఇంగ్లాండుకు వెళ్లినందున, ఆయనను మలబారు దేవాలయములలోనికి రానీయరు. భగవత్ప్రేరణగల మహనీయుడు దేవ దైన విదేశములందు సంచరించి భారతదేశమున ప్రచారము గావించునపుడు, హిందువు లాయనను బహిష్కరించి వెడలగొట్టుదురా! ఇట్టి వైపరీత్యము లంతమొందుగాక! ఒక దేశమునుండి మరియొక దేశమునకు ఎట్టినిర్బంధములేక జనులు పోవుచుండుట తప్పని కొందరు వాదించుచున్నారు. ఆఫ్రికా, ఆస్ట్రేలియా అమెరికా దేశములందు శ్వేతజాతుల వారు భారతీయుల రాకను నిషేధింపవచ్చును. కాని అన్నివిషయములందును ఔదార్యము ప్రకటించుట భారతీయుల లక్షణము. నాకు రాజకీయ విషయములందు అధికముగ అనుభవములేదు. కాని దక్షిణాఫ్రికాయందు భారతీయులపట్ల ఆంగ్లేయులు అన్యాయముగ ప్రవర్తించుచున్నారని చెప్పి దక్షిణాఫ్రికా శ్వేతజాతులవారిపట్ల భారతీయులు అన్యాయముగను క్రమముగను ప్రవర్తించుట రాజకీయధర్మమైనను నే నాపద్ధతిని ఎంతమాత్రము ఆమోదింపను. పుణ్యభూమియగు భారతఖండము ఒక ప్రత్యేకప్రదేశము కాదు. దేవీస్వరూపము. ఆదేవికి అందరిపట్లను అవ్యాజమగుప్రేమ గలదు. శ్వేతజాతులవారైనను భారతదేశక్షేమముకోరు ఆండ్రూసు, నివేదిత, బెసాంటు మున్నగువారిపై భారతమాతకు అధికమగుప్రీతిగలదు. ఇట్టివారీదేశమునం దుండుట అన్నివిధముల భారతదేశమునకు లాభకరము. కావున నే దేశవృద్ధి గాంచవలయుననియు, క్రమక్రమముగ ప్రపంచమునందలి అన్నిజాతులవారికిని ఐకమత్యము కుదురునట్లు భగవంతు డనుగ్రహించుగాక యని ప్రార్థించుచున్నాను.

## నిమ్న జాతులు

ఇంక నిమ్నజాతులవిషయమై కొంత చెప్పెదను. దివ్యజ్ఞానసమాజస్థాపకులలో నొకరు నిమ్నజాతుల అభివృద్ధికి నధికముగ పాటుపడుచుండిరి. మానవులలో కడపటి తరగతులకు చేరిన జాతులవారిని సంరక్షించుట, అభివృద్ధికిదెచ్చుట పరమేశ్వరారాధన యగుచున్నదని క్రీస్తు చెప్పెను. మహమ్మదుప్రవక్తకూడ ఇట్లే చెప్పియుండెను. క్రైస్తవ మహమ్మదీయ మతగురువులు, ఆర్యసమాజ, బ్రహ్మసమాజములకు చేరిన వారు, ఇతరసేవకసంఘములు నిమ్నజాతులయభివృద్ధికి నధికముగ పాటుపడుచున్నారు. నిమ్నజాతులకు విద్యగరపి వారితో కలసియుండుట వల్ల వారు వృద్ధిచెందెదరని నా మిత్రుడొకడు చక్కగ సలహా ఇచ్చియుండెను. ఎన్నియోతరములనుండి వారిట్లు అణగద్రొక్కబడియుండుటచే వారి కిప్పుడు మనసత్సంకల్పములందెట్టి విశ్వాసము లేకున్నది.

వ్యక్తుల పవిత్రతను కాపాడుకొనుట యావశ్యకము కాని పవిత్రత చెడిపోవునను భయముతో సూర్యోదయము మొదలు మరల సూర్యోదయమువఱకు ప్రతిమనుష్యునకు దూరముగపోవుచు ఒకటే పిచ్చి భ్రమయే యుండుటవల్ల పవిత్రత క్షీణించునే గాని వృద్ధిజెందదు. అపవిత్రలగు ఇతర స్త్రీలను తాకగూడదని స్త్రీలు చీరకొంగులను దగ్గరకు లాగుకొనెదరు. బ్రాహ్మణులు వీథులందుపోవుచు మాలవారిని చూచినకసరి దూరముగ పొమ్మని చెప్పెదరు. ఇదంతయు తమపవిత్రతను కాపాడుకొనుటకు చేయుదురు కాని ఇట్లు చేయుట వల్ల వారు తమకోపము, సహనభావము లేకుండుటను ప్రకటించుచున్నారు. కోపము సహనభావము లేకుండుట మిగుల అపవిత్రమగు గుణములని వారు గ్రహించుటలేదు. బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులు నిమ్నజాతులను అలక్ష్యముచేసి పాపకర్మ మొనర్చియున్నారు. ఇందులకు పరిహారముగ వారు నిమ్నజాతులను వృద్ధికితేకున్న భారతజాతి వృద్ధిచెందజాలదు. పూర్వాచారపరాయణులగు హిందువులు క్రైస్తవులను మహమ్మదీయులను తాకుటకు సంశయింపరు. కాని సంపూర్ణవిద్యావంతులును శుచిపవిత్రతగలిగి బ్రాహ్మణులను పోలియుండునట్టి తియ్యతెగకు చేరిన వారిని దేవాలయముల సమీపమునకుగూడ రానీయరు. దేవాలయములందు దేవతలు ఇట్టిచర్యను ఎంతమాత్రము ఆమోదింపరని నేను నమ్ముచున్నాను.

## సాంఘికసంస్కరణము

సాంఘికసేవ అవశ్యమనియు సంఘసంస్కరణ నిషిద్ధమనియు కొందఱు చెప్పెదరు. కాని యీరెంటికిని ఎట్టిభేదము లేదు. యజ్ఞము, దానము, తపస్సు అన్నివర్ణములవారు చేయవలయునని శ్రీకృష్ణుడు భగవద్గీతయందు చెప్పెను. మానవులకన్న అధికమగుశక్తి గల దేవతలకు చేయబడు పూజావిధి యజ్ఞము, తోడివారికిని తమకన్న తక్కువతరగతులవారికిని చేయుసహాయము దానము. ఆత్మనిగ్రహము ఆత్మాభివృద్ధికొరకు చేయబడుసాధనము తపస్సు. అగ్రజాతులను అంత్యజాతులను సేవజేయుటకు ఈ ధర్మములు చెప్పబడినవే గాని వ్యక్తుల ప్రత్యేక లాభములకు గాదు.

నిమ్నజాతుల నుద్ధరించుట స్త్రీలను అభివృద్ధికితెచ్చుట విద్య సంపూర్ణముగ వ్యాపించునట్లు చేయుట బ్రాహ్మణుల ధర్మము. దేవాలయాధికారుల ధర్మము మఠాధిపతుల ధర్మము. మఠాధిపతులు దేవాలయాధికారులు తమవద్దనున్న ధనమును సద్వినియోగ మొనర్చి ఇట్టి లాభకరమగు పనులు చేయకుండుట గొప్పతప్పు. నిమ్నజాతులయందు తెలివిగలవా రనేకులున్నారు. వారిని అణగద్రొక్కుట దేశమునకు అనర్థదాయకము.

నిమ్నజాతులవారికి హిందూసంఘమునం దెట్టిహక్కులు లేవు. దేవాలయములలోనికి వారు పోగూడదు. ఇట్టి పరిస్థితులలో విద్య

పొందిన నిమ్నజాతివారు హిందూసంఘమునందుండుటకు ఇష్టపడుట లేదు. హిందూమతమును కాపాడుటకు మతాచారములను కాలానుగుణముగ మార్పవలెను. నిమ్నజాతు లనుభవించుచున్న అక్రమము లను అంత మొందించుటయే గాని ఇతరమతములవారు హిందూమతమునందు చేరి హిందువులనిపించుకొనుటకు గూడ అవకాశ మేర్పడవలెను.

నిజమగు మతశక్తి ఎంత క్షీణించునో మతాచారములు సాంప్రదాయములపై పట్టుదల అంత అధికమగును. క్రీస్తుపుట్టుటకు పూర్వము యూదులెట్లుండిరో హిందువు లిప్పు డట్లున్నారు. హిందూ పురోహితులు ధర్మమును బోధించు పురుషులు గారు. మతాచారములను నిర్వహించు యంత్రములుగ నున్నారు. శాస్త్రముల భావార్థము ఎవ్వరు గ్రహించుట లేదు. ఆడంబరముతో కూడిన ఆచారములకు ప్రాముఖ్య మియ్యబడుచున్నది. నిజమగు ధర్మము, నిజమగుభక్తి, నిజమగు సత్ప్రవర్తనము కనుపడుట లేదు. సాంప్రదాయక, ప్రాచీనాచారములు నిరంకుశముగ నున్నవి.

ఈ ఆచారపిశాచము ప్రేమ సత్యమును మ్రింగివేయుచున్నది. కావున నిజముగ సంఘమును సంస్కరింపవలయుననిన అర్థములేని ఈ సాంప్రదాయములను అంత మొందించి మానవ సౌఖ్య ఆధారముగ గైకొని నూతన సాంప్రదాయములను స్థాపింపగము.

## ముగింపు

హిందువులందు సంఘసంస్కరణమునకు పాటుపడవలయునని కోరుచున్నారు. కొంతవరకు అస్పృశ్యత దృష్టిదోషము మున్నగు దురభిప్రాయములు అంతమందినవి. ఈ సందర్భమున భారతసమాజము వారు చేయుచున్న కృషి ప్రశంసనీయము. ఈ సమాజమువారు ఆంగ్లేయులను కూడ తమసమాజమునందు చేర్చుకొనుచున్నారు.

యువకులసహాయము అనవసరము. పునర్జన్మసిద్ధాంతము లను నమ్ముచున్నాను. కృతయుగము రానున్నది. యువకులు ఈ కాలమున ఆధ్యాత్మిక నైతిక విషయములందు ఉన్న తాదర్శములు గలవారై యున్నారు. యువకులయందు ఈసంస్కరణాభిలాష వృద్ధిగాంచవలెను. అప్పుడుగాని మన ప్రయత్నములు విజయముగాంచవు. భగవంతుడు మన ప్రయత్నములకు తోడ్పడు గాక!

# అఖిలభారత విద్యార్థిమహాసభ - కాకినాడ

## శ్రీయుత దేశబంధు చిత్తరంజనదాసుగారి అధ్యక్షోపన్యాసము

చిత్తరంజనదాసుగారు అధ్యక్షస్థానమునుండి యుపన్యసించుచు, పాశ్చాత్యులు భారతదేశమును విజ్ఞానరూపమున జయించిరని నుడివినంతలకు చింతను దెలిపెను. మన మెప్పుడు మాటలాడుకొనుచున్నను మనదేశీయాదర్శములను గురించి చింతించుకొనుటకంటె అవమానకరమగు విషయము మరియొకటి లేదు. పాశ్చాత్యుల స్వయంనిర్ణయముయొక్క అర్థ మేమాత్రమును నిజమైనది గాదు. వారి విజ్ఞానము ననుసరించి అది నిజము గావచ్చును. ప్రతిజాతియు, తనకు సరిపడుసూత్రములను దానే నిర్ణయించుకొని, తనలోనిశక్తి నభివృద్ధిపరచుకొనునట్లుండవలెను. "ఆంగ్లదేశములోని కామన్సుసభ, నిరంకుశాధికార స్వభావులసభ. ఇప్పటికిగూడ పరాసు శాసనసభ నిరంకుశాధికార స్వభావులసభయే. కార్మికులు సమ్మెకట్టినయెడల ప్రభుత్వసైనికులు వారిని తుపాకులచే కాల్చి చంపెదరు. ఇది స్వతంత్రతయా? స్వరాజ్యమా! జాతియొక్క ఆత్మపరిజ్ఞానమును క్రమక్రమముగా నభివృద్ధిపరచి దాని ననుసరించి స్వరాజ్యమును ఏర్పరుపవలెను. ఇందుల కన్నితరగతుల వారిని, అన్నిమతములవారిని, పల్లెటూరివారిని పట్టణవాసము వారిని అందరను దగ్గరకుదీసికొని రావలెను. కాని ఈశక్తియంతయు నొకచోట కేంద్రీకరింపబడరాదు. ఇప్పటికే కాంగ్రెసునందు ఇట్టికేంద్రీకరణ మధికముగ జరిగెనని తలచుచున్నాను. ప్రతివానికిని స్వాతంత్ర్యముండవలెను. నాకు స్వాతంత్ర్యము గావలెను. భారతజాతీయమహాసభయేయైనను ఒక కేంద్రసంఘము క్రింద నణగద్రొక్కబడియుండుటకు నే నంగీకరింపను. మనము ప్రతివిషయములోను భారతీయులసముముగా నేయుండవలెను." అసత్యమాత్రములను, విదేశీయాదర్శములకును మనము పోసపోకూడదు. మనస్సుచుట్టును ఆకరించియుండు అసత్యవిషయము లన్నిటితోడను అసహాకారము నవలంబించిన నే మనస్సు అభివృద్ధియై నిర్మలత్వము నందగలదు. అదేవిధమున నే ఒకజాతిగూడ ఆజాతిని అణచివేయు శక్తులన్నిటితోడను అసహాకార మవలంబింపవలెను. జాతి అభివృద్ధినందిన నేతప్ప దానివలన మానవజాతి కుపయోగముండజాలదు. భగవంతుడొసగిన హక్కును వదలుకొని మనలను బ్రిటిషువారియధీన మొనర్చుకొనిన నేతప్ప బ్రిటిషుప్రభుత్వముతో మనము సహాకార మొనర్పజాలము. వేనితో సహాకార మొనర్చుటవలన నాయభివృద్ధికి భంగకరముగనుండునో అట్టిశాసనసభలను ఇతరసంస్థలను భగ్న మొనర్చుటకు నే నుద్దేశించితిని. నిరంకుశాధికారవర్గమును నాశన మొనర్చుటయే దేశము నెదుట ముఖ్యమగు నిర్మాణకార్యమని నేను తిరిగి నుడువుచున్నాను. తమ పుత్రులు పాఠశాలను వదలివేసిరను కారణముచే వారిని గృహములనుండి వెడల నడచిన తలిదండ్రులను బెంగాలునందు నే నెరుగుదును. అట్లు తమ పిల్లలను గృహములనుండి వెడలగొట్టిన తల్లిదండ్రుల చర్య అవమానకరము. నాకండ్లార గాంచియు నట్టిచర్యల నాపజాలకపోవుట నాకవమానకరము. (ఇచ్చట దాసుగారికండ్లనుండి శోకముచే కన్నీరు దొరలెను.)

అసహాకార మొనరించుటకు మీకు ధైర్యములేనియెడల అసహాకార మొనర్చినవారికి సహాయ మొనర్పుడు. మీకు రెండుకబళముల ఆహార ముండునెడల నొకకబళమును వారికొసగుడు. మీరు కళాశాలలనుండియును, దేశసేవ యొనర్చుటకు మీకు చాల సదుపాయములు గలవు. మీరు గ్రామములకు జని ప్రజలకు బోధింపవచ్చును. నూలువడుకుటను, నేయుటను వారికి నేర్పుడు. ఈవిధముగా నిశ్శబ్దముగా పనిజేసి స్వరాజ్యసంపాదనకు మీరు దోడ్పడగలరు."

# అఖిలభారత ఐచ్ఛికభట ప్రథమ మహాసభ - కాకినాడ

## ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీయుత కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి ఉపన్యాసము

రాష్ట్ర సేవామండల సోదరులారా!

రాష్ట్రసేవా మండలసభ్యులను మిమ్ము ఈపురాతనప్రఖ్యాత భూమి కాహ్వానించుటకు పరమానంద మగుచున్నది. కాకినాడరేవు బ్రిటిషువారి వ్యాపారమువలన సృష్టింపబడినదైనను ఆంధ్రదేశమునందు పురాతన సాంప్రదాయములు ఆర్యవిజ్ఞానమయములగున వెన్నియో గలవు. మీకు, నవ్యభారతనిర్మాతలకు, స్వాగత మొసంగు భారము నాకన్న నెక్కువ అర్హులగు వారలపైబడిన బాగుండెడిది. మీకీ గాంధినగరమున స్వాగత మిచ్చుటలో నూతన జీవితమునకును మహాద్భుతలకును స్వాగత మొసంగుచున్నాము. ఈ నిరాడంబరశాంత నిర్మాణముల జూడ మహాత్ముని సేవాకష్టానుభవాదర్శములు సత్యాగ్రహులకు స్ఫురణకు రాగలవు.

సోదరులారా! మీరు సందిగ్ధ కాలమునం దున్నారు. జీవిత తరంగములు అతివేగముగ చలించుచున్నవి. సాంఘిక మత రాజకీయ ఆధ్యాత్మిక పురోభివృద్ధి ప్రపంచము నంతను మార్చివేయుచున్నది. నూతనాదర్శములును జీవితధర్మములును బయలుదేఱుచున్నవి. బోల్షివిసము కమ్యూనిజము సోషలిజము కమ్యూనిస్ట్ ఫాసిస్టిజము, మిలిటారిజము ఇవన్నియును, మానవప్రకృతిని వినాశముజేయు రోగచిహ్నములు కొన్నిమాత్రమే.

పైనున్న దేవతలు ప్రస్తుతస్థితిగతులు మార్ప ప్రయత్నించుచుండగా క్రిందనున్న ఉపగ్రహములు వెనుకటిస్థితిగతులనే నిలువబెట్టుటకు వెఱ్ఱిప్రయత్నములు జేయుచున్నారు. ప్రపంచమహా సంగ్రామ సమయమున జేసిన మహాత్యాగములును బాధానుభవమును మానవహృదయమును మార్పలేకపోయెను. సాంఘిక, మానసిక, రాజకీయ మతాధిక్యమువడి తగ్గలేదు. ఐరోపీయజాతులు వెనుకటి ఆటనే ఆడుచున్నారు. శ్వేతజాతి రాజకీయసంస్థముగాలమునం దూగులాడుచున్నను వారి ఆధిక్యస్వాతిశయమువలన లక్షలకొలది మంది అమితదుఃఖము గలుగుచున్నది. ఎవరియిల్లు వారు చక్కబెట్టుకొన జాలని వారు ఇతరుల యిల్లు చక్కబెట్టజాలరు. ఆత్మక్షేమము, అతిశయము మాత్రమే శారీభావముల నాక్రమించి యుండును. వారు చేయుపనులు మానవస్వత్వముల కపాయముజేయుచు బాధలగల్పించుచుండును. కండ్లు మూసికొని స్వాతిశయముతో అధికారమును పూజించుచుండుటచేతనే దానివలని భయోత్పాతమును ప్రపంచము తప్పించుకొనుటకు నూతన భావమును, నూతన కార్యాచరణమార్గములును ఆచరణలోనికి వచ్చెను. పాశ్చాత్యదేశము స్వాతిశయముచే బాధపడుచుండ ప్రాచ్యదేశము దుఃఖముచే బాధపడుచున్నది.

శ్లో॥ అసౌ మయా హతశ్శత్రుర్హనిష్యే చాపరానపి ।
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ॥

పశుబలము భౌతికవాంఛల నారాధించుటవలన ప్రపంచము అనురక్తిపాలిత మాయెను. భగవద్గీతలో జెప్పినటుల సైతాను పరిపాలనము ఆత్మవికాసమునకై సంతోషించి నిజమగు ధర్మమును తల క్రిందు జేసెను.

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత; అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం"

మనమందరమును పూజించు మహాదేశభక్తుడు లోకమాన్యతిలకు దీనిని తుదిసందేశముగ దేశమున కొసగెను.

దేశమును నిర్ణీతప్రదేశమున జేర్చుటకై మననాయకుడు, మిత్రుడు, తత్వవేత్త, గాంధిమహాత్ముడు ఈలోకమాన్యుని సందేశమును ఆచరణలో బెట్టెను. శాంతి స్వాతంత్ర్యములకు నిజమగు మార్గముగ దౌర్జన్యరహిత అసహాయసాధనను మహాత్ముడు మనకు జూపెను. ఈయైచ్ఛికభటమహాసభ యీనూతన సాధనవలన గల్గినదే. ఈ సాధనభరతవర్షమును అనుకూలపాలిటినుండి తప్పింపగలదు. మీరు సత్యాగ్రహులుగనుండి పొందినపరీక్షలును, లోలత్వములను జూడ భారతమాత మహాసంరంభమునందలి సంకెలలనుండి విముక్తిబొందుటకు మంచి శిక్ష బొందినసత్యాగ్రహసైన్య ముండుట అవసరమని దెలియగలదు.

ఈసంరంభముయొక్క అతిశయమును జూడ, సుశిక్షితయోధుడగు అర్జునునకు మహావిఖ్యాతమగు క్షేత్ర సంగ్రామరంగమున గల్గినట్లే నిరాశ కల్గును. అర్జునుడు లోలోన నెంతయో సంతాపము నొంది తుదకు శ్రీకృష్ణుని ఆజ్ఞను అనుసరించి విధినిర్వహణమున విజయుడాయెను. మనల నిపుడు తీవ్ర అసమానపరిస్థితు లెదుర్కొనినవి. మనలో మనకు తగాదాలును, పైనిర్బంధములును మనసు భావాధికృత్యములను గూడ స్తంభింపజేసినవి. మనము చేయుపనుల కాటంకముగల్గినపుడు మనస్వాతంత్ర్యవాంఛ ముందుకు పోవుటకు ఏమియును తోచకుండజేయును.

### జాతీయమహాసభ, పక్షవిభేదములు

మన భారతదేశీయమహాసభయందు పక్షవిభేదములు గల్గినవి. బార్డోలీ నిర్మాణ కార్యక్రమము అట్లే నిలిచియున్నది. మార్పు కావలెననువారును వద్దనువారును నింకను వాక్సంరంభము సల్పుచున్నారు. హిందూమహమ్మదీయులకును బ్రాహ్మణబ్రాహ్మణేతరులకును విభేదము లెక్కువగుచున్నవి. ప్రతిసంవత్సరమును మశూచి కలరా ప్లేగు కాటకములవలన వేనకు వేలమంది హతమగుచున్నారు. త్రాగుడెక్కువగు

చుచేయుచున్నది. అస్పృశ్యత సంఘస్వాతంత్ర్యమున కాటంకముగ నున్నది. ఎంతటిధైర్యవంతుడైన ఈ అంతఃపరిస్థితులజూడ విషణ్ణుడైపోవును. వాని కేమాత్రమైన ధైర్యముండి అనియున్నయెడల పైనిర్బంధములతో అది కాస్తయునుపోవును. వేనవేలమంది కాంగ్రెసు ప్రచారకులు అన్యాయసూత్రములచే నేదో ఒక కారణము పెట్టి కారాగారములం దుంచబడిరి. గాంధిమహాత్ముడు, పరమశాంతమూర్తి, శాంతి సత్యాగ్రహములపై ప్రేమ గనుపరచినందులకు దయమాలి శిక్షించిరి. సంస్కరణములు, ద్వంద్వప్రభుత్వము, మంత్రిపదవులు, అధికారవర్గమునకు బలమొసంగెను. ఇదివరకున్న సంస్కరణములు వచ్చినపిదప నిర్బంధము నెక్కువాయెను. స్వర్గమునుండి ఊడిపడిన సివిలుసర్వీసు ఇండియా ప్రభుత్వముపై ధ్వజమెత్తుచున్నట్లు రాయలుకమిషనుసాక్ష్యమునుబట్టి తెలియుచున్నది. భారతస్వాతంత్ర్యము నిరోధించు ఉక్కుచట్టమే అనేకసంవత్సరములు పాలించుచుండునని లాయిడుజార్జిగారు ఉన్నదున్నట్లు చెప్పిరి. ఇట్టికష్టపరిస్థితులలో స్వరాజ్యసంగ్రామము దీర్ఘకాలము జరిగి కష్టముననేయుండును. అందువిజయము గాంచుటకు మన జాతీయమూలములను స్థిరపరచుకొనుటకు కాలమువచ్చినది.

స్వరాజ్యము మనప్రయత్నములవల్లనే రావలెనని మహాత్ముడు చెప్పెను. స్వరాజ్యమును దేవతలుగాని అధికారవర్గముగాని ఒక పారితోషికముగ నొసంగుట కూడిపడునదిగాదు. ప్రజలు భరతమాతసేవకై జీవితమును అర్పణచేసిరేని స్వరాజ్యము సులభముగ రాగలదు. రాజకీయములను ఆత్మలాభముల సంపాదించుటకై వినియోగించుస్థితి నుండి సత్య ఆధ్యాత్మికస్థితికి మహాత్ముడు లేవనెత్తెను. 'మూన్నాళ్ల ముచ్చట' బలముపోయినది. సేవాత్యాగముల కాలము ప్రారంభమైనది. ఈనూతనశిక్షవలన చాలమంది కాంగ్రెసువాదులు భయపడి పారిపోయినను మాతృభూమిసేవకై జీవితముల నర్పించిన సత్యాగ్రహులసైన్యమేర్పడినది. పూర్వానుభవమును బట్టిచూచిన నెన్నెన్నియో తెగలవారుండు కాంగ్రెసు వాదులనుండి అనేకస్వభావములు, వయసులు గలవారుండుటవలన, ఒకేరకపు సత్యాగ్రహసైన్యమును యేర్పరచుట సాధ్యము గాదనియు, వాంఛనీయముగూడ గాదనియు తలంపబడెను. దేశమంతటను ఐచ్ఛికభటనిర్మాణములు బాగుగ పనిజేయువానిని సృష్టించుటకు సమయ మాసన్నమైనది.

## ఐచ్ఛికభటులు

ఐచ్ఛికభటులెన్నెన్నియోపనులు జేసెదరని మహాత్ముడు వారిపై నెంతయో ఆశగల్గియుండెడివాడు. ఈ ఉద్యమము దేశమున కుపయోగకరముగనుండునటుల వారు ఆత్మశిక్షణముబొంది అహింసకు బద్ధులైయుండవలెనని ఆయన కోరెను. కొందరు కాంగ్రెసువాదులు శిక్షణమునందు కొంత తగ్గింపవలెనని కోరిరి గాని, మహాత్ముడు అందువలని యుపద్రవమును కనుగొని దానికి లొంగకపోయెను. మహాత్ముడు చేసిన పని మంచిదని బొంబాయి, మద్రాసు చౌరీచౌరాలోని విషయములు తెల్లముచేసెను. సహనములేక లోతుపాతులు దెలియని విమర్శకులు మహాత్ముని దుర్బలుడని నిందింపవచ్చును. కాని ఆయన ధీరకార్యమును గుర్తెరిగినవారు ఆయన శాసనోల్లంఘనమును దుర్బలత్వముచేత ననజాలరు. ఇట్లుచేయుటవలని ఉపద్రవమును తమకు స్పష్టముగ గనుగొనియే ఆసంరంభము నాపివేసెను. మహాత సత్యాగ్రహ సంరంభమును ఆపినపుడు లాలాలజపతిరాయి వంటిపురనాయకులే మహాత్ముని గొప్పతనమును గ్రహింపలేకుండుట విచాయమే. ఈవిషయమై యింకను యెక్కువచెప్పి లాభమేమియునులేదు. మనప్రస్తుతకార్యము దేశము స్వరాజ్యమును శాంతన్యాయమార్గమ బొందునట్లు చేయుటయే.

ఐచ్ఛికభటులయొక్కయు తన్నిర్మాణములయొక్కయు లోపములను చౌరీచౌరాదురంతములు వెల్లడిజేసెను. వీరల సుగుణసంపత్తిని నాగపూరు పతాకసంరంభమును అకాలీవిజయమును వెల్లడిజేసెను. విజయవంతమగు సంరంభములందు గూడ యీసభాకార్యదర్శి హర్డీకారుగారు చెప్పినటుల ఐచ్ఛికభటులు అహింస త్యాగములపై శిక్షణమును బొంది పనిచేయవలయును.

ఐచ్ఛికభటోద్యమము పాశ్చాత్యసైనికపద్ధతినుండి వెలువడినది. సైన్యములో జేరవలెనను నిర్బంధము నొల్లని స్వతంత్ర దేశములలో ఐచ్ఛిక సేవాపద్ధతి అనుసరింపబడును. పరాధీనదేశములగు ఇండియా వంటి దేశములలో యీ ఐచ్ఛికశిక్షణముగూడ సాధ్యముగాదు. కారణము విదేశీయులకు ప్రజలయందు విశ్వాసములేదు. భారతదేశీయుల మహాసభ ప్రారంభమునుండియు ఐచ్ఛికభటులు జాతీయోద్యమమునకు అఖండసేవను జేయుచుండిరి. స్వయంసహాయము, దౌర్జన్యరాహిత్యమగు అసహాయోద్యమము కాంగ్రెసు విధానమైనపుడు ఐచ్ఛికభటనిర్మాణములు పూర్తిగ మార్పుజెందెను. అసహాయోద్యమతరంగము మిన్నుముట్టి వేలకొలదిమంది కాంగ్రెసు కిలాఫతు ఐచ్ఛికభటులుగ జేరి దేశమునకు అఖండసేవ సల్పిరి. కాని దౌర్జన్యరహిత అసహాయోద్యమమునకు మూలాధారమగు సత్యాగ్రహసిద్ధాంతమును ఐచ్ఛికభటులు గ్రహింపజాలకపోయిరి. సత్య, అహింస, త్యాగములను ఆచరణలో బెట్టుటకు ధైర్య, సహనములు గావలయును. సురాసురుల సంగ్రామమునందు తుదకు విజయము సురలకు గల్గినను అసురులే యింకను ప్రపంచమునందాధిక్యమును గల్గియున్నారు. పశుబలమునకును, ఆత్మబలమునకును భోగకష్టానుభవములకును ప్రాచీప్రతీచీ సంస్కారములకును ఆధిక్యమును గూర్చిన సంరంభమునందు భారతపుత్రులు పురోగాములుగ నుండగలరు.

మహాత్ములు స్వార్థత్యాగమును సత్యాగ్రహమును సల్పి పశుబలమును జయించిన దివ్యాదర్శము మనకు గాన్పించుచునే యున్నది. మహాత్ముని శుష్కశరీరమును ఎఱవాడ జెయిలులో బంధించినను ఆయన ఆత్మ ప్రపంచమంతను మానవకారుణ్యాతిశయమును చాటెను. నేడు ప్రపంచమునందు మహాత్ముడుత్తమపురుషుడై పరగుచున్నాడు. ఆత్మశాశ్వతవిజయముల నుద్ఘోషించును. లోకమాన్యునిసందేశము మహాత్ముని ఆదర్శనమునందు ప్రతిఫలించుచున్నది. కాని యింకను కష్టకాలములును తీవ్రపరీక్షలును రానున్నవి. ఇంకను నెందరో వాజపేయులును అకాలీలును యీ మహాసంరంభమున విజయము బడయుటకై

లసల్పి బాధానుభవమును గాంచవలయును. మహాత్ముడు కష్టపడి విజయమార్గమును జూపెను. ఇచటనున్న సత్యాగ్రహులు మంది మహాత్ముని ఆదర్శమును త్యాగకష్టానుభవముల బొంది ధర్మ నిర్వర్తింప సంసిద్ధులుగ నున్నారు. మీలో చాలమంది అసహాయోద్యమమువలన కష్టముల బొందిరి. ఉద్యమస్వరూపము మారినది. ఉద్యమముయొక్క భౌతికమూలము అధ్యాత్మిక మూలముగ మారినది. స్వాతంత్ర్యము, ఆత్మలాభము మున్నగు భౌతికాదర్శములు, ఆత్మసమర్పణము, నాశనము క్రిందకు మారినవి. సత్యసత్వములకై వేలకొలది మంది అర్పణ గావించుకొనిరి. మీ అనుభవమును దేశముయొక్క అవసరమునుబట్టి చూడ జాతీయ ఐచ్ఛికదళ నిర్మాణము జాతీయశాశ్వత మూలముపై నుండవలయునని తెలియగలదు.

దివ్యదత్తమగు స్వరాజ్యమునకు మహాత్ముడే ప్రపంచమునకు మార్గముజూపెను. భారత సంస్కారమునుబట్టి సత్యాగ్రహముద్వారా ఆదర్శనమును జేరగలము. జైన, బుద్ధ, దధీచి, అర్జున, భీష్మాది మహాపురుషు లుద్భవించిన యీపురాతన సంస్కారభూమియందు వేలకొలది మంది సత్యాగ్రహులు పుట్టగలరు. ఆత్మనిగ్రహము,ఆత్మరాహిత్యము, ఆత్మత్యాగమే మోక్షమునకు నిజమగుమార్గములు. ఈదివ్యగుణములును, మంచిశిక్షణ నిర్మాణములతో నలవడవలయును. గాంధిమహాత్మునితో సమకాలికులముగ నుండి మన భవిష్యత్తునకు ఆయననాయకత్వమున పాటుపడునంతటి అనుగ్రహము మీకు గల్గినది. యౌవనమునందే కార్యోత్సాహముండి ఆశయుండిన జీవితమునకు వసంతాగమముగ నుండును. నవ్యభారతనిర్మాణము భారతమాతయోధు లనందగు మీచేతులలోనే గలదు. శ్రీకృష్ణుడు చెప్పినటుల మీరే దైవరాజ్యపుత్రులు. గాంధిమహాత్ముడు ఆదైవరాజ్యమునకు త్యాగకష్టానుభవముల ద్వారా మార్గమును జూపెను. మేల్కొనుడు, నిర్మాణముల గావింపుడు, మాతృభూమి పిలుపు ననుసరించి పనిచేయుడు, మహాత్ముని ననుసరింపుడు.

శ్లో॥ దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా
మాశు ద్విసంపదం దైవీ మనుజాతోసి భారత॥

సుప్రసిద్ధదేశభక్తుడగు శ్రీయుత పండిత జవహరిలాల్ నెహ్రూగారి నాయకత్వమున ఈ సభ విజయము ఒడయునటులు భగవంతుడు ఆశీర్వదించుగాక!

# అఖిలభారత గ్రంథాలయ ప్రదర్శనము-కాకినాడ

## శ్రీయుత న్యాపతి సుబ్బారావు పంతులుగారి అధ్యక్షోపన్యాసము

మన రాజధానియందు గ్రంథాలయోద్యమమును బెజవాడలో శ్రీయుతులు నరసింహశాస్త్రిగారును అయ్యంకి వేంకటరమణయ్యగారు మున్నగువారుప్రారంభించిరి.అఖిలభారత పుస్తకభాండాగార ప్రథమసమావేశము మద్రాసులో 1919లో జరిగెను. నేడు రెండవసభ ఇచట జయకరుగారి అధ్యక్షతను జరుగుచున్నది. ఈయుద్యమము జాతీయాభ్యుదయమున కెంతయు లాభకరమైనను, బలమగుసాధనమైనను దాని ప్రాముఖ్యమును ప్రజలు చక్కగ గుర్తింపలేదు. ఉత్సాహముతో ప్రజలు దానిని సాగించుటలేదు. ఈయుద్యమముయొక్క ఉద్దేశ్యము ప్రతివానిని ధీమంతునిగజేసి బుద్ధి వికాసమును కలుగజేయుటయే యని అందరకును తెలిసినవిషయమే. స్త్రీపురుషులకును వృద్ధులకు, యువకులకు, పిల్లలకు అన్నితెగలవారికిది యుపయోగించును. వీరి జీవితములు సుఖప్రదముగ జేయబడును. అట్లు చేయుటకు ప్రయత్నించును. గ్రంథజాలమే గొప్పకు ఆలవాలము. ఇచటనే వివేకము జ్ఞానము, పూర్వులు గడించిన విజ్ఞానము గ్రంథములందు కేంద్రీకృతమై యున్నది. కొంత కాలమైన, పుస్తకభాండాగారములో గొప్పవారిచెంత కలసి యుండగలము. తరతరములనుండి సంపాదింపబడిన మన పెద్దల జ్ఞానమునకు మనమే వారసులము. దానిని మనమువినియోగించుకొననిచో అది మన తప్పు. మనతోడివారందరకును విద్యాగంధమును వెదజల్లి ప్రబోధమును కలిగించి వికాసము కలుగజేయుట మనవిధి.

ఈయుద్యమమును పాశ్చాత్యులు అత్యుత్సాహముతో నడుపుచున్నారు. పాశ్చాత్యదేశములందు ప్రతిపల్లెయందును ఈయుద్యమమే. గ్రంథాలయములన్న పుస్తకములు ఒకమూలబడియుండు స్థానము లనుకొను కాలము పోయినది. అచట బుద్ధివికాసమునకు జాతీయజీవనమునకు ఆకరములైనవి. ప్రతిదేశపువారును ఊరిలో గొప్పపుస్తకభాండాగారము లున్నవని ఉప్పొంగుచున్నారు. బ్రిటిషు చిత్రవస్తు ప్రదర్శనాలయమున 2000000.పుస్తకము లున్నవి. కరపత్రములు మున్నగునవి ఇంకొక 5000000 గలవు. వాషింగ్టన్ లో 2500000 గ్రంథరాజములున్నవి. భాండాగారము విలువయే 2 కోట్ల రూప్యములు. పన్ను వేయదగు సొత్తుమీద పౌను 1-కి ఒక పెన్నీ పన్నును పుస్తకభాండాగారమును నెలకొల్పుటకు పురపాలక స్థానికసంఘమువారు విధించునిబంధనలు గలవు. 1910 సంవత్సరమున గ్రేటుబ్రిటనుకును, యునైటెడ్ స్టేట్సువారికిని కీ॥ శే॥ ఆండ్రు కార్నిజిగారు పుస్తకభాండాగారము భవనములను ఒసగి ఈ యుద్యమమున కెంతయు ప్రోద్బలము నొసగిరి. 1910 లో ఇంగ్లాండునందు 2000000 మంది పుస్తకములను ఎరవు తీసికొనెడివారు. ఇందులో నూటికి 59 గురు పురుషులు. నూటికి 41 మంది స్త్రీలు. ఇందులో నూటికి 48 మంది 20 ఏండ్లకు లోపుగను నూటికి 32 మంది 20 ఏండ్లకు పైబడినవారు గలరు. ఇంటి దగ్గర చదువుకొనుటకు వీరు 60.0000 పుస్తకములను గొంపోవుదురు.

### యునైటెడ్ స్టేట్సు

లో పుస్తకభాండాగారములను నెలకొల్పుటకు వ్యక్తులెవరో చాలమంది లక్షలకొలది ధనమును ఇచ్చిరి. ఇచట దివ్యముగ పనిజేయు

చున్నవి. ఎంతసొమ్మెబ్బు పెట్టుబడిగలదు. యునైటెడ్ స్టేట్సులో పురపాలకసంఘములందు గ్రంథాలయములు జూపినపురోవృద్ధి ప్రపంచములో ఇంకొకచోట లేదు. కొన్ని రాజ్యములయందు అనుభవము గల కొంతమంది వ్యక్తులను నియమించి స్థానిక గ్రంథాలయభాండాగారములను స్థాపించి ప్రోత్సహించునటుల జేసెదరు. ముఖ్యముగ ఇవి పట్టణములందును, గ్రామములందును జరుగును. ప్రభుత్వకోశమునుండి కొంత విరాళమునుగూడ ఇచ్చుట కధికారమున్నది. సాధారణపుస్తక భాండాగారములే గాక సందేహము నివారణజేసికొనుటకు కొన్ని గ్రంథాలయములున్నవి. ఎఱువిచ్చు గ్రంథాలయము లున్నవి. ఎన్నియో గ్రంథాలయములున్నవి. మతము, న్యాయశాస్త్రము, పురాతనవస్తుపరిశోధనము, వైద్యము, ప్రకృతిశాస్త్రము మున్నగు విషయముల నన్నిటిని తెలిసికొనుటకు వీలగు గ్రంథాలయములు గలవు.

ఈయుద్యమమును వ్యాపింపజేయుటకు ప్రత్యేకసంఘములుగలవు. గ్రంథాలయములందు సహాయకులుగ పనిజేయువారిని పరీక్షించి పట్టముల నొసగెదరు. గ్రంథాలయములనుగూర్చి ఎన్నియో పత్రికలున్నవి. ఈయుద్యమము శీఘ్రముగ వ్యాపించుచున్నది. ముఖ్యోద్దేశ్యము ఉపన్యాసములు, ప్రదర్శనములు, వినోదములు, సభలమూలముగ జ్ఞానమును వెదజల్లుటయే.

పాశ్చాత్యదేశములం దీయుద్యమవ్యాపకమును జూచితిమేని మన మెంత వెనుకబడినారమో గ్రహింపగలము.

పూర్వము మన గ్రంథము లన్నియు వ్రాతలోనేయుండెను. తక్షశిల నలంద విక్రమశీల ఓదంతపురి విశ్వవిద్యాలయములకు జేరియుండెను. ఆసియాఖండమునుండి విక్రమశీలకు, ఓదంతపురికి చాలమంది పోవుచుండెడివారు. ఇవిగాక మతపీఠములందును దేవాలయములందును గ్రంథాలయము లుండెడివి. ఇందులో ముఖ్యముగ వేదాంతతత్వమును మతవిషయములనుగూర్చి వ్రాసిరి. లోకులుగూడ కొందరు గ్రంథాలయములను స్థాపించిరి. ప్రభువులచే పోషింపబడు గ్రంథాలయములలో తంజావూరు గ్రంథాలయము ఇంకను పేరుగాంచుచున్నది. అమూల్యగ్రంథము లెన్నియో ఇందు గలవు. ఇందులో కొన్నిగ్రంథముల పేర్లు మనకు తెలియనే తెలియవు. 17, 18 శతాబ్దముల ఆంధ్రవచనవాఙ్మయము ఇ తవఱకు తెలియదు.

ఆధునిక పద్ధతుల నవలంబించి తన రాజ్యములో గ్రంథాలయములను స్థాపించినవారిలో మొదటివారు బరోడా గయికా. ఆయన కేంద్ర గ్రంథాలయము జిల్లా గ్రంథాలయములను గ్రంథాలయములను సంచారక గ్రంథాలయములను స్త్రీ పిల్లలకును ప్రత్యేకభాగములను ఏర్పాటుజేసిరి. మనము ఈప్రాంతములందు మంచి ప్రారంభమును జేసినారము. అనధికారవిధానము ననుసరించితిమి. నాళము కృష్ణారావుగారు మిత్రులును గలసి 20 ఏండ్లకు పూర్వము రాజమహేంద్ర స్థాపించిన గౌతమీ గ్రంథాలయ మున్నది. అందు 15000 పుస్తకములున్నవి. 400 మంది సభ్యు లున్నారు. ఇందులో 50 మంది స్త్రీలు గ్రంథములను ఉపయోగించుకొనుచున్నారు. మొన్ననే కే. వి. ఎస్. రామచంద్రరావుగారి ధర్మమాయని 6000 రూప్యములను గ్రంథములను కొనుటకు విరాళము నొసగిరి. ఇచట కాకినాడలో కీ. శే. పోలవరం జమీందారు కొచ్చర్లకోట ఆర్, వి. కృష్ణారావు బహదరుగారు దానముచేసిన గొప్పగ్రంథాలయమున్నది. శ్రీ శే॥ చెలికాని లచ్చారావుగారు ఆంధ్రపరిశోధకమండలి అను వ్రాతప్రతుల గ్రంథాలయమును స్థాపించిరి. వీరు ఒకపత్రికను గూడ ప్రకటించిరి. అందులో ఇదివరకు వెలికిరాని గ్రంథము లన్నిటిని గూర్చి వ్రాయుచున్నారు. ఈగ్రంథాలయములో తెలుగు సంస్కృతగ్రంథము లెన్నియో గలవు. జిల్లా గ్రంథాలయములకు వావిళ్ల రామస్వామిశాస్త్రి కొమార్లు తమదగ్గర ప్రకటింపబడి గ్రంథములెన్నిటినో దానము జేసినందుల కెంతయు వందనీయులు. 1911 లో ఆంధ్రదేశగ్రంథాలయ సంఘము స్థాపింపబడెను. బెజవాడలో కేంద్రగ్రంథాలయ మేర్పరుపబడెను. దీనిని రామమోహన గ్రంథాలయ మనెదరు. తెలుగుదేశమున గ్రంథాలయోద్యమమును స్థాపించుటయే దీనియుద్దేశ్యము. ఈయుద్యమము ప్రజలలో ప్రాకుటకు మనమిత్రులు బెజవాడలో మాసపత్రికను ఆంధ్రమున ప్రకటించుచున్నారు. వివిధతరగతుల ప్రజలకు అనేకశాఖల నేర్పరచిరి. దీనివలన గ్రంథాలయలాభములను తెలియజేయుచున్నారు. తెలుగుదేశములో చాలచోట్ల గ్రంథాలయములను స్థాపించుచున్నారు. ఈప్రదర్శనము చిన్నదే అయినను ఉద్యమముగొప్పను జూపుచున్నది. ఈయుద్యమమును మీరందరును గ్రహించి మీ గ్రామములందును, పట్టణములందును గ్రంథాలయములను స్థాపింపుడని కోరుచున్నాను.

# అఖిలభారత విశ్వకర్మ మహాసభ - కాకినాడ

## పీటరు జావిట్క్సగారి ప్రారంభోపన్యాసమునందలి భాగములు

సోదరులారా!

ఈ అఖిలభారత విశ్వకర్మ ద్వితీయమహాసభయం దుపన్యసించు గౌరవము గల్గినందులకు నాకు చాలసంతోషమగుచున్నది. ఇయ్యది అఖిలభారత విశ్వకర్మ మితవాదిసంఘ యాజమాన్యమున జరుగుచున్న రెండవ విశ్వకర్మమహాసభ. ప్రథమమహాసభ రెండు సంవత్సరముల క్రింద పూజ్యులగు గాంధిమహాత్ముని అధ్యక్షతను జరిగెనని దెలియుచున్నది. ఈ విశ్వకర్మసంఘముయొక్క యుద్దేశము భారతదేశపు చేతిపనుల నుద్ధరించుటయే. ఈ ఉద్యమము విజయము గాంచుట చాల అవసరము. ఇందువలన భారతదేశమే గాక ప్రపంచమంతయు గూడ అనాగరకతలో పడిపోకుండ జేయవచ్చును.

ప్రష్యామహాసామ్రాజ్య మొకనాడు విఖ్యాతమై శక్తిమంతముగ నుండినది. ఇపుడెట్లు క్షీణించి వినాశమైనదియు మీ రెరిగియే యున్నారు. దానికి ముఖ్యకారణమేమో యెవరికిని దెలియదు. అది కత్తులచేత గాక స్వదేశపరిశ్రమ నుపేక్షజేయుటచేతనే కల్గెను.

ఎనిమిది సంవత్సరముల ఆదేశముయొక్క క్షీణము ప్రారంభమైనపుడు దిగుమతి ఆగిపోయెను. ఆ దేశములో పనిజేయుచుండిన పారిశ్రామికయంత్రములు యెనోయొక మర పోవుటవలన పనిజేయక ఆగిపోయెను. ఆ పోయినభాగము లచట దొరకవు. అన్నియును విదేశములందే చేయబడును.

ప్రజ లిపుడు నూలువడుకుటను, నేతను, తోలుపనును జేసి చెప్పులు చేయుటను మరచిపోయిరి. దేశములో కావలసినంత ఉన్ని, దూది, తోళ్లు కండ్లయెదుట కనబడుచుండగా, వారు వేలకొలదిమంది గాక లక్షలకొలదిమంది కృశించిపోవుచుండిరి. దేశములో నెంతయో అన్నముండగా లక్షలకొలదిమంది మాడిచనిపోవుచుండిరి. కారణము, యింతవిశేషమని గర్వపడు ఆధునికపు రాకపోకల సాధనములు పనిచేయక పోయెను. ఒక చిన్నదంతైన యెక్కడనో పాడై యంత్రము యొక్క ముఖ్యభాగము పోవుటవల్లనో నాశన మేర్పడెను. ఇప్పుడు భారతదేశఆర్థికస్థితిగూడ ప్రష్యా నాశము గాకముందువలెనే యున్నది.

అట్టి ఘోరవినాశము మనల నావరించుటకు ముందే యిప్పుడే పురాతనపు స్వల్పమగు చేతిపనులను చిత్రకళలను అభివృద్ధిచేసి ప్రోత్సాహము జేయవలయును.

ఆధునికనాగరకతను రుచిచూచిన పిదప వెనుకటినిరాడంబర జీవితమునకు నడంగుట గష్టమే. ఈ ఆధునికనాగరకత మహాపాపము. నేను చెప్పునది నమ్ముడు. నేను దానిని రుచిచూచితిని. నేను ఏమి చెప్పుచున్నానో నాకు దెలియును. మొదట్లు మిమ్ము జూచి కొందరు నవ్వి వెక్కిరించెదరు. కాని దానిని లక్ష్యము చేయవద్దు. గాంధి మహాత్ముడు చెప్పిన దానిని వినుడు. అపుడు మీరు నవ్వుటకే పని యుండదు. అదియే చాల మంచిది.

నిరాడంబరజీవితమునకు గడంగుట యనగా అనాగరకముగ నుండుట గాదు. పురాతన విశ్వకర్మనాగరకమును అనుష్ఠింపు డనియే కోరుచున్నాను.

మీరు (విశ్వకర్మలు) పురాతన హైందవ నాగరకనిర్మాతలే గాక ప్రపంచనాగరక నిర్మాతలని చెప్పవలయును. మీరు మానవులకు అనాగరకత పోగొట్టబట్టియే గాంధిమహాత్ముడు మిమ్మును ప్రపంచము మరల ఆ అనాగరకతలోనికి బోకుండ నుద్ధరింపుమని కోరెను.

మీరు (విశ్వకర్మలు) ఇపుడు 4 కోట్లమంది యున్నారు. భారతదేశమునందున్న దేవాలయములను ఇతర పూజాస్థలములను మీరే నిర్మించితిరి. పూర్వము మీరు భారతదేశమునందు బంగారు వెండి, రాగి, కంసాలిపనులును, దంతపుపనులును కొయ్యచెక్కడపు పనులును, శిల్పమును, వడ్రంగమును, ఇతర చిత్రకళావిన్యాసములను జేసితిరి. ఆచిత్రకళాప్రకృతిభావము మీయందే గలదు. కాని అది నిద్రాణమై యున్నది. ఇపుడు కావలసినది దానిని మేల్కొల్పుటయే. ఈ అఖిల భారత విశ్వకర్మమహాసభ యుద్దేశ మయ్యదియే. భారతదేశ మంతయును ప్రపంచమంతయు గూడ మీకు తోడ్పడుగాక. చిత్రకారుడు ఏదో యొక దేశమునకే గాక ప్రపంచ మంతకును సంబంధించినవాడు. భగవంతుడు మిమ్ము నాశీర్వదించుగాక!

## శ్రీయుత ఆచార్య ప్రఫుల్లచంద్ర రే గారి అధ్యక్షోపన్యాసము

గోదావరిజిల్లా కాకినాడ పురమందిరమున 1923 డిశెంబరు 29వ తేదిని జరిగిన అఖిలభారత విశ్వకర్మమితవాది ద్వితీయమహాసభ కధ్యక్షత వహించిన సర్. పి. సి. రాయి గారి అధ్యక్షోపన్యాసమునుండి యీ క్రింది భాగములు మాకు ప్రచురణార్థ మంపబడినవి:—

సోదరులారా, మిత్రులారా, భారతదేశ పరిశ్రమలవలన మనదేశ నాగరికతకును, మిగిలిన ప్రపంచనాగరకతకు గూడ అమితమగు లాభములు గల్గెను. ప్రపంచనాగరకతకు తోడ్పడినవారిలో గ్రీకుల పిదప విశ్వకర్మలనే చెప్పవలయును. ఎల్లోరా, తిరువళ్వేలీ, మధుర గుహాలయములగల చిత్తరువుల జూచినయెడల భారతదేశపు చేతిపను లెంతవర కభివృద్ధిగాంచినదియు తెలియగలదు. విశ్వకర్మల విజ్ఞానమున కివి నిదర్శనములు గావా? మద్రాసులో గూడ విశ్వకర్మలు చేతితో జేసిన పను లెన్నియోగలవని నేను విందును. ప్రపంచమంతయును యాత్ర

జేసినవారు మనదేశములో తాజిమహాలు నిర్మాణమును జూచి ఆశ్చర్యమును దెల్పెదరు. అది ప్రపంచములోని అద్భుతములలో నొకటిగ పరిగణింపబడుచున్నది. నేను వలువలు తయారగు బెంగాలునుండి వచ్చితిని. ఈవలువ లెంతయో పలుచనగనుండి సాయంత్రము వేసికొని నది మరునాటి యుదయమునకు గాన్పింపకుండును. ఇపుడు అన్ని చేతిపనులు చచ్చిపోయినవి. భారతదేశమునకు స్వరాజ్యము నిచ్చినయెడల తన విషయమును తాను జూచుకొని దేశీయులు చేతిపనుల నభివృద్ధిచేసికొని యుండెడిని. బ్రిటిషు ప్రభుత్వమువారు ఇంగ్లాండు కాపిటలిస్టుల లాభములను మాత్రమే గమనించుచుండిన మహాదోషము.

ఇదివరలో భారత ప్రభుత్వముయొక్క హోంమెంబరుగ నుండిన సర్ విలియం విన్సెంటుగారు బ్రిటిషు ప్రభుత్వము ఇండియాకేమిచేసినదియు నిర్ణయించుస్థితిలో నున్నారు. ఏమియును జేయలేదని ఆయన అంగీకరించెను. మించిపోయినదానికి పరితపించి లాభమేమియును లేదు. మనకు మనస్వంత అభివృద్ధిమార్గ ముండవలయును. వెండి బంగారు రాగిపనుల జేయు కంసాలులును, కమ్మరులును, వడ్రంగులును, కొయ్యచెక్కడపు పనుల జేయువారును, శిల్పులును, నేతగాండ్రును, రంగులువేయువారును అందరుగూడ భారతదేశీయనాయకుల ప్రోత్సాహమును బొంద నర్హులై యున్నారు. ఆర్థికముగ నెన్నికష్టము లున్నను మీరు మీపూర్వవృత్తులనే అవలంబించియున్న విషయము చాలమంచిది. భారతదేశమంతటను వృత్తివిద్యాలయముల నిర్మించి విదేశీయాక్రమణలేకుండ యీదేశీయులే ధనమును సేకరించునట్లు శిక్షనేర్పుట చాల అవసరము.

## భారతవస్త్రాధిక్యము

భారతదేశములో చేతితో జేసిన వస్తువులను బ్రిటిషు యూరోపియను వస్తువులతో పోల్చి చూడుడు. ఈదేశపు వస్తువులు చాలకాలము మనును. విదేశములవస్తువులు పైమెరుపు మాత్ర సోదరులారా, కాలమును గమనింపుడు. గాంధిమహాత్ముని [illegible] నొకడై అల్యూమినియము పరిశ్రమాభివృద్ధి కెక్కువపని జే[illegible] లాలుగారిని మీ రెరుగుదురు. ఆయనకు ఇంగ్లీషుచదువు [illegible] వ్యాపారము ఎట్లుచేయుచున్నాడో చూడుడు. ఆయనవ్యా[illegible] దేశమంతటను వ్యాపించినది. ఎక్కడకు పోయినను ఆయనవస్తు గాన్పించును. ఆయన నిజముగా గాంధిమహాత్మునిశిష్యులనవలయు ఆయన కలకత్తా, బొంబాయి, మద్రాసు, రంగూనువంటి పెద్ద[illegible] ములలోనే గాక, రాజమహేంద్రవరం, కాకినాడ, బెజవాడ, మ[illegible] దాబాదువంటి చిన్నపట్టణములలో గూడ ఏజెంట్లను నియమించెను ఆవస్తువుల అధిక్యమును కొనువారే అంగీకరించిరి. ప్రదర్శనముల జే[illegible] మీవస్తువుల ప్రదర్శించుటకును, మీపరిశ్రమలవలన తయారగు వస్తువుల నమ్ముటకును మార్గముల జూడవలయును.

విశ్వకర్మలు అందరసానుభూతికిని పాత్రులై యున్నారు. విశ్వకర్మలకు మంచిరోజులు వచ్చుచున్నవి. శిల్పిసోదరులారా! వెంట[illegible] మీపారిశ్రామిక నిర్మాణము వేరుగ నుండవలసిన అవశ్యకతను సం[illegible] హింపనక్కరలేదు. మీరు సహకార పరపతిసంఘముల వంటిదా[illegible] నిర్మింపవచ్చును.

నేడు నాకెన్నియో పను లుండుటవలన వ్యవధి కొలదిమాత్రమే యున్నది. మీసందర్శనము గలిగినందులకు కృతజ్ఞుడను. నేను బెంగాలులో చేతిపనుల అభివృద్ధియందు కొంతవరకు పనిజేయుచున్నాను నేను నామిత్రుడు పండిత గానాల రామమూర్తిగారి కోరికపై మీకార్యక్రమమునందు పాల్గొన నంగీకరించితిని. భగవంతుడు మిమ్ము నా[illegible]ర్వదించుగాక! నేనింతటితో విరమించుచున్నాను.

# అఖిలభారత మహిళా మహాసభ - కాకినాడ

## మాతా, కస్తూరిబాయి గాంధి అధ్యక్షోపన్యాసము

ప్రియసోదరీమణులారా!

మనము భారతస్త్రీలము. మనదేశముయొక్క గౌరవస్వాతంత్ర్య సౌఖ్యములను మరల సంపాదించుటకు నేమిపనిజేయవలయునో మిమ్మును కలిసికొని ముచ్చటించుటకు నేడు నాకవకాశ మిచ్చినందులకు వందనములర్పించుచున్నాను. మనమాతృభూమ్యుద్ధరణకై మనసోదరులు ధైర్యముతో వేరువేరు మార్గములను బనిజేయుచున్నారు. ఐతే ప్రియసోదరీమణులారా! మనము తల్లికూతుళ్లము. మన మందరమును పెద్ద మొదలు చిన్నవరకును సహాయము జేయవలెనని కోరుసని మణువజనము. కావున మనమందరమును ఏకమై యీమహాదాదర్శమును నెరవేర్చుటకు పవిత్రయముతో చిత్తశుద్ధితో విశాలహృదయముతో పనిజేయవలయును,

సీత, ద్రౌపది, మీరాబాయి, నూర్జహాను, చందుబీబీ మున్నగు ధీరనారీమణులను, ఝాన్సీలోనున్న ధీరవనితలక్ష్మివంటి స్త్రీలను, తల్లియైన భారతమాత యీ యుగమునం దట్టికూతుళ్లను గనుట మానెనని చరిత్ర ముద్ఘోషించునంతటిసిగ్గును దెప్పింపకుడు.

కావున మనము, పరమాత్మ మనకొసంగిన శక్తినంతను వినియోగపరచి సత్యవిజయమునకై హృదయ మానసపూర్వకముగ ఆత్మపరిపూర్ణముతో కార్యార్పణము జేయుదుముగాక!

## కార్యసాధనములు

నేను ఉత్తరమునుండి దక్షిణమునకును, తూర్పునుండి పడమరకును దేశమంతటను తిరిగితిని. ఎక్కడికిపోయి చూచినను సోదరీమణులందరును యేజాతివారైనను యేమతమువారైనను యీయాదర్శముకొరకే తహతహలాడుచుండిరి. మనము యీ ఆదర్శమును చేరుటకు పనిజేయుటెట్లు?

## జాతీయ విద్య

...దట నేను విద్యావిషయమై చెప్పెదను. తల్లులే విద్యా... నుండిన చిన్నవారలమాట యేమి చెప్పవలెను. ప్రతిరోజును ...యును పెద్దవాళ్లనుజూచియే పిల్లలు పరిశుభ్రమును, ధైర్య స్వయంసహాయమును, దేశభక్తిని నేర్చుకొందురు.

ఇంటివద్ద తల్లి పెంపునుబట్టియే పిల్లలనడవడి యేర్పడుచుండును. ... మనదేశములో సత్య, గౌరవశీల లోపములు గాన్పించుచున్న ...ల ఆలోపము మనదే. తన్నివారణోపాయము మన చేతులలోనే ...లదు. ఆత్మశరీరమానసముల అభివృద్ధి గాంచుట కవకాశములేనిసోదరీ మణులందరకును మనము సహాయము జేయవలయును. మన బాలికలకు గూడ నట్టి యవకాశ మొసంగవలయును.

మనము మన జాతీయవిద్యాలయములకు బలమునొసగి వానిని పని జేయించి మనపిల్లలకు మంచివిద్య చేకూరునటుల జూడవలయును. గాంధి, జాతీయవిద్యపై నంతయెక్కువపట్టుదలతో జెప్పినది యెందు ...కో యని మీరు చాలమంది ఆశ్చర్యపడుచుండవచ్చును. ప్రభుత్వ పాఠశాలలు బానిసలను తయారుజేయు ఫ్యాక్టరీలు తప్ప మరేమియును గావని ఆయన తెలిసికొనెను. సోదరీమణులారా, నేను ముఖ్యముగ మీకొకటి జెప్పగోరుచున్నాను. మీ కుమార్తెలు కుటుంబములో మగ వానిపై ఆధారపడకుండునటుల గౌరవముగ జీవనాధారమును సంపా దించుకొనునటుల యేచేతిపనులో నేర్పి సాధన మేర్పరుపవలయును. భారతదేశము చాలబీదదేశము. శక్తినంతను వృధాచేయజాలదు. ... కొలదిమంది విధవలు ఏమిచేయుటకును పనిలేక సోమరులై పరాధీనలై యున్నారు. ఈ స్త్రీలు ఉపాధ్యాయినులుగను, నర్సులుగ నుండునటుల నేర్పి పల్లెలలోను పట్టణములలోను వారిసోదరీమణులకు సహాయము జేయునటుల జేయవలెను.

## గ్రంథాలయములు

నేను ఆంధ్రదేశమునకు వచ్చినప్పటినుండియు యీదేశములో మీరు స్త్రీలుచేసినపని నాకు అద్భుతముగ గాన్పించుచున్నది. మీరాష్ట్ర ములో 500 గ్రంథాలయము లున్నవనియు, స్త్రీలు వానినిబాగుగ నుప యోగించుచున్నారనియు వినుటకు చాల సంతోషముగ నున్నది. ఈ గ్రంథాలయములు మీ సాంఘిక మానసిక, రాజకీయ కార్యములకు కేం ద్రస్థానము లగునని నేను నమ్మెదను.

## అస్పృశ్యతానివారణము

హిందూసోదరీమణులు మహమ్మదీయ సోదరీమణులకును, మాన వస్వత్వములు తిరస్కరింపబడిన దురదృష్టవంతులకును సహాయము చేసి వారికున్న స్వాతంత్ర్యమును సఫలపరచెదరని నేను కోరుచున్నాను. వారు నీచముగ అధోగతియందుండుట మనకు లజ్జాకరము. వారలను వైదొలగియుంచుట మన బలహీనము. వారిని మాదిగవాండ్రుగను బహి ష్కరించితిమేని మనము భారతీయులము ప్రపంచదృష్టిలోగూడ నట్లే యుందుము. మనకును వారికినిగూడ తండ్రియగు భగవంతునికొరకు వారి నుద్ధరించెదముగాక! వారొకవేళ సోమరులుగ నున్నను, కార్యాచరణ యందలిసంతోషమును లాభమును వారికి బోధించుట మీవిధియై యున్నది.

## ఖద్దరు ప్రచారము

ఇచట నూటికి 80 మంది ఖద్దరుధరించుటజూడ సంతోషమగు చున్నది. దీనిని జూచిననే మీరు ఖద్దరుయొక్క ఆధ్యాత్మిక, ఆర్థిక ప్రాముఖ్యమును కనుగొంటిరని తెలియగలదు. భారతదేశమందితర రాష్ట్రములుగూడ మిమ్ము జూచిన నేర్చుకొనునని నమ్ముచున్నాను. మీరు ఆంధ్రదేశమందు అందరును ఇంకను ఎక్కువప్రయత్నములజేసి యీదేశములో ఖద్దరుగట్టనిస్త్రీగాని, పిల్లగాని లేదని చెప్పగలస్థితి రావలయును.

## త్యాగము - కష్టానుభవము

ఈవారము కాకినాడయంతయు కార్యనిమగ్నమై యున్నది. మీరు నాయకుల నెందరనో చూచితిరి. కాని మనము ధర్మరాజ్య మునుసంపాదింపవలెనన్న బుద్ధిపూర్వకముగ స్వార్థత్యాగమును జేయ సిద్ధముగ నుండవలెనని జ్ఞాపకముంచుకొనవలయును. మీరాష్ట్రము గల దువ్వూరి సుబ్బమ్మగారివంటి స్త్రీని జాతీయోద్యమమున కర్పించి నందుల కభినందించుచున్నాను. ఆమె రెండుసారులు సంవత్సరం సంవ త్సరం శిక్షబొందెను. కాని మీరింకను కష్టముల బొంది త్యాగము గావించి ఆదర్శమును జేకవలయును. మీరు కష్టములను సంతోషముతో భరించెదరని నాకు దెలియును. ఒకవేళ అధైర్యమువచ్చు నెడల ప్రాణము పోవుచున్నను సహనముతో ధైర్యముతోనుండి దేశమునకు ప్రాణము లర్పించిన వాజపేయిగారిని స్మరణకు దెచ్చుకొనుడు. మన అహింసా సైన్యమునందు ధైర్యముగల సిపాయిలలో ఆయన ఒకడని మన మెప్పు డును స్మరించుచుండవలయును.

సోదరీమణులారా, తుదకు ముగించుచు నేనొకటి జెప్పెదను. మన కార్యక్రమము విజయమందుటవలన మనము స్వరాజ్యమును పొందు టయేగాక ఆచంద్రార్కమును కీర్తికాయులమై పశుబలము జయింప జాలదనియు ఆత్మశక్తియే జయింపగలదనియు మానవకోటి కంతకును దెలుపగలమని మనసునందిడుకొనవలయును.

వందే మాతరం

# ఆంధ్ర భజగోవిందము

బాలకవి తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు

ఓరరే! యెంతవివేకహీనుఁడవు లోకాధారు గోవిందునిన్
గరుణాసాగరు సంస్మరింప వకటా! కాలుండు నీ ప్రాణముల్
సరగన్ దీయుచునున్న కాలమున లేశంబైన నిన్నీ "డుకృఞ్
కరణే" పాఠము రక్షసేయ దిది నిక్కంబోరి మూఢాత్ముఁడా!

ఉ. విత్తము సేకరింపవలె వేలకువేలను కోర్కె మాని నీ
చిత్తమునన్ దురాశలనుఁ జేరఁగనీక సుబుద్ధి గల్గి నీ
వృత్తముచేత లబ్ధమగు విత్తము కాసయినన్ సహస్రమం
చత్తినవేడ్క నెంచుకొనుమా! వినుమా! యనుమాన మేటికిన్.

చ. పొలఁతుకగబ్బిగుబ్బలను పొక్కిలిఁ గన్గొని మోహవార్ధిలో
పలఁ బడఁబోకు పోకు మిఁక బాగుగ వానినిఁ జీము నెత్తురున్
గలిగినకండలంచుఁ బొడగాంచినవేళల మాటిమాటికిన్.
దలఁచుము పైమెఱుంగులకు దాసుఁడవై చెడిపోకు మజ్ఞుఁడా!

మ. నలినీపత్రపయఃకణంబుగతిఁ బ్రాణం బస్థిరత్వంబు, మ
ర్త్యులు తృష్ణామయపీడితాత్ములగుచున్ దుఃఖాబ్ధినిర్మగ్నులై
తెలివింగోల్పడి దారిఁగానకఁ గడున్ దేహాభిమానంబుతో
నిల వర్తింతురుగాని సౌఖ్యపదువారెవ్వారలూహింపఁగన్.

ఉ. వేలకువేలు మానవుఁడు విత్తము నార్జనసేయు వేళలం
దాలును బిడ్డలున్ హితులు నందఱు నాదల మోయుచుందు ర
య్యాలుమ బిడ్డలున్ హితులె యర్థముఁ గూర్పఁగలేక వృద్ధుడై
కాలముఁ బుచ్చువేళఁ బొడగాంచరు పిల్చినఁ బల్కరకటా!

ఉ. బొందిని బ్రాణవాయువులు పొల్పుగ నుండెడువంతదాఁక ని
న్నందఱుఁ గూర్మిమై కుశలమా? తమకంచును బృచ్ఛసేతురో
మందుఁడ! నీవు చావఁగనె మక్కువఁ జూపిన పెండ్లమైన నీ
యందపుమేనుఁ జూడ భయమందు నసహ్యమునందు నెంతయున్.

ఉ. కా సాకవేయిగాఁ దలఁచి కల్లలుఁ బొల్లలుఁ గూసి సొమ్ముఁ బే
రాసను గూర్చనేల! విను మర్థమనర్థము సౌఖ్యమందునన్
వీసముఁ గానరాదు సుమి విత్తముగల్గినయట్టివారికా
రా! సుతుఁడైన సంతతభయప్రదుఁడేగద యెంచిచూడఁగన్.

చ. చెడుగుడులాడఁ బోడఁగనుఁ జిన్నతనంబున నాస, లందపుం
బడఁతులతోడఁ గూడ నెలప్రాయమునం దభిలాష, లంత వృ
ద్ధుఁడయిన చిమ్మటన్ విషయదుఃఖములన్ గృశియించు నింక నె
ప్పుడు మనుజుండు బ్రహ్మపదపూజ నొనర్చి తరించుఁ జెప్పుమా.

శా. దారాపుత్రులు మిత్రులెవ్వరుఁ విచిత్రం బూహసేయంగ స
సారం బంతయు భ్రాంతికల్పితము నిస్సారంబు సంబంధు లె
వ్వారున్నారలు? నేనెవండ? నిటురా నేకారణం? బెవ్వరి
దారాపుత్రులుమిత్రులంచు మదిలోఁ దర్కించినన్ మేలగున్.

శా. రాగత్యాగముగల్గు సత్పురుషమిత్రత్వంబునన్ దానిచే
వేగన్ గల్గును మోహనాశనము భావింపంగ నిర్మోహతన్
బాగై నిశ్చలమై విశుద్ధమగు, తత్త్వజ్ఞానసంప్రాప్తియౌఁ
దాఁగల్గించును గాదె శాశ్వతసుఖోద్యన్ముక్తి భక్తాళికిన్.

ఉ. కాయపటుత్వమెల్లఁ జెడఁ గామవికార మదెట్టులుండుఁ బా
నీయము శుష్కమైనతటి నిల్చునె చెఱ్వనునట్టినామ? మా
దాయము బోవ సేవకులుఁ దగ్గర యుందురె? తత్త్వవేత్తగాఁ
బాయకయున్నె సంసరణబంధము? డెందమునం దలంపఁగన్.

ఉ. భోగము భాగ్యమున్ సతులుఁ బుత్త్రులు మిత్త్రులు నిత్యమంచు
వీగతి మోసపోకు మివి యెల్లనుగల్ల యటంచు వానిపై
రాగము మాని విశ్వపరిరక్షకు నక్షయసౌఖ్యదాయకున్
బాగుగ నమ్మి కొల్వుము శుభంబగు, నన్యవిచార మేటికిన్.

చ. శిశిరవసంతకాలములుఁ జిత్రకరంబగు సందె వేకువల్
నిశలుఁ బవళ్లునుం దిరుగు నిత్యము నాయువుఁ దీఱుఁగాని యో
కృశమతి! నిన్నుఁ గ్రమ్ముకొని కేరుచునుండిన కోర్కె గాడ్పుల
భృశముగ నుండుఁగాని చలియింప వొకింతయు నేమివింతయో

మ. ధనసంపాదనఁ జేయుకోరికయె వ్యాదిగ్లంబయ్యె నాకార! దీ
నిని మానందగునంచు నింతవఱకున్ నీకెవ్వరున్ జెప్పరో
ఘనసంసారసమావ్యయాబ్ధిఁ గడవంగన్ లోకము ల్మ్యాటు, స
జ్జనసాంగత్య మొకండె నావ యగుచున్ సాయంబుఁ జేయుంగదా

ఉ. కావిమెఱుంగుదోవతులఁ గట్టినబోడులు జోగులు న్మునుల్
భూవలయంబున న్నిరతమున్ దిరుగాడుచునుంద్రు గాని స
ర్వావృతుఁడైన బ్రహ్మము నహో! కనఁజాలరు పొట్టకూటికై
యీవిధి దంభవేషముల నెత్తెదువారిక దెట్లు చేకుఱున్.

చ. ముడుతలువాఱె మేను, శిరము న్నెరసెం గద ముగ్గుబుట్టుటల్
దొడదొడనూడె దంతములు తుండము బోసిగ నుండె వృద్ధుఁడై
యడుగిడలేక దండమును హస్తమునం గొని నూఁతకోలగా
విడువఁడు తృష్ణ నిప్పటికి వెంగలిమానిసి యేమి సెప్పుదున్.

నగ్నీ వెన్కను నభోమణి గడ్డమునందు జానువుల్
రాత్రులందు నిడ వూటకుఁ బూటకు బిచ్చమెత్తి చే
చెట్లనీడల సతంబుఁ దపం బొనరించువానినై
పట్టియాడ్చును వినమ్రునిఁ జేయును తృష్ణ భూసురా!

సాగరయాత్రలన్ సలిపినన్ గాంగేయదానంబు లు
ంగన్ భూసురకోటికిచ్చిన వ్రతంబుల్ పెక్కు గావించినన్
ంగోపాంగముగా శ్రుతిస్మృతుల నభ్యస్తంబు గావింప నె
ంగిన్ దత్త్వవివేకహీనునకు లబ్ధంబౌను మోక్షం బిలన్.

ఆలయసీమలందు సొబగౌ తరుమూలములందు నిల్చుచున్
నేలను నిద్దురింపుచును నెమ్మి మెలన్ బులితోలుఁ గట్టి ని
ర్మాల మొనర్చి రాగముల భోగములన్ ద్యజియించి బ్రహ్మమున్
జాల భజించునట్టి ఘటిసౌఖ్యము వాకొన శక్య మెట్లగున్.

. యోగివరేణ్యుఁడైన నిల నుత్తమభోగివరేణ్యుఁడైనఁ దా
రాగవిహీనుఁడైన ఘనరాగసమేతుఁడునైన నిత్యమ
య్యాగమవేద్య సర్వగుణాఢ్య సనంతు నకల్మషున్, బరున్,
బాగుగఁ జింతనం జడిన బ్రహ్మపదంబునుఁ జేరకుండు నే.

. గీతలలోపలన్ వెలయుకీలు నెఱింగినవాఁడు, స్వర్ధునీ
పూతజలంబుఁ ద్రావినసుపుణ్యుఁడుఁ గేశవనామకీర్తన
ప్రీతుఁడుఁ బ్రేతనాయకవిభీషణముద్గరమున్ దలంచఁడా
భీతిల నేల? నయ్యముని బింకము సాగునె వానిముందటన్.

. పలుమఱు జన్మమెత్తుటయుఁ బల్మఱుఁ జచ్చుట మాతృకుక్షిలోఁ
బలుఁ బలుమాఱు సొచ్చుటయుఁ బాపపుసంసృతిలబ్ధములగదా
తెలియుము కర్మబంధములఁ ద్రెంపి సుఖించెడుమార్గ మిందుకై
జలజభవాండపూరితపిచండు ముకుందుని సేవఁ జేయుమా!

. యోగనియోజితాత్ముఁడగు యోగివరేణ్యుఁడు సందుగొందులన్
మూగినయట్టిపేలికల బొంతలు గుట్టుచుఁ బుణ్యదుష్కృత
త్యాగ మొనర్చి బాలునివిధంబునఁ జిత్తవికారికైవడిన్
బాగుగ నిత్యమోదమున భాసిలుచుండు జగంబులోపలన్.

. ఎవ్వఁడ వీవు! నే నెవఁడ? నెచ్చటినుండియు వచ్చినార? మీ
యవ్వయు నయ్యయు నెవ్వరని యాత్మఁ దలంచిన స్వప్నతుల్యమై
నివ్వెరగౌఁ గదయ్య! యిది నీ విఁక బంధవిముక్తినొంది యా
కవ్వడినేస్తగాని పదకంజయుగంబును బూజసేయుమా!

ఉ. అందఱిలోపలన్ వెలయునట్టిమహాత్ముఁడు విష్ణువొండె యా
చందమెఱింగి భేదములఁ జంపియు భూతదయార్ద్రబుద్ధిచేఁ
బొందుము మోక్షసౌఖ్యములఁ బుట్టుట గిట్టుటఁ గట్టిపెట్టు మో
మందుఁడ! నీవు నే ననెడిమత్సర మేటికి మాటిమాటికిన్.

ఉ. లోపలిశత్రుషట్కమును లొంగఁగఁ జేసినపుణ్యుఁ డాత్మస
ద్రూపముఁ గాంచి ధన్యుఁడగు రూఢిగ నట్లొనరింపలేనియా
పాపుఁడు కాలకింకరులబాధలఁ బొందుచుఁ బుట్టిగిట్టుచున్
శ్రీపతిఁ జేరుమార్గమును జేరఁగలేఁ డతఁ డెన్నినాళ్లకున్.

శా. గీతానామసహస్రము న్నిరతమున్ గీర్తింపుచూ, శ్రీపతిన్
జేతోవీథి నఖండభక్తి వెలయన్ సేవింపుమా, సజ్జన
వ్రాతస్నేహముచేతఁ బూతమతివై వర్ధిల్లుమా, దీనసం
ఘాతంబున్ ధన మిచ్చి సాఁకు, మివె సత్కార్యంబు లుర్వీస్థలిన్.

*ఉ. వైరులమీఁదఁ గోపమును బాంధవమిత్రకుమారకోటిపైఁ
గూరిమిఁ జూపుచుండుటయుఁ గూడదు కూడదు సర్వమీశ్వరా
కారమె, సంధివిగ్రహవికారవిదూరుఁడవై మెలంగు మీ
దారిఁ దొలంగినన్ భవశతంబునకున్ గడతేఱలే విఁకన్.

ఉ. రోగము లుద్భవిల్లునని రోయక మాయకుఁ జిక్కి కామినీ
భోగము లిచ్ఛగించెదవు భూసుర! మృత్యువు తప్పఁబట్టిదు
రోగమటంచు నెఱింగియు నయో! దురితాచరణేచ్ఛమాన వీ
త్యాగము లేక ముక్తి కలదా? యిలలోపల నెట్టివారికిన్.

శా. ప్రాణాయామ మొనర్చి పిమ్మటను బ్రత్యాహారమున్ జేసి ని
త్యానిత్యంబులచర్చ సల్పి జపయుక్తాత్మాంతరంబందు మో
హానందప్రదుఁడైన బ్రహ్మమును నిర్వాలోకనన్ జేయు మ
జ్ఞానారణ్యమునందుఁ జిక్కుకుము మోహావేశతన్ దుర్మతీ!

మ. తొలుతన్ సద్గురుపాదసేవ సలుపన్ దోడ్తోడ నద్దానిచేఁ
గలుగున్ సంసృతిపాశమోక్ష మిది నిక్కంబంత యొమ్మద్వైని
ర్మలహృద్రంగమునం గనంబడు జగన్మాన్యుండు దేవుండు ని
శ్చలచిత్తంబున బోధితాంశములపై సాగింపుమీ యత్నమున్.

---

* ఈ పద్యము మొదలు నాలుగు తుదపద్యములు వేమూరు వెంకటకృష్ణమసెట్టి అండు సన్సువారిచేఁ బ్రకటింపఁబడిన శ్రీశంకరాచార్య విరచితమగు లక్ష్మీనృసింహస్తోత్రగ్రంథాంతమున శ్రీమదాచార్య విరచితములై ప్రస్తుత పరిశోధనలవలన లభించిన భజగోవిందశేషశ్లోకము లని ' మోహముద్గరశేష ” మను పేరఁ బ్రకటించిన శ్లోకచతుష్టయమున కాంధ్రీకరణము.

# మహాకవి రవీంద్రుడు

తణికెళ్ల వీరభద్రుడుగారు ఎమ్. ఏ.

[రవీంద్రునివాక్యము లీవ్యాసమం దాంధ్రీకరింపబడినవి. ఒకభాషలోని యుత్తమవాక్యముల మఱియొకభాషలో వ్రాయుటయందును కవిసార్వభౌముని గీతముల నల్పుడు భాషాంతరము చేయుటయందును రసనష్టము కాకతప్పదు. పండితులు మన్నింతురుగాక.]

ప్రస్తుతమున ప్రపంచమందలి కవులెల్లరిలో నుత్తముడని ఘనతవహించిన హైందవుడగు రవీంద్రుడాధునికయుగమందలి లోకపురుషులలో నొకడు. కవిత్వవిషయములో నతనిని "సర్వజ్ఞుడని" పిలువవచ్చును. ఆతని నాటకములును, గీతములును, కథలును, లేఖలును, వచనమును, కావ్యమును నవయుగసారస్వతమునకు నూతనోజ్జీవము గల్పించినవి. రసభరితములగు గీతముల రచించుటయం దాతనికళాకౌశల మద్భుతము. సృష్టి చిత్రముల వర్ణించుటయందును, ప్రకృతికిని మానవజీవితమునకు గల చెలిమి సూచించుటయందును నాతని ప్రజ్ఞ యసమానము. తనమాతృభాష కాకపోయినను నాంగ్లమం దతనికి గల రచనాకౌశల మపారము. ఆతనిని కవిగాయకుడని చెప్పినపుడు, పనిలేక వీథులవెంబడి తిరుగుచు, వెఱ్ఱిమొఱ్ఱిపాటలను బాడునాదర్శరహితుడని కాదు. అత డాధునిక యుగమందలి "కవివీరుల"లో నగ్రగణ్యుడు. మహాకవులందఱును "శూరుల"నియు లోకోద్ధారకులనియు గతశతాబ్దమం దొక యాంగ్లమహనీయుడు నొక్కి చెప్పుచుండెను. ఏపురుషుని వర్ణించినను, ఏకాలము వర్ణించినను, బాహ్యప్రపంచము వీడి మానసవీథిని జేరి, వారి వారి యాదర్శములను గనుగొని వానితత్త్వమును బోధించుట కవికర్తవ్యమయియున్నది. వేలుత్రిప్పి ద్వారము దెఱచి యుగముయొక్క మానసగృహమును జొరనిచ్చి, దానియం దతీతమైన పదార్థ మేదిగలదో దానిని సంగ్రహించి యారసమును గ్రోలుటకు సమర్థత నీయగల కవీశ్వరుడే కవిశూరుడను బిరుదమున కర్హుడు. సారస్వతము సృష్టియొక్క ప్రతిబింబమును జూపును. అనగా పరమ రహస్యమును వెల్లడిచేయును. ప్రతిక్షణమందును, మానవజీవితమను నాటకము మనయెదుట బ్రదర్శింపబడుచున్నది. కాని మనకు నేత్రములుండియు చూచుట లేదు. చెవులుండియు వినుట లేదు. కాబట్టి బహిరంగమయ్యు నిది రహస్యమయినది. నిత్యమును బ్రదర్శింపబడు మానవనాటకములోని ముఖ్యాంశములను దీసి, వాని గళను జేర్చి, చక్కని యాకృతి నిచ్చి మనహృదయమాలిన్యమును ద్రోసివైచి, మనల నున్నతపదవికి దేగలిగిన కవియే మహాకవియనబడును. ఆధునిక యుగమందలి కవులెల్లరిలోను రవీంద్రుడీశతాబ్దతత్త్వమును బాగుగ నెఱింగినవాడు. లోకమందలి దేశములన్నియు నేసమస్యచే బీడింపబడుచున్నవో గ్రహించి దైవికాదర్శములేని జీవనము నిరర్థకమని దేశదేశములకును బోధించుచున్న మహాశయుడు. పక్షు లుదయమున దమగూండ్లను విడిచి యొక చెట్టుమీదనుండి మఱియొక చెట్టుమీదికి బోవుచు, నేలాగున కొంతసేపొక కొమ్మమీదను మఱికొంతసేపు మఱియొక కొమ్మమీదను గూర్చుని పాడుచుండునో, ఆవిధముననే యీగంభీరమగు హైందవపక్షి ఇంగ్లాండునుంచి అమెరికాకును అమెరికానుండి జపానునకును దన సందేశమును గొంపోయి కావ్యగీతములు పాడుచుండును. దినమంతయు బాటుపడినపక్షి సాయంతనమున గూటికి జేరినట్లుగా, నొకదిగ్విజయయాత్ర సలిపిన పిదప తిరిగి శాంతినిలయమగు స్వగృహమునకు జేరుచుండును. ఈకవి కెట్టి యున్నతాదర్శమున్నదో యాతనిమాటలే సాక్షి:-

మహాప్రభూ, నాచేష్టలన్నిటి యందును నిన్ను జూపింపవలయుననియే నాముఖ్యోద్దేశము.....................

లోకులు నాకృతులన్నిటి యందును నీప్రతిబింబమునే చూచెదరు..........................................

కవివాక్యములనుండి యెవరికి రుచించినయర్థమును వారు తీయుదురు; కాని, నాపరమార్థము సదా నిన్నే సూచించును.

ఇదియే రవీంద్రుడు తన గీతములందు బోధించు తత్త్వము. దీనిని బోధించుటకే తాను లోకయాత్ర సల్పుట. ఒకసందర్భములో నాతడు వర్ణించినరీతిని, తాన

...ని టపాజవానట. లోకపాలకుని వార్తను వీథి
...ంటింటికిని గొంపోవుటకై తాను నియమింపబడి
...ట. రవీంద్రుని కవిత్వము భక్తిరస ప్రధానము.
...తాంజలి" మన హిందూదేశమందే కాక పాశ్చా
...దేశములయందును మెప్పువడసి పశ్చిమవిద్వాంసులు
...జాలిన మహోన్నత గౌరవమునకు (నోబిలు ప్రైజు)
...మైనది. ఇది యీకవి తన భావగీతములను పుష్పము
...పరమేశ్వరునికి సమర్పించిన పూలహారము. ఈగీతము
...లయందు మానవహృదయము పరమాత్మముతో నైక్య
మగుటకు నెట్టివిధమున బరితపించుచున్నదో చక్కగావర్ణిం
పబడినది. సదా పరమేశ్వరుని ధ్యానించుచుండు భక్తుడు భగ
వంతుడు తనకు బ్రత్యక్షమగుటకు ముందు తల్లడిల్లువిధము
ను, ఆతని యత్నములును, ఉత్సాహమును, ఒకానొకసమ
యమందు జనించు నాశాభంగమును, వివరముగా వర్ణింప
బడినవి. ఈదిగువ వాక్యములనుండి యీ మహాభక్తుని
యాందోళన మెట్టులున్నదో చూడనగును. నా శరీర
ప్రాణములను దుదకతనిచేతిలో నప్పగింపవలెనని యాత
నికి బ్రేమ మెప్పుడయినను గలుగునాయని వేచియుంటిని.

నీవే నాకోరిక. నీవు తప్ప నాకు వేరుకోరిక లేదని
నాహృదయము ప్రతిక్షణమందును జపించునుగాక. నా
దృష్టిని మరల్చు నితర కోరికలన్నియు నసత్యములును
నిస్సారములును కదా !

పరమాత్మా! నాశరీరమును హరించి నీవే నాసర్వ
మని సూచింపగలిగిన స్వల్పభాగమును మాత్రమే నిలు
పుము. ఏ ప్రక్క తిరిగినను నీస్పర్శము నే యనుభవించు
టకును, ప్రతి క్షణమందును నీసన్నిధికివచ్చి నాప్రేమను
సమర్పించుటకును సమర్థత నిచ్చు కొలదిభాగమును
మాత్రమే విడిచి, నామానసమును హరింపుము.

ఈ పరమభక్తునికి పరమేశ్వరుడు ప్రభువు, తండ్రి,
సోదరుడు, మిత్రుడు. ఏయే సమయములం దెట్టి యుత్సా
హము జనించునో దానిని వేర్వేరుచోట్ల నీరీతిని వర్ణించి
యున్నాడు.

మహాప్రభూ! గానామృతమును ద్రాగి యున్మత్తుడ
నయి, పరిపాలకుడవగు నిన్ను మిత్రుడాయని సంబోధించు
చుంటిని.

రాజుల కెల్లరకును రాజగు నీమహారాజాధిరాజెవ్వ
డని యాశ్చర్యపడుచుంటిని. రారాజా! నేను నీయెదుటనే
నిలువబడితిని.

అన్నా! నా సోదరులలో ముఖ్య సోదరుడవు. నా
యార్జనమును సంతోషముతో నీతో బాల్గొనెదనురమ్ము.
నీవే నాతండ్రివి. నీపాదములకు సాష్టాంగ ప్రణా
మంబుల నాచరించుచున్నాను.

అమ్మా! నీమెడ నలంకరించుటకు నాకన్నీటి బిందు
వులతో నొక ముత్యాలహారమును గూర్చితిని. దయ
యుంచి స్వీకరింపుమా!

ఈవిధముగా నీభక్తాగ్రేసరుడు భగవంతుని సంబో
ధించి యున్నాడు. పరమేశ్వరుడు పరిపూర్ణుడు, సర్వ
గుణుడు, ఏక్షణమం దేయే గుణములు భక్తుని మనస్సు
నాకర్షించెనో, ఆయా మానసస్థితు లీ యాకారములను
దాల్చినవి. మానవుడు గంభీరమగు సృష్టివైచిత్ర్యము
లను దిలకించునపుడు, అఖిల ప్రపంచ సార్వభౌముని
ఠీవి కాన్పించును. ఆకాశమునుండివర్షమునుగురిపించి సృష్టి
యంతకును జల్లదనమిచ్చుచు పరిపాలకుడు తన కరుణా
రసమును వెదజల్లునపుడు, చిరునగవుగల ముఖముతో
ప్రేమతో నిండిన చేయి జాపి, 'నాయనా' యని పిలిచి
హృదయమును గరిగించు కన్నతల్లి జ్ఞాపకము వచ్చును.
మనపవిత్రగ్రంథ మగు భాగవతమందు మనుష్యుడు
లోకమం దేయేయానందముల నపేక్షించునో, ఆయా
సౌఖ్యము లన్నియు భగవద్ధ్యానముచే బొంద వచ్చునని
వర్ణింప బడినది. శ్రీకృష్ణుడు తా నొకనాటిరాత్రి యక
స్మాత్తుగా వేణుగానము సలుప ప్రారంభించినపుడు, గోపిక
లందఱును గీతమార్దవముచే హృదయములు చలింప,
తమతమగృహకృత్యములను సేవలను వదలి యర్ధరాత్ర
మందా మహాగాయకుని వెదుక మొదలిడిరి. తమతమ
భర్తలను దలిదండ్రులను బిడ్డలను వదలి తనకై పరుగిడుట
ధర్మమాయని పరిపాలకుడు వారిని బ్రశ్నింప వారిచ్చిన
ప్రత్యుత్తరమేమి?

ఉ. పతుల న్బిడ్డల బంధుల న్సతులకు న్బాటించుటే ధర్మ ప
ద్ధతి యౌ నంటివి దేహధారిణులకు న్ధర్మజ్ఞ! చింతింపుమా
పతిపుత్త్రాదికనామమూర్తి వగుచు న్భాసిల్లునీయందుఁ ద
త్పతిపుత్త్రాదికవాంఛల న్సలిపి సంభావించు టన్యాయమే?

ఈ గీతములయందు మానవమనస్సు పడు పరితాపము
స్పష్టముగా వర్ణింపబడినవి. ఒక ప్రేమగల చక్కనియువతి
తన ప్రాణేశ్వరుని రాక కెదురు చూచుచు, తన ప్రియుని
హస్తముల నడుమనిమిడి సమస్తప్రాపంచిక బాధలను
మఱచి మహానందము ననుభవించు తరుణముకొరకు వి...

ల్లూరుచున్నట్లు మానవహృదయము పరమేశ్వరుని స్పర్శమునకై పరితపించుచున్నది. అట్టి ఉత్కటమగు నాశతో నిండియుండిన ప్రాణికోరిక చెల్లింపబడనపుడా ప్రాణికి నిరుత్సాహమును నాగ్రహమును జనించుటలో నేమి యాశ్చర్యము కలదు? ఈపరిస్థితి నీదిగువ వాక్యములలో కవి వర్ణించి యున్నాడు.

"నిన్ను కలిసికొనవలెనను కోరికతో జీవించియుంటిని. కాని యా సమావేశమింకను లభింపలేదు. క్రూరుడవై నీయాకారమును నానేత్రములకు గనబడకుండ దాచి కొనెదవేల? ప్రభూ! రాత్రియంతయు గడచినది. కాని నీప్రియదర్శనము కానేలేదు.

అతడు లేచి లేచి హృదయేశ్వరుని దర్శనాభావముచే జనించిన నిరాశలో మునిగియున్నపుడా మానసము దిలకింపుడు.

నీవు నీముఖము జూపింపక, నన్ను పూర్తిగా వదలి వేసిన యెడల, నీదీర్ఘములగు వర్షకాలపు దినముల నెట్లు గడపగలను?

మిత్రమా! నాకు నీవే దిక్కు. ప్రాణప్రియా! నా యింటి తలుపులు తెఱచియే యున్నవి. స్వప్నమువలె క్షణములో నదృశ్యము కావలదను నా విన్నప మాలకింపుము.

నాకీరాత్రి నిద్రపట్టుట లేదు. క్షణ క్షణమునకును ద్వారముతీసి చీకటివైపు జూచుచుంటిని."

ఈవిధమున వేచి వేచి విసిగి తుద కీచందమున మొట్టపెట్టుచున్నాడు.

"ఒకదినము వెనుకొ మఱియొకదినమునడచుచున్నది. కాని నీదర్శనము లభించుటలేదు. హృదయపాలకుడా! ఇక వేచియుండజాల."

రవీంద్రుడు గీతాంజలియందుమానవప్రాణి యనంతమయినదిగా వర్ణించియున్నాడు. మొదటిగీతమందే యీ యుత్తమతత్వము సూచింపబడినది.

"నీవు నన్ననంతునిగా జేసితివి. నాయందు నీకట్టి దయకలదు. దుర్బలమగు నీపాత్రములోని జలమును శారబోసి యెప్పటికప్పుడు తిరిగి నేటితో నింపుచుంటివి."

మనుష్యుని జీవితమాతనిమరణముతో నంత మొందదనియును, ఆత్మ శరీరము క్షీణింపగనే తిరిగి వేఱొక గృహము నిర్మించికొనుననియు మన నమ్మిక. కావ్యములందు సాధారణముగా మానవజీవితము, అతనుష్యుని చర్యలును, ఆశయములును వర్ణింప బడి కాని యాతని చరిత్ర ముగిసి శరీరమదృశ్యమయి నాతనిజీవి కేమి వాటిల్లునో కవీశ్వరులు వర్ణింపరు. మృత్యువనగా నెవ్వరికయినను భయంకరమైన దురూహ్యమైనదియు నగుసమస్య. ఎంత వేదాంతనను మృత్యువును తలపగనే భయకంపితులు కాకమా. ఆంగ్లవాఙ్మయమందు మానవజీవితములోని నవరసలును వర్ణింపబడినవి. కాని యంధకారమగు మృత్యుదేశముగూర్చి వర్ణించినవారుకాని దాని పేరు తలప నుత్సాహము జనించినవారు కాని కానరారు. ఆదిపురుషుని సృష్టినిగురించి యుత్తమగ్రంథమును రచించి, సూర్యమండలము, చంద్రమండలము, తారామండలము మొదలుగాగల లోకములతో గూడిన సర్వబ్రహ్మాండమును నయితము వర్ణింప గలిగిన మిల్టను మహాశయునకు మృత్యురహస్యము తెలియలేదు సరికదా భయముకలిగినది. స్వర్గలోకమందలి నందనోద్యానమునందు,

కల్పవృక్షమును కలివృక్షమును కలిసి జంటగానున్నవి. అనగా మృత్యువు జీవితమున కంత సమీపముగానుండును—మృత్యువనగా నేమో కాని, ఏమయిననసరే, మొత్తముమీద నేదో యొక భయంకరమైన శక్తియని చెప్పుటకు సందేహములేదు.

ఆంగ్లదేశమందలి కవులలో నగ్రగణ్యుడై జగద్విఖ్యాతిగాంచిన నాటకకర్తయై మానవ జీవితపటములోని ప్రతియంశమును నైపుణ్యముతో చిత్రించి, భూమినుండి యాకసమువంకను నాకసమునుండి భూమివంకను జూచి నంతనే సృష్టినంతను వశముచేసికొన గలిగిన యాంగ్లకవి సార్వభౌమునకు మృత్యువనగా నెవ్వరును బూర్తిగా తెలిసికొననిదేశమట. ఆదేశమునుండి యెప్పుడును ఒక్క బాటసారి యయినను దిరిగివచ్చి మన కాచిత్రములను వివరింపలేదట. ఈ నాటకకర్తయొక్క ముఖ్య గ్రంథమందు కథానాయకుడు పరమ ధర్మాభిలాషి. అతడు లోకమందలి యధర్మమునుజూచి విసుగుజెంది, జీవించుటయా మానుటయా యని తనలో తాను చాలసేపుతర్కించుకొనుచుండెను. ప్రాణముబాసి ప్రాపంచక బాధలను దొలగింపవచ్చునని తీర్మానించెనుగాని ప్రాణముపోయిన వెనుక నేమిజరుగునో తెలియకపోవుటచే గలిగిన భయము మనో

గదలించెనట. కడపటి యంకమందు విష
మున మరణ మాసన్న మగుటచే విచారనిమ
గ్నుఁ చెంత నిలువబడిన మిత్రుని యొక్కయు, ధర్మ
స్వార్థత్యాగియయిన తన్ను జూచి యచ్చెరు
వు దిదృక్షులగు మానవకోటియొక్కయు సెలవు
ని తన జీవితార్థమును లోకమునకు బోధింపమని
రుచు ప్రాణము పైకిపోవు సమయమున కనులుమూసి
కొడు "ఇటుపైని యంధకారము" అని పలికెను.
అనగా ధర్మనిరతుడగు నీయువకునికేకాక యాతని సృష్టి
కర్తయగు కవిపుంగవుని కాతరుణమున మానవజీవితా
నంతర మంధకారముగా దోచెనని చెప్పుట యతిశయోక్తి
కాదు. కాని మృత్యువును గురించి మన హైందవకవి
చెప్పిన వాక్యములు వేరుపద్ధతిగానున్నవి. నాటకమందు
ప్రథమాంకమందు ప్రారంభింపబడిన కార్యములు పంచ
మాంకమందు సఫలము లగును. అవి పూర్ణత్వమును
బొందును. మృత్యు వటులనే జీవితమునకు గడపటి
యంకము వంటిదట. అతని యుత్సాహ మీదిగువ
వాక్యములవలన తేటపడును.

చావు బ్రతుకులు కవలపిల్లలు. నాకు జీవితమం
దుత్సాహ మున్నది. కావున మృత్యువు నందును నభి
మానముకలదు. చంటిపిల్లవాడు పాలుత్రాగుసమయ
మున దల్లి కుడి స్తనమునుండి తప్పించి నపుడు బిగ్గరగా
నేడ్చును. కాని యుత్తర క్షణమే ఎడమవైపు స్తనము
నోటికి తగులగా నూరకుండును.

అనగా ప్రాణి యీ లోకమునుండి బలాత్కార
ముగా లాగబడినప్పుడు దుఃఖించును. కాని వెంటనే
రెండవలోకమును జూచి సఖ్యపడును. కాని మనుష్యుడు
తాను లోకయాత్ర సల్పిన కొలదిని ప్రాపంచక మాలిన్య
మెక్కువగును. రవీంద్రునికి దానెప్పుడు లోకద్వారము
దాటునో జ్ఞాపకము లేదు కాని యొక్కమాటమాత్రము
తెలియునట. వయస్సు ముదిరినకొలదిని దైవికతేజమునకు
దూరుడగును.

నాపేర బిలువబడు ప్రాణి యీ చీకటికొట్టులో
దుఃఖించుచున్నది. నేనతిశ్రద్ధతో కోటగోడవలె నీగోడను
కట్టుచున్నాను. ఈ గోడ వృద్ధియయి ఆకాశము వైపు
పెరిగినకొలది, నల్లనిదాని నీడలో నా నిజరూప మానాటి
కానాడు హరింపబడగా, నంతకంతకు నాకది యదృశ్య
మగుచున్నది.

మనము పెరిగినకొలదిని ఐహికబంధములు
హెచ్చుచుండును. మనుజుడు మిక్కిలి శ్రమపడి ఐశ్వ
ర్యమును సంపాదించునే కాని తుదకు దన 'ఖజానాకొట్టులో
తానే ఖైదీగా పట్టుబడె ననుమాట గమనింపడు. ఈ
యథార్థమునే, రయొక తత్త్వజ్ఞుడు చిత్రముగా వర్ణించెను.
మానవుడు స్వాతంత్ర్యముతో బుట్టును; కాని యినుప
గొలుసులతో దన్నుదానే బంధించుకొనుట యాశ్చర్యము.

గీతాంజలి యాధునికయుగమందు రచింపబడిన
భక్తిరసప్రధానములగు గ్రంథములలో నుత్తమమయినది.
అద్దియొకమత గ్రంథమని చెప్పవచ్చును. దీనియందు సర్వ
జనసమ్మతమైన మతమే వర్ణింపబడినది. నిజమతాభి
మాని హృదయనైర్మల్యము కరుణారసము దైవభక్తి
కలవాడయి యుండును. నిజభక్తుడు తనలోపములను
గ్రహించి మనోవాక్కర్మములందు నిర్మలతకు యత్నించు
చుండును. భగవంతునియందు భారమువైచి సదా పరమ
పురుషుని నామసంకీర్తనము గావించుచుండును. నిజ
భక్తునివలె రవీంద్రుడు తన ఐహికలోపములను రూపు
మాపుమని సర్వవేళలయందును జగదీశ్వరుని ధ్యానించు
చుండును.

తండ్రీ! నాబుణము లెన్నియో కలవు. నాలోప
ములు మిక్కుటముగా నున్నవి. నాలో నేను పడుచున్న
లజ్జకు భరిమితి లేదు.

ప్రభూ, ఖండింపుము. ఖండింపుము. నాహృదయ
దౌర్బల్యమును ఖండింపుము. పేదలను విసర్జింపకుండగను,
బలోన్మత్తులకు వంగి సలాములుచేయకుండగను మనో
నిశ్చలతను బ్రసాదింపుము.

సాధారణముగా భక్తులు పాపభూయిష్ఠమగు నీ
ప్రపంచమును జూచి యసహ్యపడి, తమకు గూడ పాప
మంటునేమో యను భయముచే లోకమును వీడి, యడ
వులలో నివాసముచేసికొని జపించుచుందురు. కాని యట్టి
యేకాంతపద్ధతి మనయాధునికకవివర్యునికి రుచింపదు.
అతనికి మనము నిత్యమును జూచు ప్రకృతియంతయు బర
మాత్ముని యాకారమైయున్నది.

ఆహా నేనెంత ధన్యుడను ప్రపంచమను నీ మహా
తీర్థమునకు బరమేశ్వరుడు నన్నాహ్వానించెగదా!

ఐహిక పాపభీతిచే నరసమూహములకు దూరము
గా నివసించు సన్యాసులను జూచిన రవీంద్రునికి మిక్కిలి
నిరసన. వారు తీర్థపునాటి వినోదము చూచుటకు పోవుచు

విలువగల జరీబట్టలను ధరించిన పిల్లవాడు పడునవస్థలో నుందురు. అట్టి వేషధారియగు బాలుడు తనతోడి మిత్రులతో నాటలో పాల్గొని యానందింపగలడా? వాని రాజదుస్తులు ప్రతిక్షణమందును వాని కాటంకము కలుగజేయవా?

తల్లీ! మానవ ప్రపంచమందలి పవిత్రధూళి నిన్నంటకుండ జేసి, సామాన్య జనసమూహమను మహోత్సవమందు బాల్గొనుట కాటంకము గలిగించినయెడల నీనితో నెగ్గుటెట్లు? ధగధగ మెఱయుచున్న నీవిలువదుస్తులవలన నెంతమాత్రమును బ్రయోజనము లేదుసుమా!

ఏలయన, లోకమందు కడుబీదలను, లోకవర్జితులును ఎవ్వరుకలరో వారియందే యీశ్వరుని పాదములు మోపబడియున్నవి.

లోకమందు కడుబీదలును, లోకవర్జితులను ఎవ్వరు కలరో వారి వేషముతోనే యీశ్వరుడు సంచరించుచుండును.

లోకమందు కడుబీదలును లోకవర్జితులును ఎవ్వరు కలరో వారి సమూహములందే యీశ్వరు డెప్పుడును నివసించుచుండును.

ఓసన్న్యాసీ! నీ మంత్రములను జపమాలలను గట్టిపెట్టుము. దేవాలయములో నొకమూల చీకటిలో నేకాంతముగా గూర్చుండి నీ ధూపదీపాదుల నర్పించుట తగదు.

పరమేశ్వరుని దర్శనము కావలెనన్న, వెంటనే ఆలయము విడచి, దినమంతయు కష్టపడి నెమ్మదిగా దనపొలమును దున్నుకొనుచుండు కృషీవలుని కడకు బొమ్ము. దినమంతయు నెండలో నిలచి రాళ్లు పగులగొట్టుచు బాటను సరిచేయుచుండు కూలివానిని సందర్శింపుము.

కాబట్టి యెంత నీచమయినను లోకమందలి ప్రతి ప్రాణియు పరమాత్ముని ప్రతిబింబమైయున్నది. అనేకముతో నిండియున్న నీ జగన్నాటకమందు ఏకమగున దేది కలదో దాని స్పర్శాసౌఖ్యమును వీడకుమా: అను వాక్యము రవీంద్రుని కావ్యసారాంశమయియున్నది.

కాబట్టి రవీంద్రుని భావగీతములయందు ప్రేమయే మానవుని జీవితమునకు ముఖ్యాధారమయినదిగా బోధింపబడియున్నది. అనేకత్వములో నుండి యేకత్వమును గ్రహింపవలయుననియే యీ మహనీయుని సందేశము. గీతాంజలి యాంగ్లభాషలో రచింపబడిన యుత్తమమత గ్రంథమని సూచింపబడినది. అది మొదట బంగాళా భాషయందు రచింపబడియున్నను ఆంగ్లమునకు మార్చబడినది. నిజముగా నాంగ్లభాషలోనికి ? రము కానియెడల పాశ్చాత్య విమర్శకులకు నది యుండదు. అది నోబిలు ప్రైజు సంపాదించియు బంగాళాభాషయందు రవీంద్రునిస్థాన మున్నతమైనది మాట యటుండనిచ్చి యాంగ్లసారస్వతమునకు హైందవ కవివర్యుడుచేసిన మహోత్కృష్టమైన యుపకారము గమనింపవలెను. రవీంద్రుని భావగీతములేకాక యతని వ్యాసములును లేఖలును కథలును నాటకములును నూతనాంగ్లసారస్వతమున కెంత వన్నె దెచ్చినవో చెప్పనలవికాదు. ముఖ్యముగా గీతాంజలివలన భక్తిరస ప్రధానమగు గ్రంథము పాశ్చాత్యభాషలలో గూడ హృదయ రంజకముగా రచింపవచ్చునని స్పష్టమయినది. ఆంగ్లకావ్యములలో గాఢమయిన భగవద్భక్తి వర్ణింపబడినట్టి యుత్తమ గ్రంథములు లేవనియే చెప్పవచ్చును. నాటకకర్తలకు చక్రవర్తియనదగు షేక్స్పియరు మానవ నాటకములోని చిత్రవిచిత్రములన్నింటిని అతిరమ్యముగా వర్ణించె నన్నమాట నిజము. గూఢమగు మానవ హృదయమును జొచ్చి రహస్యముల నన్నింటిని వెల్లడిచేసినమాట నిజము. మనుష్య జీవితములోని సుఖదుఃఖములను వివరముగా మనకు స్పష్టీకరించినమాట వాస్తవము. అతని నాటకమందు ధర్మాధర్మములకు గల సంగ్రామము జూపబడినమాట సత్యము. జీవిత మనుష్యసమస్య చర్చింపబడినదే కాని భగవత్సమస్య యంతగా గాన్పింపదు. నిరంతరము పరమేశ్వరుని ధ్యానించుచుండు ప్రహ్లాదుని వంటి భక్తుడు ఆంగ్ల సారస్వతమంతయు వెదకినను కానరాడు. అందుచేతనే రవీంద్రుని గీతము లాంగ్లమునకు నూతనోజ్జీవమును గల్పించినవి. అనగా గీతాంజలియందు బూర్వ ఖండముయొక్క జీవితతత్త్వము పాశ్చాత్యులకొఱకై పశ్చిమభాషలో నమర్చబడినదని చెప్పుటకు సందేహము లేదు.

రవీంద్రుని కావ్యములలో బాల్యమును వర్ణించిన గీతములు మిక్కిలి మధురములయినవి. అతని సారస్వతమందు బాలుడు ముఖ్యాధికారియై సంచరించుచుండును. పసిబాలుని మృదుశరీరమును చంద్రవంకబోలు ముద్దులొలుకు ముఖమును, వాని చిత్రపుటూహలును రమ్యపు చేష్టలును ఆనందదాయకములును భావగర్భితములు నయియున్నవి. ఆంగ్లభాషయందలి కావ్యములలో బాల్యవర్ణ

వల వఱకును లేదనియే చెప్పవచ్చును. ఎక్కడ ఉపమానముక్రింద బాలుని గురించి సూచన సవచ్చును. కాని బాలుడు కథానాయకుడయిన ములు కానరావు. వర్డ్సువర్తు కాలమునాటివఱకును బాలుని జీవితార్థమును గ్రహించి బాల్యముయొక్క భవిష్యత్తులను మానవజీవితమునకు బాల్యము ధింపగల సందేశమును సరిగా నేయాంగ్ల కవివరుడును ంచియుండ లేదు. బాల్యమును మనోహరముగా వర్ణించిన యాంగ్లగ్రంథములలో రవీంద్రుని "చంద్రవంక" ముఖ్యమయినది. గీతాంజలియందు బాల్యతత్త్వము సూచింపబడినది. రవీంద్రుని చిన్నకథలయందు ముఖ్యముగా బాలుడే కథానాయకుడయి యున్నాడు.

రవీంద్రునికి లోకమంతటియందును నతిసౌందర్యము కలదియయి చూచినంతనే ప్రేమను స్ఫురింపజేయునది చంటిబిడ్డ. ఎవ్వరయినను చంటిపిల్లవాడు తనదుస్తులను శరీరమును మకిలచేసికొనుటచే నసహ్యముగానున్నాడని పలికిన పక్షమున రవీంద్రుని కత్యాగ్రహము రాగలదు. తన ముఖమును సిరాతో పూసికొనినాడని పూర్ణచంద్రుని జూచి యెవ్వరయిన నేవగించుకొందురా? బాలురకు బ్రకృతితో సయ్యాటములాడుట మిక్కిలి ప్రీతి. వా రెప్పుడును చెట్లు జేమలు, గట్లుకాలువలు కలచోటుల దిరుగనిచ్చినయెడల నానంద పరవశులయియుందురు. మనము నిత్యమును జూచుచున్న ప్రపంచమును మనుష్యులును వారికి నూతనమగు చిత్రాకారముగ గాన్పింతురు. చిన్నిపాపలకు మనవీథులలోనుండు దీపములకును నాకాశమునందు నక్షత్రములకును నెంతమాత్రమును భేదము కాన్పింపదు. 'చంద్రవంక' యందలి చిన్న బాలుడు తల్లితో దన ప్రగల్భముల జెప్పుచు "అమ్మా, ఎవ్వరికిని యెంతమాత్రమును దెలియని యేదేశముకలదో అక్కడకు నేపోవలెను" సప్తసముద్రములను బదమూడు మహానదులను దాటగలను. అని ప్రతిజ్ఞ చేసెను. ప్రాపంచకవ్యవహారమందు మనకు నియమములును నిబంధనలును గలవు కాని బాలునికి నేదేశమందు తర్కశాస్త్రము, లోకవ్యవహారికనిబంధనలను గాలిపటములవలె నెగరవేయునో, ఆదేశ ముత్సాహమును గలుగజేయునట. ప్రకృతికిని బాలురకును గల చెలిమి యెంతచిత్రముగానుండునో యీదిగువ చరిత్రను బట్టి స్పష్టమగును.

రాయచరణుడు తన ప్రభువు కుమారుడగు చంటిపిల్లవానిని సెలయేటి యొద్దకు దీసికొనివెళ్లెను. అతను వేఱుపనిమీద నుండగా నీపసిపాప డాసెలయేటిగానము విని యానంద పరవశుడయి దానిని సమీపించెను. ఎందుకనన అల్లరి పిల్లలగు నదీకన్యలు తమ విచిత్రమగు పాటతో వానినిబిలిచి తమ నాట్యరంగమునకు గొంపోయిరట. చూచినంతనే మనల భయకంపితులజేసి తాకినంతనే ప్రాణమును హరింపగలుగు సముద్రతరంగములు బాలురకు నర్థములేని చిత్రమగు పాటలను బాడుచుండును. తల్లి తన చంటిబిడ్డ నుయ్యేలలో బండుకొనబెట్టి యూగించునపు డల్లిబొల్లి పాటలను బాడుట లేదా.

రవీంద్రుని యభిప్రాయమున బాలుడనగా బ్రేమవాడు తన తల్లికానందము. ఆనందమేల? యామెకు బ్రాణము. ఆమెయొక్క హృదయ ప్రతిబింబము. ఈపసిబాలుని చరిత్రయెట్టిదో యతడెందు నిమిత్త మీలోకయాత్ర సల్పుచున్నాడో యీదిగువ వాక్యములు స్పష్టీకరించును.

ఈచంటిబిడ్డడు కుప్పలుగా బడియుండిన బంగారమును రాసులుగానుండిన ముత్యములునుగల ధనికుడయ్యు పేదబిచ్చగానివలె నీ మర్త్యలోకము దిగియున్నాడు. అతడు కారణములేకయే వచ్చెనా? కాదు. జగన్మాతయొక్క ప్రేమధనమును యాచించుటకుగదా యీముద్దులొలుకు చిన్నదిగంబరభిక్షుకుడు తాను కేవలము నసహాయుడయినట్లు నటించుట.

మాతాపుత్రులదయిన యీదిగువ సంభాషణము దిలకింపుడు:—

అమ్మా. నన్నెక్కడ గనుగొంటివి?

నాయనా, నీవు మొదటనుండియు నాహృదయమందు వాంఛగా దాగి యుంటివి. భూలోకమను తీవ్రనదీ ప్రవాహమున దేలిపోవుచున్న నీవు నాహృదయము ద్వారాగా జిక్కికొంటివి. అందఱివాడవగు నీవు నావాడవయితివి. నీవు నన్ను దాటిపోయెదవను భయముచే హృదయమున జేర్చి నొక్కి గట్టిగా బట్టుకొంటిని, ఆహా! అబల నగు నాకోమల హస్తముల నడుమ నమూల్యమగు లోకధనమును బంధింప గలిగినదియే యింద్రజాలము!

ఈవిధమున బాల్యవర్ణనము రవీంద్రుని కావ్యమందు భావగర్భితముగాను నసమానముగాను నున్నది.

అనేక స్థలములయందు మాతాపుత్రుల యనురాగము వర్ణింపబడినది కాని యిట్టి వర్ణన మతీతము. ప్రేమయే బాలుని సందేశము. దానిని బోధించుటయే యీకవివరుని ప్రథమోద్దేశము. ఒకప్పుడు తల్లి తనయాత్మ ప్రతిబింబమగు కుమారుని యద్భుతచేష్టలను జూచి యాశ్చర్యపడి తనివితీఱక "కన్నవాడా" లోకులందఱును నీముఖమును జూతురుగాక, చూచి లోకమందలి సర్వాంశముల యథార్థతత్త్వమును గ్రహింతురుగాక. నిన్ను బ్రేమింతురుగాక. ప్రేమించి తమతోతాము గాఢానురాగులయి మెలంగెదరుగాక, అని యానందపరవశయయి పలికినది. ఇదియే రవీంద్రుని సందేశము. ఇట్టి యథార్థమునే పూర్వమొక మహాపురుషుడు బోధింపయత్నించి యాప్రయత్నమందు బ్రాణత్యాగము చేసెను.

లోకయాత్ర సల్పుమహాజనులారా యొక చిన్నవార్త, గమనింపుడు. మీరందఱును బాలురవలెనుండుడు. వారిపద్ధతి నవలంబింపనియెడల మీకు స్వర్గలోకమందడుగిడుట కర్హత లేదు.

ఆంగ్లసారస్వతమందు బాల్యవర్ణనము నూతనపద్ధతియయినను మన హైందవ సారస్వతమున బ్రాచీనమునాటినుండియు కావ్యగౌరవము నందినది. రామాయణ భారత భాగవతాది కాలములనాటినుండియు బాల్యవర్ణనము మనకు సాంప్రదాయమైనది. పుత్రులకొఱకు తల్లిదండ్రులు పరితపించుట, వారి నిమిత్తమై మహాతపము లొనరించుట, పుత్రులబడసిన వెంటనే సమస్తక్లేశములు నదృశ్యములయ్యెనని యుప్పొంగుట, ఒకవేళ పుత్రవియోగము కలిగినయెడల శోకాబ్ధిలో మునిగి యడుగంటుట మొదలగునవి మన హైందవ సారస్వతమునకు వింతగాదుకాని యాంగ్లసారస్వతమందు నూతనాంశములని చెప్పవచ్చును. శ్రీరాముని బాల్యచేష్టలును, లవకుశుల యద్భుతకృత్యములును, భరతుని విచిత్రపరాక్రమమును ధ్రువుని తపస్సును ప్రహ్లాదుని పరమభక్తియు మొదలగు నెన్నియోచరిత్రలు హైందవ కవిపుంగవుల మనముల నాకర్షించి నవీనకాలమందు సయితము గ్రంథకర్తలకు మార్గదర్శకములయి లక్షలకొలది హైందవులకు ముక్తిదాయకములుగా నున్నవి. వేయేల మన యుత్తమ మతగ్రంథమగు భాగవతమందు లోకపాలకుడు తాను పసిబాలుని యవతారము స్వీకరించినట్లున్నదికదా. సమస్త లోకములకు చక్రవర్తియగు శ్రీకృష్ణుని బాల్యక్రీడలు వర్ణించిన కవియే మన హిందూకవు లందఱి భౌముడని చెప్పవచ్చును. పరమేశ్వరుడు బాలునాతని వింత క్రీడలను వైష్ణవభక్తులందఱును యానందించి, పరిపరివిధముల యత్నించుచుండిరి. కృష్ణుడు పసిపిల్లలందఱివలెనే పాలు, మీగడ, మొదలగువానియందు మిక్కిలి ప్రీతికలవాడట. కృష్ణునికి వీనియందు గల యభిమానము మిక్కుటము. టచే వీని భక్తులందరు నితనికి నవనీతచోరుడను దము నిచ్చిరట. క్షీరము మానవకోటికి ప్రాణము. నవనీతము క్షీరసారము. దాని మృదుత్వము వర్ణనాతీతము. సృష్టి యంతటిలోను మిగుల మెత్తనిది. మానవహృదయమును హరించిన శ్రీకృష్ణుడు పరమబాలుడగు నవనీతచోరుడేల కాడు?

రవీంద్రుడు నవీన శకమందలి కవిపుంగవులలో నగ్రగణ్యుడని మొదటనే సూచింపబడినది. భక్తిరసప్రధానమగు గ్రంథమును రచించి ధన్యత్వమును బొందిన పరమభాగవతోత్తముడు. ముక్తిని బొందుటకు బ్రేమయే ముఖ్యసోపానమని యీతని యభిప్రాయము. మనము చూచు పదార్థములన్నింటికంటెను మహత్తరమైన దేదికలదో దానిని మఱువవలదను సందేశమును ప్రతిగీతమందును బోధించుటయే యీతని ముఖ్యోద్దేశము. ఈకవి వాక్యముల నెవరికి రుచించినట్లు వారర్థము చెప్పవచ్చును గాని యీతని మాటల పరమార్థము సదాదీనినే సూచించును. ప్రపంచమందలి నానాదేశములందును మహాపురుషులే యున్నతాదర్శములకై పాటుపడుచు తమ యావచ్ఛక్తిని ధారవోయుచుండిరో యట్టి మహత్తరమైన యాదర్శములనే యితడు కావ్యరూపమున జనసమూహమునకు జూపుచున్నాడు. అందఱికంటె నితనికి యొక ఘనత కలదు.

ఇతడు పూర్వఖండమును బశ్చిమ ఖండమును సంఘటనము గావింప యత్నించు మహనీయులలో నుత్తముడు. పాశ్చాత్యుల సంఘతత్త్వము మనకును, మన జీవితసారము పాశ్చాత్యులకును బోధించి, యీరెండు శక్తులును సమావేశమయిన యెడల లోకమునకు మహోపకారము కలుగగలదని నమ్మిన మహాశయుడు. పశ్చిమ శాస్త్రము హైందవ తత్త్వమును రెండు మహానదులను సాగరసంగమము గావించి విశ్వభారతియను బుణ్యక్షేత్రము నిర్మించిన పూజ్యుడు. తనదేశము పరదేశ మను

య పాటింపక సమదృష్టితో జూడగలిగిన విశాల
డు. ధనమదాంధులగు పాశ్చాత్యుల దుర్మార్గ
ఖండించునప్పుడు సయితము తన దేశమెట్టి సాంఘిక
ముచే పీడింపబడుచున్నదో మఱువక యాదాస్య
ు బరిమార్పవలెనని దినదినమును ఘోషించు నిష్ప
తబుద్ధిగల లోకైకహితుడు. ఎన్నటికయినను జ్ఞాన
ను నిర్మల జలపూరితమగు హిందూనది పూర్వాచార
య నెడారిలో జిక్కి దారితప్పి యదృశ్యము కాకుండ
రక్షింపుమని సదా జగదీశ్వరుని బ్రార్థించు దేశభక్తుడు.
మనుష్యులేమి, దేశములేమి, యాత్మను గోల్పోయిన
వెనుక నైహికైశ్వర్యములన్నియు నిష్ప్రయోజనములని
లోకమునకు జాటుచున్న హైందవయోగ శాస్త్రబలముచే
నేమి, ధనబలముచే నేమి, రాజ్యముబలముచే నేమి,
యున్మత్తులయి కంఠ్లుగానక విఱ్ఱవీగుచుండు పశ్చిమగోళ
వాసులకు నిజతత్త్వమును బోధించి దైవికాదర్శములేని
జీవనము నిరర్థకమని తమవార్తలను దేశదేశములకు బంపు
చు లోకోద్ధారకులయిన హిందుమహాపురుషులు ముగ్గు
రిలో నొకడు. శాస్త్రప్రపంచమందును, కావ్యప్రపంచ
మందును రాజకీయ ప్రపంచమందును దైవికాదర్శము
నెలకొల్పి, ధర్మదేవతను బ్రతిష్ఠాపన చేయుటయే యీ
హైందవ త్రయము లోకమునకు జేసిన మహాసేవయై
యున్నది. సకలశాస్త్ర పారంగతుడయి ప్రకృతి రహస్య
ములనెల్ల గ్రహించి సృష్టికి శిరోభూషణమగు మాన
వునియందే కాక, మనము కాలిక్రింద నిర్లక్ష్యముతో
నడుగద్రొక్కు పనికిరాని మొక్కయందు సయితము
ప్రాణమున్నదనియు, దానికిని మనవలెనె సుఖదుఃఖము
లున్నవనియు బ్రత్యక్ష నిదర్శనములజూపి, యొక్క
మహాశక్తియే సమస్త పదార్థములందును బ్రవహించు
చున్నదని బోధించు శాస్త్రజ్ఞాని యొకడు. ఎల్లప్పుడును
బరమాత్ముని నామసంకీర్తనము గావించుచు ప్రతి చిన్న
పదార్థమందును, నోరెఱుగని పసిబాలునియందు సయి
తము పరమేశ్వరుని ప్రతిబింబమునే చూపి, యనేక
ముతో నిండియున్న యీ ప్రపంచమందు శాశ్వతమై
లోకాతీతమగు నొక్కటి యగునేదికలదో దానిని దేశ
దేశములకు బోధించు భక్తిపరాయణుడగు కవిగాయకు
డొకడు. ధర్మనిరతియం దపరహరిశ్చంద్రుడయి, అహింసా
తత్త్వమను తారకమంత్రపటిమను తన మనోవాక్క
ర్మములచే లోకమందు వెదజల్లుచు, వేణుగానముచే బది
యార్వేల గోపికల మనముల నాకర్షించిన శ్రీకృష్ణుని
వలె మానవకోటి మనముల హరించి జగన్మోహనుడయి
ధర్మసంస్థాపనము నిమిత్తము పరమ విరాగియై రాజిల్లు
తేజస్వియొకడు. ఆధునికయుగమందు హైందవులగు
మనము నైతికతత్పరులగు మన ప్రాచీనుల నిర్మలజీవితము
నకు దూరులమై, శారీరమానవ నైతికబలములు క్షీణించి
పాశ్చాత్య మోహపాశమునఁజిక్కి యెండమావుల వెను
వెంటదిరుగుచున్న కాలమున, తమ యాదర్శముల చేతను,
తమ వాక్యముల చేతను, తమ చేష్టల చేతను తమ దైవిక
సందేశమును వ్యాప్తి జేసి లోకోద్ధరణమునకై సమకట్టిన
జగదీశుడు, రవీంద్రుడు, కరుణాసాంద్రుడు అను లోకారా
ధ్యులగు త్రిమూర్తులను గన్న భారతమాత లోకమాత
యనుటకు సందియమేమి?

# దేవాలయములు

వల్లూరి సూర్యనారాయణరావు గారు

౧

మనదేశములో దేవాలయము లేనిగ్రామమే లేదు. అట్టిగ్రామ మేదైన నున్నయెడల, అక్కడ మంచి తీర్థముకూడ తీసికొనగూడదని పెద్దలు చెప్పుదురు. సాధారణముగా ఈ దేవాలయములకు భూములమీదగాని ప్రజలవలనగాని వచ్చువరుంబడి అర్చకుని జీవనమునకును నిత్యనైవేద్య దీపారాధనలకే చాలదు. ఇప్పుడిప్పుడు కొన్ని జిల్లాలలో దేవాలయపుభూములు బాగుగా ఫలించుచుండుటచేత అనేకదేవాలయములకు సాలునకు వేయి మొదలు పదివేల రూపాయీలవఱకు ఆదాయము వచ్చుచున్నది. కాని, యది యంతయు పూర్వకాలములో వలెనే, తామే అనుభవింపవలయు నని అర్చకులవాదన. ఇవి దేవునివిగాని అర్చకులసర్వీసు యీనాములు కావనియు అటులైనయెడల భోగమువాండ్రు, భజంత్రీలు, స్వస్తివాచకులు మొదలగు స్వామిసౌఖర్లకు పట్టాలిచ్చినట్లే వీరికిని పట్టాల నిచ్చియుందు రనియు, దేవునినిత్యనైవేద్యధూపదీపారాధనఖర్చులలో అర్చకుని భూతాది ఖర్చులు చేరే యున్నవనియు నిటీవల హైకోర్టువారు తీర్మానించియున్నారు. అర్చకుడు లేనిదే దేవునికి అర్చనయే జరుగదుగనుక, నితనికి ప్రత్యేకించి సర్వీసుమాన్యములు ఎక్కడనోగాని వేఱుగా నీయబడియుండలేదు. కాబట్టి అర్చకుని కుటుంబమువారు స్వామివారి అయివజులోనుండియే జీవింపవలెను. కాని యీ అయివజు ఎంత వృద్ధియగుచున్నను, అంతయు తమ కుటుంబములకే వినియోగించి దేవాలయము దుస్థితిలో నుంచుటయు, ఉత్సవములు మొదలగునవి సరిగా జరిపింపకపోవుటయు తటస్థించుటచేత స్వామివారి యీనాములను అర్చకులనుండి లాగుకొని వారిభూతాదికి నెలజీతముల నిచ్చుటకు కోర్టువారు, నూతన ట్రస్టీలను ఏర్పఱచుచున్నారు. సి॥ ప్రొ॥ కోడ్లు సె. 92 క్రింద దేవాలయముల మేనేజిమెంటు విషయమై స్కీములు ఏర్పడుచున్నవి. ఇదిగాక యీ యర్చకులకుటుంబములు తామరతంపరగా పెరిగినపుడు స్వామివారి యీనాములను విభాగించుకొని, అయివజునంతయు తమ జీవనోపాధికే వినియోగించుకొనుటచేత, కో మరమ్మతులు, యీనామముల మరమ్మతులు, ఉత్స వములు, మొదలగునవి నిలిచిపోవుచున్నవి గనుక నిట్లు పంచుకొనగూడ దనియు ఒకటి రెండు చిన్నకుటుంబములకు సరిపడునట్లుగానే జీతముల నేర్పాటుచేయవలసినదనియు కోర్టులు తీర్పుల నిచ్చుచున్నవి. తక్కినకుటుంబ మెంబర్లు ఇతర కోవెలలోగాని మరియొకచోటగాని ఉద్యోగములు సంపాదించుకొన వలసినదేగాని, స్వామివారి భూములమీద జలగలవలె అంటి యుండరాదు. అర్చకులు మంచిసంస్కారులైనకొలది వీరికి జీతములు వృద్ధిచేయబడి, గొప్పకోవెలలకు తీసికొనబడుదురు.

తమ పూర్వులకంటె, నిప్పటివారికి దైవభక్తి కొఱవడుటవలననో, లేక, మనలోని నవనాగరికులకు రూపోపాసన రుచింపకపోవుటచేతనో లేక కొందఱు అర్చకుల సమర్థతాదుష్ప్రవర్తనలవలననో, యీ దేవాలయములను, ప్రజలు త్రొక్కిచూడకున్నారు. ఇవి శిథిలములగునపుడు తూష్ణీంభావమును వహించుచున్నారు. ఉత్సవములు మొదలగువానికి విరాళముల నొసగకున్నారు. కాబట్టి కనీసము అర్చకునికి రు. ౨౦ లు నెలజీత మిచ్చి నిత్య నైవేద్య దీపారాధనలకు నెలకు రు ౧౫ లు ఏర్పఱచినయెడల దేవాలయముల మరమ్మతులకును ఉత్సవములకును సొమ్ము మిగులకపోదు. ఇట్టి దేవాలయములకు స్కీముల నేర్పాటు చేయించుకొన్నయెడల స్వామివారికి వచ్చు అయివజును, ఏయే కార్యములకు నెంతెంత ఉపయోగింపవచ్చునో ట్రస్టీద్వారా నిబంధనలను చేసెదరు. ఈ నిబంధనలను, అప్పటప్పటి సంగతిసందర్భములనుబట్టి ప్రజలు కోర్టువారిచేత మార్పించుకొనవచ్చును. ట్రస్టీని తీసివేయింపవచ్చును. లెక్కలను తనిఖీ చేసికొనవచ్చును. వానిని ప్రచురింపించవచ్చును. లెక్కకాపీలను బడయవచ్చును. ఇట్టి సౌకర్యములు కలుగజేసినను గ్రామస్థులు తమ దేవాలయపు వ్యవహారములను తామే చక్కగా జరిపించుకొన జాలనియెడల వీరు స్వపరి

# దేవస్థానపుస్తకము



దావా దేవాలయమునకును దాని ఆస్తులకును ఒక్కరే ట్రస్టీగా నుండవలెను. చాతుర్వర్ణములలో చేరి మేజరై మనోదార్ఢ్యముగల యే మగవాడైనను ట్రస్టీగా నుండవచ్చును. అతను, దేవాలయమున్న గ్రామములోని కాపరస్థుడుగ గాని దానికి అయిదుమైళ్లలోపుగా నున్న యితర గ్రామనివాసిగ గాని యుండవచ్చును. నెలకు యేబది రూపాయీల అయివజు వచ్చేవాడుగ గాని లేక తనవంతుకు రెండువేల రూపాయీలకు తక్కువ కిమ్మతు కాని స్థిరాస్తి కలవాడుగ గాని యుండవలెను. ఆయన యిన్సాల్వెంటుగగాని నీతిబాహ్యమైన నేరమునకు శిక్షింప బడినవాడుగగాని యుండకూడదు.

2. పైనచెప్పిన యోగ్యతలుగల ట్రస్టీ తానేర్పడిన తేదీ లగాయతు మూడు సంవత్సరములవరకు ఆపదవిలో నుండవచ్చును. ఆ గడువు కాలమైన తరువాత తిరిగి ఆయననే కోర్టువారు ఏర్పరుచుచుండవచ్చును.

3. ట్రస్టీ చనిపోయినపుడుగాని మరియే ఇతర కారణములచేతగాని ట్రస్టీపదవి ఖాలీ అయినపుడు దేవాలయమం దభిమానము గలవారెవరైనను పిటీషను పెట్టి కోర్టువారిచేత నూతన ట్రస్టిని యేర్పరుచుకొనుచుండవలెను.

4. స్వామివారి చరస్థిరాస్తులన్నియు ట్రస్టీ కోర్టువారి సహాయముతో స్వాధీనము చేసికొని దేవునితరఫున మేనేజి చేయుచుండవలెను.

5. స్వామివారికి వచ్చు ఆదాయమును, వారికొరకు చేయు వ్యయమును కనపరచు లెక్కలను యెల్లపుడు ట్రస్టీ సరిగా నుంచవలెను. కోర్టువారు కోరినపుడు వానిని హాజరు పెట్టుచుండవలెను. దేవాలయమం దభిమానముగలవారెవరైనను తడవకు రెండేసిరూపాయీలు దాఖలుచేసి ట్రస్టీ యుంచిన లెక్కలను చూచుకొని కాపీలు తీసికొనవచ్చును. తనకు అప్లికేషనుతో ఆ సొమ్మును దాఖలుచేయగానే వారమురోజులలోగా ట్రస్టి లెక్కలను కనుపరచి కావలసిన కాపీల నీయవలెను.

6. సంవత్సరముల కొకసారి ట్రస్టీ, క వలన నియమింపబడు ఒక ప్రత్యేక ఆడిటరుచేత, లను తనిఖీ చేయించుకొనవలెను. ఆడిటరుకు స్వా మెస్టేటునుండి యేబదిరూపాయీలకు మించకుండ నీయవచ్చును.

7. స్వామివారి అయివజులోనుండి అర్చకునిజీతమునకును నిత్యపూజావిధానమునకును, ఉత్సవములకును, గుడి మరమ్మతులు మొదలగువానికిని, అవసరమైనంత వరకు, సొమ్మున్నంతవరకు, ఖర్చు పెట్టుచుండవలెను.

8. నిత్యపూజయు, మామూలుగా జరుగు మాసోత్సవ సంవత్సరోత్సవములును పండుగులును, ట్రస్టీ యథావిధిగా జరిగించుచుండవలెను. ఆదాయమును బట్టి వానిని వృద్ధిపరచవచ్చును.

9. అర్చకుని జీతమునకును, నిత్యపూజా విధానమునకును, ఉత్సవములకును ఖర్చుపెట్టిన తరువాత దేవాలయము మరమ్మతులకును నూతన కట్టడములకును స్వామివారి అయివజులోనుండి వ్యయపరుచుచుండవలెను.

10. సంవత్సరాది పండుగదినమున గ్రామములో ముందుగా దండోరా వేసి స్వామివారి సన్నిధానమున గత సంవత్సరపు ఆదాయవ్యయముల స్టేటుమెంటును ట్రస్టీ బహిరంగముగా చదువవలెను. దానికాపీని 15 దినములవరకు దేవాలయములో కట్టుటయే గాక మరియొక కాపీని కోర్టువారికి పంపవలెను.

11. అర్చకుడు ట్రస్టీయొక్క అదుపాజ్ఞలలో నుండవలెను. ప్రస్తుతము అర్చకత్వము చేయుచున్నమనిషికి నెల 1-టికి కనీసము రు 15 లు నౌఖరీ చేసినందుకుగాను, జీతము ఏర్పాటు చేయబడును. అతని విద్యను బట్టియు, నడతనుబట్టియు, దేవుని ఆదాయమునుబట్టియు, ఈ జీతమును వృద్ధిచేయవచ్చును.

12. దేవాలయమును, ప్రొద్దున 8 ఘంటలు మొదలు 12 ఘంటలవరకును సాయంత్రము 6 ఘంటలు మొదట 9 ఘంటలవరకును తెరచియుంచవలెను. పర్వదినములలోను మరి కొన్నిదినములలోను, ట్రస్టీ ఆజ్ఞ ప్రకారము ఎక్కువకాలము తెరవవచ్చును.

౹౩. స్వామివారికో వెలనుగాని దాని ఆస్తులనుగాని కట్టుపెట్టకూడదు; విక్రయించకూడదు. స్వామి ములను కోర్టువారియంగీకారము లేనిదే అయిదు ములకంటె నెక్కువ కాలమునకు కవుళ్లు నీయ కోర్టువారి సాంక్షను లేనిదే ట్రస్టి యెప్పుడును స చేయకూడదు.

14. సంవత్సరారంభముననే స్వామికి సుమారుగా రగిన ఆదాయమును కావలసిన ఖర్చులను తెలియజేయు పట్టీనిన్ని (బడ్జెటు) నిత్యపూజకును ఉత్సవములకును చేయదలచిన ఖర్చులపట్టీనిన్ని (దిట్టము)కోర్టులో దాఖలు చేసి, వారి సాంక్షను ముందుగా తీసికొనవలెను.

15. స్వామివారిభూములమీదను, ఇతరాస్తులమీదను రావలసిన శిస్తులు అద్దెలు వగైరాలు వసూలు చేసి ఆ మొత్తములోనుండి దేవస్థానపు పనులకు ట్రస్టి ఖర్చు చేయుచుండవలెను. నిత్యపూజకును ఉత్సవములకును వస్తురూపముగగాని లెక్క-రూపముగగాని అర్చకునకు కోర్టువారు సాంక్షను చేసిన దిట్టముప్రకారము ట్రస్టి యీయవచ్చును. అవసరమని తోచినపుడు ట్రస్టి ఒక గుమాస్తాను బంట్రోతును పెట్టుకొనవచ్చును.

16. దేవాలయమునకు ప్రస్తుతము మిక్కిలి అవసరమైన మరమ్మతులను, ట్రస్టి కొంతకాలము ఉత్సవములను ఆపివేసి యైనను తక్షణము మొదలుపెట్టి చేయించవలెను.

17. ఎప్పుడుగాని ట్రస్టి తన చేతిలో రెండువందల రూపాయిలకంటె హెచ్చు మొత్తమును నిలవయుంచుకొనకూడదు. కోర్టువారిచేత అంగీకరింపబడిన బ్యాంకులో మిగిలిన మొత్తమును యెప్పటికప్పుడు వడ్డీకి డిపాజిట్టు చేయుచుండవలెను. కోర్టువారి సాంక్షను తీసికొని స్థిరాస్తిని కొనుచుండవచ్చును.

18. దేవాలయమునం దభిమానము గలవారెవరైనను తగిన కారణములను కనుపరచి కోర్టులో పిటీషను పెట్టి, ట్రస్టీని తొలగించవచ్చును.

19. ఈస్కీములో అవసరమని తోచినపుడెల్లను, దేవాలయమం దభిమానముగలవారెల్లరు, మార్పులను కోర్టువారిచేత చేయించుకొనవచ్చును. ఈదావాలో చేయబడినడిక్రిని ట్రస్టీయే కాక వారిలో నెవరైనను అమలు జరిగించుకొనవచ్చును. ఈ స్కీముకు సంబంధించిన పిటీషను లన్నియు, ఈడిక్రి అమలులో పెట్టినట్లే యెంచబడును.

20 పైనవ్రాసిన నిబంధనలలో "కోర్టు" అనుశబ్దము యీడిక్రిని ప్యాసుచేసిన కోర్టునకును, యీకోర్టును తీసివేసినయెడల, యీ దేవాలయముమీద జూరిసుడిక్షను గల మరియొక కోర్టుకును కూడ, అన్వయించును.

# అశ్రుపాతము

## జంధ్యాల వేంకటశివకవులు

అగ్ని వర్షంబు గురియు సూ◆ర్యకిరణముల
భువన మెల్లను భస్మమై ◆ పోవునపుడు
కరుణచే నిలువెల్లను ◆ గరఁగి నీవు
జలదరూపంబుఁ దాల్చి వ◆ర్షంబు కురిసి
పృథ్వికంతకు జీవనం ◆ బిచ్చుచుందు
పటుల నాహృదయంబు ని◆రంతరోగ్ర
తాపమున భస్మముం జెందు ◆ తఱి నెఱింగి
కనుల నిరతాశ్రుధారను ◆ గలుగఁజేసి
చల్లపఱచెదు మామక ◆ స్వాంత మీవు
పరమలఘుతరోద్వేగ వై◆వశ్య మంది
గురుతరశరీరధారి కుం◆జరవరమ్ము
క్షుబ్ధతఁ జెందుచుండుటఁ ◆ జూచి నీవు
గండమ్ముల మదజలమును ◆ గార్పఁజేసె
దంత నయ్యది మరల స్వా◆స్థ్యమ్ము నొందు,
అటుల నామనమున శాంత ◆ మగుడు ప్రకుపి
తాంబుధిఁ బడు నావవి◆ధంబు నాదు
దశయుఁ గడుశోచనీయమై ◆ తనరుచుండ
నశ్రుపాతంబుఁ గూర్చెద ◆ వంత నేన
నంతశాంతిసామ్రాజ్యమ్ము ◆ నధిగమింతు.

—పూదేనెనుండి.

# గీర్వాణభాషాప్రచారము

## మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు

శ్లో. యాదేవీ సకలప్రపంచకలనా వ్యాపారధీరా పురో,న్నిద్రా క్షీంద్రియలోకసేవ సకలం దృష్ట్వాద్య నిద్రామగాత్
సాగీర్వాణ సరస్వతీ భగవతీ ప్రాప్య ప్రబోధం నిరా, యాసాక్షీణకటాక్ష మద్య పునరప్యాలోకయ త్వాదరం.

పండితమ్మన్యమాన్యులారా!

ప్రపంచమ్మున నానాదేశమ్ముల ననేక ప్రకారమ్ముల విస్తరిల్లి యున్న భారతీపురంధ్రీమణికి నాదినుండి నేఁటివరకును నవిచ్ఛిన్నంబగు ప్రచారవిచారము కొదువలేక జరుగుచున్నయది. యేయే దేశమ్ములనేయే భాష యాదరణీయమైయున్నదో అద్దియె విశాలంబుగ విస్తరిల్లి నానాముఖంబుల నద్వితీయమై విరాజిల్లుచున్నయది. ఏదేశంబులనేని నాదరణీయముగు దేశీయవిద్య నిరంకుశంబుగఁ ప్రభుత్వ మొనరించినను గీర్వాణభారతీసతి మాత్రము పూజ్యమానయై సర్వత్ర నివాస మేర్పఱచుకొని సుస్థిరయై నిరాకులయై నిరంకుశయై యనన్యయై నానాగుణమణిఖచితసింహాసనారూఢయై దివ్యదృష్టుల నెల్లెడలం బ్రసరింపఁజేయుచుఁ దన సామ్రాజ్యపాలనాపద్ధతుల నప్రమత్తయై యున్నదనుమాట నిరుత్తరము. ఇట్లు తాను వాఙ్మయసామ్రాజ్యపట్టభద్రయై తనకృపాకటాక్షనిక్షేపంబున ననేకులఁ బాత్రులుగాఁ జేసి తదీయవాచాసుధామధురధారాసారంబున నిత్యాభిషిక్తయగుచు జేగీయమానయై నిత్యప్రబోధంబున మేలుకాంచియుండెను. ఆయమ కంతరాయము లంకురింపకుండ భాషోద్ధారణచణులగు భూరమణులు తమసర్వస్వమును భారతీసతీతిలకమున కర్పించి యేలోటును గాంచకుండ దండధరులపగిది నిండుకొల్వున దండిమగంటిమి నుండఁ జేసిరి. పండితమండలము నఖండపాండితీభూషాలంకృతముం జేసి షండాలమండలంబుల నూఱేగించిరి; గీర్వాణవాణీసతికిఁ దనవైభవముఁ గ్రీఁగంట నొక్కింత నిక్కినిక్కిచూడఁ జిరునవ్వుదయించెను; ఆనందమంకురించెను; గర్వము చిగురొత్తెను. మేను పులకరించెను; ముఖరాగమతిశయిల్లెను. ఆనందబాష్పములు ప్రవహింపసాగెను. చిట్టచివరకు తొక్కుచోనుండఁజాలక దిక్కుల కెగయ నాట్యమాడసాగెను. పాపమాయమకేమియుఁ దెలియదు కాఁబోలు; మీఁగాళ్లమీఁది చూపు చూచుకొనుచు ముందుచూపు గానక తనవైభవమునఁ గొసంతయైన లోటుమాట నోటరాదని తలంపసాగెను. దేశభాషాయోషయుఁ దనకు మాతయగు నాయమకుఁ దనదేశంబున నమందంబున విందొనరించుచుఁ దన పుట్టుకకగు ఋణమును దీర్చికొన మెల్లమెల్లన నుద్యమించుచుండి తల్లివైభవమునకుఁ దోడ్పడి ప్రోత్సహించుచుండెను. ఇట్లు తా నమందానందసమేతయై పండితమండలీమండితయై నిండుపేరోలగంబునఁ జిరకాలము నిరాయాసంబునఁ బ్రొద్దుపుచ్చుకొనుచుండెను. యుగములు గతించినవి. లక్షలు, వేలు, నూర్లు, వత్సరములు వెనుకఁబడినవి. తన కించుకంతయు నకించనత్వము పొడగట్టినది కాదు. పదుల సంఖ్యలోనికి వచ్చెను. రానురా నీకాలమాయమపాలిటికి అంతకంతే కాసన్నభూగామియగు కింకరుడయ్యె. అయ్యో. యెంతలో నెంతవైపరీత్య ముదయించెనో గదా! పాపము!

"కస్యాత్యంతం సుఖ ముపనతం దుఃఖ మేకాంతతో వా।
నీచై ర్గచ్ఛ త్యుపరి చ దశా చక్రనేమిక్రమేణ"

అనినట్లు దేవతాజనంబునకుఁ గూడ దశాపరివర్తనము తప్పదయ్యె; రానురాను వార్ధక్యము ముదిరెను. సంచారము నిలువఁజొచ్చెను. వణఁకు పుట్టెను. తనకుమారికలు తనయట్ల మినుచూపు పచరింపఁ జొచ్చిరి. ఆలంబన మొసంగువారు కనుచూపుమేరకుఁ గానరారైరి. ఎందునుం బోవఁజాలక మూలనఁ గూర్చుండు కాల మావిర్భవించె. ఇట్లు దైవవిధి యెంతతప్పుత్రోవ నడచినను, "క్వ భోగ మాప్నోతి నభోగభాగ్జనః" అనినట్లు భాగ్యోదయయగుటఁ దనకిట్టికాలమునఁ బ్రాచీన పండితమండలి యండయయ్యె. ఇఁక ముందుమార్గము విచారములో నుండెను. చింత లతిశయిల్లెను. తన్నాదరించుటకు భూపాలు రొడంబడకున్నను పాపము కొందఱు పేదసాదలు మాత్రము తన్నువిడనాడలేదు. ధనవంతు లావంకకుఁ దలఁద్రిప్పరైరి. ముద్రణాలయంబులు దేశీయభాషాపరవశంబులై ముద్రించిన బీరువ లలంకరించనా యని తన్నెత్తి పొడవసాగెను. శ్లోకములు కప్పుకొననా యని ఇంగ్లీషుబాలు రెగతాళి సేయసాగిరి. వారిని జూచి మనశ్రోత్రియ కుమారులును గనుసైగఁ జేయ మొదలిడిరి. పాపమాయమకు నేఁడునేఁడు బహిస్సంచారముడిగిపోయినది. శ్రోత్రియగృహస్థులు తమకుమారుల నేమనఁజాలక పెదవులవరించుచుండిరి. ఆవాగ్దేవికి దిగ్విజయయాత్రకుఁ బయలు వెడలినప్పుడీయాంధ్రదేశమునకు వారశూలతగిలెనా యని నేఁటికిఁ జింతగల్గె "అత్యుచ్ఛ్రియః పతనహేతుః", అని తాను దన్నుం గానని వారలఁ, గన్నుఁగీటుచునే యుండెను. మనయాంధ్రసోదరులు "దూరపుకొండలు నును" పనినట్లు విదేశభాషాసేవకు శక్తియున్నవఱకుఁ బరుగిడసాగిరి, సారము గనుగొనిరి. కడకుఁ గ్రొత్త యొకవింత యన్నట్లు కన్యాదాతలు సయితమపూర్వరీతిఁ దమకూఁతునకు నింగ్లీషునం దక్షరకుక్షియయిన వాఁడు కావలెనని వెదుక నిశ్చయించిరి. ప్రాత యొకరోఁత యనియు వినఁగల్గితిమి. పులిని జూచి నక్క వాతఁబెట్టుకొనినట్లు లక్షవ

గతానుగతికత్వమే యలవడెను. కొంతకాలమున క్షేమ ఘునందక్షురమక్షి చాలునన్నందులకు స్కూల్ ఫైనల్ కు నాంక్షపెట్టిరి. అదిమాని బి. ఏ. యని చేర్చిరి. అది ఎల్. టి., వారికిఁ దోపకట్టెను. అదిమఱచి ఐ. సి. గాపుఁజేరిరి. కట్టకడకందు తీర్ణులయినను బనిలోఁ జేరిన కావలెననిరి. నేఁడునేఁడు మనవారికి "స్వధర్మే శ్రేయః పరధర్మో భయావహ" అను గీతావాక్యము ధను నలంకరించెను. ఆర్యోక్తి సత్యమ్మనివారు లోన లెక్కిడుకొనుచుండిరి; "ఇతో భ్రష్టస్తతో భ్రష్టః" అనినట్లయినందున స్వధర్మాశ్రయంబునకుఁ గ్రాపుల వంకఁజూచి కంటఁ దడిపెట్టలేకుండిరి. ఈనాఁటికిని తన్నాశ్రయించిన ప్రాచీనఛ్ఛాందస పుత్రులెక్కడనో యొక్కప్రక్క రిక్కరిక్కలాడ నెప్పుడో యొక్కప్పుడాది భారతి కను తెప్పలు పులపొడుచుచు నేయుండెను. కాని యింతవఱకును మనవారు పూర్వమత్సరమున నాడెసమఁ గను చూడ్కి విగుడ్చరైరి. విద్యార్థిసోదరు లనుభవజ్ఞులైయుంట విరక్తులై యుండం జూచి తల్లిదండ్రు లర్థము ప్రాణము పోగొట్టుకొని యయ్యో యని చింతిలుచున్నను నివాపోదకమందు మాత్రము దృఢాశయులై యుండిరి. రానురా నీరీతి నచిరకాలముననే యవతారభేదము గన్పట్టెను. ఇఁక మన యాంధ్రవాణీసేవకులు చిటికెలపందిరి వైచుచు గోడలేని చిత్తరువు వ్రాయ నుత్సుకులైరి. చిన్నప్పుడు బడిలోఁ జదివిన రెండక్షరములకు రెండువాఙ్మయపత్రంబులం ద్రిప్పి యొకటిన్నర చరిత్రగ్రంథముల వ్రేలుపెట్టి పత్రికలనుండు ప్రచురణంబులఁ జూచి తాము గూడ నొకగ్రంథము వ్రాసి ప్రచురణము చేయవలయునని గ్రంథమువ్రాయ సమకట్టిరి. గీర్వాణశబ్దమమరమందున్నదని వినికిడిః రచనయందుశబ్దమే త్రోవ నడుచుచున్నదో తెలియదు. గణములు ప్రమథగణములు. యతులు కాషాయవండధరులు. ఎట్లో పూర్తిచేసిన నదెట్టి గ్రంథమోయనిన "సంక్షిప్తసంగ్రహలఘుగుప్తకలి వినోదసారమంజరి" యని బయలు వెడలును. కవికులతిలకు లెవరో కలివినోదమను గ్రంథము వ్రాయుట; అందుఁ దమపాండిత్య మితికించి తకమికచేసి సంక్షేపించి సంక్షిప్తకలి వినోదమని యొకఁడు; దానిని సంగ్రహించి సంగ్రహకలి వినోదమని మఱియొకఁడు; లఘూకరించి, గుప్తార్థబోధమని. ఇన్నిటికిని సారమని, అందులో మంజరియని. ఆంధ్రమని అభినవమని, వేలువేలు నామంబుల నెట్టకేలకు "సంక్షిప్తసంగ్రహ లఘు గుప్తకలి వినోదసారమంజరి" యని ముగింతురు. తరువాత కొందఱు తమనామముల నిరికించుచుందురు. అట్లున్నను కెట్టుబుక్కులు చేయవలయునను వారిప్రయాసమునకు రైల్ పోస్టల్ డిపార్టుమెంటువారియాదాయమె తార్కాణము. చేసినదంత యెట్టిఫులగమో తెలియరాదు. చేయునది భాషాసేవ. పోనిండు 'ఎవరికివారే యమునాతీరే' యనుకొందమన్న మనసంక్షిప్త కవులు తమకర్థముగాకున్నఁ బండితసార్వభౌముల నిందఁ జేయమొదలిడిరి. రచనలు కటువులు. పదములు గొంట్లు. అర్థము గాంభీర్యము. తలపగులఁగొట్టుకొనినం దెలియరాదు. భావము నిగూహము. అని పలుపలు తెలుంగుల వ్రేలుపెట్టి చూపుచుందురు. పిండికొలఁది రొట్టెయను పశ్చాద్బుద్ధి యామేధాప్రపంచమునఁ దోఁపట్టపయ్యె. గీర్వాణభాషా సేవకులం జూచి తమపాండితీగరిమచే "మ్రొక్కక దేవుఁడు వరమీయకుండ నేలాప్రయాస"మని పళ్ళనవ్వులు నవ్వయత్నించుచుండిరి; కాని తమ కలివినోదము కలివినోదమని యెన్నరుగదా! తాఁజెడ్డకోఁతి వనమెల్లఁ జెఱచెనన్నట్లు తమశక్తినిఁ బ్రకటించుచుండిరి. గాని గీర్వాణ సరస్వతీ ప్రసంగము నెత్తరైరి. ఎంతవింతయో గదా! ఈరీతి నంతకంతకు క్షీణదశ నొందుచున్న గీర్వాణభాష నుద్ధరించుటకు నొక్కరైనను దల నిక్కబెట్టరైరి. మనకు సంస్కృతభాష యెంత యుపయోగమో తెలియకుండిరి. రహస్యము లెందున్నవి? ఎటునుండి వచ్చెను? ఇతిహాసము లెక్కడ? చరిత్రాంశము లెందు? భగవత్సాయుజ్యమునకుఁ ద్రోవఁ జూపునదేది? కొంచెము వెనుక దృష్టినింపుడము. ముద్రణాలయంబులు రాకమున్న నీవిద్యాధనమును మనపూర్వు లేరీతి గుప్తపఱచి యంతరము చెడకుండ మనకు కటాక్షించిరో యదియే యావిద్యయందున్న గౌరవమును సూచింపుచున్నయది గదా! క్రమముగ ముద్రితములు గూడ నయ్యెను. బ్రదికియున్నకాలమున నాదివాగ్దేవి నలుగురిలో మేటియగుట నాయమకే గౌరవమొసంగి ముద్రణంబునఁ బుటలలంకరింపఁ జేసిరి. నేఁటి కిందులఁ గొఱగాకుండ నాయమ నేదో పదిలో పదునొకండవదిగా నెన్నుకొని యత్యనాదరము చూపుటకు నాభాషాసేవకులు లేకుండుటయే కారణమగుచున్నయది. పాప మాదేవి వెత్తికాలమునాఁటిది. ఈచిత్రకాలపుఁ జిత్రముల నెఱుంగదు గదా! దళసరికాగితములపై నాసగొనెనా? కిత్తానారబైండు కావలెననెనా! పుల్ కాలికో కోరెనా? వెత్తితల్లి పుట్టినట్లున్నఁ జాలుననుకొనెను; ఈదేశంబే యాయమ కచ్చుఁబాటు గాకుండెనుగాని వంగదేశంబునఁ దానును సాటివారిలో మేటియై దేశభాషాపోషకు హెచ్చరికగనే యుండెను. తానున్న గాలఁపుఁ జిత్రముల నొక్కరికన్న నిక్కటము గనె చక్కఁజేయుచున్నది. తానే యాదేశంబున సామ్రాజ్యదీక్షవహింప వంగభాషాపోషపై దాడినెడలుచున్నది. అచిరకాలంబుననే కృతకృత్య కాఁగలదు. కూపకూర్మన్యాయమున మనవారిందక యాలోచించరుగాని, ఆదేశమున గీర్వాణభారతీవిజయము నాలకింపుఁడు. ఏమి గ్రంథములో? ఏమివ్యాఖ్యానములో! ఏమిరచనలో! ఏమిపరీక్షలో? సర్వము కరతలామలకములు. పురోభివృద్ధికరములు. ఇఁక మనవారి వ్యాఖ్యానములో విచారింతము. తార్కికుఁడో, వైయాకరణియో, మీమాంసకుఁడో; వ్రాయఁబూనుదురు. అందుఁ దమపాండిత్యము తమతమవిద్యలయందుఁ జటపట లాడింతురు. వారికిఁ దెలియదు. చదువువారికంతకుఁ దెలియదు. చెప్పువారికి మొదలే తెలియదు. వ్యాఖ్యానము చేయుగ్రంథమెందుం గూర్చియో? విద్యార్థుల కాగ్రంథంబున నేది ప్రయోజనమో, ఎంతకావలయునో, ఎట్లువ్రాయవలయునో వారివ్యాఖ్యారణిలోఁ గానరాదయ్యె. నాటకములలో వ్యాకరణపటిమ. తర్కపాండితీప్రకర్షత. మీమాంసవాదములు. అసలు నాటకమునందలి రహస్యప్రసంగములు బయలుపడుబుసున్న. తర్కవ్యాకరణ మీమాంస ప్రసంగము నాటకములలో నెంత ప్రాచుర్యముగా వచ్చునో తెలియనగును. ఇట్లు మనవారు మొదటినుండియు దిగ్బంధన మొన

రించుమనే యుండిరి. పాఠకుల కుత్సాహముడుగుటకు మార్గము లడిగినవి. ఈపాపకార్యమునందుఁ దలంచువారలే లేరు. నూటికొక్కఁ డున్న స్వంతకృషి కవకాశము గానరాదు. ఇట్లంతకంతకు నశింపఁ జొచ్చె. మఱియు మనవారి కెప్పుడుజూచినను జిగీషయె పాండిత్యమునకు ఫలమని తలఁపుగలిగెను. తన్ను మించువారుండరాదను శపథము. తనకుఁ దోఁచిన రహస్యములు ప్రచురించిన సర్వుల కవి తెలియునేమో యను నొకభయము. తానవి చెప్పిన నొరుఁడు నేర్చుకొనిపోవునేమో యను నొకశంక. ఈరీతిఁ బూర్వమునుండియు గీర్వాణవిద్యాపాఠకుల రహస్యచర్యలు నేఁటివరకును. ‹‹అవశ్యం పితృాచార›› మని పండితులును వదలఁదలఁపక నింతవరకుఁ దెచ్చిరి. సర్వము సంపూర్ణము కావచ్చినది. ఎట్టి జిగీషకని పెట్టిరో గాని శబ్దములు చదువు బాలుని రామశబ్దమునకు షష్ఠీవిభక్తి "రామేషాం" అని యాసర్వశబ్దమునకు "సర్వాణా" మనియా యని ప్రశ్నలు, ఏమి ప్రశ్నలో! బాలుని చెడగొట్టుట తప్ప వేఱుఫలము గానరాదు. మేఘసందేశము చదువుకుఱ్ఱని ‹ఆషాఢస్య ప్రథమదివసే.› యనుస్థలమునఁ బూర్వపక్షముచేసి యాతనికిఁ దెలియకుండఁ జేయుటయె గాక పిమ్మటఁ గాళ్లపైఁ బడినను నాతనికిఁ జెప్పకుండుటయు పిమ్మట నాతఁ డందేముండెనో మనగురువు చెప్పలేదని యామొదటివాని చేరుటయు, అచ్చట వాని పాండిత్యము పల్లవగ్రాహిపాండిత్యమైయుంటయు విద్యార్థి రెండర్థముల జెడిపోవుటయు సిద్ధించుచున్నది. ఇట్లనేక ప్రకారములఁ దిమ్మిని బ్రహ్మిని, బ్రహ్మిని దిమ్మినిజేసి మూలచ్ఛేదపాండిత్యులగుటయుఁ గనుచున్నారము. ఇంత యసూయ మఱొకవిద్యయం దున్నట్లులేదు. పద్య. పురాణవిద్యార్థుల యైకమత్యము. పండితుల భాషాసేవాప్రచారము చూచిన నసూయ కాదరువున్న దేమో విచారింపుఁడు. వృద్ధికి వచ్చువారి మార్గమది; మనవారి మూలచ్ఛేదకమార్గ మిది. ఇంతమాత్రమయిన గతశేషులగు పండితులున్నంతవరకే. ఆపైన ఆకాశమే. ఇన్ని కారణములచేతను, మఱికొన్ని యితరకారణములచేతను, సంస్కృతమంతరించుటకు మూలమయినది. జ్ఞానార్కునకు రాహుకాలము డగ్గరించినది. అజ్ఞానతమఃపటలము లావరింపఁ దొంగిచూపులు చూచుచున్నవి. ఇట్టికాలమునఁ గర్తవ్యాంశ మాలోచించి జగంబున కీకీడు విడిదీసి పురశ్శ్రేయోభివృద్ధికిఁ దోడుపడవలసిన భారము పండితసమాజముపై నొరగుచున్నది. నిన్న నేఁడు మన కట్టెదుటఁ బుట్టిన హిందీభాషా కుమారి యెంతలోపల గణ్యతకెక్కెనో లెక్కిడుదము. తప్పుటడుగులు వేయుకాలముననే దేశమునంతయుఁ ద్రిప్పివేసి పెక్కండ్ర సేవకులఁ దన ప్రక్కకుం ద్రిప్పికొనినది. సభలకెక్కినది. దేశీయమహాసభ నలంకరించినది. విజయశంఖధ్వాన మొనరించుచున్నది. తన సేవకులకు స్వర్ణపతకంబుల దిగవేయుచున్నది. అనేకుల నుపన్యాసకులఁ జేసినది. ఏండ్లకుఁ జిన్నదియైనను మహాత్ముని యాశీఃపాత్రమయినది. ఇఁక నాయమదీర్ఘాయువునకు గండము లుండఁబోవు. ఈచిన్నిబాలకింతలోపల నింతయైశ్వర్య మబ్బుటకు మహాత్ముని యనూయా విరహితంబగు శాంతోద్యమంబే కారణంబు; మహాత్ముని మనోనైర్మల్య మీహిందీకుమారి ప్రచారమున మనసూహా ప్రపంచమునఁ దోఁపట్టకమానదు. మనపండితమండలి కంతటి యౌదార్యమున్న

గీర్వాణవాణీతిలక మింతటిదురవస్థపాలుగాక తానెంత యుండునో యెన్నిసభల కెక్కునో యెందఱ నుపన్యాసక అట్టిభాగ్యము మనయాంధ్రజననికి బొత్తిగఁ గానరాదయ్యె. యసూయ యెట్టిదో విచారింతము. అనేకులు జిగీషాపరతంత్రతరములఁ బడరాని పాట్లుపడి యొక్కొక్కయక్షరము నేర్చుక బ్రతి మఱియొకఁ డుండరాదని తమపాండిత్యప్రకర్షచూపిం దుర్కొనిన పండితు నోడించి తామగ్రగణ్యులై యుండఁ గాని కడకేమిగానున్నది గానరైరి. ఎట్టకేలకు-యూగియోగ న నెత్తియో యగుట. లేకున్నఁ బ్రాణంబుల విడనాడుట. ఏలయ యసూయ జనింపవలయును? విద్యానాశనమునకేగదా? తామార్జించిన విద్యాధనమును లోకమునఁ బంచిపెట్టి యందున్న రహస్యాతి రహస్యమ్ములఁ బైటంబెట్టి దానివలన నేల చిరతరయశఃకాయమును సంపాదింపఁ దలంచరాదు! వైదేశికు లాదిభారతి నాశ్రయించి తత్కృపాపాత్రములై తదీయవరప్రసాదమున అణోరణీయంబులగు రహస్యంపు సంగతులఁ గనిపెట్టలేదా? విద్యుచ్ఛక్తిఁ జేతపట్టలేదా? జిగీషమానిననేది కాదు! దానిని వ్రతముగ నాచరించుచున్న మనపండితులమార్గ మద్వితీయమైనది. ఎట్లయిననేమి? ఆదిసరస్వతికి గ్రహచారము ఘుందగించినది. ‹‹విధౌ శిరస్థే కుటిలే కుతః శ్రీః›› యనినట్లు లాయమకు దైవగతి మారిపోయినది. కడకు ముగియవచ్చినది. ముగిసినది. నాళ్లన్నియు నేకమయినవి. సర్వత్ర స్తంభించినది. ఇఁకముందుగతి యెద్ది? కర్తవ్యమేమి? ఎద్ది? ఎద్ది మనకావశ్యకము? ఎదిచేసిన మనయుద్యమము నెరవేరును? ఎట్లు మనయాంధ్రావనిమండలము గీర్వాణవాణీ కృపాపాత్రము కాఁగలదు? అని యించుక దీర్ఘాలోచనము సేయుదము. మనగీర్వాణభాషాసేవకులలో ముఖ్యముగ వాచాప్రచారము నుపయోగింప నుద్యమించువారు గానరారు. ఏమున్నను. ‹‹అంతర్గడగుడాయతే బహిర్వక్తుంనశక్యతే›› యన్నట్లుండును. తాము గ్రంథమునుజూచినప్పుడు తక్క మఱి యితరకాలములనా భాష నుపయోగింపనార్జించినవారుకారు. ఇదియొకత్రోవ నలిగినది. మనపండితసాంప్రదాయములో నయితము శిష్యులకు బోధించునపుడు గూడ నిదియె పద్ధతియయ్యెఁ గాని యాశ్రయించిన భాష నుపయోగపఱచి శిష్యునకు భాషాపరిచయము గలుగునట్లు చెప్పుట యడుగంటినది. ఇదియెంత దురాచారమో చూడుఁడు. ప్రారంభమునుండియు సర్వకాల సర్వావస్థలను దాని నభివృద్ధిచేసికొనుటకుఁ దదీయవ్యవహారమే యుపయోగించుచుండిన నంద సమాన్యమగు వాచాధోరణి గలిగియె యుండెడిది. ఆపద్ధతి నెట్టివైచిరి. ఇట్లు చేయుటచే నేమగును? చదివినవి యుద్గ్రంథములు. సంస్కృతోపన్యాసమనిన మానముద్ర లేదు. ప్రాపంచికవిషయములలోనన్న పచ్చిబూతులు. ఇట్లు నానాఁటికి నశింపనయ్యెను. ఇదిగాక నెవఁడేని కొంచెము మాటాడిన మనశ్రోత్రియగృహస్థులే పండ్లిగిలింతురు. ‹మునుపే ముక్కిడి, పైనఁ ఒడిసె› మన్నట్లు దీనివలన మఱి కొంత ముఖపిధానమయ్యె. పుట్టుచెడుగులన్నియు దీనికే పుట్టెను. ఇతరభాషలలోఁ జూతము. ప్రారంభించిన దాదిగ నాభాషనే వ్యవహరింతురు. దానివలనఁ జిన్నప్పటినుండియు నొకవిధమగు వాగ్ధోరణి

... మనవారి కిది లేదు. కనుకనే భాష యెన్నివిధముల నైనో అన్నియు మనవారికిఁ దోఁపకైను. కొఱఁతలేదు. ...వ్య మూహింతము. ఇంగ్లీషు-హిందీభాషలలోవలె సంస్కృ...ఖరదగ్గఱనుండియు భాషాభివృద్ధి గలుగుటకుఁ దగిన గ్రంథ...లగు. ప్రథమపాఠకులనుండి యెవరెవరి కెంతెంతవరకు భాషా...లుగునో యట్టిరచనలు లేవు. ఎక్కినవేనుఁగు నెక్కవలె ...దచారిగావలెనన్నట్లు గ్రంథము లున్నవి. అందునను రెండు ...కాగానె రఘువంశము పాఠము. చదువుగ్రంథమునకు విద్యా...జ్ఞానముండవలెనో తెలియదు. గుడ్డిపాఠము. అంతకంటె బాల...ధనమునకు సులభములగు గ్రంథములా? సున్న. సోపానశ్రేణివంటి గ్రంథపంక్తిగానరాదు. పండితసమాజము ఖండనముపై ఖండనములే గాని ముఖ్యోపయోగమార్గము వెదకుట కుద్యమించక పోయెను. కనుక, అట్టిగ్రంథసంపాదనము ప్రథమప్రయత్నము.

గీర్వాణవిద్యార్థి ప్రతివాఁడును మొదలిడినదిమొదలు తా నా భాషయందే యెక్కుడభ్యాసము చేయుచుండిన ధారాళముగ భాషా పరిచయము కాఁగలదు. దేశికులెల్లరును దమసన్నిధినుండు విద్యార్థుల కెల్లరకును నీమార్గము శిక్షించి తామును భావార్థములయందు గైర్వాణీభాషనే యుపయోగించి పాత్రాపాత్రవిచక్షణతో ననుగ్రహించుచుండిన నచిరకాలములో విద్యార్థు లభివృద్ధికి రాఁగలరు. ఇట్లు చేసిన ననేకులకు శ్రుతపాండిత్యమును గుదురగలదు? అనేకు లుత్సుకులు కాఁగలరు. ఇది ముఖ్యమని పౌనఃపున్యముగాఁ బండితప్రపంచమునకు నమస్కారాంజలి. ప్రతిగృహస్థపాత్రుఁడును దమపుత్రుల నీరీతిఁజదివించి ఇహపరలోకములకు బంధువులై గీర్వాణభాషోద్ధారకు లౌటకు యథాశక్తి ప్రయత్నించుట రెండవప్రయత్నము.

ఆంధ్రదేశమున ననేకులు మాతృభాషాసేవకమహాశయు లనవరతము నవిచ్ఛిన్నముగ మాతృభక్తియెడ బద్ధాదరులైయున్నారు గాన నీక నాయమువిషయమై మనమంత ప్రోత్సహింపవలసినది కానరాదు. "ప్రకృత మనుసరామః." యనువము. ఇప్పుడు గీర్వాణ భాషాదీపిక యంతరింపనున్నది. స్నేహపదార్థ మింకిపోయినది. అద్దాని నుద్ధరింప బ్రయత్నించి యద్దీపికాప్రభల మున్నువలె దేశంబున వెలిగించుట కర్తవ్యాంశము. ఇప్పటికిని అక్కడక్కడ గీర్వాణసభలు రిక్కరిక్కలాడుచునే యున్నవి. చదివినవారిని బరీక్షించుటకేగాని చదువనివారి గతి నాలోచింపను గాదు. పోనీ యాసభలలోనైన గీర్వాణవిద్యాప్రచారమా? తదుద్ధరణమా? దానినిగూర్చిన యుపన్యాసములా? పరీక్షలందుమా? కొమ్ములుతిరిగిన పండితులు తల్లక్రిందులగుచున్నారు. వారు పరీక్షలలోఁ దలక్రిందులౌదురా? భాషోద్ధారణ మొనర్తురా? అన్నియు సున్న. గాన భాషోద్ధారణమున కుద్యమించిన సభలవి గావు. ఇఁకఁగాలేజీలా? ఆదిభారతి యేత్రోవనఁ బారిపోవునో. దిక్కులఁ బ్రచరించునో యేమో యని ముండేయష్టదిగ్బంధన మొనరించిరి. మన కలి వినోదపండితులు రచించిన సంగ్రహాత్సంగ్రహములే పాఠ్యగ్రంథములు చేసిరి. అన్నిఁటను వ్రేలుపెట్టుటకు మాత్రము రకమున కొక పాత్రము పాఠ్యమగును. కడకు పాండిత్యమొందనిన తర్కము చూచి నాను. వ్యాకరణము బాగున్నది. సాహిత్య మున్నది. ఇవెందున్నది? ముఖములందా? గ్రంథములందా? యని యీవ్యాసపాఠకులు సంశయింతురు. ప్రాణ ధారవోసినను బరీక్షావారిధి తరించునది దుస్తరము. ఇందుచే నుత్సాహముగఁ జదువుప్రయత్నము లస్తమించెను. పాఠకులు ముందంజవేయఁ జాలకుండిరి. గాన నెవ్వియు భాషోద్ధరణమునకుఁ దోడ్పడనయ్యెను. అయిననిఁక శరణ్యమెద్ది? యని యూహింతము. మనయాంధ్రదేశీయపండితమాన్యు లనేకస్థలముల సభలంజేసి యందు ద్ధారణమార్గ ముపన్యసించి పూర్వమాత్సర్యమంతరింపఁజేసి శ్రద్ధాళువులై సదయహృదయులై యాబాలగోపాలము తేటతెల్లముగఁ దెలియున ట్లీయుద్యమమును బ్రోత్సహింపవలసినట్లు వారిపై నీభారము వైచుచున్నారము. బాలురకును బోధపడఁగల గ్రంథముల రచించి యందున్నరహస్యములఁ బైలుపఱచి వానియుపయోగము నుద్ఘోషించి వాఙ్మయసేవయొనర్చి ప్రపంచమునకు సహాయ మొనరింపవలయును. వారు వీరనక యెల్లరకును నభివృద్ధికాములై యచ్చటచ్చటఁ బరీక్షాస్థానము లేర్పఱచి యందుఁ బాఠకుల కుత్సాహముదయించు నుపాయము లాలోచించి సర్వుల నుద్బోధించి యజ్ఞానతమంబును బారఁదోల జ్ఞానాదిత్యుని రాక కెదురుచూచుచు గీర్వాణ సరస్వతికి నిత్యప్రబోధమగునట్లు మేల్కొల్పి ఇహపరలోకములకు నాప్తులై కీర్తిగడించుట తృతీయప్రయత్నము.

ఇఁక నీఫలితార్థమును మనవిచేసి విరమించుచున్నాఁడ.

శా. ఆదిన్ వాఙ్మయసేవ, పిమ్మటఁ దదీయాలోచనా మార్గ, మా,పైఁ దత్సంస్కృతభారతీకరుణ, యాపైఁ దత్ప్రచారంబు, నా,
మీఁదన్ దివ్యరహస్యవేదనము, నామీఁదన్ సదాముక్తిసౌ,ఖాదిప్రాప్తియుఁ గల్గుఁ బండితవరేణ్యభ్రాతృలారా! తుదిన్.

మ. అనుచుం బ్రాంజలినౌచు నే మనవిసేయ గల్గితింగాన మీ, రనపాయస్థితి నీప్రచారమును జేయన్ దీక్షనుం బూని వెం,
టనె యుత్తీర్ణులరై ప్రజాలికి "స్వయం తర్త్వాపరాన్ తారయే", త్తను రీతిం గరుణింప"వేఁడెద సమస్తాంధ్రీయులారా! యిఁకన్.

# స్వప్నలోకము

చింతలపూఁడి శేషగిరిరావు గారు

అప్రతరకార్యభార సందీప్తిచేత
నలసియుంటను సాయంతనంపువేళఁ
బోతిఁ జేరఁగ నొక సికతాతలంబు
మేనిశ్రమఁబాపు మందసమీరుఁ డనుచు
ఉత్తరీయంపుఁ గొంగుపై నొత్తిగిలుచుఁ
జేయితలగడగాఁ జేర్చి చేరఁబడియుఁ
జిత్తమలరఁగ సృష్టివైచిత్ర్యమెల్లఁ
గాంచుచుంటిని కన్నుల కఱవుదీర.
పక్షిసంతతు లాకాశపథములోన
నర్ధచంద్రాకృతిని దాల్చి యరుగుచుండ
నాకసంబను పందిలి నంటియున్న
కంబములు లేనియాకు తోరణములట్లుఁ
గానిపించుచునుండె శృంగార మొప్ప
నన్నిదిశలను నిశ్శబ్ద మావరించెఁ
గాని శ్రవణపుటంబుల నానుచుండెఁ
గూకలిడుచున్న సంద్రంపుఘోష కొంత.
అట్టులాశ్చర్య సాగరమందు మునిఁగి
కన్నులరమోడ్చి కునుకుచుఁ గలనుఁగంటి
దాని కలరూ పెఱింగింతు నేనొకింత:—
చటులకంటక క్షితిజాతసంయుతంబు
కఠిన సముపేతపాషాణ కలుషితంబు
విపినమృగరాజగర్జనభీకరంబు
నగుచుఁ గన్పట్టు మార్గమధ్యంబుఁ బట్టి
యేగుచుంటి నదేడ కో యెఱుక లేక.
అట్టు కతిపయకాలంబు చెట్టు చేమ
పుట్టగుట్టలఁ గాంచుచుఁ బోయినంత
దృష్టికిం దోచెఁ దైలపుం దివ్వెయొకటి.
సరియె! కాఁబోలునిదిజనాశ్రయమటంచు
జేరి యటకుఁ బథశ్రమఁ దీరఁ దలఁచి
కంటి నిదురను స్వప్నలోకంబునందె.

స్వప్నమందలి నిదురలో స్వప్న మొకటిఁ
గాంచుచుంటిని వినుఁడి యొకించుకంత.
కన్నుమూసినయుత్తరక్షణమునందె
తపసి యొక్కఁడు నాకుఁ బ్రత్యక్షమయ్యె.
నిమ్మహామహు వెన్నంటి యేగుచుంటి
గవ్యూతలమునుఁ గాంతు మన్గాంక్షకతన.
ఆతఁడట్లు హుటాహుటి నరుగుచుండి
చేరె నపుడపుడె పటకుటీర మొండు.
అట్టు లాఋషి యదృశ్యమగుడు నేను(?)
వచ్చిచేరియుఁ దద్గృహప్రాంగణమున
నిలచి చూచితిఁ గకుబంతనిచయమెల్ల
అన్నియుం బర్ణశాలలే యచటఁగలవు
కాని యొండొంటిమధ్యను గానఁబడియె
బాలతృణ పూరితంబగు బయలుకొంత
అరరె! ధన్యతఁబొందె నా యక్షియుగము
చూచి తోకమునిపల్లెను జూడ్కులలర
నని మదీయ భాగ్యంబు నే నట్లుపొగడి
కొనుచు వింతలారయు వేడ్క కొంతగలుగఁ
బోతి వేఱొక్క మునివాటి పొంతకంత
వ్యాఘ్రహరిణంబు లొక్కెడ నాడుచుండె
నొకట గజకేసరుల్ చేరెఁ బ్రకటితముగ
నిరతి మన్యోన్య వైరమే నెగడుగాని
యిట్టి సఖ్యభావంబు లవెట్లుగలిగె
ననుచుఁ జింతించుచుఁ సాగి తవలికింక
అతులదీర్ఘంపుకుశసమూహంబుపైన
నారవైచిన నార్ద్రవల్కలములెంతొ,
గనులపండువు సల్పెను మనము పొంగ
నంత నింకొక్కఋష్యాశ్రమంబుఁ జేరఁ
గడుపునిండుగ నివ్వరికంకులెల్ల
మేసి మృగశాబకంబులు మృగమువెంటఁ

పర్ణశాలకవాటంపుఁ బ్రక్కకేగ
నట్టె చూచితి ననిమిషత్వంబు నొంది
తల్లిబిడ్డలప్రేమ సూత్రమ్మువంక.
అంత నావల నొక కుటీరంబుఁ జేర
సతులస్వచ్ఛంపు జలపూరితంబులైన
పాత్రలంబట్టి పూదీవెపందిళులకుఁ
గోరి మునికన్యకాళియు నీరమెత్తి
వెనుకకుందిర్గి చూచుచు వెడలుచుండె
నాలవాలమ్ములం బక్షిజాల మహహా!
పీల్చుచుండుట నీరమ్ము బెదరిబెదరి.
ఇంక ముంగలగలయాకుటింటికేగ
నొక్క దేశికునొద్దను బెక్కుమంది
కూడి మునిబాలకాళియుఁ బాడుచుండె
సామగానంబు విమలసచ్ఛాత్రనియతి.
అదిర! ధన్యంబులయ్యె శ్రోత్రంబులంచు
వేత్త యొక్క పర్ణశాలకు వెడలినంత.
సామగానంబుమించిన శబ్దమొండు
శ్రావ్యముగ వినఁబడియె నాశ్రవణములకు.
రమ్యతరమైన యిద్ది యారాత్ముగాన
మనుచు గ్రహియించి చేరువ కరిగినంత.

మున్ను బ్రత్యక్షమైనయామునియె యిచట
చరకమును ద్రిప్పుచున్నట్టి సరణిఁ దోఁచె
కాయమతి బలహీనమై కానఁబడియె
చాయ చామన చాయయా చాడ్పునుండె
బ్రాయమరువదిన్ మించని భంగిఁదోఁచెఁ
బోసినోర్నను బుద్ధియే పోడమె నాకు
గాని ముఖమండలంబునఁ గానఁబడియె
బహుళతరమైన సాత్త్వికభావమెంతొ
యట్టి పురుషాగ్రగణ్యుని చుట్టుఁ జేరి
చెంతమునివరుల్ గొందరాసీనులైరి
వీరి కమ్మహాభాగుఁడు ప్రేమసూత్ర
సరణిఁ గాఁబోలు బోధన సలుపుచుండె
సహజమౌ మృదుమధుర వాగ్జాలమందు
అట్టులాతని వాగమృతంబుఁ గ్రోలి
హర్షసూచకభంగి నయ్యాశ్రితాళి
చఱచి కరతాళపుంధ్వనుల్ సలిపినంత
తత్తరిల్లుచు లేచియు నుత్తరీయ
మ్మున్ విదల్చి మిగులఁ బ్రొద్దుఁబోయెనంచు
మోముఁదుడిచికొనుచుగృహోన్ముఖుఁడనైతి
సంతసించుచు గనినట్టి స్వప్నమునకు.

# కుటీరలక్ష్మి

కనుపర్తి వరలక్ష్మమ్మ గారు

౧

కార్తికమాసము ప్రారంభమై పదునాల్గుదినములైనది. సుధాకరుఁడు దినదినము కళాభివృద్ధి నందుచుఁ దనసాంద్రశీతల కిరణములచే జగజ్జనుల గడగడ వణకింపుచున్నాఁడు.

దివ్యసౌధములలో గాలి చొరకుండ గవాక్షములకు తలుపులను బిగించుకొని యున్ని చొక్కాయలు తొడిగికొని దుప్పటులఁగప్పుకొని తనువును విశ్వమును మఱచి గుఱ్ఱులుపెట్టి నిద్రపోవు ధనాఢ్యులకు శీతకాలమంత సౌఖ్యమైనకాలము లేదు. కానిపెకుటింపుచలిలో నోడలు నిండ బట్టలైన దట్టమైన కొంపలేక నల్లాడు బీదజనులకీఋతువు మాత్రము హృదయవిదారకముగ నుండును.

పేదలు సాధులు పథికులు నలమటించెడు నాశీతరాత్రివేళ రామలక్ష్మి కప్పుకొంతపోయిన చుట్టుగుడిసెయందుఁ దనయిరువురుబిడ్డల నొకతాటియాకులచాపపై నిరుప్రక్కలఁ బరుండఁ బెట్టుకొని "అమ్మా చలే" యని బిడ్డలరచినప్పుడెల్ల "నాచిన్ని యన్నలారా! నన్నుఁ గట్టిగా గౌఁగిలించుకొనుడు. ఈప్రపంచములో మీకన్నధనమెల్ల నీ నిర్భాగ్యపుతల్లి యొక్కటయే గదా?" యని కన్నీరొల్కుచు డగ్గుత్తికతోఁ బల్కుచు నవ్యాజముగా వెడలుచున్న కన్నీటిధారల పైటపేకెల నద్దుకొనుచు నాగభీరశీతరాత్రిని వేగించుచుండెను. రాత్రి మూఁడుగంటలతిక్రమించినది. హోరు మని యీదరగాలి యెక్కువైనది. గోడకొత్తిగిలి పరుండిన రామలక్ష్మికిని యామె బిడ్డలకును చంద్రుఁడభిముఖుఁడైనాఁడు. చల్లనియా చంద్రకిరణములు రామలక్ష్మిమీఁదను నామె యిద్దఱుబిడ్డలమీఁదను సోకినవి. ఆయీదరగాలి కాచంద్రకిరణప్రసారమునకు చలి యెక్కుడు మైనది. చలిబాధకు తాళలేక రామలక్ష్మి చిన్నకొమారుఁడగు రంగఁడు "అమ్మా! చలే" యని పెద్ద కేక పెట్టెను. "కేక వేయకు నాయనా" యని రామలక్ష్మి యాబిడ్డను దగ్గఱకు లాగఁబోయినది. బిడ్డయొడలు కొయ్యవలె గట్టిగాఁ జేతికిఁ దగిలినది. అంత రామలక్ష్మి "అయ్యో! బిడ్డ కొయ్యలాగున్నాఁడే" మని యాతురతతో "రంగా, రంగా" యని రెండుమాఱులు గట్టిగా పిలచినది. రంగడు పలుకలేదు. రామలక్ష్మిగుండె లవిసిపోయినవి. "అయ్యో నాయనా! పలుకవేమిరా?" యని రామలక్ష్మి పెద్దగ నేడ్వసాగినది. తల్లి రోదనమునకుఁ బెద్దకొమారుఁడగు రాముఁడుగూడ మేల్కొని "అమ్మా! యెందు కేడ్చుచున్నావు?" యనెను. "నాయనా! తమ్ముఁడు బిగిసికొనిపోయి నాఁడు. మాటలేదు. ప్రాణమున్నట్లు లేదురా" యని రామలక్ష్మి యేడ్చుచుఁ జెప్పినది. ఇఁక నేమున్నది? తల్లి బిడ్డ లిద్దఱు "రంగా రంగా" యని గొల్లున గోలెత్తినారు.

వీరిరోదనమునకు నిరుగుపొరుగుల నున్నవారి కల్లరు వచ్చినది. పాపము! రామలక్ష్మి యెందులకో యేడు... యందఱు పరుగెత్తుకొనుచువచ్చి "రామలక్ష్మి! యెందు కేడ్చుచు[న్నావు]" యనిరి. "నాయనలారా! సంస్థానమువంటి సంసారము చితికిపోయి కడుపుకూటికిఁగూడ కష్టపడుచున్నను, వేలకువేలు సంపాదించుచుఁగూడ పోయి యల్లాడుచున్నను, యిద్దఱునలుసులను బెట్టుకొని బ్రతుకవలయు ననుకొంటిని. వీరే నాభాగ్య మనుకొంటిని. ఆయదృష్టము లేకుండ దేవుడు కన్నులఁ గంపకొట్టినాఁడు. కడుపునఁ జిచ్చుపెట్టినాఁ" డని రామలక్ష్మి రంగనిఁజూపి రోదనముచేయుచు చెప్పినది. "అయ్యో పాప" మని యందఱు రంగనియొద్దకుఁ బోయి పట్టి చూచిరి. "ఏమున్నది? కొయ్య! చిన్నబిడ్డగుణమేమొ! రక్షచేసిన తెలివి వచ్చు"నని కొంద ఱనిరి. "ఏడేండ్లబిడ్డకుఁ జిన్న బిడ్డగుణమేమి" యని కొంద ఱామాట నాక్షేపించిరి. "ఆఁ! రావచ్చును. పదిరెండేండ్లవఱకు చిన్నబిడ్డగుణము వచ్చుట కలదు" దని కొందఱు సమాధానము చెప్పిరి. "అట్లయిన జుట్టుతో రక్ష చేయుఁడ" మని యొకరు మోమునఁ జుట్ట నంటించఁబోవుచుండ నింతలో నొకముసలివాఁడు వచ్చి "యాబిడ్డకు రక్ష చేయుచున్నా రెందులకు? మీకు మతి పోయినదా? ఒకవంక హోరుమను యీఁదరగాలి; ఒకచెంప జిల్లుమని శీతకట్టు; పున్నమవెన్నెల; చల్లనిచాప; అడుగున ప్రక్కబట్ట లేదు; పైన కప్పుకొనుబట్ట లేదు; ఈరాత్రి చలియత్యధికముగా నున్నది; పాపము శీతగాలికి బిడ్డ బిగిసికొనిపోయినాఁడు. రక్ష వలదు. శిక్ష వలదు. రెండు తాటాకులు మంటవేసి బిడ్డశరీరము కాపు చేయుఁడు తెలివి వచ్చు"నని చెప్పెను. ముసలివాఁడు చెప్పినమాట నిజమని యందఱు నిశ్చయించిరి. వెంటనే నిప్పుచేసి యఱచేతులతో బిడ్డయొడలు కాచిరి. అట్లొక్క పదినిముసములు కాపుచేయ పిల్లవానిశరీరము మెత్తపడెను. మఱి పదినిముసము లట్లే చేయ పిల్లవాఁడు కొంచెము కదలెను. అంద ఱానందముతో "రామలక్ష్మి! నీ బిడ్డ బ్రతికినాఁడేమువలన" దని యాఁడించిరి. ఇంకఁ గొంచెము సేపునకు "అమ్మా! వేడిగా నున్న దేమే" యనుచు రంగఁడు కనులు తెఱచెను. "నా చిట్టితండ్రీ! బ్రతికితివా?" యని రామలక్ష్మి పట్టరానియానందముతో గుమారు నాలింగన మొనర్చుకొనెను.

౨

వేంకటస్వామి పితృపితామహుల కాలమునుండియు రంగు లద్దకమే వృత్తిగా గలవాఁడు. వేంకటస్వామి తండ్రియగు రామస్వామియు నాతనితండ్రి యగు వీరాస్వామియు జీవితులై యున్నకాలమునందు వారివ్యాపారము చాల కొద్దిపాటిదై యుండెను. వా రెప్పుడు కోస్తా బేరము చేసి యుండలేదు. తమ గ్రామమునందలి వర్తకు

బునకును వస్త్రములకును రంగు లద్ది మరల నావర్త యొసంగు నేర్పాటుతో వారు వ్యాపారము చేసిరి. రంగు వారు తమ గ్రామవర్తకులయొద్దనే కొనుచుండిరి. వారి యంత సౌమ్యముగ నుండుటను బట్టి కొంచెమో గొప్పయో నచ్చుటయే గాని యపారము లగు వ్యాపారనష్టములు లకుండెను. పాడిపంటలతో నొప్పి కలిగినకాఁపురమును వారికాఁపుర మెుండెను.

తండ్రి మరణించు నప్పటికి వేంకటస్వామి యిరువదేండ్లయువకుఁడు. తమగ్రామమందలి వైశ్యయువకులతోఁగూడ సమీపపురమునందుఁ బ్రవేశతరగతి చదువుచున్నాఁడు. తండ్రి మరణింపగనె యేకపుత్రుఁడగు వేంకటస్వామిచదువు వాఁగిపోయినది. తండ్రివ్యాపారభార మాతనిపైఁ బడినది. వైశ్యయువకుల సాంగత్యమువలన గలిగిన వాణిజ్యప్రియత్వముతోడను నాంగ్లభాషాభ్యాసమువలన గలిగిన స్వాతంత్ర్యభావములతోడను వేంకటస్వామి కులవృత్తి నారభించెను. వేంకటస్వామి వ్యాపారములో చేయిపెట్టగనె గ్రామవర్తకులయొద్ద రంగులుకొని వస్త్రములు పుచ్చుకొని రంగు లద్ది మరల వర్తకుల కొసంగి వా రిచ్చెడుడబ్బు గైకొనెడి కూలిపాటుపద్ధతి వేంకటస్వామికి రుచింపలేదు. బొంబయినుండి తానే స్వయముగ రంగులను బట్టలను తెప్పించి వేరువేరురంగుల నద్దించి యింపుగొల్పెడి తీరైనచుక్కలను తీగలను నంచులను వేయించి తెలుఁగుసీమయందలి నలుదిక్కులకేకాక బొంబాయి హైదరాబాదు రంగూను సింహళము మున్నగు పరరాష్ట్రములకు గూడ నెగుమతిచేసి లాభము గడించవలె నని వెంకటస్వామికి బుద్ధిపుట్టెను. వెంటనే వెంకటస్వామి కొన్నివేలు ఋణము తెచ్చి చేతుపాటు వెలుగని యౌవనపు టుత్సాహముతో బొంబాకియవెళ్లి రంగులు బట్టలు వచ్చు నేర్పాటు చేయ సమకట్టెను. "నీవు చిన్నవాఁడవు; వర్తకములోనిమాయ మర్మము లెఱుగవు. ఇట్టి ఘనవ్యాపారములు వర్తకజీవులగు వావైశ్యలకే తగును గాని మనకుఁ దగవని బంధుమిత్రు లెన్నివిధములఁ జెప్పినను వేంకటస్వామి కప్పు డున్నవ్యాపారకాంక్షలోఁజెవి దూరలేదు. బొంబాయికివెళ్లి వేంకటస్వామి బట్టలదిండ్లును రంగులును వచ్చునేర్పాటు జేసి యందుకొఱ కాయావర్తకులకుఁ గొంత సొమ్మును ధరావతు నిచ్చి వచ్చెను. బొంబాయి వెళ్లివచ్చిన తరువాత వేంకటస్వామి వ్యాపారకాంక్ష మఱింత ప్రబలమైనది. అచ్చటి వర్తకుల కుబేరసంపద యాతని మఱింత మోహమున ముంచినది. ఐశ్వర్యవంతుఁడను కావలెనన్నచో విరివియైన వ్యాపారము సేయుటకన్న వేఱు మార్గము లేదని యాతఁడు నిశ్చయించెను.

వేంకటస్వామి బొంబాయినుండి రాగానే గ్రామము వెలుపల నున్న తమకాలీదొడ్లలో పెద్దపాకలు వేయించి బందరు నెల్లూరు కాకినాడ మధుర మున్నగు పట్టణములనుండి చక్కనిరంగుల నద్దుట యందును చుక్కలు కట్టుటయందును, సొగసైన యంచులను కమ్ములను వేయుటయందును నిపుణులైన పనివారల రప్పించి బొంబాయి నుండి వచ్చినరంగులతో వస్త్రములతో వ్యాపారము సాగించెను.

ఒక్కసంవత్సర మగునప్పటికి వేంకటస్వామిగారి రంగుబట్టలు దేశమంతట ప్రసిద్ధి కెక్కినవి. "చిఱిఁగి ముక్కలైనను చెన్నుమా యని వన్నె తగ్గని పక్కారంగులు, సన్ననిబట్టలు, సరసమైనధరలు" అను పత్రికలలోని పెద్దపెద్దప్రకటన లాతనిపేరును మఱింతవ్యాప్తిపఱిచినవి. అనేకవస్తువులు పత్రికలయందుఁ బ్రకటించినయోగ్యతకుఁ దగి యుండవు. కాన పత్రికాప్రకటనములన్న లోకులకు విశ్వాసము లేదు. కాని వేంకటస్వామిగారిరంగుబట్టలు పత్రికలయం దెంతదృఢముగఁ బ్రకటింపఁబడెనో యంతేమంచివిగ నేయుండెను. మాయరంగులు విపరీతపుధరలు యిత్యాదికుటిలక్రియలు లేకుండ నుండెను. అందువలననే ప్రజలకును వర్తకులకును గూడ యాతనియందు విశ్వాసము కుదిరినది.

అతనిఋజువర్తనమే యాతనికి లాభము చేకూర్చినది. వేంకటస్వామి తెచ్చినఋణము తీఱిపోయినది. తొలుదొల్త వేంకటస్వామి వ్యాపారారంభమునుజూచి వెక్కిరించినవారు ముక్కుపై వ్రేలిడికొని యక్కజపడున ట్లాతనివ్యాపారము శుక్లపక్షచంద్రునివలె దినదినాభివృద్ధిని గాంచినది.

3

పదిసంవత్సరము లీరీతి నేకధక్కితో వ్యాపారము సాగినది. వేంకటస్వామి అందు నన్ను, వారిరంగుబట్టలు జగత్ప్రఖ్యాత మైనవి. అయిదువేలఋణపురూకలతో "నష్టము సిద్ధము నష్టము సిద్ధము" అను ప్రజాశీర్వాదముతో నారంభించిన వేంకటస్వామివ్యాపారము, ప్రాంతప్రాంతమునందలి పల్లెపట్టణముల ప్రాకిపోయినది. ప్రతిసుందరాంగి తనువునను, ప్రతివిలాసపురుషునిశరీరమునను వేంకటస్వామి గారి రంగుబట్టలే రాణించినవి.

వ్యాపారము కూడివచ్చిన విత్తమున కేమి కొదువ? వేంకటస్వామి సకలైశ్వర్యశోభితుఁ డైనాఁడు. అతని పురాతనపు పెంకుటిల్లు మూడంతస్థులదివ్యసౌధ మైనది. పట్టుసోఫాలు, నిలువుటద్దములు, పట్టెమంచములు, తూగుటుయ్యెలలు, బల్లలు, కుర్చీలు, వెండిపాత్రలు, బొంబాయి చెన్నపురి మున్నగు పట్టణములనుండి తెచ్చిన వింతవింతలైన విలాసవస్తువులు మున్నగుసంపద్విలాసనాగరికపుపరికరములతో వేంకటస్వామిమేడ నిండిపోయినది. గృహశోభయే యంతయైశ్వర్యవిరాజితమై యుండ నిఁక భార్యాబిడ్డల యలంకారములను గూర్చి వేఱు నుడువ నేల?

వేంకటస్వామి ఇప్పుడు పెద్దషాహుకారు. అతని విశాలమైన కచ్చేరిసావడిలో యిద్దరు గుమాస్తాలు యెప్పుడు పెట్టెలను ముందుపెట్టుకొని కూర్చుండి వ్యాపారసంబంధములగు వ్రాఁతకోఁతల నిర్వహించుచుందురు. వేంకటస్వామి వ్రాతబల్లయొద్ద కుర్చీలోఁగూర్చుండి గుమాస్తాలడిగినవ్యవహారవిషయములకుఁ దగినయుత్తరములఁ నిచ్చుచు తన్నుజూడ వచ్చినపెద్దమనుష్యుల నుచితరీతి సత్కరించి సంభాషింపుచు తన్ను సందర్శింపవచ్చిన యాచకబృందములయథోచితదక్షిణలఁదనుపుచుఁ గాలమును గడుపుచుండును. పలుకుబడిని బట్టియు భాగ్యమునుబట్టియు నిటీవల కొన్నిస్థానికాధికారములు వేంకటస్వామికి లభించినవి. అయాచిత

ముగాఁ దనకు లభ్యమైన యధికారపదవులను మిక్కిలి ప్రజాసమ్మతముగ నిర్వహింపుచు వేంకటస్వామి ప్రజాగౌరవమును బడయుచుండెను.

రామలక్ష్మి వేంకటస్వామికిఁ దగినపత్ని. వారిద్దరు మేనత్త మేనమామబిడ్డ లగుటఁబట్టి కాఁబోలు వారిద్దరకు స్వభావమునందుగూడ సామ్యమున్నది. వేంకటస్వామి యెంతఋజువర్తనుఁడో, రామలక్ష్మి యంతఋజువర్తన గలది. వేంకటస్వామి యెంతసరళవర్తనుఁడో రామలక్ష్మి యంతసరళప్రవర్తనము గలది. వేంకటస్వామి యెంతదయాధర్మశీలుఁడో రామలక్ష్మి యంతదయాధర్మశీల.

అన్నాతురుల కేయింట నన్నము దొరకకున్నను, రామలక్ష్మి యింట దొరకును. శిశువుల కేయింటఁ జా లలభ్యమైనను రామలక్ష్మి యింట బొజ్జనిండును. రామలక్ష్మియింట బానలతో పాడి. వచ్చినవారికెల్ల రామలక్ష్మి లేదనకుండ మజ్జిగ పోయించును. అన్నివర్ణముల వారు, ఒకమజ్జిగయే కాదు, ఉదయము లేచినది మొదలెన్నియో విధముల సహాయమును రామలక్ష్మివలనఁ బడయుచుందురు. ఈరీతి నా లేఁబ్రాయపు దంపతులు తులలేని సిరిసంపదలచేతను, ఇంతటి సంపద యున్నను గర్వముచే ప్రలోభముచే మొక్కవోని సుగుణసంపదల చేతను పౌరుల కత్యంతప్రేమాస్పదులై విరాజిల్లుచుండిరి.

౪

మఱి రెండువత్సరములు గడచినవి. ౧౯౧౪ సంవత్సరము వచ్చినది. ఐరోపాలో ఘోరమైన సంగ్రామ మారంభమైనది. సూఁది గుండీ మొదలయిన ప్రతిచిన్నవస్తువునకుఁ గూడ పరదేశములపై నాధారపడియున్న హిందూదేశములోఁ బ్రతివస్తువునకు ధర పెరిగిపోయినది. ముఖ్యముగా జర్మనీలోఁ దయారగు రంగులకును మాంచెస్టరు, లాంకషైరు పట్టణములలో తయారగు వస్త్రములకును విపరీతముగా ధరలు పెరిగినవి. రూపాయి కాఱుగజము లమ్మిన మల్లుగుడ్డ యొక్కగజ మైనది. ముప్పదిరూపాయ లమ్మిన రంగుపీపా మూఁడు వందల రూపాయ లైనది.

పెద్దపెద్దవ్యాపారములలో వివిధాంతరములు లేవు. వచ్చిన భోగి, పోయినజోగి. రెండేపద్ధతులు. ఈరెంటికిని తాళుకొని తట్టుకొని నిలుచబడే సమర్థతను గలిగియుండవలెను. వేంకటస్వామి యాకస్మికముగా సంభవించిన ఈధరలప్రమాదము విని నిశ్చేష్టుఁడైనాఁడు. మూఁడుసంవత్సరములవఱకు నొకేధరలకు రంగుబట్టలను నందిచ్చునట్లు బొంబయివర్తకులకు వేంకటస్వామి పూచీపడియున్నాడు.

వర్తకు లందునిమిత్తము వేంకటస్వామికి ధరావతుసొమ్మునుగూడ చెల్లించియున్నారు. కాన రంగు ఎంతప్రియపుధరలకుఁ గొన్నను వేంకటస్వామి వెనుకటిధరలప్రకారమే రంగువస్త్రములను వర్తకులకుఁ జెల్లించి తీరవలెను. ఈ స్థితిఁ దలఁచినప్పుడు వేంకటస్వామి గుండె గుభేలు మన్నది. కాని యిట్టి ఒప్పుదలలె బట్టలవర్తకులవల్ల తానుగూడ పొందియుండుటచే రంగు లెక్కువధరలకు గొన్నను బట్టలు పూర్వపుధరలకే వచ్చునుగదా. లాభము లేకపోయినను నష్టము లేకుండ వ్యాపారము సాగవచ్చునని వేంకటస్వామి కొంతధైర్యః ఎప్పటియట్లు వ్యాపారము సాగుచుండెను.

కాలము ప్రతికూలముగా నున్నప్పుడు అనుకొనిన లనుకొనినట్లు జరుగవు. వేంకటస్వామి రంగు లొక్కటియే ప్రియముగఁ గొనవలసినది. బట్టలు పూర్వపుధరలకే యనుకొనెను గాని రంగులధర యనుకొనినదానికంటె కమైనప్పుడు అతని వ్యాపారము నష్టము లేకుండ మహాద్రవ్య ప్రవాహమునందు యథేచ్ఛముగా విహరింపుచ స్వామి వర్తకపుటోడను క్రమక్రమముగా నవరోధ మారంభము సంగ్రామతీక్ష్ణాతపము నానాటికి మిక్కుటంబగుచుండ ధనవాపి యింక కెట్లుండును? జలము కొంచెమైన పడవ యేరీతి నడచును? కొన్ని మాసములనుండి వేంకటస్వామి మనసున మనసు లేదు. ఒకటేవిధముగ దీర్ఘాలోచనము చేయుచున్నాఁడు.

ఈదెబ్బతో వేంకటస్వామి యధఃపాతాళమునకుఁ ద్రొక్కఁబడినట్లే యని యాతని యౌన్నత్యమునుజూచి సహింపలేని ప్రతిపక్షు లానందింపుచున్నారు.

పాపము! వేంకటస్వామి కెంతకష్టము వచ్చినదని యాతని శ్రేయోభిలాషు లగుమిత్రులు విచారింపుచున్నారు.

శివుఁడు తనవాఁడైన చిల్లర దేవుళ్లతో నేమి పని? కాని శివుఁడే ప్రతికూలుఁడైనాఁ డిప్పుడు వేంకటస్వామికి.

వేంకటస్వామి తెలివి తేటలు గలమనిషి. వ్యాపారమర్మము లాతఁడెఱిఁగినట్లు కోమటిరైన యెఱుఁగునో యెఱుఁగఁడో యని భావింపవలసినంతవాఁడు.

విదేశరంగులవ్యాపకముచే నశించిపోయిన నీలిమందు ఉత్పత్తిని రంగులు లేక సంకటపడుచున్న యీతరుణమునందు పునరుద్ధరించుటచేత కొంచెము లాభముండునేమో యని వేంకటస్వామి కొకయూహ దోఁచినది. ఈరంగుమూలమున దనయద్దకపు వ్యాపారము నిరంతరాయముగ సాగింపవచ్చునేమోయని వేంకటస్వామి యాలోచించినాఁడు. సరేననుకొనినాఁడు. పూనుకొనినాఁడు. కాని యెన్నియెత్తు లెత్తినను యెన్నిపాట్లుపడినను వేంకటస్వామి వ్యాపారమునకుఁ బూర్వపు పోఁడిమి రాలేదు.

౫

వైశాఖమాసము సగముచెల్లినది. ఎండలు బహుతీక్ష్ణముగా నున్నవి. నాలుగుగంటలైనను బయట మొగమును బెట్టనీయుట లేదు. మంటలఁ గ్రక్కుచున్నది నాఁటియెండ. నిప్పులఁ జెరుగుచున్నది నాఁటిగాడ్పు. ఇట్టి భయంకరపు టెండలతో వేగుచున్న యొక్కనాఁటిపగలు మూఁడుగంటలవేళ సుందరమైన తనసౌధమునందు తనపడకటిగదియందలి ద్వారములకును గవాక్షములకును వట్టివేళ్ల తడికలను గట్టించి యెడతెగకుండ చల్లనినీళ్లచేఁ దడిపింపుచు వానినుండివచ్చు శీతలసమీరములకు హాయిహాయియనుచు హంజానీళ్లతో గ్రుక్క దడుపుకొనుచు తాళవృంతముతో స్వేదనివారణము చేసికొనుచు వేంకటస్వామి తనపట్టెమంచ

...యెద్దియో యాలోచింపుచుండెను. రామలక్ష్మి తత్స...టిచాపపై నైదేండ్లవాఁడగు పెద్దకొమరుని నిద్రపుచ్చి ...ఁడగు చిన్నకొమారుఁడు నిద్రపోకుండుటచే సెండలోనికి ...శిలో గూర్చుండబెట్టుకొని ముద్దులాడుచుండెను.

...నెవరో గబగబ మేడ మెట్లెక్కి లోనికి వచ్చు...డయ్యెను. ఎవరువచ్చుచున్నది చూచుటకై రామలక్ష్మి ...కొని లేచి నిలువబడెను. ఆలోచనాధీనచేతస్కుఁడై ...టస్వామికూడ యాసడికి లేచి మంచముపైఁ గూర్చుండెను. ...ంతలో ఆమనిషి రానేవచ్చినాఁడు. భోరుభోరున నేడ్చుచు ...మ్యా మనయగ్దకపుగొట్లకు నిప్పు ముట్టుకొన్నది. భయంకరముగా ...ండుచున్న" దన్నాఁడు. "ఆఁ-ఆ-ఆ-గోరుచుట్టుపై రోకటిపోటా?" యని వేంకటస్వామి పఱుపుమీఁద నొఱిగినాఁడు. అయ్యో! యని రామలక్ష్మి నేలఁ గూలినది.

ఉచితశైత్యోపచారములచే నిర్భాగ్యురాలగు రామలక్ష్మి యసువులు నిలిచినవి! భాగ్యశీలుఁడగు వేంకటస్వామి యసువు లెగిరి పోయినవి!

నడికప్పు నంటఁబెట్టిన మల్లుతానులదిండ్లు నూలుదిండ్లు రంగు బట్టలదిండ్లు దొంతరలు తీర్చిపెట్టిన రంగుపీపాయీల సహితముగా భగభగమని మిన్ను నంటెడుమంట లెగసి యగ్దకపుగొట్లు భస్మావశేష మైనవి. ఎంతటివిషాదసంఘటనము.

"అయ్యో! అర్థము ప్రాణము ఒక్కమారే పోయినదే" యని రామలక్ష్మి యొక్కతయే గాదు—గ్రామమంతయు యాబాలగోపాల మొక్కవిధము విలపించినారు. మానవుని భోగభాగ్యములును బ్రాణ ముఁగూడ యెంతక్షణభంగురములు వేంకటస్వామిజీవితము వెల్లడించి నది. ఐహికైశ్వర్యములను గాంచి గర్వించెడి మందమతు లీవృత్తాంత మును జూచి కన్నులు తెఱచెదరుగాక.

౬

రావలసినబాకీ లున్నవి. ఇయ్యవలసిన బాకీ లున్నవి. చేబదు లుగా యిచ్చినవియున్నవి. వ్రాఁతమూలకముగాఁ దెచ్చినవియున్నవి. చెల్లించినధరావతు లున్నవి. చెల్లించుకొనవలసినవి ధరావతు లున్నవి. దేశమంతట నీవిధముగా వ్యాపారమును వలనుపఱచినట్లుపఱచి వేంకట స్వామి జీవము వదలినాఁడు.

అనాథ, అబల, భర్తృవిహీనదుఃఖముతో భాగ్యవినాశనదుఃఖ ముతో నల్లాడుచున్నది. పాపము! రామలక్ష్మి యేమిచేయగలదు? తనయులఁ జూడబోయినఁ గన్నులు తెఱవని పసిపాపలు. వేంకటస్వామి యాస్తికి రక్షకు లెవరు?

బొంబాయివర్తకు లటు, తెగువగలవారు. వేంకటస్వామి చచ్చినవారముదినములకే వచ్చి తట్టఁబుట్ట బయటవేసినారు. అసూర్యం పశ్యయగు రామలక్ష్మిని యామెముద్దుబిడ్డలతోఁగూడ ముంగిలి కీడ్చి నారు. తోఁటలమీఁదను దొడ్లమేడలమీఁదను మిద్దెలమీఁదను దండ యాత్ర సాగించినారు.

ఈభీభత్సప్రదర్శనములో రామలక్ష్మికి "నా" యన్నవారు లేక పోయినారు. అదియేమి పాపమో? వేంకటస్వామికి రామలక్ష్మికిఁగూడ తల్లిదండ్రులుగాని తోడబుట్టినవారుగాని లేరు. రామలక్ష్మికి సవతి యన్న యొకఁడున్నాఁడుగాని యాతఁడు కర్షకుఁడు. వ్యాపారవ్యవ హారము లెఱిగినవాఁడు కాఁడు.

ఇరుగునఁ బొరుగున దాఁచినసామాను లక్కడే యంతర్ధానమైనవి. బంధువులయింట దాఁచిన నగలు నాణ్యము లక్కడే యంతరించినవి. ఆయాచకబృందము, ఆమిత్రవర్గము, ఆబంధుబలగము! యేమయిరో? ఒకరు వాకిలిలోనికి వచ్చి పలుకరించువారు లేరు. ఈవిపత్సమయ ములో మొదటినుండి వేంకటస్వామి యొద్దనుండిన బాపనగుమాస్తా లు చేఁజిక్కినసొమ్మును కబళించుటయే గాక వేంకటస్వామి యాస్తి పాస్తులజాడలు చెప్పి ఋణదాతలలనఁ బారితోషికముల నందిరి. స్వామి ద్రోహమన్న నిట్టిదియే గదా!

పర్యవసాన మేమి యన? రామలక్ష్మి యామెయిద్దరుబిడ్డలు తప్ప వేంకటస్వామికి సంబంధించిన దేమియు మిగులలేదనియే చెప్ప వచ్చును. ఆతనిభాగ్య మెంతత్వరితముగ నభివృద్ధి నందెనో యంతకు లక్షరెట్లు త్వరితముగ నశించిపోయినది.

ఇట్లు సర్వము వమ్మైపోవ చేత రాగిడబ్బు లేక రామలక్ష్మి యల్లాడుచుండ నొక్కసత్యసంధుఁడు రూపాయిలు మూటగట్టుకొని వచ్చి "యమ్మా! నీపెనిమిటి నాకొమారుని వివాహమునిమిత్తము డబ్బు లేక కటకటంబడుచుండ నైదువంద లప్పునిచ్చెను. ఆమహనీయుఁడు నావల్ల ఋణపత్రమునైన వ్రాయించుకొనలేదు గానీ నేనుమాత్రము దానిని ఋణముగానే పరిగ్రహించితిని. ఆయన యుండఁగానె యీ పైకమిచ్చుప్రాప్తము నాకు లేకపోయినది. కాని నీకాఁపుర మిప్పుడు చితికిపోయినది. కాని యీయవసరకాలమున నారూక లెవ్విధమున నైన సాయపడినచో ఆయన చేసినయుపకారమునకు నాకృతజ్ఞతను గొంతయైనఁ జూపినవాఁడ నగుదును. అని వడ్డితోఁగూడ నైనయెనిమిది వందలు రామలక్ష్మిచేతఁ బెట్టెను. రామలక్ష్మికి రావలసిన యనేకబాకీ లలో వచ్చినసొమ్ము యీయెనిమిదివందలే. రామలక్ష్మి యాసొమ్మును దనకు రావలసిన ఋణపుసొమ్ముగా గాక మహాదానముగాఁ బరిగ్ర హించెను.

తనచేఁజిక్కిన యీ యెనిమిదివందలలో రామలక్ష్మి యొకనూరు రూప్యముల కొక చిన్నస్థలమునుకొని మఱియొకనూరు రూప్యముల కొకపూరిగుడిసెను యింటికి గావలసిన చెంబు, తప్పేల, పప్పు, బియ్యము కొనుక్కొని యాకుటీరములోఁ బ్రవేశించెను. మిగిలినరూక లొకసజ్జ నుని నమ్మికొని యాతనిచేతఁ బెట్టెను.

౭

ఐరోపా మహాసంగ్రామకారణమున హిందూదేశమున నన్న వస్త్రాదుల కేర్పడిన మహాక్షామమువలన బీదలు పడ్డయలజడి యింత యంత కాదు. రూపాయకు మూఁడుసేర్ల గింజలతోఁ బొట్టగడుపు కొనుటయే కష్టమైన జనులకు బట్టగూడకొనుట మహాదుర్భరమైనది.

పేలికలుకట్టినవారు, చాపలు చుట్టినవారు, పట్టాలు కట్టుకొన్నవారునై బీదజనులు మహాయాతన ననుభవించిరి.

ఈదుర్భరస్థితిలో మహాభోగము లనుభవించిన రామలక్ష్మియు నామె బిడ్డలును అనుభవించిన కష్టములు గణనాతీతములు. ఇద్దరు బిడ్డలును తల్లియు తినవలసినప్పుడు మహాకరువు దినములలో నాల్గురూకలున్నను యెన్నాళ్లు వచ్చును. అతిగారాబముగాఁ బెరిగిన పిల్లలు అవ్యక్తులు. అదికావలె నిదికావలెనని తల్లిని పీడింతురు. పాపము రామలక్ష్మి కన్నీళ్లతో; "నాయనా మన కవి లే"వని బతిమాలి చెప్పును.

రామలక్ష్మి సుకుమారి; యభిమానవతి; ఇతరులచే జేయించుకొనుటయే గాని తాఁ జేసి యెఱుఁగదు. ఇతరులకుఁ దాఁబెట్టుటయే గాని తా నితరుల నడిగి యెఱుఁగదు. అట్టిమానవతి యితరులను యాచించుట యెంతకష్టము. అయినను కానికాలము వచ్చినది. కడుపు కున మెఱుఁగదు. లేమి సిగ్గెఱుఁగదు. ఏపాటుపడియైన తన్ను తన బిడ్డలను కాపాడుకొని తీరవలెను. రామలక్ష్మికడనున్న నారువందల రూప్యములతో నొకటిన్నర వత్సరము గడచినది. అప్పుడా రామలక్ష్మి పూవు లమ్మిన యూరకట్టె లమ్మెనన్న సామ్యమున నేదో యొకపాటుపడవలసి వచ్చినది. రామలక్ష్మి యిప్పుడు గత్యంతరము లేక సంజచీకటిలో యిద్దరు ముగ్గురు గృహిణులయిండ్ల కేఁగి "యమ్మా మీకు పిండివిసరిపెట్టెదను. రెవికలు కుట్టిపెట్టెదను. నాచేత నైనదైన నీలాటిపని చేయించుకొని యన్నను నాబిడ్డలను కాపాడుఁ"డని ప్రార్థించెను. పాపము రామలక్ష్మి యైశ్వర్యమును గండ్లారఁ జూచిన యాగృహిణులకు రామలక్ష్మి వేఁడికోలు జాలిఁ గలిగించెను. అట్లే యని వారు సమ్మతించి తమపనులను రామలక్ష్మి కిచ్చి చేయించుకొనుచుఁ దగుమూల్య మిచ్చుచుండిరి.

రామలక్ష్మియు నామెబిడ్డలయు గుడ్డలుగూడ చిఱిగి పేలికలైపోయినవి. గుడ్డలుకొనుటకు రామలక్ష్మియొద్ద డబ్బేది? భుక్తిగడచుటయే దుస్తరముగ నుండ వస్త్రము లెట్లువచ్చును? పైపెట్టు కార్తీకమాసారంభమునఁ గురిసిన విపరీతపువాన గాడ్పులకు రామలక్ష్మి గుడిసెమీఁది యాకులు కొన్ని యెగిరిపోయినవి. కప్పించుటకు రామలక్ష్మికి సామర్థ్యమున్నదా? పాపము అందువల్లనేగదా రామలక్ష్మిబిడ్డ యట్లుబిగుసుకొనిపోయెను. పాఠకులారా! ప్రథమ ప్రకరణవృత్తాంతముజ్ఞాపకము లేదా?

౨

రామలక్ష్మితనయుఁడట్లుబిగుసుకొనిపోయిన మరునాఁటి యుదయము రామలక్ష్మి పెందలకడనేలేచి బిడ్డలిద్దరకింతయన్నము వండి పెట్టి రాత్రి జరిగినవృత్తాంతమును, బిడ్డలు కప్పుకొనుటకు కొక్కగుడ్డముక్కయైన లేని తమదురవస్థను దలపోయుచు "బిడ్డల కొక్కదుప్పటిని కొనవలెనన్న నాకడ యొక్కనియేగాని లేదు. కొనకపోయిన నీమాయ చలికి బిడ్డలయసువులు దక్కునట్లు లే"దని దుఃఖింపుచు లేని సత్తువతో కూలిపిండి విసరుచుండెను.

కూలికి నాలికిఁ బోవ యభిమానించి చేయుపనియే కాని పిండి విసరుట యెంతకష్టమైనపని! మఱియు దానివలన వచ్చుకూలిగూడ యత్యల్పమే! బలహీనురాలగు రామలక్ష్మి యుదయముమొదలు సాయంత్రమువఱకు విసరినను రెండుశేర్లగింజలకన్న నెక్కువ విసరలేదు. రెండుశేర్లకు కూలి యొక అణా. రెవికకుట్టినఁగూడ నసాదారెవిక కర్ధణా; గుండీరెవిక కణా; చిన్నచొక్కా-అహోరాత్రములు పనిచేసినను దినమునకు రెండణాలకన్న రాదు. మూఁడుఅణాలరాబడియైన లేదు. మూఁడుకడవలెను చూడుఁడు! ఎంత దుఃఖస్థితియో?

రామలక్ష్మి యట్లు తలపోయుచుఁ బిండివిసరు నేదియో డప్పు గొట్టినట్లు సడియయ్యెను. రామలక్ష్మి నాడప్పువాని హెచ్చరిక యెట్టిదో గమనింపలేదు. అంతఁ కొనుచున్న రామలక్ష్మి బిడ్డ లిరువురు "అమ్మా-కాగితం-కాగితం దెచ్చుకొన్నాను-నేను దెచ్చుకొన్నా"ననుచుఁ జెరియొక కాగితమును బట్టుకొని గంతులువేయుచుఁ దల్లియొద్దకు వచ్చిరి. ఎట్టి దుస్థితిలనైనను బిడ్డలముఖసందర్శనము తల్లులకు సంతాపనివారక మేగదా! సంతోషముతో వచ్చినబిడ్డల జూచి రామలక్ష్మి యొకింత యానందముతో "రంగా! నీ కాగితము నాకుఁ జూపవా? నేను నీకు అమ్మను గాదూ" యని లాలనతోఁ బలికెను. "అన్నయ్య యివ్వరా దేఁ?" అని రంగఁడు బుంగమూతి పెట్టుకొని కాగితమును గుండెలకదుముకొని ముద్దుగాఁ బలికెను. "ఇదిగో అమ్మా! నాకాగితము ముందుగా చదువు" మని రాముఁడు తల్లిచేతిలో తనకాగితమును పెట్టెను. అయితే నా కాగితమును ముందుగాఁ జదువుమనీ యలిగినరంగఁ డన్నకాగితమున కడ్డుపడెను. రంగని రమణీయపు చెయిదములకు సంతోషితస్వాంతయై రామలక్ష్మి రంగని నక్కునఁ జేర్చి "రంగా! యెంత కొంటెవురా" యని తనివిదీర ముద్దాడెను.

రామలక్ష్మికి చక్కగాఁ జదువువచ్చును. కొడుకులు తెచ్చిన ప్రకటనకాగితములను జదివి ఈ గృహలక్ష్మి నాదారిద్ర్యనివారణ క్షేమయిన తరణోపాయ మగునేమో యనుకొనెను.

౩

అది ౧౯౨౧ సంవత్సరము. ఆంధ్రదేశమున సహాయనిరాకరణోద్యమము మహావిజృంభణస్థితిలో నున్నది. ఎక్కడచూచిన ఖద్దరు సంఘములు! ఎక్కడ చూచిన నేతపరిశ్రమాలయములు! ఎక్కడచూచిన మధుపాననిషేధకప్రయత్నములు! ఎక్కడచూచిన జాతీయపాఠశాలలు! ఎక్కడచూచిన స్వదేశీసంతలు! సభలు! ఏయింట చూచిన రాటములు! కదుళ్లు, చెవులు, యేకులు, ప్రత్తి, ఎక్కడవిన్న నిదే ముచ్చట.

దేశవ్యాప్తమైన యీయుద్యమము రామలక్ష్మిగ్రామములో మాత్రము ఎందుకుఁ బ్రవేశింపదు? ఆగ్రామములోఁగూడ నొకజాతీయోపసంఘము స్థాపింపఁబడినది. ఒకజాతీయపాఠశాల పెట్టఁబడినది. ఒక్క ఖద్దరుపరిశ్రమాలయము నెలకొల్పఁబడినది. ఆపరిశ్రమాలయమువారే రాటమును గూలికి వడుకువారెల్ల మాకుఁ దెలియఁబఱచిన రాటమును యేకులను ఇంటికి మేమే తెచ్చియిచ్చి వడికినసూలునకు వీసెకు రూపాయి పావలాకూలి నిచ్చి తీసికొని పోవుదుమనియు, ఆసుగూడ బోసి యిచ్చినవారికి మఱి యొకపావలా యెక్కువకూలి నిచ్చెద మనియు,

...నుబట్టికూడఁ గూలి హెచ్చు యివ్వఁబడుననియు, నూతన ...నువడుకుటను నభ్యసించువారికి మాస్వంతమనిషిని బంపి ...మనియు, మానుషముగా గృహములందే యుండి జీవనము పేదసతీమణుల కీరాటము కొంగుబంగారమనియు, పెరటి ...సూరంతటు చాటించిరి. ఆవిషయములనే చిన్నకాగి ...నచ్చొత్తించి యూరంతటు పంచిరి. మనరామలక్ష్మి ప్రకటనకాగితములనే. రామలక్ష్మి యాకాగితములను ...ల్ల పాటుపడినను నాకు బేడడబ్బులకన్న నెక్కువ వచ్చుట ఈరాటము వడుకుటవల్ల నామాత్రము రాకపోదు. మఱియు రాటమును వడుకుట మొదలుపెట్టితినేని యింటింటికిఁ బోయి గింజలు తెచ్చి పిండివిసరి మళ్లీ వారికిచ్చి వచ్చు శ్రమకూడ తీరిపోవును. అంతి యేకాక యేరాత్రియో శ్రమపడి మఱి వీసెడు యేకులు వడుకుదునేని రెండుబట్టలు గూడ నేయించుకొనవచ్చును. కాన ప్రయత్నించిచూచెదను గాక! అని రామలక్ష్మియారీతి యోచించి యొకకాగితపు ముక్కపై తాను రాట్నమును వడుకుటను నేర్చుకొన సిద్ధముగా నుంటిని గాన నేర్పుమనిషిని రాటమును యేకులను పంపఁ బ్రార్థించెదనని వ్రాసి రామునిచేతఁ బరిశ్రమాలయమున కంపెను.

మఱునాటియుదయము రాటమును ఏకులను తీసికొని రెడ్డి కోటమ్మ రామలక్ష్మికుటీరమున కేతెంచెను. రామలక్ష్మి యాస్త్రీ యొద్ద పదిదినములు రాటమువడుకుటను నేర్చుకొనెను. రాటముపై చేయివేసిననాఁడె రామలక్ష్మికి దారము తీయుట వచ్చెను. పదిదినముల యభ్యాసముతో రామలక్ష్మికి వడుకుటలో మంచి కౌశల మేర్పడినది. పరిశ్రమాలయమువారు రామలక్ష్మి వడకినసన్ననినూలును చూచి సంతసించి "అహమ్మదాబాదులో దేశీయమహాసభా సందర్భమున జరుగు ఖద్దరుప్రదర్శనమున మానూలును ప్రదర్శించెదము గాన ఈరెండుమాసములును చక్కనినూలును తీయుటకుఁ గృషి సల్పు"డని కబు రంపిరి. రామలక్ష్మి యుత్సాహముతో రాటమును వడుకుటను సాగించెను. పరిశ్రమాలయమువారు రామలక్ష్మినూలున కెక్కువ మూల్య మిచ్చి తీసికొనుచుండిరి. బిడ్డల నిద్దరను జాతీయపాఠశాలలలో చదువుకొనుట కంపి ఆ యింట నాయింట గింజలు తెచ్చి పిండివిసరుశ్రమ తీరిపోవుటచే రామలక్ష్మి నిరంతర మింట గూర్చుండి విధివిరామము లేక నూలు తీయుచుండెను.

౧౦

నాఁడు పండువులలో కెల్లఁ గడపండువగు సంక్రాంతిపండుగ మన తెలుఁగుసీమలో సంక్రాంతి పండుగ చాల సంతోషప్రదమైనది. సంవత్సర మెల్ల పాటుపడిన కృషీవలుఁడు పంట నింటికిఁ జేర్చి తన పాటుఫలమును కన్నులార జూచి యానందించునది యీ పండుగ సమయముననే, అన్ని పండువులలో యన్నమునకే మనసుపడెడు పేదజనులు కడుపు నిండ భుజించునది. యీ పండుగకే వేలు గలవాఁడు మొదలు కూలివానివఱకు సంతుష్టితో నుండునది. సంక్రాంతి పండుగ దినముననే సన్న పుపూఁతలతో కావివోరులతో పసుపుకుంకుమలతోఁ బచ్చనితోరణములతో నతిరమణీయరంగవల్లులతో ప్రతి గృహము నిత్యకళ్యాణముగ నుండునట్లు చేయునది సంక్రాంతిపండుగ; భాగ్యవంతునిమొదలు బడుగువానివఱకు సంతుష్ట హృదయముతో సముదితోత్సాహముతో నాచరించునది సంక్రాంతిపండుగ. ప్రకృతిలక్ష్మియొక్క యనూనసౌభాగ్యము నసమాన సౌందర్యమును గనులారఁ జూచి యానందించు శుభదినము సంక్రాంతిపండుగ; ఈ పండువు సౌభాగ్యము బస్తీలలోకన్న పల్లెటూరులలో నెక్కువగఁ గాన్పించును. గృహములన్నియు కళకళలాడుచున్నవి. ప్రజలెల్ల రుత్సాహముతో నున్నారు. ఏదెసఁ జూచినఁ బండుగసొంపు గానవచ్చుచున్నది కాని మన రామలక్ష్మి కుటీరముమాత్ర మెప్పటివలెనే యున్నది. ఆ కప్పుపోయిన గుడిసెయే! ఆ జీర్ణచేలములే! ఏట్టి మార్పులేదు. ఉదయము తొమ్మిదిగంటలైనది. రామలక్ష్మి రాటమును త్రిప్పుకొనుచున్నది. చిన్నవాఁడగు రంగఁడు తల్లివీఁపు నానుకొని "అమ్మా నాకుఁ గ్రొత్తచొక్కా కుట్టించవటే? మనయింట్లో పండుగచేయవటే," యని మారాము చేయుచున్నాఁడు "రంగ నాన్నా! రాటమున కడ్డురాకు" మని రామలక్ష్మి వానిని బతిమాలుచున్నది. కుఱ్ఱఁడు వినఁడు. "ఏ పండుగకు అప్పచ్చులు చేయవు. క్రొత్తచొక్కాలు కుట్టించవు. అందఱు కుట్టించుకొన్నా"రని రంగఁడు పెద్దపెట్టున యేడువ సాగినాఁడు. పాపము! రామలక్ష్మికి దుఃఖ మాగలేదు. పూర్వపుస్థితి యొక్కసారి జ్ఞప్తికి వచ్చినది. పెనుగాలికి మహాసముద్రమువోలె యామె హృదయము యొక్కమారు సంక్షోభించినది. సాగరతరంగములవలెఁ బొరలి పొరలివచ్చు దుఃఖమును ఆవేదనను ఆఁపుకొనలేకపోయినది. కన్నీరు కాల్వలు గట్ట రామలక్ష్మి యొక్కమాఱు కుమారు నాలింగనమొనర్చుకొని "నాయనా నే నేమిచేయుదును.? మీ రడుగవచ్చునప్పటికి నా చేతు లిట్లు తలక్రిందైనవి. అయ్యో? మీతండ్రి జీవించియుండఁ బిత్రుదినమని తల్లిదండ్రుల పేర్వెట్టి ఈ పండుగనాఁ డెంతమంది బ్రాహ్మణులకు దక్షిణలు! ఎంతమంది బ్రాహ్మణులకు వస్త్రదానము! ఎంతమంది బీదల కన్నసంతర్పణ! ఎంతమంది బీదలకు వస్త్రబహుమానము! పొరుగూళ్లనుండిగూడ మీతండ్రి యిచ్చు సంభావనకాశపడి బ్రాహ్మణులు గుంపులుగ వచ్చెడివారు. ఆ బ్రాహ్మణాశీర్వాదఫల మేమయ్యెనో? ఆ వస్త్రదానఫల మేమయ్యెనో? ఆ యన్నదానఫల మేమయ్యెనో? ఆ ధనదానఫల మేమయ్యెనో? ఆ నెఱదాత బిడ్డలకు నేఁడొక్క చొక్కాగుడ్డ లేదు; ఒక్క అప్పచ్చిముక్క లేదు; ఆ మహారాజు పుట్టుభోగి;. కావుననే యాయన కట్లు జరిగిపోయినది. దారిద్ర్యమాయన యనుభవించునేమో యనియే భగవంతుఁడాయనను చిటికెలోఁ దీసికొనిపోయినాఁడు. మంచివాని చావు మరణకాలమందుఁ దెలియు నన్నట్లు మరణమే యీ యుత్తమపురుషుని యోగ్యతను వెల్లడించుచున్నది. ఆ బంగారుగని నిర్భాగ్యులమగు మనకు దక్కునా? నాయనా! పూఁటకు గంజిలేనిమనకుఁ బిండివంటలు క్రొత్తవస్త్రములు యేరీతి వచ్చు"నని రామలక్ష్మి పెద్దపెట్టున విలపించెను. తల్లితోపాటు రంగఁడుగూడ విలపించెను. పాప మాతల్లి బిడ్డల నూరడించువా రెవ్వరు?

Sjt. Jayanti Kamesam Pantulu Garu



శ్రీయుత జయంతి కామేశంపంతులుగారు

Sjt. Paramatmuni Narasimhayya Garu B.A.,B.L.



శ్రీయుత పరమాత్మuని నరసింహయ్యగారు బి.ఏ.,బి.ఎల్.

గత వ నియోగిమహాజనసభాగ్రాసనాధిపతి

Sjt. Karavadi Ramakr[illegible] G[illegible]u, B.A., Usmar[illegible]



శ్రీయుత కరవది రామకృష్ణరావుగారు

బి. ఏ., ఉస్మానియా

Late Brahmasri Kotra Lakshminarayana Sastri Garu



కీ. శే. బ్రహ్మశ్రీ, కొట్ర లక్ష్మీనారాయణ శాస్త్రి గారు

Late Muttaraju Subbarao Pantulu Garu, M.A.



కీ. శే. ముత్తరాజు సుబ్బారావు పంతులుగారు, ఎం.ఏ.

Brahmasri Kotra Syamala Kama Sastri Garu



ఆంధ్రవిద్యావాచస్పతి, కావ్యనిధి, బ్రహ్మశ్రీ, కొట్ర శ్యామలకామశాస్త్రిగారు

Lakshminarasayya Garu, M. A., Andhra Padmasali



శ్రీయుత నేమాని లక్ష్మీనరసయ్యగారు ఎం. ఏ., ఆంధ్రపద్మసాలి

Sjt. Duggirala Radhakrishnamoorti garu



శ్రీయుత దుగ్గిరాల రాధాకృష్ణమూర్తి గారు

Sjt. J. V. Krishnarao Garu



శ్రీయుత జే. వి. కృష్ణారావు గారు

Sjt. J. V. Narayana Garu



శ్రీయుత జే. వి. నారాయణ గారు

Sjt. Samudrala Venkataramachari Garu



శ్రీయుత సముద్రాల వేంకటరామాచారి గారు

Sjt. Motaparthi Venkatanarayana Garu



శ్రీయుత మోటుపర్తి వేంకటనారాయణ గారు

౧౧

అట్లు రామలక్ష్మి పతిని దల్చి భాగ్యమును దలచి బిట్టు వాపోవుచుండ లోని కప్పరో వచ్చుచున్నట్లు సడి యయ్యెను. రామలక్ష్మి యాసడినివిని దుఃఖమాపుకొని కన్నులొత్తుడుచుకొని తొంగిచూడ వారు దళిత గ్రామజాతీయోపసంఘాధ్యక్షుఁడును బరిశ్రమాలయాధికారి యునైన సీతారామయ్యగారని స్పష్టమయ్యెను. ఆయనతోఁగూడ రామలక్ష్మి పెద్దకొమారుఁడును మఱియొక పెద్దమనిషికూడ నుండిరి. రామలక్ష్మి వారిని జూడగనె తన జీర్ణంపు పైఁటచెఱఁగును రెండుభుజములపై సవరించి కప్పుకొనుచు లేచి యిట్టి పెద్దమనుష్యులు తన కుటీరమున కేతెంచినప్పుడు చాపమున్నైన వేయఁజాలని తన పేదతనమునకు లోలోనఁ గుందుచు నవనతముఖయై గోడకొత్తిగిలి నిలువఁబడెను. సీతారామయ్యగారు రామలక్ష్మిని జూచి "అమ్మాయీ! నీవు వడికిననూలును అహమదాబాదు దేశీయ మహాసభాక్షుద్దరు ప్రదర్శనమున కంపితిమి. వివిధరాష్ట్రములనుండి వచ్చిననూళ్లలో నెల్ల నీనూలు మిక్కిలి సన్ననిదిగ నా పరీక్షకులు నిర్ణయించిరి. ప్రశస్తమైననూలును వడికినవారి కీయంచిన ప్రథమబహుమానము నూటపదునాఱురూపాయలొసంగిరి. అన్నిప్రాంతముల నూలును బ్రదర్శించినప్పుడెల్ల నీనూలు ఉత్తమబహుమానమును బడయుటచే నదిప్రదర్శించిన మాపరిశ్రమాలయమునకే గాక, మన తెలుగువారికిని యనమానఖ్యాతి వచ్చినది. మనఆంధ్రదేశమునకీబహుమానమైనందులకు మానమాంధ్రు లెల్లరు సంతోషనిమగ్నులగుచున్నారు. ఇవిగో బహుమానరూప్యములు గైకొనుమని సీతారామయ్యగారు పలుక, ఒక్కనిముసముక్రిందటఁ దన తీవ్రదారిద్ర్యమునకుఁ గన్నీరుమున్నీరుగా విలపించుచున్న రామలక్ష్మికి బిడ్డ ఆపదయని యేడ్వఁగనే యాదరించి పాలిచ్చుమాతృదేవతవోలె నయాచితముగ లభ్యమైన బహుమానమున కమందానందకందళితహృదయారవిందయై రామలక్ష్మి దోయిలిపట్టి యాబహుమాన మందుకొనుచు "బాబూ! మహాత్ముఁడు నుడివినట్లు నిజముగా నీరాటము కుటీరలక్ష్మి సుమండీ!" యనెను.

# శరద్రాత్రి - నాయకాన్వేషణము

కొణిదెన - బాలకృష్ణయ్య గారు

అయ్యారె! మూలనున్నమము నర్ధనిశీథిని వేణుసంజ్ఞచే
నోయ్యనఁ జేరఁబిల్చి, యిపు డోయదునందన! మోసగించి మా
నెయ్యము వీటఁబుచ్చఁదగునే? యెటులేగితో; వేగ డాయరా
వయ్యా! కటాక్షముంచగద వయ్యా! కనుంగొనుమయ్యా! బంధులన్.

చ. అబలలు వీరటంచుఁ బరిహాసము యార్తశరణ్య! నీవ కా
ద బలము సర్వజంతులకు? ధర్మము నమ్మినవారి నిట్లు వే
డబమున కాననంబునఁ దటాలున వీడి చనంగ? రావె వే
గ బదులుపల్కవే! సతులఁ గాంచి దయామతి నాదరింపవే!

సీ. అకులైన చలింపవె భూజములఁ జూడు; కాళిందిఁదరఁగలుగల్గుటుడిగె
జాబిల్లి దివినుండి జరుగఁడు గాంచుమీ; వేగు రేపనెడివిశేక మెడలె
ప్రకృతి యంత్రములు రాల్చి పరితపించెడిఁ గను; హిమకణంబులు తీవ
[గముల జాఱె
వేథోరడపిల్ల వెల్వెలనయ్యెఁ జిలకింపు, భూతజాలంబులపోక లడఁగె

గీ. ననఘ! నీవిరహం బిట్టు లన్నిటికిని
జీవి తేచ్ఛలఁ బోఁగొట్టి చేవఁ దొలఁగఁ
బెట్టె; నే వచ్చి చేపట్టి పెంపవయ్య!
భక్తపాలనశీల! గోపాలబాల!

శా. మ్రోడుల్ వేఁజిగురింప, నాలగమి మోము ల్సాచి యాలింప, మా
వాడన్ గోపనితంబినీమణులు వహ్వా! యంచుఁ బ్రేమింప, నీ
వీడన్ మంజులవంశనాళమును నిష్టే కావ మ్రోయించి తా
రా! డాఁగం జననేల నోయి? యదుబాలా! వేణుగానప్రియా!

మ. అలవంశీకలనాద మాధురి, మహాత్మా! మార్గమున్ జూపఁగా
సలుపన్ జాలితి మింతదాఁక నెవియో శక్త్యానుసారంబు, నేఁ(?)
డెలమిన్ పిల్లనగ్రోవితోడఁ జనియొందే నీవు దాఁగుంట, మా
తెలువుల్ మాటలెగాక; కార్యసరణిన్ దీర్ప స్సమర్థంబులే?

చ. జలజలమంచు నశ్రువులు జార్చుచు, నీవిరహంపుటార్తియు
మ్మలికమఁ బెంప నెంతొ సుకుమారపులేఁదలిరాకువాతెఱల్
చలనము నొంద నద్దెసలు జాలిగ నిన్నె తలంచి చూచుచున్
గొలిచెడితీవఁబోండ్లఁ గనుఁ గొమ్మ, రయమ్మున రమ్మ, మాధవా!

మ. పనిగా నెన్ని విధంబులన్ దెలిపినన్ బాటించి నాబోధలన్
వినరున్ జేయరు నేకమై మనరుచూ వీరంచుఁ గోపించి నీ
యనుకంపామతి మానిపోవఁ దగదయ్యా; రమ్మహో! విశ్వమో
హనసంగీతకళావినోద! మముఁ గార్యారంభులన్ జేయఁగన్.

మూసక లేప్సితంబు లిడఁ దోడ్తో నుండి కాపాడ నె
బున్నెపు మేల్మిత్రోవలను లీలఁ జూపి పోషింప, న
సకా స్వేచ్ఛ నొసంగి దైన్యము నొగిఁ బోకార్పదెక్కంతునో
దవినోద! నమ్మితిమి, మమ్ముఁ గాసి భాషింపవే.

డనేమిపని? యెందుల కందు వసించె దక్కటా!
రాధ మెవ్వరిది? యేటికి మమ్ముఁ గలంతు వన్న? మా
జూడుమన్న! యిది సాధుతనంబె తలంపు మన్న! నీ
లమారిచెద్దములు మాని నటింపఁగ వన్న! యాదవా!

పూతనా స్తనదుగ్ధపూరంబు జీర్ణంబు, గాకుంట మందులకై యరిగితో?
శకటాసురాదులఁ జక్కాడిన శ్రమంబు, వాయవిశ్రాంతికై పోయినావొ?
గోగోపగోపికాకులములబలుగోల, పడలేక విసుగెత్తి వెడలినావొ?
కంసాదిశూరుల హింసింపఁదగువిద్ద్య, లిఁక నేర్వనగునంచు నేఁగినావొ?
ఎచట నున్నావొ? మ మ్మిప్పు డేమి సేయు
మనెదొ? యెప్పుడొ నీ రాక మరల మమ్ముఁ
గలయఁ? దెల్పుము మోహనాకార! ధీర!
భక్తపాలన! కృష్ణ! గోపాలకృష్ణ!

ఉ. చిక్కనిపండువెన్నెల నిశీథిని మర్వఁగఁ జేయ, హాయిగా
నిక్కడి సైకతస్థలుల నేము సుఖింపఁగఁ జల్లగాలిలో
నొక్కఁడవౌచు నట్టడవి నోడక నీ సొదరిండ్లఁ జీకటిఁ
జిక్కి శ్రమంబు నొందఁ జనఁ జెల్లునె? మోహనకృష్ణ! పిన్నవై.

చ. ఘనటఁ గలంగి మాకుఁగ నవాచ్యపుబాధల నొంది కంది యా
తనలకు దోసిలొగ్గు టరుదా! నినువంటి జగత్కుటుంబికిఁ
బనిగఁ దనంతఁ గష్టములఁ బాల్గొని బిడ్డలఁ బ్రోదసేయఁడే
జనకుఁడు? నట్లు నీకు సహజంబ కదా శ్రమ కోర్చుటల్ ప్రభూ!

సీ. ఓ తమాలమ! నిల్చెనో నీదుక్రీనీడ, లోన మాకూర్చెడి ప్రాణసఖుఁడు?
ఓ రసాలమ! దెల్పుమా రయంబున నేఁడు, వనరాని మా నేస్తకానిజాడ?
వంశమా! నీ సహవాసంబునకు వచ్చెనో వివరింపవే మా విభుండు?
పున్నాగమా! తొంటిపోల్కి నీపై నెక్కి, యున్నాఁడె? మా చిన్ని
[మన్నెఁడు!
కానవా నీవు మమ్మేలు ఘనుని వకుళ
మా! యశోకమ! కంటివా? మందహాస
చంద్రికానూచిశారదచంద్రవదను?
భారతీయాప్తబంధుఁ గృపాళుఁ గృష్ణు.

ఉ. తిన్ననివాఁడు పల్కులను దేనియ లొల్కెడివాఁడు, హింసకుఁ
గన్నులు మూయువాఁడు, దయగల్గినచల్లనిచూపువాఁడు, పే
రెన్నికఁ గన్నవాఁడు, మము నెన్నఁడు బాయనివాఁడు, డాఁగెనో
పున్నమచందమామ! యెటు పోయెనో యాతనిజాడఁ జూపుమా.

సీ. తనయాన మీఱమంచని నాథునకుఁ దెల్పఁ, బోవ నిద్దురమాని లేవవమ్మ!
బాసఁ దప్పమటంచుఁ బలుక మాస్వామికి సరగ మాంద్యము మాని
[సాగవయ్య!
మాతప్పులను గావుమని మాగురునితోడఁ, దెలుప నీవింక నిలువుమన్న!
నీకుఁ గా సర్వంబు నిరసించిరని ప్రభు, నరసి చూపెడుగనుల్ దెఱ
[వుము చెలి!
గీ. ఓ యమున! యోయి మారుత! యో వధీశ?
ఓ సిపద్మిని! మావాని యొడలిచాయ,
ఘనబలంబును, నెమ్మోము కనులసొగసు
నరయ మీరలె మేటిచుట్టాలు గాన.

# వేమన - కాలనిర్ణయము

## బండారు తమ్మయ్యగారు

ఆంధ్రులగు నాంధ్రులలో వేమనయోగీంద్రుని పేరెఱుంగనివాఁడును, ఆతని పద్యములలో నొక్కటయినఁ గంఠస్థముగానివాఁడును నుండనేరఁడనుట యతిశయోక్తికాదు. శతక వాఙ్మయములో. వేమనశతకమునకు, సుమతిశతకమునకు నున్నప్రచారము మఱి వేనికిని గానరాదు. వేమన పాండితీసంపన్నుఁడు గాకపోయినను నాతనికవితాప్రతిభ నిరుపమానమై సర్వంకషమయినది. ఈతనిపద్యములు నీతులకు నిధానములు. మతసాంఘిక దురాచారములకు మహోగ్రకుఠారములు. ఈ మహాకవి చరిత్రమును బరిశోధించి పుస్తకరూపమున నూతనముగా వెలయించి కీర్తిశేషులయిన శ్రీ వంగూరి సుబ్బారావుపంతులుగా రాంధ్రలోకమునకుఁ జిరస్మరణీయులు.

శ్రీ సుబ్బారావుగారి సిద్ధాంతములు కొన్ని కేవల మూహలపై నాధారపడియున్నవి. వేమన స్థలనిర్ణయము, కులము, కుటుంబముఁగూర్చి సుబ్బారావుగారి సిద్ధాంతములను శ్రీ వేమూరి విశ్వనాథశర్మగారు సారస్వతానుబంధములలో విమర్శించియున్నారు. సుబ్బారావుగారు తలంచినట్లు వేమన కొండవీటిరాజవంశమునకుఁ జెందినవాఁడు గాక కర్షకకుటుంబమునకుఁ జెందినసామాన్యపు రెడ్డి యనియు, ఆతని జన్మస్థలము కొండవీడు గాక నెల్లూరుజిల్లా పొదిలి తాలూకా మూగచింతల యనియు, ఆతనితల్లిదండ్రులు కర్నూలుజిల్లా మార్కాపురము చెంతనుండిన కటారుపల్లెలోఁ గొంతకాల ముండియుండురనియు, కొండవీడునందుఁగూడ వేమన కొంతకాలము నివసించియుండుననియు, ఆతఁడు సిద్ధిపొందినతావు శ్రీసుబ్బారావుగారు తలంచినట్లు కడపజిల్లాలోని కటారుపల్లె కాదనియు దానిని సరిగా నిర్ణయించు నాధారములు లేవనియు శ్రీవిశ్వనాథశర్మగారి విమర్శనముయొక్క సారాంశము లయి యున్నవి. వేమన పద్యములను బట్టియుఁ గొన్ని పూర్వకవిస్తుతులనుబట్టియు శ్రీసుబ్బారావుగారు వేమన కాలనిర్ణయమును జేసి యాతఁడు క్రీ. శ. 1412 సంవత్సరమునఁ బుట్టి క్రీ. శ. 1480 సంవత్సరమున మరణించి యుండునని సిద్ధాంత మొనర్చిరి. శ్రీవిశ్వనాథశర్మగారీనిర్ణయమును గూర్చి యంతగాఁ జర్చింపక దానినొకవిధముగా నంగీకరించిరి. కాని యీకాలనిర్ణయములోఁగూడ శ్రీసుబ్బారావుగారు కొన్ని భ్రమప్రమాదములకు లోనయిరని యే నాయభిప్రాయము.

"ఇతఁడు 17 వ శతాబ్దమువాఁడయి యుండునని బ్రౌనుదొరగారనిరి; ఇప్పటికి 300 సంవత్సరములక్రితమువాఁడై యుండునని క్యాంబెలుదొరగారు వ్రాసిరి. ఇప్పటి కైదువందలనలువదిసంవత్సరములక్రితమువాఁడని పూర్ణయాచార్యులుగారు పీఠికలో వ్రాసిరి. వీరి ననుసరించియే కాఁబోలు తక్కినగ్రంథకర్తలును దలఁగాలనిర్ణయ మొనరించిరి. కాని వారట్లు నిర్ణయించు యుపపత్తులను జూపరైరి. వాడుకకథలపై నాధారపడినవ. యిదివఱకీతనికాలనిర్ణయము 1920 వఱకును కాలేదు" అని శ్రీ సుబ్బారావుగారు 1920 సంవత్సరములో జరిగిన వేమనజయంతినాఁడు శ్రీయుత కే. వి. లక్ష్మణరావు పంతులుగారు పైగ్రంథములను బరిశీలించి వ్రాసిన వ్యాసభాగము నుదాహరించి, తుదకు శ్రీలక్ష్మణరావుగారు వేమనపద్యములందలి తురకపదములను బట్టి తురకల ప్రభుత్వ మాంధ్రదేశమున రెడ్లప్రభుత్వము పోయినతరువాతనే సాగినది కావున నితఁడు 15 వ శతాబ్దమునకుఁ బూర్వుఁడు కాఁడనుట స్థిరమనియుఁ, దరువాత నెంతకాలమునకుఁ బుట్టెనో తెలియదనియు, వ్రాసిరనియు, అందుపైఁ దా మొనర్చిన కాలనిర్ణయమును లక్ష్మణరావుగారికడఁ దెల్పినప్పుడు కాలముసరిగ నున్నదని వారుకూడఁ సంతసించిరనియు, లిఖించిరి.

వేమన కాలనిర్ణయ మొనర్చుటకు వేమనశతకమునందే తగిన నిదర్శనములు కొంచె మున్నవని శ్రీ సుబ్బారావుగారు మునుముందు "పరఁగ రాయనికులు బాచనిధన మెల్ల, బట్లపాలు కవుల పాలు తలఁప, నొనర హీనజనుని ధనము దాయాదుల, పాలు జారకాంత పాలు వేమ!" అను పద్యము నుదాహరించి యీ నామముగలవారు పలువురున్నందున నిం దుదాహరింపఁబడిన భాస్కరుఁ డెవఁడయి యుండునని కొంతచర్చ సలిపిరి. అది యనవసరము. సెబిదాతయై ధనము బట్లపాలు చేసి భాచఁడను ముద్దుపేరితో నిప్పటికిని బట్టుకవులస్తుతులందు స్థిరజీవియై యున్న రాయనభాస్కరుఁ డొక్కరుఁడే. ఆతఁడు కొండపల్లిలో మంత్రిగానుండి యనవేమారెడ్డిచే నగ్రహారాదుల నందినవాఁడు. అనవేముని యనంతరము కొమరగిరి రెడ్డికాలములో నాతని మఱఁది కాటయవేమునియొద్ద మంత్రిగానుండినట్టు లోకచాటుపద్యమును బట్టి తెలియు రాయనభాస్కరుఁడు గూడ నీతఁడే యైయుండిన నుండవచ్చును. ఈతఁడు క్రీ. శ. 1380. 1400 ప్రాంతముల నుండినవాఁడు. కృష్ణదేవరాయల యనంతరము గూడఁ గొందఱు రాయన భాస్కర లున్నందున వేమన కృష్ణరాయలకుఁ బూర్వ మున్నట్టు లాధారములున్నఁ గాని యాతఁడు పైపద్యములో 1381 ప్రాంతమున నున్న రాయని భాస్కరునే పేర్కొనెనని చెప్ప వీలు లేదని వ్రాసి శ్రీ సుబ్బారావుగారు వేమన కృష్ణదేవరాయలకుఁ బూర్వముండె ననుటకుఁ గొన్ని యాధారములను జూపిరి. వానిని ముం దుదాహరించి చర్చించెదను. ఏది యెట్లున్నను బైపద్యము వేమన వ్రాసినదే యని యంగీకరించినను దానిని బట్టియే యాతని

మునర్చి యాతఁడు రాయనిభాస్కరుని కాలమునఁ గాని యంతరము సమీపకాలములోఁ గాని యుండెనని చెప్ప భాస్కరునికీర్తి యప్పటికి నిప్పటికి నిలిచియున్నదే. వేమన యీ భాస్కరుని యనంతరము చాలకాలమునకు గూడ నీ పద్యమును జెప్పి యుండవచ్చును. రాయలకుఁ బూర్వుఁడనుటకు శ్రీ సుబ్బారావుగారు కారము లివి.

ఎడపాటి ఎఱ్ఱాప్రెగ్గడ మల్హణచరిత్రమునందలి యీ ద్యములు.

ఉ. ఇట్టి మహాప్రధానపరమేశ్వరమూర్తివి గాన నీవు చే
పట్టితి, మేలు చుండి పురపాలక! కాశినమంత్రిచంద్ర! ము
న్నట్టిగఁ గృష్ణరాయజనకాంతున కీయక దాఁచినట్టి యా
రట్టడియైన యెఱ్ఱకవిరాజితమల్హణ కావ్యకన్యకన్.

చ. వినతు లొనర్తు నాంధ్రసుకవిప్రభు నన్నయభట్టుఁ దిక్కయ
జ్వను శివదేవు భాస్కరుని జక్కన నాచనసోము సర్వదే
వుని భవదూరు వేము నలపోతనఁ బిల్లలమఱ్ఱి వీరభ
ద్రుని శరభాంకు వీరకవిధూర్జటిఁ గేతన భట్టబాణునిన్.

(2) నిమ్మ లక్ష్మణకవి తన కంచి యేకామ్రలింగ శతకములో "భీమ వేమానంత బిరుదుకవుల" అని కవిస్తుతిలో వేమనను బేర్కొనుట.

(3) క్రీ. శ. 1590—1620 ప్రాంతమువనుండిన పింగళి యెల్లనార్యుఁడు తోభ్యచరిత్రములో

సీ. భక్తిమై రేణుక ప్రముఖోత్తము నుతించి,
మాయదేవాహ్వయు మహిమఁ బొగడి
చెలఁగి యథావాక్యముల నన్నమయగారి
భజియించి ప్రెుక్కిడి పాలకురికి
సోమన్నగారిఁ బ్రస్తుతిచేసి ప్రియమంది
శివదేవముఖసత్కవుల నెంచి
గణపతిదేవుని ఘనత సన్నుతిచేసి.
వేమనఁ గీర్తించి విమలమతిని

గీ. వ్యాస వాల్మీకి కాళిదాసాదిఘనుల
నన్నపార్యునిఁ దిక్కన యజ్వనెఱ్ఱ
ప్రెగడ ధూర్జటిఁ బోతన భీమకవిని
జెలఁగి శ్రీనాథముఖకవి శ్రేణిఁ దలఁచి.

(4) 15, 16 శతాబ్దమునవాఁడని చెప్పఁబడు శివయోగీంద్రుఁడు రచించిన 'అన్యవాద కోలాహలము'లో

"వేమయ్య నేకాంత రామయ్య బల్లేశు, మల్లయ్య నల్లయ మది భజించి" అని వేమయ్య భజింపఁబడుట.

(5) క్రీ. శ. 1581 ప్రాంతమువాఁడయిన తురగా రామకవి నాగర ఖండమందలి యీ క్రిందిపద్యములో వేమనను నుతించుట,

సీ. ప్రాచేతసుఁ బరాశరకుమారుఁ గాళిదా
సు మయూరు భవభూతిఁ జోరు దండి
బాణు ధనంజయు భారవి జయదేవు
భాసుని శ్రీహర్షుఁ బ్రవరసేను
మల్హణు, బిల్హణు, మాఘు, మురారిని
క్షేమేంద్రు, వటమూలు, సోమనాథు
శివతత్త్వు, శివదేవుఁ, జిన్నయు భవదూరు
శరభాంకు, రాజశేఖరుని, వేము

గీ. నన్నపను, దిక్కమఖిఁ, బ్రబంధపరమేశు,
సాధు, నాథర్వణాచార్యు, జంద్రమౌళి
భాస్కరుని, నల శ్రీనాథభట్టు, భీము,
సోము, నమరేంద్రుఁ, దలఁతు నుత్సుకత నాత్మ.

ఈపద్యములలో నుదాహరింపఁబడినవేముఁడు మనవేమనయే నాయని నాసందేహము. ఇందుఁగూర్చి చర్చింపకపూర్వము మనము ముందుగా రెండు ముఖ్యవిషయములను విచారింపవలసియున్నది. పూర్వకవులు వేమనకవితాప్రతిభను గుర్తించి తమకవిస్తుతిలోఁ జేర్పఁదగినవానినిగ నాతనిని గణించిరా యనునది మొదటివిషయము. వారట్లు గణించిరని నేదలంపను. శ్రీసుబ్బారావుగారే తమ గ్రంథపీఠికలో నేఁటివిద్యార్థులు, ఆంగ్లమానససంభవులయినట్లు మన ప్రబంధకవులు సంస్కృతమానస సంభవులయిరని చెప్పుచు "వాఙ్మయమున వేమన్న స్థానము" అను శీర్షికక్రింద నీక్రిందివాక్యములు లిఖించిరి.

"నేఁటి యాంగ్లమానససంభవులగు విద్యార్థులవలె నాకాలమందున్న సంస్కృతమానస సంభవులగు ప్రబంధకవులతో నీతనికిఁ బోలిక లేదు. వారిప్రపంచము వేఱు. ఈతనిది వేఱు. వారిది పాండిత్య ప్రదర్శనము." "రాజానుగ్రహము, గుఱ్ఱము కోకలు అగ్రహారము, కీర్తి, ప్రౌఢకవియను ఢక్కా"-ఇవి వీరి యాదర్శములు. వేమన్నకవి గౌరవమెఱుఁగును. తాను గవినని యెఱుఁగును. తనకు సంస్కృతము రాదని తెలియును. కవులను ప్రసిద్ధిగలవారు తన్నుఁ గవియనరని సంపూర్ణముగఁ దెలియును. కాని యాతఁడు కవిగా నుండవలె నన్న కోరికకంటె యోగిగా నుండవలెనని కోరినవాఁడు."

కాఁబట్టి సంస్కృతమానస సంభవులయిన పైకవీశ్వరులు సంస్కృతభాషాపాండిత్యము లేని మన వేమనను గవిగా గణించి యాతనిని తమపద్యములలో నుతించి రనుట కవకాశము లేదు. శ్రీవీరేశలింగము పంతులుగారినంటి యాధునికకవిశ్రేష్ఠులే వేమనను గవిగా గణించి తమకవిచరిత్రములో నాతనికి స్థానమొసంగఁజాలకపోయిరి. ఇఁకఁ బూర్వప్రబంధకవులమాట చెప్పనేల? ప్రబంధకవులు వేమనను గవిగా గణింపక పోయినను వారిలో శైవులైనవా రాతనిని మహాశివభక్తునిగాఁ దలంచి యాదృష్టిలో నయిన నాతనిని దమకావ్యములందు నుతించిరా యనునది రెండవవిషయము. వేమన వీరశైవమతప్రాశస్త్యమును గుర్తించి, "ఆఱుమతములపయి నధికమైనమతము, లింగమతముకంటె లేదుజగతి." "వీరశైవమార్గ విధము లెటింగియు బ్రహ్మవిద్యమీఁదఁ బరఁ

గానేని, చెలఁగి పులినిబట్టు సింగపుఁ బిల్లయా" ఇత్యాది పద్యములలో వీరశైవమును, "క. భవదూరుఁడు శరభాంకుఁడు, శివశీలుఁడు వేము గోటి సిద్ధేశ్వరుఁడున్, శివభృత్యుఁడు వటుమాలుఁడు, శివమయ చిన్మయుఁడు సోమ శేఖరగురుఁడున్." అను పద్యమునఁ బురాతనవీరశైవులను నుతించినను మొత్తముమీఁద నాతని పద్యములను బట్టి చూడ నాతఁడు కేవల వీరశైవుఁడగునా యని నా సందేహము. శ్రీ సుబ్బారావుగారు "కావున మన వేమన్నకవికూడ శైవమతాభిమానియే యైనను వీరశైవుఁడు కాఁడు. వేమన్నచరిత్ర ద్విపదకావ్య మాతఁడు కేశవభక్తుని పుత్త్రుఁ డనుచున్నది. అయినను వేమన్న యాతనివాక్యములచే నద్వైతి. ప్రవర్తనచే, వాక్కుచే, మనస్సుచే నాతఁడు ద్వైతి. పూర్వసంస్కారమో బాల్యసంస్కారమో యగు శైవమునందలి యభిమానమును మాత్రము విడిచినట్లు కనఁబడదు" అని వ్రాసి మఱియొకసందర్భమున "నాతనిమతము కేవలాద్వైతము గాక శివాద్వైతమో, యద్వైత శైవమోయగు నని లిఖించిరి. వేమన వీరశైవుఁడయినను గాకపోయినను శైవకవీశ్వరు లీతనిని మహాశివభక్తునిగా గణించి తమ గ్రంథము లందు నుతించిరనుట కవకాశములు లేవు. (వీరభద్రవిజయములో బమ్మెరపోతన తన గురుఁడయినయిచటూరి సోమనాథునిగూర్చి వ్రాయునపుడు సోమశేఖరుఁడనికూడ వాడియున్నందున, పై "భవదూరుఁడు" అను పద్యమందలి "సోమ శేఖరగురుఁడు" ఆతఁడేయై యుండుననియు, వేమన పోతన లిరువురుగూడ నొక్కగురువు శిష్యులనియుగూడ శ్రీ సుబ్బారావుగారు వ్రాసిరి. వేమన పదునేనవ శతాబ్దమువాఁ డనుటకుఁ బ్రబలాధారము లున్నప్పుడే యీయూహ నిలువనేర్చును గాని లేనిచో నిలువనేరదు. సోమశేఖరునకు గురువిశేషణమును జేర్చినమాత్రమున వేమన యాతనియొద్ద నుపదేశమందిన శిష్యుఁడని తలంప నవసరము లేదు. పాల్కురికి సోమునియనంతర, మెప్పటికో వెలసిన పిడుపర్తి సోమనాథాదులు తమ గ్రంథములలో నాతనిని సోమగురుఁడని వ్రాయుచువచ్చిరి.)

ఇఁక శ్రీ సుబ్బారావుగారు దాహరించిన పై పద్యములను గూర్చి క్రమముగా విచారింతము.

1. ఎడపాటి ఎఱ్ఱాప్రగ్గడ యుదాహరించిన కృష్ణరాయఁడు విద్యానగర ప్రభువగు కృష్ణదేవరాయఁడే యని యెట్లు చెప్పఁగలము? కృష్ణదేవరాయల కాలమువాఁడగు ధూర్జటి తరువాత పద్యములోఁ బూర్వకవిస్తుతిలోఁ జేరియుండుటచేఁ గూడ నీ విషయము శంకింపఁ దగియున్నది. ఏది యెట్లున్నను రెండవ పద్యములో నుదాహరింపఁబడినవేముఁడు మనవేమనేయనుట కవకాశము లేదు. అందుఁ జేర్కొనఁబడిన నన్నెచోడ భవదూరులవలె శివకవిగాఁ గాని, నన్నయ తిక్కనాదులవలెఁ బండితకవిగాఁ గాని సంస్కృతమాన సంభవుఁడయిన యెఱ్ఱాప్రెగ్గడ మనవేమనను గణించియుండఁడు కదా! ఇందలి భవదూర శబ్దము వేమనకు విశేషణమని సుబ్బారావుగారు తలంచిరి. అదిపొరపాటు. ఇవి వ్యస్తపదములు. భవదూరుఁడు వేఱు. వేముఁడు వేఱు. ఇరువురుకూడ మనవేమనకంటె వేఱయిన మహాశివభక్తులు కాఁదగును.

2. ఏకామ్రలింగశతకకర్త పేర్కొనిన వేముఁడు భీమకవివలె బిరుదు (ఉద్దండ) కవులలోఁ జేరినవాఁడని వలన వ్యక్తమగుచున్నది. ఆతఁడు మనవేమన యెట్లు? భీమకవి మున్నగువారివలెఁ బాండితీసంపన్నుఁడను, తనపద్యములలోఁ బలువురను బలువిధములఁ దిట్టిన వేమనబిరుదుకవులలోఁ జేరునా? ఇది విచారణీయము.

3. ఎల్లనార్యుని సీసపద్యములో మొదటి నాలోను జేర్కొనఁబడినవారు కేవలకవులు కారు. వారు శివాచార్యులు, మతోద్ధారకులు, మహాశివభక్తులు నై యున్నారు. వారిలోఁ గీర్తింపబడిన వేమన మనవేమనకవి యనవీలు లేదు. కేవలకవిస్తుతి యెత్తుగీతిలోనే యారంభమైనది. దానిలోఁ బ్రథమపాదమున సంస్కృతకవులు, తరువాతి పాదములలో నాంధ్రకవులు నుతింపఁబడిరి.

4. అన్యవాద కోలాహలకర్త శివయోగీంద్రుఁడే యనుట కాధారములు లేవు. దానిని రచించినవాఁడు పిడుపర్తి సోమనాథుఁడని కొందఱు వ్రాసిరి. అదియు యథార్థమని చెప్ప వీలు లేదు. ఈ విషయమై "పిడుపర్తి సోమనాథకవి అన్యవాదకోలాహలకర్తయా?" అను శీర్షికతో సారస్వతానుబంధములో నేనువ్రాసినవ్యాసమును జూడుఁడు. ఇంతకు నీశతకపద్యములోఁ జేర్కొనఁబడినవేమయ్య మనవేమన కాఁజాలఁడు. అందుగ్గడింపఁబడిన తక్కినవారివలెనే యాతఁడు బసవపురాణాదిగ్రంథములలో వర్ణింపఁబడినపురాతన వీరశైవులలో నొకఁడు. అతఁడు చేటలవేమయ్య కావచ్చునని నాతలంపు. ఈ వేమయ్య చరిత్రము పండితారాధ్యచరిత్రములో వర్ణింపఁబడినది. "ఈవేమన్న శివభక్తులలోనివాఁడై యుండును." అని శ్రీ సుబ్బారావుగారుకూడ పుట్‌నోటు (Foot note) లో శంకించిరి.

5. నాగరఖండమందలి సీసపద్యములో మొదటినాలుగుపాదములలోఁ బేర్కొనఁబడినవారు కేవలము గీర్వాణకవులును, శైవగీర్వాణకవులు నైయున్నారు. కావున వారిలోఁ జేర్పఁబడినవేముఁడు గీర్వాణభాషాపాండిత్యము లేని మనవేమన కాఁజాలఁడు. ఈ పద్యములో నాంధ్రకవిస్తుతి యెత్తుగీతిలోనే యారంభమైనది. ఈ పద్యములం దుదాహరింపఁబడిన వేముఁడు మఱి యెవఁడయి యుండును? పురాతన వీరశైవులలో బెలిదేవవేమనారాధ్యుఁ డొకఁడు పండితారాధ్యచరిత్రమున వర్ణింపఁబడినాఁడు. ఆతఁడు శాపానుగ్రహసమర్థుఁడు; కవియునఁట. బసవేశ్వర పండితారాధ్యులకు సమకాలీనుఁడగు నొక బెలిదేవ వేమనారాధ్యుఁడుకూడ నున్నట్లు పండితారాధ్యచరిత్రమువలనఁ దెలియుచున్నది. పాల్కురికి సోమనాథుని గురువుయొక్క తాతకూడ బెలిదేవ వేమనారాధ్యుఁడే "పేరెన్నఁబడిన శ్రీ బెలిదేవవేమ, నారాధ్యులను పర మారాధ్యదేవు, మనుమని శిష్యుండు..." అని సోమనాథుఁడు చెప్పికొనినాఁడు. ఈ మువ్వురు నొక్కపురుషుఁడే యైనఁగావచ్చును. రెడ్డిరాజులు తమ పేఱును వేమన యను వీరశైవమతాచార్యుని నామమును బట్టి ధరించియుందురని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు శృంగార శ్రీనాథములో వ్రాసిరి. పైనిజెప్పిన వేమనా

యా మతాచార్యుఁడా? ఈ వేమనారాధ్యుని శ్రీ సుబ్బా
డ వేఱొక సందర్భమున "వేమన రసవాదము" అను
ఁ జేర్కొని యాతని సంతతివారు మొన్నఁటివఱకుఁ
ట్లు కవులచరిత్రము సాక్ష్యమిచ్చుచున్నదని వ్రాసిరి.
కవిస్తుతిలోఁజేరిన వేమన యీ బెలిదేవవేమనారా
యాతని వంశములోఁ జేరిన మఱియొక వేమన కాని
నా యభిప్రాయము, ఈ చెప్పిన కారణములచేతఁ బై
ఎట్టి శ్రీ సుబ్బారావుగారు చేసిన వేమనకాల నిర్ణయము
దని యూహింపవలసి వచ్చుచున్నది. పూర్వులు వేమనను
యోగిగా గణించినట్లు కవిగా గణింపనందునఁ బూర్వకావ్యములు
మనకు వేమనకాల నిర్ణయమున నుపకరింపవనియే నా నిశ్చయము.
"ఇట్లే ప్రసన్నాంజనేయ శతక కర్తయగు నరసింహదాసు మొదలగు
నలుగురు కవులు వేమన్నను బొగడియుండిరి" అనికూడ శ్రీ సుబ్బా
రావుగారు వ్రాసిరి. ప్రసన్నాంజనేయ శతకకర్త శతకాంతమున
"మంగళము యోగివేమన్నగురుఁ డెఱుంగు" అని వ్రాసియున్నాఁడు;
ఈయోగి వేమన మనవేమనయే కాఁదగును. ఈ శతకకర్త వేమన
శిష్యుఁడయి యుండును. ఇట్లే తక్కినమువ్వురుకూడ నైయుండ
వచ్చును. వీరు సుప్రసిద్ధులు కానందున వీరి కాలనిర్ణయ మొనర్చుట
కంతగా నాధారములు లేవు. కావున వేమనకాలనిర్ణయమునుబట్టియే
వీరి కాలములఁగూడ నిర్ణయింపదగియున్నదే గాని వీరి శతక
ములఁబట్టి వేమన కాలనిర్ణయ మొనర్చ నవకాశములు లేవు. ఇఁక
వేమన కాలనిర్ణయమున కాతని పద్యములే ముఖ్యశరణ్యములు కాఁ
దగియున్నవి. శ్రీ సుబ్బారావుగారు లిఖించినట్లు వేమనశతకము వ్రా
సిన గ్రంథముగాక (వేదమువలె) వ్రాయని గ్రంథ మయి యున్నది.
"వేమనచెప్పినది వేదము" అనుసూక్తి యీవిషయమునుబట్టికూడ సార్థ
కమగుచున్నది. తనకుఁదోఁచినభావముల నెప్పటికప్పుడు వేమన పక్షి
వలెఁ బాడుచుఁ బోయెనేగాని వాని నాతఁడు గ్రంథరూపమున వ్రాసి
నట్లు కానరాదు. పైఁగా వేమన శిష్యప్రశిష్యులు వేమనకంకితముగా
వ్రాసిన పద్యములుగూడ రానురా నీపద్యసముదాయములోఁ జేరి
యుండును. వేమనపద్యము లేవియో, యాతనిశిష్యులపద్యము లేవి
యో సరిగా నేర్పఱచుట దుస్తరము. కాఁబట్టి పలుప్రక్షిప్తములతోఁ
గూడిన వేమనపద్యములను బట్టి యాతని కాలనిర్ణయ మొనర్చుట
ప్రమాదరహితమయిన మార్గము గాకపోయినను వేఱుదారి లేనందున
నదియే శరణ్యమగుచున్నది. వేమనపద్యములందలి తురకపదములను
బట్టి శ్రీలక్ష్మణరావుగారు సెలవిచ్చినట్లు వేమన క్రీ. శ. 15 వ శతా
బ్దము తరువాతివాఁడనుటకు సందేహము లేదు. నేనీవ్యాసమును
వ్రాయుచుండఁగా శ్రీవేటూరిప్రభాకరశాస్త్రిగారు సారస్వతానుబంధ
ములో "వేమనయోగిదేశకాలములు" అను శీర్షికతో వ్రాసినవ్యాస
మును జూచుట తటస్థించినది. శ్రీశాస్త్రిగారు "ప్రాకటముగ నిట్టి
లోకములో గంటు, పల్లిముత్తఁ డెన్నఁబరమగుణుఁడు; అన్నదానము
నను హరుపూజచేతను, హరునిఁ గాంచె లోన నరసి వేమ"అనుపద్యము
నఁ బ్రాతవ్రాఁత ప్రతులలోఁ గొన్నిటియందు "గంటుపల్లి" కిమాఱు
"గుంటుపల్లి" యని యున్నదనియు, మఱియు నీపద్య మర్థసందర్భము
పొసంగునట్లుగా నందు "పరఁగరాయనికులు బాచనిఘనమెల్ల..."
అను పద్యమునకుఁ దరువాతనే యున్నదనియు, గుంటుపల్లె ముత్తా
మాత్యుఁడు శా. శ. 1545 (1623 ఏ. డి.) లో మృతిచెందినట్లు
చాటుపద్య మున్నందున వేమన యాతనికాలములో నుండినట్లు నిస్సం
శయముగాఁ జెప్పవచ్చుననియు వ్రాసిరి. ఈపద్యము ప్రక్షిప్తము
గాని, వేమనశిష్యులు చెప్పినది గాని గాక వేమనస్వయముగాఁ
జెప్పినదే యని యంగీకరించినను దానినిబట్టియే వేమన ముత్తనామా
త్యుని కాలములో నున్నట్లు తలంపరాదని నా యభిప్రాయము.
రాయని భాస్కరుని ప్రశస్తిని బట్టి వేమన యాతని యనంతరము చిర
కాలమున కాతని నెట్లు పేర్కొనెనో యట్లే ముత్తనామాత్యునిఁగూడ
దా నాతని యనంతరము వెలసినప్పటికిఁ గూడఁ బేర్కొనియుండ
వచ్చును. అన్నప్రదాతలు, నెఱదాతలు నగు పుణ్యాత్ములు స్థిరకీర్తు
లగుటచే నేకాలములందును గీర్తింపఁబడుచునే యుందురు. కొన్ని
పద్యములను బట్టి వేమన క్రీ. శ. 1623 తరువాతనే యుండెననుట
కవకాశ మేర్పడుచున్నది. "శ్లో. అవసరపఠితా వాణీ గుణగణరహితాపి వహతి పరమోదం; రతిసమయే యువతీనాం భూషాహానిశ్చ భూషణం భవతి." అను పండితరాయల శ్లోకమునకు వేమనపద్యములలో నీ
క్రిందియనుకరణ మున్నది.

"గీ. ప్రస్తుతంపువేళఁ బద్యంబుచదివినఁ
దప్పు లున్న మిగులనొప్పియుండు
వెలఁది (పణఁతి) సురతవేళ బిత్తరై (ప్రౌఢయై) యుండదా
విశ్వదాభిరామ వినురవేమ!"

వేమన క్రీ. శ. 1412-1480 వఱకు నుండినట్లు తాము తలంచు
టచే శ్రీసుబ్బారావుగారు పండితరాయలే వేమన ననుసరించినట్లు
వ్రాసిరి. పండితరాయ లాంధ్రదేశమున జన్మించినను ఢిల్లీశ్వరుసభ
యందుఁ గవీశ్వరుఁడుగానుండి యుత్తర హిందూస్థానమందే కాలము
గడపినవాఁడు. ఆంధ్రభాషాప్రచారము లేనియాదేశమున నుండిన
గీర్వాణకవీశ్వరుఁడు వేమన తెలుఁగుపద్యమును విని దానిని సంస్కృ
తీకరించెనని తలంచుట యసంగతము. పండితరాయలు మొగలు చక్ర
వర్తియగు షాజహాను (క్రీ. శ. 1628-1658) నాస్థానమందుండిన
వాఁడు. ఆంధ్రదేశమున నాతనిగ్రంథములకు వ్యాప్తికలిగినతరువాతనే
పైశ్లోకార్థమును విని వేమన తెలుఁగుపద్యమును జెప్పియుండుననితోఁచు
చున్నది. శ్లోకమును బద్యమును బరిశీలించి చూచినప్పుడు మొదటి
దానినిబట్టి యే రెండవదివెలసినట్లు కనఁబడును. మఱియు "పేరు పైదు
మొగలు చెలఁగుపఠానులు, తురకలు దొరతనము తొలుతఁ జేసి, గాఁగ
రాఁగవిడిచి రౌతులై కొలిచిరి, విశ్వదాభిరామ! వినుర వేమ!" అను
పద్యమునుబట్టి వేమనకాలము నాఁటికి మహమ్మదీయుల ప్రభుత్వముకూడ
క్షీణదశకు వచ్చినట్లు స్పష్ట మగుచున్నది. మొగలుచక్రవర్తియగు
ఔరంగజీబు (క్రీ. శ. 1658-1707) అనంతరమే మహమ్మదీయప్రభు
త్వమున కిట్టిదశగలిగినది. కావున వేమన క్రీ. శ. 1650, 1700 ప్రాంత
మున జన్మించి యుండుననుట సమంజసముగ నుండునేమో

యని తోఁచుచున్నది, "క. నందన సంవత్సరమునఁ, బొందుగఁ గార్తీకశుద్ధ పున్నమనాఁడుఁ, వింధ్యాద్రిసేతు బంధన సందున నొక వీరుఁ డేలు సరగున వేమా!" అను పద్యమును వేమన తన్నుద్దేశించియే చెప్పియుండునని దానిని బట్టి కొంద ఱాతఁడు జన్మించినది నందన సంవత్సరమై యుండునని తలంచుచున్నారు. ఇది సందేహాస్పదము. మఱియు వేమన శార్వరి సంవత్సర చైత్ర శుద్ధ నవమినాఁడు సిద్ధిపొందెనని యాతనిభక్తులు తలంచుచున్నారఁట. దీనికిఁ గూడ సరియగు నాధారములు లేవు. ఇవి నిజమే యైనచో వేమన క్రీ. శ. 1652 సంవత్సరమున జన్మించి 1720 సంవత్సరమున మర నని తలంపవచ్చును.

మహాశయులారా! వేమన కాలనిర్ణయమునకుఁ లన్నియు నయోమయములుగ నున్నవి. నా యభిప్రాయమైనవేయని నేను చెప్పఁజాలను. శ్రీ సుబ్బారావుగ ధకు లిదివఱకు నిర్ణయించినకాలము భ్రమప్రమాద మూలః టచే నీవిషయమును విశేషజ్ఞు లింకను బరిశోధించి సత్యః విశ్వాసముతోనే నీవ్యాసమును వ్రాసితిని. విజ్ఞులు క్ష

# పసిరిమొగ్గలు

## అడివి బాపిరాజుగారు

**పాపాయి:—** ౧

పాపల కెల్లా పాపాయైన
పాపా యనెడు ప్రణవా మైన
పాల సముద్రుడు చేతుల తోడా
మత్తా కుయ్యాల జోలల వూప
ఎట్టి వారికి తెలియందండీ
సృష్టి రూపం బందిన నవ్వూ
చిన్న కెంపులా పెదవుల వెలగా
చేతిని పాదం చేరగ బట్టీ
చూత ఫలంనా బుఱకుచు తానూ
తోనల రూపమున దేహం బెల్లా
ద్యుతుల నీనుచు వారయుచు నుండా
నిన్నే నీవు తెలియ నట్టుగా
మిన్ను రంగునా బొజ్జ బాబువై
కన్నుల లోనా ప్రేమ కాంతులూ
అన్ని దిక్కులా వ్యాపింపంగా
అంతులు లేని పాపా యైన
పాపల కెల్లా పాపా యైన
పాపాయి వచ్చీ రాని కబురులా
ఆడుకొందము రమ్మా! రమ్మా!
పాడు కొందమూ పాపాయి రమ్మా!

**తారలు:—** ౨

తమ్ముడ! ఒక సారిట్లా రా
తమ్మా మొగమూ పై కెత్తూ
మినుకూ మినుకూ చుక్కలు రా
కనుగొంటివ అవి యెవరంచుః
వాడీ పోయిన పువ్వులనే
దేవుడు చుక్కల చేయును రా

**జోల:—** 3

ఏడవకు ఏడవకు వెఱ్ఱి చిన తల్లి
ఏడిస్తె నీ కళ్లు నీలాలు గారె! ॥ హాయి ॥
లలల లలల లల హా యీ!
హాయి వారింటికే పోయి వద్దామా
అందెల్లు బేడీలు తెచ్చు కుందామా
అందెల్లు బేడీల అంగలా ధ్వనులూ
అడుగడుగు మురినవ్వ అమ్మాయి అంగం॥హాయి॥
ల ల ల ల ల ల ల ల పిల్లీ!
పిల్లీ పిల్లీ పిల్లలకు తల్లీ
పెట్టవే అమ్మాయి పట్టు జడ గంటా
పట్టు జడ గంటలూ పైడి నాగరమూ
కట్ట కాసుల పేరు కంఠ గల వన్నె ॥ హాయి ॥
ల ల ల ల ల ల ల ల మఱ్ఱీ!
మఱ్ఱి చెట్టూ క్రింద తోఱ్ఱ నాగన్నా
నాగన్న బువ్వలకు నాలు గప్పాలు
అప్పాలు చాలునే అమ్మాయి కెపుడూ
ఆవు పాలా బువ్వ లాకళ్లు తీరు ॥ హాయి ॥
ల ల ల ల ల ల ల ల దాయి!
దాయి దాయి రావె దాయిల్లు పోవే
తల్లివస్తాడు మా తల్లికే మొగుడు
మగడు వచ్చీ కట్టు మంచి మూర్తాన
మంగళ సూత్రంబు మాలచ్చి మెడలో ॥హాయి॥

౪

చిన్ని చిన్ని గోరూ వంకా లెన్నిచేరీ యున్నాయో
గన్నేరు పూలా మొగ్గాలన్ని గుత్తూ లున్నాయి
పూలా పూలామంచూగుళ్లూ ముత్యాల వెలుగూలయితే
మొలా చేరూచిన్నిపాపలు బాలా చంద్రా రేఖాలయిరి

# కవితాస్వరూపము

## ఒక ప్రసంగము

యనమండ్ర నారాయణమూర్తి గారు, బి. ఏ.,

**ముక్రిందట** మీరాబాయి రచించినశాంతభక్తిరసప్రధానములగు కీర్తనలును, అఖండవైరాగ్యద్యోతకములగు శ్లోకములును నేటివరకు నుత్తర హిందూస్థానమందు బండితపామరసామాన్యముగ నత్యాదరముతో స్మరింపబడుచున్నవి. మీరాబాయి పరమభాగవతోత్తమురాలగు నొకయుదయపుర మహారాజ్ఞి. ఈమె కాలనిర్ణయమును జీవితవృత్తాంతమునుగూడ పలువురు పలువిధములుగ జెప్పుచున్నారు. కొందరామెభర్త కుంభమహారాణాయనియు, జిన్ననాటనుండి సతీపతులిరువురును గవితాప్రియులనియు, యౌవరాజ్యావస్థయందంతటను కావ్యరచనయే వ్యసనముగా గాలము గడపిరనియు వయసు మీరి యధికారము వచ్చినకొలది కుంభునికవిత శృంగారరసాయత్తమై ప్రసంగము రాజసప్రధానమైనదనియు, మీరాబాయి కృతియు, నభిరుచియు, జేష్టలుగూడ నుత్కటభక్తివైరాగ్యమయములుగా జొచ్చెననియు జెప్పుచున్నారు. రానురాను వారికింగారణకైతవములచే సంభవించిన పరస్పరవియోగమున కాదినిశ్చయబీజ మీవైమత్యమే అయి యుండవచ్చును. ఏది యెట్లున్నను రసైకమూలమై, స్వభావానుకరణప్రధానమైన కావ్యరచనకు గుంభుని, ధర్మప్రతిష్ఠాపనము, పరతత్త్వప్రతిపాదనము, స్వభావసంస్కరణమును బ్రధానాశయముగాగల రచనకు మీరాబాయిని బ్రతినిధులుగ జేసి యీప్రసంగము రచింపబడినది.

పాత్రములు:—

[౧. కుంభుడు—ఉదయపురయువరాజు. ౨. మీరాబాయి—తద్ధర్మపత్ని. రంగము—ఉదయపురరాజధానియగు చితోడ్ నగరమందు యువరాజు భవనోద్యానవనము.

కాలము:—వసంతదివసాంతము. ప్రవేశము:—కుంభుడును మీరాబాయియును లతాగృహప్రాంతమున జంద్రకాంతోపలవేదిపై బఱచిన తెల్లపట్టుపరుపుపై ముఖాముఖిగ గూర్చుండిరి. పుస్తకములును లేఖనోపకరణములు నందందు జెదరియుండును.]

మీ:—అట్లే యయినచో "విశ్వశ్రేయః కావ్యం" అనువిధి యేలకలుగవలయును?

కుం:—ఆహ్లాదముకన్న శ్రేయ మేమి? కవితకాహ్లాదజనకత్వమే ముఖ్యాశయము. సమస్తశాస్త్రములకును, విద్యలకును, సమస్త సద్వ్యాపారములకుంగూడ.

మీ:—ఎక్కడి కాయాహ్లాదమునకు? మితియు మేరయు లేని యాహ్లాదము ప్రమాణ మెట్లు కాగలదు? కిరాతునకు జీవహింస యాహ్లాదము. ప్రాకృతజనంబునకు మృగముల కట్లే యుదరపోషణమును దన్నిమిత్తమన్యార్థప్రాణభంగము నాహ్లాదము; లోభికి స్వకీయసుఖహింసాకరమైన ద్రవ్యసంగ్రహము; సంసారికి విషయసంగము; సన్న్యాసికి సంగత్యాగము; కావ్య మిందఱకు నిన్నివిధములగునాహ్లాద మెట్లు కలిగించును? ఇంతియ గాక కేవలసుఖలోభత కామభోగేచ్ఛవంటిదౌటను పామరలక్షణమగును గాని యుత్కృష్టకావ్యమాన మెట్లు కాగలదు?

కుం:—వానిలో సదసద్విభేదము లేదా? ఎట్టి యుత్కృష్టసుఖము మహాకావ్యఫలము కాగలదో అట్టిసుఖమే లెక్క. తదితరము కావ్యప్రశంసయందు దురూహ్యము. సహృదయరంజనమే కావ్యమూలము. రసవిహీనులును బ్రాకృతులును గవితావిషయోద్వాసితులుగా దలంపుము.

మీ:—మహాప్రభూ! మీ రానతిచ్చునదియే కవితాతత్త్వమయ్యెనేని పామరులగతి యేమి? వారి కాహ్లాదము గలిగించుకృతులు కృతులు కావయ్యె; సత్కావ్యములయందట్టివారి కాహ్లాదము కలుగ దయ్యె. శ్రేయోభివృద్ధి రసజ్ఞులకే యని నిర్దేశించినచో 'విశ్వశ్రేయః' అనువాక్యము సార్థక మెట్లు కాగలదు.

కుం:—ప్రేయసీ! భ్రాంతివిడిచి చక్కగా బరికింపుము. సంగీతసాహిత్యాదిరసప్రధానవిద్య లన్నిటికి బండితపామరభేదము లేక విశ్వము రంజింపజేయుసామర్థ్యము కలదు. "శిశుర్వేత్తి పశుర్వేత్తి" యనుపరమార్థమునిరర్థకమేనా? కావ్యప్రాణమైనరసమునకు బ్రాణము స్వభావానుకరణము. అన్నచో భగవత్సృష్టికి బ్రతిసృష్టి జేసి కృతికర్త విశ్వకర్తయై విశ్వవిహితుడై భూజనంబుల వాసికెక్కు.

మీ:—విశ్వరంజకుడై యని యానతిండు. విశ్వహితకారిత్వము దానికి బైమెట్టు. ఇందులకై సామాన్యకవులు యత్నింపనేరరు. ఉన్నది యున్నట్లు వర్ణించుట విశేషమే యగుగాక! అందు సరసవిరసవిభేదము లున్న నుండుగాక! కాని యట్టిభేదమును జాలదు. యథావస్తువర్ణనమెంత రసవంతముగా జేసినను మహాకవి కానేరడు. స్వభావసిద్ధములగు వర్ణ్యాంశములును విభావాద్యౌచిత్యమును వ్యంగ్యప్రధానమై రసచిత్రాలంకారమయమగు శైలియును గర్ణరసాయనమగు పదరచనయుం గవితకు ముఖ్యలక్షణములే; కాని వానితో సంతుష్టిపొందిన రసకవిత్వమనిపించుకొనును. శబ్దాద్యలంకారములతో నింద్రజాలము విరచించెనేని చమత్కారకావ్య మనిపించుకొనును. కాని తాము మునుమున్న వాక్రుచ్చిన సదసద్వస్తువివేచనమును బరమార్థప్రతిపాదనమును జగత్

త్వనిరూపణమును, మహాకావ్యోద్దేశ్యములు. వీనిమూలముననే విశ్వశ్శ్రేయము సమకూడును. ఇట్టి కవిత్వమే సరసవిరస తారతమ్యముల నెంచక పండితపామరసామాన్యముగ భోగింపదగు మహాభాగధేయము. రసకవిత్వమునకు రసావాప్తియే పరమావధి. నీతిబోధయు దుర్నయతిరస్కృతియు, ఆస్తిక్యసిద్ధియు మహాకావ్యఫలంబులు.

కుం:— ఇహిహి!! ఈపాటిదానికి గావ్యము లేల? రసభావాలంకారము లేల? ఛందోనియతి యేల? నీతి మంచిదనియు, దుర్నీతి కూడదనియు రెండుముక్కలు చెప్పిన జాలదా? శృంగారాదిమహారసములు వెల్లివిరియుటకన్న గవిత కవధి యే మున్నది? ధర్మాధర్మవివక్షు కావ్యములపని కాదు. పరమార్థవిచారము వలయునేని వేదాంత మభ్యసింతుము గాక! వానప్రస్థమునకు బోదుముగాక! చాలదేని నొక్కమాఱు సన్న్యసింతుము గాక!

సీ. చేవను చిగురించు, సింగంబు వలపించు
దినవచ్చు దైత్యుని బ్రణతుజేయు
భవము హృద్యవిలాస వన కేళి యనిపించు
నార్తుని నలరించు నర్థి వించు
భువన మర్మిలి దారమున జక్కగనగూర్చు
నితవున నోలలాడించు మనను
జగదంతరంగమౌ సామరస్యము దెల్పు
జుట్టరికము గల్పు సురనరులకు
వెల్లి పడదు విరులు విరిబోండ్లు రంగమ్ము
రసము సొమ్ము, తీవి, రాజసమ్ము,
మంటిబొమ్మ కొసగు మానుష తేజంబు
కవిత వట్టిముదుక కఱుకు గురువె?

మీ:— ఏలినవారు కవిసార్వభౌములు. తాము సెలవిచ్చినదాని కన్న ప్రమాణము లేదు. నాయెఱింగినది రసావేశ మొక్కటమైనప్పుడప్రయత్నముగ నజ్ఞాతముగను దమంతన వచ్చు రెండుముక్కలాత్మానందముకొఱకల్లుకొనుటయే. నాకు లక్షణశాస్త్రముతో బని లేదు. కాని మొన్న శ్రీదర్బారువా రనుగ్రహించిన పండితసభలో శివనారాయణపండితు లుపన్యసించినశాస్త్రార్థమును సవిస్తరముగా విని లక్ష్యలక్షణసమన్వయము చేసికొని కొన్నియంశములు మనస్సున బట్టించుకొంటిని. ధర్మాభినివేశము లేని రసపోషణము శవాలంకరణమువోలె నిష్ప్రయోజనము. నిత్యానిత్యవస్తువివేకమునకుం గొఱగాని లోకానుభూతియే నిరర్థక మన్నచో గవికల్పితలోకానుభూతి మాట సెప్ప నేల? నిరర్థక మేగాదు. దుర్భరము. పీడాకరము. ఏరసమైనను ధర్మానురిగ బుష్టియైనదే హితకారి. తద్వ్యతిరేకము భగవదుద్దిష్టమైన లోకస్థితికి బ్రతికూలమై యమంగళదాయకమగును. చెల్లెలిపై వలపును తల్లిపై బరాక్రమమును మహారసములగు శృంగారవీరము లెంతవెల్లివిరిసిన నేమి శ్రేయోదాయకములు కానేరవు సరిగదా! తమ రానతిచ్చిన యాహ్లాదమునకుం గూడ బాహ్యములై జుగుప్స పుట్టించును. శాస్త్రలోకజ్ఞానము కవిత కుపాంగము. కవితాహార్మ్యారోహణమునకై లోకజ్ఞానము సోపానము. ఆహ్లాదము మిషమాత్రముగాని యాశయము గాదు. వలపన్ని కవిభూజనులహృదయములంబట్టి విశ్వోపయుక్త వరించును.

సీ. సర్వభూతములందు సర్వేశ్వరు నెఱుంగు,
తనయందు సర్వభూతము లెఱుంగు,
సుఖదుఃఖముల కంద కఖిలభవోల్లోల
కల్లోల మొకనాటకముగ జూచు,
డెందము గఱగించి యందు విశ్వహితంబు
ముద్రించు, విశ్వాత్మ మూర్తి నించు,
దివ్యదృష్టిని సర్వదిక్కాలముల జూచి
దేవదేవునిదయాదీక్ష జాటు,
రసికమాత్రుడె కవి?—యతిబ్రహ్మ యనుడు
ధర్మసంస్థాపకుడు జగత్త్రాత యనుడు
వానిమాటలు మంత్రముల్ వానిలో క
మమర కావ్యంబు, రీతి విశ్వాతిశాయి.

కంచుకి ప్రవేశించును:—

కం:— మహాప్రభూ, సాయంకాలము కావచ్చినది. ఆజ్ఞానువర్తినై జ్ఞాపకము మనవిచేసికొనుచున్నాను.

కుం:— ఆ, అవును. దేవీ! మహాప్రభువువారితో గలసి వాహ్యాళికి బోవలసియున్నది. పిలిపించికొనక ముందే హుజూరునకుం బోయి కొలువును వేచియుంట యుక్తముగా నుండును.

మీ:— చిత్తము. రండి లేతము.

[కంచుకినిష్క్రమించును]

కుం:—(కొంతదూరము యువరాజ్ఞితో గలసి నడచి—సాలోచనముగా) ప్రాణసఖీ! ఇట్టిరమణీయరచనాధురంధరియగు ప్రకృతి కన్న గవీశ్వరు లెవ్వరు? ఈయనల్పకల్పనాప్రావీణ్యము, అనంతకృతిబాహుళ్యము, అసంఖ్యాకరూపగుణవిభేదమును ఆమహాదేవి కేచెల్లును. తలపదలప.

మీ:— స్వామీ! ఒకవిధాన ప్రకృతియే మహాకావ్యము. పరమాత్మ కృతికర్త.

కుం:— ఆగు! నేజెప్పబూనినదియే యది. బ్రహ్మానంద మాశయము.

మీ:— భగవంతునికి—కవికిని నట్లే—కవియాత్మానందముకై సృష్టియొనర్ప జగత్తునకు శ్రేయము సమకూరును. విశ్వశ్శ్రేయము కాని వ్యాపారమందు మహాకవి కానందమే కలుగదు. కవియాత్మ కేవల ప్రత్యగాత్మ గాదు; జగదాత్మయే. తనహృదయమునుమిష వెట్టి మహాకవి విశ్వహృదయముతోఁ జొక్కును; విశ్వచక్షువుతోఁ జూచును; కులజాతి మతభేదము లాతనిశుద్ధసత్త్వ మెన్నటికిం బంకిలము సేయలేవు; వేయేల? జగన్మయుడౌటను కవికి జరాచరభేదమే స్ఫురింపదు. ఏతాదృశమగు కవి నైసర్గికము తత్కవితాద్వారమున లోకమంతటికి విధియై తదాచరణము సతు స్తపురుషార్థసంపాది యగును.

—కాఁగనే యానందము శ్రేయ మంటిని. తిరిగితిరిగి వచ్చితివి.

—కేవలేంద్రియానందము కానిచో—ఇంతియ కాదు, కేవల పరమగు జ్ఞానానందము కానిచో, ఎంతరసాలవాలమయ్యును మై పరమార్థమూలమైనయాహ్లాదమే కావ్యాశయము.

—ప్రకృతిసాపత్యముచే నావాదము బలము చేసితివి. శేషము: ప్రకృతియందు శుభాశుభములును నయదుర్నయ ప్పలవిడిగ మిళితములై యుండునట్లే కావ్యమందును ఉండ నామతము. ప్రకృతికర్త కక్కఱలేనిధర్మోద్ధారము కృతి కర్తకు మాత్రమేనా కావలయును? స్వభావసౌందర్య ప్రదర్శనమాత్రముచే గవితాసిద్ధి యగుచుండ దత్సంస్కరణముతో బని యేమి? అంత సాహసమున కెవ్వడు సమర్థుడు?

మి:—కవిస్వభావ ప్రతిబింబనము ప్రకృతిశాస్త్రముల పని కాని కవితది కాదు. ప్రకృతియందు గల నిమ్నోన్నతముల సవరించి యశుభముల నడంచి శుభములను, అధర్మముల నడంచి ధర్మమును బ్రకాశింపజేసి భగవంతునియనంతకల్యాణశీలతను సమర్థించుట కవితాసిద్ధి. ఛాయాపటమునకును జిత్రపటమునకును భేదము లేదా? ద్వంద్వభూయిష్ఠమైన సామాన్యలోకమును బ్రచురించినకవి ద్వంద్వాతీతుడును లోకపావనుడును అగు భగవంతునాశయము నిరసించినవాడే యని నమ్మెదను. అభూతకల్పనలచే సృష్టికి వన్నె పెట్టినవాడే కవి. మహాకావ్యలోకమున, దృశ్యమానలోకమునందువలె గాక, సత్యజ్ఞాన దయాశౌచాదిమహాగుణములు విధులు కావు. నైసర్గికములు అధర్మము దుర్బలము. స్వర్గము కరతలామలకము.

కుం:—చక్కగా జెప్పితివి! ప్రాచీనకవిత్వమం దంతటను దటాకించిన యసంభావ్యకల్పనల నన్నిటి నొక్కమాటతో సమర్థించి వైచితివి!! ఆకల్పనలవెంబడిని లోకమందు వెలసిన కృత్రిమమతములను వికృతదైవములనుగూడ సమర్థించి లోకోద్ధారము జేతువుగాక!!!

మి:—మహాప్రభూ! ఏకవిత్వమందైన నేమి, యేమతమందైన నేమి, కల్పనలు కల్పనలే. వానిపరమార్థము నిజముగాని యవి పట్టిసాంకేతికప్రాయములే. సాంకేతికములను వస్తుభ్రాంతితో బూజించుట తప్పే. కాని యవాఙ్మనసగోచరవస్తువులకు సాంకేతికము లుంచగూడదని వాదులాడుట యంతకన్న తప్పు. దేశకాలశృంఖలితములైన ప్రకృతికిని దదారాధకులకును సంభావ్యాసంభావ్య భేదములు గలవు గాని దుర్ఘటఘటనాసమర్థులును లోకోత్తరులు నగు కవిబ్రహ్మల కసాధ్యములు నసంభావ్యము లేవి?

కుం:—చాల్చాలు! ఈవాక్యార్థములింతటితో గట్టిపెట్టుదుముకాక!!

ఎఱిఁగియు నీవు నే నీచర్చలందు
బ్రాక్పశ్చిమములాట వాదింతు; నేటి
వనలక్ష్మిహాయలు నీవైరాగ్యమునకు
దగిననిరుత్తరోత్తరమంచు దలచి
అరయవో మాధవునవతరించుటలో
పికదూతికలు దెల్ప, నకనకల్ వదలి
వేగిరపడి లేచి, వికచాస్య యగుచు,
లేబచ్చపట్టుముస్తాబు గైనేసి
కమ్మనివలపుచొక్కపుటంతరాత్మ
వెలిపుచ్చె బసలూలుక్కవిరిచప్పరముల
కనుము నాథునికూర్మి కౌగిటనె గఱిగి
కుసుమహర్షాశ్రువుల్ గురిసె నంచంద
గుసుమాస్త్రవిజయఘంట కోనలొత్తి మ్రోయ,
తన విందు లోకంబు కనువిందు సేయ
హృదయము నిదురింప దేని నీవేళ
నెవ్వడు పులకింప డివ్యనద్యుతికి?

మి:—పరమసాధ్వీమతల్లి భర్తృసమాగమనాకాంక్ష గనుక బులకింపవలసినదా, తన్మయము కావలసినదా! కాని యంతటితో జాలదు.

వనము, వసంతుండు, వసుధ, వారాశి,
చిగురు, చేవయు వానినేవకై బుట్టు,
బెరుగు, జక్కడగు, నూపిరి తీయు టాది
అఖిలచరాచరవ్యాపార మెల్ల
వలపు వైరాగ్యమ్ము వాదమ్ము భేద
మావిశ్వచైతన్య సేవలై మిగులు
ఎఱిగి, యెఱుంగక, యీ విశ్వ మెల్ల
పరిపక్వమగువిశ్వపతిభోజ్యముగను
కాలభేదమె గాని కర్మ లన్నిటికి
గతియొక్కటియె విశ్వగమ్యదాస్యమ్మె
ప్రకృతిని భేదంబు బరికింప కెవడు
సము డయి వశి యయి సదయాత్ము డగుచు,
నఖిలవిశ్వము జుట్టునంతరిక్షమ్మె
లీల,విష్ణువునందు లీనమై చరము
నచరము, సదసత్తు లల్పాధికములు,
తానును, పెరవాడు, తనవాడు, వైరి,
సకల మేక మటంచు జాటిందు, జొక్క-
వాడె ధీరుండు తత్త్వజ్ఞుండు వాడె
భవ్యకావ్యతపమాపట్టభద్రుండు !!

౧ కంచుకి ప్రవేశించును;

౧ కం:—మహాప్రభూ! దర్బారుశేలవగుచున్నది.

కుం:—ఇదె వచ్చితిని—చెచ్చెలీ! సేభయావడినట్టే అయినది. ఈచర్వితచర్వణమందు మునిగి మహారాజాజ్ఞ మరచిపోతిని.

౨ కంచుకి ప్రవేశించును;

౨ కం:—స్వామీ! పితాజీవారియాజ్ఞ యగుచున్నది.

కుం:—(వేగిరమునడచుచు) వచ్చితి, వచ్చితి.

3 కంచుకి ప్రవేశించును

3 కం:—మహాప్రభూ, సర్కారువారుతొందరపడుచున్నారు. బండిలో గూర్చున్నారు. తిన్నగా తమ్మును బండియొద్దకే వెంచేయమని సెలవయినది. [అందరును తొందరగా నిష్క్రమించుచున్నారు]

# రాటము

## భూతపురి నారాయణస్వామి గారు

కన్నులు విప్పి లోకములు గన్గొని యబ్బురపాటుఁ జెందఁగా
మున్నొకకాలమున్ భరతభూమి యశశ్శరదిందు కాంతితో
సన్నని జిల్గువల్వలఁ బ్రచారము సల్పి ప్రశస్తి కెక్కుటల్
నిన్ను వరించి కాదె? జననీ! సకలోర్వి యెఱుంగు రాటమా!

ఉ. మే మొక యన్యజాతికడ మిక్కిలి దాసుల మౌకతంబునన్
నీమహిమంబు సుత్తెఱుఁగ నేరక నిన్నొకమూలఁ ద్రోసి, పె
న్బాములఁ జిక్కి కుందితిమి; భారతభాగ్యపురాశియైన గాం
ధీమహనీయ మూర్తికృపఁ దెల్వి జనించెను మాకు నేటికిన్.

క. ఎక్కడ కదురు రాడెడినో
అక్కడ కఱవుండ దనెడు నార్యోక్తి సదా
నిక్కమని తెలిసె నేటికి
దిక్కయి నిలువంగ రావె దీనతఁ బాపన్.

ఉ. చీర లొసంగి కౌరవులచేఁ జెడకుండఁగఁ గృష్ణనామ మే
తీరున యాజ్ఞసేనిఁ గడతేర్చెనొ యవ్విధమీవు వస్త్రముల్
గోరినవాని కొసంగి లోకములన్నియు సంభ్రమింప మా
భారతజాతిమానముఁ గృపామతి నిల్పఁగదమ్మ! రాటమా!

తే. స్త్రీలసద్గుణములు ప్రకాశింప సొంపుఁ
బెంప నన్యోన్యరాగంబు దంపతులకు
నింప గృహము స్వర్గంబు గావింపఁ జాలు
రాటమా! నిన్ను నేమని ప్రస్తుతింతు?

సీ. తలుకు బెళ్కులపైని తగులంబుఁ దప్పించి
నిర్మోహసంస్థితి నెగడఁజేసి
తగనివస్తువులఁ జిత్తంబు పాఱఁగ నీక
యేకాగ్రవృత్తిని జోకపఱచి
కలఁక లేనట్టి యస్ఖలితదృష్టిని గూర్చి
యలసూత్రమందున నిలువరించి
శ్రవణ పేయముఁ జేయు ప్రణవ నాదంబుచే
నానందబ్రహ్మంబు నలవరించి
జీవయాత్రకుఁ దుది ఫలసిద్ధియైన
ముక్తికిం దార్చు సద్గురుమూర్తివగుచు
మించుకృప మాకు సాక్షాత్కరించినావు
రాటమా! బంధనమ్ములు రాలకున్నె?

సీ. పరులయత్నమ్ములఁ జడఁగొట్టి మోదాబ్ధిఁ
దేల్చుటఁ జండికాదేవి వగుదు
కూడుగుడ్డ కొఱలఁ గొల్వఁబోని బ్రతుకు
దెరువుఁజూపుట రమాదేవి వగుదు
స్వాతంత్ర్యగాన విస్తారమాధుర్యంబు
గ్రోలించుటను ముద్దరాల వగుదు
కరతలామలకంబుగాఁ దోఁచి యిలస్వరా
జ్యాకృతితోడఁ బ్రత్యక్షమగుదు
డీలుపడకుండఁ ద్రిప్పఁజే కీలకంబు
సత్త్వమయినబీజం బహింసావ్రతంబు
గాంధిప్రోక్త త్రిశక్త్యాత్మకంబు నైన
రాటమా! నీవు ధర మంత్రరాజ మగుదు.

సీ. వివిధజాతులలోన భేదముల్ నశియించి
యైకమత్యంబు పెంపందుకొఱకు
హైందవజనుల మనోభీష్టసిద్ధికై
యాశీస్సు సురలచే నందుకొఱకు
భారత స్వాతంత్ర్య పరమసాధనమును
దేశజనులకు బోధించుకొఱకు
మొగి 'నహింసా పరమోధర్మ' యనుటఁ బ్ర
పంచమునందుఁ జాటించుకొఱకు
నిన్ను గాంధిమహాత్ముండు నిండుప్రేమ
కేతనము పైననుండ నెక్కించినాఁడు
తావకము తేజ మాచంద్ర తారకముగ
నెల్లదిశలను బఱపి వర్ధిల్లుమమ్మ!

సీ. గాంధిమహాత్ముండు కనకాసనంబున
నంచితగతిఁ బ్రతిష్ఠించియుండ
అక్షతల్ చేఁబూని 'యాచార్యుఁడు ప్రఫుల్ల
చంద్రుండు' పూజలు సలుపుచుండ
అతిభక్తిఁ గైదండ 'ఆలీసహోదరుల్'.
వింజామరంబులు వీచుచుండ
ఆలసరోజిన్యాది లలనాశిరోమణుల్
ముత్తెంపుటారతు లెత్తుచుండ
భక్తజనములు భుజములఁ బట్టి మోయ
పార్శ్వములఁ గొల్చి పండితుల్ స్వస్తి బాడ
రాటమా! దేవివై, యనురాగగరిమ
కలితచిత్తవై యింటింట వెలయుమమ్మ!

# శ్రీ గాంధి ఆంధ్ర జాతీయ మహావిద్యాలయము—ఏలూరు

(శ్రీ ఆచార్య పప్పు పార్వతీశం గారు ఎం. ఏ, బి. ఎస్. సి. (డిప్లమొ ఇన్ ఎడ్యుకేషన్, ఎడింబరో.)

పరమేశ్వరనిర్మితంబై చరాచరాత్మకమగు ప్రపంచమున మానవులు సర్వోత్కృష్టులని చెప్పకతప్పదు. మానవుల ఘనతకు వారి యసాధారణశక్తియే కారణము. స్వశక్తిచే మానవు లెట్టి కార్యములనైన సాధింపఁగలరు. మహాకవి కాళిదాసు—

శ్లో. మరుపృష్ఠా న్యుదంభాంసి నావ్యా స్సుప్రతరా నదీః
విపినాని ప్రకాశాని శక్తిమత్వా చ్చకార సః."

అని చెప్పినట్లు మరుప్రదేశముల నఖాతజలప్రపూరితములుగను, పారావారములఁ బాదసంచారయోగ్యస్థలములుగను, నొనరించుశక్తి వంతులు మానవులే. ఇంతవఱ కేల? ఆర్యభారతుల యాకాశగమనము, పరకాయప్రవేశము, మృతసంజీవిని మొదలగుశక్తులు జగద్విదితములే కదా! అమూల్యభవిష్యద్వార్తాకథనము లార్యసంతతి కనుక్షణదృష్టాంతములై తచ్ఛక్తినిర్ణాయకము లగుటలేదా?

ఇట్టి యపూర్వశక్తి నొసంగున దేది? జ్ఞానము. ఈ విమలవిజ్ఞానమే లేక తత్ప్రదాయకమే విద్య యనంబడును. ఈవిద్యయే మానవుని మానవత్వప్రతిష్ఠాపకము. విద్యావిహీనున కఖిలప్రపంచ మంధకారబంధురమైయుండును. అవిద్యాతమస మాశామండలం బావరింపఁ జన్మమయాక్షిప్రసార మంతరించు నన వింత యేమి? విద్యాచక్షువో య ట్లుండఁగక స్వతంత్రముగ నిరాఘాటమున వర్తింపఁజాలును. కాన విద్యయేఁ మానవునకు ప్రధానచక్షురాఖ్యాతము.

"క. పలుసందియములఁ దొలఁగను, వెలయించ నగోచరార్థవిజ్ఞానములో
కుల కక్షి శాస్త్ర మయ్యది, యలవడ దెవ్వనికి వాఁడె యంధుఁడు [జగతిన్."

అనుసూక్తి నాలింపుఁడు.

అగుట విద్య నార్జించుటయే మనుజుని ప్రధానకర్తవ్యమని తేలుచున్నది. ఐహికాముష్మికభేదమున నీవిద్య ద్వివిధావిభజ్యము. అందాముష్మికవిద్య జీవితాంతమునఁ బరలోకసౌఖ్యముల నొసంగఁజాలి యుండును. ఐహికవిద్య సోపానరూపమున దాని కుపకరించుచున్నది. ఐహికవిద్య చతుష్షష్టికలామయము. ఐహికవిద్యచే మానవుఁడు సక్రమాభివృద్ధిఁ గాంచి స్వతంత్రుఁడై సౌఖ్యజీవనమున నలరారుచు దేశమునకును, కులమునకును, జన్మమునకును వన్నెఁ గూర్పఁ జాలియుండును. మఱియు ధర్మప్రవర్తనమును, దేవ పితృ భక్తిని, సత్య ధర్మ క్షమా శాంతాది సద్గుణములను గల్గి తన్మూలమునఁ దుదకు విరాగియై, సంసారబంధ ముక్తుఁడై, యాముష్మికవిద్యాభిసారియై, తద్జ్ఞుఁడై, విజ్ఞుఁడై నిఖిలనిరవధికానందమయకైవల్యపదంబునుగూడ నందఁజాలి యుండును. ఐహికవిద్యకు లౌకికమనియు, నాముష్మికవిద్యకు వైదికమనియు నామాంతరములు కలవు. లోకస్థితిరక్షణపరాయణు లగు నరపాలురు విద్యాద్వితయమునకుఁగూడఁ బ్రోత్సాహ మొసఁగి వృద్ధిఁ బొందించుచుండెడివారు. ఈవిద్యలు రెండును మతానుప్రాణితములు, మతవిరుద్ధముగఁ బ్రవర్తింప శక్తివంతములు కావు.

కాని యన్ని దేశములందును విద్యాస్వరూప మిట్లే యుండు ననరాదు. మన మతవిద్యాచార సాంప్రదాయము లన్యదేశీయులకు భిన్నములుగా నుండును. వారి మతవిద్యాచారసాంప్రదాయములు మనకు విరుద్ధములుగ నుండును. కాన నెవరి మతవిద్యాచారసంప్రదాయములను వారు సంరక్షించుకొనుచుఁ దన్మూలమునఁ గృతార్థత నొందవలసియున్నది. కాని దైవవిపాకమున మనదేశ మన్యాయత్తమై యుంటచేతను బరిపాలకులగు పాశ్చాత్యులు తమ మతవిద్యాచార సంప్రదాయము లీదేశమునఁ బ్రబలింప బద్ధకంకణులై యుండుటచేతను, వారు తమ విద్యాలయముల మన కొసంగువిద్య కేవలసేవకావృత్తి కుపకరించునదే యగుటచేతను, బాలిశు లెపుడును బరిపాలకుల ననుకరించుట మానవస్వభావ మగుటచేతను, ప్రస్తుతము మనము స్వమత విద్యాచార సంప్రదాయదూరులమై, స్వాతంత్ర్య విహీనులమై తుదకు వ్యక్తిత్వమునుగూడఁ గోల్పోవుస్థితికి వచ్చియున్నాము.

ఇట్టి సంకటస్థితియందు దేశదౌర్భాగ్యమును గమనించి తన్నివారణార్థము లోకోత్తరుండగు గాంధిమహాత్ముఁడు త్రివిధబహిష్కరణ నిర్మాణరూప మగు నసహాయోద్యమమును విజృంభింపఁజేసి దశదిశలు మారుమ్రోగునట్లు విజయశంఖధ్వాన మొనరించుట యాసేతు శీతాచల మధ్యవాసు లెల్లరకు విదితమే! అట్టితఱి భారతభూమండలంబున వివిధప్రాంతముల ననేకజాతీయవిద్యాలయ ప్రతిష్ఠాపనము లొనరింపఁబడినవి.

తత్కాలముననే పూర్వమొకప్పుడు వేఁగిదేశమునకు రాజధానియై యనంతవిభవశోభితంబై యొప్పిన వేఁగిగ్రామంబున కనతిదూరంబున నున్నట్టియు, నమితవిభవాఢ్యులును, సౌజన్యముఖర సద్గుణాలంకారులు నగు వైశ్యరత్నముల కావాసమైనట్టియు, పశ్చిమ గోదావరీమండలమునకుఁ బ్రధానస్థాన మైనట్టియు, నేలూరను హేలాపురంబునఁగూడ సుస్థిరముగ నుండునట్లు జాతీయవిద్యాలయము నొకదానిని శ్రీ గాంధిమహాత్ముని పేరఁ బ్రతిష్ఠింప శ్రీమోతే గంగరాజుజమీందారు ప్రముఖులగు పౌరశ్రేష్ఠులకుఁ గుతూహలము జనించియుండెను. తత్ఫలితముగఁ గొలఁదికాలముననే చాలధనము చందాలమూలమున నార్జింపఁగలిగి యుండిరి. ఆ సమయముననే

పురుషోత్తముండగు మహాత్ముం డాంధ్రదేశపర్యటన మేర్పాటుచేసి కొని యుండుటచే ధర్మపత్నీసమేతుండై యీ పురంబునకు విచ్చేసి విద్యార్థుల కక్షరాభ్యాస మొనరించి పవిత్రాశీర్వాదములతో శ్రీ గాంధి ఆంధ్రజాతీయ మహావిద్యాలయ సంస్థాపనము గావించెను. అనంతర మచిరకాలమునకే పౌరవైశ్యవర్గమువా రించుమించుగ లక్ష రూప్యముల సమకూర్చి విద్యాలయమునకు మూలధనముగా నుంచి స్థిరోపాధిని గల్గించియున్నారు. తొలుత ముప్పదిమంది విద్యార్థులతోం బ్రారంభింపబడిన యీ విద్యాలయము క్రమక్రమాభివృద్ధి నొంది నేటికి 220 మంది విద్యార్థులతో విరాజిల్లుచున్నది.

ఇట్టి విద్యాలయమున కన్నిటికంటె ననుకూలస్థానము లభించియుండుట ప్రశంసార్హము. హేలాపురపట్టణమధ్యమునం గృష్ణావాహినీతీరమున నానావిధతరులతాదుల మధ్య దోబూచులాడు నాశ్రమశాలాసందోహ మత్యంత మనోహరంబులును, నాదర్శ ప్రాయంబులును, విద్యార్థుల కారోగ్యప్రదంబులును నై చూపరులకుం బ్రాచీనార్షపుణ్యాశ్రమంబులువోలె నేత్రోత్సవం బొనరించుచున్నవి. ఇట్టి యుత్తమాశ్రమారామప్రదేశమున బాలురు తమ చిన్ని చేతులను జోడించి, 'సత్యంవద,' 'ధర్మంచర' యిత్యాది శ్రుతివాక్యముల నెలుంగెత్తి యుచ్చరించుచు దైవప్రార్థనాదికముల నొనరించుపట్టునను, నధ్యాపక సహితంబుగ శీతలతరుచ్ఛాయల నుపవిష్టులై, పాఠములం బఠించు కాలములను, నాశ్రమమునందలి స్థావరజంగమాత్మక ప్రకృతిచిత్రములం గాంచి చిత్రించునప్పుడును, వివిధౌషధశోధనపాచనాదు లొనరించునప్పుడును, బలువిధములగు తంతువాయకృత్యములం దత్యుత్సాహముతో నిమగ్నులై యున్న సమయమునను, మఱియు వ్యాయామము, తరులతాదిజలసేచనము, మొదలగు నుత్సాహజనకకృత్యములందుం బ్రవర్తించునట్టి బాలకులం గనుగొన్న, యేనిమానస మానందసుధావారాన్నిధి నోలలాడి భారతభావ్యభివృద్ధి నిశ్చిత రూపమున సమన్వయింపం జేసికొనకుండును? ఇట్టి యాశ్రమప్రాయ మగు విద్యాలయమున విద్యార్థులకును దేశమునకును సౌభాగ్యప్రదంబగు విద్య సంపూర్ణజాతీయపద్ధతులపైం గఱపంబడుచున్నది.

సహజముగా దేశీయభాషామతసాంప్రదాయాదులం జక్కంగ గ్రహించినపిమ్మట నన్యదేశీయముల గ్రహించుట సులభసాధ్యమగుటచేం బ్రాథమికవిద్యాశాఖయందు మాతృభాషకుం బ్రాముఖ్యత యొసంగంబడియున్నది. ప్రాథమికవిద్యాశాఖయందలి యాఱుతరగతులలో మొదటిమూడుతరగతులందును కేవలమాంధ్రభాషయే బోధింపంబడును. నాల్గవతరగతినుండి విద్యార్థు లందఱికి హిందీభాష నేర్పంబడుచున్నది. వలయువారి కైదవతరగతినుండి సంస్కృతభాషయును, గతినుండి యాంగ్లభాషయును నేర్పంబడుచున్నవి. పిమ్మట శాఖ ప్రారంభింపంబడును. ఇందు మూడుతరగతులు యందు విద్యార్థు లాంధ్రము, సంస్కృతము, హిందీ, నను నిలో నేరెండుభాషలందైన నసామాన్య యుర్వేదము, నేత, వడ్రము, వాణిజ్యము, మొద న నొకవృత్తివిద్యయందు నైపుణ్యమును బాగుగ సంపాదింపవలసియుండును. ఈరీతిని తొమ్మిదితర విద్యాలయమున విద్య నభ్యసించిన విద్యార్థి స్వతం పాదింపంగలిగి జనజీవితమును ధార్మిక నైతికభూయి కొని దేశోపకృతికిం దోడ్పడం జాలియుండును. ఈ నేర్పంబడుచున్న వివిధవిషయముల సంక్షిప్తచరిత్ర వి పఱుపబడియున్నది.

## ఆంధ్రము

విషయపరిజ్ఞానమునకు భాషాభివృద్ధి యావశ్యక. లెంతలెస్సగ నేర్చినను, వానిమూలమున స్వీయవిష చేకూరుట దుర్ఘటము. మఱియు బాలుర కవి స్వభాష నంతగ మనోవికాసహేతుభూతములు కూడం గాంజాలవు. భాషామూలమున మనతల్లులు జోలలంబాడి శైశవమున మనల ల చిరో, దేనితో వచ్చియురాని ముద్దుపల్కులం దొలుత మ యూహలం దలిదండ్రులకు విశదపఱచితిమో, రానురా నితరు యూహలగ్రహించి మనయూహలు నితరులకు దేనితోం దెలుపంగలిగి మో, యట్టిమాతృభాషాజ్ఞానమే మనోవికాసదాయకమై యొప్పును కావున నీవిద్యాలయమున మతనైతికరాజకీయార్థికాదివిషయము లెల్ల మనదేశభాషయగు నాంధ్రమునసే గఱపంబడుచున్నవి. ఇట్లాంధ్ర భాషకుం బ్రధానస్థాన మిచ్చియుండుటచే జిన్నతరగతులందు శతకములును, బ్రహ్మశ్రీ వావిలికొలను సుబ్బారాయకవి ప్రణీతంబులగు నాగ కథానిధులను, నున్నతశాఖలోని తరగతులందుం గవిపుంగవులగు తిక్క పోతనాదిమహాకవుల భారతభాగవతభాగములును బఠనీయగ్రంథములగా నేర్పఱిచి నిర్దుష్టమగు మృదుమధురభాష నేర్పంబడుచున్నది ఇందుచే బాలురకు స్వచ్ఛమైన చక్కనిభాష వ్రాయం జదువ నలవడ చుండుటయే కాక వారు భారత భాగవత రామాయణాదిగ్రంథమ లందలి సంప్రదాయములను ధర్మములను విశ్వాసములను స్వయముగ గూడ గ్రహింప నవకాశము లభించుచున్నది.

## సంస్కృతము

మనశ్రుతిస్మృతి పురాణేతిహాసములును, కావ్యనాటకాలంకా ములును, మఱియు వివిధశాస్త్రములునుగూడ సంస్కృతభాషయం యుండుటచేతను, మనయాంధ్రమున కది మాతృభాష యగుటచేతను జాతీయపాఠశాలలయందు సంస్కృతభాషాబోధన మత్యవసర మనుట నిర్వివాదాంశము. కావున సంస్కృతభాషకుంగూడం గొంతవఱకు బ్రాముఖ్యత నీయందలంచి, యీవిద్యాలయమున బాలురకు మూండవ తరగతినుండియు, సంస్కృతనిఘంటువగు నమరకోశము పఠింపంజేయ బడుచున్నది. ప్రధానముగ సంస్కృతభాష నభ్యసింపంగోరువా కైదవతరగతినుండియుం దద్భాషాభివర్ధకములగు గ్రంథములు విశేషము బోధింపంబడుచున్నవి. విద్యాలయమున సంస్కృతప్రాధాన్యముగ దరగతు లన్నియుం బూర్తి చేసినవారికిం గావ్యనాటకాలంకారసాహిత్యమును, వలయుపాటి వ్యాకరణపరిజ్ఞానమును గలుగును.

## హిందీ

న విశేషవ్యాప్తి గాంచినట్టియు, సులభగ్రాహ్య
త్రలమున దేశీయమహాజనసభవారిచే హిందూదేశసర్వ
బరిగణింపఁబడినట్టియు, హిందీభాషకు జాతీయ
దొసఁగవలసిన ప్రాముఖ్యమునుగూర్చి వేఱుగఁ జెప్ప
. ఈభాష నాల్గవతరగతినుండియే ప్రారంభింపఁబడి
ం భాషించుటకును, గ్రంథార్థముల సంపూర్ణముగఁ దెలిసి
యు సామర్థ్యమొసఁగఁ బడుచున్నది. ఇచ్చటివిద్యార్థ
ంత్యసమ్మేళనమువారి వివిధపరీక్షలకుఁ బోయి కృతార్థ

## ఉరుదు

హిందూమహమ్మదీయ సమ్మేళనమునకు దోహదముగ నీవిద్యా
షమున నురుదుభాషకూడ బాగుగ నేర్పఁబడుచున్నది. ఈశాఖ
నాఁటికి నిక్కమగు యభివృద్ధిలోనికి వచ్చుచున్నది. ఇంకను మహమ్మ
యసోదరుల ప్రోత్సాహమున వృద్ధినొందఁగలదు.

## ఇంగ్లీషు

హిందూదేశమునందుఁ బ్రస్తుతము రాజభాషగా నుండుటం
సియుఁ బలుభాషల నుండు వివిధవిషయసమన్వితములగు గ్రంథము
భాషలోనికిఁ బరివర్తింపఁబడి గ్రహింపఁదగియుండుటం జేసియు,
ండాంతరముల విశేషవ్యాప్తిఁ గాంచియుండుటంజేసియు, జాతీయ
ద్యాలయములందుఁగూడఁ గొంతవఱ కాంగ్లభాష నేర్పవలసియున్నది.
వున కోరువారి కాంగ్ల మాఱవతరగతినుండి ప్రారంభింపఁబడి
ఆంగ్లేయగ్రంథములందలి సారమును గ్రహింపఁగలశక్తి యొసఁగఁ
డుచున్నది.

## ఇతిహాసము - భూగోళము

"మానవుఁడు తెలిసికొనఁదగినవానిలో ముఖ్యమైనది మనుజునిఁ
రాన్వవిషయమే" అను సూక్తియం దెంతయు సత్యముకలదు. ఈ
క్యమునందలి మనుజశబ్దమునకు మనుష్యజాతియనియే భావము.
నుష్యజాతియొక్క పూర్వస్థితిని దెల్పునదే యితిహాసము. ప్రతి
తియొక్క భావిదశయుఁ బూర్వపరిస్థితులపై నాధారపడియుండును.
తకాలీనస్థితి పరిణామమే వర్తమానపరిస్థితిరూపమును దాల్చుచుండు
. కావున నౌన్నత్యమును బడయవలెనన్న బ్రతిజాతికిఁ దనపూర్వ
తిగతుల సంపూర్ణజ్ఞాన మవసరము. అట్టిజ్ఞానమును సమకూర్చు నితి
సముయొక్క ప్రాముఖ్యమును వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. ప్రతి
లునకు స్వదేశేతిహాసము తెలిసియుండవలెను. భారతవర్షేతిహాసా
యనము మనయువకులహృదయసీమల దేశాభిమానాంకురముల సుస్థి
ముగ నాటఁగలదు. కావున జాతీయవిద్యాలయములందు జాతీయేతి
స మవశ్యపఠనీయముగ నియమింపవలయును. ఈపాఠశాలయందు
న దేశముయొక్క సాంఘికార్థిక రాజకీయచరిత్రలు బాలురకుఁ బ్ర
నముగఁ గఱపఁబడుచున్నవి. దేశముయొక్క ప్రాచీనాధునాతన
స్థితిజ్ఞాన మొసంగుటయే కాక మహాపురుషుల జీవితచారిత్రములును,
జాతీయోద్యమచరిత్రయు, జాతీయమహాజన సభాసంవిధానమును
గూడ బోధింపఁబడుచున్నవి. మఱియు నన్యదేశీయవిషయములు
కూడ వలయునంతవఱకు బోధింపబడుచున్నవి. 7వ తరగతినుండి యర్థ
శాస్త్రము, రాజనీతిశాస్త్రము, నభిమానవిద్యలుగ నేర్చుకొన నిచ్ఛ
గలవారి కీపాఠశాలయం దవకాశము కలదు. భారతవర్షభూగోళములు
బ్రపంచభూగోళమునుగూడ నవీనపద్ధతుల ననుసరించి గఱపఁబడు
చున్నది.

## మతబోధ

మానవులు ధర్మవర్తనులై పుణ్యశీలురై జన్మసాఫల్యము నందఁ
గలుగుటకు దైవాంశసంభూతు లనఁదగు వివిధమతోద్ధారకులు తమ
జీవితములను ధారవోసి యాయాదేశకాలపాత్రానుసరణము లగు పరి
స్థితుల కనువగురీతిఁ జక్కని మతవిధు లేర్పఱిచి యున్నారు. స్వమతా
భిమానులై తమతమమతనియమములను భక్తిశ్రద్ధలతో నాచరించు ప్రజ
లేరాజ్యమున నుందురో యది శ్రీరామరాజ్యమువలె సౌఖ్యావహమై
యుండు ననుటకు సందియము లేదు. ప్రజలు తమమతవిశ్వాసములఁ
గోల్పోయి స్వేచ్ఛానుచరులై దుర్నీతిపరులై పాపభీతి లేక సంచరించు
నప్పు డారాజ్యమున జనించు నశాంతినిఁ బారద్రోలుటకు రాజశాసన
ములు కఠినదండనములు మొదలగు ప్రక్రియ లేవియుఁ బ్రయోజనకర
ములు కాఁజాలవు. అందుచే నైతికాధ్యాత్మికవిజ్ఞానప్రదము లగు
మతవిషయిక విద్యలను రాజ్యమున వెలయింపఁ జేయుట శాంతి
స్థాపకకార్యపరాయణు లగు భూపాలుర విధ్యుక్తధర్మము. తొల్లి
నైతికమతాదిక విద్యలయం దత్యున్నతి వహించి కర్మభూమియని
ప్రసిద్ధిచెందిన పవిత్రవంతమగు మన భరతఖండ మిప్పుడు విధివశమున
గర్హ్యమగు పరాధీనస్థితియం దుండుటచే పూజనీయములును బుణ్య
ప్రదములు నగు హిందూమహమ్మదీయాది మతము లన్నియుఁ గ్రమ
క్రమముగా దమ మహత్త్వములఁ గోల్పోయి నామమాత్రావశిష్ట
ములు కాఁబోవు దుస్థితికి వచ్చుచున్నవనుటయం దతిశయోక్తి యెంత
మాత్రము లేదు. మనకు స్వరాజ్యము లభింపఁగనే భారతీయు లెవరి
మతానుసారము వారు విజ్ఞానవంతులై నీతికోవిదులై ధర్మానురక్తులై
ధన్యసత్త్వములై వెలయఁగలుగుట కర్హములగు సాధనములు రాజశాస
నానుసారము, మనకుఁ దప్పక చేకుఱఁగలవు. అంతవఱకును బాలుర
హృత్క్షేత్రములందు మతవిశ్వాసబీజములు లెస్సఁగ నాటుకొనఁ జేసి
వారి భావ్యున్నతికిని, దేశసౌభాగ్యమునకును దోడ్పడుట యుపా
ధ్యాయుల ప్రథమకర్తవ్యమని చెప్పనొప్పును. కావున నీ విద్యాలయ
మునఁ జిన్నతరగతులందు సైతము మతబోధనమున కనువగు నార్మిక
థానిధులు ప్రధానపాఠ్యపుస్తకములుగ నేర్పఱచి సందరా
ముగ భారతవిజ్ఞానము, హిందూమతధర్మములు, నార్యస
ములు, సదాచారములు మొదలగునవి బాలురు గ్ర
నుత్సాహకరములగు సంభాషణముల మూలమున
బోధించుచున్నారు. మఱియు మూఁడవతరగతిఁ
ప్రత్యేకింపఁబడిన కాలమున విద్యార్థులకు స్వమత

లగు వివిధవిషయములు విపులముగ బోధింపఁబడుచున్నవి. ఇంతియకాక వివిధమతస్థాపకులును బుణ్యచరిత్రులు నగు మహమ్మదు, ఏసుక్రీస్తు, రామమోహనుఁడు, బుద్ధుఁడు మున్నగు మహనీయుల జీవితముల విద్యార్థులకుఁ జక్కఁగ విశదపఱిచి వారికిఁ బరమతసహిష్ణుత, భూతదయ, పరోపకారచింత, సర్వమానవసౌభ్రాతృత్వము మొదలగు సద్గుణము లలవడున ట్లుపాధ్యాయులు తగుశ్రద్ధఁ దీసికొనుచున్నారు. మఱియుఁ బవిత్రపర్వదినములందు విద్యార్థులు జాతీయోత్సవము లొనరించి యాత్మపారిశుద్ధ్యమును బొంది దైవమునందు మహాపురుషులందును గల తమ యవ్యాజానురాగమును సఫలపఱచుకొనుచున్నారు.

## ఆయుర్వేదము

మానవుల కన్నిటికంటె నవశ్యవాంఛనీయము లగు నాయురారోగ్యముల వృద్ధిపొందింపఁ జాలి వేదప్రాయ మననొప్పు నాయుర్వేదముకూడఁ బ్రస్తుతము కృశీభూతమై యుండుటచేఁ దదభివృద్ధి యత్యంతాభిలషణీయమై యున్నది. మఱియు దీనివలనఁ బరోపకారకమగు స్వతంత్రజీవనముకూడ లభించుననుట నిర్వివాదాంశము. కావున నిది కూడ నీ విద్యాలయమునఁ బ్రధానవృత్తివిద్యగ నేర్పఁబడుచున్నది. ఇం దాయుర్వేదము శాస్త్రమూలమునను బ్రత్యక్షమూలమునఁగూడ మూఁడువత్సరములలోఁ బూర్తిగ నేర్పుట కేర్పాటు గావింపఁబడి యున్నది. ఇచ్చటినుండి విద్యార్థు లఖిలభారతాయుర్వేద పరీక్షలకును, నాంధ్రాయుర్వేద పరీక్షలకును, డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారి ప్రత్యేకపరీక్షలకుఁగూడఁ బోయి కృతార్థులగుట కవకాశము గలదు. కేవలము గ్రంథములను జెప్పుటయే కాక వివిధములగు నౌషధములుగూడఁ దయారుచేయింపబడుచున్నవి. ఈ వత్సరమున 12 మంది విద్యార్థులనుఁ బైనుదహరింపఁబడిన కొన్ని పరీక్షలకుఁ బోఁజాలియున్నారు. ఈ శాఖ ఆయుర్వేదవిద్యాపీఠమంత్రి కవిరాజ శ్రీమాన్ ప్రతివాదిభయంకర కృష్ణమాచార్యులవారిశిక్షణమునఁ దృప్తికరముగ వృద్ధి నొందుచున్నది.

## నేత-నూలువడుకుట

గాంధిమహాత్ముని యాదేశములలోఁ బ్రధానస్థాన మలంకరించిన ఖద్దరునిర్మాణవృత్తి వృత్తులన్నింటిలో నగ్రగణ్యమై యున్నది. తత్ప్రోత్సాహకముగ నీపాఠశాలయందు బాలురందఱకు నూలువడుకుట నేర్పఁబడుచున్నది. కొందఱు విద్యార్థులు మిక్కిలి చురుకుగ నాణ్యమును మున్నగునూలు తీయఁజాలియున్నారు. ౩ వ తరగతినుండియు నేను వృత్తివిద్యగఁ గైకొన్న విద్యార్థులందఱు శిక్షకునిసహాయ మపేక్షింపకయే స్వయముగ నాసుపోయుట, కండెలుచుట్టుట, పడుగుతోడుట, సరిచేయుట, నేయుట మున్నగువస్త్రనిర్మాణకృత్యములన్నియు నిపుణతతో నిర్వర్తింపఁజాలియున్నారు. ౫ వ తరగతినుండియు బాలురు కండెలుచుట్టుట మొదలగు కొన్నివస్త్రనిర్మాణకృత్యములను నేర్చినవారును బాగుగ నేయఁగలిగియున్నారు. ఇంకను జిత్రవిచిత్రము లగుసంచులుకట్టుట, యద్దకము లగు పనులన్నియుఁ గొలఁదికాలములో నేర్పఁబడు...

## వడ్రము

కళలలో నొకటియై స్వతంత్రజీవనము ప్రసాదిం... ముకూడ నీపాఠశాలయందు నేర్పఁబడుచున్నది. వి... వాలు, పెట్టెలు, నవారుమగ్గములు మొదలగునవి త... చున్నారు.

## వాణిజ్యశాఖ

దేశమున కార్థికాభివృద్ధికరములగు వృత్తులలో వాణిజ్య ప్రధానమైనదగుటచే నీశాఖ విద్యాలయమున నేర్పాటుచేయఁబడిన... ఇచ్చటఁ గమర్షియల్ కరస్పాండెన్సు, బుక్కుకీపింగు, టైపురైటింగు, షార్టుహాండు మున్నగునవి చక్కఁగ నభ్యసించి విద్యార్థులు వ్యాపార కౌశలము నలవఱచుకొనుచున్నారు.

## చిత్రలేఖనము

మనోవికాసహేతుభూతములగు కళలలో నొక్కటియగు చిత్రలేఖనమునఁ బ్రారంభభాగము నేర్పఁబడుచున్నది. బాలురు సామాన్యముగ వృక్షములయు పశుపక్ష్యాదులయు రూపముల చిత్రింపగలిగియున్నారు. ఇంక నీశాఖ బాగుగ వృద్ధిపొందు నవకాశములు కలవు

## వ్యాయామము

“శరీర మాద్యం ఖలు ధర్మసాధన” మనునట్లు ధర్మనిర్వహణమునకు శరీరధారణపోషణములే ముఖ్యములై యున్నవి. కాన వాని నభివృద్ధినొందించు వ్యాయామము మనుజున కత్యావశ్యకము. కాన బుద్ధిబలముతోఁబాటు విద్యార్థులకు దేహబలముకూడ నొసంగుబాధ్యత జాతీయవిద్యాలయములపైనున్నది. అందుచే జాతీయపద్ధతుల ననుసరించి యీవిద్యాలయమున బాలురకు వ్యాయామ మొసంగబడుచున్న... ఇం దెక్కుడభిమానముగల బాలురకు సాము కుస్తీ మొదలగునవి ని...ణులగు నొకయుపాధ్యాయుని యాజమాన్యమున మిక్కిలి చక్కఁగ నేర్పఁబడుచున్నవి. ఈసంచికయందు పత్రాంతరమునఁ జిత్రింపఁబడిన వ్యాయామవిద్యార్థులదృశ్యమే యీవిషయమును విదితము చేయఁగలదు.

## విద్యార్థిసంఘము

విద్యార్థులవక్తృత్వమును, విమర్శనశక్తియు, రచనాసామర్థ్యమును, విషయపరిజ్ఞానమును, భావప్రకటనాకౌశల్యమును బెంపొందించుటకై విద్యార్థిసంఘ మొకటి “ఆంధ్రసాహిత్యచర్చాసంఘ” మను పేర నెలకొల్పఁబడినది. ఇందు మత సాంఘిక రాజకీయవిషయములు గూర్చి ప్రతివారము నున్నతతరగతులవిద్యార్థులు విద్యాధికు లగువారి యాధిపత్యమున సభలు జరిపి చర్చించుకొనుచు ఫలము నొందఁగలుగుచున్నారు.

## రాత్రిపాఠశాల

నియమితకాలమునఁ బాఠశాలయందుమాత్రమే విద్య నేర్పవలసినబాధ్యత కలదని తలఁపక బాలుర కేరీతిని విద్య యారీతిని వివిధోపాయములఁ బ్రయత్నించుట యుపాధ్యుక్తధర్మము. ఉపాధ్యాయులు పగలు పాఠబోధనము శ్రమకంటె నాపాఠముల గట్టిపఱుచుటకై యెక్కువ రాత్రులందు సైతము సమక్షమున బాలురచే శ్రద్ధగఁ జదివించుట యావశ్యకము. కావున నీవిద్యాలయమునఁ గొంద ఱుపాధ్యాయులు తరగతులందు వెనుబడియున్నవిద్యార్థులను రాత్రులయందు నియమముగ రప్పించి వారిచే శ్రద్ధగఁ బాఠములఁ జదివించి యవసరములగు విషయముల బోధించుచున్నారు. మఱియు వేసవనుగూడ సకాలమునకు విద్యార్థులనందఱిని మేల్కొలిపి విద్యాపఠనము, వ్యాయామము, స్నానాదికృత్యములు నొనరింపఁ జేసి సదభ్యాసము, క్రమశిక్షణము, నారోగ్యము బాలుర కలవడఁజేయుచున్నారు. ఇంతియ కాక గురుశిష్య నిరంతరసాంగత్యమువలని లాభములుకూడ విద్యార్థులు పొందఁగలుగుచున్నారు.

## ముగింపు

ఈవిధముగ శ్రీగాంధీయాంధ్రజాతీయమహావిద్యాలయము సక్రమాభివృద్ధిఁ గాంచుచు దేశోపకారకులును, బవిత్రజీవులును, త్యాగశీలురు నగు విద్యార్థిబృందమును భారతదేశోద్ధరణమునకై సమర్పఁ గలిగి జాతీయవిద్యాభిమానుల మానసములఁ దనవంకకుఁ ద్రిప్పుకొనఁ జాలియున్నది. "శ్లో. దుర్జనః పరిహర్తవ్యో విద్యయాలంకృతోఽపి సన్, మణినా భూషిత స్సర్పః కి మసౌ న భయంకరః" అనుసూక్తి ననుసరించి యీవిద్యాలయము విద్యార్థులకు సత్ప్రవర్తన మలవఱచుటయే ముఖ్యాదర్శముగ గ్రహించినది. ఇట్టి విద్యాలయములే దేశాభివృద్ధికి హేతుభూతములై యుండుటం జేసి వీనిని బాగుగ వ్యాప్తిఁ బొందించి పోషింపవలసినబాధ్యత ధనాఢ్యులును, ధర్మశీలురు నగు దేశీయులపై నున్నది. కావున నట్టిదేశీయులు గొఱవడియున్న సంగీతము, శిల్పము, కమ్మరము మొదలగు కళలుగూడ నీవిద్యాలయమున నెలకొల్పుటకుఁ దగినతోడ్పాటు నొసంగి శ్రీగాంధిమహాత్ముని పేర నలరారు నీమహావిద్యాలయము నన్వర్థసంజ్ఞికముగ నొనరించి భావిభారతసంతతి కృతజ్ఞతకుఁ బాత్రులై కృతార్థత నొందుదురుగాక! ఆంధ్రదేశమున నచ్చటచ్చటఁ గొన్ని జాతీయవిద్యాలయములు స్థాపింపఁబడియున్నవి. కాని వానిఁ జాలభాగము దనసహాయాభావముచేఁ గృశీభూతములై నామావశిష్టములుగ నున్నవి. అట్టివానికిఁ దగినసహాయ మింతవఱకు లభింపకుండుట మిక్కిలి విచారకరము. ఇట్టి ప్రజాహితసంస్థలు ప్రస్తుతము ప్రజాపోషణైకజీవితములే యగుట నింకనైన దేశీయులు తదభివృద్ధిమార్గముల నన్వేషించుపట్లఁ గాలహరణ మొనరింపకుందురని నమ్ముచున్నాము. మఱియు నవశిష్టములగువిద్యాలయములైన విద్యావిధానావలంబనమువను, బఠనీయగ్రంథాది నిర్ణయంబునను బరస్పరసమాలోచనముల వర్తించుచు సుస్థాపితమగు నొకయాంధ్రజాతీయ విశ్వవిద్యాలయము యొక్క యాజమాన్యమున బాగుగఁ బనిచేసి యశంబు గాంచునట్లొనరించుటకు జాతీయవిద్యాభిమానులగు విద్వన్మణులు సత్వరముగఁ గడంగుట యావశ్యకము. దేశభక్తుల కమితానందదాయక మగునట్లు శ్రీగాంధిమహాత్ముఁ డెరవాడస్వరాజ్యాశ్రమమం దొనర్చుతపము ముగించి మగుడఁ దనమానవాతీతసామర్థ్యములను గ్రియారూపమున వెల్లడింప నుత్సాహియై యేతెంచెను గావున జాతీయవిద్యాలయములు సర్వాంగసౌష్ఠవముతో నలరారుచు మహోన్నతస్థితిని దప్పక పడయఁగలవనియు నచిరకాలములో నీ విద్యాలయ మాంధ్రదేశ జాతీయవిశ్వవిద్యాలయముగ నొనరింపఁబడి తన విధ్యుక్తధర్మమును సక్రమముగ నాచరించి ధన్యత నొందునని విశ్వసించుచుఁ దచ్ఛుభసమయప్రాప్తిఁ జేకూర్పఁ బరమేశ్వరుని మనసారఁ బ్రార్థించుచున్నారము.

"శ్లో. స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు."

Andhra Young Men's Association, Second Anniversary, Kharagpur



ఆంధ్ర యువజనసంఘము; ద్వితీయవార్షికోత్సవము, ఖరగపుర

Sree Krishna Devarayalu's Andhra Bhasha Nilayam, Hyderabad




శ్రీ కృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయము, హైదరాబాదు

Teachers of the Gandhi National School, Ellore, with Acharya Gidwani



శ్రీ గాంధి జాతీయవిద్యాలయోపాధ్యాయులు, ఏలూరు, శ్రీయుత ఆచార్య గిద్వానిగారు

# ఆనందము

"ఆనందో బ్రహ్మ"

పొక్కులూరి లక్ష్మీనారాయణ గారు

ఆనంద మనేక విధములు. అందు ముఖ్యము లగు కొన్నిటిని మాత్ర మిచ్చట వివరింపఁ బ్రయత్నింతును. భౌతికానందమునకు వాక్పాణిపాదపాయూపస్థలును, త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములును కేంద్రస్థానములు. ఒక్కొక్కఁడు చక్కఁగ నుపన్యసించి సంతసించును. వేఱొకఁడు తన గానమాధురికి తానే యానందాంబుధి నోలలాడును. శిల్పశాస్త్రనిపుణుఁ డగు మఱొకఁడు స్వీయకరప్రజ్ఞావిశేషంబున కలరును. ఒకతె యంచనడల మించురీతి నడచుచు తనయానమునకు తానే యానందించును. చల్లనిపిల్లగాడ్పులు మేన సోఁకిన హాయి నొందనివా రుండరు. గానమాధురీరసాస్వాదనంబు సమస్త ప్రాణికోటికిని కర్ణపేయంబు. షడ్రసోపేతములగు పదార్థముల భుజించుచు మానవులు రసనాసంతుష్టి నెందుదురు. గులాబివంటిపుష్పరాజ మెట్టివాని కైన ఘ్రాణేంద్రియానందముఁ గూర్చును. నాట్యము, గానము, కవిత్వము, శిల్పము మొదలగు సకలకళాకౌశలంబువలనఁ గలిగిన యానందమున కీద శేంద్రియములును జన్మస్థానములు. ఇంద్రియసుఖమునకును మనసునకును సంబంధమున్నను మనసువలనఁ బ్రత్యేక మానందింపఁగలవిషయములు గొన్నిగలవు. అందు ఊహ (Imagination) శాస్త్రము (Science)ను ముఖ్యములు. మనము కన్నులు మూసికొని యింద్రియాతీతములగు విషయములను భావనాప్రపంచమునఁ గల్పించుకొనుచు నందలివైచిత్ర్యములకు అద్భుతానందమును బొందుట మనయనుభవములోనిదే. స్వప్నావస్థయందలి సంతోషకరములగు ప్రదర్శనము లిట్టివే. అట్టియూహాశక్తి సక్రమమార్గమున నభివృద్ధి నొందెనేని నేకాగ్రచిత్తతయు దానివలనఁ గలుగు ఫలితములును సుసాధ్యము లగును. శాస్త్రజ్ఞానవిషయమున మనసునకుఁ గలుగునానంద మది యిం వారి కెల్లరకును విశదమే. మానవునియొక్క జ్ఞానసంపత్తి తైలధారాతుల్యంబై నిరంతరాయమాన ప్రవాహంబునఁ బ్రతిబింబించుచు మున్నుఁ జేర్కొనఁబడినయానందముల నతిత్యాగము, జాలి, దయ, క్రౌర్యము, రాగము, ద్వేషము మున్నగు సుగుణదుర్గుణములు నుద్భవించును. భౌతికానందముకంటె మానసికానందము మృదుతరమున్ను, కష్టసాధ్యమును, అల్పమనస్కుల కతీతమును, చిరస్థాయియు నగుచున్నది.

భౌతికానందము శరీరధారుల కెల్లరకు ననుభసాధ్యము. మానసికానందము జ్ఞానవంతులకు మాత్ర మనుభవైక వేద్యము. కాని రెండును వినశ్వరములే. అట్టి యానందానుభవానంతరమునఁ గలుగునది తత్ప్రతికూలమగుదుఃఖమే. కాని శివయానందము సుఖదుఃఖసమ్మిళనముగాని ప్రత్యేకసుఖము కానేరదు. అట్లయ్యు ధీమంతులగువా రెందఱెందరో భౌతికమానసికానందలోలురై దుఃఖరూపమగు శాశ్వతబ్రహ్మానందమును బొందఁ బ్రయత్నింపకున్నారు.

ఇంద్రియములకంటెను ఇంద్రియకేంద్రస్థాన మగు మనసుకంటెను విజ్ఞానఖని యై విలసిల్లు నాత్మపదార్థము దివ్యమై, పిపీలికాదిసమస్తజీవరాసులయందును, ప్రకృతి సంసర్గమువలన తమోగుణాచ్ఛాదితమై "మసిపాతఁ గట్టిన మాణిక్యముపగిది" నిజరూపసంపదలను దాత్కాలికముగఁ గోల్పోయి నివృత్తిమార్గాన్వేషణంబుఁ గావించుచున్నది. ఆత్మానందముకొఱ కనేకజన్మముల నెత్తుచున్నది. ప్రకృతి కర్మబద్ధము గదా! ఆత్మ విజ్ఞానమయమును ఆనందమయము నని చెప్పఁబడియున్నది. ఆత్మానందమునకుఁ బ్రథమమున మనోబుద్ధీంద్రియములు చక్కఁ

యాపరికరములన్నియు మానవుని యాత్మజిజ్ఞా
సకు మరల్చి శాశ్వతానందమునకు మార్గముఁ
జూపు.

క్రోధాదులఁ ద్యజించి సర్వభూతసమత్వమను
ం దనకును నిఖిలభూతములకును గల మాయా
నిజమగునైక్యమును గుర్తించినజిజ్ఞాసు వీజన్మ
ముక్తుఁడై ఐహికము లగు ధనధాన్యాదిసంప
రూపశోభావిశేషములును లేకున్నను బ్రహ్మ
రసైకచిత్తుఁడై తన్మయత్వము నొంది తన్నుఁ దాఁ
దెలిసికొని విజ్ఞాననిధియై నిరంతరానందమున నోలలాడు
చుండును. "నకర్మణా న ప్రజయా ధనేనా త్యాగే నైకే
నామృతత్వ మానసుః" అనునమృతత్వమును బొందును.
అట్టిస్థితియందే ప్రాణిదేహత్యాగమునందునో దానికిని
సచ్చిదానందస్వరూపుఁడగుపరమాత్మకు నభేదము సిద్ధిం
చును. దాన ననేకజన్మాంతరసంసారకారాగారబద్ధుఁడగు
జీవునకు శృంఖలావిమోచనమును, శాశ్వతమగు బ్రహ్మా
నందమును గలుగును. ఈ యానందముమాత్ర మనం
తము. సంపూర్ణదుఃఖరాహిత్యము. దీనికొఱకే హంస
లును, పరమహంసలును, కర్మయోగులును, భక్తులును
నిశ్చయముగ కన్నులయెదుటనే దుష్ఫలముల నిచ్చెడి
దుర్గుణవర్గమును, దుర్మార్గసంసర్గమును ద్యజించి పరమ
స్వతంత్రులై పరమాత్మస్వరూపులును, పరమాత్మయు
నై బ్రహ్మానందము నొందుచున్నారు. ప్రథమమునఁ
జేర్కొనఁబడిన యానందము లీబ్రహ్మానందమునెదుట
ప్రచండ మగు భానుతేజమునెదుట మిణుఁగురుఁబురువుల
వంటివి. మానవుఁడు సర్వకాలసర్వావస్థలయం దట్టియ
ప్రతిమానమగు బ్రహ్మానంద మొందుటకు తాత్కాలి
కానందములఁ ద్యజించుట పరమకర్తవ్యము.

# బ్రహ్మచర్యము

## కాట్రావులపల్లి రామమూర్తి గారు

అరుణోదయస్నాన మపురూపమైపోయె, సంధ్యానమస్కృతుల్ సన్నమయ్యె
నిత్యాగ్నిహోత్రంబు నీరుగారుచునుండె, బ్రహ్మయజ్ఞము పటాపంచలయ్యె
వేదపాఠక్రియల్ వికలమై చెడిపోయె, నాత్మవిచారణం బాగిపోయె
మౌంజియు నజినంబు మటుమాయమైపోయె, పాలాశదండంబు మూలఁ బడియె
తలఁప శృంగారరసపూరితంబులైన, నృత్తగీతవినోదప్రవృత్తితోడఁ
గాలమంతయు నూరక గడచుచుండె, బ్రహ్మచర్యమ! నీకింక బ్రదుకు గలదె?

సీ. ఆంజనేయునిఁ జేరి యసురులఁ బరిమార్చి, సీతను రాముతోఁ జేర్చినావు
గంగాసుతునిఁ జేరి కదనరంగమునందు, ఘనతరమగు కీర్తిఁ గాంచినావు
ద్రోణనందనుఁ జేరి రూఢప్రతిజ్ఞతోఁ, బాండవేయుల గోడుపఱచినావు
శుకయోగి జతఁగూడి శుద్ధసత్త్వమహిమ, జీవకోటికి బోధఁ జేసినావు
ఇట్టి శక్తి నీయందు నింకెంత కలదొ, పలుక వశమె? శేషునికైన నలువకైన
నిన్నుఁ గొల్చెడువారికి నిఖిలజగము, సారహీనంబుగద బ్రహ్మచర్యవ్రతమ!

# మనుచరిత్రము — స్ఖాలిత్యములు

యడ్లపాటి వేంకటసుబ్బారావు గారు

ఆంధ్రప్రబంధముల కెల్ల మనుచరిత్రము శిరోభూషణమని చెప్పుట అతిశయోక్తి కాదు. భావవికాసము, వర్ణనాపటుత్వము, మృదుపదలాలిత్యము, చిత్రకళానైపుణ్యము, సమయవిస్ఫూర్తి మొదలగునవి, పెద్దన కవితాకన్యకు అమూల్యభూషణములు. వీనిని గుఱించి నే నిప్పుడు వివరింపఁదలఁచుకొనలేదు. దుర్ముఖిసంవత్సరాది సంచికలో "మనుచరిత్రవిమర్శనము" క్రింద వివరించి యున్నాను. దుందుభినామసంవత్సర ఫాల్గుణ శు ౹౩ శనివారము సారస్వతానుబంధములో శ్రీయుత గాడేపల్లి అనంతరామమూర్తి పంతులుగారు మనుచరిత్రమున స్ఖాలిత్యములనుగుఱించి వ్రాయుటచేత నే నీవ్యాసము వ్రాయు ప్రసక్తి కలిగినది. వారే చివర "ఇట్లన్యోన్యవిరుద్ధములైన వ్రాతలుండుటకు కారణము అల్లసానిపెద్దనపొరపాటో లేక యీవిషయము ఒప్పులుగ సవరించుట కాధారము లేమైనఁగలవేమో తెలుపఁ జదువరులు ప్రార్థితులు" అని వ్రాసియున్నారు. అవి సమర్థనకు సాధ్యములే యని మనవి చేయుచు నా యభిప్రాయములను క్రింద వివరించుచున్నాను. వానిని పాఠకమహాశయులు పరిశీలింపఁ బ్రార్థితులు.

రామమూర్తిగారుకనఁబఱచినస్ఖాలిత్యములు పెద్దన శేముషీమహిమకు కొఱఁత నాపాదించుటకు మాఱుగ పెద్దన కవితాసామర్థ్యము అనుగుణపదప్రయోగశక్తి పాత్రమనోవ్యాపారములస్వభావలక్షణవ్యక్తీకరణము మొదలగు విషయము లెన్నియో తెలియుచున్నవి.

వారు స్ఖాలిత్యము లని కనఁబఱచినవి రెండు. అందులో మొదటిది ఆంధ్రలోకమునకు చిరపరిచయమై ఖండనప్రతిఖండనముల నిగ్గుదేరి స్థాయిభావము వహించియున్నది. ఆనందవారి మనుచరిత్ర వావిళ్లవారి మనుచరిత్ర పీఠికలు ఈవిషయమున పెద్దనపొరపడినట్లు తెలుపుచున్నవి. "కుతపకాలము" "మధ్యాహ్నము" ఈ వివాదాంశమునకు మూలకారణములు. కొందఱు పెద్దన కాలనిర్ణయము చేయుటలో పొరపడె ననుచున్నారు. ప్రవరుఁడు మఱునాఁ డుదయమున వెళ్లెనని కొంద ఱనుచున్నారు. సాయంసంధ్యావందనాదికృత్యము లొనరించు పాదప్రక్షాళనసమయమున గాని మఱునాఁడు అఘమర్షణస్నానసమయమున గాని పసరు కరుగకుండునా? కనుక ప్రవరుఁ డాదినముననే వెళ్లెనని కొంద ఱనుచున్నారు. సిద్ధుఁ డారాత్రి ప్రవరునింటనే యుండి మఱుదినమున పసరు పూసివెళ్లెనని కొందఱవాదము. కాని యీవాదమున కాధారము లేదు. సిద్ధుఁడు అప్పుడే వెళ్లినటులు స్పష్టముగా నున్నది. అట్లైన ఈవివాదాంశము తీరు టెట్లు? నాకొక అభిప్రాయము తోఁచుచున్నది. అది సమ్మతమైన కావచ్చును; కాకపోయిన పోవచ్చును. అదే సిద్ధాంతమని నేను సాహసించి చెప్పలేదు. కవిపదప్రయోగములచేతను ధ్వనిసాహాయ్యముచేతను నేనీదిగువ యభిప్రాయమును వెలిపుచ్చ సాహసించుచున్నాను. నీరు తగిలినంతమాత్రముచేత కరఁగిపోవక విశేషకాలము నీహారవారిసాహచర్యము కలిగిన కరఁగిపోయెడి పసరు లేమైననున్నవేమో యని నాతలంపు. సిద్ధుఁడు ప్రవరాఖ్యునిపాదములకు పూసిన పసరట్టిగుణము కలిగినదేమో యని తలఁచుచున్నాను. ఆపసరున కట్టిగుణమున్నటులు కొన్ని విషయములవల్ల స్ఫురించుచున్నది. అతిథిసత్కారములై భోజనములై, ప్రసంగము లగునప్పటికి మూఁడుజాములు గడచిపోయి యుండును. సిద్ధుఁడప్పుడు ప్రవరునిపాదములకు పసరుపూసెను. అప్పటికే వేళ యతిక్రమించినందునను సాయంకాలకృత్యములకు వేళ మైనందువలనను ప్రవరుఁ డాదినమున వెళ్లుటకు సంకల్పించి యుండుట సంభవింపదు. మఱునాఁ డుదయముననే వెళ్లనిశ్చయించియుండును. కావున పాదప్రక్షాళనసమయమున పాదలేపనము కరఁగిపోవునేమోయని సిద్ధుని యడుగకుండునా? అడిగియే యుండును. నీటివలన కరగునది కాదని సిద్ధుఁడు చెప్పియుండవచ్చును. తాను పుణ్యక్షేత్రముల సందర్శింపవలయుననిగదా ప్రవరుఁడు పాదలేపనము గ్రహించినది. పుణ్యక్షేత్రముల సందర్శించి గ్రుంకు లిడకుండ వచ్చునా? అది నీటివల్ల సులభముగా కరఁగిపోవునదే యైనయెడల అప్పుడు కాలికి పూయించుకొను

వసరు తీసికొని భద్రముచేసికొని యుండును. ...తునకు హిమాలయప్రాంతములకు వెళ్ల ...కనబడదు. "తీర్థయాత్రవలనర్గ ధన్యామరే" అని సిద్ధుని ప్రార్థించినాఁడు. ఈ క్రింది ...న కావలసినవి రెండు ముఖ్యవిషయములు వి.

...ధసత్త్వముల్ దెలియ మాయాద్వారకావంతికా
త్రిగయాప్రయాగములు నే సేవింప నుద్దండగం
డకవరాహవాహరిపు ఖడ్గవ్యాఘ్రము మి మ్మంచుఁ గొం
డను రాఁజెల్లునె బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్.

మాయా ద్వారక మున్నగు పుణ్యక్షేత్రములకు వెళ్లక ఈమంచుకొండ కొండులకు వచ్చితినా యని చింతిలుచున్నాఁడు. 'మంచుఁగొండకు' అను పదప్రయోగమును గమనింప పాఠకులు ప్రార్థితులు. దీనివలన ఒకవిషయము స్ఫురించుచున్నది. పుణ్యక్షేత్రముల దర్శించునపుడు పవిత్రజలస్నాన మొనర్చుట సహజము గనుక ప్రవరుఁ డావిధముగ చేసినను పాదలేపనము పోయెడిది కాదనియు 'మంచుఁగొండకు" వచ్చుటచేతనే కరఁగిపోయిన దనియు ధ్వనించుచున్నది. "బుద్ధిజాడ్యజనితోన్మాదుల్" అను పదప్రయోగముకూడ నీ యభిప్రాయమున కెడమిచ్చుచున్నది. తనకు బుద్ధిమాంద్యము కలిగినదని నిందించుకొనుచున్నాఁడు. నీహారవారిచే పాదలేపనము కరఁగిపోవునని తెలిసికూడ బుద్ధిమాంద్యముచే గలిగిన వెఱ్ఱివలన మంచుగొండకు వచ్చితి నని చింతించుచున్నాఁడు. దీనిని బట్టి నీహారవారిలో విశేషకాలము తిరిగిన కరగిపోవునని సిద్ధుఁడే ప్రవరాఖ్యునితో చెప్పినటులు స్ఫురించుచున్నది. ఈవిషయములను వివరించి చూడగా పెద్దన పొరపడలేదనియు ప్రవరాఖ్యుఁడు మఱుదినమున వెళ్లెననియు తిరిగి యింటికి వెళ్లఁదలఁచుకొనునప్పటికి "నలినీబాంధవభానుతప్తరవికాంతస్యందినీహారకందళ చూత్కారపరంపరల్ పయిపయిఁ మధ్యాహ్నముల్ దెల్పుట" నిజమేననియు, ఈ విషయములను పెద్దనమహాకవి ధ్వనిప్రాధాన్యమువలనను, అట్టి పదప్రయోగములవలనను పాఠకలోకము గ్రహించునటులు చమత్కారముగ దిద్దె ననియు మనవి చేయుచున్నాను.

ఇఁక రెండవ స్ఖాలిత్యమును గుఱించి విచారించెదను. వరూధిని ఒకచోట చావు లేనిదిగను మఱియొకచోట చావుగలదిగను కవి వర్ణించెనని దోషారోపణ చేసిరి. ప్రవరాఖ్యునిచే తిరస్కరింపఁబడి "మృతిలేనినాదు చెల్వింతయు శూన్యగేహమున కెత్తినదీపిక యయ్యెనక్కటా" అని విలపించినది. మాయాప్రవరాఖ్యుని చూచి "చావో యెక్కడొ నీయెడర్ బొడము వాంఛల్ భూసురగ్రామణీ" అని దీనాలాపము లాడినది. మాయాప్రవరాఖ్యుఁడు వెళ్లిపోఁదలఁచినపుడు "పంచత ప్రాపించి మీఁద పాపంబిడునో" యని భయపడినాఁడు. ఇవి అన్యోన్యవిరుద్ధములుగా పైపైని చూచువారికి కనఁబడుచుండుట వాస్తవము కాని కవిప్రతిభాశక్తి యిక్కడనే వెల్లడియగుచున్నది. ప్రథమమున తనకు చావులేదని పలికిన వరూధిని తత్త్వము వేఱు. తరువాత చావుగలదని పలికినవరూధినితత్త్వము వేఱు. తాను గంధర్వస్త్రీననియు అతిరూపలావణ్యవతి ననియు అహంభావసమన్వితురాలై ప్రవరాఖ్యుని వశపఱచుకొనగలుగుదానవని గర్వము వహించియుండెను. ప్రవరాఖ్యుఁడు విడనాడినపుడు దుఃఖములో ఆ యహంభావస్ఫురణముచేత తన యమరత్వమును నిందించుకొన్నది. ఈపట్టున కవికూడ అమానుషప్రవృత్తిసముగ్నుఁడై యుండెను. కనుక అట్లే వర్ణించెను. మాయాప్రవరాఖ్యుని దర్శనముతో వరూధినితత్త్వము మాఱినది. వరూధిని కతఁడు మాయాప్రవరాఖ్యుఁ డని తెలియుటచేఁ గాదు. ఆసంగతి యామెకు తెలియదు. నిజమైన ప్రవరుఁడనియే నమ్మినది. లభింపఁ డనుకొన్నవాఁడు మరల లభించుటయే చిత్తవృత్తి మార్పు చెందుటకుఁ గారణము. అదివఱకు వరూధిని కున్న అహంభావత్వము నశించినది. "ఇంతలు కన్నులుండ" అనుచు నర్మగర్భముగాఁ బలికినప్రౌఢతనము మాఱినది. తన అమరత్వమును విస్మరించినది. ప్రవరునివలె తానుగూడ మానవమనస్త్వము వహించినది. మానవప్రకృతిధోరణి ననుకరించినది. ఏవిధముగానైన ప్రవరునిమనసు కరఁగించి వానిని చేపట్టుటయే వరూధిని దృష్టి. కనుక ఏవిధముగా దీనాలాపము లాడిన వాని హృదయము కరఁగునో ఆవిధమును తలపోసినది. చావను కెత్తు వేసినది. అందుపైనైన వానికి దయకలుగదా యని ఆమె యాశ. మోహపరవశత్వమున నున్నపుడు విచక్షణాజ్ఞానశూన్యత కలుగుట సహజము. కనుక వరూధిని తన అమరత్వమును విస్మరించు టొకవింత గాదు. ఈమార్పు సహజప్రవృత్తి ననుసరించి యున్నది. మఱియొక విషయము. కవిమనోభావములు సహజపరిణామములను తాల్చుచు నుండును. విరక్తి కలిగినపుడు చావు

తెట్టుకొనుట స్త్రీజనస్వాభావికము. ప్రకృతిలక్షణముగ సహజపరిస్థితులను లోకమునకు తెలియఁజేయుట కవి దృష్టియై యున్నది. లోకస్వభావమునకు భిన్నముగ కవి ప్రవర్తింపఁజాలఁడు. లోకమును చిత్రించుటయే కవిముఖ్యోద్దేశము. కనుక ఈ సందర్భమున వరూథినిమనోభావములను చిత్రించునపుడు కవిదృష్టిలో మర్త్యవరూథినియే ప్రత్యక్షమగుచున్నది గాని అమర్త్య వరూథిని కాదు. వరూథిని చచ్చి తనకు పాపము చేకూర్చునేమో యని మాయాప్రవరాఖ్యుఁడు భయపడుట కూడ నిట్టిదే. ఇక్కడకూడ కవిదృష్టి లోకసామాన్యపద్ధతి మీఁదనే యున్నది.

పెద్దనగారి బుద్ధివైశద్యము మఱియొకచోట కాన్పించుచున్నది. ప్రవరాఖ్యుని సద్గుణములను వర్ణించుచు "సాలగ్రామము మున్నగాఁ గొనఁడు" అని చెప్పి మాయాప్రవరాఖ్యుఁడు వరూథినితో "గ్రహణసంక్రమణాదుల రాచనగరు గాసువీసంబు వెడలమి గ్రాసమునకు" అని చెప్పునటులు కవి చేసియున్నాఁడు. దీనిని అన్యోన్యవిరుద్ధ గుణవర్ణనమని కొందఱు అధిక్షేపించియున్నారు. ప్రవరాఖ్య వరూథినీపాత్రములను కడునేర్పుతో దిద్దిన పెద్దన కీస్వల్ప దోషారోపణచేయుట వింతగానున్నది. బాగుగ చూచిన ఇక్కడఁగూడ పెద్దనప్రతిభ వెల్లడి. ప్రవరాఖ్యుఁడు సాలగ్రామదానము సైఁ[illegible] పాఠకులకు తెలియును గాని వరూథినికి తెలి నేవిధముచేనైన సమ్మతపఱచి వెళ్లవలెనని వరునియుద్దేశము. తాను వరూథినిని విడువ కారణములను చెప్పుచున్నాఁడు. వరూథినికి ఏమాత్రము అవకాశము చిక్కనను తంటావ[illegible] నాధారముగఁ గొని వాని నుండునటులు నిర్బఁ[illegible] అందుచే కవి మాయాప్రవరునిచే రాచనగరునుండి వీసముకూడ వచ్చుట లేదని చెప్పించినాఁడు. మాయ ప్రవరుఁ డీవిషయము తెలుప లేదని యనుకొందము. అప్పుడామె మీతల్లిదండ్రులకు రాచవారిసాయ ముండును లెమ్ము; నీవిక్కడనే యుండు మనిన దిక్కేది? కావున ప్రవరుని తల్లిదండ్రుల కేవిధమైన యాధారము లేనట్లు వరూథినికి నచ్చునట్లు చేయుటకు కవి ఈవిషయమును గూడ మాయాప్రవరాఖ్యునిచే చెప్పించెనేగాని అన్యోన్యవిరుద్ధగుణవర్ణన చేయవలెనని కాదు. ఈసందర్భము పెద్దనగారి ప్రతిభాశక్తి దూరదృష్టి నేర్పు వెల్లడియగుట లేదా?

# పరిణామగీతి

## తురగా వేంకటరామయ్యగారు

చేరితి నాశావర్వత - శృంగమ్ముల విహరింపఁగఁ
  జూచితి మానవలోకము - సొలపులఁజూపుల లేతగఁ

పువ్వులవాసన లానితి - నవ్వుల కోటల మెలఁగితిఁ
  గేరుచుఁ దేనియఁ గ్రోలుచు - మీఱితి దైవికధర్మము

కోకిలపాటలతీవల - సాయమ్మున గంధర్వులఁ
  గలసియు వీణియతంతుల - గానము మ్రోయించి తిఱి

తెలిమబ్బుల తెరులపై - నలరుచుఁ గరువలిపీథుల
  విహరింపుచు నాబలమే - వెలలేనిదిగాఁ దలఁపఁగ

పరమ్మైను గాలపురుషుఁ - డే లెడుచలిగాడ్పుబలము
  సాగెఁ దేరులు నంబరము పీఁగెఁ గండ్లఁ దిరిగె

గూలితి నెకపెట్టున సుడి-గుండమ్ములతండమ్ముల
  బడలెమేను సడలెమనసు-దడఁబడుచుంటిని దేవా!

ఏలెదవో? మొసళులపెను-నోళులలో విసరెదవో?
  నీదే భారము దేవా! నిగమాలకుఁ దలపూవా!

చూపుండ్రోవలదీపము - జూపింపుము పెనుఁజీకటి
  తెరలనడుమ మానవుఁ డెటు-దీయును ఆనందపథము

పాడెదఁ గల్యాణగీతి - భరతమునకుఁ దగినరీతి
  త్రిజగన్మోహనగానా - తీత నన్ను దరిఁ జేర్పఁగ

రామా! రమ్మిఁక! వేంకట - రామమనోసరసిజాత
  కవితాసుధఁ గ్రోలి ధన్యుఁ-గావింపఁగ నీకేసరి

చంపితివా? హంతకుఁడవు - సాకితివా పాలకుఁడవు
  కీర్తియు నపకీర్తియు నీ - కే వదలితి రఘున్నృపతీ.

# అథర్వణ వేదము

ఎస్. కే వేంకటేశం గారు, ఎం. ఏ., ఎల్. టి.

పున అనేకవేదములు ఉండినవనియు వానిని
కృతము ఖిలములని వాడుచున్నా మనునది
యము. యజ్ఞయాగాదులు చేయునపుడు
మంత్రములలో ఖిలమంత్రములను దండా
ముగ చెప్పుట వాడుకలో నున్నది. ప్రయోగము
ను నిర్ణయించిన సూత్రకారులుకూడ నామంత్రము
ను వేదమంత్రములుగనే యెత్తి వాడియున్నారు. ఇట్లు
అనేకవేదములు ఉండినవని తెలియగా "ఋగ్యజుస్సా
మాథర్వాణి చ్ఛందాంసి" అని నాల్గువేదములు
మాత్రమే యెచ్చటను ప్రశంసింపబడియున్నవి. వానిలో
త్రయీ! అని ఋగ్యజుస్సామములను మాత్రము ప్రాము
ఖ్యముగా నెత్తి వాడియున్నారు. మన్వాదులు ఈ
మూండువేదములను నెక్కువగ ప్రశంసించియున్నారు.
యునను గాయత్రికి నాలుగుపాదము లున్నవని వాడు
కలో నున్నది. వానిలో నాలుగవపాదము మాత్రము
సాధారణముగా నుచ్చరించుట అలవాటులో తప్పిపోయి
నది. బ్రహ్మయజ్ఞమును ప్రశంసించు కాలమునందు
యజుర్వేదారణ్యకములో నాలుగువేదములను గూడ
ప్రతిదినము పఠింపవలయునని చెప్పియున్నది. అథర్వణ
వేదములో అన్నికర్మలకు మూలాధారముగాను, చాల
సారాంశముగాను నుండు నొకమంత్రమును మాత్రము
బ్రహ్మయజ్ఞమునందు పఠియించుచున్నాము. ఈ మంత్ర
పఠనము, గాయత్రికి నాలుగవపాదము ఉన్నదనే వాడు
కయు, నాలుగు వేదములు ఉన్నవని శాస్త్రములలో విని
పించుటయు, వీనివలననే అథర్వణవేదము ఒకవేదమని
నమ్మియున్నాము. అంతకు మించి ఆవేద మెట్టిదో, దాని
లోని మంత్రములు ఏ కర్మలయం దుపయోగపడునో
వాని ఫలాఫలము లెవ్వియో దానికి వేదమనుపేరు
తగునో తగదో అను, ఈ విషయములనుగురించి మన
మేమియు, విచారణ చేయకనే, ఇటీవల పాశ్చాత్యపండి
తులు వ్యాకరణశాస్త్రమును గురువుగా నమ్మి కేవల
సంస్కృతజ్ఞానముమాత్రము గల పండితుల సాహాయ్య
మునుమాత్రము గైకొని అథర్వణవేద మంత్రములకు
అర్థమును వ్రాయబూని, కొన్నిచోట్ల సరియైన అర్థ
ములు మరికొన్నిచోట్ల యపార్థములు వ్రాసి, వారికే
అర్థముకాని మరి కొన్ని తావుల, ఆ మంత్రములు
మిస్టేక్ (Mistake) అనగా ఏమిటో అవి అని వదలివేసి
నారు. ఈ ప్రకారముగా అర్థములు చేసి, వానితో
తృప్తిబొందక; ఈ అథర్వణవేదమంత్రములు క్షుద్ర
మంత్రము లనియు, నీచమైన వృత్తిగల మంత్రవేత్తలు
ఉపయోగింపవలసినమంత్రము లనియు చెప్పియున్నారు.
శూన్యము, ద్రోహధర్మము ఇటువంటివానికి ఇంగ్లీషులో
బ్లాక్ ఆర్ట్స్ (Black Arts) అనిపేరు. ఈ మంత్రములు
బహుశః ఉపయోగపడునటులు వీబరు (Weber) మ్యాక్
డానల్ (Macdonall) ప్రభృతులు వ్రాసియున్నారు.
ఈ వేదము నవీనమైనదనియు, కడపటిదనియు, ఎవరో
కొందరవలంబించి పూర్తిగా పాటింపలేక పోయి
రనియు, పూర్ణముగ వేదమువలె గ్రాహ్యము గాదనియు
వచించియున్నారు. వారి వాక్యములు వేదవాక్యముల
వలె కేవల పాశ్చాత్యవిద్యావలంబులైన నవనాగరికు
లైన మన చరిత్రవేత్తలుగూడ పూర్ణముగ నమ్మి,
బాలుర పఠనీయగ్రంథములైన హిందూదేశచరిత్రముల
యందును తదితరస్థలములందును ప్రకటించుచున్నారు.
వీరిలో కొందఱు పాశ్చాత్యులు మనవారుగూడ వేదార్థ
ములు వ్రాయునప్పుడు విద్యారణ్యులయిన శాయణాచా
ర్యుల వారు వేదసంస్కృతమును కొన్నిచోట్ల అర్థ
ము చేయజాలకపోయిరని యనుకొని తలచి వారిభాష్య
మునకు ప్రతిభాష్యము వ్రాయబూనిరి. వ్రాయనిండు;
వీరే నవీనవిద్యారణ్యులని యనుకొనెదము.

మఱియు అథర్వణవేదము బ్రహ్మవేదమని
బడియున్నది. ఏదో మూడు వేదములను హోత, అధ్వర్యు
ఉద్గాత వీరుముగ్గురు ఆక్రమించుకొనిన దిచూచి, ఈ వేద
మును బ్రహ్మకు వేదము లేకపోయనే యని చింతిం
అథర్వణవేదమునకు బ్రహ్మవేదమని పేరిడిరట. ఇట్లు
గూడ పండితులు వ్రాసియున్నారు. శాయణాచార్యు
అథర్వణవేదభాష్యములో, ఈ వేదమునకు అథ

రన్నే పేరిట్లు గలిగినదని ప్రశంసించి ఇది ఒకే వేదమని
యు, ఇరువది కాండలచే సంపన్నమైనదనియు వ్రాసి,
"అతఏవ సర్వసారత్వాత్ అయం వేదః శ్రేష్ఠః" అని చెప్పు
చు "శ్రేష్ఠో హి వేద స్తపథి జాతో బ్రహ్మజ్ఞానాం హృ
దయే సంబభూవ" "ఏత ద్వై భూయిష్ఠం బ్రహ్మ యద్
భృగ్వంగిరసః యేంగిరసః, సరసః, విథర్వాణ స్తద్
భేషజం యద్ భేసజం త దమృతం య దమృతం
తద్బ్రహ్మ" అని గోపథబ్రాహ్మణమునుండి యుదహరించి
"ఏవం సారభూత బ్రహ్మాత్మకత్వాత్ బ్రహ్మకర్తవ్య పతి
పాదనాచ్చ అయం బ్రహ్మ వేద ఇత్యాఖ్యాయతే"
అనివ్రాసిరి. కనుక నాలుగు వేదములలో అధర్వణ వేదము
బ్రహ్మాత్మకమైనదియు, బ్రహ్మకర్తవ్యప్రతిపాదన మైన
దియు గనుక బ్రహ్మవేదమని పేరు గలిగినదని చెప్పిరి.
గోపథబ్రాహ్మణములో "చత్వారోవ ఇమే వేదా ఋగ్వే
దో యజుర్వేదః సామవేదో బ్రహ్మవేదః" అనియే
వ్రాసిరి. ఈ బ్రహ్మవేదము సర్వభైషజ్యమనియు, అమృత
తుల్యమనియు సిద్ధమంత్రమనియుఁ గూడ తెలియుచున్నది.
"న తిథిర్న చ నక్షత్రం న గ్రహో న చ చంద్రమాః ।
అధర్వమంత్ర సంప్రాప్త్యా సర్వసిద్ధి ర్భవిష్యతి" అని ఉదాహ
రించినారు. మఱియు స్కాందములో కమలాలయఖండ
మునుండి ఈ అధర్వణమంత్రముల జపమాత్రమున నభి
మతఫలములు సాధితమగుచున్నవనియు చూపియున్నారు.

అధర్వణ వేదము ఇందువలన శ్రేష్ఠమైన వేద మని
యు అధర్వణమంత్రములు క్షుద్రమంత్రములు గాక
సర్వసిద్ధమంత్రములనియు తెలిసినది. ఇంతేగాక "తదేవం
ఆముష్మికఫలేషు దర్శపూర్ణమాసాదిషు అయనాంతేషు
త్రయీవిహితకర్మసు అపేక్షితం బ్రహ్మత్వం అనన్యలభ్య
త్వాత్ అధర్వవేదైక సమధిగమ్యం ఇతిస్థితం తద్వదేవ
ఐహికఫలాని శాంతిక పౌష్టికాని కర్మాణి రాజకర్మాణి
అపరిమితఫలాని తులాపురుషాదిమహాదానాని చ అధర్వ
వేదఏవ ప్రతిపాదితాని, పౌరోహిత్యం చ అధర్వవేద
నైవకార్యం" అనిసాయణాచార్యులు విస్తరముగా వ్రాసి
యున్నారు. శాస్త్రోక్తప్రమాణముగూడ నిందులకు వెల్ల
డిచియున్నారు. ఇందువలన మిగతమూడు వేదములు
ఆముష్మికఫలములను ఎదురుచూచుచున్న వనియు అట్టి
ఆముష్మికఫలమును గోరుచు క్రతువులను జేయువారికి
ఐహికఫలముల నిచ్చుటకు అధర్వణవేదము ముఖ్య
ని గ్రంథముద్వారా ఏర్పడినది.

కేవలము ధర్మమార్గమును
అధర్వణవేదకర్మలను చేయఁదగిన వారని
ప్రయోగగ్రంథమైన కౌశికసూత్రముల
పద్ధతిలో చెప్పియుండు విషయములవలన
చున్నది. కౌశికసూత్రప్రారంభములో
న వలంబించు మనము దేవపితృకార్యమ
చరింపవలయు నని ప్రథమములో చెప్పి,
మాసక్రతువులు అధర్వణవేదమంత్రములత
క్రమమును సవిస్తారముగా సూత్రములలో వ్రాసి
యజ్ఞసంభవమైన యగ్నిని ముందుంచుకొని సక
కర్మలను చేయుటకు ప్రయోగసూత్రములను చెప్పి
యున్నారు. కేశవులు ఇట్లు ప్రారంభింతురు. "సంహి
తాధ్యయనానంతరం విధే రధికారః సంహితావిధిం
వక్ష్యామః శాంతికపౌష్టికాభిచారికాద్భుతాదీనికర్మాణి
సంహితావిధౌ ఉక్తాని" అని ప్రారంభించుచు త్రివి
ధాని కర్మాణి విధికర్మాణి అవిధికర్మాణి ఉచ్ఛ్రికర్మాణి
త్రిః ప్రమాణకో విధిః ప్రత్యక్షం అనుమానం శ
చేతి" అని ఈ ప్రకారముగా వేదకర్మలకు ధర్మమార్గవి
ననుసరించువిధమున విధులను సూచించియున్నారు.
మరియొకచోట భైషజ్యకాండమునందు అన్నసంబం
ధముగాని కేవలకర్మసంబంధమైన వ్యాధులకు ఈ వేదమం
త్రములు విధింపబడినవని చెప్పియున్నారు. "తత్ర ద్వి
విధా వ్యాధయః ఆహారనిమిత్తా అన్యజననపాపనిమిత్తా
శ్చ, తత్ర ఆహారనిమిత్తేషు చరక బాహటసుశ్రుతేషు వ్యా
ధ్యుపశమనంభవతి అశుభనిమిత్తేషు అధర్వవేదవిహితేషు
శాంతికేషు వ్యాధ్యుపశమనం భవతి" అని స్పష్టముగా
వ్రాసియుండుటవలన ఈ మంత్రములు శూన్యములు
పెట్టి విరోధులను చంపుటకును, క్షుద్రకర్మలతో అధ
ర్మమైన యాభిచారిక ప్రయోగములు చేయుటకును,
ఉపయోగింపబడలేదనియు, అట్లు ఉపయోగించుట
ఈ వేదముయొక్క ఉద్దేశ్యము గాదనియు స్పష్టముగా
దెలియుచున్నది. ఇట్లే కొన్ని కర్మవ్యాధులకు ఈ
మంత్రములను ఉపయోగించగా దుష్టఫలములను
గూడ చూచినాడను. మఱియు జాతకర్మ ఆయుష్యకర్మ,
నిష్క్రమణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయ
నము, వివాహము, గర్భాధానము, పుంసవనము, సీమం
తము, ఇట్టి గృహ్యసంస్కారములన్నిటికి నీ వేదమునందు
అన్య వేదాపేక్ష లేకయే మంత్రములు ప్రయోగములు

క శాంతికర్మ పౌష్టికకర్మ రాజకర్మ వీని
ను ప్రయోగించువిధము లన్నియు చాల
ని చెప్ప నలవిగాదు. ఇప్పుడు మనము
శాస్త్రము తంత్రశాస్త్రము అని
ప్రయోగములు మంత్రములు ఇవి యన్ని
ంపఁగా, అథర్వణవేదకర్మలు కాలక్రమ
రాజులయొక్క పోషణ తప్పిపోయినందువల
ర్వణవేదము తెలిసినపౌరోహితులు లేకపోయి
వలననో అథర్వణ ప్రయోగములు మృగ్యమై మం
త్రములని తంత్రములని శూన్యములని జాలములని ఈ
ప్రకారము బయలుదేఱి వానిని అభ్యసించువారియందు
కనఁబడుచుండిన కొన్నికొన్ని శోచనీయములైన కృత్య
ములవలన ఇదియే అథర్వణవేదకర్మలు కాబోలు
ననుతలంపు పుట్టి అథర్వణ వేదము వేదతుల్య
ము గాదనియు, వేదమే గాదనియు, బ్లాక్ ఆర్ట్స
అనఁగా క్షుద్రోపాసనలయం దుపయోగము లగు మంత్ర
ములు ప్రయోగములుగల యార్యులవలన గ్రహణానర్హ
మైన యొక గ్రంథమనియు వాడుకలోనికి పాశ్చాత్యపండితు
లును వారిమాటలయందే అభిమానము గల మన ఆర్య
వేత్తలును అభిప్రాయముపడుట మనభరతఖండమునకును
ఆర్యధర్మమునకుఁగూడ చాల హేయమని తలఁచెదను. ఇక
నైన ఈ దురభిప్రాయమును వదలి ఆర్యులు ఈ అథర్వణ
వేదమును పరిశీలించి దాని విశేషములను తెలిసికొను
దురు గాక! అథర్వణవేదమునందలి విశేషాంశములను
అనుభవములను చూచి మున్ముందు వ్రాయుటకు మహ
ర్షులు నా కనుగ్రహింతురుగాక!

# దివ్యగానము

## సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

శ్రీయుత గ్రహాయ హృతసేవకభక్తజనప్రకాండపా
పాయ సమగ్రకృత్తసురవైరిజనాయ మహోదయాలవా
లాయ దురాసదాయ కమలామహిళాహృదయారవిందసూ
ర్యాయ మహామహాయ గుణరత్నగృహాయ నమో నమోఽస్తు తే.

మ. నవనీలాభ్రసమానవర్ణతనవే నానాశుభాసాదినే
అవలీలాపరిభూతసర్వరిపవే ఐశ్వర్యసందాయినే
అవితోర్వ్యాదిసమస్తలోకతతయే ఆహేయపర్యంకినే
భవతే మంగళమూర్తయే భగవతే భవ్యం పరస్మైనమః.

గీ. సాక్షి మాత్రంబ వీవు; దృశ్యము త్వదన్య
భూతమేయని, తదనన్య భూత మదియు
నని విమర్శించి తద్బుద్ధి నంత విడిచి
పొలుచుదురు చిదానందరూపులయి సతము.

మ. భవదీయప్రియమాయ దుర్గుణములన్ బంధించి జీవిన్ హరిం
చి వసువ్రాతము బాధపెట్టెను; గుణశ్రేణుల్ విడంగొట్టి త్రో
తువు దుర్గామృతమందు నీకృపను నంతుం గాన మైనన్ రమా
ధవ! యోగ్యుండ పటుండను నిన్నసతిగాఁ దన్మాయనం డేలొకో!

చ. ఒకపురి భక్తకాంక్షివయి యుండి భుజింపక చూచుచున్న నెం
చక భుజియించె స్వైరగతి స్వాదువుగా నితఁ డజ్ఞుఁడై యటం
చకములు బొంది దీనతఁ ద్వదాశ్రయ మందఁగ శ్రీధరుండ వం
చ కరుణవానిఁజేయు దనఘాత్మునిఁ, గాఁ జ్యుతనామరూపుఁగాన్

శా. ఆమత్యాన మనుత్తమంబును ననింద్యార్కానలం బచ్చటం
గాముల్ కోరున దుండదంచు సుఖభోగంబొందు దొక్కండవే
భూమిన్ జ్ఞాతరహస్య నేసుకృతి నో పొందింతు వచ్చోటికిన్
ప్రేమం గ్రమ్మఱఁ బంపవే గురుఁడు నేర్పె న్నీవు నీచాతురిన్.

మ. మనుజామర్త్యసురేంద్రముఖ్యులకుఁ దన్మార్గానుసారంబు వం
చనమై యిచ్చి క్రమాదికంబులగు లేశంబుల్ మహానందకో
శనిధిం గొంటివి నీవె! వారడుగ నిస్సంగుండ నిర్ముక్తుఁ గ
ర్తను గా నేనువినా మరొండు 'నహి' మద్ధామంబు నందువున్.

మ. విరజావాహిని కగ్నిసూర్యశశభృద్విద్యుత్ప్రదేశాళికిం
బరమై నిర్భయమైన తానకమునన్ వాసించి కాఁజేయు ద
వ్వరి సర్వస్వము నో తమోఽవిరళభావస్ఫూర్తి నాశ్చర్య మి
ద్దరయన్ దుఃఖము నొంచఁడా! యతఁడు బోధానంతరంబే నియున్.

ఉ. లేనిగుణాలు నీకుఁ దగిలించి నుతింపఁగఁ బ్రేముడింతు; లో
కానను నాకుమించిన దొకండును లేదని యెన్నుకొందు వీ
వే నిను; నీవచఃప్రతతి యెల్లయు మిథ్య తలంప లోఁతుగా
నీనిరహంక్రియుండవను నిర్దయశం బెటు గొంటి వప్రభూ.

మ. ఎలమిన్ నీప్రియమాయ దానసతియై యీవన్ భిదాబుద్ధినిం
గలుగంజేసి భవన్నిశాంతవిముఖులా ద్వాత్సజాతీయజీ
వులఁ గల్పించుచు సంశయంపఱచెదుం బోల్పార నీయున్కిలే
ముల కామావిశయంబు మాపు మది సమ్మోహంబు మాకిచ్చెదున్.

మ. తనుభృద్బృందములన్ గుణత్రయముచేతం గట్టి తర్వాత వే
దనముం బొందుచుఁ 'బాహిమా' యనుచు ముక్త్వంబుఁ గాంక్షించుచు
ప్రణిపాతింపఁగ వారలం జలిపి జీవన్ముక్తులం ద్రోయు దం
తను దుర్గామృతమందుఁ గాని 'దహి' దానన్ శోక మావంతయున్

మ. స్ర. నలువారన్ సర్వకల్యాణమును భవదధీనంబుగాఁ జేసి తద్దు
ర్గలితాసారంబు కోశవ్రజము నొసఁగి వేర్పాటుఁ బొందించి
వుల మోహం బెట్టి మాయాపురుషుఁడయితి వన్ బుద్ధి నవాఁ
గలియన్ శ్రుత్యాప్తసద్వాక్తతి ననశనులై గాంత్రుత్

గీ. కేలు లేదు గ్రహింతువు; కాలు లేదు
పఱతు; కన్ను లేదు కనుదు; మరియు వీను
లేదు వినుదు; నిన్ జూడఁగల్గినది జ్ఞాన
దృష్టి బ్రహ్మాదులును నిన్నుఁ దెలియ లేరు.

మ. స్వపదం బిత్తును భక్తకోటి కనుచున్ వాక్రుచ్చుచుం ద్వత్స్వమీ
పపదాపన్నులకుం దగన్ విపదభావంబుం బ్రసాదింతు వి
శ్వపతీ! వేగ నివృత్తుఁడౌను నితరస్వార్థ్యాసులం జేరి త్వ
త్కృపణాపన్నుఁడు పంగుఁడౌటఁబునరావృత్తుండు గాఁ డెన్నఁడున్

మ. భవదాయత్తునిఁ జేసికోఁగ నొక పుంవర్యం బ్రభృత్యాధ్య దు
ర్భవరోగంబు నొనర్చి దుస్సహము సర్వస్వాపహారక్రియా
వ్యవసాయంబును బూని నాకెపుడు సేవం జేయుమా! లేనిచో
ధ్రువమే నీకిక మృత్యువంచని తదార్తుం గొందు నిన్గోల్వఁగన్

మ. కొలువం గావలె సంతతంబు ఫలముం గోరంగ రాదెప్డుఁ బ్రా
క్ఫలలేశంబను భోగ్య మన్యఫలసంఘుంబున్ సమర్పింపఁగా
వలయున్; సర్వము దేవ! నా గమ్యతభావ్యం బే భవత్సేవకున్
ఫల మిాక్షింపమ యిట్టి సేవను నమోవాకంబు నీమాయకున్.

మ. అనువేలమ్మ్ నను గ్రహింతునని యత్యంతంబు వంచించి త్వ
జ్జన బృందంబు హరించి పెట్టిన నవస్సర్వస్వ సంపత్తులన్,
అనలాహస్కరచంద్రమోఽద్యుతితమూహాతీతమా యెట్టి ని
ష్పునరావృత్తి పదంబులోనొ పడఁద్రోపుం ద్రోయఁగాఁ బాడియే?

సీ. మొదలింట నస్ఫుట మూర్తివై భావత్క వివిధగుణశ్రేణి విస్తరించి
వానిలోఁదగిలించి భ్రాంతిమద్ద్విజతతిఁబిదపఁదద్గుణములు ప్రిదులఁజేసి
తదుపరి పక్షపాతంబు సంధానించి యగతులు కావుట హ్లాదమొంది
తద్ద్విజశ్రేణి నంతర్గతంబుగఁ జేయువాఁడవు గాదె? యోపద్మనాభ!

గీ. ద్విజవితతి భవన్ముక్తి విధిక్ష్ప నంబు
దృష్టపూర్వంబు గాద యీపృథివియందు
నెందు శ్రుతపూర్వముం గాద యేమనంగ
వచ్చు నినొక్క రమామనోజ్ఞాతతరణి!

శా. కారాణుండవు నీవు మాయయనఁగాఁ ద్వద్భార్య నిన్నెప్పుడా
సారంగాక్షి స్పృశింప దీవలిన నిస్సంగుండవేలా! మహా
ధీరుల్ నమ్ముదు రావధూమణి ప్రసూతిం గాంచె నాయా జగ
ద్వారంబున్ భవదీయసన్నిధిమాత్రం బుండి యన్నిల్కలన్

శా. స్వైరంబై భువి సంచరింతు మనమున్ సాధించి రోధించి వి
స్తారంబైన ఫలప్రదానమున నాశం బెట్టి జ్ఞానాహ్వయాం
కూరశ్రేణికిఁ గాపువెట్టి ఫలభాక్కుం జేయ కద్దానిమా
యారీతిం జడమంచుఁ ద్రోసి గ్రహియిం తాలాభ మెక్కండవే.

శా. పౌరాణుండవు నీవు స్వైరవతి త్వద్భార్యా జనంబైన మా
యా రామామణి త్వద్భవంబులు జడవ్యక్తుల్ 'నసౌఖ్యంహి' సం
సారం బందు జగత్ప్రభుండ వయినన్ స్వామీ! యిదబ్రంబు సం
సారంబందున రోసి యాశ్రితులఁద్వత్సాదృశ్యలం జేతు నాన్.

దణ్డాంభోనిధిమధ్యసంభవమహాకల్లోలమాలాపరం
పాతుకభక్తలోక జనతాపద్గ్రంథిసంభేదక
త్తరికాబృందములైన తావకదృగంతంబుల్ ప్ర
శ్వర! రక్షింపుము సైఁచి మామకదురజ్ఞానక్రి...

చ. సుదృగవతంస వశ్యమనసుండవు కావుట నొడ్ల
సదుఁడవ కా తలంచి బుధసంతతి త్వత్ప్రియభక్తి
యొదురు; తదీయసంశ్రయణ మొప్పనయేని ద
గుదువు శుభంబు లున్నె యదిగూడనిచో ఫలతె.

మధ్యాక్కరలు.

భావత్కగుణజాలబద్ధహృదులట భక్తులు ముక్త
లే? వేదనావిష్టులట సుఖాంభోధి నేలా! మునిగిఁ
దేవేశ! ధ్యానించి నిన్నుఁ ద్వత్ప్రకృతినిఁ బొందుదురఁ
రేవిధి మాయదూరరో? యిదెల్ల నీయింద్రజాలంబు.

గీ. ఉన్న వైతె పోద; లేని సౌఖ్యోదయంబు
రాద; తావక సాక్షాత్కరణముచేతఁ
గాన నిజరూపభవన మెక్కండె ఫలము
తెలియ కీతత్త్వ మేదియో ఫలముఁగోరి
కొలుచునట్టి యబోధులకును జివరకు
ఫల మనసుపన భ్రాంతి విలయముగద!

గీ. అఖిలభూతప్రకృతి వీవ యగుటఁ బ్రేమ
నిధివి; నీ ప్రేమ పాత్రుండు, నీదు సేవ
కుఁడు, సదంభ మన్యప్రేమ; క్షోణినిరుప
ధికకృపాంభోధివని నీకుఁ బ్రకటకీర్తి.

మ. యతివర్యస్మృతిబృందరజ్జుపరిణద్ధాత్మస్వరూపుండవై
యితరుల్ ముక్తినిఁ గాంక్షసేయఁగ సతం బేలాగు నీఁబూనితో!
క్షితిఁ ద్వద్భక్తిమహాబ్ధిమగ్నవిబుధశ్రేణుల్ తరింపంగ నే
గతిఁ గల్పింపఁగఁ బూనితో యి! తెలియంగాలేము నీతత్త్వమున్.

చ. ఎఱిఁగియునుం ద్రివిక్రముఁడ వీ వనుచున్ హృది నేల యుంత్రో స
త్స్మరుషులు నిన్నుఁ గేమి గతిఁ బొంది యవిద్యను దమ్ముదార లే
మఱవఁగ; నాక్రమించి హృది మాత్రమె ముందది త్వద్వశంబుగాఁ
బఱపి త్వదీయరూపము నవారిగ మాపెదు నామరూపముల్.

ఉ. ఉన్నదియేని లోకముల నుండదు బాధము గొంచెమేని; లే
కున్నను లేదు బొత్తిగను; నున్నది యేమొయటన్న ప్రత్యయం
బున్నది; కానఁ ద్వత్ప్రకృతి నొప్పుగఁ జెప్పఁగ తే కుదాసులై
సన్నుతి సేయుచుంద్రు బుధసంతతి నిత్యము మోదపూరమున్.

సీ. మచ్చరంబుననైన స్మరియింపఁగా నిన్నుఁ బడయఁజేయుదువు నిర్వాణఫలము
నుచ్చరింపంగ నన్యోద్దేశమున నేని నీ పేరు భవభూతి రూపు మాపుఁ
బత్త్రింబుగాని పుష్పంబుగాని ఫలంబుగానీ జలంబులుగాని మఱియు
నేలేశ మిచ్చినఁదృప్తిని గ్రహియింతువీయకున్నను వహించుప వలుక

గీ. తావకావ్యాజకరుణా సుధాసముద్ర
మునకుఁ జెలియలికట్ట దాఁబోలుచునొక్క
క్షీరసాగరకన్యకా చిత్తపంక
జాతకోరకబాలఖద్యోతమూర్తి!

# నాగార్జునాచార్యుఁడు

దువ్వూరి జగన్నాథశర్మగారు

కుశలప్రణిధానదశా, విశుద్ధతేజులు; వివేకవిలసితు; లగుపు
ణ్యాశరీరులస్మరణమె దు, ర్దశలం దొలఁగించు నించుధర్మసమృద్ధిన్.—అవదానకల్పలత.

శ్రాత్త్వికమ్మైనయాసక్తి మెండుకొనియున్నవారి చిత్తవీథు లందు మహాపురుషులు సంచారమొనర్చుచుందురు. అందు ... మహాపురుషు లనఁబడువారికి మృతిఁజెంది ధ్వనవస్థను లౌకిక ...సక్తిచేతమాత్రమే చెప్పఁదగును కాని వారు నిజముగాగతించినవారు కారు. మఱియు మహాపురుషులు సుహృదులహృదయాకాశమునం దట్లు లీలాసంచారము గలిగి స్మర్తలను తాదాత్మ్యమార్గంబున మహాపురుషులను గావింపఁగలరు! కావున మహాపురుషసంస్మరణము సట్టి ...ార్హైనను గావింపఁగల్గినవారైనచోఁ దామును సమున్నతచిత్తులు కా ...స్సను. ఆర్యులు బుద్ధి నంతర్ముఖము గావించి భరతఖండముమీఁదఁ ...చినగతకాలమువంక తమహృదయాకాశము నభిముఖముగావించిరేని ...దు మహాపురుషులలో, ద్యోతకపడువాఁడు నాగార్జునాచార్యుఁ డొక్కరుఁడు!

...లము:—

చారిత్రకులుచెప్పు సాంప్రదాయము ననుసరించి యీతని నివాసస్థలమును జేర్కొనవలయు నన్నచో సర్ ప్రఫుల్లచంద్ర రాయ్ గారు సెలవిచ్చినదానిని బట్టి ఘూర్జరదేశమందలి సోమనాథపురిదగ్గఱి దయిహాక్షుగ్రామ మగుచున్నది. ఏడవశతాబ్దమధ్యమున హిందూదేశమును జూడవచ్చిన చీనాయాత్రికుఁడగు హ్యూనత్సాంగు వివరించిన దానిని బట్టి కోసలదేశమున కాగ్నేయమూలగా నలువది మైళ్లదూరమందున్న "పోలోమో లో కివి" యనుపర్వతము నాగార్జునుని యాశ్రమమున్న స్థలమని తెలియవచ్చుచున్నది. త్రివిష్టపదేశమందున్న బౌద్ధగ్రంథములు నాగార్జునుఁడు నిర్యాణమందినస్థలము శ్రీశైలమని వివరించుచున్నవి. కాశ్మీరరాష్ట్రమై విరాజిల్లుచున్న రాజతరంగిణి నాగార్జునాచార్యుఁడు కాశ్మీరరాష్ట్రారణ్యమున నాఱుదినములు సంచరించెనని చెప్పుచున్నది. హిందూదేశచరిత్రమును వ్రాసిన స్మిత్తుమహాశయుఁడు అమరావతి బౌద్ధస్తూపముతో నాగార్జునునికి సంబంధము దెలుపుచున్నాఁడు. నాగార్జునవిరచితమైన సిద్ధవినోదనము గ్రంథము ఆతని నివాసప్రదేశము నీక్రిందిరీతిగా నెఱిఁగించుచున్నది.

సిద్ధనాగార్జునో నామ పురా ఽసీత్ తాపసో మహాన్
శాంతో దాంతో జితాత్మా చ నియతః ప్రయత శ్శుచిః;
ఉవాస స చిరం సోఽపి రేవాతీరే మనోరమే
శాంతినికేతనే తత్ర ఆశ్రమే చిత్తహారిణి" అని

ఈతఁడు రేవాతీరమందు శాంతినికేతనమను ఒక మనోహరమైన యాశ్రమమునఁ జిరకాలము వసించెనని ఈయర్థము తెలుపుచున్నది. రేవానది నర్మదయని మనలోఁ బ్రసిద్ధి కెక్కియున్నది. కాఁబట్టి నర్మదా చెంగటనుండినవాఁడని నాగార్జునుఁడు తెలిసికొనఁబడుచున్నాఁడు. ఇన్ని వ్రాఁతలను బట్టి నాగార్జునుని వాసస్థలము నిర్దేశించుటకు ఒకదాని కొకటి పోలికలేక విస్సంప్రతి గలుగుచున్నది. ఐనను నాగార్జునుఁ డొకసిద్ధుఁడు. విశేషించి మతస్థాపనాచార్యుఁడై యుండి బౌద్ధులలో బోధిసత్త్వుఁడుగా నెన్నఁబడుచున్న వాఁడు. అందువలన దేశద్రిమ్మరియై యుండి—ఘూర్జరుఁడై యుండినట్లు కొందఱకును, కోసలేయుఁడై యుండినట్లు కొందఱకును, కాశ్మీరవాసి యని కొందఱకును, శ్రీశైలేయుఁడైనట్టిగాని అమరావతీయుఁడైనట్టి కాని ఆంధ్రుఁడని కొందఱకును, ఇట్లు పల్వురకుఁ బలురీతులఁ దోఁచుచున్నాఁడు. ఇందేదయిను గాదనువిమర్శకు మనము చోటీయనక్కఱ లేదు. ఏల నందురా? మంత్రౌషధసిద్ధిచే సిద్ధుఁడని తెలిసికొనఁబడుచున్నవాఁడు మహత్తరమయినపాదవిన్యాసమున నిత్యసంచారము నొందఁగలవాఁడై ఎల్లదేశములవారికిఁ దమలోని వానివలెనే విశ్రుతపూర్వుఁడుగాఁ గలఁడుకదా! కావున నట్లు నిలుకడ లేక నిత్యసంచారము సలుపఁగల సిద్ధునికి నివాసస్థలమును నిర్ణయించువాదమున్నకై జొరఁబడుట ఏబుద్ధిమంతుఁడును తనకర్తవ్యమని రాఁజాలఁడు. గనుక, నాగార్జుని నివాసస్థలమునుగూర్చి పైరీతిగా నెంద ఱేమి వ్రాసినను అది నమ్మవలసినదియే యగుచున్నది.

కులము:—

న్యాయముచేత బౌద్ధమతస్థులకుఁ గులగోత్ర సంబంధమైన యభివాదన చిహ్నములతోఁ బని లేదు. కాని అది యిటీవలి సంప్రదాయము. మిక్కిలి సనాతనుఁడైన యమరసింహుఁడు తాను బౌద్ధసంస్థలోనివాఁడయ్యు బౌద్ధమతస్థాపకుఁడైన శ్రీబుద్ధుని వివరించు సంసర్గమున నిట్లని కులగోత్ర సందర్భము లిచ్చియున్నాఁడు.

గౌతమ శ్చార్కబంధు శ్చ మాయాదేవీసుత శ్చ సః
నశాక్య సింహస్సర్వార్థసిద్ధ శ్శౌద్ధోదని శ్చ సః—అని

బుద్ధుఁడు గౌతమగోత్రజాతుఁడనియు, సూర్యవంశ క్షత్రియుండనియు మాయాదేవియొక్క గర్భసంజాతుఁడనియు శుద్ధోదన రాజుపుత్రుఁడనియు సర్వార్థసిద్ధుఁ డని యాతనికి ...ణము చేయఁబడెననియు సూర్యవంశమున శకులనఁబడ

యందుఁ గల్గినయుత్తమపూరుషుఁడనియు నిర్వచింపఁబడియున్నాఁడు. శాక్యసింహశబ్దార్థము పరిశీలింపఁగలవారిచే ధర్మశాస్త్రపరిభాషలోఁగల లిచ్ఛవిక్షత్రియులలోని ఒకశాఖవారగు శకవంశజులకుఁ జెప్పఁబడుచున్నది. లిచ్ఛవిక్షత్రియులు యజ్ఞయాగాదికర్మలను వదలి కర్మతులగుసూర్యవంశజులనుండి వేఱుపడిన,యొకశాఖవారైయున్నారు. కాఁబట్టి బుద్ధునిజన్మస్థానము లిచ్ఛవికుటుంబముగాఁ దెలియుచున్నాము. దత్తుమహాశయుఁడు నాగార్జునుని బుద్ధునిమేనమామగా నెంచుచున్నాఁడు. ఇది నిజమగునేని నాగార్జునుఁడు జన్మతః సూర్యవంశములోని లిచ్ఛవిశాఖీయుఁడైన క్షత్రియుఁడని పేర్కొనఁదగియున్నది. నాగార్జునుని ప్రసంగము వచ్చినప్పుడు రాజతరంగిణి ఆతఁడొక భూమీశ్వరుఁడని చెప్పియుండినది. బుద్ధుఁడు జన్మించినకుటుంబము భూపాలకుటుంబము. నాగార్జునుఁడాతని మేనమామయై యుండినచో రాజతరంగిణి చెప్పినట్లుగా నాగార్జునుఁడు కూడ భూమీశ్వరుఁడేయని విశ్వసింపవలసియున్నది. ఈయుదంతము నాగార్జునునికి బుద్ధునికి సమకాలమువానినిగాఁ గూడ తెలుపఁగలుగుచున్నది. ఈ యంశ మిట్లుండనిండు.

శీలము:—

శివస్య ప్రియశిష్య స్స త్రికాలజ్ఞో మహామతిః

వశీగా న్యధితిష్ఠంతి షట్ కర్మాణి చ ధీమతేః—అని

నాగార్జుననిగూర్చి సిద్ధవినోదనమనుగ్రంథము చెప్పుచున్నది. దీనినిబట్టి ఆమహామతి మూఁడుకాలముల నెఱిఁగినవాఁడు; మారణోచ్చాటనాదిషట్కర్మలను వశపఱచుకొని యున్నవాఁడు; మహేశ్వరునిప్రియశిష్యుఁడు అని తెలియుచున్నది. తుండి యాతనికి శిష్యుఁడని వినవచ్చుచున్నది. ఇట్టి యీనాగార్జునుఁడు గొప్పప్రవక్తయని బౌద్ధగ్రంథములు పేర్కొనుచున్నవి. శైవుఁడని వినఁబడుచున్న నాగార్జునుఁడు బౌద్ధపీఠము నధిష్ఠించినయాచార్యుఁడని సిద్ధుఁడని చెప్పఁబడుట సంశయమును గలిగించుచున్నది. హీనాయనులని మహాయనులని బౌద్ధులు రెండుతెగలుగ నున్నారు. అందు మహాయనపద్ధతికి నాగార్జునుఁడు స్థాపకుఁడు. ప్రాజ్ఞపరిమితములను మహాయన సూత్రములకుఁ గర్త నాగార్జునుఁడు. మహాయనమనఁగా నొక ప్రాకృతికమహోదధినుండి తరించుటకు భక్తులకు ఆశ్రయమైనదియని మహాయనపద్ధతిని నాగార్జునుఁడు నెలకొల్పెనఁట! విగ్రహారాధనమున కవకాశమిచ్చుచు బుద్ధుని విగ్రహముగాఁ బూజించు పద్ధతి గల హీనాయనపద్ధతికంటె నుత్తమమైనదిగా మహాయనపద్ధతిని బౌద్ధులు భావించుచు దాని నవలంబించిరఁట! బ్రహ్మ, విష్ణు, శివ, సరస్వతి, గణేశులనఁబడు దైవతములతో ఆ విగ్రహముల శిరస్సునందు బుద్ధుని నెలకొలపి వారికి ఉపాసకులని పేరు పెట్టి బోధిసత్త్వగణము హీనాయనులను వేఱుపఱచి తాను పతంజలియోగశాస్త్రములలో తన మతమును వ్యాపింపఁజేసెనఁట! ఆర్యదేవుఁడు, అశ్వఘోషుఁడు, మున్నగువారు మహాయనపద్ధతిలోని వారే! సిద్ధనాగార్జును శైవుఁడని సిద్ధవినోదనము తెలుపుచున్న యంశము ఆతఁడు మొదట ఉపాసకుఁడై హీనాయనపద్ధతిలోనుండి శివార్చన గావించియుండి, ఇటీవల పతంజలియోగమునుండి రించి యోగసిద్ధిఁబడసి ఆ పద్ధతిని బౌద్ధులలో వ్యాపింపఁ జేసియుండెనేమోయని యూహించుచున్నది. పుట్టుకచేత క్షత్రియుఁడైయుండి అవలంబములోని వారిచే వెలయింపఁబడిన బౌద్ధమతస్థుఁడై జలయోగశాస్త్రాదికమును సమధికాభ్యాసము గలయుత్తమత్వమును దా నవలంబించిన మతములోనికిఁ బ్రాబాటువడిన భూపాలుఁడయి అన్నిటిని విడిచి సిద్ధుఁడాయని యింతవఱకు నాగార్జునుని దెలియుచున్నాము. ఇఁకెప్పటివాఁడను నంశమును జర్చించెదము.

కాలము:—

టిబేటు దేశచరిత్ర కర్తయగు తారానాథుఁడు క్రీ. శ. 1 220 లకు నడుమ నాగార్జునుఁడున్నవాఁడని కాలనిర్ణయము యత్నించినాఁడు. క్రీ. పూర్వము 150 సంవత్సరములనాఁడు హిందూదేశముమీఁదికి గంగానదివఱకు దండెత్తివచ్చిన గ్రీకు మినాండరుతో మతవిషయికమైన చర్చయందు మన నాగార్జునుఁడు పాల్గొనెనని ఒక పాళిగ్రంథము చెప్పుచున్నట్లు దత్తు తెలిసికొనియున్నాఁడు. ఈయంశము పైతారానాథుఁడుచెప్పిన దానిని కాదనఁ జేయుచున్నది. స్మిత్ మహాశయుఁడు హువిష్కునికి—కనిష్కునికి సమకాలీనుఁడై తరువాత 162 ప్రాంతములందు నాగార్జునుఁడుండినట్లు వ్రాయుచున్నాఁడు. క్రీ. తరువాత రెండవశతాబ్దాంతమునను మూఁడవశతాబ్ద ప్రారంభమునను శ్రీయజ్ఞశాతకర్ణియుండినట్లు వ్రాయుచు ఆంధ్రచరిత్రము నాగార్జును నాతని సమకాలీయుఁడని చెప్పుచున్నది. బుద్ధనిర్వాణానంతరము నాలుగువందల సంవత్సరములనాఁటివాఁడు కనిష్కుఁడని—క్రీ. తరువాత 78-100 సంవత్సరప్రాంతములందున్నవాఁడని, ఆంగ్లవిద్యావిశారదులు భావించుచుఁ బదింబదిగ నాగార్జునుఁడప్పటివాఁడని నిర్ణయించుచున్నారు. బుద్ధునికిఁ బిమ్మటఁ బార్శ్వకుఁడు తత్ పీఠాధిష్ఠాతయైనట్లును తరువాత అశ్వఘోషుఁడు పీఠస్వామి యైనట్లును ఆతనివెనుక నాగార్జునుఁడు పీఠాధ్యక్షుఁడైనట్లును,ఈ కాలము బుద్ధ నిర్వాణానంతరము 500 సంవత్సరములుకాఁదగియుండు ననియుఁగావున క్రీ. తరువాత రెండవశతాబ్దమందు నాగార్జునుఁడుండినవాఁడనియు మఱికొందఱు చారిత్రకులు వాకొనుచున్నారు. ఇట్లు పెక్కండ్రు వ్రాసిన వ్రాఁతలవలన నాగార్జునుఁడు క్రీస్తుపూర్వము రెండవశతాబ్దము మొదలు క్రీస్తుతరువాత రెండవశతాబ్దము వఱకు మొత్తము నాలుగువందల సంవత్సరములనడుమ నెప్పుడో యుండినట్లు నహ్మవలసి యున్నది. బుద్ధుని మేనమామయే నాగార్జునుఁడై యుండవలెనను గాథను నమ్మితిమేని క్రీస్తుపూర్వము అయిదవశతాబ్దము మొదలు క్రీస్తుతరువాత రెండవశతాబ్దపర్యంతముగల కాలములో నాతని కాలమును స్థిరపఱచఁ దగియున్నది. ఎట్లయినను నాగార్జునుని కాలము నిర్వివాదమైనదిగా నింతదనుకఁ దేలియుండలేదు. మన మొకరీతిగా దీనిని నిర్ధారించుట కవకాశమున్నది. అభిమన్యుఁడు కాశ్మీరరాజ్య మేలినప్పుడు నాగార్జునుని ప్రబోధమువలన కాశ్మీరరాష్ట్రి

క్తమైన ఆచారములను నిరాకరించి యాగమద్వేషు
ష్ణుఁడు వ్రాసియున్నాఁడు. ఈ యభిమన్యుఁడు
శ. అశోకుఁడు రాజ్య మేలినతరువాత జికా
కనిష్కుఁడు, అతనితోఁబాటు హువిష్కుఁడు,
రువాత అభిమన్యుఁడు, అటుతరువాత గోనందనుఁడు
రు. కనిష్కుఁడు మొదలగువారు శాక్యవంశజులు.
మనకు బిమ్మట 2268 సంవత్సరములనాఁడు గోనందుని
రది. ఈనందుని తండ్రి అభిమన్యునినాఁడు మన
న్నాఁడు. కావున మనము ప్రస్తుతము వాడుచున్న లోక
కార మీకాల మెప్పుడో వివరించఁదగియున్నది. గణించి
ాడెఁ గా మృగశీర్షానక్షత్రప్రాంతమందు సప్తర్షు లుండినప్పుడు
ార్జునుఁడగుపడుచున్నాఁడు. ఇయ్యది క్రీస్తు పూర్వము 250-150
సరముల నాఁడని చెప్పఁదగియున్నది. కృత్తికయందు సప్తర్షు
లప్పుడు ఆంధ్రరాజ్యమారంభమైనదని మత్స్యపురాణము వివ
రించుచున్నది. ఆంధ్రరాజులలోని శాతకర్ణి మన నాగార్జునునికి మిక్కిలి
చెలిమికూర్చినరాజుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. కావున బి. సి.
50-150 సంవత్సరప్రాంతములందు నాగార్జునుఁ డున్నాఁడని నమ్మఁ
యున్నది.

వృత్తము:—

ఈతని గూర్చి ఇఁకను గొంచెము చెప్పి యీ వ్యాసమును ముగించెదను. ఈ మననాగార్జునుఁడే యేలోహము నైనను బంగారము చేయఁగలవాఁడని, ఆవిద్యను భారత భూమియందు నెలకొల్పిన రాసాయనికశాస్త్రవేత్తయని తెలియఁదగియున్నది. మఱియు శాతకర్ణిని ఏవో సలికలు సేవింప నియోగించి చిరజీవినిజేసినట్లు బీల్ మున్నగు పాశ్చాత్యరాసాయనికతంత్రజ్ఞులు నమ్ముచున్నారు. ఈతఁడును 4-5 వందల సంవత్సరములు జీవించియుండెనని నమ్మఁట కవకాశములు సమకూఱుచున్నవి. సుహృల్లేఖ మున్నగు కావ్యములను నిర్మించియు రతిరమణము మున్నగు కామ్యగ్రంథములను నిర్మించియు ప్రాజ్ఞపరమితాదిమతగ్రంథములను నిర్మించియు రసతంత్రముపై గొప్పగ్రంథములను వ్రాసియు పటుపన్నిమున్నగు మూలికల సాహాయ్యమున నేఁటికిని బంగారుచేయఁగల సిద్ధులమూలమునను అమరావతి శ్రీశైలముమున్నగుచోట్ల నిర్మితములయిన శిలాచిత్రముల పేరుపెట్టియు నేఁటికిని, ఎప్పటికిని మనకు సంస్మరణీయుఁడైయున్న యీ నాగార్జునునికి నమస్కారము.

# మాలా పంచరత్నాలు

### మంగిపూఁడి వేంకటశర్మ గారు

ఎండవానలందు హిమమందు నిరులందు
పగలు రాత్రి యనక పాటుపడుచు
ప్రజకు సుఖముగూర్చు పరమోపకారియౌ
మాల శివుని యకుమాల గాఁడె?

తానె చెమట లోడ్చి ధాన్యాలు పండించి
గాదులందు చేర్చి కాపులిచ్చు
కూడు చాలనట్టి కూలికే హర్షించు
మాల దివ్యకుసుమమాల గాఁడె?

అధికబలము గలిగి యడకువచే మించి
పేదయయ్యు దొంగ వృత్తిలేక
మాయలేక న్యాయమార్గాన వర్తించు
మాల విష్ణుతులసి మాల గాఁడె?

గుడిసెలందు నుండి కుక్కిమంచములందు
పండి దుంప తూఁడు వండి తినుచు
చింపిగుడ్డ కట్టి చిత్తాన రంజిల్లు
మాల హేమపుష్పమాల గాఁడె?

ఘనత వచ్చు పనులు ధనమిచ్చు పనులును
మీఁదివర్ణములకు మీఁదుగట్టి
జీవితంబు నిత్యసేవకై యర్పించు
మాల సుగుణరత్నమాల గాఁడె?

# రాజ్యాంగతంత్రమున పక్షాభిమానము

అత్తిలి సూర్యనారాయణగారు

స్వాతంత్ర్యము లయిన నానాదేశముల యందలి రాజ్యాంగప్రతిష్ఠాపనములు జనసామాన్యహృదయమున స్వరాజ్యప్రబోధమును గలిగించియు, అజాగరూకతను దొలఁగించియు, ఉద్యోగోత్సాహములను వెలిగించియు, క్రియాజడత్వమును రూపుమాపుచుండుట మహోపకారమై యున్నది. ప్రజాధికారముచేతనే నడుచు స్వరాజ్యములకు మూలాధారము దృఢముగా నుండవలయునన్న జనసామాన్యమున విశేషముగా విద్యావ్యాప్తి యుండకతప్ప దని యెందఱెందఱో చెప్పుచుండ వినుచుందుము. అది సత్యమే యగును; గాని, ప్రజలను విద్యావంతులనుగాఁ జేయుసాధనములలో స్వరాజ్యము నెకల్గి యుండుటకంటె నెక్కుడు పటిష్ఠమైనది వేఱొకటి యుండఁబోదనుమాట మఱవఁగూడదు. ఐశ్వర్యవంతులకు వలసినన్ని విద్యాలయములు లభింపవచ్చును. జ్ఞానాధిక్య మందుటకై వారికి నానాచిత్రవస్తుప్రదర్శనములు, గ్రంథములు, నాటకములు, దేశాటనములు సుసాధ్యములయి యున్నవి. జనసామాన్యమునకో స్వరాజ్య ప్రతిష్ఠాపనములే సర్వాంగశిక్షను గల్గించుచున్నవి. అవియె వారికి విశ్వవిద్యాలయములై యుపకరించుచున్నవి. స్వాతంత్ర్యశోభితము లయినరాజ్యములయందు ప్రతిపౌరునికిని దురతిక్రమణీయము లయినబాధ్యతలు గలవు; భజనీయము లయిన పరమధర్మములు గలవు. అట్టిపౌరులలో నొక్కొక్కరును లోకహితార్థము మహత్తరములగు విషయములనుగూర్చి చర్చింపవలసి యుండును; ఉత్కృష్టప్రయోజనములను నిర్ణయింపవలసి యుండును; లక్షలకొలఁది, కోట్లకొలఁది యైనజనాళి క్షేమమును, సంతతివారి భావికళ్యాణమును, పురస్కరించుకొని యెన్నెన్నో నూతనశాసనపద్ధతులు విధింపవలసియుండును. ఎప్పటికప్పుడు దేశమునందె తలయెత్తుచుండెడి యంతస్సంబంధములను గుఱించియేకాక, యితరదేశములతో సహితము తా మెట్టి సంబంధముగల్గి మెలఁగవలయునో నిశ్చయించుకొని, యట్లు సకలనాగరికలోకముతోడను సమన్వయింపఁదగు రాజనీతిపద్ధతిని వెలయింప వలసి యుండును. స్వదేశపాలనముతోఁ దనకు ...నము గలుగఁగానే లోకహితజీవనము నిత్యవిధి యగుచున్నది. ...యేకాదర్శము, లక్ష్యము నగుచున్నది. ధర్మవిధే...యట్లు వర్తిల్ల నేర్చువాని కాత్మవికాస మెన్నండును ...నేరదు.

దేశాభివృద్ధికరముగాఁ దోఁచెడి బహువిషయములలో ...దెసల నభిప్రాయభేదములే గాక, యవలంబింపఁదగు ...నములలోనో యనుసరింపఁదగు మార్గములలోనో భిన్నత ...యుక్తాయుక్తతలను గూర్చిన చర్చలు బయలు ...ము, ధీశక్తులకు జీవకళయుఁ జాకచక్యమును గలిగి, ప్రాయికముగా స్వబుద్ధ్యతీతములు విశాలములు నయిన విషయ...శీలించుటకు విశేషమైన యాసక్తి యుదయించు...మున నిదియె స్వభావముగా సహితము రూపొందు. ...కుశపాలనములోఁ దా నెన్నండును గని యెఱుంగని (Robustness), శక్తియు (Force), ధీవిశాలతయు విస్పష్టములగును.

రాజ్యాంగవిషయములలో పక్ష (Party) మన నెట్టిది? ...ననుసరించి దేశహితాచరణమే దీక్షగాఁ గల్గియుండునట్టిది. ... (Faction) యన నట్టిది కాదు. ప్రత్యేకముగా నొకకొందఱు వ్యక్తులకో, ప్రజాసమూహమునఁ గొన్ని శాఖలకో, యేవో కొన్ని ప్రయోజనముల నె పెంపొందింపఁ బాటుపడునదే కాని, సమష్టితో సమష్టిసౌఖ్యాభివృద్ధి నర్థించునది కాదిది. ప్రాచీనములగు గ్రీకు నగరరాష్ట్రముల (Greek City States) యందు దూ...కూటము లిట్టివే. కొందఱి మూలముననే రాజ్యవ్యవహారములు నడచునట్టి యభిజనులు (Oligarchs), జనసామాన్యాధిపత్యమును ప్రతిష్ఠింప నభిలషించు సామాన్యతంత్రపక్షావలంబులకు (Democra...) రాజ్యాధికారమున స్థాన మీయకుండుటయు, మఱి వీ రధికారము వహించినప్పుడు వారి కీయకుండుటయు, వాని కప్పటి ముఖ్యధర్మసూత్రము లయి యుండినవి. వ్యవస్థాపకసభలో (Senate) నల్పసంఖ్యాకులయిన యభిజనులచేతనే రాజ్యాధికారము వహింపఁబడుచు వచ్చినకాలమున సామాన్యతంత్రపక్షావలంబులకును, మఱి వీరే యధికారమునకు వచ్చినపుడు వారికిని, సకలాధికారములును పదవులును బోకుండునట్లు చేయుటయే పనిగా నుండెడిది. ఇది క్రీస్తుజననమునకు ముందు రెండవశతాబ్దములోని గాథ. అయినను, అప్పటి యభిజనపక్షవాదుల యదృష్టమున, ఆకాలములో ప్రజాధికారపక్షావలంబుల మని బయలువెడలినవారును దమవలెనే దుష్టులో భ్రష్టులో లంచగొండులో యై యుండినందునను, దుర్మార్గమే శరణముగా సాధనముగా గల్గి యుండినందునను, వారి స్థితి కంతగా భంగము కలుగలేదు. చిత్తవృత్తులై కుటిలములై నికృష్టములై యుండ, మఱి యేయుద్యమము విజయ మందఁగల్గును ?

మఱి, యింగ్లండు దేశములోనో, ప్రాచీనధర్మసంరక్షకు లయిన ఉదారపక్షావలంబులయినను, 'విగ్గు' లయినను 'టోరీ' లయినను, పైకి మఱియెన్నెన్ని మాఱుపేళ్లతో బయలుదేఱువారైనను, మాఱు పన్నమాట లేక యేకరీతిగా స్వదేశక్షేమమునే లక్ష్యముగా నిల్పుకొని వచ్చుచున్నారు. అదే యారాజ్యతంత్రమునందలి విశేషము.

...రాదులలో నెట్టిపద్ధతు లవలంబించిన పక్ష ...ప్రయోజనకరమను విషయమున అభిప్రాయభేద ...మే. కాని, యట్టిభేదములు స్వల్పకారణము ... గలుగరాదు. అనల్పము లయిన ధర్మభేదము ...ులు వంద్యము లగుచున్నవి. ప్రబలధర్మసూ ...యున్న, మఱి పక్షములుండ నిమిత్తమే లేదు. ...మునయాటంకములను గల్గింపక, విదేశవస్తువులను స్వ ...దేశవస్తువులను విదేశములకును బంపుకో నిచ్చిననే ... నమ్మువారు కొందఱును, మఱిసుంకములు విధించి ...వలంబించిననే కాని స్వదేశవస్తూత్పత్తికి మహానర్థ మవు ...ముగా విశ్వసించువారు మఱి కొందఱును, భిన్నాభిప్రాయ గల్గియుండవచ్చును. ఐశ్వర్యాభివృద్ధికై ప్రాచ్య ...ప్రాజ్యము నిల్పుకొనుటయుక్తమేయని తలపోయువారు కొంద ...అట్టిది తఱుచుగా యుద్ధాదుల డింపి, వ్యసనాదుల నింపి, ...నష్టమాపాదించు ననియు—జనసంఖ్యాపాటవాదులు క్షీణించి ...వు ననియు — నైతికదోషములు హద్దుమీఱి పోవు ననియు— ...కలదానితోనే సంతృప్తి వహించి, శాంతిపథమునఁ జనుచుం ...భద్రప్రాప్తికి మూలమని యెన్నుచుండువారు మఱికొంద ...వచ్చును. అభిప్రాయభేదము జనించుట కిట్టి ప్రబలనిమిత్త ...పుడే పక్షావలంబనము ప్రయోజనకరమును వంద్యము నగుచు ...దో, లేదేని నిపతితము నింద్యము నగుచున్నది.

కేవలపక్షాభిమానములు సర్వదా దేశవినాశకరములు కాకపో ...వచ్చు ననుమాట సత్యమే కాని, యవి పరిశుద్ధసత్యమును, నిష్పా ...క్షికన్యాయమును, ఆత్మనిగ్రహమును, దయాదాక్షిణ్యములను, నిరం ...తరము మ్రింగివేయుచుండు ననుట యంగీకరింపక తప్పదు.

ఎవరికి యుక్తమని తోఁచుపక్షములో వారు చేరుట ధర్మమే ...యగును; గాని, యంతరాత్మబోధనల నతిక్రమింపకుండుట యత్యం ...తాభిమతమే కాని, కేవల పక్షాభిమానము దారుణదుర్గుణముల జ్వలిం ...పఁజేయు ననుమాట విస్మరింపరాదు. మంచియో చెడ్డయో యొక్క ...సామాన్యధర్మమును నిర్వర్తించుటకే పదువు రొక్కచోఁ గూడిన ...యెడల, వారు చెప్పెడుదాని నెల్ల ప్రతిఘటించుటకే, స్వలాభా ...ర్థమే మఱి కొందఱు బద్ధకంకణులై యభిముఖముగా ప్రతిపక్షము ...వహించి కూర్చున్నయెడల, తా మెల్లరు నొక్కచోట నేల కూడవలసి ...వచ్చినదో యామాటయే మఱచిపోవుటయు, నూతనావేశము నందుం ...టయు, ప్రతిపక్షులనఁగానే జనించు తీవ్రవిముఖత వహించుటయు, ...భీకరాకృతులఁ దాల్చి, ద్వేషరోషానలము దరికొని మండఁబెట్టక ...మానదు. ఒక్కప్రయోజనమును గూర్చి కాని, మఱి యభిప్రాయము ...గూర్చి యొకానొకఁడు తానొక్కఁడై పెక్కండ్రతోఁ బ్రతిఘటించి ...పోరువేళ, తా నంతటిపని చేయుచుంటిఁ గదా యను గర్వాతిరేక ...మును, జిగీషను, ఆగ్రహాదిస్వకీయ రాగోద్రేకములను నిజముగా ...వణఁచిపెట్టుకొనుట—పెట్టుకోఁగలుగుట—యెంత యసాధ్యమైన పని! ...మఱి, తా నొక్కఁడును గాక పదువురతోఁ గూడియే యొకపక్షము ...నఁ బోరుచుండఁ దటస్థించునపుడు, మఱి వారందఱిహృదయములను ఆవేశించియున్న నిష్ఠురతయు నిర్ఘృణతయు, మొండిపట్టుదలయు, అక్కసును, ఆవేగ మందక యుండవచ్చునా?

"పగవగగొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే?"

ఇది యటుండ, స్వపక్షవిజయము లభించినదనఁగానే విశాల ధర్మముమాట వెనుకఁబట్టి, ప్రతిఘటించుటే పోరాటముగా మాఱి, యధికారాపేక్షయు, స్వగౌరవాభిరతియు, పరపక్షనిర్మూలనదీక్షయు, జయకాంక్షయు, పిచ్చి...వుఁ గదా! వీనిచేఁ గల్గుతెంపరితనము, పిడివాదము, దుష్టబుద్ధి,—ఈదృశదుర్గుణపుంజభారమే కదా దేశచారిత్రయుగములోని దారుణవారణఘట్టము!

పక్షవాదములు ప్రబలిపోవునపుడు, ముందు భేదము కల్గుట కేది కారణ మనువిచారముతోఁ బ్రసక్తియే లేకపోవును. ఒక గజము నేలవిషయమే కావచ్చును; మఱి, యొకయుత్సవములో ముందెవ్వరు సాగిపోవలయు నన్న యల్పవిషయమే కావచ్చును. ఇట్టియల్పవిషయములందైనను పోరాటమే తలయెత్తినా, మఱి హఠవాదము (self-will), ద్వేషబుద్ధి (Ill-will), జిగీషారోషావేశము (The rage for victory), అవమానజనితభీతి (The dread of mortification), పరాజయభయావేశము, నివి యవి యననేల? యిత్యాది దుర్గుణపిశాచగణము తాండవమాడఁజొచ్చి గోరంతలనే కొండంతలుగాఁ జూచి, యమ్మయో మహోమున్నది! మనపక్షమునకును దేశమునకును మహోపద్రవము కలిగినదని బాహాటముగాఁ బ్రకటింపఁదొడఁగుటయు నౌదార్య మనుమాట వెనుకఁబట్టి ప్రతిపక్షుల యెట్టిగుణముల నైనను ప్రబలదోషములుగానే పరిగణించి చాటుచు, స్వపక్షదోషములను వంద్యగుణములుగానే నిశ్చయించి గణుతించుచు, మొండితనము మీఱిపోవుటయు సంభవించి, స్వార్థమే పరమార్థమై గర్వమే సర్వమై, గణనాతీతము లయిన గళగండములు గండుమిగులక మానవుకదా!

ఇట్లు కేవలపక్షాభిమానముచే నలువురును బాడెడిపాటయే పరిపాటియై, గుణాగుణవిచారము కుంటువడిపోయి విమలనీతిధర్మములు విస్మరింపఁబడి సంకుచితభావములే సర్వోత్కృష్టములుగాఁ బొడకట్టును. ఈవిధముగా వివేకమే విలుప్తమైనపుడు, మానవుఁడు మఱి స్వర్గరాజ్యాధిపత్యము పడయఁగల్గినను, దాన నేమి ప్రయోజనము! అది యెంతకాలము నిలువ నేర్చును? సర్వగుణములలోను వివేకమే దివ్యగుణ మనియు, నది సంఘహృదయమున లోపించి యన్యాయ ప్రబలినయెడ, సమాజక్షేమమునకై బాహ్యాధికారము తప్ప దనియు సాక్రటీసుమతము ననుసరించి 'ప్లేటో' యను శాస్త్రకారుఁడు నిర్ధారించి యున్నాఁడుకదా!

## రోమకరాజ్యము—రాజ్యాంగపక్షములు

రాజ్యాంగమునందు పక్షములు బయలుదేఱిన నవి యెట్టులుం దగునో తెలిసికొనుటకై, పూర్వకాలమున రోమకసామ్రాజ్య నవి యెట్టులుండెనో, మఱి యింగ్లాండులో నెట్లు మాఱుచ చున్నవో మనము గుర్తెఱుఁగక తప్పదు. మొదట రోమక

ములో ప్రభుజన మను నొకతరగతివారును, జనసామాన్యపక్ష మను మఱియొకతరగతివారు నుండిరి. ఈరెండుజాతులలోను మొదటివారే సర్వాధికారులై యుండ, రెండవతరగతివారు అధికారరహితు లయి నందున హక్కులకై పోరాడుచుండిరి. కాని, దేశశత్రువుల నెదుర్కొ వలసివచ్చినప్పుడు మాత్రము, వారిలో వారికి పరస్పరసహాయము వెల యుచునే వచ్చెను. తమలో నేవో యభిప్రాయభేదములు నధికార భేదములు నున్నంతమాత్రమున, వారిదేశభక్తి కెన్నండును లోపము కలుగ లేదు. తర్వాత, మఱికొంతకాలమునకు వారిలో శ్రేయోదాయ కముగా సమత్వము నెలకొనెను. అనంతరము దేశములోని పేదలకును సంపన్నులకును పోరాటము ఉదయించెను. అటుపిమ్మట, అధికారము వహించి యుండిన అభిజాతులకును, మఱి ఉద్యోగాదులలో లేక స్వాధికారకాంక్షగలిగియుండి 'నోవిహామినీ' లని, చెడి బ్రదికినవాం డ్రని, నిన్న మొన్న తలయెత్తినవాండ్రని, తెగడుపడుచువచ్చిన యనధి కారసభ్యులకును, కయ్యములు తలయెత్తెను. వీరుభయులును ప్రాయిక ముగా వ్యవహారాదులలో లంచగొండులే యైయుండినను, నీతిబాహ్యు లేయై యుండినను, నిశ్చయముగా నిచ్చటనే తొల్లొల్త రాజ్యాంగ పక్షములు బయలుదేఱినవి. అయినను, వారి నీతిరాహిత్యమును, అధర్మపరాయణతయు, విధి ననుసరించి విషఫలములం గొనియే వచ్చె ను. కాలక్రమమున వా రిర్వురును ధర్మశూన్యులేయై, భ్రష్టత నందియుండ, జయశాలి యైనయుద్ధవీరుండు, బలవంతుం డొక్కండు, జూలియసు సీజరు విజృంభించి, మొదట నట్టిప్రజాస్వామిక మగు స్వ రాజ్యమును కూలంద్రోసెను. ఒక్కరాజున్నతో, మఱియేనాయకునకో లోంబడి యుండియు, పైకి మాత్రము స్వరాజ్య మనుపేర పైచిన్నెలు గలిగియుండిన యొకచందముగ ప్రభుత్వమే, నిరంకుశప్రాభవమే జూలి యసు సీజరు నధికారముక్రింద సాగం జొచ్చెను.

ఈవిధముగా స్వార్థపరత్వమే కల్గియుండి, యట్టివృత్తులే యావేశించియున్న యేపక్ష మైనను, తనతోంటియుద్దేశము నే కూల్చి వేసికొని, ప్రజాస్వామికమును మూలముట్టుగా వినాశముపాలు చేయును.

మఱి ఇంగ్లాండు చరిత్రధోరణి నించుక పరిశీలింతము. పదు నేడవశతాబ్దములోని రాజద్రోహపూర్వక మైన యంతఃకలహములో, సంగ్రామముతో నొకయుద్యమము పొడసూపి కడపు రాజును దేశ భ్రష్టుని జేసి యొట్టకేలకు మొత్తముమీంద నిరంకుశరాజ్యమును నిర్మూ లముచేయుటతో నది పరిసమాప్తి నందినది. ఈవిప్లవము జరగంగానే పెద్దపెద్దవిషయములలో భిన్నాభిప్రాయములు కలుగుట సహజమే యైపోయినది. ఇంగ్లండులో నిట్టిభిన్నపక్షములచేత నడుచు పాలన తంత్రము మొత్తముమీంద సరళముగానే సాగుచు వచ్చుచు, బహు ళముగా శ్రేయోదాయకముగానే పరిణమించుచున్నది.

ఏయాధారములను నిమిత్తములను బట్టి యాంగ్లదేశమున పక్ష ములయొత్తుచు వచ్చినవో పరిశీలించిననే కాని, రాజ్యాంగవ్యవ స్థలో నవి యెట్లుండుట ఫలప్రదమో, మఱి యెట్లున్న ననర్థ కమో నిశ్చయించుకొనుట మనదేశములో నసాధ్య మగును.

మొట్టమొదట 'విగ్గు' లను పార్లమెంటుపక్షము రాజపక్షావలంబులను వేఱుగుటతో నచ్చట పక్షం విగ్గులు పరిశ్రామికపక్షవాదులు, టోరీలు భూ స్వాము లయి యుండినందున పరిశ్రామికవాణిజ్యసంబంధ యుద్ధము లెల్ల 'విగ్గు'లచే నామోదింపంబడుచుండిన సమ్మతి పడయుచుండినవి కావు.

అనంతరము, రెండవభేదము మతవిషయ లను బట్టి కలిగినది. పైం జెప్పిన 'టోరీ' లే 'హై చారపరాయణశ్రేణికి సంబంధించివారై యుండ, చర్చి' యనువారును, పూర్వసంప్రదాయము లంగీకరింప టరు" లనెడి నూతనసంస్కారపక్షమువారు, నై యుండిరి.

తర్వాత, ప్రచండముగా పరాసీవిప్లవ మయి, తన్మూలం ధర్మాందోళనము సకలవిషయములలోను ప్రారంభమై, యాత్మవి మతిశయించుటతోడనే, గ్రుక్కుమిక్కు మనక పాక్షికభేద మూల కొంటిగి పోవలసిన విధి తటస్థించెను. ఇది మూండవయుగ అతివాదు లయిన 'విగ్గు'లు మాత్రము, ఫాక్సునంటివాని నాయ త్వముక్రిందనో తొంటిరూపముననే దృఢముగా నిలిచి యుండంగల్గి

అటువెనుక, పార్లమెంటువిధానమును సంస్కరింప సమస్యవిషయమై భేదములు పొడమెను. అప్పుడు 'విగ్గులు' సంస్కా సుముఖులై, 'టోరీ'లు మార్పులకు విముఖులై, పోరాటము సాగిం దొడంగిరి. పర్యవసానమున, సంస్కారపక్షమువారే విజయసిద్ధి గాంచుటయు, 1832-వ సంవత్సరములో సభ్యనియమనస్వాతం త్ర్యము ప్రజలలో నెంద ఱెందఱికో లభించుటయు, శాసనబ ముగా వారి యధికారార్హత నెలకొనుటయుం దటస్థించెను. 1[illegible] సంవత్సరము రాంగానే, యప్పు డధికారములో నుండిన 'టోరీ' మువారు వేఱొక సంస్కరణశాసనము కావించి, ప్రజాధికార మును విస్తరిల్లంజేసిరి. ఇదియే తురీయయుగము. ఇందు, స్వదేశ లాభమే వారికి ఏకలక్ష్యమైయుండెను; గాని, యంధప్రాయముగా పూర్వపద్ధతుల నంటంబెట్టుకొని యుండుట కాదు.

ఈ యంశమునుబట్టి చూచినయెడల పక్షవాదములు అభివృద్ధి కరముగా, మార్పులు చెందుచుండవచ్చు నని మనము గ్రహించుకో వగును. అట్లగుటకు, సర్వపక్షములవారికన్నులయెదుట దేశహి తమే ప్రధానమై, ప్రథమగణ్యమై యుండవలయుం గాని, స్వపక్షము వారి కేనాలు గుద్యోగాదులో సంపాదించుకొంగల్గుటే పరమార్థ ముగా నుండరాదు.

అనంతరము ఇంగ్లాండులో పైదవయుగము ప్రారంభమైనది. అప్పుడు, ఉదారపక్షమువా రయిన 'లిబరలు' లకును, స్వేచ్ఛా వాణిజ్యవాదులకును, గట్టిన పోరాటముతో నిది భిన్నత దాల్చి చండ తరపక్షవాదములు బయల్వెడలినవి. భూస్వాములు ఎగుమతి దిగు మతులవిషయమున నిరాతంకముగా జరుగు వాణిజ్యము కూడదని స్వ లాభపరాయణులయి ఘోష పెట్టిరి. కడకు, ఈ పోరాటమున స్వేచ్ఛా వాణిజ్యవాదులకే విజయము ప్రాపించెను.

ండు దీవివారికి స్వరాజ్యము సమకూర్చు విష స్కాట్లాండు దీవులతోఁ గలసియే యుండమని ఌ గ్లాడుస్టను మహాశయుని చేతిక్రింది యుదార ర్లాండు స్వరాజ్యపక్షావలంబులతో బుజములు ఫునను, నిలువఁగానే మఱి రెండు ప్రబలపక్షములు గోఁ గొంద ఉదారపక్షమువార మని చెప్పు వేసి, వేఱుగా నిల్చిరి. ఇటీవల, ఐర్లాండును గా పరిగణించినప్పటి నుండియు, నిందుననే మొదట ూ భిన్నపక్షములు కేవలము వాణిజ్యము విషయమైన ూచించుటకే యన్వయింపఁబడుచున్నవి.

ఇంతలో, 18-వ శతాబ్దమునుండియు వాణిజ్యవ్యవహారము ఁ గల్గుచు వచ్చిన విప్లవములవలనఁ బనివాండ్రకుఁ గల్గిన విప మ సంక్షోభములను అడంచివేయుటకై, జీవనోపాధికి పనులు ంపఁజేయుటకై, యందునుగూర్చినవిషమసమస్యలఁ బరిష్కరించు కై యిప్పుడు పక్షము లవలంబింపఁబడి యున్నవి.

ఈ యంశములను బట్టి, మొత్తముమీఁద దేశమునకెల్ల లాభ ము లయిన విషయములను గూర్చియే, తాత్కాలిక పరిస్థితుల కుగొను వ్యవహారముల పరిష్కారము చేయుటకే, యాంగ్లదేశమున ములు రూపొందుచుండిన వని సులభముగా గ్రహింపవచ్చును.

స్వపక్షమువారి ధర్మము లెట్టివో, వాని ముఖ్య మొగము ణెట్టివో, లెస్సగా నెఱిఁగి యుండకపోయినను, పరపక్షమును పర మువారిని తెగడుచున్నంత మాత్రమున నొకనిని దనవారిలోఁ వాఁడే యని భ్రమపడుచున్నంతకాలము, పక్షవాదములకు, ్యాంగవ్యవహారములలో, గురుస్థాన మిచ్చిన, ప్రయోజనము కలు గుట, వట్టిమాట. ఒండొరులలోఁ గల్గు ద్వేషాసూయాదులు, నెను కటిమంటలు, దేశసంబంధివ్యవహారముల నడుపునపుడు పైకొను చుండి, సామాన్యధర్మమునకే భంగము కలుగుచుండునేని, స్వరాజ్య సోపానములలో మొదటిమెట్టయిన నెక్క నేర్చినవారము కాము. సభల కెక్కి యేమి చేయవలయునో చర్చించువిషయ మెట్టిదో, దాని యుద్దేశము ఫలము నెంతవట్టు పోవచ్చునో, భావనాశక్తిబలమున నూహింపనేరనివారిలో పక్షవాదములు నిలుపుకొన్న నేమి ప్రయో జనము? ఉపన్యాసము లిచ్చిన నేమిఫలము? షేక్స్పియరు మహాకవి రచించిన నడివేసఁగినాఁటిరాత్రి నాటకములో నొక ప్రస్తావనలో ఒకఁడు "సింహపాత్రమునకుఁ గావలసిన 'పార్టు' అంతయు నీవు వ్రాసికొనియుంటివా?" యన, "లేదు బాబూ! వ్రాసిన దేమై నా ఉన్నట్లాయెనా, నాకు దయచేయండి. వల్లించడమంటే, నాకు కొంచెము ఆలస్యము అవుతుందండి." అని చెప్పఁగా, "అబ్బే! ఆలాటి ప్రయత్నము ముందుగా ఏమియు చేయ నవసరములేదు. నోటి కి వచ్చినట్లెల్ల అప్పటికప్పుడే అఱవవచ్చును." అని సంభాషణము జరగినవిధముగా, నేదో యొక ప్రశ్న మడిగి, "సరియైనపద్ధతిని, సరి యైనవారిని, సరియైనచోట, ఈప్రశ్నము అడిగిన, బాగుగా నుండు నేమో, యన్నట్టు ఒక సమాధానము పడసి; కడకు దాని నుపసంహ రించుకో వలసి యుండెడివారిని బోలు సభ్యులసంఖ్య శాసనసభలలోఁ బెరిగిన నేమి లగ్గు? అట్టియెడ, పక్షవాదములతోఁ బని యేమి? తక్కిన పక్షములవా రెవ్వరును మనోరథములుగా, ఆదర్శములుగా, పెట్టు కొని యుండని సమష్టిదేశధర్మమును ప్రత్యేకముగా నొకదానిని గల్గి యుండని కారణమున, బ్రాహ్మణేతరపక్షమువంటి పక్షములు నిశ్చ యముగా రాజ్యాంగపక్షములుగాఁ బరిగణింపఁ దగ వనియే నిర్ధారిం పక తప్పదు. ఆంగ్లాదిదేశములలోఁ బక్షములు తలయెత్తుట వేఱు. అవి యతర్కితభావముతో, నిర్దిష్టధర్మసంరక్షణార్థము బయల్వెడలి నవి. పరాధీనదేశములలోఁ బక్షాభిమానము లుండుట విడ్డూరము! ఎవరికిష్టమైనపక్షమున వా రున్నారు మన కేమని మన ముపేక్షాభా వమునూని యుండుటయు నసంభవమే. దురహంకారముచేఁ బిచ్చి యెత్తినపక్షవాదులు, కంటఁబడువారినెల్ల కాటువేయుచునే యుం దురు. ఎమర్సన్ మహాత్ముఁడు వచించినవిధముగా నట్టికాటుతో మనకును పిచ్చియెత్తిపోవును. విశ్వధర్మమునకే, ధర్మపక్షమునకే, భరతఖండమున స్థానమీయఁదగు గాని, యర్థధర్మములకును, పాక్షిక ధర్మములకును ప్రమేయమే యనుచితము. ఇది గ్రహింపఁగల్గు ధర్మ పరాయణులు లేరా, నేఁడును మనయార్యావర్తమున? ఓం తత్సత్.

# ఉషః ప్రబోధము

## పెనుమర్తి వేంకటరత్నముగారు

శ్రీ అంబరవీథికావిహరణాంచితమంజువిహంగగానరా
వంబుల నీయశోమృదురవంబుల నెక్కడ మేళవించి వై
శంబ జనంబులన్ నిదురలన్ విడఁగొట్టి పవిత్రమాతృపా
దంబులసేవఁ జేయఁగ నొనర్ప దొరంకొను మాంధ్రపుత్రకా!

సీ. గౌతమీస్రోతస్వినీతరంగాళిలో, జిలిబిలిరాగాల విలసనంబుఁ
దెలుఁగుఁ గవిత్వంపు తేటపల్కులలోన, ముసురుకొన్నట్టి సమ్మోహనంబుఁ
బలనాడువీరగీతుల లాస్య మొనరించు, బాలచంద్రునిశౌర్యప్రాభవమ్ముఁ
జెలువుఁ బాసిన యోరుగలుకోటగోడల, వలపించు కాకతీయులయశమ్ము
నొకటఁ దలపోతఁ గోష్ణబాష్పోదకములు, కనుగెలంకులసారిది నుద్గతములగును
మఱచిపోతివి నీయశోమంజుగీతి, జ్ఞప్తి కెలయింతు, నాంధ్రయోషాసుపుత్ర!

సీ. పరువెత్తినారు కృపాణావలోకన, చలితహృద్వృత్తులై శత్రుజనులు,
వినుతించినారు నీ ఘనపరాక్రమమును, మధురగీతముల సామంతనృపులు,
ఆశ్చర్యమొందినా రనుపమశిల్పక, ళాభిజ్ఞతను గని యఖిలజనులు,
ధన్యులైనారు నీధారుణీస్పర్శచేఁ, బరదేశవాసులౌ ధరణిధవులు,
నేఁ డిటుల స్మరణమాత్రమై నెగడెఁగాని, పొగడఁదరమౌనె నీపూర్వపౌరుషాగ్ని
దహ్యమానవిరోధివితాన మట్టె, మహితచారిత్ర! శ్రీయాంధ్రమాతృపుత్ర!

సీ. కృష్ణరాయనియశోగీతికావళిఁ బాడుఁ, దుంగభద్రాంతస్తరంగమాల
కాకతీయాంధ్రుల వీఁకె యోర్గలుకోట, రామణీయకమునఁ బ్రామికొనియెఁ
జాళుక్యకీర్తికన్యాలసగమనంబు, గౌతమీవీచికాపూత మయ్యె
బొబ్బిలికోటలోఁ బౌరుషజ్వాలనంబు, జంగాలకతల విశ్రాంతినొందె
వీరపలనాడుశోభావివిక్త మగుచు, నశ్రులఁ దొరంగఁ జేసెడు నక్షియుగళి
స్మృతికిఁ దెమ్ము భవత్పూర్వవితతయశము, మహితచారిత్ర! శ్రీయాంధ్రమాతృపుత్ర!

సీ. కుసుమగుచ్ఛములలోఁ గ్రొందేనెఁ జిలికించు, కవితారభటియందుఁ గమ్మదనము,
వీరాదిమానసవిదళన మ్మొనరించు, విక్రమలక్ష్మిపవిత్రపూజ
శారదాంబావిపంచీరవమ్ములఁ దార్చు, మంజులసంగీతమధురిమంబుఁ
గోటగోడలపైనిఁ గ్రొత్తందనముఁ గుల్క, లాలితశిల్పకళాపటిమము
నెడఁదఁ దలపోసి, కాలంపుఁగడిమిచేత, దాస్యపిహితములైన చిత్తములలోన
వెల్లువగ శౌర్యబీజాలఁ జల్లుమయ్య! మహితచారిత్ర! శ్రీయాంధ్రమాతృపుత్ర!

గీ. డంబుమీఱడి తారకాధ్వంబునందుఁ, గురిసెదరు; దేవతావళి విరులవాన
విప్రసత్తము లాశీఃపవిత్రగీతి, నాలపింతురు! శుభ మగు నాంధ్రతనయ!

# శాసనావళి

## సి. ఆర్. కృష్ణమాచార్యులు గారు

'ని ఆర్షవిచారణశాఖ*లో రెండు ఉప ) లున్నవి. ఒకటి కేవలము పురాతనదేవా , కోటలు. మసీదులు, నిసీధులు, మున్నగు ులను వెదకి, పరిశీలించి, వానిని కాపాడుటకు నున్న, మఱియొకటి దేశములోని శిలాశాసనములను మ్రశాసనములను పరిశీలించి వానిలోనిసంగతులను టించుటకున్న ఏర్పడియున్నవి. ఈ విచారణశాఖలు ప్పటికి సుమారు 30 సంవత్సరములుగ చెన్నరాజ నిప్రభుత్వమునకు సంబంధించి యుండినవి. ఈకాల సందంతటను హిందూదేశములోని యాయారాజ సంబంధించిన ఆర్షవిచారణశాఖలు ప్రత్యేకముగ వి. ఇటీవల నిచటినుంచియు యీశాఖ సామ్రాజ్య ప్రభుత్వమునకే సంబంధించియుండునటుల నేర్పాటు చేయబడినది. ఈయేర్పాటువలన నొక మార్పుమాత్రము టస్థించినది. ఇదివరకున్న యేలేటికిని ఆర్షవిచారణా ధ్యక్షులైన ఆర్కియలాజికల్ సూపరింటెండెంటులు తమ వార్షికనివేదికల(Annual Reports)ను ప్రత్యేకముగ నా యారాజధాని ప్రభుత్వములక్రింద ప్రకటించుచుండిరి. వీని యందు క్రొత్తగ కనుగొనబడినపురాతనకట్టడములను గుఱించినవ్యాసములును వర్ణనలును ప్రకటితము లగు చుండినవి. ఇదిగాక సర్కారువారి యాధీనములోనికిని వారి పోషణలోనికిని తీసికొనబడిన వాటికి జరిగిన జీర్ణో ద్ధారములవివరమున్ను అందులకుగాను వ్యయమైన పైక ములవిషయమున్ను వ్రాయబడుచుండును. పైనచెప్ప బడినమార్పుయొక్క ఫలితముగ యీవార్షికనివేదికల ప్రచురణము నిలిపివేయబడినది. ఇందుకు మారుగా ప్రతి సంవత్సరమునకును హిందూదేశమున కంతకున్న ఒకటే వార్షిక ఆర్ష విచారణనివేదిక ప్రకటించబడును. కాని శాసనోపశాఖయొక్క వార్షిక నివేదికమాత్రము మునుపటివలెనే ప్రత్యేకముగ ప్రకటింపబడుచుండును.

ప్రత్యేక శాసనోపశాఖ చెన్నరాజధానిలో మాత్రమున్నది. దక్షిణదేశములో దొరకుశాసనములసంఖ్య గొప్పది. కావుననే యిచ్చట నొకప్రత్యేకశాసనశాఖ స్థాపింపబడినది. ఈ శాఖవారిచేత సంవత్సరమునకు సుమారు ౬౦౦ శాసనములకు తక్కువలేక సంపాదింప బడి వాటిలోముఖ్యాంశములమీఁద ప్రస్తావనలు (Notices) యీ శాఖయొక్క వార్షిక నివేదికలో ప్రకటింపబడుచుం డును. ఈకారణమున నీ నివేదిక యితరఆర్ష విచారణ శాఖలనివేదికలవలె గాక వేఱై యున్నది. ఈ విషయ మును గమనించియే ఆర్షవిచారణ సర్వాధికారియైన డైరెక్టరు జనరల్ గారు శాసనశాఖయొక్క వార్షికనివే దిక పూర్వమువలె ప్రత్యేకముగనే ప్రకటించవలసిన ఏర్పాటు చేసియున్నారు. ఇది యెంతయు సంతోషింపతగిన విషయము. ఏలననగా ౬౦౦ శాసనములు పూర్ణ ముగా ముద్రింపబడుటకు యెన్నియో సంవత్సరములు పట్టును. దేశచరిత్రకివి యందిచ్చు సామగ్రి చాల విలువ గలదై యున్నందున సద్యఃఫలముగ నీ వార్షికనివేదికలలో ప్రకటితములగు శాసనప్రస్తావన లెంతయు నుపయోగ కరములు.

ఆంధ్రప్రపంచ మిటీవల జ్ఞానార్జనకై చేయు ప్రయత్నములు పలుతెఱంగులై యున్నవి. అభినవాంధ్ర సారస్వతముయొక్క విలాసము లన్నివిధములను విల సిల్లుచున్నవి. బంగారుకు పదునాఱువన్నె లెక్కిన యట్లుగా దీనికి క్రొత్తవన్నెలు పుట్టుకొని వచ్చుచున్నవి. చారిత్రకాన్వేషణాసక్తి యనునూనముగ నాటుకొని మొలకలెత్తి యున్నది. ఈ సమయమున నాజ్ఞానవృ మునకు ఆలవాలమని చెప్పతగిన శాసనావళిలోని స నాంధ్రచదువరులకు సందిచ్చు టెంతయు నవ సని. శాసనశాఖయొక్క వార్షికనివేదికలోని ము ములే యాంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో ప్ర బడుట సమంజసమేకదా! ఈ ప్రకటన మాంధ్ర చమున కభిమతమే అగునని మానమ్మకము. మఱియొక ప్రయోజనము గలదు. పూర్వులగ ములు నమూల్యవిషయములు గల శా

---

* ఆర్కియలాజికల్ డిపార్టుమెంటు.

జనుల యొక్క శ్రద్ధకున్ను మౌఢ్యజనితమైన దూష
ణకును దుర్వినియోగమునకును బాత్రములగుచున్నవి.
ఇది యజ్ఞానాంధకార సంభవమైనను హేయస్థితిగాక
వేఱొండు కాఁజాలదు. లోకసామాన్యమున కీపూరాతన
ముల స్వభావములు దేశభాషలో తెలియజేయకుండుట
తెలిసినవారిదోషము. 'రాజా రాష్ట్రకృతం పాపం రాజ
పాపం పురోహితః' యనియున్నట్లు. 'జ్ఞా న్యజ్ఞానికృతం
పాపం జ్ఞానిపాపం పురోద్రష్టా'. యనియు చెప్పవచ్చును.
తెలియనివాఁడు చేయుపాపములకు తెలిసినవాఁ డడ్డపడ
కుండుటచే పాపములకు బాధ్యుఁడగుచున్నాఁడు. తెలిసిన
వాఁడు చేయు పాపములకు ముందు వెనుక చూడనేర్చిన
వారు గ్రహించ కూరకుండుటచే బాధ్యులగుచున్నారు.
ఈపూరాతనముల స్వభావము లెస్స యెఱిగియుండినచో
అమరావతిస్తూపములోని విలువగలిగిన యనేక చిత్రఫల
కములును శాసనపురాస్లున్న రాజావాసిరెడ్డి వెంకటాద్రి
నాయునివలన దుర్వినియోగపడునా? కృష్ణామహానదికి
ఆనకట్ట కట్టునట్టి యిప్పటి "యింజినీరులు' వివచ్ఛలేకయు
మనసున నేలాటి శంకయును లేక నిట్టియమూల్యములను
పునాదులను తూములను కట్టుట కుపయోగింతురా? ఇప్ప
టికి నిలచియున్నవిగాక యెన్ని పురాతన శాసనములు
వీటితో నశించిపోయినవో యెవ రెఱుంగుదురు? ఇదిగాక
పూర్వకాలపురాజాధిరాజులు తగుమైనవారికి భూమ్యాది
దానముల నిచ్చుచు ఆచంద్రార్కము శాశ్వతముగ నిలు
చుగాక యని తామ్రపత్రములమీద వ్రాయించి యిచ్చి
యుండగా నాపత్రము లిపుడు పడుపాటులను తలంచుకొని
నచో తలవంపులగును. పామరులచేతికి రుపి దొరికిన
ముందే దారిద్ర్య నిహతులైనవీరలు కంసాలియింగడికి
కొనిపోయి కరగించి కడుపార కుడుచుటకు పోయెదరు.
ఆచంద్రార్కము నిలుచుగాక యని యిచ్చినదానము
వానలో గలసిపోయినది. దానపట్టమును శ్లాఘనీయముగ
వ్రాసిన హేమకారుని జాలివాఁడే యిపుడాలోకింతయు వెను
దీయక పత్రముల నశ్వరస్థితికి కారణ మూహించకనున్న
టికివాఁడు మృగమును కత్తితో నటికినట్లు రేకులను
ఎండు గా నులితో తునియగొట్టి కుంపటిలో వేసి కర
చు మహాపాతకము నొడిగట్టుకొనుచున్నాఁడు. దేశ
కెట్టిబుద్ధిజాడ్యమున్ను దౌర్మనస్యమున్ను జనించి
కరఁగించుకంసాలి కటికివానికంటెను కడునింద్యుడు

ఈకంసాలి యన్ననో, దానము జేసినరా
మున కీర్తిశేషుడయినను అతనివంశమును
కీర్తినిన్ని ఘోషించు యీతా శాసన
పినపుడె రాజహత్యయును రాజుచేత దా
దేప్రుడయినచో చారిత్రకులభావమున
మును లేదా బ్రాహ్మణుఁడయినచో
చేసినవాఁ డగుచున్నాఁడు. ఇదిగాక
లేఖకునికూడ నాశనము చేసినవాఁ డగు.
శాసనమునెడల వలసినంతగౌరవమును జన
నకు గలుగజేయుట ప్రతిదేశాభిమానికిని విడ
కిని ప్రథమవిధియై యున్నది. అట్టి ప్రయత్నము
తోడ్పడుటకుగా నీశాసనావళిసారాంశమును ప్రచ
బూనితిమి. దీనిపఠనమువలన నాంధ్రదేశమున నిక పై
తనదూషణముగాని శాసనశిలానాశముగాని
శాసనహత్యగాని జరుగకుండ నుండునని నమ్ముచున

ఇక శాసనశాఖవారు 1921-22 సంవత్సర
జరిగించిన విమర్శనలను పేర్కొనెదము. ఈ
మున 808 శిలాశాసనములను వీరు సేకరించిరి
665 శాసనములయొక్క సంగతులు వార్షికని
సూచింపబడియున్నవి. ఇవిగాక 16 తామ్రశాసనము
లున్ను పరిశీలించి వీనిలో విషయములను గుఱించి
వ్రాయబడియున్నది. ఈ తామ్రశాసనములలో
నవీనములైన వెవ్వియును లేవు. కాని యొకటి
మాత్రము ముఖ్యమైనవి యున్నవి. గోదావరిజిల్లాబో
ర్డు ప్రెసిడెంటుగారి మూలముగా బందరుదేశీయకళాశాలకు
చేరిన మహారాజరాజశ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి
గారుపంపిన తూర్పు చాళుక్యుల రాజయినట్టియు ఇంద్ర
భట్టారకుడను నపరనాముడైన ఇంద్రవర్మమహారాజు
యొక్క శాసనము నూతనచారిత్రకాంశము. ఈ చాళు
క్యుల యితరతామ్రశాసనములను బట్టి చూచిన నితండు
ఏడుదినములే రాజ్యముచేసినట్లు కనబడును. కొంతమంది
యభిప్రాయము ఇతఁడు సింహాసన మలంకరించలేదనియే.
అట్టి సందేహాస్పదముగానుండు విషయమున నీతామ్ర
శాసనము అతడు రాజ్యముచేసినందులకు గొప్పరుజువుగ
నున్నది. ఈ శాసనపట్టములకు తగిలించియుండు వలయ
మున కిమిడ్చబడిన ముద్రికమీద "త్యాగధేనువు" అని
వ్రాయబడియున్నది. ఇది ఇంద్రవర్మయొక్క ప్రధానగుణ
మైన దానశీలమును ప్రచురించునట్టిబిరుదుగా నుండ

[2] కటికివాఁడు మృగమాత్రమును వధచేసినవాఁడు.

...వాజగోత్రీయుఁడును వాజసనేయచరణీ ...ండిశర్మ యను బ్రాహ్మణునికి కొండ ...మమును బ్రహ్మదేయముగా రాజు ...నొప్పఁబడియున్నది. శాసనలేఖకుఁడు

...హ్మణ్యశాస్త్రిగారే మఱియొకశాస ...ది ప్రధానరాజవంశములకు వేనికిని సం ...ధు. ఇది మలయములనాయకులైన సూర్య ...లకు సంబంధించినది. ఈ వంశమువారు దాశ ...మునియనుగ్రహమువలన వృద్ధిచెందినట్లు చెప్ప ...యున్నారు. వీరు మద్దూరిపురవ రాధీశ్వరులు. సర్ప ...పట్టుకొనియుండు గరుడపక్షియును దర్పణమును ...ద్రికలాంఛనములు.

కృష్ణజిల్లాలోని ఏలూరు డిప్టికలెక్టరు పంపిన మఱి ...చాళుక్యశాసనమున్ను కలదు. ఇది అంతిమ ...కుల్లలలో నొకండగు ప్రథమకులోత్తుంగ చోళుఁడను ...చోళసామ్రాజ్యసింహాసనము నలంకరించిన ...వారు డగు ద్వితీయరాజరాజుయొక్క శాస ...ము. ఈశాసనములో నితనికి 'సర్వలోకాశ్రయ శ్రీ ...ష్ణువర్ధన మహారాజు' అను చాళుక్యబిరుద మివ్వబడి ...న్నది. ఇతఁడు చోళసింహాసనమున కధిపతి కాక ...ను వెంగి రాజ్యమునకు రాజప్రతినిధిగా నున్నప్పుడు శాసన మనుగ్రహించి యుండవలెను. శాసనము యొక్క యుద్దేశమే మన, రాజుకు ముఖ్యమిత్రుఁడగు నట్టియు సహకారియయినట్టియు సామంతరాజయినట్టియు ముమ్మడి భీము డను సూర్యవంశ ప్రభునకు వేయి గ్రామముల వేంగివిషయమున కధిపతిగ కార్యనిర్వాహ కము చేయుటకుగాను ౧౨ గ్రామములను పన్నులేక మన్నియనిబద్ధ మాధిపత్యముగ నిచ్చుట. రాజరాజు గంగకళింగకుంతల రాజులతో చేసిన యుద్ధములలో ముమ్మడిభీముఁడు చాల తోడ్పడి యుండెను. శాసనకర్త ము త్తయభట్టు. శాసనలేఖకుఁడు పట్టాలుడు. శాసన కాలము సుమారు క్రీ. శ. ౧౦౭౬ సంవత్సరము. శాస నములో చెప్పఁబడిన హద్దులలో నిరవద్యపురమును ఊరు చెప్పఁబడియున్నది. ఈ నిరవద్యపురముననే తూర్పు చాళుక్యభీమునికిని, వల్లభాపర నామముగు రాష్ట్రకూట వంశపుప్రభువగు ద్వితీయకృష్ణరాజుయొక్క సేనాని యైన దండెనగుండకును యుద్ధము జరిగియుండెను.

ఈ సంవత్సరమున గంజాముజిల్లాలోని మునగ వలసయను గ్రామమువద్దనున్న 'దంతవక్త్రుకోట'యను పాడుపడినస్థలము పరీక్షచేయబడెను. ఇది ఇచ్చటిలో కోట్టిలో పురాణ ప్రసిద్ధుడగు దంతవక్త్రునియొక్క కోటయని చెప్పబడుచున్నది. అందులకు రూఢియైన యాధారము లెవ్వియును గానరావు. ప్రదేశముయొక్క వైఖరిచూచిన యిది పురాతనస్థలముగ నుండియుండ వలెనని తోఁచుచున్నది. ఇపుడు నిలిచియున్నంతవరకు దీని యాకృతి యీక్రిందివిధమున వర్ణించబడియున్నది.

కోట ప్రాకారము మంటిదేను. రాతికట్టడ మెక్క డను కానరాదు. ఇప్పటిస్థితిలో ప్రాకారము కొన్నిచోటు లలో ౩౦ యడుగుల యెత్తుండును. క్రిందిభాగమున ౪౦ మొదలు ౫౦ యడుగులవరకు మందముండును. తొల్లి దీనికి నాలుగు సింహద్వారము లుండినట్లు చెప్పుదురు. కాని యిప్పుడచ్చటచ్చట వానకు మన్ను కరగి గండ్లు ఏర్పడియున్నవి. ప్రాకారము వట్రువముగా పోయియున్నది. దీనిచుట్టు కొలత మూడుమైళ్లకు పయిననుండవలెను. మునగవలసకు చెంతనున్న కోటభాగమున ఎఱ్ఱరాతితో చేయుబడిన కొన్నివిగ్రహములు మాత్రము దొఱకినవి. వీనిలో ముఖ్యమైనది కోట దుర్గవిగ్రహము. దీనికి సామాలమ్మయనుపేరును గలదు. దీని పనితనమునుబట్టి యిది ౫౦౦ సంవత్సరములకంటె పూర్వికమయి యుండ వచ్చును. విగ్రహములో విచిత్రాంశమేమన కిరీటమునకు ముందుభాగమున మూడుశిరస్సులు అలంకారముగా చూపబడియున్నది.

కోటయావరణములో నచ్చటచ్చట యిటుకరాతి ముక్కలను కుండపెంకులు కానబడుచున్నవి. ఆదిగాక మధ్యపుదేశమున కొన్నికొన్ని భాగములు దాదాపు ప్రాకా రపు ప్రస్తుతపుయెత్తున కున్నవి. ఇవియన్నియును పురా తనజనస్థానములకు రూఢియైన చిహ్నములు. ఈ ప్రదేశ మును త్రవ్వి పరీక్షించిన యప్పటివాసగృహములు దేవా యము లెవ్వియైన బయలుపడుననుటకు సందేహము లేదు.

శ్రీకాకుళమురోడ్డురైలుస్టేషను నుంచి ము వలసకు పోవుదారిలో పాండవులమిట్టయను నొక తిప్ప మీద కొన్ని 'డాల్మెను' లను మండపము లున ఇవి తిప్పమీద నమర్చబడియున్నవి. వీనికి ప్రక్క ల్లోను పైనను నుండురాళ్లు చెక్కరాళ్లుగాక బండరా నున్నవి. వీనిలో చిన్నవి పెద్దవి కూడనున్నవి.

యెత్తుగల డాల్మెను* మండపముగూడ నిచట నున్నది. ఇది యీప్రదేశముయొక్క పౌరాతన్యమును స్థాపించుచున్నది. ఇదిగాక యీతిప్పలో నొకభాగమున గుహయొకటి యున్నది. ఈ గుహాకు పైకప్పుగనుండు కొండరాతిలో పైవాననీళ్లు లోనికి కారకుండ నుండుట కొక సన్నని కాలువ తీయబడియున్నది. ఈ కాలువగుండ వాననీళ్లు ఒకప్రక్కకు పారిపోవుట కిది యొక పూర్వీకుల యుపాయము. ఇట్టి కాలువలు దక్షిణదేశమున పూర్వపు పాండ్యరాజ్యమైన యిప్పటి మధుర తిరునల్వేలి జిల్లాలలో కొన్నిచోట్ల కనుగొనబడిన గుహాలకును ఉన్నవి. ఈ గుహాలలో కొన్నింటియందు రాతిలోననే పడకలున్న వాటికి తలగడలున్న తీర్చబడియున్నవి. వీటిని అరవమునందు 'పంచపాండవ పడుక్కై' యనియు యవి యుండు కొండను 'పాండవమలై' యనియును పిలుతురు. ఇందు పూర్వపు శాసనములున్న వ్రాయబడియున్నవి. అక్షరములనుబట్టి యివి అశోకుని కాలపు శాసనములుగ గాని లేక తత్కాల ప్రాంతమునకు సంబంధించినవిగ గాని యుండవలెను. వీటిభాష యింకను నిర్ణయింపబడలేదు. అది కేవలము ప్రాకృతముగ కనుపడదు. కేవల ద్రావిడముగను కనుపడదు. ఈ పురాతనగుహాలను బోలుగుహా యీ పాండవమిట్టలో దొరకుటయెంతయు గమనించతగినది. ఈగుహాలో పడకలుగాని శాసనములుగాని దొరకకున్నను దానిస్వభావమును కొండయొక్క పేరున్న యీప్రదేశము పురాతనమని రూఢిపరచుచున్నది.

శ్రీకాకుళమురోడ్డుకు రెండుమైళ్లదూరములో నుండు సైలాడయను గ్రామమువద్ద కొండయొక్క దక్షిణపు పార్శ్వమున నొక నైసర్గికగుహా యున్నది. ఇందు ఇపుడు శివలింగమును సంగమేశ్వరుడను నామముతో [illegible] చేయుచున్నారు. పరీక్షమీద యీగుహాలోని పూజింపబడు [illegible]మూల విగ్రహము జైనవిగ్రహముగా కానవచ్చి ఇది నిలువబడియున్నది. ఇదిగాక గుహాకు వెలుపల [illegible] పార్శ్వములను రెండుజైనవిగ్రహము లున్నవి. ఈ [illegible]గ్రములసాన్నిధ్యమునుబట్టి ఈగుహా తొలుదొలుత [illegible]యముగనుండెననుటకు సందేహములేదు. గంజాం జిల్లాలో నిప్పటికి జైనవిగ్రహములు గాని యితర [illegible]ములు గాని విశేషముగ దొరకి యుండలేదు.

1921 సంవత్సరమున చెన్నరాజధా[illegible] ధ్యక్షుడు నెల్లూరుజిల్లా కనిగిరితాలూకా[illegible] యను ప్రదేశమున కొన్నిగుహాలయ[illegible] యుండి వానినిగురించి నివేదిక వ్రాసి[illegible] శాసనములున్న శాసనాధికారిచే[illegible] అక్షరవైఖరినిబట్టి వీనిలో పురాత[illegible] 6. 7. శతాబ్దములకు సంబంధించియుం[illegible] రియును యీయూహాను బలపఱచుచున్న[illegible] ములలో నొకటి "శ్రీదామోదరేశ్వరంబు" అ[illegible] ఈసందర్భమున నెల్లూరిజిల్లాలో కందుకూరితాలు[illegible] నొకగ్రామమున దొరకిన పురాతనతామ్రశాసన[illegible] పేర్కొనబడిన ఆనందగోత్రపుదామోదరవర్మయను యొక్క పేరు జ్ఞాపకము వచ్చుచున్నది.

విశాఖపట్టణము జిల్లాకు సంబంధించినజయ[illegible] ఏజన్సీలోని కొన్నిశాసనములు కూడ యీసంవత్స[illegible] పరీక్షచేయబడినవి. వీనిలో ముఖ్యమైనవి రెండు. [illegible] పూరుతాలూకాలో భండారిగూడయను గ్రా[illegible] చెంతనుండు పొడాగడ్ అనుకొండమీద నొ[illegible] శిలాశాసనము దొరికినది. ఇది 1921-22 సంవత్సరమున ప[illegible]క్షించబడిన శాసనములన్నింటిలోను పురాణమైనది. శ. 5 వ శతాబ్దపు ప్రాతతెనుగు అక్షరములలోను [ప్రా]కృతభాషలోను వ్రాయబడియున్నది, ఇందు వంశపురాజు భవదత్తునిపేరు చెప్పబడియున్నది. వంశపురాజు లుండినట్లు మన కింతవరకు చాళుక్యులశాసనములవలన మాత్రము తెలియును. చాళుక్య ప్రథమకీర్తి వర్మ వీరిని నాశనము చేసినట్లును వీరు తొలి చాళుక్యుల యభివృద్ధికి యాటంకముగ నుండినట్లును చెప్పబడియున్నది. ఇంతవరకును నలవంశపురాజుల స్వంతశాసనము దొరకలేదు. ఈపొడాగడ నలశాసనము చరిత్రకు నూతన సామగ్రి యగుచున్నది. భవదత్తుని కుమారుడు భ్రష్టుడయి పోయిన పితృపితామహీయమైన రాజ్యసంపదను తిరుగ సంపాదించి తనతల్లిచేత నర్పించి రాజ్యమును తిరుగ నిలిపినట్లు చెప్పబడియున్నది. శాసనప్రారంభ శ్లోకమున హరిస్తోత్రము చేయబడియుండుటనుబట్టి యీరాజు వైష్ణవుడని చెప్పవచ్చును. బ్రాహ్మణులకు, యతులకు, దీనులకు, అనాథులకు అవారిగ అన్నమిడుటకు ఏర్పాటుతో నొకసత్రము నితడు నిర్మించినట్లు తెలియవచ్చుచున్నది.

---

*మండపమువలె తీర్చిన రాళ్లతో కట్టబడినది కాదు; కాని యాకృతిలో మండపము ననుకరించియుండుటచే పూర్వమండపని చెప్పవచ్చును

...పూరు తాలూకాలో ననే దొడ్డయ సమీపమున నున్నయడవిలో నాగరి న సంస్కృతశాసన మొకటి దొరకినది. ౧౦, ౧౧ శతాబ్దములకు సంబం నిలో కావ్యాగమ స్మృతి పురాణ లో ప్రవీణుఁడైన పండితాచార్య వ్రునిగుఱించి చెప్పబడియున్నది. ...వియను రాశిపేరున్న ...నుపించు

ఈ పై రెండు శాసనములవలన ఏజన్సీదేశ ...లె పూర్వము మోటుభూమికాక నాగరికత కలి గేశమై యున్నట్లు స్పష్టమగుచున్నది. ఈ ఏజన్సీకి ...భాగమున నానుకొని యుండు బస్తర్ రాష్ట్రము ...ప్పుడు కేవలము అడవిదేశముగ కనుపించినను యడవులలో పూడిపోయి యుండు దేవాలయ ...ల్యకల్ప వైఖరియును వానిలోని శాసనములును దేశముయొక్క పూర్వపునాగరికతను విశదపఱచు

...ల్లూరిపురమునకూడ కొన్ని జైనవిగ్రహ ములు క్రొత్తగ కనుగొనబడియున్నవి. ఇందు ఒకటి వెం ...టగిరి రాజాగారి కాలేజి చెంతనున్నది. ఇది నిలచి ...ండు విగ్రహము. తలకు పైభాగమునుండు సర్ప ఫణావితానమునుబట్టి యిది పార్శ్వనాథవిగ్రహమను టకు సందేహము లేదు. మఱియొకటి యీపురములోని దండువారివీథిలోని నృసింహస్వామివారి యాలయములో నున్నది. ఇది కొన్ని సంవత్సరముల క్రిందట నొక కోనేటిని త్రవ్వుచుండగ దొఱకినకారణమున దీనికి "కోనేటిరాయి" యను పామరనామము తటస్థించినది. కాని యిది జైనుల యిరువదినాలుగుతీర్థంకరులలో నొకరి మూర్తి యనుటకు సంశయమే లేదు. విగ్రహముయొక్క వైఖరి యతిప్రౌఢముగను తేజోవంతముగను ఉన్నది. ఈ ప్రాంతమున నింతటిశిల్పచాతుర్యముగల విగ్రహము దొఱకియుండ లేదు. ఇంకను యిట్టి యమూల్యములయిన పూర్వికవిగ్రహము లెన్ని మరుఁగునఁబడియున్నవో చెప్ప జాలము. చదువనేర్చినవారును వ్యక్తిపరులును యిట్టి పౌరాతనములను వెదకి చూచి, కాపాడి వాని నాదరించి నయెడల జ్ఞానప్రవృద్ధికి చాలతోడ్పడినవారగుదురు.

ఆంధ్రదేశమున ప్రతిగ్రామమునను ఆర్షవిచారాభి మానులు సభజేరి మాయమూల్యపౌరాతనముల మూ లముల నెఱుంగ నుద్యుక్తులు కావలెను. దేశాభిమాన మను సౌధమునకు తొలిసోపానము పౌరాతనముల యెడ గౌరవము. ఇది యికమీదనైన ఆంధ్రదేశమున వృద్ధి జెందునను ఆసతో నీవ్యాసమును విరమించుచున్నారము.

## భీష్ముఁడు

తెలగపూడి దాసయ్యచౌదరి గారు

౧

సీ. శ్రీకరకురువంశ క్షీరాబ్ధియందున, నుడుపతివలెఁ బుట్టు వొందినాఁడు
తల్లి గంగాదేవి తనవెంటఁ గొనిపోయి, నేర్పింప విద్యల నేర్చినాఁడు
తండ్రి సౌఖ్యమునకై తనరాజ్యలక్ష్మిని, వైవాహికంబును వదలినాఁడు
కాశీశుతనయలఁ గడిమిమైఁ గొనితెచ్చి, యనుజన్ములకుఁ గూర్చి యలరినాఁడు
అంబవక్రపుఁగోర్కె కనిసేయుగురునితో, న్యాయంబుకై గుద్దులాడినాఁడు
అవినీతవర్తనుం డతఁడెట్టిఁడైనను, శిక్షించి నీతి రక్షించినాఁడు
అతివృద్ధుఁడయ్యు దా నఖిలయోధులకును, ప్రక్కలో బల్లెమై ప్రబలినాఁడు
అంపశయ్యాగతుండై యెల్లధర్మముల్, బోధించి కీర్తిని బొందినాఁడు
గీ. పరమత్యాగియు శాంతుఁడు భక్తవరుఁడు, నతులపుణ్యుఁడు వీరుఁడు నమలగుణుఁడు
ధీవిశాలుఁడు ధీరుఁడు దేవమాని, వర్ణనుతు భీష్ముఁబోల నెవ్వారు గలరు?

# బ్రాహ్మణ యోధుఁడు

౧

ఉ. శ్రీయుత! విప్రవర్య! గుణశేఖర! నెల్లురిమన్మసిద్ధిభూ
నాయకుదండనాథ! శరణాగతవత్సల! యోధవర్య! ద్రో
ణాయనితుల్యవిక్రమ! రణస్తుతిపాత్ర! కృపాంతరంగ ధౌ
రేయ! సురూప! సిద్ధయగరిష్ఠసుతా! రణతిక్కనాహ్వయా!

సీ. ఏప్రొద్దుఁ జూడ నీయింట వేదరవంబు, మొరయుచుండెడిరీతి నెరపినావు
ఏప్రొద్దుఁ జూడ నీయింట బ్రాహ్మణ్యంబు, ప్రేమతో భుజియింపఁ బెట్టినావు
ఏప్రొద్దుఁ జూడ నీయింట యోధులుగూడి భళియంచు నుతియింపఁ బరఁగినావు
ఏప్రొద్దుఁ జూడ నీయింటనే శ్రీదేవి, వసియింపఁ దులలేక యెసఁగినావు
మనుమసిద్ధికిఁ గూర్చినమంత్రివగుచుఁ, బ్రాజ్యముగ రాజ్యము న్గూర్చి ప్రబలినావు
ధర్మమార్గావలంబివై తనరినావు, ధీర! శ్రీబ్రహ్మకులయోధ! తిక్క! నీవు

మ. కృపుఁడున్ ద్రోణుఁడు ద్రౌణియుంబలె నసత్కీర్తిన్ గనంబోక యే
కపటోద్యోగముపొంతఁ బోవక మహాశస్త్రంబునున్ దాల్చి ఘో
రపరాక్రాంతిని వైరిసేన నసిధారన్ దున్మి తూఁటాడుచున్
విపులోద్ద్యోతిత కీర్తిఁ బొందితివిగా విశ్వంబుపైఁ దిక్కనా!

చ. కదనమునందు శత్రువుల ఖడ్గముచే హతమార్పఁ జూచుచున్
బొదువఁగఁ జూచి భీతిమెయి భోరున నేడ్చుచు వైరివీరు ల
ల్లదె యదె కత్తి కత్తి! యదె యయ్యదె డాలు! నతండె తిక్కడం!
చదవద మొంది పాఱునటు లాలము సల్పెదు ఖడ్గతిక్కనా!—

సీ. శ్రీమన్మసిద్ధిరాట్సేనల కెల్లను, దండనాథుండవై తనరినావు
ఎదిరించువారునైన బ్రదికిపోవఁగనీని, శౌర్యంబు జగతిపైఁ జాటినావు
శరణుఁజొచ్చినయట్టి యరినైన రక్షించు, కరుణారసంబుచేఁ గ్రాలినావు
కాటమరాజేంద్రు ఘనతరసైన్యాళి, చెదరి దిక్కులఁ బాఱఁ జేసినావు
పలుకులందును సత్యంబు నిలిపినావు, దానములుచేసి యర్థులఁ దనిపినావు
కీర్తికన్యనువరియించి కేరినావు, ధీరశేఖర! సిద్ధన తిక్క! నీవు

# ప్రాచీనభారతసమరతంత్రము

డి. యన్. శర్మగారు

రికత చైతన్యమువంటిది. ఇది యెల్లకళల
షడశ. ఈదశవలన భారతవర్షమత్యుచ్చంబై
లించినకాల మొకటి యుండెను. జీవచ్ఛవములగు
ములు భారతవర్షప్రసాదమున విశ్వమానవత్వమునఁ దల
ను. విశేషకాలధనధిషణాదివ్యయములు లేకుండ నొక
డునకుఁ గావలసియున్న సర్వసౌకర్యములను జేకూర్చుటయే
ర్షీయనాగరికత కుండిన నిరంకుశప్రజ్ఞ. అట్టి విశ్వపాలితమగు
గరికత సాంఘిక, నైతిక, రాజకీయ, వైద్య, పరిశ్ర
లు పెక్కువ్యవస్థలకు మాతృగర్భ మయ్యెను. వ్యవస్థలకుఁ
ణముగ నసంఖ్యాకప్రణాళిక లంకురించెను. అందు రాజ
ంధియుద్ధతంత్ర మొకటి. ఇది మనపూర్వుల ధీకౌశలమును,
నమును స్థాలీపులాకన్యాయమ్మున గుణాస్వాద్యులకు

పురాజనీతిసంబంధమున రెండుప్రధానగ్రంథము లిప్ప
కిఁ బ్రమాణములై నిలిచియున్నవి. 1 శుక్రనీతి. 2 కామందకీయము.
మును రాజనీతిపారగులైన శుక్రాచార్యునివలనను, చంద్రగుప్తునికి
భిషేకముచేసిన చాణక్యునిప్రియశిష్యుఁడైన కామందకునివలనను,
తములై యున్నవి. యుద్ధవిద్యాసంబంధమున నీరెండును
వరణమును దెలుపుచున్నవి. అగ్నిపురాణమునందును, శాంతి
మునందును, రాజధర్మనిరూపణములు చాలదూర మాలోచింపఁ
డియున్నవి. ఇవి స్మృతులందు సహితము ప్రదత్తములు. మనుశాస్త్ర
సప్తమాధ్యాయమున సమరసమస్యఁగూర్చి స్థిరపటుపఁబడియున్నది.

## యుద్ధము

యుద్ధ మొకటి విశ్వమునందు సమంగళకార్యము. అతిప్రాచీన
కాలమున జనులు యుద్ధస్పర్శ తగులకుండ జాగరూకులై యుండిరి.
కాని దస్యులవిజృంభణ మణఁచుటకు యుద్ధ మార్యుల కావశ్యకమైనట్లు
కనఁబడుచున్నది. పిదప సమరము కులవృత్తిగా మాఱిపోయినది. ఉభ
యపక్షములకు రాయబారములవలన సంధి పొసఁగనపుడు దుఃఖమునకు
నిలయమగు భారతయుద్ధమువంటి పోరాటమును దలపెట్టక వీలు లేదు.
క్రోధపౌరుషావేశితములగు రెండుమొనలు సమరముఖమున దాఁకినపుడు
ఒకటి నెగ్గుటయు నొకటి వీఁగుటయు స్వతస్సిద్ధము. యోధవర్గము
యుద్ధము సర్వోత్కృష్టపుణ్యకార్యమనియు, నీశ్వరున కది ప్రీతి
పూర్వకమైనదనియు దృఢవిశ్వాసమును గలిగియుండెను. యోధుఁడు
సమరప్రాంగణమున విజయకల్యాణమును వరించి జీవనపర్యంతసౌఖ్య
ములు భోగించుచుండెను. వీరుఁడు వీరశయనము నలంకరించిన జీవన
లీలానందమున నోలలాడి స్వర్గపదవిని జూఱలాడును. సైనికుఁ డష్ట
మహాపాపముల మునిఁగి యున్నను, దేశారాధనమునకై తనప్రాణము
యుద్ధదేవతకు బలియిచ్చి యపరసౌఖ్యము నందఁగలుగుచున్నాఁడు.
మనపెద్దలు విజయలాభముఁగూర్చి యింద్రున కొనరించిన స్తవములు
ఋగ్వేదమునఁ గనఁబడుచున్నవి. జనని వీరుఁడగు కుమారుని బడయుటకు
నోములు చేసి తపస్సు చేయుచుండెను. క్షత్రియులది యుద్ధజీవన
మయ్యు బ్రాహ్మణవైశ్యశూద్రులుగూడ నీవృత్తియం దగ్రేసరులు కాఁ
జొచ్చిరి. రక్షణమునకు యుద్ధవిద్య ప్రధానసాధనముగాఁ బరిగణింప
బడెను. అట్టియుద్ధమును విడిచిపెట్టవలయునని యే స్మృతియు నుపదే
శింపలేదు. దేశప్రాణరక్షణముల కన్యోన్యోపాయములు విఫలము లై
నపుడు యుద్ధసాహాయ్యమును వెదుకనగునని స్మృతిసమూహమున బ్రతి
పాదింపఁబడియున్నది. యుద్ధమువలన నెల్లరకు దుఃఖము నష్టము తప్పని
దైనను శాత్రవభయము పోవును. శత్రుశేష మెవరికైన ననర్థదాయ
కము. అట్టివాఁడయినను దాసత్వశృంఖలమునుండి విముక్తుఁ డగుటకు
శత్రువిజయమును జేయక తీఱదు. ధర్మశాస్త్రమునందును, అర్థశాస్త్ర
మునందును యుద్ధకారణములు పెక్కులు వక్కాణింపఁబడియున్నవి.
కాని యుద్ధ మిరువాఁగులవారిని సర్వదా మృతప్రాయులుగఁ జేసి
వేయును. సమరము తొలుత ధర్మమున నడచినను, తుద కధర్మమునకు
దిగక మానదు. కావున యుద్ధ మన్యాయప్రత్యక్షపరిణామ మగు
చున్నది. కాని మనము సమరకారణములను పుంఖానుపుంఖముగా
నాలోచించినచోఁ, బరదారాపహరణము, పరధనరాజ్యాక్రమణము,
బలవంతునివలన దుర్బలుఁడు పీడింపఁబడుట, లోనగునవి ప్రాప్తించునపు
డు, యుద్ధ మత్యావశ్యకముగఁ గనఁబడుచున్నది. ఇట్టియుద్ధశబ్దకళంక
మును మానుషత్వమునుండి శుభ్రపఱుపవలె నన్న విశ్వమానవసోదరత్వ
మును, సత్త్వగుణప్రధానమగు నహింసావ్రతమును నాచరణములోనికి రా
వలయును. అపుడు కదా మనమహర్షులయాశ్రమములయందలి పులియు
మేఁకయు బుసులాడుకొనుట యథార్థమై ప్రపంచపరిజ్ఞానక్షేత్రమునఁ
బట్టియున్న యంధత్వ మొక్కలి ప్తలోఁ నెగుర గొట్టి వేయును. 'సంఘే
శక్తిః కలౌయుగే' యనుట సార్థకపడును. యుద్ధము మంచిదా? చె
డా? యనువిషయము సందిగ్ధప్రశ్నము. కావున దీనిచర్చ తదా
లకు విడిచిపెట్టుచున్నాఁడను.

## యుద్ధనిమిత్తధనము

ఫలమును గాని, విజయయశస్సును గాని యర్థించుసం
మునకు ధనము మూలమై యున్నది. దుర్గనిర్మాణము, పూ
రక్షణాన్వేషణము, సైనికులసముచితసజ్జీకరణము, సమ

Late Sjt. Muttaraju Sivakamayya Garu, B. A., L. T.



కీ. శే. ముత్తరాజు శివకామయ్య గారు, బి. ఏ., యల్. టి.

Sjt. Buddharaju Achyutarama



శ్రీయుత బుద్ధరాజు అచ్యుతరామరాజు గారు

Sjt. Anvarul Jaman Garu



శ్రీయుత అన్వరుల్ జమాన్ గారు

Sjt. Deshamukha



శ్రీయుత దేశముఖ

Sjt. Mohan Lal Pandya Garu



శ్రీయుత మోహనలాల్ పాండ్యా గారు

Sjt. Moulana Sayyad Moula Saheb



శ్రీయుత మౌలానా సయ్యద్ మౌలా సాహెబ్

Sjt. Sunder Laljee



శ్రీయుత సుందర లాలుజీ

Sjt. Dandu Narayanaraju Garu, B.A., B.L.



శ్రీయుత దండు నారాయణరాజుగారు, బి.ఏ.,బి.యల్.

Sjt. Vallabha Bai Patel



శ్రీయుత వల్లభ బాయి పటేలు

Sjt. Pandita Santanam Garu



శ్రీయుత పండిత సంతానముగారు

Sjt. Doctor Varadarajulu Naidu Garu



శ్రీయుత డాక్టరు వరదరాజులునాయుడుగారు

Sjt. Acharya Gidwani



శ్రీయుత ఆచార్య గిద్వా[illegible]

దళముల, కాహారాదిదానములు వీనినిమిత్తము, ధనము కావలయును. ఋగ్వేదాంతర్గతమునవిపులసేనాసంరక్షణమునకు సరిపడుధనముఁగూర్చి యింద్రదేవునికిఁ బ్రార్థనములుచేయఁబడియుండుట యుద్ధధనావశ్యకతను స్థిరపఱచుచున్నది. ప్రేమాకర్షణము, ఆదరణోపాయములు, ధనవ్యయమువలననే ప్రతివానికి లభించుచుండును. సామ్రాజ్యపుమూలభిత్తి రాజకోశమై యున్నది. సింహమునకు బాహువులందు బలమున్నట్లు, రాజుబలము ధనాగారముననుండును. రాజీధనమును వెచ్చించువిధానములలో మొదటిది దుర్గనిర్మాణము, సంరక్షణము నై యున్నది.

## దుర్గములు

సామ్రాజ్యకేంద్రస్థానమున దుర్గనిర్మాణము చేయవలెను. దుర్గములనేకవిధములుగ నున్నను, యుద్ధమాయలకు, మంత్రములకు లోపడనట్లు దుర్గముల నిలుపవలయును. వీనియందు ధనుర్బాణములు, మందు గుండు, అక్షయములుగా నుండవలయును. సంగ్రామతరుణమున దుర్గము రాజులకుఁ దెక్కులాభము లొసంగును. అది సేనావ్యూహములకుఁ బ్రశస్త కర్మక్షేత్రము; సమరప్రాంగణస్వరూపము. అది సైన్యములకు స్వీయగర్భమున స్థానమిచ్చి దాఁచి యుంచును. విపక్షదళములను యుద్ధమునందు నిరుత్సాహపఱచును; సామ్రాజ్యకళ్యాణమును తనికుడిచేతియందుంచును. దుర్గము రాజప్రతినిధిక్రింద నుండును. వైశ్యశూద్రులు సహిత మధికారులై యుందురు. దుర్గసమాశ్రితుండగు నృపునకు నెట్టి ఘాతుండైనను తృణప్రాయుఁ డగుచుండును. దుర్గములోని యొక భటుఁడు నూఱుగురుపగవారితోఁ బోరాడసమర్థుఁ డగుచుండును. దుర్గము రాజునకు గుడిచేయి యయ్యె నది దుర్బలస్థితియందున్నఁ గడు బాధలు తెచ్చిపెట్టును. స్వాభావికము, కృత్రిమ మని దుర్గములు ద్వివిధములు. మనుశాస్త్రమున, మహాభారతమున స్వాభావికదుర్గవిషయము వర్ణింపఁబడియున్నది. అగ్నిపురాణమున శుక్రనీతియందును ఉభయ దుర్గములవర్ణనములు కలవు. నదీ, నద, సింధు, గిరి, వనములు స్వాభావికదుర్గము లనంబడు. విశ్వకర్మనియమహాకౌశలమున నిర్మింపఁబడిన దుర్గమునకంటె స్వాభావికదుర్గ ము త్తమమైనది. మానవుఁడు నిర్మించిన దుర్గము లాఱువిధములుగా నున్నట్లు యాజ్ఞవల్క్య, శుక్రనీతి, అగ్ని పురాణము, కామందకీయము, మాధవకృతపరాశరభాష్యాదులలో వివరింపఁబడియున్నది. 1. ధనుర్దుర్గము. ఇది యేకప్రకాండప్రాంత...ము ప్రత్యేకదిగమునఁ బంచయోజనాధికదూరమున నుండు...లు. శత్రుశిబరములకు పిలుపడని యర్ధవర్తులాకృతి నున్న...ు. 2. మహీదుర్గము. ఇది కడువిశాలమైన బహిరంగస్థలము; ...మైయుండును. ఇందశ్వారోహకులు, రథసమూహములు క్రిక్కి...యుండును. 3. అబ్దుర్గము. ఇది చిత్తడినేలచేతగాని నీటిముంపుడు...చేత గాని చుట్టఁబడియుండును. ఇది సేనాసురక్షితస్థలము.

4. వార్షదుర్గము. ఇది మొరళ్ళు డొంకలు వ... చొరనశక్యంబైన యడవిచేఁ జుట్టఁబడి యుఁ... రాజమిత్రవర్గములు నలువైపుల నిండ్లుకట్టుకొ... గిరిదుర్గము. ఇది పర్వతమాలచే నావృతంబై... రాజ్యరక్షాస్థలము. ఇది యన్నిదుర్గములలో సర్వో...

రాజు ప్రత్యేకగిరిమయప్రదేశమున యుద్ధకా...చుండును. మొసళ్లకు సముద్రమువలెఁ బ్రకృతిసౌంద... దుర్గము నృపతికి బ్రాణరక్షణస్థానమై యుండును. దు... రాజు వాస్తుశిల్పకళావేత్తల బిలిపించి సముచితస్థాన మేర్ప...మఱి దుర్గమును నిర్మించుచుండును. దుర్గములు సాధారణము భూములలోఁ గాని, బయలుచోట్లలో గాని, కట్టుచుందురు. దుర్గము సాధారణముగా నీటితో నిండిన యగడ్తలును, రంధ్రము బురుజులును ఒక్కద్వారమును గలిగియుండును.

## దూత

రాష్ట్ర సంరక్షణమునకుఁ గల యన్నిపరికరములలో దు...పట్టుబంధనమువంటివాఁడు. రాజు తన మిత్రులనుండి కాని శత్రువులనుండి కాని, విదేశములనుండి కాని, వార్తలను దెలిసికొనవలె యున్నది. ఈ కార్యమును దూత సాధించుచుండును. కాననకు దూతహితోపదేష్ట, మంగళప్రదుఁ డగుచుండును. ద... జ్ఞానము, సమయస్ఫూర్తిగ మాట్లాడు నేర్పు, గలిగియుండవలె... గూఢచారుఁ డనేకరూపములు ధరించు సమర్థతయు, గంభీరతయు, బరులవలన నెన్నికష్టములు మూఁడినను తన లోగుట్టు బయలుపెట్టకున్నటువంటియోర్పియు గలిగి, రాజభక్తుఁడై యుండును. నాటకరంగమున విదూషకుఁడు నాటకకళలతో మూర్తిమంతుఁడై యున్నట్లు దూత శస్త్రాస్త్రములపాండిత్యము కలవాఁడై రంగస్థలమున మహావీరుఁడుగ నిలిచియుండుట కలదు. రాజునకుఁ దీఁగలేనితంతి వాఁడు. దూత యమానుషీయకార్యముల నాంజనేయుఁడగుచుండును; సందిగ్ధసమయమున సంజయుఁ డగుచుండును. పవిత్రచరిత్ర, సంపూర్ణగర్భిణి యగుసీత నకారణమున ఘోరాటవులకుఁబంపించినట్లు చేసినదుర్ముఖుని బోలి దూత వ్యవహరింపరాదు. తిమ్మర సఖండాంధ్రరాజ్యలక్ష్మిని సంపతిల్లఁజేయుటకు నతనిచారపద్ధతియే కదా మూలస్కంధము. పూర్వపురాజులీక్రమమున రాజ్యములను గాపాడుకొని, యశంబు నొందుచుండిరి.

ప్రాచీనభారతవర్షము రాజనీతిచేతను, ఆర్థికతత్త్వవిశారదుల చేతను విఖ్యాతిగాంచి, యిపుడు కనులు మూసికొని నిద్రావస్థయందున్న విదేశముల మంచిస్థితిలోనికి దెచ్చియుండెనని, యీవ్యాసము పాఠకమహాశయులకు భారతమాతృగౌరవమును ఇంకొకసారి స్మరింపఁజేయును గాక.

# శ్రీరామస్మరణామృతము

జనమంచి సీతారామస్వామి గారు

…ందుకు సాటి జగతి లేదనిపించె
మహనీయరామనామంబు గాదె
హనుమంతు నవలీల నంబుధి దాటించె
మహనీయరామనామంబు గాదె
అలయశోకవనంబునందు సీతను గాచె
మహనీయరామనామంబు గాదె
రావణానుజునకు రాజ్యలక్ష్మి నొసంగె
మహనీయరామనామంబు గాదె

తే. అహహ! శ్రీరామనామ మాహాత్మ్య మెన్నఁ
దరమె ధాతకైనను వానితాతకైనఁ
…న నిన్స్మరగింపు మింక నను రామ!
సకలగుణధామ! లోకైకసార్వభౌమ!

సీ. భవదీయపాదాబ్జభజనచేతనె కదా
పోతన్న కబ్బెను భూరికవిత
భవదీయపాదాబ్జభజనచేతనె కదా
త్యాగయ్యకృతు లయ్యె నమృతనిధులు
భవదీయపాదాబ్జభజనచేతనె కదా
గోపన్న యయ్యె నీ కూర్మిసఖుఁడు
భవదీయపాదాబ్జభజనచేతనె కదా
రఘునాథభూపతి ప్రణుతికెక్కె

తే. నిన్ను మనసార సేవించు నిర్మలులకుఁ
జేకుఱెడు భాగ్య మేమని చెప్పఁగలను!
గాన నిన్స్మరగింపు మింక నను రామ!
సకలగుణధామ! లోకైకసార్వభౌమ!

ఉ. తియ్యఁగనుండుఁ దేనియలు తియ్యఁగనుండును బంచదారయున్
దియ్యఁగనుండు నిక్షువును దియ్యఁగనుండు ననంటిపండులున్
దియ్యనివెట్టి వెన్నొ జగతిం గలవైనను రామనామపుం
దియ్యదనంపుసాటి యగు తియ్యన యెందును లేదు రాఘవా!

చ. నిను నొకసారి చూచిన మునీశ్వరులైనను మోహ మంది ని
న్న నయము నట్లె చూడవలె నంచును గోరుదురంట యౌర! నీ
యనుపమరూప మొక్కపరి యైనను జూపవె నాకు రామ! ని
న్గనుటెఁక నెప్పుడెప్పుడని కన్నులు కాయలుగాచె రాఘవా!

ఉ. "రామపదంబుసోఁక నొకరాయి వనంబున రామయయ్యె, నా
రాముమహత్త్వమిట్టిదని ప్రస్తుతిచేయవశంబె" యంద్రహో!
నీమహనీయపాదములు నిత్యము సోఁకెడు నామనంబు దా
నేమిసుభాగ్యమొందెడినొ యింకని యువ్విళులూరు రాఘవా!

మ. "వనమందుండి శరీరరక్షణ మొనర్పన్ నన్నియోగించి, కు
బ్జని పైఁ బెట్టితివమ్మ యీభువనభారంబెల్ల; నేకార్య మె
వ్వని కెంతేసులభంబొ యంచును దలంపన్, నీవు నాయంద చూ
పినదే హెచ్చగుపక్షపాత మని తోఁపించుఁగదా తల్లిరో"
అని కైకేయిని మెచ్చు నీకుఁ బ్రతియాహో నీవెగా! రాఘవా!

ఉ. ఎక్కడనెప్డు "రామ"యను నెవ్వరిపల్కను విన్నఁ దత్క్షణం
బెక్కడలేనిమోదమున నెంతయుఁ బొంగుచు, "రామ, రామ"యం
చక్కడ కేఁగి, పాడుచును నాడుచు సొక్కుచు నశ్రుధారలన్
గ్రొక్కన రాల్చు పావనిముఖాంబుజ మెన్నఁడు చూతు? రాఘవా!

ఉ. అక్కఱలేదు వాహనము, లక్కఱలేదు ధనంబు, కీర్తియు
న్నక్కఱలేదు, జవ్వనులు నక్కఱలే దధికారయోగమౌ
యక్కఱలేదు, నిక్కముగ నక్కఱలే దిల నెట్టిభోగముల్
చిక్కులఁబెట్టకుండ ననుఁ జెంతను జేర్చినఁ జాలు రాఘవా.

శా. నీతండ్రిన్ మును సత్యబద్ధుఁ జలుపన్ నీ వెల్ల రాజ్యంబు సం
ప్రీతి న్వీడి ప్రయాణమౌనెడ, "నను న్నీవెంటఁ గొంపో
మీతోఁగూడ వసించునప్పుడు వనంబే నాకయోధ్యాపురం
బై తన్వి న్గలిగించునం చెఱుఁగరే ప్రాణేశ్వరా" యన్న యా
సీతాదేవి మహోక్తులెల్లపుడు రక్షించు న్నన్నున్ రాఘవా!

# శిశుక్రీడాపరత్వము

కొప్పర్తి నారాయణమూర్తి, బి. ఏ., ఎల్. టీ., గారు, సాహితీసమితిసభ్యు.

శిశువుల కందఱకు వారిపుట్టుకతోడన కొన్ని సామాన్యలక్షణము లుండును. అందు చుఱుకుదనము విశేషముగా నుండు టొకటి. ఈకారణముచేతనే మిక్కిలి పసి శిశువులందును అవయవచలనమును చూచుచున్నాము. కొన్నివారములు పెరిగినపిల్ల యయినను కాళ్లను చేతులను కదల్చుచుండును. కాని అది కదల్పవలెనను నుద్దేశముతో కదల్పదు; దానిలో నిమిడియున్న చుఱుకుదనము పైకుబికి అవయవ చలనపూర్వకముగా మనకు తెలియబడును. తనకాళ్లుచేతులు కదలు చున్న శిశువునకు మిక్కిలి సంతోషము. మన మాకదలిక కేమాత్రము ఆటంకము కలుగజేసినను.అది యేడ్చుచు తనయనిష్టతను జూపును. తిరుగ ఆయాటంకమును తీసివేసినతోడనే ఏడ్పుమాని కరపాదములను విచ్చలవిడిగ కదల్చుచు ఆనందించుచుండును.

రెండు మూడు మాసములు వచ్చినపిమ్మట నోట ధ్వనిచేయుట కొంతవరకు దానికి పట్టుపడును. అప్పుడు కొన్నిహల్లులను 'త,' 'ప,' మొదలయినవానిని తఱుచుగ నుచ్చరించుచు నాడుకొను చుండును. అక్షరముల నుచ్చరించునపుడు కలుగుధ్వనివలన దాని చుఱుకుదనమును చూపుట కొకమార్గము కలుగుటచేతనే శిశు వట్టిధ్వని చేయుచుం డును. ఇందు శిశువునకు నియమితోద్దేశమేమియు నుండదు.

రమారమి సంవత్సరము గడవనుండు శిశువు ఒకచోటనుండి మఱియొకచోటునకు పోవ కొంతవఱ కలవడియుండును. ఈశక్తిని ఆధారముగ జేసికొని దానిని పలువిధముల పలుమాఱులు కదల్చియు, ఆ వస్తువును నేలపై కొట్టి అట్లు చేయుటచే కలిగిన శబ్దమున కానందించి యు, నాడుకొనుచుండును. ఇప్పుడు శిశువు నవయవచలనము పూర్వ మున్నంత విచ్చలవిడిగ నుండదు; దానిని కొంతవఱకు శిశువు తనవశము చేసికొని యుండును. శరీరము, కన్ను, చెవి మొదలయిన యింద్రియ ములు చుఱుకుగా పనిచేయుటయే యీయీడుశిశువుల కానందము. 'అక్క', 'అమ్మ', 'తాత', 'అత్త',—ఇట్టి శబ్దముల నుచ్చరించి ఆ ధ్వనివిని యానందింతురు. ఇదియే వారియాట.

[illegible]వులకు భావనాశక్తియు కల్పనాశక్తియు మిక్కుటముగ [illegible]ము గ్రహింపగష్టముగ నుండుమార్గములు వారిని సంచరింప [illegible]ను. శిశువులందలి యిట్టిశక్తి యేమాత్రమయిన క్రియారూపమున [illegible]ష్టపడినపు డాశిశు వాడుకొనుచున్నదని యందుము. "మేము [illegible]ళ్వాలాట ఆడుకొంటాము" అని శిశువు లనుట మన మెఱిగినదే. [illegible]ట్టి శిశువుల యాటలందు చాలవఱకు కల్పనముండును. కొంతవఱ ప్రపంచముతో సంబంధించి యుండకపోవు.

శిశువుల కెవరయిన నాటల నేర్పింపవలెనా? ఒకరేల నేర్పినను శి కి రుచించునా? వారివారి యూహానుబట్టి, కల్పనాసామర్థ్య మునుబట్టి, శిశువులే యాటల నేర్పఱచుకొందురు. అ[illegible] కరముగా నుండును. శిల్పి, చిత్రకారుడు, కవి—వీ రువు, కావ్యములమూలమున వారి 'కళ' నెట్లు చూ శిశువులును వారియాటలమూలమున వారియందలి కళా స్పష్టపఱతురు. వారిమనస్సున కామోదము కలుగజేయు న రీతిని తగురూపమున జూపుటకు వారలందు మిక్కిలి ప్రోత్ ఆరూపములలో ఆట ముఖ్యమయినది. ఆటయందు దృష్టి ను చున్న శిశువున కింకేమియు గోచరింపదు. ఆకలికూడ బాధింప యాటయందు తనకు తోడ్పడువస్తువులే యెప్పటికి తనస్నే తనసర్వస్వము. తన యూహాప్రకారము ఆడుకొనుటయందే ముల ప్రయత్నించును.

ఎడమచేతిని దొప్పగా పెట్టి అందుండి దేనినో కుడి[illegible] తీసినట్లు నటించి చిన్న స్తంభముపై పూయుచుండ రెండేండ్లన్నర చూచితిని. కుంకుమభరిణనుండి కుంకుమము తీసి యొకరికి పెట్టుట శిశువునుద్దేశము. దీనినే పైకి ఆటరూపమున చూపుచుండె. ఈయాట యాడునపుడు కుంకుమభరిణి లేదని తలచి ఆటను మా[illegible] వేయునా? లేక దానికై ప్రయత్నించునా? అది లేకపోవుట ఆట[illegible] మా, లోపమా? తన కందుబాటులో నున్నవస్తువులనే తనయాట[illegible] కావలసిన ఉపకరణములుగాను, పాత్రలుగాను భావించి తనయూ హను వెల్లడిపుచ్చును. కఱ్ఱను గుఱ్ఱముగా భావించి పిల్లలాడుకొనుట గలదు. చిన్న బల్లకు తాడుకట్టి దానిని బండి యని త్రోలుచుందురు. రెండుగోడలమూలను యిల్లుగా జేసికొందురు. పరిస్థితులనెల్ల వారి యాటకనుగుణముగ నుండువస్తువులుగ భావించి యాటలాడుకొందురు. ఆయాటలమధ్య ఆయాపరిస్థితులు కేవలము తామనుకొనినవస్తువులే యని గట్టినమ్మకము. ఇట్లు శిశువులు తమయాటలయందే తాము లీన మయి, పరిస్థితుల యాటంకమును వారి భావనాదార్ఢ్యముచే జయించి వానిని తోడ్పడ జేసికొందురు. ఒక్కొకపుడు పరిస్థితుల కనుగుణముగ తినయాటలు కొంతవఱకు మార్చుటయును గలదు.

ఈవిధమున భావనాశక్తిచే ప్రేరేపింపబడి యూపకప్రదర్శన మందు పాల్గొనుటకు శిశువులకు ఆటలయందుగల యమితోత్సాహమే కారణము. పిల్లి కుక్క వీనిపిల్లలకును కొంతవఱకు భావనాశక్తి యున్న ప్పటికిని అవి శిశువులవలె పలుపాత్రల స్వీకరించుకొని యాడుకొన జాలవు. గుడ్డచీలికను చూచి దానితో చెలగాటలాడుట కుక్కపిల్ల కును, పిల్లిపిల్లకును సహజమే; కాని కుక్కపిల్ల లింకొకజంతువువలె గాని, మనుష్యునివలెను గాని నటించి యానందింపలేవు. ఇతరమను

శువులయొక్కయు చేష్టలను జూపి వానివలె
వును.

రణము శిశుస్వభావమునకు చెల్లును. గుడి
రాజు, రాణి, దుకాణదారుడు, చాకలివాడు,
త్కృష్టజీవనముగలవారిని, అత్యల్పజీవనము గల
అచేతనపదార్థములరూపమునుగూడ శిశువు భావమున
ం. పువ్వుల నమ్మువానివలె నొకప్పుడు కేక వేయుచు
న్న యందరిని జేర్చి,

పువ్వులమ్మ పువ్వులోయి!
మేలుగులాబీ పువ్వులోయి!
ఎంతో పెద్దవి పువ్వులు
బాగావిడిచిన పువ్వులు
కొనరమ్మా యీపువ్వులు.'

అని యఱచును.

ఇక కొంతసేపటికి గుడ్డలమూట నొకదాని భుజాన వేసికొని, వానివలె బట్టల నొప్పగించును. మఱియొకకొంతసేపటికి చేతుల ను మోకాళ్ళమీదను ప్రాకుచు 'అమ్మా' 'అమ్మా' యని ఆవు మనట్లు అఱచును. అట్లుచేయునపుడు దగ్గఱ మనుష్యులనుగాని వస్తు ఘగాని పొడవబోవుటయు గలదు. చిన్నచీమ యయి కుట్టబోవుట సూడ కొందఱుశిశువులందు చూచియున్నాము. మూడుసంవత్స రముల యాడుపిల్ల తనజతగాండ్రతో, "నేను నాన్నని, కచేరినుంచి వస్తానట, మీకు మిఠాయి తెచ్చిపెడతానట." అని చెప్పుచుండగా వింటిని. శిశువులభావమున పొందుటకు ప్రపంచమం దెవ్వరుగాని, యేవస్తువుగాని అసాధ్యమైనది కాదు.

పసితనమందు పిల్లలకు వస్తుచలనమం దెట్లు ఆసక్తియు ఆనం దము కలుగునో, అటులే రూపకముల ప్రదర్శించుటయందును గూడ వారు త్వరితకాలములో తమ రూపముల మార్చుచుందురు. ఆవువలె కొంతసేపు నటించిన ఆ క్రియయం దుత్సాహము తగ్గి చాకలివాడుగా మాఱును. ఒకేదానిపై దృష్టి నిలిపి యుంచుట శిశువులచేత గాదు. కాని, నా రెదిగినకొలది, అయిదాఱు సంవత్సరముల వయసు రాను వారు దినమంతయు ఒకేరూపమున నున్నట్లు భావించుకొని, నటించు చుందురు. "అక్కా! నేను బొమ్మలను అమ్మినానే; ఆరోజున నీకి చ్చిన బొమ్మ యెక్కడ పెట్టావు?" అని యొకపిల్ల యడిగెను. ఆ పిల్లయే, "పాపాయీ, ఇవాళ నేను నీకు అమ్మని; నీకు బువ్వపెట్టి ఉయ్యాలా ఊపుతానే" అని పదినెలల పిల్లతో చెప్పుచుండెను. ఒకరోజున, ఆదినమంతయు 'పాపాయి'కి సంరక్షణ చేయుటలోనే గడపిన దాపిల్ల.

పైని చెప్పినట్లు మార్పు అనిశ పసివాండ్రకు మిక్కిలియిష్టము. ఈకారణముచేతనే యట్లయియుండవచ్చును, వారు అన్యరూపముల ధరించినట్లు భావించి నటించుట. వా రెప్పుడు రూపము మార్చి వేఱురూపమును పొందినట్లు ఊహింతురో, అప్పుడే వారి పరిస్థితు లును నూతనరూపమునందు వారి కుచితమని తోచునట్లు మాఱుచుం డును. వారిభావమందు ఏదయిన పనిచేయవలెననియు, అట్లు చేయు టకు వీలుకానపుడు, ఆయా చేతల నటించుటయు మిక్కిలి పసిపిల్ల లకుకూడ స్వభావమే. ఏడాదిలోపుపిల్ల దగ్గఱనున్న పాత్ర నందికొని దానిని నోటియొద్ద బెట్టుకొని అందేమియు లేకున్నను త్రాగుట నభి నయించును. వర్షము కురిసి చిన్నగుంటలో, కొంతనీరు చేరినది. దాని చూచినతోడనే చెఱువు జ్ఞాపకమువచ్చినది కాబోలు. పిమ్మట చెఱు వునొద్ద బట్టల నుతుకుట స్ఫురించియుండనోపును. సుమారు మూడు న్నర సంవత్సరముల పిల్ల చిన్నగుడ్డను గుంటవద్దకు తీసుకొనిపోయి దానిని ఉతుకుచున్నట్లు నటించును. పుల్లను తీసికొని మరియొక చిన్నపుల్లతో ఫిడేలు వాయించినట్లు నటించుచు ఏదియో, పాటపా డుచు నాడుకొనును.

పిల్లలకు పరులను చూచి వారిరీతులను బాగుగ గమనించి ఆ రీతుల నభినయించు శక్తియు నాసక్తియు నెక్కువగ నుండును. పిల్లల యాటలలో చాలవఱకు అభినయ ముండుననుమాట వాస్తవమే; కాని తా మట్లు అభినయించుచున్నట్లు వా రెఱిగి యుండరు. మొదట కొంత కాలమువఱకును అట్లు వారికి తెలిపినయెడల ఆటలయందలి సార మంతగ గ్రహించి వారంతగ నానందింపరు. అయినను ఈసందర్భమున నింకొకటి యోచింపవలసియున్నది. గాజుల నమ్మువానివలె నటించు పిల్లవానికి వానివద్ద నిజమయినగాజులు లేవనియు, తానిచ్చునవి గాజులు కావనియు, తాను పుచ్చుకొనునవి నాణెములు కావనియు తెలియకుండునా! వయసు కొంత వచ్చినవారికి తాము ఆట నాడుచుంటిమనియు నిజమయినచేత చేయుట లేదనియు తెలియును. ఇట్టిపిల్ల లేదయిన వారితో వారే, అనగా ఒంటరిగా నాడునప్పుడు పెద్దవా రెవరయిన చూచుచున్నట్లు తెలిసినచో నవ్వి సిగ్గుపడుదురు.

పిల్లలు ఆటలాడుట వారి యానందముకొఱకే గాని ప్రదర్శ నము గావించి యొరుల మెప్పు వడయుటకు గాదు. తన యూహలకు సరిపోవునట్లు వస్తువుల నమర్చి యుంచి వానితో తాము సంబంధము కల్పించుకొని వానిని తమకు తోడ్పడునటులు చేసికొనుటయే వారి యానందమునకు కారణము.

చిన్నపిల్ల లిట్టి నాటకముల నాడునపుడు నిఘ్నవిరంగ... లతో గాని యుపకరణములతో గాని వారికి పనిలేదు. ... పిల్లలు కలిసియాడునపుడు తగుపాత్రధారు లుందురు. అట్లు ... నాటకమున కభ్యంతరము కలుగనేరదు; ఏలన ఒక్కశిశువే చ... క్కఱల నున్న వస్తువులలో కొన్నిటిని పాత్రధారులనుగా భా... మఱికొన్నిటిని వలయునుపకరణములనుగా నుపయోగించి తానే స... ధారుడయి నాటకమంతయు జరపుకొనును. ఇట్లు ఒకేపిల్ల నా... మంతయు ఆడుటకు కల్పనాశక్తి విస్ఫుటముగా కావలెను. తా... తెరయే ఒకమూల కూర్చుండి రెండు పాదములు పొయ్యివలె జేర్చి దానిపై 'ఉత్తుత్త'బువ్వను వండి 'ఉత్తుత్త' అతిథ...

ు చూడవే, ఒక్కమాటు;
ే నింక చిన్నమ్మతోటి!

ప యింకను కొన్నియంశములకు ఈ పద్యము

ూవిష్టులయి సంచరించు నవస్థయందును కొన్నిక్షణ
్తులయందు నిర్లక్ష్యభావమును జూపుటయును గలదు.
ము బొమ్మల నెచ్చోట నున్న నచ్చోట పారవైచి యుం
మ్మలు సజీవులు గావనియు, నాటవస్తువులనియు రానురాను
ప్పుడప్పుడు తెలిసికొందురు కాబోలు. తెలిసికొన్నను, వారీ
యును బాగుగ గ్రహించి యిదివఱకున్న తమయూహలను
కొనుటకు తగుకాలము కొన్నిసంవత్సరములు జరిగినగాని తట
. శిశువులకు ప్రప్రథమమున బొమ్మలయందు పూర్ణవిశ్వాస
ను. పదప వారనుమానపడుచుందురు గాని విశ్వాసమును పూర్తి
గొట్టుకొనరు. సుమారు పది వత్సరములు గడచినపిమ్మట బొమ్మ
ముమును గ్రహించి వానీ నంతగ జేర్చుకొనరు.

ప్రపంచమందలి ప్రతివస్తువునకును స్వతంత్రముగా వర్తించు
ననియే శిశువులయూహ. కదలుచున్న బొంగరమును ఆపుట
నుత్సాహము. ప్రాకుచున్న చీమను జూచిన దానిచలనము
నాప జ ప్రొ. కదలకుండనున్న వానిని కదప ప్రయత్నింతురు. తమ
యిష్టము వచ్చినటుల ఇతరవస్తువులను వర్తింపజేయుటకు మిక్కిలి
ప్రయత్నింతురు. అట్లు చేయగల్గిన మిక్కిలి యానందము, చేయలేక
పోయిన వారు చిన్నపోయినమోముతో నుందురు. ఇతరవస్తువులను
స్వాధీనపఱచుకొనుట వారి యాసక్తి.

కొంతకాలము జరిగినపిదప ఆటలయందు తోడివారితో పందె
ము వేసికొని వారిని గెలుచు నుద్దేశముతో వర్తించుటకు వారు మొదలి
డుదురు. ఈ యుద్దేశమయినను చాలకొలదికాలముండి, ఆట ముగియక
పూర్వమే క్షీణించిపోవును. ఇద్దఱు పిల్లలు పందెము వేసికొని పరు
గిడుదురు. కొంతదూర మరిగిన నొకపిల్ల వెనుకబడును; అయినను
ముందుపోవుచున్న పిల్ల పోవుట మానక పరుగిడుచునే యుండును.
పరుగిడుటకు గెలుచు నుద్దేశము కారణమయినను, కొంత
సేపయిన పిమ్మట ఈయుద్దేశము పోయి, పరుగిడుట కేవల ముద్దేశ
రహితమైన యాటగా మాఱును. పందెమున గెలువవలెనన్న ఆసక్తియు
పూనికయు తగ్గిపోయి ఆటగా పరుగెత్తుటయందు పూనిక హెచ్చును.
ఇట్టిపూనికయు తగ్గిపోయి ఆటగా పరుగెత్తుటయందు పూనిక
హెచ్చును. ఇట్టిపూనికమూలమున తమ యవయవములను, చుట్టుప్ర
క్కల నుండు వస్తువులను శిశువులు స్వాధీనపఱచుకొను చుందురు.
ఇందు వారిశక్తి హెచ్చినకొలఁది నూతనవస్తువులనుగూర్చి ఎక్కువగా
తెలిసికొనవలెనని కుతూహలము హెచ్చును. శిశువులు జ్ఞానమును
సంపాదించుటలో నిది యొకముఖ్యమైనమార్గ మని వేఱుగ చెప్పనవ
సరము లేదు.

ఇదివఱకు చెప్పఁబడిన యంశములఁబట్టి శిశువులకు ఆట లెల్లపు
డును ఆహ్లాదకరములుగ నుండుననియు, హాస్యోపేతము లనియు తలఁ
చెద రేమో, అట్లుగాదు. పిల్లలకు 'బూచాడు' ఎంతభయంకరముగ
నుండును! అయినను వానిని వారియాటలయందు పిల్లలు సూచించుట
మానుదురా? దయ్యములు, రాక్షసులు, దొంగలు, అరణ్యము మొద
లయినవి వారికి భీతిని కలిగించును. ఇట్టివానికిని ఆటలయందు తా
విత్తురు. పిల్లలయందలి భావముల నేది యెక్కువగ కదల్చి యుద్రేకింపఁ
జేయునో దానియందే వారి కాసక్తి; ఏభావము జనించినను సరియే.

అందుచేతనే దయ్యములనుగూర్చి తెల్పు చక్కిటిపురాణములందు
శిశువులకు నమ్మిక యెక్కువ. ఆటయందు 'ఆవు'గా భావింపబడిన
పిల్ల పొడువవచ్చిన, నాటలోనివారు నిజముగా ఆవుపొడువవచ్చిన
ఎంత భయపడుదురో, అంతభయమును పొందుదురు.

పెరుగు నమ్మువానివలె నటించుచున్న పిల్లవాడు, ఎంతయో
శ్రమపడుచు, అతిజాగ్రత్తగా స్వల్పవిషయములలో గూడ వానివలెనే
యాచరించుటకు ప్రయత్నించును. నెత్తిపై నున్నతట్టను పట్టుకొను
టలో నేమి, నడచుటలో నేమి, కేకవేయుటలో నేమి, ఎల్లవిషయము
లందును వానివలెనే చేయుట కెంతయో యోచించి వర్తించును. ఇది
సులభమా? హాస్యమా? కేవల ముల్లాసదాయకమా?

పైని ఉదాహరించినవిషయము లన్నియు సామాన్యముగా ప్రతి
శిశువునకును వర్తించినను, ఏయాడున శిశు వెట్టియాట లాడు ననువిష
యము దానినైజమునుబట్టి యుండును.

శిశువుల చేష్టలందు మనకు అత్యద్భుతమును గొల్పువిషయము
నొకదానిని చెప్పవలసియున్నది. కదలికగలప్రకృతియందలివస్తువులు
తనవలెనే యాటలన్న కుతూహలము కలవనియు, తన చెలికాండ్రే
యనియు, తన్ను ఆడుకొనుటకు పిలుచుచున్నవనియు భావించును.
ఇట్లు భావించుట యుద్దేశపూర్వకముగ కాకున్నను, మన కెంత
హృదయరంజకముగను, ఆశ్చర్యముగనుఉండునో యించుక యోచించిన
చాలును. ఈ క్రిందిపద్యములు ఈ విషయమును స్పష్టపఱచుచున్నది.

అమ్మ, చూడవె! ఆడుకొనుటకు
పిలచు చున్నవి వెళ్లివచ్చెద.
ఆకు లల్లల లాడుచున్నవి
చేతసైగల చేయుచున్నవి॥ అమ్మ॥

పిల్లగాలులు మెల్లమెల్లన
తాకి పోవును త్వరగ లెమ్మని॥ అమ్మ॥

ఆకసంబున ఆతురముగా
మెలగుచున్నది మేఘ మల్లదె! ॥అమ్మ॥

చెట్టుపై నవె పిట్టలున్నవి
రమ్ము రమ్మని రవము సేయుచు॥ అమ్మ॥

నాడు రాకవు నమ్మకముతో
ఎదురు చూచును ఇనుడు మింటను॥ అమ్మ॥

చెఱువులోపలి చిన్న కెరటము
కదలుచున్నది ముదము జెందుచు॥ అమ్మ॥
ఘుమ్మ ఘుమ్మను కమ్మతావుల
పొల్పు జూపును పువ్వులెంతయు॥ అమ్మ॥
ఇంతమందియు ఎంతసేపుగ
వేచియుండిరో ప్రేమతోడుత ! ॥అమ్మ॥
వీని జేరక నేను మాత్రము
ఇంటనుండుట ఏల అమ్మరో? ॥అమ్మ॥

*      *      *      *      *

## గాలి

నాతోడ నాడును వన్నాడనీదు
నన్ను ముట్టుచునుండు నాకంట బడదు
చెట్లచాటున నుండి చెంతకు వచ్చి
ప్రొద్దున లేపును ముద్దుల బెట్టు
పవళించు సమయాన పాడుచు విసరు
ఎండవేళను నైన నెగురుచు వచ్చు
నను జూచి పోవంగ కనులారగాను
వడవడ వణకుచు వానలో దడిసి
వెదకుచు వచ్చును బెదరించి పోవ
మేఘాల దరుమును మెట్టలపైకి
సంతోషమును గూర్చు చాలగా నాకు
పడుచు లేచుచు వచ్చు నడిరేయి నైన
భ్రాంతి పుట్టినయపుడు పాప మాగాలి
గట్టిగా దానిని పట్టుకో జూడ
మాయమైపోవును మంత్రించినట్లు!

నిజముగా జరిగిన రెండుకథల నీక్రింద చెప్పుచున్నాను. వానిని బట్టి శిశువులకు ఆటలయం దమితకుతూహల మని తెలియవచ్చును.

అయిదుసంవత్సరములబిడ్డ గంతులు నాడుకొనుచుండ, దానితల్లి ఆఆట తెలియ శించి, "అబ్బాయీ, చూడరా, కాంతం పెద్దకుమారుడు, ఇరువదిసంవత్సరముల వయసు చేసెను. ఆతడు వచ్చి బిడ్డను చేయిపట్టుకొని లోనికి తీసుకువెళ్లి కూర్చోబెట్టి ఇంక ఎప్పుడయిన గుంజీలు తీయిస్తాను, జాగ్రత్త. మాట్లాడకుండా అని చెప్పి తాను పుస్తకమును చూచుకొనుచుండెను. రెం మాత్ర మట్లు కూర్చుని "అన్నా, గుంజీలుతీస్తాను, వెళ్లనిస్తా మిక్కిలి అమాయకముగా పిల్ల అడిగెను. అన్నగారు నవ్వి, కొని, వెళ్లి యాడుకొమ్మని బిడ్డకు సెలవిచ్చెను.

నేను నాస్నేహితులు నొకయంశమునుగూర్చిచర్చించుచు కూర్చునియుండ బిడ్డ (మూడున్నరఏండ్లది) వచ్చి అలమారు పుస్తకాలను కదపి క్రింద వేయుచున్నది. నే నాబిడ్డపై కోపపడితిని. అంత నాస్నేహితుడు నన్ను జూచి, "పిల్ల అం యెక్కువగారాము. కొంచెము భయంచెప్పకపోతే నెత్తెక్కి తుంది" అని నన్ను సెపపెట్టినాడు. నే నాతని తో " పెట్టాలో నాకు తెలియకుండాఉంది. నీవు కొంచెం భయ అని కోరితిని. అప్పుడాతడు కళ్లుగా మెడు, ముక్కుమూ , మొగ బెత్తెడుచేసికొని కోపమునునటించి బిడ్డనులాగి క్రిందకూ బెట్టి చేతుల ముడిపించి "అల్లరిచేస్తే తన్నేస్తాను చూడు, కదలకుండా కూర్చో"అని ఆజ్ఞాపించినాడు. పిమ్మట మేము తిరిగి వాదములోనికి దిగితిమి. బిడ్డ చెప్పినరీతిని కూర్చున్నదేగాని దృష్టిమాత్రము అలమారుపైనే యున్నది రెండునిమిషములు కూర్చున్నట్లే కూర్చుని, "నా కాచిన్నపొత్తకం ఇయ్యవూ?" అని వ్రేలితో చూపి యడుగుచునే లేచి అలమారువద్దకు పోయినది! తనశక్తియందు హెచ్చునమ్మకము గల్గియుండిన నామిత్రుడును విరుగబడి నవ్వసాగెను.

# వర్షము

## శృంగారకవి సర్వారాయుడు గారు

క్రమ్మది రాతి రెల్లరును నిద్దురవోయినవేళ నాకస
మ్మిమ్మల నిర్మలం బయి రహింప నదెంతటివింతో?. చీకటుల్
గ్రమ్మ దనంత వాయువులు ఘుమ్మని వీవగ రేచి మేఘబృం
దమ్ములు కాఱుగ్రమ్ముకొని తామరతంపర లై తళత్తళల్
పమ్మరఁ గర్ణభేదనముఁ గూర్చు పెళీప్పెళీ లుప్పతిల్ల గ్రీ
ష్మమ్ము నడంప దాడిగొనుచందమునం జెలరేఁగి కాయమా

నమ్మున పొట్లకాయలగణమ్మున ధారల పెల్లుగట్టి భూం
డమ్ములఁ బ్రిమ్మరించిన విధమ్మున నిమ్మహి యెల్ల నించి సం
ద్ర మ్మొనరించి వెల్లువపరంపర మేలును గీడుఁ గూర్చి తా
నిమ్మకు నీరుపోసినటు నెమ్మది నుండినయంత లేచి భే
కమ్ములు కంఠము ల్గలిపి గాఢరవమ్ము లొనర్చుజాడ హ
ర్ష మ్మొనరించె విప్రవిసరమ్ముల వేదనినాదవైఖరిన్.

# వర్ణవికాసము

## చిల్లరిగె శ్రీనివాసరావు గారు

నుగూర్చి యనేకదురభిప్రాయములు ప్రబలి
న్నవి. దానినిగూర్చి చిక్కుదీసి తెలియఁబర
బ్రయత్నించు ప్రతివారును మఱింతచిక్కును
పోవుచున్నారు. మనువు ప్రధానముగ నాలుగు
లను గూర్చి చెప్పుచు సంకరజాతులు వీనినుండి
అక్రమ సంయోగమువలన గల్గినవని చెప్పుచు
ు. ఈ మాటలు కేవల రూఢములుగఁ దీసికొనిన
సంఘములోను సంయోగముకంటె దుస్సం
మెక్కువగ నున్నట్లు బోధపడును. మనుస్మృతి
ఒక్క యుదాహరణ తీసికొందము. చండాలజాతి
యని మనువు చెప్పినాఁడు. బ్రాహ్మణస్త్రీ
ద్ర పురుషునికి కల్గిన సంతానము చం
ాలుఁ చెప్పియున్నాఁడు. ఈ భారతదేశమునందు
ప్రస్తుత ు అయిదవవర్ణము పంచములు లేక చండాలు
రున్నారు. మనువు చెప్పినమాటయే సత్యమైనయెడల
ఎంతమంది బ్రాహ్మణకన్యలు శూద్రసంపర్కమును
పొంది యున్నారో? యోచించిచూడుఁడు. కావున
స్మృతికారకులయొక్క వచనము రూఢముగాఁ దీసి
కొనఁ గూడదని స్పష్టముగా కనఁబడుచున్నది. ఇట్టి
వాక్యము నేబ్రాహ్మణుఁడును దనకు గౌరవముగాఁ దీసి
కొనఁడు. ఎక్కడనైనను ఒకటిరెండు లేక కొన్ని దుస్సం
యోగములుండిన నుండవచ్చునుగాని కేవల మొకసంఘ
మంతయు నటు లుదయించినదని చెప్పనొప్పునా?

ఈ వర్ణభేదమును గూర్చి స్మృతికారకులును
వ్యాఖ్యానకర్తలును దప్పు చెప్పుటటుండ నవీనవిద్యావంతు
లును ఈ కలవరమునకు కొంత కారకు లగుచున్నారు.
ఆర్యు లెప్పుడో మధ్యయేషియానుండియో మఱి యెచ్చట
నుండియో భారతదేశము బయటనుండి దండెత్తివచ్చి
నారని సిద్ధాంతమును పాశ్చాత్యులు ఈమధ్యకాలమున
బయలు దేఱఁదీసినారు. ఆ పాశ్చాత్యులయొక్క శిష్యులైన
మనమందఱమును కొంత తెలిసియు కొంత తెలియకయు
ఆ భ్రమలో పడిపోయినాము భారతదేశములో పుట్టి యు
త్తమవర్గములోనికి వచ్చుట యసాధ్యమని మనకందఱకును
ఒకపిచ్చ పుట్టినది. మనలను పరిపాలించువారు నేఁడు శీతల
దేశవాసులై నందువలన ప్రాచీనకాలములో నెల్లప్పుడును
శీతలదేశవాసులే వీర్యవంతులనియు అట్టివారినుండియే
నాగరికత యుద్భవించినట్లును మనము భ్రమపడుచున్నా
ము. స్వర్గీయ బాలగంగాధరతిలకుగారు ఆర్యులయొక్క
ప్రాచీననివాసము ఉత్తరధ్రువమునొద్ద నని రుజువు
చేయుటకు ప్రయత్నించినారు. ఆరుజువును గూర్చి
ఇక్కడ విమర్శించుటకు అవసరము లేదు. అది సత్యమై
నను బ్రాహ్మణ నాగరికతమాత్రము ఈదేశములో ప్రబ
లినదనిచూపింపవచ్చును. ప్రాచీనకాలములో మానవసంఘ
ములు భూమిని అంటిపెట్టుకొని యుండక పశుపాలక
వృత్తిలో నుండి యొకదేశములోనుండి ఇంకొకదేశములో
నికి ప్రవహించుచుండెడివి. కావున భారతదేశమునకు బయ
టనుండి యేసంఘములైన వచ్చియున్నను, అదేవిధముగ
భారతదేశమునుండి సంఘములు బయటకుబోవుచుండెడివి.
ప్రాచీనగ్రంథములగు వేదములందు ప్రాచీనకాలమునాఁటి
సమస్తనాగరికసంఘములయొక్క విజ్ఞానము నుండియుండ
వచ్చును. వేదములు వేదవ్యాసునిచే క్రోడీకరింపఁబడినవని
కూడ మనము చెప్పుకొనుచున్నాము.

ఈ ఆర్యులదండయాత్ర నుగూర్చి పాఠశాలల
యందు చదువుకొనినందువలన బ్రాహ్మణులు పరదేశము
నుండి వచ్చి ఈదేశీయులపై సాంఘికముగ నత్యాచా
రము చేయుచున్నారను నభిప్రాయము ప్రబలుచున్నది
ఈ యభిప్రాయముచే బ్రాహ్మణులు నిష్కారణము
గర్వపడుచున్నారు. తక్కినవర్ణములవారు వారియెడ
నిష్కారణముగ ద్వేషపూరితు లగుచున్నారు. ఈ ఆ
ర్యులదండయాత్ర మిథ్యయని యెఱుంగుటకు
భారతీయులను సవినయముగ ప్రార్థించుచున్నాను.

వర్ణభేదము హిందూదేశములో ఆధ్యా
త్మికోత్తమసృజనమును ధర్మముమీఁద నాధార
యున్నదని హ్యావెల్ చెప్పుచున్నాఁడు. వర్ణ
ఆధ్యాత్మికోత్తమ సృజనముమీఁదనే కాదు ఆ
త్తమసృజనముమీఁదకూడ నాధారపడియున్న

చెప్పవచ్చును. శరీరముఖవైఖరిలక్షణములను పరీక్షించి చూచినప్పుడు ఉత్తమకులములందు అధమకులలక్షణములును అధమకులములందు ఉత్తమకులలక్షణములును గాన్పించుచున్నవి. ఇది కేవలము అక్రమసంయోగమువలన నని హ్యావెల్ చెప్పినట్లు చెప్పుటకు వీలు లేదు. ఈ యుత్కృష్టనికృష్టలక్షణములు ఒక సంఘమునందే వధూవరుల నేర్పాటుచేయుటయం దున్నది. ఎంత నీచసంఘమునందైనను జాగరూకతతో వివాహసంబంధములు జరిపినయెడల నుత్తమరూపవిలాసములు సంతానమునందు కనఁబడునట్లు చేయవచ్చును. వృక్షములందును పశువులందును సత్సంపర్కముచేత నుత్తమజాతులను బుట్టించుట లేదా? అటులే జ్ఞానముగల మనుష్యులందు తగు జాగరూకత తీసికొనినయెడల నుత్తమరూపలావణ్యములు వచ్చునట్లు చేయలేమా? చేయవచ్చును. మనుజులందును పశువృక్షములందువలెనే రూపమే కాదు ముఖ్యము; గుణముకూడ ముఖ్యమే.

ఇఁక చిత్తవైఖరిని పరీక్షించి చూచినపుడు ఉత్తమవంశసంతానములందు కొన్నిచోటుల నధమలక్షణములును అధమవంశసంతానమందు కొన్నిచోటుల నుత్తమలక్షణములును గాన్పించుచున్నవి. దీనికి కారణము కేవలము కర్మ యనియే మనవా రెంచుచున్నారు. అది కావచ్చును కాకపోవచ్చును. పూర్వజన్మ విచారణలోనికి మనము ఇప్పుడు పోఁజాలము. కాని ఈ జన్మలో మనకు తెలిసినంతవఱకు మంచిగుణములు సత్సహవాసమువలనను దుర్గుణములు దుస్సహవాసమువలనను గలుగుచున్నవని మనము చెప్పవచ్చును. సహవాసము అనగా పరివేష్టనము. మనుజుఁడు కేవలము జననీజనకులయొక్క సంతానమే కాదు; సమాజసంతానముకూడ యున్నాడు. తనచుట్టు నున్నవారియొక్క గుణదోషము మనుజునికి కొంతవఱకు అంటును. అయితే మనుష్యు కొన్నియెడల నతిక్రమింపగలడు. ఆసం విషయము. మనుజుఁడు తల్లిదండ్రులకు బుట్టి మ్యములందు తల్లిదండ్రులను అతిశయించికూడ పోయినటులే, సమాజసంభవుఁ డైనను సమాజము నతిశయించికూడ పోగలఁడు. ము క్రుంగికూడ పోవచ్చును. మనుజుని విషయనా కారణములన్నియు నరయుట మనకు సాధ్య మనుజుని చిత్తమును మంచికిగాని చెడ్డకుగాని

చలింపఁజేయు యావత్తు రహస్యవృ బహిరంగమైన లెక్కలోనికి రావు.

అయితే భౌతికరూపమునందు నందుగాని మన దేశములోని ప్రాచీ ఉత్తమసృజనమును గూర్చి బుద్ధి త్నము చేసినట్లు మన గ్రంథములంది పాశ్చాత్యదేశములో నవీనకాలమునంది నమును (Eugenics) గూర్చి సర్ ఫ్రాన్సి పండితుడు విశేషముగా పరిశ్రమచేసినట్లు వచ్చుచున్నది. ఈయుత్తమసృజనమును గూ వారలుచేసిన ప్రయత్నము పూర్తిగ కొన కొనసాగుటకు సాధ్యమా యనుమాట వేరు. దా గూర్చి నే నిప్పుడు విమర్శింప దలచుకొనలేదు. ప్రయత్నమునందు చాల కష్టము లున్నవనుమా సత్యమే. త్రాగుబోతులును రోగపీడితులును సంసార చేయుటవలన నీచసంతానమును బడయుచున్నారు గా నట్టివారిని సంఘము నభివృద్ధిచేయకుండ క చేయవలెనని సర్ ఫ్రాన్సిస్‌గిల్టను చెప్పు న్నాడు పూర్తిగ కొనసాగించుట కష్టము. సందేహము లే ఆసంగతి మనకు ప్రస్తుతవిషయమున కవసరము లేదు.

కాని మనసంఘములో నట్టియుత్తమసృజనము దృష్టియం దుంచుకొనియే బ్రాహ్మణులు సంఘమును వేరుపడియున్నారు. వారు కొంతవఱకు మద్యమాం నిషేధమువలన నుత్తమసృజనము సేయఁగల్గిరి. వా సంఘములోనుండి పై నిషేధమువలన వికాసము పొంది వారమని జ్ఞాపకముంచుకొన్నంతకాలమును సంఘముల నొకశాఖగా సంఘము నంటిపెట్టుకొని వా రున్నా కాని వారు రానురాను తమసంబంధమును మఱచిపో పైనుండి అనఁగా భారతవర్షముబయటనుండి గాని బ్రహ్మ ముఖమునుండి గాని వచ్చినామని భ్రమపడి తమబలము తేజస్సును గోల్పోయిరి. ఒకచెట్టుయొక్క పుష్ప దానికే జ్ఞానమున్నయెడల తనకళ యంతయు వేళ్లను వచ్చుచున్న దని తెలిసియుండవలెను. చెట్టు న యున్నప్పుడే పుష్పముయొక్క పరిమళమును ప్రకాశి నున్నవి. చెట్టునుండివిడివడిన నది తనలావణ్యమును గోల వును. ఆవిధముగనే సంఘములోని యన్నివర్ణములవా ఒక్కపోషకరసముచేతనే పెంపఁబడుచున్నారు. ప్ర తము అన్నివర్ణములవారును ఒకరితో నొకరు సంబం

మూని విడివడి యుండుటచే నొకరిపై
ప్రులై యుండి యత్యాచారములు సలు
నాశనకారకు లగుచున్నారు.

...జనముకొఱకు చేసిన ప్రయత్నము
...ములో నిప్పటికిని కనబడుచున్నది.
...కప్పుడు మనభారతదేశమునందంత
చెప్పుటకు దృష్టాంతము లున్నవి. కాని
...న మాయాచారములను అర్థముచేసికొన
చేత నది బ్రాహ్మణులు నెలకొల్పినయత్యాచార
...పించును. మళయాళదేశములోని బ్రాహ్మ
...ు నియర్థమును గ్రహింపజాలక తాము నాయరు
సుమునకు భిన్నులమనియు నాయరులపై
మత్యాచారముచేయునధికారమును సంపాదిం
మని తలంచుచున్నారు. నాయరులు నంబూరి
హ్మణులు భిన్నజాతివారై తమ్ము వశముచేసికొని
...రాచారమును దెచ్చి తమపై బలవంతముగా వేసి
...దలంపవచ్చును. కాని ఇది యథార్థము
...ు. బ్రాహ్మణనాయరు లిద్దఱును ఒక్కజాతివారిపైన
...న యుత్తమసృజనమును దృష్టియందు పెట్టుకొని
మాయాచారమును మొదట పెట్టియుండిరి. కాని రాను
రాను దానియొక్క యుద్దేశము చెడిపోయినందున నది
...రాచారముగా పరిణమించినది. కాని వర్ణభేదమును
గూర్చి విచారించినపుడు మొదట కొన్ని నాయరుజాతి
యందలి యుత్తమతరగతులవారే నంబూరి బ్రాహ్మణు
లుగా వికాసము నొందియుండిరని మనము చెప్పవలసి
యున్నది.

ఈ యుత్తమసృజనమును దృష్టియందుంచుకొని
యే సమస్తప్రాంతములలోని వారును తమతమ సంఘ
ములనుండి యుత్తమవర్గములు అనగా వైశ్యక్షత్రియ
బ్రాహ్మణవర్ణములను వికసింపజేసికొనిరి. ఆ కారణము
చేతనే ఒక్కొక ప్రాంతములో వేఱువేఱు వైశ్యక్షత్రియ
బ్రాహ్మణశాఖలు గాన్పించుచున్నవి. పంచద్రావిడ
బ్రాహ్మణులును పంచగౌడ బ్రాహ్మణులును ఇంకను సార
స్వతచిత్పావనులును మొదలగు బ్రాహ్మణులును ఇంక
ననేకనాడిభేదములున్న బ్రాహ్మణులును పరీక్షగ విచా
రించినయెడల తక్కువవర్ణములనుండి వికాసము పొంది
నట్లు గన్పించుచున్నది. ఈ బ్రాహ్మణులు ఒకప్పుడు
తక్కినవర్ణములతోపాటు మద్యమాంసములు పుచ్చుకొను
చుండినట్లు మన గ్రంథములందు కాన్పించుచున్నది.
అంతేకాక గొప్పప్రఖ్యాతి వడసిన బ్రహ్మఋషులును
శూద్రయోనులందు పుట్టినటుల గన్పించుచున్నది. ఈ
సంగతులన్నియు నిక్కడ నేకరువుపెట్టిన గ్రంథబాహుళ్య
మగును.

మద్యమాంసనిషేధము మంచిదైనను, అట్టి
నిషేధము పూర్తిగ తమసంఘమునందు నెఱవేఱుటకు
బ్రాహ్మణులు చేసినయేర్పాటులు కడు లెస్సైనవైనను
నేడు దానిరహస్యము నెఱుగనికారణమున బ్రాహ్మ
ణులును బ్రాహ్మణేతరులును వేరువేరైరి. ఈవిధముగనే
బ్రాహ్మణులు తరువాత తక్కినవర్ణములవారును పూర్వ
మొక్కసంఘమైనను వేరువేరుగ చీలిపోయి తమతమ
వర్ణములమధ్య నభేద్యమైనగోడలను నిర్మించుకొనుచు
న్నారు. మన ప్రాచీనగ్రంథములను బట్టి చూడ ఒక
వర్ణములోనిపురుషుడు తనకంటె తక్కువవర్ణపుస్త్రీని
వివాహము చేసికొనవచ్చునని యున్నది. ఈకాలములో
నంతమాత్రము అవకాశమును లేదు. రానురాను వర్ణ
భేదముయొక్క కాఠిన్య మెక్కువగుచున్నది గాని
తక్కువగుట లేదు. దీనికి కారణము వీరందఱును ఒక్క
కడజాతినుండి వికాసముపొందినామని యెఱుంగక ఎవరి
మట్టుకు వారు ఆకాశమునుండి యూడిపడితి మని యను
కొనుచున్నారు.

గుణకర్మలవలనను విద్యాధనములవలనను వచ్చు
వర్ణభేదము పూర్తిగ మానవజాతినుండి పోవలెనని
యుద్దేశమును గాదు. పోవుననని నాయభిప్రాయమా...
కాని వ్యక్తులు తమగుణకర్మలయొక్క ఫలాఫల
సులభముగ ననుభవించుటకు సంఘమునం
కింతకంటె చాల ఎక్కువ యుండవలయు
చెప్పుచున్నాను.

# స్మరణ

శ్రీమాన్ బాలకవి, ధూపాటి – కొండమాచార్యులు గారు

## నవరత్నమాల

శారద యామినీసమయచంద్రికలన్ యమునాస్రవంతికా
తీరమునందు సైకతపు తిన్నెలపై మురళీమనోజ్ఞగీ
తారవమాధురుల్ సెలప తన్మయతన్ గృహముల్ త్యజించి గో
పీరమణుల్ నిను న్వెదకి వేసరిరంట! నిజంబె? మాధవా!

సీ. నవనీలనీరదనవ్యవిలాసముల్,
తనువల్లి యెల్లెడఁ, దనరఁజేయ
రవికరోద్దీప్తమా రమ్యాంబుకణమట్లు
బర్హిబర్హపుకళల్ పరఁగుచుండ
శారదపూర్ణిమాచంద్రబింబము బోలి
వదనంబు వెలుఁగొంది వఱలుచుండ
విశ్వసమ్మోహమా వేణునినాదంబు
జగమెల్ల నిండి హర్షము నొసంగ
ఏది మఱియొకసారి వాయింపు మంచు
రాధ పలుమాఱు నిన్నుఁ బ్రార్థనము సేయ
గోపగోపీజనంబులు గోగణములు!
పారవశ్యతఁ జెందగాఁ బ్రాడినావె!

మ. అలరుందేనియ లానునట్టిమధుపం బాలాపము ల్మాని ని
శ్చలమై యుండ వసంతకోకిల వృథాసంగీతము ల్వీడి కే
వలమాగ్ధ్యంబు వహింప గోపరమణీభావంబు లుప్పొంగ స
ల్లలితంబౌ మురళీరవామృతము నెల్లన్ దిక్కుల న్నింపితే!

. వేణునినదంబు వినినంత వెఱ్ఱియగుచు
వెల్లనాఁ డయ్యొ! రాధ! చంద్రాతపమున,
బృందలో నెల్ల నినుఁగూర్చి వెదకనంట
విచినాఁడవె? యెఱుఁగవే? విరహబాధ!

వన్నముద్దల మ్రింగ వేంచేసినప్పుడు
దొంగలలో గజదొంగ వైతి
మకరిప్రాణము దీసి మత్తేభరాజంబుఁ
గాపాడి యార్తరక్షకుఁడ వైతి
మోహితాఖిలగోపముగ్ధలన్ దనియించి
కరుణించి రసికశేఖరుఁడ వైతి
తగ యుక్తిచేత యుద్ధమునందు దుష్టులన్
సమయించి లోకికోత్తముఁడ వైతి

గీ. అన్నిటను నీవె! గానవిద్యాప్రవీణ!
చతురనటమూర్తి! నీ కేది సాటి గలదు!
ఆత్మకుసుమం బిదే కరుణాలవాల!
పారితోషకమయ్య! గోపాలబాల!

గీ. ఎచట నున్నావొ యెవ్వరి కేమియొఱుక
కేశవా! మాధవా! హృషీకేశ! యనుచు
ఎంత బతిమాలినను పల్కవేల కృష్ణ!
పలికినంతనె పోవునే భాగ్యమెల్ల!

గీ. చిన్నిపాపలు దోఁగాడుచున్నయపుడు
నీదురూపంబు గనుపట్టు నెమ్మనమున
వరవసంతపుకోకిలపాట వినఁగ
వేణుగానంబు వీనులవిందు సేయు

గీ. కరముశుభదంబు లీలాశుకప్రణీత
కృష్ణకర్ణామృతంబు నొక్కింత చదువ
సరిగ నీరూప మచట సాక్షాత్కరించు
వేణుగానధ్వనుల్ వినుపించు నిజము

శా. ఆపోతన్న రచించినట్టి భవదీయంబైన విన్నాణముల్
రేపున్ మాపు పఠించునట్టియెడ నీరీతుల్ మనోజ్ఞంబు నా
శాపూర్ణత్వము నందఁజేసి నిను గాంచన్ గోర్కి గల్గించి నీ
ప్రాపున్ జేరియు వేణుగీతికలకై ప్రార్థింపగాఁ జేసెడిన్.

# జాత్యభిమానము

కొండిపర్తి వీరభద్రాచార్యులు గారు

...న మనఁగా నేమి? దాని స్వరూప మెట్లుండును? దీనినిర్వచనము సులభముగాదు. కాని దీర్ఘాలోచన నొకరీతిని దీనికి నిర్వచనము చెప్పవచ్చును. ఒకజాతియం సామాన్యముగ సమష్టిప్రవృత్తికై ప్రేరేపింపగలభావము; స్థానమా ప్రజలహృదయము. కావున నొకజాతియందలి ప్ర ...డును, బాలికయు జాత్యభిమానమును హృదయమున దాల్చియే ...చు ననవచ్చును. వా రాభావమునకు రక్షకు లగుచున్నారు. వారి ...య పేటికయం దీదివ్యరత్నము నునిచి భగవంతుడు వారిని సంరక్ష ...గ నియమించుచున్నాడు. ఇది పిత్రార్జితమై పారంపరిగవచ్చు ...నము. దీని నన్యాక్రాంతముచేయుట కెవనికిని నర్హత లేదు. కాని సానపట్టి మెఱుగిడి మహాప్రకాశవంతముగ నొనర్చుటకుఁ గాని, మట్టును మాలిన్యమును జేర్చి తేజోవిరహితముగ నొనర్చు వారికి హక్కున్నది. ఈ మణిరాజముయొక్క విలువకు మహి మెఱింగినవాడు దానిని ప్రకాశమునకు దెచ్చుటకే తానీభువిని జన్మెత్తినటుల భావించి మెలగును. వానికంతకు మించినగమ్యమే యుండదు. కాని దాని మహిమ గోచరింపనివాడు స్వార్థపరుడై, తమోనిమగ్నుడై, దానియెడల తూష్ణీంశీలు డగును.

ఒకజాతిలో జననమందు ప్రతిబిడ్డయు నీ జాత్యభిమానమను రత్నరాజమును సంరక్షించు బాధ్యతతోడనే పుట్టుచుండును. దానిని సానబట్టి మెఱుగుపెట్టించి తేజోవిరాజితముగ నొనర్చుబాధ్యత ప్రతివానియందును సహజ మయి వెలయుచున్నది. ఒకడు మహాధీశాలియై సామాన్యమానవాతీతకార్యముల గావింపజాలువా డైనను, లేక సామాన్యుడై మితప్రజ్ఞతో నొప్పువాడైనను, లేక దీనుడై క్షుద్రజీవితమును గడపువాడైనను నీ జాత్యభిమానరక్షణబాధ్యత వానియందు నిలిచియే యుండును. ఆ బాధ్యత నత డెంతవఱకు నిర్వహించునా యను విషయము వేరు. బాధ్యత గలదా యనువిషయము వేరు. ఆబాధ్యతను నిర్వహించుశక్తిగాని, వసతిగాని యున్నదా యను విచారణవేఱు. బాధ్యత వానిపైన గలదా లేదా యను విచారణవేఱు. శక్తి సమర్థతలను బట్టియు, అనుకూలప్రతికూల పరిస్థితులనుబట్టియు నీబాధ్యతను నిర్ణయించుటకు వీలు లేదు.

ప్రతి నరునందును ననన్యసామాన్యమగు ప్రత్యేకలక్షణము లుండితీరును. ఆ ప్రత్యేకలక్షణములే వాని వ్యక్తిత్వమును నిరూపించుచుండును. వాని ననుసరించియే యొకని యోగ్యతను గుర్తించుదుము.

ఒకడు విశ్వాసపాత్రు డనిగాని, క్షుద్రభావుడని గాని, క్రూరుడని గాని, దయాళుడని గాని, యభిమానశీలు డనిగాని, యాపాచ్యుడని గాని నుడువుటకు వాని విశేషలక్షణములే యాధారములు. ఒకానొకప్పుడు గావించిన కార్యముల బాటించి యొకని పాత్రతను నిర్ధరించుటకు వీలుండదు. తాత్కాలికముగా సంఘటిలు పరిస్థితుల ననుసరించి భీరువగు వనితయు మహాసాహసకార్యము సలుప గలదు; మహాసాహసికుడు భీరుత్వమును జూపవచ్చును. బహు కృపణుడు ఘనతరత్యాగముం గావింపవచ్చును; సంతతత్యాగశీలుడు సానుభూతి జూప నోడవచ్చును. వీనిని పాటింపదగదు. ఒకనియందు స్థిరతరమై వర్ధిలు వ్యక్తిత్వలక్షణముల ననుసరించి వాని యోగ్యతను నిర్ణయింతుము. అదేరీతిని జాతులగుణములనుగూడ గణన సేయవలసియుండును. జాతు లనగా మనుజులమహాగణములే యగును. కావున నొకజాతియొక్క పాత్రతను బరిగణించునప్పు డందుండునరుల యొక్క శీలమునే పాటించవలసియున్నది. అందువలననే యొకజాతి యొక్క ప్రతిభను సంరక్షింపవలయుననిన నందలి జనగణమునకు సామాన్యమగు గుణరాజములను గుర్తెఱుంగుటయు, వానిని సంరక్షించుటయు ప్రధానము. ఈనాటిపసివారు ముందునాటి పౌరు లగుదురు. వారేజాతిగ నేర్పడనున్నారు. వారిభావములును వారిచైదములును జాతియొక్క భావములును చైదములును నగును. వారిశీలము జాతియొక్క శీల మగును. వారియందు స్థిరతరమై వెలయు నాదర్శాభిమానము జాత్యభిమాన మనంబడును. ఈవిచారణయందు తాత్కాలికావస్థలు జాత్యభిమానసూచకములు గావని జ్ఞాపకముంచుకొనవలయును.

నేటి భారతదేశము పూర్వకాలపు భారతదేశము కాదు. పరిస్థితులు చాలగ మారియున్నవి. వాని కనుగుణముగ పైకి దృశ్యమగు స్వరూపమునందు మార్పులు గాన్పించుచున్నవి. అయినను భారతజాత్యభిమాన మనగా నేమనియు, భారతజాతీయత యన నేమనియు విమర్శించునపుడు మనము భూతకాలమును పరిశీలింపక తప్పదు. ఆ... రణానంతరము మాత్రమే మనము భవిష్యత్తునుగూర్చి యోజన... టకు నవకాశము గల్గుచున్నది. భారతజాతిని భవిష్యత్ మహాప్రతిభావంతముగఁ జేయ నెంచితిమేని ఆనిర్మాణకార్య... భూతకాలమునందు దిగంతవ్యాప్తమై వఱలిన భారతాధిక్యత... యగును.

నూటయిరువదివత్సరములక్రిందట బ్రిటిషువారు భరత... మును సాగించిరి. ఆ కాలమున దేశీయప్రభువులు పరస్ప... ములతో దమలో దాము పోరాడుకొనుచు, బ్రిటిషువా... మును గోరుచువచ్చిరి. ఒండొరుల సాధించుకొనుటలో నొక వారి సహాయమున వైరిని నిర్జించెడువారు. త్వరలోనే వచ్చి మొదట మిత్రులైవచ్చిన బ్రిటిషువారిచే నిర్జిత

# జాత్యభిమానము

ఇటుల బ్రిటిషు యిండియాసామ్రాజ్యము నిర్మిత మైనది. ఈ ప్రభుత్వముక్రింద ననేకపరివర్తనములు జరిగినవి. కాని ప్రజలందు భారత జాత్యభిమానము నాశము గాలేదు. బ్రిటిషురాజ్యమును సుస్థిరముగ దేశమున నాటినను, దేశాభిమానము శూన్యమై పోయినటుల గాన్పించినను జాత్యభిమానము నివురు గప్పిన నిప్పువలె నున్నదే గాని సమసిపోలేదు. దీని నెఱుంగక విదేశీయప్రభుత్వోద్యోగులును, వారి యడుగులజాడ ననుసరించి దేశీయోద్యోగివర్గమును నధికారగర్వము పెంచుకొని నిరంకుశపాలనము నారంభించిరి. భారతీయుల సాధుశీలము మూఢత్వముగ భావింపబడినది. వాగ్దానములు, లాలనలు, ప్రజలను మోసగించినవి. చిరకాలనిష్క్రియతచే నిర్వీర్యులై ప్రజలు నాశము గాగలరు. కాని భగవదిచ్ఛ వేఱుగా నున్నది. అధికారులు గావింప సాగిన యవమానములు హఠాత్తుగ ప్రజలను మేల్కొలిపెను. ప్రజల దుర్భ్రమలు తొలగినవి. తమ జాతిగౌరవప్రతిష్ఠలు నష్టమై పోయె నని గుర్తించిరి. జాత్యభిమానము ప్రజ్వరిలినది. ఇక వారియభీష్టము ననుసరించి పరిపాలనము మారకతప్పదు. కాలరథము కదలినది. దానిని వెనుకకు నడుపుటకుగాని యాపుటకుగాని యెవరికిని శక్తిలేదు. వారు స్వేచ్ఛాస్వాతంత్ర్యములను గోరుచున్నారు. ఇది రాజద్రోహ మనిన ఫలము లేదు. వివేకము గల్గినచో రాజశాసనముల నందు కనుగుణ్యముగ సవరించి ప్రజాభీష్టము ననుసరింపవలయును. నరునిసుఖజీవనమున కేర్పడిన శాసనములు మారక, వానికొఱకే నరుడు జన్మించెనని వాదించుట వెడఁగుదనము. కాలపరిస్థితుల ననుసరించి యాచరణయోగ్యములు గాని స్పష్టపడిన శాసనములను శాశ్వతముగ నిలుపబూని జాతీయజీవప్రవంతిని వెనుకకు నెట్టుప్రయత్నము విఫలము గాక మానదు. అందుకై పూనుకొనినవారికి భంగపాటు తప్పదు.

ప్రజలు స్వయంనిర్ణయాధికారమును దమస్వత్వముగ గుర్తించిరి. స్వపరిపాలనమును గోరుచున్నారు. ఇం దొక సూక్ష్మరహస్యమున్నది. వారు కోరునది తాము నిర్ణయించినటులు పరిపాలనము సాగవలయుననియేగాని, తాము రాజకీయోద్యోగముల నన్నింటిని బొందవలయునని కాదు. మొదటిది ప్రధానము, రెండవది అప్రధానము. కాని మొదటిదాని నిర్వహణమునకు రెండవ దనివార్యముగ నొనర్పబడెనేని నదియు తప్పదు. రెండవపరిస్థితి గల్పించుటయో, తప్పించుటయో ప్రస్తుతపు పాలకుల చేతులలో నున్నది. తాము ప్రజాప్రతినిధులుగ మాఱి వారి నిర్ణయములకు విధేయులై వర్తించుట కొడంబడిరా యుభయపక్షములకును క్షేమము.

భారతీయు లెల్లరును జాత్యభిమానజ్వలితు లయినారు. వారు
ంసావ్రతమును బూనినమాట నిజము. వారు బాధలనన్నిటిని
సహించుటకు నొడంబడిరనుట తథ్యము. కాని, వారు నిష్క్రి
కూర్చుండరు. సత్యాగ్రహము నాచరింపబూని యుండిరి.
ర్ణస్వరాజ్యము సాధించువఱకును దీక్షను విడువరు. కొందఱు
గను, మఱికొందఱు వేగముగను, నింక మఱికొందఱు
తత్క్షణమును, స్వరాజ్యస్థాపనము
స్వరాజ్యస్థాపనము నుపేక్షించుట కొ
డును లేదు. ఒకపక్షమువారు శాస
సిద్ధి బడయనెంచుచున్నారు. ఒకపక్షమువ
కుండ స్వయమగు నిర్మాణకార్యక్రమ
జూచుచున్నారు. మఱియొకపక్షమువా
భగ్నముగావించి వాని పునాదులపైన ని
నెంచుచున్నారు. అందఱును నేకొలది వత్సరము
తోడనో స్వరాజ్యస్థాపనమును గావింప కృత
యున్నారు. క్షుద్రములగు తృణజాతులను మాడ్చి
జాలమే మహావృక్షముల ఫలములను సుపక్వము చేయ
యున్నకందమూలములను ప్రవర్ధనము గావించును. అటులనె
తీవ్రచర్యలు, కొందఱిజాత్యభిమానమును ప్రజ్వరిలజేసి యా
సంసిద్ధులను జేయుచున్నవి; ఇకను కొందఱిదేశాభిమానము
గాక వారివారి సాంసారికతాపత్రయములక్రింద మఱుగుపడి
వారి బంధుమిత్రాప్తవర్గమునకు వాటిలు నాపదలవలన వారిని
సంకల్పులనుగ నొనర్చుచున్నవి. నిర్బంధశాసనములు దేశభ
ఱినో కార్యరంగమునకు దెచ్చినవి. అంతటికిని మూల
మానము. ఒక్కప్రాణశక్తి యనంతరూపములు దాల్చు
భిమానము కార్యరంగమున ననంతస్వరూపములు దాల్చి వఱల
అజ్ఞానముచేత పాలకులు వానికి జాతిభేదమును గల్పించుచు
ఈ కార్యము లన్నింటికిని రూపభేదమే గలదు గాని మూలస్వ
మున భేదము లేదు.

భారతీయులు తమజాత్యభిమానమును సంరక్షించుకొనుచు
వఱకు, వారు దేశమాతృభక్తిపరులై వఱలుచున్నంతవఱకు, వా రహిం
సత్యవ్రతముల నిర్వక్రముగ గాచుకొనుచున్నంతవఱకు వా రజేయు
వర్ధిలగలరు? భారతీయులందు మిశ్రమైయున్న వివిధమతస్థులును, సం
ములవారును నొక్కొక్కెడ విడిపోవుచుండవచ్చును, పరస్పర
పోరాటముల జరుపుకొనుచుండవచ్చును. కాని తరుణము వచ్చినె
నేవో యొక మహాత్కార్య మాసన్నమైనప్పుడు ఏమహాత్ముడో
తరించి వారినందఱ నైక్యము చేయగలడు. అప్పుడు త్రింశత్కో
కంఠములు నేకమై భారతమాతృస్తవము చేయగలవు. జాత్యభిమాన
వారి నెల్ల బంధించియే యున్నది. వారు దానియునికిని విస్మరి
చున్నారు. దానిని కార్యరంగమున బ్రకటించుటకు ప్రబోధ
మాత్రమే యవసరము. కించిజ్ఞులకు భేదములుమాత్రమే గోచరిం
చుండును. అన్నిటికిని నడుమన మూలాధారమై వఱలు జాత్య
భావము పర్వసమయములందుమాత్రమే దృగ్గోచరము కాగల
భారతసోదరులారా! నిస్పృహులు గాకుడు. ప్రబోధము గాంచు
మిమ్ము మీరు దెలిసికొనుడు. మీజాత్యభిమానమును బ్రకాశము
రానిండు. సర్వమును విజయము గాంచును.

# శారదా హారావళి

విద్వాన్ కట్టి కామేశ్వరశాస్త్రి గారు

...ర స్ఫుటప్రోల్లస
...రహారిసుగుణాధారా స్ఫురత్సాధ్వలం
సురీతిజాతివిమలాఖ్యా సల్పు నాదుజి
... నిల్చి నిత్యరసధారాసారముఞ్ శారదా!

...యంబుచే సరసులఞ్ సంతోషసంపూర్ణ స
యుక్తులఁ జేయుచుందువు భళీ! చింతింప నీయందు దో
...కంబులు గల్గియున్నయపుడుఞ్ సారాతిదూరుల్ నినుఞ్
... జూడకయున్న లోపమటవే భీతిల్లకే శారదా!

...సాతిశయాతిమాత్రపరిఖేదాత్యంతవిచ్ఛేద మై
యారీతి సుబంధబంధురగతి స్వాహ్లాదముం గొల్పి వే
... దేల్చును నన్ని వేళలను దా నస్పష్టశైథిల్యమా
... గోరకుందురె బుధుల్ నిత్యంబు నో శారదా!

...స్వాంతనితాంతకాంతమయిదాఁ దర్కింప నక్లిష్ట మ
త్రప్రౌఢివిగూఢముఞ్ ఘనవినేయంబుం బ్రతీతంబు నే
...ంతాహ్లాదము నీప్రసాదము మదిం గాదంచు వేఁ బల్కునా
చింతాక్రాంతనరుండు ధన్యుఁడగునే చింతింప నో శారదా!

...తప్రక్రమభంగభీషణ మనఞ్ దోషప్రశోషంబనఞ్
ధరలోనఞ్ సరసుల్ నుతింప మృదుమధ్యప్రౌఢజాత్యుల్లస
త్సరసాశేషవిశేషబంధసమతాసౌఖ్యంబు లేకున్న నా
పురుషుం డెట్టుల ధన్యుఁడౌ గద సదామోదప్రదా! శారదా!

ధీమన్మాద్రదనవిశ్రుతాతికనదుద్వేలాత్మసారంబునఞ్
వామాక్షీమణి తావకీనమృదువాగ్వస్తుస్ఫురద్వాసముఞ్
కామోపార్జిత ధీవిదగ్ధ నిరలంకారాతిరమ్యంబు నా
నీమాధుర్యము పెంపు లేడ పొగడఞ్ నేనేడ నోశారదా!

ఒకనాఁడైనను నిష్ఠురాక్షరము లోహో! నీయెడం గానమే
యొకనాఁడుఞ్ శ్రుతిదుష్టవాక్యరచనాయోగంబునున్ గానమే
ఇఁక శౌద్రాదులయందునుఞ్ పరశతోపేతాత్మవై యుండు నీ
సుకుమారత్వము నెన్న నాకుఁ దరమే శోభాస్పదా! శారదా!

వ్యర్థన్యూనపదంబు లెయ్యెడ నదృశ్యంబై విరాజిల్ల న
త్యర్థంబుఞ్ విలసిల్ల భాసురములై యర్థంబు లాహా! యపు
ష్టార్థంబన్నది యెట్టులుండును భవత్సాన్నిధ్యమం దౌర! నీ
యర్థవ్యక్తి నుతింపఁగా వశమె సర్వార్థాస్పదా! శారదా!

హ్లాదాపాదకభాసురార్థనిచయావాప్తిప్రహృష్టాత్మ స
మ్మోదాపాదితనాదమేదురితదిశావ్యాప్తప్రభావేద్ధ నా

నాదేశస్పృహణీయ దివ్యతర సన్మానేద్ధనూత్కర్ష నీ
యౌదార్యంబు నుతింపఁగా వశమె సార్థప్రదా! శారదా!

ఓజోరాజితరాజరాజమహిళా; వ్యోమస్పృశద్దివ్యవి
భ్రాజత్కీర్తి మహాజనస్తుతనిజవ్యాపారపారీణ నా
నాజాత్యంచితతాండవప్రకరణానందప్రదానేద్ధ నీ
యోజం బయ్యరె! యేజనుండు పొగడఞ్ యోగ్యుండగుఞ్ శారద!

సత్యంబున్ వచియింతుఁ గన్పడు సదాసారంబె నావాక్కులం
దత్యుక్తుల్ మఱిగానరావ యిఁక గ్రామ్యంబన్న నెట్లుండునో
నిత్యోల్లాసితతావకీనఘనకాంతిన్ గానకున్నఞ్ నరుం
డత్యంతంబు నభాజనుం డనఁగఁ దప్పా చెప్పుమా శారదా!

సిందూరస్ఫుటమూర్తి గౌణఫణితి శ్రీసేవ్యమానా! సెబాష్!
మందుల్ ధీరులు నీసమాధికి నమస్కారంబులం జేసి యా
నందోద్వర్థి సమాధిఁ బొందుదు రిలఞ్ భక్తుండు తాదాత్మ్యముఞ్
బొందంగా నది యద్భుతంబు గుణసంపూర్ణాత్మ! యోశారదా!

ఘనదివ్యార్థము నిచ్చుమాటలె యలంకారంబులై యొప్పు నో
వనితా! నీకనుధీరులఞ్ గనఁగఁ దద్వాక్కుల్ సదాహీనశో
భనసారాతిశయోక్తులై మరియుఁదా వక్రోక్తులై యుండునో
యనఘా! సంతత సద్గుణోజ్జ్వలసువర్ణాలంకృతా! శారదా!

ఘనహీనస్థితి శూన్యరమ్యవిషయాఖ్యానప్రసంగంబునం
దనఘా! నిన్నుపమానభూషితను జేయఞ్ సాటి లేదంచు స
జ్జనబృందంబు నుతింప భాసురయశస్సారంబులఞ్ గన్నదా
సునిజన్మంబె కృతార్థమయ్యెడి గదా చూడఞ్ సదా శారదా!

కాంతంబై సరసైకవేద్యరసమై కాంతా! యసాధారణో
దంతంబై మఱి మందబుద్ధులకు వేద్యైన్యాకరంబైన నీ
యంతశ్శాంతి బహిఃప్రకోపనవిరోధాభాసముఞ్ గాంచి తా
మెంతో సంతస మొందకుందురె బుధుల్ హృద్యాభిధా! శారదా!

వేయేలా పటుసారలభ్యమయి సాధ్వీ! తా నసాధారణం
బై యర్థంబులు పెక్కులిచ్చి సతతం బానంద మొందించి ...
ద్గేయంబై యిలరాజభూషణసువృద్ధిం గాంచి విఖ్యాతమౌ
నీయాశ్లేషసుఖోన్నతిఞ్ నిరతముఞ్ నేఁ గోరుదున్ శ్యా...

రసముం గల్గిన వస్తువుల్ సతతముఞ్ రంజిల్లు నెంతేని య
రసముఞ్ వీడిన జీవశూన్యసుశరీరంబట్ల తుచ్ఛంబులై
యిసుమంతైన రుచింప వట్టు లగుటఞ్ వీక్షించి నీకుఞ్ ...
రసమే ప్రాణమటంచుఁ బల్కిరి బుధుల్ రాజద్రసా!

గుణముల్ గల్గిన నేరసంబులును గల్గుం గానఁగా నెండియున్
గుణముల్ వీడిన నుండవీవు మఱినీకున్ సంతతప్రోల్లస
ద్గుణముల్ శోభను దెచ్చునట్టు లగుటన్ గుర్తించినీకున్ సదా
గుణముల్ ప్రాణము లన్న పెద్దల సువాక్కుల్ తప్పులా శారదా!

మధువుం గ్రోలిన తేంట్లచందమున ధీమంతుల్ కడుంజిత్తస
మ్మదముం బొందుదు రెట్టిగల్గ ధరవుం బ్రాణంబు తానెట్టి యె
య్యది నీవస్తువులందు నీపలుకులం దత్యంతముం గాననౌ
నదికాదే రస మారసంబు గలుగన్ హర్షింపరే శారదా!

లలితంబౌ భవదీయ శోభమును మూలంబౌ రసం బెన్నఁగాఁ
గలకాలంబును నీకు నొప్పగు నలంకారంబె యౌ నన్న పె
ద్దలవాక్కుల్ నిరసించి యొక్కఁడను మాత్రంబే యలంకారమున్
పలుకుల్ తామెటు భూమిలో వెలసెనో భావింపవే శారదా!

ఇక్షుక్షీరగుడాదు లెంతయుమనోహృద్యంబులై యుండినన్
వీక్షింపన్ రుచిభేదముల్ సతతమున్ పెక్కౌచుఁ గన్పట్టువా
మాక్షీ! తొమ్మిదియో పదో యనఁగ సామాన్యంబు కాకున్నచో
దక్షుం డెవ్వఁడు చెప్ప నీదురసముల్ తత్సంఖ్యలున్ శారదా!

మహి నాస్వాదముచేయుచున్న కొలఁదిన్ మాధుర్యవంతంబులై
యహితుల్ సైతము మెచ్చ రిచ్చవడి యాహా! యర్థగంభీరిమా
మహితంబున్ భవదీయమున్ బొగడఁగా మాబోంట్లకున్ శక్యమే
బహిరంతస్స్ఫురదారసప్రసరమున్ పాకంబు నోశారదా!

పటుసారుల్ భళియంచు నిత్యము నుతింపన్ స్వల్పసారాళికిన్
గటువై దుర్ఘటమై వితుచ్ఛజనదుర్గ్రాహంబులై రమ్యమా
స్ఫుటరాజద్భవదీయపాకమహిమాభావ
జటులాత్ముం డిఁక శక్తుఁడౌనె రసనా

అతిమాత్రంబు నుతించుచుండ్రుగద వాచ
మతిలో నీదగు మంజులధ్వనిని భామా!
ద్భుతశయ్యాసుఖపారవశ్యకలితాత్ము[illegible]
చితయుష్మత్పదముల్ త్యజించి తరమ

రుచ్యంబై హృదయైకవేద్యరసమై శ్రోతవ్యమై
వాచ్యం బయ్యది యింపునింపుగద యోవామాంగి!
వాచ్యార్థానుపపత్తి హృద్యశుభశుంభల్లక్షణాలక్షి
శోచ్యుండౌఁగద నిన్ను వీడి నరుఁ డు చ్ఛోభాస్వ

అలమోహంబు నశించు నైనను భవద్వ్యాసంగసంజాతబు
ద్ధులు మాత్రంబు వినాశమొంద విఁక వృద్ధుల్ గూడ నెల్లః
భళి! నీతోడ రమించుచున్న కొలఁదిన్ భామామణీ పాటవ
బులనున్ మిక్కిలి గల్గియుందురు గదా పూజాస్పదా శార

అనయం బంబరభాసి దివ్యగతి వృత్తాత్యంతహృద్యంబు స
జ్జనసుశ్లాఘసువర్ణకాంతియుతమున్ సమ్మోహనాశక్తిపా
వనముం దాళసునారికేళఘనమున్ వామాక్షి నీదైన
స్తనయుగ్మంబును బొందకున్న నగునే ధన్యుండు

ఆహా! యేండ్లకొలంది యెంతయును నిద్రాహారముల్ మాని
నోహో కొల్చుచునుంటి నింక వశమం దుండున్ భళీయంచు
మోహంబెంతయు నొంది ముందువెనుకల్ మోదంబుచేఁ గాన
యీహారావళి నీకు నిచ్చితిఁ గృపన్ వీక్షింపవే శారదా!

# భక్తిమార్గము

వారణాశి లక్ష్మీనారాయణశాస్త్రి గారు

ఘోరుసంసారజనుర్జరామరణముల్ గుందింప దేహంబు దు
ర్భరమై తోఁపకమున్న హస్తచరణవ్యాపారముల్ హద్దు మీ
రి రహిం బోవకమున్న మానసలసత్క్రీడాదురూహాపరం
పకున్ లోనయిపోకమున్న జగతిం బారత్రికాపేక్షికిన్
వైరిస్మరణంబు భావ్యము తలంపన్ నిండుప్రాయంబునన్.

సముం దోడనె యంతరించు హృదయాంభోజంబునం దూహ లె
డుగా, సత్కులజాతయై విధవయై క్రోశించు బాలామణీ
వక్షోజములట్లు కాన మది నాశం జెంద కీసర్వముం
మిన్ శ్రీశివచోదితంబనుట యొప్పున్ సాత్త్వికజ్ఞానికిన్.

మ. తనుకావింపఁదలంచినట్టిది సమస్తంబున్ వృథా చేయవ
చ్చును లేదా? మరి దేనినో సలుపవచ్చుం గాని చింతింప న
య్యనఘుం డిందుధరుం డనాథునిగఁ జేయన్ లేఁడు తానుండఁగా
నని భావించి నుతించు టొప్పతని నే యాముష్మికాభ్యర్థికిన్.

శా. ఆధివ్యాధిపరీతమై యనునిమేషాపాయమై తుచ్ఛమై
క్రోధాద్యుద్భవమై మహాగహనమై క్షోణిస్థలీభారమై
బాధాసంయుతమై ముహూర్తసుఖమై వర్ధిల్లు సంసారమం
దీధాత్రిన్ రుచిలేనివాఁడు తగు గౌరీశాంఘ్రిసంసేవకున్.

# యజ్ఞములు

వెదురుమూడి రామ లక్ష్మీ నరసింహారావు పంతులు గారు, బి. ఏ.

మతములన్నియు నాచారకర్మబంధము …ందు, భారతదేశ మాదినుండియు నట్టి మతధర్మాచ మై యొప్పు. అట్టి హైందవదేశమున నాదినుండియు న్న మతధర్మములలో యజ్ఞము లాచరించుట యొ త్రనుష్ఠానమున కెద్దాని నైన బరిత్యజించుటకు యజ్ఞ

రామాయణమహాభారతాది యుత్కృష్ట గ్రంథపఠనమునుండి లనునవి మనదృష్టికి మీఱిన ప్రాచీనములే కాని నవీనములు …క్కి చెప్పనగును. ఈగ్రంథములఁ జదువుటవలన నింకొక్క … మనకుఁ దెలియనగును. గ్రంథములలో వేనిని జదివినను, నఁ గ్రత్వాచరణ క్షత్రియులయందున గనిపించుచున్నది. …గజన్ములు సత్రతన్తులఁ జరపినట్లున్నను, నగటున వారు, …ల్లాడోఁచును. కాని, యాయజూకులుగ నున్నట్లు …. అట్టి సమయమున నిప్పుడు కొందఱు బ్రాహ్మణు లీ నేల సల్పుచున్నారో నాకుఁ దెలియదు. ఒకచో వా రాచ ను యథాశాస్త్రీయములైన యజ్ఞము లిం దెన్నిగలవో నా కెం …ము సందేహముగ నున్నది. ఒకరిద్దఱు చేయుచుండుట నేను గం వానింజూడ నాకు యజ్ఞాభిప్రాయమునకు విరుద్ధముగను దీక్షి …మజచిహ్నములఁ దగిలించుకొనుటకై చేసినట్టులను గనిపించెను. నేను జూచుటయే కాక మన్మిత్రులు గొందఱు నాతోఁ జెప్పుచుండ వింటిని. వారును నా కట్టియభిప్రాయమునే యిచ్చిరి. అనఁగా దేశ మునం దాచరింపఁబడు యజ్ఞములన్నియు నట్టివని కాదు. కాని యొ త్తమున నట్టివనియు నెవరేకార్య మొనర్చినను పూతమతులై, ఆకర్జము సలుపవలె ననియు మదీయాభిప్రాయము.

కొంద ఱీయజ్ఞములను బ్రహ్మవేత్తలుగావలెననియు, మఱికొం దఱు స్వవాంఛాసిద్ధికిని నాచరించెడివారు: అట్లు చేయుటలో నాయ శ్వరదేవతాసంతృప్తికై జంతువులను, కొన్నిస్థలముల మనుష్యులను బలి యిచ్చుచుండిరని వింటిమి, చదివితిమి. అంబరీషుఁడు తొల్లి నవన మొ కటి చేయ నెంచి తద్దేవతకు నాహుతిగా నరునీయవలసి, కొంతధనము నకు శునశ్శేపునిఁ గొనుటయు వాని మేనమామయగు గాధినందనుండు మంత్రోపదేశమున వానిని రక్షించెననియు మనము రామాయణమునఁ జదివియున్నాము.

అయితే, మనశాస్త్రము లన్నియు నేకగ్రీవముగా "నహింసా పరమో ధర్మ"అని ఘోషించుచుండఁగా వారట్టిఘోరాఘభూయిష్ఠం బైనకర్జ మేల యాచరింపవలయునని కొందఱు ప్రశ్నింపనగును. అందు కుఁ బ్రత్యుత్తరము వెంటనే యున్నది. వా రభినవరీతిని జంతుహింస నాయుధసహాయమునఁ జేయక, మంత్రశక్తిచే నాజంతువున కేవిధమైన బాధయును లేకుండఁ బ్రాణమును తీసి సర్వజంతువాంఛయగుస్వర్గము నిచ్చెడివారని పురాణేతిహాసంబులఁ జదివియున్నాము. అట్టియోగబలి మి వారియందు నుండుటచేతనే వా రట్లు యజ్ఞములఁ జేసెడివారు. దానఁ దమమనోవాంఛ యీడేరుటయే గాక, నామృగముయొక్క కోర్కె—స్వర్గప్రాప్తి—లభించెడిది. కావున వారు పాపకారకులుగా రు. యోగప్రాప్తిచేఁ బ్రాణముఁదీయనగునా యని కొందఱు తర్కించు కొనవచ్చును. యోగమనఁగా జితేంద్రియత, మనోనిశ్చలత, సమాధి ఈ శక్తిచే నెట్టి కార్యములనైనను సాధింపనగును. ఇందులకుఁ దా ర్కాణముగాఁ బ్రకృతమున "మెస్మరిస్టు" అని మీరుఁ పిలుచువారి సాధనల నక్కడక్కడఁ గాంచుచునే యున్నారు కదా! ఇది ప్రథమస్థితి. ఇదియే తమస్థితి కభివృద్ధిఁ జెందినచో నామానవుఁ డేకార్యమైనను సలుపఁగలఁడు. కావున నిందు నమ్మరాని దేదియు లేదు. అయితే మనపూర్వులు మఖము లాచరించిరని మనవారిప్పుడు కొందఱు సలిపి జంతుహింసఁ జేసి పాపము నొడిఁగట్టుకొనుచున్నారు. మంత్రశక్తిచే జంతువుల ప్రాణములఁ గష్టము లేకుండఁ దీయు సామ ర్థ్యము లేని వీరీయజ్ఞములఁ జేసి యేమి మోక్షమును మూటగట్టుకొను చున్నారో నాకుఁ దెలియదు. దాన వారికిఁ గేవలము నరకప్రాప్తియే కాని ముక్తి లేదు. కావున మన మట్టివారియందు నెట్టి గౌరవభక్తుల నుంచరాదు. పూర్వికు లనుష్ఠించిరి, కాన, నేనును అనుష్ఠించెదనని, తమకును, పూర్వికులకునుగల తారతమ్యముల గణింపక నవనాచరణఁ జేయువారికి ద్వైతమతసిద్ధాంతు లగు శ్రీమధ్వాచార్యులవారు నిజమృగ మునకు బదులు పిండిబొమ్మను బలియిచ్చి సంతృప్తిని బొందవలయు నని చెప్పిరి. ఇది యొకవిధముగ నున్నది.

శ్లో. మాంసం నజాయతే భూమ్యాం నవృక్షేన చ పర్వతే
జీవఘాతసముత్పన్నం హేయం మాంసం వ్రతార్థిభిః

అనెడి మాణిక్యమాలావచనానుసారముగా మాంసవర్జనా… చారులయందు వర్తిల్లుచున్నది. కావున దీనికిఁ బ్రతికూలముగ వ… చువారు దురాచారులను చండాలురే అయినను మనవాంఛా తకై అన్యప్రాణములఁ దీయుటకు యజ్ఞకారకుల కెట్టియధికా… లేదు. కావున నట్టిజన్మముల సలుపువారలు చండాలురన… ఘము వర్జింపవలయును. అయితే యాగములఁ జేయనే యని ప్రశ్నింపనగును. అందులకుఁ బ్రత్యుత్తరము నా… విమర్శనానంతరము చెప్పనగును.

యజ్ఞము లాఱువిధములు:— జ్ఞానయజ్ఞము, దేవ… పితృయజ్ఞము, బ్రహ్మయజ్ఞము, భూతయజ్ఞము, మనుష్యఁ

జ్ఞానయజ్ఞవ్యవహారికమును గూర్చి తైత్తిరీయోపనిషత్తునందు నీవిధముగాఁ జెప్పఁబడియున్నది. ఇం దాత్మ యజమానుఁడు; శ్రద్ధ యతనిభార్య; వక్షఃస్థలమే యజ్ఞవేదిక; శరీరజనితరోమములే దర్భలు; శిఖయే వేదము; శరీరమే సమిత్తు; హృదయమే యూపస్తంభము; కామమే యాజ్యము; తపస్సే యగ్ని; శాంతమే దక్షిణ; క్రోధమే పశువు; వాక్కు హోత; నేత్రమే యధ్వర్యుఁడు; ప్రాణ ముద్గాత; శ్రోత్రము త్రేతాగ్నులు; ప్రాణధారణావధియే యజ్ఞదీక్ష; మనస్సే బ్రహ్మ; యజమానునిజ్ఞానమే హోమము; అహోరాత్రములే పూర్ణిమామావాస్యలు; ముఖమే యాహవనీయాగ్ని; సంచారాదివ్యాపారములే అగ్నిష్టోమాదులు; అన్నపానములఁ గైకొనుటయే సోమపానము; ఋతువులు పశుబంధములు; చావు యజ్ఞాంతమునఁ జేయుదీక్షావిసర్జనస్నానము.

అగ్నిముఖముగను బ్రాహ్మణముఖముగను మంత్రపూర్వకముగ దేవతల కొసఁగునాహుతులు దేవయజ్ఞ మనఁ బరఁగు.

పితృదేవతలఁగూర్చి విప్రముఖముగను, అగ్నిముఖముగను, అన్నోదకాదితర్పణముల నాచరించుటే పితృయజ్ఞము.

అతిథుల నభ్యాగతుల నాదరించుట మానవయజ్ఞము.

జంతువులఁ బలియిచ్చుట భూతయజ్ఞము.

ఈ యధ్వరమున తొల్లి మనరాజవరులు దేశక్షేమముకొఱకై బలులవలన నద్దేవతలఁ దృప్తిపఱుపఁ జేసిరని గ్రంథములఁ జదివియున్నాము. మఱియు, వారు మృగముల మంత్రశక్తిచేఁ జంపిరనియు పట్టి యజ్ఞములును స్వర్గభోగాదులకు మార్గదర్శకము లనియుఁ బెద్దలవలన వినియున్నాము. కాని నాకిందెంతమాత్రమును నమ్మకము లేదు. దేవతలు విష్ణుతేజులు. దయార్ద్రహృదయులు. భూతదయాతత్పరులు. కావున వారెన్నఁడును జంతువుల బలియిచ్చుటచేఁ దృప్తినొందరు. అట్లు తృప్తినొందుట భూతదయారహితమగు నసురపిశాచగణగుణము. కావున దేవతలతృప్తికై బలియిచ్చుట యన్న వారికీర్తికిఁ గళంకమే. కావున జ్ఞానులగువారీయజ్ఞమును బరిత్యజింపవలెను. ప్రథమమునఁ జెప్పిన పంచయజ్ఞ గాని, శక్తులకొలఁది, యథాశాస్త్రీయ యజ్ఞము లీనియం దుత్తమోత్తమము. ఏ పకరణము లక్కఱలేదు. దేహాంతమున నిస్స

జ్ఞానయజ్ఞమునుగూర్చి చదివినవారి కావలసిన యుపకరణములు దెల్పినాను. అ లేక, ధువిత్ర మను నుపకరణ మింకొక్కటి

భూతయజ్ఞమునుగూర్చి యొకమాటఁ జెప్పి మును ముగించెదను.

భూతయజ్ఞ మన జంతువులను బలియిచ్చుట మునఁ దెలిపితిని. ఇది కేవలము వామమార్గులఁ బోలు యథార్థమని కొందఱు మహాపండితు లీ విధమునఁ గొన్ని డి. బూర్వము సమర్థించిరి. మానవయజ్ఞమువలెనే భూతయజ్ఞ జంతువుల బలియిచ్చుట కాదనియు, అతిథుల నభ్యాగతుల న నటులే, మృగకోటిని ఆదరించుటే భూతయజ్ఞ మనియు, చాపల్యముచే నా మాంసభక్షణకై మధ్యములు గొంద ఱీ మును కొనివచ్చిరనియు దానఁ బూర్వక్రతువులకుఁ బ్రకృత లకు దేవతాబలులకు నుపమానముఁ దెచ్చుట దోషముగా ప్రాప్తి యనియు వారు చెప్పిరి. ఇదంతయు కారణ నమ్మకమునకు వీలుగను నున్నది. ఇట్లు వామమార్గులచే ని ఎన్ని సద్విషయములు, దుర్విషయములుగా మార్పఁబడుట చూడ లేదు. కావున నీయర్థమందు దీనిని మనము గైకొనినచో, దేవసాన్నిధ్యమునకు మార్గదర్శకము లగు నీయాఱుయజ్ఞములను నిరాటంకముగఁ జేయవచ్చును.

కావున నోసోదరులారా! సదనాచరణయందు జీవహింస లేకుండఁ జూడుఁడు. యథాశాస్త్రపుఁబుంతను ద్రొక్కుఁడు. భూతదయ యను సంఘధర్మమును గౌరవింపుఁడు.

* ధవిత్ర మనఁగా, నిజ్జితోలుతోఁ జేసిన విసనకఱ్ఱ.

# * ఒంటరి కాపుకన్నె

అధికార్ల సూర్యనారాయణరావుగారు, బి. యే., బి. యల్.

చూడుము! ఒంటరిగ నట
జెలువు మీఱెడు కాపుపిల్లను
పొలము గోయుచు మధురగానము
జిలుకుచున్న దదే!
నిల్వు మిచ్చట, వేగనడువుము
మెల్లగా! వరిగోయు చొక్కటె
చల్లనౌ కంఠమున జింతా
గీతమును బాడున్.
వినుము విందుగ కన్నెపాటను,
తనివి దీరగ గ్రోలి యలరుము,
వినుము, చల్లని లోయ యంతయు
బాటతో నిండెన్.
అలసి సొలసిన బాటసారులు
ఆలకింపగలేదు సుమ్మా
చెలియగానము మించు తీయని
పులుగుపాటలను.
వన్నెగులుకువసంతకోయిల
నెన్నడును నాలించి యెరుగము
కన్నెపాటను బోలె ముదమిడు
గాన మొలికింపన్.
ఏరి గూరిచి పాట పాడును
యెరుగువా రెవ్వరును లేరే?
మురువు గులికెడి ముద్దు గొంతున
ముచ్చటగ బాడున్.
చన్నకాలపుచింత లెన్నొనొ?
మున్నుజరిగినపోరు లెన్నొనో?
వన్నెదొరగినపూర్వగాథల
వరుస లెన్నొనొకో?
దినదినము సహజముగ బరగుచు
మునుపుజరిగిన ముందురాగల
వనట తెరగులో కష్టనష్టపు
అనుభవములొక్కో?
వేనిగూరిచి పాటపాడెనొ?
వేనిగతులు పవిత్రమాయెనొ?
అటులె బాలిక పాడె పాటకు
అంతు లేనటులు!
అంతు లేనటు లామె పాడెను
సంతసంబున వరిగోయుచు
నెంతొ ముదమున వినుచు నిలచితి
నట్టె ప్రతిమవలెన్.
సాటియెరుగని మధురిమము గల
మేటిగానము నాటె నాత్మను,
పాటలంధరిపాట వీనుల
సోకకుండినను!

## జ్ఞానోదయము

కనులు కలక చేరంగ దర్పణమునందు
మురువుగులుకెడి ముఖబింబ మరసినాడ
కాంచినాడను పర్వతాగ్రమును వీడి
నవనవవసంతశోభితానందవనము
మంచుతెరలు వీడగ బరికించినాడ
మహితతేజముగల భానుమండలంబు
తనుప్రబంధించు లోకసూత్రములు సకల
పోల్చుకొనినాడ విశ్వైక్యపుణ్యమూర్తి
తలపుల కఠోరరోషంబు తొలగిపోవ
చెలియరో! నీదుహృదయంబు తెలిసినాడ!

* వర్డ్స్‌వర్తుకవిరచితమగు The Solitary Reaper అను కావ్యమునకు తెనుగు.

# వైద్యగ్రంథములు

(ఒక భిషగ్వరుఁడు)

పూర్వకాలమున మనదేశమున వైద్యవృత్తి మిక్కిలి ఉచ్ఛస్థితియం దుండెడిది. రాజులు వైద్యులను సన్మానించుచుండిరి. అగ్రహారాదుల నిచ్చి గౌరవించుచుండిరి. దానికి తగినట్లు వైద్యులుగూడ గొప్ప ప్రతిభతో వారికార్యములందు నిపుణులయి గౌరవమును సంపాదించుచు రాజులకు "ప్రాణాచార్యులు" గ నుండిరి. పూర్వపురాజులు వైద్యుల నెట్లు గౌరవించినదియు, వారు గౌరవార్హములగు పనుల నేమేమి చేసినదియు, కొన్ని చారిత్రకవిషయములనుండి మనము గ్రహింపవచ్చును. అట్టివిషయములను దెల్పు రెండుశాసనాదులను కీర్తిశేషులయిన గోపాలాచార్లుగారు "శ్రీధన్వంతరి" పత్రికయందు నిదివరకు ప్రకటించియున్నారు. అవి రెండును ప్రసిద్ధములే; ఆశాసనములు పరహితాచార్యున కిచ్చిన అగ్రహారదానాదులను దెలుపుచున్నవి. ఆశాసనములు రెండునుగాక శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు రచించిన "శృంగారశ్రీనాథ" మనుగ్రంథమునందు మఱి రెండుశాసనములు ప్రకటించినారు. ఈశాసనములు రెండును రెడ్డిరాజులకాలమునాటివి. మొదటిశాసనమున రెడ్డిరాజులలో ప్రఖ్యాతుడగు పెదకోమటివేమారెడ్డి క్రీ 1440లో పరహితాచార్యునిపుత్రులును, భూలోకధన్వంతరియు నగుభాస్కరార్యునకును, రెండవశాసన[మున] భాస్కరార్యుని పౌతుడగు సింగనార్యునకును, [ ]ల్లె యను నగ్రహారము దానమిచ్చినట్లు చెప్ప[బడియు]న్నది.

[ప]రహితాచార్యు డను వైద్యవరుఁడు, కప్పను [మ్రింగిన ]చే, దానియెముకలు గ్రుచ్చుకొని, బాధపడు[చున్న ]మునకు చికిత్సచేసి బ్రతికించినాడట! ఇట్లు [చేసిన]చేత "పరహిత" యను నది అన్వర్థనామముగా [ఏర్ప]డియుండును. అది మొదలుకొని వారివంశము [పరహితవంశ]మని పిలువబడుచుండవచ్చును. పరహితాచార్యునిపుత్రునకు భూలోకధన్వంతరి[బిరుదు] నుండిన ట్లున్నది. శాసనమునం దిట్లు :

"..........మండూకశల్యవ్యథితసరీ[ సృపత్రా]ణాత్, ఆసేదుషాం పండితానాం కులే పరహి[త]..........భూలోకధన్వంతరయే సతః పరహి[తాచార్య]పుత్రాయ భాస్కరార్యాయ పండితేంద్రాయ ధీమ[తే]"

ఈపరహితవంశమువారు అంతటిగొప్పవా[రై] గొప్పకార్యములు చేసి, రాజులచే సన్మానింపబడు[ట]గాక వారికీర్తి శాశ్వతముగ నెలకొనునట్లు కొని[యాయుర్]వేదవైద్యగ్రంథముల గూడ రచించియుండు[రు]. శ్రీచెన్నపురి ఆయుర్వేదకలాశాల పుస్తకభాం[డాగార]మందు "పరహితసంహిత" యను ఆయుర్వేదవైద్యగ్రం[థ]మొకటి గలదు. ఈగ్రంథ మిదివఱ కెచ్చటను దొరకలేదు. ఇట్టిపేరుగల పుస్తకమున్నట్లు ఉత్తరదేశపు కవిరాజులు కొందఱు వ్రాసిరేగాని దానియాకరము దెలుపలేదు. ఆయుర్వేదకలాశాలయందున్న గ్రంథముగూడ సమగ్రముగ లేదు. రెండవయధ్యాయము నుండియు యెన్మిదియధ్యాయములతో సంపూర్తినొందినది. మొదటి గ్రంథభాగము కొంత దొరకలేదు. చివరభాగముకూడ కొంత లోపించినట్లున్నది. కౌమారభృత్యము మొదలుగా గలిగి, శల్యతంత్రము, అగదతంత్రము, గ్రహచికిత్స, యిందు విపులముగ వివరింప బడియున్నవి. చివరభాగమున కొన్ని రసాయన, వాజీకరణయోగములు కలవు. కొన్నియధ్యాయాంతములయందు "ఇతిశ్రీనాథపండితస్యకృతౌ పరహితసంహితాయాం..........."అని గద్య కలదు. ఇంతకంటె గ్రంథమునం దెచ్చటనుగూడ గ్రంథకర్తవంశాదిప్రశంస గానరాదు. గ్రంథారంభము గాని, చివరభాగముగాని దొరకినయెడల దానినుండి [య]దేమైన కొంత బయల్పడవచ్చును.

సడు పయిన పేర్కొన్న పరహిత
కావలయును. పరహితవంశ్యులు
రాజులచే గౌరవింపబడియుండుట
గానే భావింపఁబడవలసియున్నారు.
తెలుగుదేశమున నుండి తెలుగు
పఁబడి అగ్రహారాదుల గైకొనుట
నేరదు.

హితసంహితగూడ, నేతద్వంశ్యులగు పండి
ద్దింపఁబడినది గావలయును లేనిచో గ్రంథ
నామ మిడుట సంభవింపదుగదా! విషయపరి
యనకయి అచ్చటచ్చట కొంత గ్రంథభాగము
చ జూపెదను:—

నవిచారమ్:—

మాతురేవపిబేత్ స్తన్యం తదలం దేహవృద్ధయే;
వేనే సచ్ఛాగం గవ్యం వా తద్గుణం పిబేత్.

ణే క్రిమిదోషః:—

అరక్షయా వ్రణేయస్మిన్ మక్షికానిక్షిపేత్క్రిమీన్ తే భక్షయంతః కుర్వంతిరుజాశోఫాస్రస్రంసనాన్. సురసాది ప్రయుంజీత తత్ర ధావనపూరణే; సప్తపర్ణకరంజార్కనింబరాజాదనత్వచః

గర్భస్రంసనలక్షణమ్:—

వస్త్రౌ పార్శ్వద్వయే శ్రోణ్యాం జఠరే త్యగ్రవేదనాః; పరివృత్తిశ్రమో నాభిశూలం హృదయసీదనమ్; పాండుత్వంచేతి గర్భస్య స్రంసమానస్య లక్షణమ్"

తచ్చికిత్సా:—

గర్భే నిపతితే తీక్ష్ణం మద్యం సామర్థ్యతః పిబేత్; గర్భకోశవిశుద్ధ్యర్థ మార్త్యా విస్మరణాయచ.

ఉన్మాదనిర్వచనము:—

ఉన్మాదోనామ మనసా దోషై రున్మార్గగై ర్మదః; సదోషః సన్నిపాతాది విషభూతసముద్భవః. విరుద్ధస్వాహ్యరుచిభోజనాని ప్రధర్షణాద్దేవగురుద్విజానామ్; ఉన్మాదహేతు ర్భయహర్షభూతో మనోవికారో విషమాశ్చ చేష్టాః.

శుక్లక్షయే కారణాని:—

శుక్లంతు చింతావ్యాయామవ్యాధిభిః కర్మకర్శనాత్; క్షయం గచ్ఛ త్యనశనాత్ స్త్రీణాం చాతిని షేవణాత్.

శుక్లక్షయా ద్భయా చ్ఛోకాత్ అవిస్రంభాదసేవనాత్; అతిహర్షా దతిస్థౌల్యా త్కాలోపచయతశ్శ్రమాత్.

ఇంకను చూపఁదగినమంచిపట్లు చికిత్సాభాగమున గలవుగాని, విస్తరమగునని విరమించినాను.

ఈగ్రంథముగాక, సంస్కృతముననుు, తెలుఁగుననుు మఱికొన్ని వైద్యగ్రంథములు గలవు. అందు కొన్ని అపూర్వములయినవి గూడ నున్నవి. వాటినన్నిటిని గూర్చి యిచ్చట విస్తరించిచెప్పుటకు స్థలము లేదు. కొన్నిటినామములుమాత్ర ముదాహరించెదను. కాశ్యప సంహిత, ఆయుర్వేదసూత్రములు, ద్రవ్యరత్నావళి, ఆనందకందము, కల్యాణకారకము, చారుచర్య, ఏకాక్షర నిఘంటు, కార్మణము, వీరభట్టీయము, వైద్యభేషజ తర్కము ఇత్యాదులు.

సంస్కృతగ్రంథములుగాక తెలుఁగుగ్రంథములు గూడ చాలగలవు. ఎక్కువగా పద్యరూపమున నున్నవి. త్రిదోషములగూర్చి తెలుపుగ్రంథములు తెలుఁగున లేవు. నిదానవిషయములు అష్టస్థానపరీక్షనుగూర్చి యుండునే గాని, పంచలక్షణనిదానమునుగూర్చి తెలుపుగ్రంథములు లేవు. తెలుగున ఆయుర్వేదవాఙ్మయము నొందించుటకయి, చికిత్సాభాగములే గాక, చర్చకుఁ బూనుకొని, త్రిదోషసిద్ధాంతమును విపులపఱచుకొన్నిపుస్తకములు వచనరూపమున వ్రాయ వలసియున్నవి. కలాశాలయందు గ్రంథములను గూర్చి వేఱొకపుడు వ్రాయదలచి యింతటితో వ్యాసమును ముగించుచున్నాను.

# కాలధిక్కృతి

నోరి నరసింహశాస్త్రి బి. ఏ.

సాహితీ సమితి సభ్యుడు

ఊహాతీతము నీమహత్త్వము త్వదీయోదాత్తరూపమ్ము స
మ్మోహం బందగ జేయు జూచునెడ సంపూర్ణమ్ముగా, మాదు శో
భాహీనాత్ముల యల్పశక్తియె మమున్ భావించి కాపాడ లే
దా హింసింపవె కాలమా! భయదమా స్థైర్యప్రతాపప్రభన్.

నీయాజ్ఞన్ శిరసావహింత్రు నిశమున్ విశ్వంభరాభారధా
రేయప్రాభవశాలులెల్ల నృపులున్ లీలన్ మహేంద్రాదులన్
మాయంజేసి విచిత్రముం గనెదు నిన్వర్ణింపగా వేర నే
లా యాసృష్టి విధాతయేని భవదీయాజ్ఞానుసంవర్తిగా!

ఈవేళన్ జనసంకులం బవిరతస్వేచ్ఛామధూపాత్తమో
హావేశంబున సల్పుచుండెడి సమీకారంభముల్ నృత్తలీ
లావాద్యధ్వనిసంతతుల్ చెలగు నేడన్ వింద వచ్చోట రే
పే విస్రబ్ధవిలాసనృత్యముల ఘోషింపన్ పిశాచాంగనల్.

నీ కాఠిన్యము నీస్వభావమువలె న్నిస్సీమమై భేదచిం
తాకార్యక్రమబుద్ధి బూనదు, సదా నైశ్చల్యసంశోభి యై
లోకక్షేమవిపక్షశిక్షణ మెటుల్ రూపించు నారీతి న
స్తోకశ్రీకరమూర్తులౌ బుధజనుల్ శోషింపగా గాంచెడిన్.

ఫుల్లంబై మృదుపత్రమై సుమధురామోదంబునై చిత్రవ
ర్ణోల్లంఘీకృతశక్రచాప మయి పొల్చుం బుష్పరాజం బక
స్మాల్లభ్యం బయినంత దాని సొబగున్ శ్లాఘించు మాత్రంబు లో
నొల్లంబోయి యపాత్తకాంతి యగు నీయుద్యత్ప్రభావంబునన్.

నీదుశ్శక్తి తిరస్కరించు తమితో స్నేహాతురుల్ రాగజో
న్మాదోద్రేకత గౌగిలించుచును ప్రేమన్ ముద్దులం గొంచు, స
మ్మోదాశ్రుల్ జడివార బూన ప్రతినల్, మోచించు గౌగిళ్లు, పెం
పేదున్ చుంబన, లింకు నశ్రులు, పతిజ్ఞేచ్ఛల్ మరుద్రూపమా!

ఏమాత్రంబు భవత్ప్రతాపమహిమం బిచ్ఛావిధిం గాంచగా
లేమిం గాదు మదీయజృంభణము, స్వాల్పీయంబు నాశక్తి యౌ,
నామాటల్ శమియించుగా కనిలసంచారంబులం, దింతలో
నేమాయెన్ హృదయంబు నిండిన పవిత్రేచ్ఛల్ సుహృద్భావముల్?

# రసము - రసాయనము

కామఋషి – మృత్యుంజయవర్మ గారు

రసతంత్రములు ముఖ్యముగాఁ బరిశోధ
అన్నిశాస్త్రములకంటె రసశాస్త్రవిషయిక
ంత తెలివిగలవానికైన తెలిసితెలియనివిషయములు
రసశాస్త్రకోవిదులు నాయీసాహసమునకు
ంపవలయునని ప్రార్థించుచున్నాను. దక్షిణ
నాడుదురు. కాని యాపద్ధతు లగస్త్య
ములై యున్నవి. ఆంధ్రదేశమున నాయుర్వేద
తాత్పర్యసహిత మాంధ్రలిపియందు ముద్రింపఁబడని
ఆంధ్రవైద్యులలో నూటికి అఱువదిమందికి సం
జ్ఞానము లేకపోవుటచేతను, ఆంధ్రవైద్యులకు చికి
క్షీణింపఁ జొచ్చినది. వంగపాంచాలాద్యుత్తరదేశ
బొంబాయి, పూనా మొదలగు పశ్చిమప్రాంతముల
గరలిపియందు రసార్ణవాది రసతంత్రములు చరకసుశ్రు
ర్వేదగ్రంథములును ముద్రింపఁబడుటచేత నాయాప్రాంత
ం దాయుర్వేద మభివృద్ధి నొందుచున్నది. ఆంధ్రదేశమున గ్రంథ
హాయము లేకనో రససంస్కారములు తెలియకనో, కష్టమని యు
పేక్షించుటవలననో, అసంస్కారణసిద్ధమైనదోషయుక్తరసమును బ్రయో
గించుటవలన ననేకవిధముల నోరుపట్టి, కీళ్లు పడిపోయి, తాపమోహ
మూర్ఛామరణములకు రోగులు లోనగుచుండుటచే నాంధ్రలోకము
రసముయొక్క పేరు విన్నంతమాత్రముననే భయపడుచున్నది. శాస్త్రీ
యసంస్కారణములచేత దోషరహితము చేయఁబడినవిషము లమృతప్రా
యము లగును. రసము ద్రవరూపమైన లోహమై యున్నది. సృష్టిలో
మొదట స్వర్ణాదిసర్వలోహములు ద్రవరూపముగా నుండి రానురాను
ఘనీభవించినవి. అట్లే భూగర్భశీతోష్ణపరిస్థితుల ననుసరించి రసము
కూడ ఘనీభవించి రజితమువంటిలోహ మగును. ఆకాలము మనము
చూడనిది. అయినను, ఆస్థితి కట్టు, గ్రాసములవలన రసమును ఘనీభ
వింపఁజేయవచ్చును. అట్లు ఘనీభవించినది రసలోహ మని పేర్కొ
నంబడును. రసమును లోహరూపముగా మార్చుటకు ముందుగా నితర
లోహమిశ్రమము కాకుండ శుద్ధిచేసికొనవలయును. రసమును వెల్లుల్లితో
నూఱి యొకకుండలో నుంచి పైన నొకకుండ బోర్లించి గాఢముగా
చీరమన్ను లిచ్చి యాటివెనుక మూడుయామములు క్రమాగ్నులచే
వండగా నాగవంగాదిలోహపిష్టమును గ్రింద విడిచి నిర్దోషమైన
రసము పైకుండకు లేచి పట్టుకొనును. అట్టి స్వచ్ఛ
మైన రసమును జాగ్రత్తగా దీసి నిమ్మకాయరసమునఁ
గాని కాంజికమునఁగాని కడిగి చిక్కని గుడ్డలోవేసి యేడుపర్యాయ
ములు పిండఁగా పలచఁదనము, చుఱుకు గలరసము వెలువడును. ఇది

యష్టసంస్కారములు చేసిన శుద్ధరసమువలె యోగములఁ జే
ర్పందగును. ఇట్లే యూర్ధ్వపాతనయంత్రసహాయమువలన నింగి
లీకసౌవీరములనుండి తీయఁబడినరసమును యోగములం జేర్పఁదగును.
ఇట్లు సంస్కారింపఁబడిన శుద్ధరసము నొకమూసలో వేసి కోష్టియంత్ర
మందుంచి స్వల్పాగ్నిమీఁద పెద్దయెలుకచెవియాకురసమును పైన
పోయుచుండఁగా రసము ఘనీభవించి రసలోహ మగును. దాని నెన్ని
పర్యాయములు కరఁగించినను స్వర్ణాదిలోహములవలె మరల మరల నది
కరఁగుచుండును. ఇది మూలికాబద్ధమగు రసలోహము. పెద్దయెలుక
చెవియాకును సంస్కృతమున 'బృహదాఖుకర్ణి' యని పిలువంబడును.
నిఘంటురత్నాకరమున "రసబంధకరీ నేత్ర్యా రసాయన్యథ శూల
నుత్ । జ్వరం కృమీన్ వ్రణంచాఖువిషంచైవ వినాశయేత్.
అని చెప్పఁబడినది. ఇది చిన్నయెలుకచెవివలెనె యుండును.
కాని ఆకు లంతకంటె పెద్దవిగాను ఆకు అడుగున బూడిద చల్లి
నట్లును, యాకున కడుగున తొడిమ కలిగి యాకుయంచున మృదు
వైన మూడుముండ్లు కలిగియు నుండును. చిన్నయెలుకచెవివలెనె
తీఁగె ప్రాఁకును. దీనిని హిందీభాషలో 'బడామూసాకానీ'యనియు,
వంగభాషలో 'ఉన్దురకానీపానా'యనియు, మహారాష్ట్రభాషలో
'ఉందిరకానీభోపనీ'యనియుగుజరాతిభాషలో'ఉందరకనీ'యనియు
ఫారసీభాషలో 'సతర్'అనియు, అరబ్బీభాషలో 'అజానుల్ ఫార్'
అనియు, యుత్కలభాషలో 'శరదమ్' అనియు లాటిన్ భాషలో
ఆయీపోమియాదేనిఫోర్మిస్ అనియు వాడుదురు. రసము మూలికా
బద్ధము చేయఁబడినట్లే తామ్రాదిబద్ధము చేయంబడును గాని యా
రసలోహము మిశ్రమరూప మగుటచే నప్రశస్తము. ఇట్లు చేయఁబడిన
రసలోహమువలన కాయసిద్ధి, యమరత్వము మొదలగు దివ్యగుణములు
కలుగునని రసతంత్రములయందు వర్ణింపఁబడినది. రసము లోహరూప
మైనచో నద్దానివలన దేహము లోహరూపముగా నగునని ఋషా
కుల నిశ్చయము. ఇట్టి రసలోహసేవ చేసి జరామరణవర్జితు
వేలు పూర్వఋషులు జీవన్ముక్తిని బొందినట్లు ర...
రసేశ్వరదర్శనములు సర్వరసతంత్రములు ఘోషించుచున్న
మనసశ్చైవ చంచలత్వం స్వభావతః; రసబంధో
సిద్ధ్యతి భూతలే" స్వభావముచేత రసమనోధర్మము.
రసబంధ మనోబంధములు సిద్ధించునెడల జీవన్ముక్తిసి
భావము. రసమనోబంధములవలన చిరకాలజీవులై
యాధివ్యాధులు లేక యనేకజన్మములలో సాధిం
మీజన్మముననే సాధింపవచ్చు నని రసేంద్రమతసిద్ధాంతః
"రసశ్చ పవన శ్చేతి కర్మయోగో ద్వివిధా మతః" రసబం

నిరోధము ఈ రెండును జ్ఞానప్రదములైన కర్మయోగము లని రసేంద్ర చింతామణి యందు శ్రీరామచంద్రగుహులను రసశాస్త్రవేత్తచే వర్ణింపఁబడినది. ఇట్టి రసలోహము లోహరూపముగా నుండుటవలన సేవించునప్పుడు సమగ్రజీర్ణము కానేరదు. అట్టిలోహమును స్వర్ణాది లోహములవలెనే మాఱక ప్రసిద్ధములగు మూలికలచే భేదించి భస్మము లేక సిందూరములుగా మార్చి సేవించి యాయురారోగ్యములను బొందెదరు. అవియే రసాయనములు. "యజ్జరావ్యాధివిధ్వంసభేషజం తద్రసాయనమ్." ఏది ముదిమిని వ్యాధిని నిర్మూలముచేయునో యది రసాయనము. పరిశుద్ధమగు రసమునకు సమగంధకము చేర్చి కజ్జలీకరించిన నల్లనికాటుకవంటి చూర్ణ మగును. దానిని పైడిప్రత్తిపువ్వుల రసమున మర్దించి చిన్నచిన్నమాత్రలు గావించి ఛాయాశుష్కముఁ జేసి గాజుకుప్పెలో వేసి వాలుకాయంత్రసహాయమున నాలుగుయామములు క్రమాగ్నులచే వండగా రసము గంధకజారితమై సిందూరమగును.

దీనిని సమసిందూర మందురు. పైప్రకారమే రసమునకు రెండు రెట్లు, మూడురెట్లు, నాలురెట్లు గంధకము చేర్పఁబడి పాకసిద్ధములైన సిందూరములకు క్రమముగా ద్విగుణసిందూరము, త్రిపాదసిందూరము, షడ్గుణసిందూరము అని వ్యవహరింతురు. ఇట్లు గంధకజారితములైన రససిందూరములే రసాయనము లగుచున్నవి. గ్రాసవిధానము ననుసరించి యిందు స్వర్ణాదులు రత్నాదులు చేర్పఁబడి దివ్యరసాయనము లగుచున్నవి. స్వర్ణమున కెనిమిదిరెట్లు రసము రసమునకు రెట్టింపు గంధకము కజ్జలీకరించి పూర్వోక్తప్రకారము వండఁగా సిద్ధమగు రసాయనమునకు పూర్ణచంద్రోదయ మని ప్రసిద్ధము. ఇందు రసమునకు మూడురెట్లుగంధకము చేర్పబడినప్పుడు మకరధ్వజమను రసాయనమగుచున్నది. ఇందు పూర్వభాగానుక్రమణికగా మరలమరల గంధకమును జేర్చి వండినయెడల గుణోత్కర్ష కలిగి ద్విపాకత్రిపాకాది చంద్రోదయమకరధ్వజము లను దివ్యరసాయనము లగుచున్నవి. అందలి లోహములు రసగంధకహతములై దేహమందు సమగ్రజీర్ణభావమును బొందగలభస్మము లగును. ఇట్లే స్వర్ణపుష్పరసాయనము, స్వర్ణరసాయనము, కాంతవల్లభరసము, మేహవంగరాజీయము, మొదలగు ననేక [illegible]యనములు ప్రసిద్ధములై యున్నవి. రసము గనిలోఁ బుట్టును. [illegible]ండి యీవలకు తీయునప్పుడు నాగవంగములందు కలిపి సహజ [illegible]ను తగ్గించి బరువు గలదానిగాఁ జేయుదురు. ఇట్టిరసము [illegible]ంగాదిద్వాదశదోషము లున్న వని రసశాస్త్రవిశారదుల[illegible] బడినది. కనుక "అతో దోషనివృత్త్యర్థం రసశ్శోధ్యః శోధితో రసరాజస్తు సుధాతుల్యఫలప్రదః, దోషహీనో [య]స్తదా మృత్యుజరాపహః, సాక్షా దమృత మ ప్యేష [illegible] రసో విషమ్." ఇట్లాయుర్వేదప్రకాశ మను రసతంత్ర[illegible]ధవునిచే వర్ణింపఁబడినది. కనుక దోషవినాశనముకొఱకు [illegible] సంస్కారా ఊనవింశతికాః క్వచిత్, సంప్రోక్తా రస సంఖ్యాః క్వచి న్మతాః." అనునభిప్రాయభేదముల నను నిమిదియు, పందొమ్మిదియు, నెనిమిదియు, సంస్కా[రములు]

[illegible]రము లెవరియిష్టానుసారము వారు చేయ[illegible] కూడ రసతాంత్రికు లంగీకరించియున్నా[illegible] దగినది కాదు. 1 స్వేదనమువలన తీవ్రత్వ[illegible] లత్వమును, 3 చారణమువలన బలకరణము[illegible] నంబును, 5 ద్రావణమువలన నేకత్వమును[illegible] మును, 7 సారణమువలన వ్యాపిత్వమును, [illegible] త్వమును, సిద్ధించును. 1 స్వేదనము, 2 వ[illegible] ఉత్థాపనము, 5 పాతనము, 6 బోధనము, 7 నిర[illegible] పనము, అనునవి యష్టసంస్కారములు. 1 అన[illegible] గ్రాస, 3 చారణ, 4 గర్భద్రుతి, 5 బాహ్య[illegible] 7 రంజన, 8 సారణ, 9 క్రామణ, 10 వే[illegible] నొకండును పూర్వోక్తమగుసంస్కారము[illegible] మ్మిది సంస్కారము లైనవి. ఈ ఊనవింశతిసంస[illegible] కొఱకు రసకోవిదులు వచించిరి. అందు స్వేదనాదిదీపన[illegible] గల యెనిమిదిసంస్కారములు దేహసిద్ధికొఱ కేర్పడిన[illegible] సూతసంస్కారాః సమా ద్రవ్యే రసాయనే, శేషా [illegible] త్వా న్న తే వైద్యోపయోగినః." అని వాగ్భటమున[illegible] ఇందులో నధఃపాతన తిర్యక్పాతనము లను రెండుని[illegible] లనుగూడఁ జేయుదురు. ఈ రససంస్కారము లెట్లు [illegible] యాక్రమములు గ్రంథవిస్తరభయంబున విరమింపంబడుచున్న[illegible] రోగనివృత్తికొఱకు స్వేదనాదిదీపనాంతరమువఱకు నెనిమిది స[illegible] రములు చాలు ననియు నెంతపరిశుద్ధమైన రసమునకైన గంధకజారణ మావశ్యకమనియు శుద్ధమైనను గంధకజారితము కానిరసము యోగములఁ జేర్పం దగదనియు, మృతామృతరసములు పాకావలేహగుళికాచూర్ణాదులయందు గంధకజీర్ణమై కాని స్వర్ణాదిధాతుజీర్ణమై కాని రసాయనము లగుచున్నవనియు, అట్టిగంధకజీర్ణితమైనరసమునకు రసోపరససాధారణరసములు, ధాతూపధాతువులు, రత్నోపరత్నములు, విషోపవిషములు శుద్ధమైనవి చేర్చి నవరత్నచింతామణి, నవలోహచింతామణి, త్రైలోక్యచింతామణి, మహారాజమృగాంకము మొదలగు ననేకరసరసాయనములు కల్పించి దేహబలానుగుణ్యముగా సేవింపం జేసి సర్వరోగముల నిర్మూలన మొనర్పఁ దగుననియు "సమే గంధేతు రోగఘ్నః" అనున్యాయముచేత గంధకమిశ్రమము కానిరసము రోగహరణసమర్థము కానేరదనియు రసాయనగుణోత్కర్షకొఱకు గంధకజారణానంతరము హేమాభ్రకాది సత్వసమ్మేళనము చేసి మారణవిధిచే హతము గావించి యద్దానిని త్రైతీకరణపూర్వకముగా యుక్తానుపానభేదములచే రోగానుగుణ్య పథ్యయోగములు కల్పించి మండలము లేక ఆఱుమాసములు, సంవత్సరము, లేక యావజ్జీవము లేక యవకాశము నెంబడిని పౌనఃపున్యముగా సేవింపందగు ననియు, రసమాధవునిచే వచింపఁబడియెను. అందు మూర్ఛనమునుగుఱించి నిర్గంధసగంధమూర్ఛనములని రెండువిధములు వర్ణింపఁబడినవి. . విషాద్యోషధీసమ్మేళనమువలన రసము నిర్గంధమూర్ఛనము చేయఁబడును. ఇందు గంధకసంపర్కము లేదు. ఇది

పాఠాంతర భేదముచే పామరయోగిసమ్మ
క సగంధమూర్ఛనమున గంధకము రసము
ర్ధూమాంతర్ధూమనిర్ధూమము లని మూడు
ౕటికి 1 గంధపిష్టి 2 గంధబద్ధ 3 గంధజీర్ణ
అని యైదువిధములు. మూర్ఛనజారణశబ్ద
ు గలవి. కాచకూపి, కాచసంపుట, స్వర్ణ
గంధకమువలెను నంతర్ధూమబహిర్ధూమ
యుటవలన రసాయనము లగుచున్నవి.

స్వాభావికద్రవత్వమును క్రమాగ్నిభేదముచేత
స్మరూపముగాఁగాని చేయుట. శుద్ధరస
ంచి యూర్ధ్వపాతనయంత్రమున క్రమా
ము పైనుండను భస్మీకరించి పువ్వువలె
ందు గంధకసంపర్కము లేదు. ఇట్లే నాలుగైదు
శమముచేసి వండిన నిర్దుష్టమైనభస్మ మగును. ఇట్లయిన
ంధకమిశ్రమము చేసి విధిప్రకారము సేవించిన సర్వ
ోకడచును. దీనినే కుష్టాయని యూనానీవైద్యులచే
ాని కొందఱు ద్రాక్ష, తాటిబెల్లము మాటుపెట్టి గం
డనే వాడుదురు. కాని యది శాస్త్రీయము
లీకము సౌవీరము అనునవి రసమయములే. రసగంధక,
పాషాణాదిద్రవ్యముల చేర్చి వండి చేయుదురు. ఇందు రసము
్వపాతనయంత్రసహాయమువలనఁ గాని యధఃపాతనయంత్రసహా
యమువలనఁ గాని తీయవచ్చును. అట్టిరస మష్టసంస్కారములచే
శుద్ధమైన రసమునకు తుల్యముగా నుండును. కాని యింగిలీకరస
మున షండత్వదోష మున్నదని కొంద ఱనుమానించుచున్నారు.
ఇంగిలీకములో నున్నప్పుడే గాని యింగిలీకమునుండి తీయఁబడిన రస
మునకు షండత్వదోషము లేదని రసవిజ్ఞులయభిప్రాయమై యున్నది.
కాలానుగతముగా రసతంత్రవిజ్ఞాన మభివృద్ధినొందినకొలఁది నిటీవల
రసకోవిదుల రసపరిశోధనలవలన, శ్వేతాభ్రకము నీలాంజన రసాం
జనా ద్యంజనపంచకము, కృష్ణాభ్రకము, రాజావర్తమణి, రత్నోప
రత్నములు తాళకము మృదారు చిన్ని మొదలగు కొన్ని ఖనిజములు
రసగర్భితములై యున్నవని యనుమానించి వానివానినుండి ప్రత్యేక
ప్రత్యేకముగ నధఃపాతనయంత్రసహాయమువలన రసమును వేఱుచేయు
టకు ప్రయత్నములు జరుగుచున్నవి. వానివాని పర్యవసానములు,
మార్గములు నాచే వ్రాయఁబడుచున్న రసతంత్రవిజ్ఞాన మను రసగ్రంథ
మున విరళముగా నుదాహరింపఁబడును. కనుక గ్రంథవిస్తరభయంబున
నిందు నింతటితో విరమింపఁబడెను. రసేంద్రచింతామణి యను రస
శాస్త్రమున రససిద్ధాంతప్రకరణమున "మూర్ఛితో హరతే వ్యాధిం
మృతో జీవయతి స్వయం, బద్ధః ఖేచరతాం కుర్యా ద్రసో వాయు
శ్చ భైరవిః." మూర్ఛను బొందినరసము వ్యాధిని కుదుర్చును. మృత
మైనరసము రోగిని బ్రతికించును. బద్ధమైనరసమువలన ఖేచరత్వాది
సిద్ధులు గలుగును. అవియు దేహదార్ఢ్యము తగ్గువఱకున్న వెంద్రుకలు
నరయువఱకున్న, రసభస్మమందు బుద్ధి యేలాగుపుట్టును? అనఁగా రస
భస్మసేవవలన దేహదార్ఢ్యము దృఢపడునని భావము. ఎంతవరకు రస
మును సేవింపఁడో యంతవఱకు రోగవిముక్తి యేలాగుకలుగును? ఈశరీ
రము ఏలాగున ధరింపఁబడును? అని వర్ణింపఁబడినది. లోకము రసము
వలన ననేకప్రత్యవాయములు గలుగు నని పొరపాటు పడుచున్నది.
సంస్కారరహితమైన యశుద్ధరసమువలన ప్రత్యవాయములు కలుగును
గాని సంస్కారపరిశుద్ధమైనట్టియు నిర్దోషమైనట్టియు పవిత్రమయినట్టి
యు రసమువలన నెట్టిప్రత్యవాయము కలుగక జరామరణవర్జితమైన
కాయసిద్ధిని కలుగఁ జేసి యాయురారోగ్యములను వృద్ధిచేయును.
ఈ రసవిద్య శ్రేష్ఠమైనదియు, భుక్తిముక్తుల నిచ్చునదియు, దుర్లభ
మైనదియుఁ గనుక బ్రహ్మజ్ఞానసంపన్నుఁ లైనప్పటికి నెవడు
సంస్కారసిద్ధమైనట్టియు పవిత్రమైనట్టియు శుద్ధరసమును నిందిం
చునో వాఁడు పాపాత్ముఁడనియు రసనింద చేసినవారితో సంభా
షణమును స్పర్శయును చేయరాదనియు రసేంద్రచింతామణియందు
శాసింపఁబడెను. అనఁగా నిర్దోషమైనపదార్థమును గుఱించి యపవాదములు కల్పించి వృథా నిందచేయకూడదని యభిప్రాయము. శాస్త్రీ
యముగా మృతమైన రసేంద్రలక్షణము "అగురు రతేజాఃస్వభ్రా
వహ్నిస్థాయీ స్థిరో ధూమః; హేమాదిధాతుభోక్తా తత్కర్తా, స్యా
న్మృతఃసూత్సః." అనియు, "అతేజా అగురు శ్శుభ్రో
లోహహా చంచలో రసః; యదానావర్తతే వహ్నౌ నోర్ధ్వం
గచ్ఛేత్త దామృతః." గురుత్వరహితమును, తేజోరహితంబును, అగ్ని
యందు స్థిరముగా నిలుచునదియు, తెల్లనివర్ణము కలదియు, అగ్ని
యందు వైచిన పొగయెత్తనిదియు స్వర్ణాదిధాతువులను గ్రసింపఁగల
దియు, లోహాదులను భేదించునదియు, చాంచల్యము లేనిదియు, అగ్ని
సంస్కారమువలన యూర్ధ్వగామిగాక నిలుచునదియు మృతరసేంద్ర
మని తెలిసికొనవలయు నని రసమాధవునియభిప్రాయము. అట్టిమృత
రసేంద్రము "రసాయనంత్రిదోషఘ్నో యోగవాహ్యతి శుక్రలః భస్మ
సూతో ఖిలాతంకనాశన స్త్వనుపానతః" త్రిదోషనాశనము శుక్ర
వృద్ధి కలిగించి యోగవాహినియై యనుపానవిశేషములచే సకల
రోగముల నిర్మూలించును. అట్టిమృతసూతము రసాయన మగుచున్నది.
ఇది యిట్లుండఁగా నాంగ్లేయరసశాస్త్రవేత్తలు చేసిన రసపరిశోధ
నలవలన తేలిన రసౌషధము లాయుర్వేదరసతంత్రజ్ఞులయభిప్రాయ
మునకు చాల దూరముగా నున్నవి. పాశ్చాత్యరసౌషధములు కే
కొన్నికొన్ని ప్రత్యేకవ్యాధులను గుదుర్చుటకే యేర్పడిన
సర్వరోగనివృత్తి యగును రసాయనసిద్ధి యగును గా
పింపవు. 1 హైడ్రార్జిరమ్‌కమ్‌క్రేటా అనఁగా శుద్ధ
రస మొకభాగము, రెండుభాగములు సీమసున్న మృత్తః,
బడును. 2 పిలూలాహైడ్రార్జిరి. అనఁగా బ్లూపిల్; సూత
డమ్ రూబ్రుమ్ అనఁగా రెడ్ మెర్క్యురిక్ ఆక్సిడమ్‌సుకో
ఆక్సిడమ్‌ఫ్లావమ్- అనఁగా యెల్లో మెర్క్యురిక్ ఆక్సైడు సమ
ర్జిరి- పెర్‌క్లారిడమ్. ఇది మెర్క్యూరిక్ సల్ఫేట్ సోడియం
మాంగనీస్ డైఆక్సైడులయొక్క సమ్మేళనము. 6 కాలో
రసభస్మము. దీనినే సబ్‌క్లోరైడ్ ఆఫ్ మెర్క్యూరీ అని

రైస్ క్లోరైడ్ అనియు, హైడ్రార్జిరి సబ్‌క్లోరిడమ్ అనియు పిలుతురు. ఇది మెర్క్యూరస్ సల్ఫేట్ సోడియమ్‌క్లోరైడ్ కలిపి వండి చేయుదురు (7) పిలూలా హైడ్రార్జిరిసబ్‌క్లోరైడ్ కంపోజిటా అనఁగా ప్లమ్మర్సుపిల్ అందురు. (8) హైడ్రార్జిరి అయోడిడమ్ రుబ్రల్. దీనినే అయోడైడ్ ఆఫ్ మెర్క్యూరీ అనియు మెర్క్యూరిక్ అయొడైడ్ అనియు, బిన్ అయొడైడ్ అఫ్ మెర్క్యూరీ అనియు పిలిచెదరు. దీనిని మెర్క్యూరిక్ క్లోరైడ్, పొటాసియమ్ అయొడైడ్, సమ్మేళనమువలన చేయుదురు. (9) వైకర్ అసినియాయియెట్ హైడ్రార్జిరి అయొడైడ్. దీనినే డినోవన్‌సు సొల్యూషన్ అందురు; (10) గ్రీన్ అయొడైడ్ ఆఫ్ మెర్క్యూరి; (11) వైకర్ హైడ్రార్జిరి నైట్రేటిస్ ఆసిడస్. దీనినే మెర్క్యూరిక్ నైట్రేట్ లేక, పెర్ నైట్రేట్ ఆఫ్ మెర్క్యూరీ అని అందురు. (12) హైడ్రార్జిరమ్ అమ్మోనియేటమ్ అనగా అమ్మోనియా మెర్క్యూరి (13) సాల్ అవెసాల్ అలెమ్‌బ్రాత్ అనఁగా అమ్మోనియా మెర్క్యూరిక్ క్లోరైడ్ అందురు. ఇదే డబ్బల్ క్లోరైడ్ ఆఫ్ మెర్క్యూరీ అన్‌డ్ అమ్మోనియమ్. ఇది జలమున కలియును దీనిని దారుణమైన సవాయివ్యాధులందు సూచీయంత్రసహాయమున ప్రయోగింతురు. ఇట్లెన్నివిధముల పాశ్చాత్యరసౌషధములు అభివృద్ధిగాంచినను రసాయన ప్రసిద్ధమగు రసౌషధ మొక్కటియు నందు గన్పించుట లేదు. పాశ్చాత్యరసకోవిదు లింకను రసముతో స్వర్ణాదిధాతుసమ్మేళనము చేసి రసాయనౌషధములుగా మార్పగల యభివృద్ధికి రాలేదు.

నవరత్నములు అంజనపంచకము, స్వ... ననేకఖనిజములయొక్క యుపయోగము రసాయనములుగామార్చి యనేకరోగము... ఆయుర్వేదరస తంత్రజ్ఞులవలన నభివృద్ధి ఈ యభివృద్ధి చాలదు. దేశకాలాను... ములను రసతంత్రములను కొంతవఱకు సవరి... సమర్థులైన పండితులు పరిశోధకులు క... నాయుర్వేదమునకు ఆదరణ తక్కువగా నుండుటః... వైద్యము ప్రబలియుండుటవలనను అయుర్వేదపు... కనిపించుట లేదు. గతానుగతికముగా పూర్వశాస్త్రములను విమర్శకులు విమర్శిం... ధించి యనుభవవిరుద్ధమైన విషయములు తీసవే... గంబులు సవరించుట యావసరమైయున్నది. రసతం... దే నిదానచికిత్సాజ్ఞానములు శోభింపవు. కనుక ఆయ... నులు ప్రభువులు నభిమానించుకొని రసతంత్రముల తాత్పర్యసహితము ముద్రించి ఆయుర్వేదప్రపంచము యును. అప్పు డాంధ్రవైద్యులకు రసతంత్రవిజ్ఞానము, చికిత్సాపరిజ్ఞానము కలుగును. ఇట్టి శుభకాల మచిం... చుటకొఱకు శ్రీహరి నహర్నిశము ప్రార్థించుచున్నాను.

# కాకినాడ కాంగ్రెసునం దెత్తిన యఖిలభారతీయ స్వరాజ్యపతాకము

చాగంటి విశ్వపతిశాస్త్రి గారు

స్వతస్స్ఫుటసూత్ర శంకుసంకీలిత
　　స్తంభాగ్రవాయు నృత్యత్పటంబు
పాండునీలారుణప్రకటవర్ణత్రయ
　　స్ఫురితజాత్యైక్యసంశోభితంబు
ప్రజాదైన్యనిర్వాపణైకపథసం
　　ప్రలప్తసర్వోన్నతవిష్ణుపదము
...ందిష్టశాంతాశయాకర్షిత
　　నైకఖండప్రజాలోకనంబు
...హానవిపక్షవర్గభీత్యావహంబు
...స్యభారతస్వాతంత్ర్యలాంఛనంబు
...నరత్నగుణచక్రమండితంబు
...ిలభారతీయస్వరాజ్యధ్వజంబు.
...రమున్, సకలభారతజాతులుఁ గూడియుండుఁడీ
...స్వదోషమును, వేగ స్వరాజ్యము సేకుఱంగ; నన్...

నుడు లనిశంబుఁ బ్రేక్షకమనోగతులందుఁ బరిస్ఫురింప నొ
ప్పెడుఁ గనుఁడీ! త్రివర్ణముల విన్నన భారతకేతనం బదే!

గీ. పశుబలులదైనయంత్రపు బలిమికంటె
　నాత్మబలుల తర్జనిబల మధిక మనెడి
　సూత్రమును దెల్పు జంత్రపుశత్రువైన
　రాటనంబునఁ బొలుచు భారతపతాక.

గీ. ధరణి భారతస్వాతంత్ర్యధనము, కీర్తి
　ధనము, ధనముఁ బెరుంగు విస్తార మగుచుఁ
　గోట్ల కపుడు ముప్పదిమూఁడుకోట్ల ప్రజలు
　పడగ నెత్తుదు రిట్లె నాధ్వజము దనరు.

శా. బాలార్కప్రతిమానరత్నరుచియుం బద్మాక్షుపాదద్వయాం
　కాలంకారముఁ గల్గు భూభరణశేషాహిస్ఫటం బోలి, ద్వే
　ష్యాలోకోరుభయంకరంబును బ్రశాంతాత్మప్రవంద్యంబునై
　క్రాలుంగావుత! భారతధ్వజ మిలం గల్పాంతపర్యంతమున్.

# ...యల్ ప్రిఫరెన్సు' భారతదేశమునకు లాభకరమా?

కందుకూరి ఈశ్వరదత్తుగారు బి. ఏ.

...డిశెంబరు పదునెనిమిదవ తేదీని వంగ వణిక్సంఘమువారి సమక్షమున మాట్లాడుచు*నింపీరి... గూర్చి యిట్లు మనరాజప్రతినిధియైన రీడింగు ... పద్ధతివల్ల భారతభూమి కనేకలాభములు ...గా రాజకీయార్థికలాభములు గమనింపం...

...రియల్ ప్రిఫరెన్సు పద్ధతి' యనంగా నేమి? ఈసమస్య ...ది? దీనిచరిత్ర యేమి? భారతదేశమున కుపయోగకారి ...ను ప్రశ్నలను మనము విచారింపవలసియున్నది.

...రెన్సు' అనునది రక్షణపద్ధతి (Protection)యం దొక ...ము. దీనియర్థ మేమన: బ్రిటిషుసామ్రాజ్యమునందలివివిధ ...యా దేశములందు తయారైన యపక్వపదార్థసంచయ (...w materials) గాక యంత్రకళలు, హస్తకళలు మొద ...కళలకును, అన్యదేశములనుండి వచ్చుసరకులకన్న ప్రాము...యము నిచ్చుట. ఒక యుదాహరణ మిచ్చినం జాలును. హిందూదేశమునకు ఇంగ్లండునుండియు, జపానుదేశమునుండియు బట్టలు దిగుమతి యగుచున్నవి. జపానునుండి వచ్చుబట్టలపై దిగుమతిపన్ను నూటికి పదిరూపాయిలు విధించినయెడల, ఇంగ్లాండునుండి వచ్చువానిపై నూటికి పదిరూపాయలకు తక్కువగా దిగుమతిపన్ను వేయవలెను. అనంగా అయిదురూపాయిలో, ఎనిమిదిరూపాయిలో దిగుమతిపన్ను ఉండవలెను. ఇదియే యీసాంప్రదాయముయొక్క ముఖ్యోద్దేశము. ఇంగ్లాండుదేశము స్వేచ్ఛావ్యాపారపద్ధతిని అవలంబించుచున్నది. (Free Trade) ఇతరదేశములు అనగా ఫ్రాన్సు, అమెరికా, జర్మనీ, మొదలగునవి రక్షణపద్ధతి నవలంబించి, యింగ్లాండుదేశమునుండి వచ్చుసరకులపై చాల హెక్కువయైన దిగుమతిపన్నులు విధించుచున్నవి. అందుచేత బ్రిటిషుసరకులు ఆదేశములందు చలామణీయవుట లేదు. బ్రిటిషు కళలు క్షీణదశకు వచ్చుగతి పట్టినది. కళలు క్షీణించుట వలన దేశమునందు పనివారలకు పనిలేక దారిద్ర్యము పెరుంగుట తటస్థించినది. అందుచే నశాంతి ప్రబలమయ్యెను.

ఇట్టి యవస్థలు మాన్పుటకై ఈ శతాబ్దప్రారంభమునందు జోసెఫ్ ఛాంబర్లెన్ గారు మనము ప్రస్తుతము విచారించుచున్న సాంప్రదాయము నమలులోనికి తెచ్చినయెడల బ్రిటిషు సామ్రాజ్యమునకు క్షేమకర మని యుపన్యాసముల నీయ ప్రారంభించెను. కాని యీ పద్ధతి 1902 వ సం. నకు పూర్వమే అమలులోనికి వచ్చినట్లు కనంబడుచున్నది. 1897 వ సంవత్సరములో కెనడారాష్ట్రము బ్రిటిషు సరకులపై తక్కువసుంకముల విధించెను. (2)

ఈ పద్ధతియొక్క ముఖ్యోద్దేశములు ఏవి?

(1) బ్రిటిషు సామ్రాజ్యమునందలి వివిధరాష్ట్రములయొక్క వర్తకవ్యాపార మభివృద్ధి గాంచుటయు, నందుచే సామ్రాజ్యమునకు లాభము కల్గుటయు.

(2) సామ్రాజ్యము బలపడుటయు.

(3) సామ్రాజ్యమునందున్న యధినివేశములు దేశములు తమ తమరక్షణపద్ధతుల మాన నవసరము లేదు. సామ్రాజ్యములో స్వేచ్ఛావ్యాపారమును స్థాపించుటయుం గాదు.

(4) ఈ పద్ధతిని అవలంబింపవలెనను బలవంత మేమియును లేదు. ఆయాదేశములయొక్క పరిస్థితులను బట్టి ఆయాదేశములు ఈ పద్ధతిని అవలంబింపవచ్చును.

(5) ఇంగ్లండు వీలైనయెడల సామ్రాజ్యమునందలి రాష్ట్రములనుండి దిగుమతియగు వస్తువులపై చాల తక్కువసుంకముల విధింపవలయును.

ఈ పద్ధతి హిందూదేశమున కుపయోగమా, కాదా యను ప్రశ్న 1903 వ సంవత్సరములో ప్రారంభమయ్యెను. అప్పటి హైందవదేశపు కార్యదర్శియైన హేమిల్టన్ ప్రభువు భారతప్రభుత్వ... వారి కీక్రిందితంతివార్త నంపెను. 'అధినివేశనముల సభయ... సపక్షకరమైన పన్నులనుగూర్చిన (Preferential Duties... నము ఆమోదింపబడెను. ఆ తీర్మానము... ఆచరణలోని... యందు, మీ దేశమున కానీతి యెట్లు పరిణమించునో... నీయవలెను. భాగ్యవశమున హైందవప్రభుత్వమువారు...

---

* "She is the only country in the Empire which does not respond to Preference. There are ... Capable of easy and immediate Comprehension. Other benefits are claimed for the system, whi... deserve close study. There are also political and other aspects as well as economic for consid... Viceroy before the Bengal Chamber of Commerce 18-12-1923.

(2) The question of Imperial Preference in the British Empire first took practical shape in 1897 wh... partly in pursuance of a liberal Tariff Policy reduced her duties on Br. Goods.................Indian Fisc... sion Report Page 120.

ఖులై యీ క్రిందికారణములచే నాపద్ధతి మాకు పనికిరాదని ప్రత్యుత్తర మిచ్చిరి.

(1) దీనివల్ల బలవత్తరమైనలాభము లేవియు కలుగవు.

(2) ఈ పద్ధతి నవలంబించి బ్రిటిషు సరకులపై స్వల్పసుంకముల విధింతుమో, నితరదేశములవారు మాదేశమునుండి వచ్చుసరకులపై పెద్దసుంకముల విధించి వర్తక వ్యాపారమునకు నష్టము కలుగఁజేయుదురు.

(3) ఈ పద్ధతి హైందవవాదాయమునకు నష్టము కలుగఁజేయును.

(4) బ్రిటిషు సామ్రాజ్యమునుండి హిందూదేశమునకు దిగుమతులు నూటికి 75 వంతునను, హిందూదేశమునుండి సామ్రాజ్యములోనికి నూటికి 47 వంతునను అగుటవల్ల ఈపద్ధతి యీ దేశమునకు బొత్తిగా లాభకారి కాదు. హిందూదేశమునుండి ఎగుమతులు ఇతరదేశములకు ఎక్కువ పోవుటచేత నితరదేశములవారు, ఇండియా బ్రిటిషు సరకులకు ప్రాముఖ్యము నిచ్చినయెడల కోపముచేత ఎక్కువ పన్ను విధించినయెడల హిందూదేశ వర్తకవ్యాపారమునకు నష్టము అపరిమితముగా కలుగగలదు. బ్రిటిషుసామ్రాజ్యమునుండి దిగుమతులు ఎక్కువయగుటచేత వానిపైని దక్కువపన్నులు వేయవలసినయెడల హిందూదేశముయొక్క ఆదాయము తగ్గిపోవును.

(5) పూర్వపు అనుభవమును బట్టి చూడఁగా యిండియాయొక్క వాణిజ్యవ్యాపారసమస్యల నెప్పుడు చర్చించినను, హిందూదేశముయొక్క హితమునే ఆలోచనచేయుట లేదు. ఇంగ్లాండునందలి కొందఱే వ్యాపారస్థులలాభమునే చూచుచున్నారు. హిందూదేశమునందలి కళలకు రక్షణ ఆవశ్యకమై యున్నను, లేదా ఇప్పుడు కోరబడినను, ఆరక్షణవిధానములు ఇంగ్లాండుదేశమునుండి యీ దేశమునకు వచ్చుదిగుమతులను బాధించును. కాని అన్యదేశములనుండి యీ దేశమునకు వచ్చుదిగుమతులను అంతగా బాధింపవు. ఒకవేళ, అన్యదేశ దిగుమతులపై, ఇంగ్లాండునుండి వచ్చుదిగుమతులపైకంటె ఎక్కువపన్నులు విధించినను, ఇండియా దొరతనమువారు పైని పేర్కొనఁబడిన రక్షణపద్ధతిని అవలంబించినయెడల లాంకషైరు గకులు కాని, బ్రిటిషు ప్రభుత్వమువారు కాని, ఆ పద్ధతుల నామోదని మేము తలంపఁజాలము. కావున మాకీపద్ధతి అవసరము లేదు.

ల 1913 వ సంవత్సరమువఱకు దీనిప్రశంస రాలేదు. ఆసం సామ్రాజ్యశాసనసభయందు గంగాధరచిట్నవీసుగారొక ప్రవేశపెట్టిరి. ఆతీర్మాన మిట్లుండెను:

"దేశముతో చేసుకొన్న ఒడంబడికప్రకారము నల్ల వచ్చుఆదాయము తగ్గిపోవును. గనుక, సపక్షకరమైన (al) పన్నుల విధింతుమో, నింగ్లాండునకును, ఇండియా దేశములకును చాల లాభకరముగా నుండును."

ఈతీర్మానమునకు గవర్నమెంటు దొరగారు వ్యతిరేకముగా మాటలాడకొనవలసివచ్చెను. అనగా గవర్నమెంటు లుగా నుండిరి.

మఱల దీనిప్రశంస 1917 సంవత్సరమున సామ్రాజ్యయుదాంతరంగికసభ దేశమునుండి, మెస్టన్ దొరయు, సింహ గారును ప్రతినిధులుగా బోయిరి. ఆసభయందు ఈ దింపఁబడెను. "సామ్రాజ్యమునందలి ప్రతిరాష్ట్రము వారివృద్ధినిగూడ గమనించుచు, సామ్రాజ్యమునందు ఉత్పత్తికాఁబడు అపక్వపదార్థములు కళలకు, అనుకూలములగునరతుల నేర్పజేయుట పాడియను. ముఖ్యసూత్రమును ఆంతరంగికముగ నామోదించియున్నారు."

ఈసభ జరిగినదిమొదలు ఇండియా ప్రభుత్వము మునందు కొంచెము మార్పు కలిగినది. 1918 వ సంవత్సరమున తేయాకున కీ పద్ధతి యవలంబింపఁబడినది. 1919 వ నందు జంతువులచర్మములకును తోళ్లకును ఈ పద్ధతి యాచరణలోనికి తెచ్చిరి. మనదేశమునుండి సామ్రాజ్యములోని దేశముల కెగుమతి యైనయెడల నూటికి 10 వ వంతును, ఇతర దేశముల కెగుమతి యైనయెడల నూటికి 15 వ వంతును పన్ను విధింపఁబడెను. ముఖ్యముగా ఈచర్మవ్యాపారమునకు రక్షణ మత్యంతావశ్యకము. సామ్రాజ్యములోని దేశములకు పన్ను తగ్గించి యెగుమతి చేసినయెడల వర్తకులకు చివరకు ఎక్కువ నష్టమే కలుగుచున్నది. ఈ దేశమునందు చర్మములను పరిశుభ్రముచేసి జోళ్లు మొదలగు వస్తువులు చేయు కర్మాగారములు తక్కువ. కాఁబట్టి చవుకధరలకు ఈచర్మములనుకొని యింగ్లాండు, అమెరికాదేశములు చక్కఁగా చర్మములచే జోళ్లు మొదలగునవి తయారుచేసి తక్కువధరల కిక్కడ అమ్ముచున్నారు. అందుచేత ఈ దేశమునందలి జోళ్ల పరిశ్రమములు మొదలగునవి అభివృద్ధి పొందుట లేదు.

మఱల నీసమస్య మొన్నమొన్న గవర్నమెంటువారిచే నియోగింపఁబడినఫిస్కల్ కమీషన్ వారి విచారణనిమిత్తమై జారీచేయఁబడినవి. వారు విచారించి యీ సమస్య ప్రస్తుతము హిందూదేశమునకు వర్తింపఁజేసినయెడల విశేషలాభము లేదని తేల్చిరి. 1903 వ సంవత్సరమునకును, ఇప్పటికిని విశేషము వ్యత్యాసము లేదని కూడ వ్రాసియుండిరి. * ఈ క్రిందిపట్టికవల్ల ఎగుమతి, దిగుమతులలో విశేషభేదము కలుగలేదని కనుఁగొనవచ్చును. వ్యత్యాసము లేనప్పుడు 1903 వ సంవత్సరమున గవర్నమెంటువారిచ్చిన సరియైన ప్రత్యుత్తరమే ఇప్పుడును వర్తించును.

---

Government of India found in 1903 that $\frac{3}{4}$ of the total imports came from the Br. Empire. Indian ...nt preponderatingly to foreign countries. The situation in broad outline is the same.......................
...mission Report Page 129.

| 20 | 1920 | 21 | 1921 | 22 | |
|---|---|---|---|---|---|
| ది. | ఎ. | ది. | ఎ. | ది. | |
| 44% | 61% | 43% | 66% | 37% | 66% |
| 56% | 39% | 57% | 34% | 62% | 33% |

నుండి దిగుమతులు హెచ్చుచున్నవి. ఎగుమతులు హెచ్చుచున్నవి. అనగా ... సామ్రాజ్యమునుండి మూడువంతులకు తగ్గుతులగుచున్నవి. సామ్రాజ్యమునకు ఎగుమతులలో ... తగుచున్నది. (1/3) ఫిస్కల్ కమీషనువా ... లను తమనివేదికయందు వ్రాసిరి.

సామ్రాజ్యశాసనసభవారియిష్టము లేనిదే ... ము.

... ఆవశ్యకమైన కళలకు 'ప్రిఫరెన్సు' పద్ధతిని ఇవ్వ ... ందూదేశమునకు నష్టము వచ్చునని తోఁచినయెడల వేయవలెను.

ప్రత్యేకనివేదికయందు హైందవసభ్యులు ఇట్టి యభి ప్రాయపడిరి.1 "హిందూదేశమునకు సంపూర్ణభాధ్యతాయుతపరి పాలనము కలుగువరకుగాని యీపద్ధతిని అవలంబింపఁగూడదు. హిందూ దేశము తనయెగుమతిదిగుమతులపై సంపూర్ణస్వాతంత్ర్యము కలిగినప్పుడుగాని యీపద్ధతి పనికిరాదు. అట్టిది సంపూర్ణముగా నెన్ను కొనబడినశాసనసభవారి వోటుపై నాధారపడియుండును.

అదియుఁగాక మనకు అధినివేశనములతో వర్తకవ్యాపారము చాల తక్కువ. ఇట్టిస్వల్పవ్యాపారమునందు ఒకరికొకరు 'ప్రిఫరెన్సు' చూపుటవల్ల లాభ మేమియును లేదు. ఇంగ్లండునకు 'ప్రిఫరెన్సు'ను చూపినచోఁ గల్గునష్టముల నిదివఱకే వ్రాసితిమి.

యుద్ధానంతరము ఇంగ్లాండుయొక్క పరిశ్రమలస్థితి మిక్కిలి హీనస్థితియందుండెను. రష్యాదేశముతో వర్తకవ్యాపారము లేదు. ఫ్రాన్సు రూర్ ప్రాంత మాక్రమించినది. అధినివేశనములు సంరక్షణము (Protection) నవలంబించెను. ఫ్రాన్సు, అమెరికాదేశీయులు బ్రహ్మాండమైన దిగుమతిపన్నులు విధించెను. జర్మనీయవస్థ వర్ణింప నలవికాదు కదా. ఇట్టి ప్రపంచకస్థితిలో స్వేచ్ఛావ్యాపార పద్ధతి అవలంబించిన యింగ్లాండు దేశముయొక్క పరిశ్రమలు అడుగంటఁ జొచ్చెను. దేవుఁడా ఇట్టిగతి ఎట్లు తప్పిపోవును? అని రాజ్యాంగవేత్త లాలోచింపఁ దొడంగిరి. క్రిందటిసంవత్సరాంతమందు సామ్రాజ్య ఆర్థికసభ యొకటి సమకూర్పఁబడెను. ప్రతిసామ్రాజ్యమునందలి ప్రతి రాష్ట్రమునుండియు ప్రతినిధులు ఆసభకు పోయి యుండిరి. ఇండియానుండి మన పారిశ్రామికసభ్యుఁడైనఇన్నీసుదొర ప్రతినిధిగా పోయెను. ఆ సభయందు ఇతరసమస్యలతో పాటు ఈ ప్రిఫరెన్సు పద్ధతి కూడ ఆలోచనకు పెట్టఁబడినది. అధినివేశనములనుండి సరకులకు మేము ప్రిఫరెన్సు ఇచ్చెదము. మాసరకులకు కూడ అధినివేశనములవారు 'ప్రిఫరెన్సు' ఈయవలెనని సభలో ఇంగ్లండుపక్షమున గోరఁబడెను. అధినివేశములవారీపద్ధతికి పూర్తిగానిష్టపడ లేదు. ఇప్పుడు ఇంగ్లండునకు పట్టుకొన్న పెద్దచింత యేమనఁగా, తనసరకుల ప్రపంచమునం దెక్కడను చలామణీయగుటకు చోటు లేదు. కనుక సామ్రాజ్యమునందున్న ఇండియా, ఆస్ట్రేలియా, కెనడాదేశము ఆ మెసరకులకు ప్రిఫరెన్సు ఇచ్చినచో సామ్రాజ్యమంతయు నొకపణ్యచక్రముగా మారి తనసరకులను చెలామణీ కావించుకొనవలెనని తనభాగ్యమే తాను చూచుకొన్నయెడల ఇతరదేశములయొక్కగతి యేమి? భాగ్యనగరమున ఇండియాప్రతినిధి ఈ 'ప్రిఫరెన్సు' మాకక్కఱలేదని చెప్పెను. అతడును వెనుకటి ప్రత్యుత్తరమే ఇచ్చెను. ఇంగ్లాండునుండి నూటికి 75 పాళ్లు దిగుమతులును, ఇంగ్లాండునకు నూటికి పాతికపాళ్లు ఎగుమతులును గనుక ఈపద్ధతి అవలంబించినచో నిండియాకు చాలనష్టమని చెప్పెను. అదిగాక ముఖ్యముగా ఇంగ్లాండు, నూలు, నూలుగుడ్డలను విశేషముగా ఇండియాకు దిగుమతిచేయుచున్నది. ఆవర్తక మామె గుత్తగా గొనియున్నది. ఆమె కెవరును పోటీ లేరు. పోటీయున్నచో, ఇంగ్లాండు నూలుసరకులకు 'ప్రిఫరెన్సు' నిచ్చి, యితరదేశములబట్టలపై పెద్ద సుంకముల విధింపవచ్చును. మీదుమిక్కిలి అట్లు తక్కువసుంకముల విధించినచో ఇక్కడినూలు పరిశ్రమలు మఱునాడే అడుగంటి రూపు లేక పోవును. ఈయభిప్రాయమునే పండితకలేగారు తమగ్రంథమునందు వ్రాసియున్నారు.2

అదిగాక ఇంగ్లండుయొక్క అభిప్రాయమేమనఁగా, ఇక్కడినుండి ఎగుమతి కాఁబడు అపక్వపదార్థసంచయముపై తక్కువపన్నులను విధింపమని. దీనియర్థమేమన హిందూదేశము బ్రిటిషువ్యాపారులకు గుత్తగా చేయుటయే. ఇట్టిప్రిఫరెన్సునే చూపినయెడల హైందవాదాయమున కెంతో నష్టము చేకూరఁగలదు. ఇదివఱకే డెబ్బదికోట్ల రూపాయిలు ఒక్కబట్టలకే హిందూదేశమునుండి యింగ్లండునకు పోవుచున్నవి. ఈ నష్టముతోపాటు ప్రిఫరెన్సును చూపినచో ఆదాయమునందు కూడ నష్టము కలుగును. ఈ చిత్రమంతయుఁ జూచినయెడల ఇదియొక గారడీగా తోఁచుచున్నది. కాని, వ్యాపారముగా తోఁచదని కలెపండితుడు వెనుక నుదాహరించినగ్రంథమునందే వ్రాసియున్నాడు.3

ఈసంవత్సరములో బొంబాయి కూడిన హైందవార్థికసభ కధ్యక్షత వహించుచు శ్రీ విశ్వేశ్వరయ్యగారుకూడ ప్రిఫరెన్సు మనకు అవసరము లేదనే చెప్పిరి. ఈ పద్ధతికి హైందవాభిప్రాయ మనుకూలమా? ప్రస్తుతము నూతనముగా వచ్చిన లేబర్ ... రీపద్ధతిని అవలంబింపరు. వారు స్వేచ్ఛావ్యాపారపక్షము...

ఇట్టి స్థితియందు వైస్రాయిగారు ఈ వ్యా... "కీన విధమున పల్కుట హాస్యాస్పదముగ లేదా? ... నుండి

---

1 Indian Fiscal Commission Report: Minute of Dissent P. 193. The logical conclusion ... cannot accept the principle of Imperial Preference until she has attained responsible Government to ... Fiscal policy by the vote of a wholly elected Legislative.

2 India and Imperial Preference in Indian Economic and Industrial Problems (Prof. Kale).

3 This is not business but Juggling' Indian Economic and Industrial Problems' (Prof. Kale).

# ఆయుర్వేద సంస్కరణము

ముదిగొండ బుచ్చయ్యలింగశాస్త్రి గారు

శ్రీజగదీశ్వరనిర్మితం బగు ప్రపంచమునకు నాధారభూతం
బులు వేదంబులు. వేదధర్మములు బోధపడుటకు
పరమకారుణికులగు ఋషులు వేదార్థప్రతిపాదకములై
ఆచారవ్యవహారములను దెలుపు స్మృతులను స్వనామక
ములుగా మన్వాదిస్మృతులను రచించిరి అట్టి శ్రుతిస్మృ
తులు సర్వసామాన్యజనులకు బోధపడునటులు అష్టాదశ
పురాణములను వ్యాసమహర్షి రచియించెను. ఇందు
వేదస్మృతిపురాణములలో ఆయుర్వేదము గలదు. స్మృతు
లన్నియు ఆచారకాండను బోధించునవి. "ఆచారా దా
యుర్లభ్యతే" యనుసూత్రప్రకారము ఆయుర్వేదమునం
దలియారోగ్యభాగమునకు స్మృతు లాచారభాగమును
వక్కాణించినవి. వాగ్భటాచార్యుడు బాహట మను
వైద్యగ్రంథమును వ్రాయదలచుకొని స్మృతులయందలి
దినచర్యను గ్రహించి రెండవఅధ్యాయమునకు దినచర్యా
ధ్యాయం బని యారోగ్యముకొఱకు ధర్మశాస్త్రమును
పురస్కరించుకొని వ్రాసియున్నాడు. వ్యాసమహర్షి
పురాణములయందు నీభాగమును వదలక గారుడాదిపురా
ణములయందు నిదానచికిత్సాక్రమములను విస్తరించి
యున్నాడు. వేదతుల్యములగు నాగమములయందు, కల్ప
ములు, వ్యాహారమంత్రతంత్రములు వేనవేలు గలవు.
బట్టి యుపవేదమగు నాయుర్వేదము నాలుగువేదముల
స్మృతిపురాణములయందు మఱియు ఆగమముల
జెప్పబడి యున్నది. అందుచే నాయుర్వేదము
ములతో సమమైనదగుటచే సంస్కరణార్హము

యు సంస్కరణార్హ మెద్ది యనిన, ఆయు
ష్టతంత్రములతో గూడినను మన మిపుడు
ములుగా విభజించుకొందము: ౧ శస్త్రచికిత్సా
౨ ఔషధచికిత్సావిధానము. ఈ రెంటియం
మూస్థానములో ఆయుర్వేదమునందలి
శస్త్రవిధానములోపించ
నామావశిష్టమై యున్నది. విద్యలకు
మెప్పుడుండనేరదు. సద్యస్కాలమునందు ఆంగ్ల
చికిత్సావిధానము మనకు లేదని ఆయుర్వే
వారు కొందరందురు. సుశ్రుతమున
౧౭ అధ్యాయములతో శాక్యకసూ
విధానమంతయు చక్కగా వ్రాయబడియున్న
విచారించినచో సుశ్రుతమునందలి సూత్రాభి
ఆంగ్లేయులకుగాని తదితరులకుగాని బోధ
చదు. అట్టిసుశ్రుతమునందలి శస్త్రవిధా
మనవారు ప్రారంభించుటయె సంస్కరణ వ
వలయును.

మఱియు నిదానచికిత్సాభాగమునందు శతగ్రం
ములు కలవు. చికిత్సయం దాఱితేఱిన యనుభవవృద్ధ
వైద్యులు గలరు. కాబట్టి ఈవిషయమునందు సంస్కరణ
యనావశ్యక మని చెప్పితీరవలయును.

మఱియు కార్యక్రమమునుగుఱించి విచారింతము.
మనదేశమునందు కార్యక్రమమున నిపుడు కొన్ని యేర్పా
టులు జరిగినను చాలాకాలము కార్యక్రమము తప్పిపోయి
నది. ఇప్పటికైనను నిదానచికిత్సాభాగములే పాఠ్య
క్రమమం దున్నవిగాని శస్త్రచికిత్సావిధానము మిగిలి
యున్నది. కాబట్టి యెంతవఱకు మనము శాస్త్రప్రకా
రము పాఠ్యక్రమమును నెఱవేర్పమో అంతవఱకు పాఠ్య
క్రమము సంస్కరణావసరమును కోరుచునే యుండును.

మనగ్రంథముల గౌరవమును ఆలోచింపుడు.
వేదతుల్యమగు ఆయుర్వేదమును జదివి సుశ్రుతాది ఋ
షులు చరకసుశ్రుతాదులను రచించిరి. మఱియు వాగ్భట
భావమిశ్రాదులు అష్టాంగహృదయభావప్రకాశాదిగ్రంథ
ములను రచియించిరి. ఇట్టియుద్గ్రంథములు సంస్కర
ణార్హము లెంతమాత్రమును గానేరవు. మనకు లోబ

మనలను శాసించు వేదశాస్త్ర
ములైనచో వానికి గౌరవ ముండ

వైద్య గ్రంథముల నాంగ్లేయులు
సుశ్రుతమునందలి యస్త్రములు
సనవి యన్నియు సాధించి యుప
దెచ్చియున్నారు. ఈవిషయ మందఱకును
టచే మిక్కిలి వ్రాయనక్కఱలేదు.

మొక్క పాఠ్యక్రమాదులను ఆంగ్లసాహి
దు వత్సరములు చదువుదురు.
విషయమం దొక్కొక్కరు కృతార్థులై
యుచుందురు. వారు చదువుకొనుకాలమునం
యుక్తముగా జదువుకొనియెదరు. మన గ్రంథ
యబడిన గ్రంథములను జదివి ఆంగ్లవైద్య
ప్రసిద్ధిని గాంచిరి. వారిచదువునకు
ందు విక యింపబడు నౌషధజాతమునకు సం
యును గలుగజేసిరి. వారియౌషధములకు బ్రతి
రిపరీక్ష లనవసరములు. వారలవైద్యమునకు ప్రభు
త్వసహాయము, ద్రవ్యసహాయము, మతసహాయము ఈ
మొదలగుసహాయములుగలవు. మఱియు సద్యస్ఫలగుణ
దాయకములని ప్రసిద్ధిని జెందినవి. ఆంగ్లవైద్యునకు ఫీజు
తో చెల్లు. అట్లులైన వారికంపెనీలలో నౌషధమును కొని
తీరవలయును. ఇట్టిసౌకర్యము లుండుటచే వారిలో పదు
గురువైద్యు లేకత్ర సమావేశముగా జేరినను కలతలుండ
నేరవు. పరస్పరాభిప్రాయంబుల నిచ్చుకొందురు. రోగుల
కానందముగా నుండును. ఆంగ్లవైద్యమునం దిట్టిసౌకర్య
ము లుండుటచే సంస్కరింప బడిన దని నమ్మవలయును.

ఆయుర్వేదీయుల పాఠ్యక్రమము నాలోచింపుడు.
మనవైద్యులలో ప్రతివైద్యు డొకగ్రంథమును జెప్పును.
అవి గురువులయొద్ద జదివినట్లుండవు. నిఘంటువులు చదు
వుటలేదు. ('నిఘంటునా వినా వైద్యః')యనువచనమువలన
నిఘంటువు మొదట జదువవలయును. వైద్యుడు గాబో
వునతడు కాశిదాసత్రయమైనను జదివితీరవలయును.
పిమ్మటలఘుత్రయబృహత్త్రయములలో అవసరభాగము
లను జదువవలయును. మఱియు, భస్మములు, వంటౌషధ
ములు, ఖజ్జలీయౌషధములు, లేహపాకచూర్ణాదులను
అనుభవముగల గురువులయొద్ద నభ్యసింపవలయును. గురు
వులు చేయునిదానచికిత్సల నరయవలయును. ఈ యాయు
ర్వేదవిద్య కంగములుగా జ్యోతిషమంత్రశాస్త్రము
లుండవలయును అపు డాయుర్వేదీయవైద్యులు ఆంగ్లేయ
వైద్యులతోపాటు సంస్కరింపబడినవారని తలంపవల
యును. అటులుగాక ఇపుడున్న విధానమాశ్రయించువఱకు
సంస్కరణ మవసర మనియే నుడువుచుందురు.

మఱియు, చదువులయందు చికిత్సలయందు, నియ
మము లేదు. వైద్యులయం దైకమత్యము గానరాదు.
ఒకరిమందు లొకరికి నమ్మకములేవు. సత్యము లేదు. పూ
ర్వాచారము లేదు. కష్టించుట లేదు. ఔషధములు దొరకు
నన్న నమ్మకములేదు. దొరకినను తాజేయనందున నమ్మ
కములేదు. ఈవ్యాధి నావలనగుదురునాలేదా యనువిచా
రములేదు. సహింపులేదు. ఇతరుల యౌషధములయందు
గౌరవము లేదు. తాజేయుట లేదు. అనేకలేదులు
ఆయుర్వేదీయులనుదుటయున్నందువలన సంస్కరణ మవ
సరము.

ఇన్నిలేదులు సంస్కరణహీనతవలన సంభవిం
చినను దేశీయులపుణ్యలేశమువలన బీజరూపములుగా
హిందూదేశమునం దున్నవి. ఎవ్వి యన : గ్రంథ
ములు, నిదానములు, చికిత్సలు, అనుభవశీలురగు ఆయు
ర్వేదవైద్యులు, ఈ మొదలగునవి గలుగుట్లయే గాకమొదగి
యౌషధములయందు వారికి నమ్మకము గలదు? బ్రా
చేయుదునన్న నమ్మకము గలదు. వస్తుసామగ్రిగ
మూలికాదులు కలవు. మనయార్యులలో చా
మనయౌషధములయందు నమ్మకము దవ
యౌషధములు సేవించువారికి నాయుర్వే
యందు నమ్మకము గలదు. విచారణశా మఱి
కొన్నవన్నియు కొద్దిగానైనా గలవు. ము
ఆయుర్వేదవిద్య కన్నియు పరిదృశ్యమా దవ
విధానము మాత్రము లేదని ప్రపంచానుభ
చున్నది. కాబట్టి సంస్కరణాసంస్కరణలు

మునకు గలవు, ఈవైద్యమున కుండు అసంస్కారముల దప్పించిన సానబట్టబడినమణివలె ప్రకాశించును.

ఆయుర్వేదమునకు సద్యస్కాలసంస్కరణము

౧-పాఠ్యక్రమము

౨-శస్త్రచికిత్సావిధానము

3-చికిత్సాభాగము

౧. పాఠ్యక్రమమును ఆయుర్వేద మండలి వారు ప్రారంభించియున్నారు. అనుభవనీయులగు గురువులయొద్ద చక్కగా జదివిన జాలును.

౨ శస్త్రవిధానము: శస్త్రచికిత్సావిధానమును ప్రారంభింపవలయును. విద్యావంతులు, ధనవంతులు, ప్రజలు, వీర లందఱు అభిమానించి తగినసహాయ మొనరించిన శస్త్రచికిత్సావిధానము సాగును.

3. చికిత్సావిధానము ర విధములుగానున్నది. అందు మొదటిది మూలికాదిచికిత్సావిధానము. మనకు చరకసుశ్రుతాది గ్రంథములు మూలికాచికిత్సనే బోధించుచున్నవి. అందుచే ప్రజలకు, నిఱుపేదలకు అత్యంతోపయోగము; కాబట్టి విద్యార్థులకు ప్రథమమునందు మూలికావిధాన మంతయు అనుభవపురస్సరముగా బోధింపవలయును. ఈ మూలికావైద్యమునందే లేహ పాక చూర్ణాదు లలవడును.

రెండవది రసవైద్యము. ఈ వైద్యము శ్రీమం ...సహాయముచే ప్రసిద్ధిజెందదగినది. ఈవిధానము గురు సాంప్రదాయములు తెలిసికొని అతికష్టముచే సాధింప... ఈ రసవైద్యమును జేయువారే వైద్యశబ్దమున

...డవది శస్త్రవైద్యము. ఇది కేవలము హైస్య ...ది. ఈ విధానము నుద్ధరించుటకు దేశీ గ్రహ ముండితీరవలయును. అనగా దేశీయు ...సి యుద్ధరింపదగినది.

...గవది, మంత్రవైద్యము. దీనినే సిద్ధవైద్య మం ...ద్య ఆత్మసంబంధ మైనది. ఈవిద్య ఒకరిసహా ...నేరదు. ఈవిద్యయుత్తమవిద్య యని వైద్య

శాస్త్రాభిప్రాయము. శక్తిపాతవి... గలదు. కాబట్టి ఈవిద్య స్వం... తగినది.

ఈ విధానములన్నియు వ... దేశీయౌషధములు చికిత్స లనవ... దేశమున కొకగౌరవము సంభవి... వృద్ధికి జనపదవాసులు, పట్టణవాస... సభలు జరిపి ద్రవ్యసహాయముచే విద్యార్థులను సంసిద్ధులను జేయ... మన్నిటికి ప్రయత్నము జేయు... మైనది. సంస్కరణములలో ...

వైద్యులసంస్క...

అనుభవశీలురగువారు, వ... హానపిశాచములనుపారద్రోలవల... స్యముగా నుంచని ఋషిసాంప్రదాయపరుల... లో గ్రంథములను జూపనివారు, చికిత్సలను జెప్ప... అన్నియు రహస్య మనువారు, చదువుకొనుచున్న స... గురు శిష్యులలో నొకరికి జెప్పువారు, మాయాచారము గలవారు, పరుల మందుల దూషించి తమదుమ్మును సొమ్ముజేయువారు, ఇతరవైద్యుల సహింపనివారు, పరుల యౌషధములు మారణమందూరము లనువారు, ఇట్టివారు చాలమంది గలరు. వీరలచే హిందూదేశమునందు ఉత్తమవిద్యలనుజెప్పకదొంగలైపోయినారనివాడుకకలదు. ఇట్టి యపవాదమును వైద్యలోకము పోగొట్టుకొన బ్రయత్నములను జేయ ప్రారంభించిన, ఆయుర్వేదీయులు సంస్కారులగుచున్నారని యెల్లలోక మానందించును.

సంస్కరణ మనునది దోషము గాదు

ప్రతిమనుజునకు, ప్రతివస్తువునకు, ప్రతియొక దానికి సంస్కరణ మవసరము. వేదములు స్వరయుక్తముగా నుండవలెను. విద్యలు కంఠస్థముగా నుండవలయును. మనుజులు శ్రద్ధాభక్తిధ్యానయోగములు గలవారై యుండవలయును. మణులు చెక్కబడవలయును. ఈప్రకారముగానే ఆయుర్వేదము పైజెప్పినప్రకార

...న్ను. దేనియందైనను ఆచరణ
...స్కరింపబడినవనియు, ఆచరణ
...ర్హ్వాము లనియు గుర్తెఱుంగవల
...మెప్పుడును పురోవృద్ధికి కార
...వసర. మనినయెడల పురోవృద్ధి

ముఖ్యవిషయము; ఆయుర్వేదీయులు నెలకొక సారిగాని, సంవత్సరమున కొకసారి గాని తమ చికిత్సానైపుణ్యమును, తమనూతనవిధానములను, గ్రంథములయందలిసువిశేషములను, నివారణ పొందిన వ్యాధులను, వ్యాధినివారకౌషధములను పత్రికాముఖంబున వెల్లడించుట ఆయుర్వేదమునకు గొప్ప సంస్కరణమని తలంపలయును.

# కాలప్రభావము

## దుగ్గమహంతి సీతారామశర్మగారు

మంబుఁ గల్పించి యలజడిఁ, గూర్చియుంటివికదా కొన్నినాళ్లు
ప్రాసలను సంక్షోభింపఁ గఱపుచే, గుండఁ జేసితికదా కొన్నినాళ్లు
అన్యోన్యవిద్వేష మంత మొందింపకఁ, గోదవఁ జేసితికదా కొన్నినాళ్లు
సహజధైర్యప్రదర్శన మొనర్పకను గూర్కొనఁగఁ జేసితికదా కొన్నినాళ్లు
అక్కటా! యిన్ని తెఱఁగుల ననవరతము, దారుణాభీలవహ్నిమధ్యంబునందుఁ
ద్రోయఁబూనఁగ ధర్మమ్మొ! తులువతనమొ! అహహా! కాలమ! నీచర్యలద్భుతములు.

సీ. అశ్రాంతభోగాశ్రయంబైన దేవేంద్ర, పదవిఁ బొందఁగఁ బాటు పడఁగ లేదు
స్వర్గలోకస్థసుశర్మాసనము నధి, ష్ఠింపఁగా మదిని వాంఛింపలేదు
సకలలోకముల దక్షత మీఱఁ బాలింపఁ, దగుశక్తినిమ్మని తలఁపలేదు
కామ్యప్రదంబైన కల్పవృక్షంబు మా, పెరటఁ జేర్పుమటంచుఁ బెనఁగలేదు
కడుపునిండుగఁ గూడును గట్ట గుడ్డ, సరసముగ లభియించినఁ జాలు ననుచు
గోరి ప్రజ లెల్లరును నిన్ను దూఱుచుండ్రు, కాలమా! యెంతకఠినాత్మ గడకు నీకు.

సీ. పాపకారణ మంచు భయ మొకింతయు లేక, పరకాంతలను బల్మిఁ బట్టలేదు
సాటివారలశౌర్యసంరంభముం గాంచి, యీర్ష్యాభరంబుచే నింకలేదు
స్వార్థభోగాభిలాషను లాఁతివారల, సంపదున్నతికి నాసింప లేదు
సర్వలోకముల మానసములు తేరని గర్వ, మొప్పఁగా నెలుగెత్తి చెప్పలేదు
సాధులము; ఘోరదారిద్ర్యసాగరోర్మి, జాలమధ్యనిమగ్నవిస్తారదీన
మానసుల; మక్కటా! యింక మానఁదగదె, కాలమా! మాయెడల నింతకఠిన మ్మూ...

సీ. అభ్రంకషంబులై యలరారుధనధాన్య, రాసుల నెప్పుడు నరయుటలొక్కొ!
శిల్పచిత్రకళావిశేషనైపుణ్యముల్, గనులార నెప్పుడు కాంచుటొక్కొ!
అన్నోదకముల కాపన్నతం బొందక, ముదముతో నెప్పుడు మురియుటొక్కొ!
దారుణాదిష్టబంధనములేకను లోక, కల్యాణ మెప్పుడు కాంచుటొక్కొ!
యనుచు మానసవీథి నహర్నిశములుఁ, జింతనలు సేయుచుండ్రు వర్జితముదాత్ము
లగుచు మానవు లెల్ల రత్యాతురమునఁ, గాలమా! నీప్రభావంబుకతనఁ గాదె!

# ఆరోగ్యసాధన

బొల్లాప్రగడ సుందరగోపాలరావుగారు

మంచి ఆరోగ్యము, ఉత్సాహము, సంతోషము సదా కలిగి యుండవలెనని కోరినవారు ఉదయమున లేవవలెను. లేవగనే మలవిసర్జనము చేసికొనవలెను. మలవిసర్జన మయినను కాకపోయినను లేవగనే బయటకు వెళ్లి కూర్చున్న యెడల నొకటి రెండు రోజులు కాకపోయినను మూడవరోజున తప్పక విరేచనమగుటకు ప్రారంభమగును. అటుపిమ్మట పండ్లుతోముకొని ముఖము కడుగుకొనవలెను. ముఖము కడుక్కునే కాలమందే చల్లని నీటిని పుడిసెట్లో పోసికొని అనగా అరచేయి గిన్నెవలెచేసి దానిలో పోసుకుని మొదట కుడికంటి రెప్ప తెరిచి 10 లేక 12 సారులు రెప్పలు వేయుచూ తెరచుచూ కడిగినకంటిలోని పుసులు, జిడ్డు నీళ్లలోనికివచ్చి కన్ను పరిశుభ్రముగాను నిర్మాలిన్యముగాను ఉండి రక్తప్రవాహము చక్కబడును. 10, 12 సారులు నీళ్లు క్రొత్తగా చేతిలో పోసికొనుచుండవలెను. ఒకమారు కన్నుకడిగిన నీటితో తిరిగి కన్ను కడుగరాదు. ఎడమకన్నుకూడా 10 లేక 12 సారులు కడుగవలెను. ఇట్లు చేయుటవలన కండ్లకు ఏవిధమైన జబ్బు రాకపోవుటయే కాకదగ్గిరచూపు చత్వారముకూడా రాకుండా చేయగలసామర్థ్యము ఈపనియందున్నదని నిపుణులగు వైద్యులు వక్కాణించియున్నారు. కన్నులు కడుగుకొని తరువాత ముఖము కడుగుకొని, బట్టతో తుడుచుకొని, కడుపు పట్టినన్ని చల్లనినీళ్లు ...వలెను. ముక్కు రంధ్రములు బాగుగా కడిగి ఒకముక్కు ... వ్రేలితో మూసి రెండవరంధ్రముతో ముక్కు ..., చేతిలో పోసికొని గాని గిన్నెలోపోసికొని ...ని నోటితో విడువవలెను. ఇదే ప్రకారం రెండవ ...సూ చేయవలెను. ఇట్లు చేసిన నెన్నటికి పడి...ట మొదలైన ముక్కునందలి వ్యాధులు గాని ...లుగాని రానేరవు. ఈపనితోపాటు 'భస్త్రిక' ...కయోగప్రదీపికలోని యోగమును చేసిన ...ధులురాకపోవుటయేగాక శ్వాసకోశము బాగుపడి ఊపిరితిత్తులు స్ఫుటపడును చర్మము చక్కగా పనిచేయును. రంధ్రములయందలి మలినము పోం... పదార్థములు చక్కగా బయటకు ... శుద్ధి అగును. 'భస్త్రిక' అనియు వ్రాయుటవలన ఈపని అసాధ్య... మాత్రము భయపడవలసిన ... జామున మంచిగాలి తగులు ... ముక్కు మూసికుని యెడమను... వానితిత్తి యూదునప్పుడు, పాము శబ్దములాగు ఊపిరి లోపలికిలాగి పైకికు త్వరగాను వదలవలెను. ఈప్రకారము 5 మా... ప్రారంభించి క్రమముగా 33, 66, 100 దఫాలవర... జేయవచ్చును. ఒకేసారి సంఖ్య హెచ్చించకూడదు. చాలనిదానముగ ఒకటిరెండు సంవత్సరములలో ఎక్కువ సంఖ్యకు రావలెను. సామాన్యముగా 6 మాసములు అయినతరువాత 33 సంఖ్యవరకూ ఒక్కముక్కుతో పీల్చుట వదలుటకు రావచ్చును. ఈప్రకారమే యెడమ ముక్కుమూసి కుడిముక్కుతో పీల్చి వదలుచుండవలెను. ఊపిరిపీల్చునప్పుడు మెడను పైకి క్రిందకు, గడ్డము మెడ క్రిందిగుంటకు తగులులాగున ఆడించుచుండవలెను. ముందు కుడిముక్కుమూసి యెడమముక్కుతోను అటుపిమ్మట యెడమముక్కుమూసి కుడిముక్కుతోను గాలి లాగి బలముగా వదలినతరువాత, రెండు ముక్కులతోను గాలి మెడను పైకెత్తి పీల్చి మెడను వంచి ఊపిరి బలముగా వదలివేయుచుండవలెను. ఇదే పద్మాసనముగాని బద్ధపద్మాసనముగాని వేసి చేసిన భస్త్రికాయోగ మగును. లేదా నిలుచుకొని గాని నడచుచుగాని చేసిన నాసికా రంధ్రములందలి మలినముపోయి దేహారోగ్యము గానుండును.

...భ్రపరుచుకున్న పిమ్మట కడు ...గున చల్లని రాగిపాత్రలో రాత్రి ...చిన నీళ్లు త్రాగవలెను. ఇట్లు ...పోగూడదు. దీనికి వ్యతిరేకముగా ...బ్బజాడ్యము వెంటాడించి మర ...దు. నీరుత్రాగుటవలన కడుపు మొదలగునవి పైకి వెళ్లిపోవును. ...ళ్లతో కళ్లు కడుగుకొని నాసిక శుభ్ర ...సినతరువాత ఒళ్లువంచుట, తిప్పుట ...గువ్యాయామములు చేసినయెడల రాత్రి ...యందు నిలిచియున్న విషపదా ...ట్టుకొనిపోయి దేహారోగ్యముగా ...ను. దేహపరిశ్రమ అయినతరు ...నతోడనే శరీరము చెమటతో ...చెయక చల్లనినీటిలో చర్మము కందు ...యుతికతడితువాలుతో రుద్దుకొనవలెను. అటు ...ట స్నానంచేసి పొడిబట్టతో తుడుచుకొనవలెను. ...నము చేసినతరువాత ఒకఘంట అయినపిదప ఆహా ...ము ఉద్దీపకపదార్థములు లేకుండా తీసికొనవలెను.

భోజనానంతరము ఘంటన్నర అయినతరువాత దాహము త్రాగవలెను. భోజనకాలమందు నీరుత్రాగగూడదు. ఇట్లు త్రాగుటవలన జీర్ణమునకు కావలసిన కడుపులో పుట్టురసములు పలుచన అయి జీర్ణముకాక అజీర్ణము పుట్టును. ఘంటన్నరఅయినది మొదలు తిరిగి భోజనము అరఘంటకు చేయుదు మనునంతవరకూ ప్రతిఘంటకూ నీరు త్రాగుచుండవచ్చును. భోజనానంతరము కొంచెము విశ్రమించి యెండకు వెరవక ఎండలో బాగా చెమట పట్టులాగున నడచుటయో మరి తోటపనియో వ్యవసాయపుపనియో చేయవలెనుగాని మూలదూరి యెండకువెరచి యింట్లో నీడను వెదకుకొని కూర్చుంటుటయే వ్యాధికి కారణమగును. పైనచెప్పిన క్రియలన్నియు ప్రత్యేకప్రత్యేకనుగా చేయుటకు 5 లేక 10 నిమిషములకన్న నెక్కువ కాలము పట్టదు. సందేహము లున్న టపాబిళ్లలు పంపిగాని, స్వయంగా రాజమహేంద్రవరమునందు జలసూర్యకిరణ ప్రకృతిచికిత్సారోగ్యజ్ఞానాశ్రమము స్థాపించిన ప్రకృతిచికిత్సప్రోత్సాహకర్త యగు బొల్లాప్రగడ సుందరగోపాలరావును కలుసుకొనిగాని తెలుసుకోవలెను.

# చిత్రపటముల వివరణము

కెమల్ పాషా:— వీరు తుర్కీ రిపబ్లికు అధ్యక్షులు. వీరి విషయము సుప్రసిద్ధము. తుర్కీరాజ్యమును పునరుద్ధరించుటకు వీరి శౌర్యసాహసములే ముఖ్యకారణమయ్యెను. వీరిసతీమణి లతీఫుహానము గారు. ఈమె శ్రీమంతుడగు నొకస్మిర్నావర్తకునికూతురు. ఈమెకు 19 ఏండ్లు వయస్సు. ఈమె మిగుల చదువరి. ఫ్రాన్సులో నీమె విద్యనేర్చినది. ఆంగ్లస్త్రీలవలె నీమె దుస్తులను ధరించును. ఈమె గొప్పసంఘసంస్కారిణి. తురుష్కజాతీయస్త్రీ ప్రబోధమున కీమెయే పునాది.

జయంతి కామేశం పంతులుగారు:— వీరి నివాసము గంజాము మండలములోని కొత్త అగ్రహారము. వీరు ఘనతవహించిన న్యాయవాదులు. స్వయముగ నపారధనము నార్జించిరి. నిరతాన్నదాత. ఆంధ్రకర్ణుడనివీరాంధ్రదేశమున పేరుగాంచిరి. వీరు పెక్కుచోట్ల నన్నసత్రములను గట్టించిరి. ఇతర ధర్మకార్యములను బెక్కింటి నొనరించిరి. కవీశ్వరుల నాదరించిరి. జానకీపరశతకము, రామశతకము, మొదలయిన గ్రంథములను రచియించి కవులై వెలసిరి. వీరు 1846 వ సంవత్సరమున జన్మించి యాంధ్రదేశము నలుగడల దమకీర్తిని వ్యాపింపజేసి 1886 వ సంవత్సరమున గీర్తిశేషులైరి. వీరి దాతృత్వమునుగూర్చినానుడికథలు పెక్కుగలవు.

శ్రీయుత జే. వి. కృష్ణారావుగారు:— వీరు బరంపురనివాసులు. వీరు కొంతకాలము మిడిల్ స్కూలు ప్రధానోపాధ్యాయులుగనుండి యసహాయోద్యమము నవలంబించిరి. వీ రాఱుమాసములు కాంగ్రెసుప్రచారకులుగా నుండిరి. 108 సెక్షనుక్రింద నాఱునెలలు కఠినశిక్షకులోనై మదరాసు కారాగృహమున నుండిరి. ఇప్పుడు గంజా జిల్లా కాంగ్రెసు ప్రచారకులుగా నున్నారు.

—శ్రీయుత జే. వి. నారాయణగారు:— వీరు తొలుత బ్రాహ్మసమత ప్రచారకులుగనుండిరి. దేశాభిమానాతిశయముచే అసహా ...ులై కాంగ్రెసుప్రచారకులైరి. 108 సెక్షనుక్రింద నొకసంవత్స ...లూరునందు కారాగృహవాసము ననుభవించిరి. వీ రిపుడు ... వారపత్రికకు సంపాదకులుగా నున్నారు.

...త మొటపర్తి వెంకటనారాయణగారు:— ..., దెందులూరు, ఏలూరుతాలూకా. వీరు తొలుత ... నుండిరి. అసహాయోద్యమసందర్భమున నాయధి...నుకొని దేశసేవకై పాటుపడుచుండిరి. నిమ్నజాతి...రు 5000/-విలువగల తనయాస్తిని బందరు ఆంధ్రజా...రముగా నప్పగించిరి. వివేకానందపఠనమందిరోద్ధార...రు. వీరు జయసంవత్సరమున జననమంది రుధిరోద్గారి ...ృమునొందిరి.

కీ. శే. బ్ర. కొట్ర లక్ష్మీనా... వీరు లక్ష్మీనారాయణీయమును శుద్ధాం... నిఘంటువు, కరప రామలింగశతకము మొ... చిరి. బ్ర. శ్రీ. శిష్టుకృష్ణమూర్తిశాస్త్రిగా... గారును.

ఆంధ్రవిద్యావాచస్పతి, ... శ్యామలకామశాస్త్రిగారు:— వీ... యణశాస్త్రిగారి తృతీయపుత్రులు. ...నమున దండ్రికి గడుంగడు తోడ్పడి ...నాడ మండలమునందలి క... ...ము

కీ. శే. ముత్తరాజు సుబ్బ... ఏ. పరీక్షయందుత్తీర్ణులై బందరు నోబిలుకళాశాల... న్యాసకులుగ నుండిరి. వీరి స్వగ్రామము నెల్లూరు. ఆంధ్రనా... యందును దద్రచనమునందును వీరికి జాల నభిమానముగలదు. కృష్ణ... భారము, రణతిక్కన, చంద్రగుప్త మున్నగు నాటకములను వీరురచియించిరి. ఉద్యోగమును నిర్వహించుచునే క్షయరోగపీడితులై వీరు1922 వ సంవత్సరమున మృత్యువువాతజిక్కిరి.

కీ. శే. ముత్తరాజు శివకామయ్యగారు:— వీరు బి. ఏ. పరీక్షయందుత్తీర్ణులై నెల్లూరులోను కావలిలోను హైస్కూళ్లలో నుపాధ్యాయులుగనుండివన్నెకెక్కిరి. నెల్లూరులోనున్న కాలమున పురమందిరమునకును కాంగ్రెసువుయూనియనునకును కార్యదర్శిగను, ఫండు ఆఫీసు కోశాధిపతిగను ఉండిరి. మఱియు ననేకఘనకార్యములయందును పాలుగొనుచుండిరి. తరువాత గుంటూరుజిల్లా ఇంటూరు లోయరు సెకండరి పాఠశాలా ప్రధానోపాధ్యాయులుగా రెండేండ్లు పనిచేసి దానిని హైస్కూలుగా మార్చించిరి. విద్యార్థుల విషయమున చాలశ్రద్ధతో బాటుపడుచుండెడివారు. వీరు తుదకు ఇంటూరునందే 30-10-1922 నాడు మృతిజెందిరి.

శ్రీయుత పండిత సంతానముగారు:— వీరి జన్మభూమి మద్రాసు రాజధాని. వీరు విద్యాసంపన్నులై పంజాబునందు న్యాయవాదివృత్తి నవలంబించి మిగుల గీర్తిని గడించిరి. సహాయనిరాకరణము నవలంబించి తమవృత్తిని బరిత్యజించి దేశసేవకు బద్ధకంకణులైరి. పంజాబురాష్ట్రీయ కాంగ్రెసుసంఘమునకు గొంతకాల మధ్యక్షులుగ నుండిరి. వీరు లాలాలజపతిరాయిగారితో రాజద్రోహమునకని కారాగృహవాసమును గొంతకాల మనుభవించిరి.

